ఆంధ్రప్రదేశ్

# పంచాయతీ సమితుల జిల్లా పరిషత్తుల చట్టము

( ACT No. XXXV OF 1959 )



అన్ని రూల్సు, వ్యాఖ్యలతోసహా ఉన్నది. పంచాయతీ సమితులకు జిల్లా పరిషత్తులకు అనువర్తింప జేసిన 1920వ ఆంధ్రప్రదేశ్ (ఆంధ్ర) జిల్లాబోర్డుల చట్టము, 1955వ ఆంధ్రప్రదేశ్ (తెలంగాణా) జిల్లా బోర్డుల చట్టము అనుబంధములుగా చేర్చబడినవి.




ప్రచురణ కర్తలు :

పంచాయత్ పబ్లికేషన్సు

పేట్లబురుజు, హైదరాబాదు — 2.

గవర్నమెంటు వారిచే (మెమొ నెం. 4870/S-1/60 తేదీ 9-2-1961)
రికమెండు చేయబడిన ఇంగ్లీషు పుస్తకమునకు
తెలుగు అనువాదము.

పి. రామా రెడ్డి. B. A., B. L.
గారిచే వ్రాయబడిన ఇంగ్లీషు గ్రంథమునకు
తెలుగు అనువాదము.

వెల రూ. 15/-
పంచాయతీలకు, సమితులకు, పరిషత్తులకు మాత్రమే తగ్గింపు రేటు.
రూ. 13/- లకు సప్లయి చేయబడును.

ముద్రణ : శ్రీ వాణీ ముద్రణాలయము,
సుల్తాన్ బజార్, హైదరాబాదు.

వేమన గ్రంథాలయము

C

# మ న వి

ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సమితుల జిల్లా పరిషత్తుల గూర్చి వివరించు గ్రంథములు తెలుగులో క్లుప్తముగా ఒకటి రెండు గలవని మే మెరిగి యుండియు, మే మీ గ్రంథమును ప్రకటించుట మిక్కిలి అవుసరమని భావించి, ఈ పుస్తక ప్రచురణకు పూనుకొంటిమి. ఉన్న ఒకటి రెండు గ్రంథములు పంచాయతీ సమితుల, జిల్లా పరిషత్తుల చట్టము, ఏవో కొన్ని రూల్సు మాత్రము కలిగి ఉండి అసంపూర్తిగా ఉండిపోయినవి. ఆ యా పుస్తకములలో అన్ని రూల్సు, పంచాయతీ సమితులకు జిల్లా పరిషత్తులకు అనువర్తింపజేసిన 1920వ ఆంధ్రప్రదేశ్ (ఆంధ్ర) జిల్లాబోర్డుల చట్టము, 1955వ ఆంధ్రప్రదేశ్ (తెలంగాణా)జిల్లాబోర్డులచట్టములు లేనందున అన్నివిషయములు తెలిసికొనుటకు అవకాశము లేకుండినది. ఈ లోపము తొలగించి అన్ని వివరములతో సమగ్రముగ గ్రామ పంచాయతీలకు, పంచాయతీ సమితులకు, జిల్లా పరిషత్తులకు ఎంతయు నుపయుక్తము కాగలదను ఆశయముతో ఈ గ్రంథము ప్రకటించినాము.

మొట్టమొదటిసారిగా ఈ గ్రంథము పి. రామారెడ్డి, బి. ఎ, బి. ఎల్., గారిచే ఆంగ్లభాషలో వ్రాయబడి 1960 సం॥ ఆగస్టు మాసములో ముద్రింపబడినది. ఇంగ్లీషులో వెలువడిన గ్రంథము అచిరకాలములోనే ఆంధ్ర ప్రదేశమున వ్యాపించి పెక్కు మేధావుల, పత్రికల యొక్క మన్ననలు బడసినది. ఈ గ్రంథము (మెమొ నెం. 4870/సమితి-1/60 Dt. 9-2-1961 ప్లానింగ్ మరియు లోకల్ ఎడ్మినిస్ట్రేషన్ డిపార్టుమెంటు) గవర్నమెంటు వారిచే రికమెండు చేయబడినది.

ఇంగ్లీషులోగల గ్రంథము తెలుగులో అనువదించి ప్రచురించిన గ్రామ పంచాయతీ/సర్‌పంచ్‌లకు (తెలంగాణా) అధ్యక్షులకు,(ఆంధ్ర)సమితి అధ్యక్షులకు ఎంతో ఉపయోగముగా ఉండునని అనేకమంది చేసిన సూచనను పురస్క-

రించుకొని ఈ గ్రంథమును తెలుగులో సులభశైలిలో ప్రచురించి అందజేయ గలిగినందులకు సంతసిస్తున్నాము.

ఈ తెలుగు గ్రంథములో 15. అగస్టు 1961 వరకు జారీ చేయబడిన గజెట్‌లో ప్రకటింపబడిన రూల్సు గూడా చేర్చినాము.

ఇంతకుముందు మా యింగ్లీషు ప్రచురణను ఆదరించినట్లే పాఠకులు ఈ తెలుగు అనువాదమును కూడా ఆదరిస్తారని ఆశించుచున్నాము.

దీని ముద్రణాభారము వహించుటకు ఉత్సాహముతో పూనుకున్న అమరావతీ ప్రెస్ అండు పబ్లికేషన్స్ వారికి, తదితర మా శ్రేయోభిలాషులకు, మిత్రులకు ధన్యవాదములు.

ప్రచురణ కర్తలు.



III

# రెండవ ప్రచురణ

మొదటిసారిగా మేము తెలుగు గ్రంథము 1961 అక్టోబరు మాసములో ప్రచురించినాము. అయితే ప్రచురించిన ఒక్క మాసమునకే ప్రతులన్నీ అమ్ముడుపోయినవి. పంచాయతీ సమితి అధ్యక్షులు, వాటి మెంబర్లుగా వ్యవహరించుచున్న గ్రామ పంచాయతీ బోర్డు ప్రెసిడెంట్లు (ఆంధ్ర) మరియు సర్‌పంచ్‌ల (తెలంగాణా) వత్తిడివల్ల, రెండవ ముద్రణాభారము వహించ వలసి వచ్చినది. రెండవ ప్రచురణకు తోడ్పడి సకాలములో పనిపూర్తిచేసిన శ్రీ వాణీ ముద్రణాలయము, సుల్తాను బజారు, హైదరాబాదువారికి మా కృతజ్ఞతలు.

మొదటి ముద్రణ ఆదరించినట్లే రెండవ ముద్రణ కూడా పాఠకులు ఆదరించెదరని నమ్ముచూ సవినయముగా కోరుచున్నాము.

ప్రచురణ కర్తలు.

# ఇంగ్లీషు గ్రంథము గురించి ప్రముఖుల అభిప్రాయాలు.

**Contains a wealth of useful and upto date information:—**

.........The book Contains a wealth of useful and up-to-date information on the Scheme of Democratic Decentralisation. I am confident that this book will prove extremely useful to all those who are concerned with the administration of Panchayat Samithis and Zilla Parishads—*From the foreword of Hon'ble Sri Justice Satyanarayaana Raju.*

**Immense value to Samithis and Parishads:—**

.........This volume, containing not only the Act and the Rules but also an exhaustive introduction and copious commentaries on some of the important Provisions of the Act should prove of immense value to the Panchayat Samithis and Zilla Parishads.—*The Hon'ble Sri Justice Basireddi.*

**Bound to be Popular:—**

.........Mr. P. Ramareddi has striven to bring out this volume consisting of the Act and copious commentaries. It has illuminating notes and instructive observations and contains appropriate and useful references. I am sure this volume is bound to be popular.—*The Hon'ble Sri Justice Munikanniah.*

**Quite useful as a Compendious reference:—**

.........The book incorporates the sections of the Act, Commentary thereon and the rules made. It is quite useful as a compendious reference and I am confident that the members of the Samithis and Parishads will find it useful—*Sri D. Narasaraju, Advocate General of Andhra Pradesh.*

**A boon to the Zilla Parishads and Panchayat Samithis:—**

.........It is needless to stress on the importance of the work which will be a boon to the Zilla Parishads and Panchayat Samithis which require constant enlightenment on the subject which is furnished by the Commentary—*Sri D. Suryanarayana Swamy, Law Secretary to Govt. of A. P.*

**Book will be helpful:—**

.........I am sure that the public, particularly those who have got to carry on the day to day administration of the Samithis and Parishads will find this book helpful—*Sri Pappu Somasundaram, Senior most Advocate, Supreme Court.*

# సాధారణ
# విషయసూచిక


| | పేజి |
|---|---|
| మనవి | 1 |
| ఉపోద్ఘాతం | 1 |
| ఉద్దేశ్యములు కారణములు యొక్క స్టేట్ మెంటు | 9 |
| పంచాయతీ సమితుల-జిల్లా పరిషత్తుల చట్టము | 12 |
| చట్టము క్రింద జారీచేయబడిన రూల్సు | 89 |


## అనుబంధము.

పంచాయతీ సమితులకు జిల్లా పరిషత్తులకు అనువర్తింప జేసిన (ఆంధ్ర, తెలంగాణా జిల్లాబోర్డుల చట్టములు).


| | | |
|---|---|---|
| ఒకటవ షెడ్యూలు:- | 1920 ఆంధ్రప్రదేశ్ (ఆంధ్ర) జిల్లా బోర్డుల చట్టముయొక్క నిబంధనలను పంచాయతీ సమితులకు జిల్లా పరిషత్తులకు అనువర్తింప జేయుట. | 349 |
| రెండవ షెడ్యూలు:- | ఆంధ్రప్రదేశ్ (తెలంగాణా) జిల్లాబోర్డుల చట్టముయొక్క నిబంధనలను పంచాయతీ సమితులకు జిల్లా పరిషత్తులకు అనువర్తింప జేయుట. | 348 |
| మూడవ షెడ్యూలు:- | 1920వ ఆంధ్రప్రదేశ్ (ఆంధ్ర) జిల్లా బోర్డుల చట్టము సరిచూచి మార్పులు. | 371 |
| నాలుగవ షెడ్యూలు:- | 1956వ ఆంధ్రప్రదేశ్ (తెలంగాణా) జిల్లాబోర్డుల చట్టము సరిచూచి మార్పులు. | 505 |



1

# ఉపోద్ఘాతం

## స్థానిక స్వపరిపాలన ప్రాముఖ్యం, ఆవశ్యకత

ప్రజాస్వామ్య ప్రభుత్వం వున్న మన దేశంలో స్థానిక ప్రభుత్వానికి వుండే విలువ దాని స్వభావం అతీతమైనది. స్వేచ్ఛా ప్రభుత్వాలను నెలకొల్పబడినప్పటికి స్థానిక స్వపరిపాలనా ప్రభుత్వాలు లేకుండా స్వాతంత్ర్యం వర్ధిల్లదు. వైకౌంటు బ్రైస్ తాను రచించిన "ఆధునిక ప్రజాస్వామ్యాలు" అనే గ్రంథంలోని మొదటి భాగము 7వ అధ్యాయంలో ఈ విధంగా తన అభిప్రాయాన్ని వ్యక్తపరచారు. "ప్రజాస్వామ్యానికి ఉత్తమమైన పద్ధతీ, ప్రజాస్వామ్యం వర్ధిల్లడానికి ఉత్తమమైన మార్గం ఒకటే వుంది. అది స్థానిక స్వపరిపాలనా ప్రభుత్వాల ఏర్పాటు".ఐదేళ్ళకొకసారి పార్లమెంటు, అసెంబ్లీ సభ్యులను ఎన్నుకోవడానికి మాత్రమే. రాజకీయ కార్యకలాపాలను పరిమితం చేసేటట్లయితే పౌరులు ఊరికే ఉండిపోవడం జరుగుతుంది. సరియైన ప్రజాస్వామ్యానికి లక్షణ మేమిటంటే అందరి పౌరులు వారి కార్యకలాపాలను నిర్వహించుకోవడంలో చురుకుగా పాల్గొంటారు. ఇటువంటి స్థానిక ప్రభుత్వ యూనిట్లలో మాత్రమే పౌరుడు ఏదైన పదవిని సులభంగా పొందడానికి, రాజకీయ అనుభవాన్ని అంటే జాలి మొత్తానికి ఆయా స్థానిక ప్రాంతాలకు సంబంధించిన విషయాలలో తన శక్తిసామర్థ్యాలను పెంపొందింప జేసేటటువంటి అనుభవాన్ని సంపాదించడానికి వీలు కలుగుతుంది. సాధారణ పౌరుడికి చైనా, పాకిస్థాన్ దేశాల విషయంలో అనుసరించవలసిన విదేశాంగ విధానం కంటే తన ప్రాంతంతో వుండే లోటుపాట్లను గురించి ఎక్కువగా తెలుస్తుంది. చిక్కులతో కూడివున్న అనేక జాతీయ విధానాలకంటే తన ప్రాంతంలో ఎటువంటి అభివృద్ధి పనులు జేపట్టాలో అతడు బాగా అర్థం చేసుకోగలడు.

ఆయా స్థానిక ప్రాంతాలతో వారికుండే పరిచయాన్నిబట్టి, ఆయా ప్రాంతాలలోని ప్రత్యేక అవసరాలను గురించి సక్రమంగా తెలియజెప్పడానికి, ఆ అవసరాలను తీర్చడానికి ఏవిధమైన చర్య తీసికోవలసిందీ నిర్ణయించడానికి వీలు కలుగుతుంది.

ప్రజాస్వామ్యంలో ఒక విద్యగా స్థానిక స్వయం ప్రభుత్వం ప్రధాన మైంది. కేంద్రీకరణ ఎక్కువైనప్పుడు, ప్రజాస్వామ్యానికి ఎదురయ్యేముప్పును తొలగించడానికికూడా ఇది తోడ్పడుతుంది. ప్రభుత్వ కార్యకలాపాలు రోజు రోజుకు అధిక మౌతున్న ఈ శకంలో ఇప్పటికే అధిక భారాన్ని వహిస్తున్న కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు స్థానిక సమస్యలకుకూడా బాధ్యత వహించడం దాదాపు భరింపరాని భార మౌతుంది. ఇంతే కాకుండా ప్రభుత్వచర్య ఫలితంగా లాభంగాని, నష్టంగాని పొందే రాష్ట్రప్రభుత్వాలకు స్థానిక ప్రజలకు తెలిసినం తగా స్థానిక అవసరాలను, స్థానిక స్థితిగతులను అవగాహనం చేసుకోడం సాధ్యం కాకపోవచ్చును. ఈవిధంగా చూస్తే స్థానిక ప్రభుత్వాలు, ప్రజా స్వామిక ప్రభుత్వాలకు వాటిల్లబోయే ప్రమాదంనుండి రక్షిస్తాయి. పంచాయతీ సమితులకు ఇతర స్థానిక ప్రభుత్వాలకు ప్రజల అండదండలు అధికంగా ఉన్న ట్లయితే రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాల కేంద్రీకరణ విధానాలను అరికట్టగలవు.

బాలగంగాధరతిలక్ కాలంనుండి భారత రాజకీయ వేత్తలు గుర్తించిన విషయం ఒకటున్నది. అదేమంటే భారతీయ పౌరులు, స్వయం ప్రభుత్వాన్ని నడుపుకోవడంలో శిక్షణ పొందడం, ఇటువంటి శిక్షణ వారికి ఇవ్వాలంటే స్థానిక ప్రభుత్వ రంగంలో సాధ్యమైనంతవరకు ప్రజాస్వామ్య సూత్రాలను ప్రవేశపెట్టడమే ఉత్తమమైన మార్గం. రాష్ట్ర ప్రభుత్వాలు ప్రజాస్వామ్య విధా నాలమీదే నడుస్తున్నాయి గాబట్టి పరిపాలనలో క్రింది స్థాయిలో ప్రజాస్వామిక సంస్థలను ఏర్పరచవలసిన అవసరం లేదనే సిద్ధాంతానికి ఆధారంలేదు. అబ్ర హాంలింకన్ వాక్యాలలో చెప్పాలంటే "ప్రజాస్వామ్య మనేది ప్రజలది. అది ప్రజలకోసం ఏర్పడింది. అది ప్రజలచేత ఏర్పరుపబడిందై ఉండాలి."

ఈ సందర్భంలోనే ఐవరు జెన్నింగ్సు చెప్పినదానిని ఈ క్రింద ఉద హరించడం అప్రస్తుతం కాకపోవచ్చును. "అధికారులు అధికార అర్హమైవుండి, లంచగొండితనం లేకుండా వున్నట్లయితే కేంద్రీకృత విధానం, అన్ని విధానాల కంటే సామర్థ్యవంతమైందీ, ఆర్థికంగా కలిసివచ్చేది కావడానికి అవకాశం వుంది. కాని ఇందువల్ల ఒకవైపున నియంతృత్వానికి, మరొక వైపున లంచ గొండితనానికి దారితీయడానికి ఆస్కారంకూడా ఉన్నది. మనల్ని సరిగాను సామర్థ్యవంతంగాను పాలిస్తారని భూఖామందులు, భూర్జువా వర్గాలను నమ్మిన దానికంటే అధికంగా అధికారులను నమ్మడానికి వీలులేదు. కట్టుదిట్టమైన అజ్మాయిషీ వుండాలి. కేంద్ర విధానమండలి చేసే అజ్మాయిషీ అంత కట్టు

దిట్టంగా లేదు. ఎందుచేతంటే అది అధికారులు అవలంబించిన సాధారణ విధానాన్ని విమర్శించడంతప్ప ఏం జేయలేకపోతున్నది. ఈ ఆధునిక ప్రభుత్వాలవల్ల ఏర్పడే చిక్కు సాధారణ విమర్శను మరింత క్లిష్టంచేస్తూ ఉన్నది. ఆ విధంగా ప్రతిదేశం, ఫ్రాన్సువంటి బలీయంగా కేంద్రీకృతంచేయబడ్డ దేశం కూడా ఎన్నికలు జరిగే స్థానిక సంస్థలు, ఎన్నికలు జరిగే కేంద్ర ప్రభుత్వం వుండటం అవసరం అని గ్రహించింది. (Ivor Jennings on Local Govt. in the Modern Constitution pages 4, 5.)

## భారత రాజ్యాంగము

భారత రాజ్యాంగచట్టం 7వ షెడ్యూలులోని రాష్ట్రసూచి (2వసూచి)లో 5వ పద్దు స్థానిక అధికార వర్గాలను ఏర్పాటుచేసి స్థానిక స్వయం ప్రభుత్వాలు లేక గ్రామపాలన నిమిత్తం వాటికి అధికారాలను ఇవ్వడానికి రాష్ట్ర విధాన మండలికి అధికారా లిస్తున్నది. అందువల్ల గ్రామ పంచాయతీల, పంచాయతీ సమితుల, జిల్లా పరిషత్తుల ఏర్పాటు, స్వయం సమృద్ధిగా స్వయం పాలక యూనిట్లగా అభివృద్ధిపరచడం అవసరమనేది సుస్పష్టమే.

## స్వపరిపాలనకు ప్రధానాంశాలు

గ్రామ పంచాయతుల, పంచాయితీ సమితుల, ఇతర స్థానిక సంస్థల స్వాతంత్ర్యం వాస్తవమైనది కావాలంటే ఈ దిగువ చెప్పినవి ప్రధానం.

## 1. చాలినంత ఆర్థిక సదుపాయం

ఈ స్థానిక స్వప్రభుత్వ సంస్థలకు చాలినన్ని ఆదాయ మార్గాలు లేక పోతే గ్రామాల అభివృద్ధికోసం, ఎక్కువగా పాటుపడే స్థితిలో అవివుండవు. అయినప్పటికి విధాన మండలిచే అప్పుడప్పుడు చట్టాలు అనేకం చేయబడి నప్పటికి 1959 ఆంధ్రప్రదేశ పంచాయితీ సమితుల జిల్లాపరిషత్తుల చట్టం చేయబడిందాకా ఆదాయ మార్గాల అభివృద్ధికి ముఖ్యమైన మార్పులేవీ ప్రవేశ పెట్టబడలేదు. చాలినన్ని ఆదాయ మార్గాలు లేకుండా కేవలం కర్తవ్యాలను, అధికారాలను మంజూరు చేయడంవల్ల పంచాయతీ సమితులకు జిల్లా పరిషత్తులకు ఎక్కువ ప్రయోజనం ఏమీవుండదు. స్థానికసంస్థలకు ఆదాయమార్గాలను పెంచకుండానే క్రొత్తగా మరికొన్ని కర్తవ్యాలను అంటగడితే దానివల్ల మంచి కంటే చెడే ఎక్కువ జరుగుతుంది.

## 2. అధికారాలు, కర్తవ్యాలు

మరొక ప్రధానాంశం ఏమిటంటే నిర్మాణ కార్యక్రమాన్ని విస్తరింప జేయడం, వాటి కప్పజెప్పబడ్డ విద్యుక్తధర్మాలు వాస్తవమైనవై ఉండాలి లేక పోతే పంచాయతీ సమితుల, జిల్లా పరిషత్తుల ఏర్పాటువల్ల ప్రయోజనం ఏమీ ఉండదు, పంచవర్ష ప్రణాళికలు, గృహవసతి, మాతాశిశు సంక్షేమం, కుటీర పరిశ్రమలు, ప్రాథమిక విద్యా, సెకండరీ విద్యాబోధనవంటి సాంఘిక సేవా కార్యక్రమాలలో అభివృద్ధి పథకాలు నిమిత్తం, సమితుల, పరిషత్తుల బాధ్యతను పెంచవచ్చును, ఈ విధానం రాష్ట్రప్రభుత్వానికి ఎక్కువ ఉపయోగ కరంగా ఉంటుంది. ఎందుచేతంటే రాష్ట్రప్రభుత్వంవారు తమంత తామే ఇతర కార్యక్రమాన్ని చేపట్టడానికి వీలుంటుంది.

## 3. పని విభజన

స్థానిక స్వాతంత్ర్యానికి కావలసిన మూడవ ముఖ్యాంశం ఏమిటంటే రాష్ట్ర ప్రభుత్వానికి, గ్రామ పంచాయతీలు, పంచాయతీ సమితులు, జిల్లాపరిషత్తులవంటి స్థానిక స్వపరిపాలన సంస్థలకు, మధ్య పనివిభజన భారతరాజ్యాంగ చట్టం రెండు స్థాయిల ప్రభుత్వాలకు అంటే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు మాత్రమే ఏర్పాటు చేస్తున్నది. అమెరికాలో మూడు స్థాయిలలో ప్రభుత్వం ఉన్నది. అవేవంటే జాతీయ ప్రభుత్వం, రాష్ట్రప్రభుత్వం, స్థానిక ప్రభుత్వం, ఈ విషయము ఆలోచించవలసి ఉన్నది.

వాస్తవానికి స్థానిక ప్రభుత్వం నిర్వహించాల్సిన పనులేమిటో కచ్చితంగా చెప్పడం అంత సులువైన పని కాకపోవచ్చును. కారణం ఏమిటంటే స్వపరిపాలన సంస్థలు నిర్వహించాల్సినబాధ్యతల్లో పెక్కు స్వభావానికి రాష్ట్రప్రభుత్వ బాధ్యతలే. విద్య, ప్రజారోగ్యంవంటివాటిలో రాష్ట్రప్రభుత్వం అనవసరంగా జోక్యం కలుగజేసుకోవడం ఉండదు. ఏవిధమైన నిరంకుశ చర్యకుగాని లక్ష్యారం ఉండదు. కేవలం అధికారాలను, విధులను స్థానిక స్వయంప్రభుత్వ యూనిట్లకు మార్చడం విషయంలో ప్రజలలో భిన్నాభిప్రాయం ఉన్నది. ఎందుచేతంటే వీటిల్లో కొంత లంచగొండితనం, అసమర్థత, సామాన్యంగా ఉంటూ వుంటాయి కాని ఇది తరచు ఎక్కువగా చేసి చెప్పడంజరుగుతుంది, ఇంతకీ

స్థానిక స్వప్రభుత్వాలకు విస్తరింపజేసిన బాధ్యతలు చాలతక్కువ. విమర్శకులు వీటిని పట్టించుకో నవసరంలేదు. ఈ సంస్థలు అనుభవంమీద అభివృద్ధికి తవ్పక వస్తాయి. స్థానిక ప్రభుత్వాలకు పరిమిత అధికారాలనే వారిని నిరుత్సాహపర చాలి. సాంఘిక, నైతిక ప్రమాణాలను పెంపుచేయడానికి, స్థానిక ప్రభుత్వం యొక్క విస్తీర్ణాన్ని మితపరచకుండా ఉండడానికి ప్రయత్నించడమే దీనికి మందు. ఈ సంస్థలు మరింత సామర్థ్యంతో పని చేయడానికి క్రమశిక్షణా సూత్రాలు నిర్ణయించడమే ఈ లోపాలను సవరించడానికి మరింత కట్టుదిట్టమైన చర్య అవుతుంది.

## పంచాయతీరాజ్య పునరుద్ధరణ

నిజమైన ప్రజాస్వామిక వ్యవస్థలో ప్రజలే పాలనాభారమును వహిస్తారు. వారి విషయములను వారే తీర్చిదిద్దుకొంటారు. ప్రభుత్వము మాత్రము సాంకేతిక సలహాలను యిస్తుంది. కావలసిన సదుపాయాలు కలగజేస్తుంది. ప్రజలు తమ కష్టసుఖములను అవసరాలను గ్రహించినంతగా ప్రభుత్వ ఉద్యోగులు గ్రహించలేరు. ప్రజలు స్వయంగా నిర్మించుకున్న సంస్థవలె వివిధ సమస్యల చైతన్యము ప్రజల్లో కలిగించలేరు. అందుచేత ప్రజాస్వామిక రంగంలో, అధికార వికేంద్రీకరణ పథకము, 1959 వ సంవత్సరములో ప్రారంభించబడింది. ప్రభుత్వ ఉద్యోగుల ఆధీనములో వున్న పరిపాలనాధికారమును ప్రజలకు అప్పగించారు. ప్రజా ప్రతినిధులే ఆయా ప్రాంతాల అవసరములను గమనించి పథకములను తయారుచేసి, అమలుపరుస్తారు.

### పూర్వకాలంలో

పూర్వకాలంలో గ్రామ పంచాయతీలు స్వయం సమృద్ధిపొందిన పరిపాలనా వ్యవస్థలుగా వుండేవి. గ్రామీణ ప్రజల ఆదరాభిమానాలు వాటికి వుండేవి. పర ప్రభుత్వ పాలనాయంత్రాంగంలో క్రమంగా పంచాయతీ రాజ్య ప్రాముఖ్యము నశించిపోయింది. పల్లెసీమల కాలవాలమైన ఈ దేశమునకు పంచాయతీ రాజ్యము వెన్నెముక వంటిదని పర ప్రభుత్వం గుర్తించలేక పోయింది. గ్రామస్థులందరు కలసి మెలసి గ్రామాభ్యుదయ కార్య రంగంలో పాల్గొనలేకపోయారు. ప్రజలు, పరిపాలనా యంత్రాంగమునకు, పంచాయతీ రాజ్యమునకు దూరమై పోయారు. పంచాయతీ వ్యవస్థ పరిపాలనా రంగంలో పూర్తిగా రూపుమాసిపోయింది.

పంచవర్ష ప్రణాళికలు అచరణలోనికి వచ్చినప్పటినుండి గ్రామ సీమల సౌభాగ్యముకొరకు, ఎక్కువ శ్రద్ధ తీసికొనడం ప్రారంభమైంది. గ్రామ పంచాయతీలను సువ్యవస్థితము చేసి గ్రామ సీమల స్వపరిపాలనకొరకు తగిన అధికారములిచ్చి ప్రతి గ్రామము అభ్యుదయ పథకములను తయారుచేసి అమలు పరుచుకోగలిగినపుడే ప్రజా ప్రణాళిక సార్థక మవుతుందని సర్వత్రా గుర్తించ బడింది. కావలసిన అధికారము యివ్వనిచో పటిష్ఠమైన పంచాయతీ రాజ్య మును సాధించుట కష్టమని గ్రహించారు.

తరచుగ తప్పులు పట్టెడు స్వభావంగల విమర్శకులు, యిప్పటి పరి పాలనా వ్యవస్థలో కేంద్రస్థాయిలో ప్రజాస్వామ్యం, గ్రామసీమల స్థాయిలో నిరంకుశత్వము ఉండునని అరోపిస్తారు. జిల్లానుండి అన్ని స్థాయిలలోను ప్రజలు బాధ్యత వహించి, ముందంజవేసి, పరిపాలనలో జోక్యము కల్గజేసి కొను అవకాశం లేదని అంటారు. ఈ పరిస్థితినిసరిచేసి పరిపాలనతో ప్రజలకు సన్నిహిత సంబంధంకల్పించడానికై 1952 అక్టోబరునెలలో, దేశవ్యాప్తంగా సమాజాభివృద్ధి కార్యక్రమం ఆరంభింపబడింది. అన్ని స్థాయిలలోను పరిపాల నాధికారం ప్రజలపరం చేయడం జరిగింది. తత్ఫలితంగా ప్రజల చైతన్య శక్తి ప్రజాస్వామిక వ్యవస్థకు మూలాధారమని రూఢిమైనది. జిల్లాకు దిగువన అన్ని స్థాయిలలోను స్వపరిపాలనా బాధ్యత ప్రజలకు రానంతకాలము, ప్రజాభి మానమును చూరగొనుట, ప్రణాళికా కార్యక్రమములను ప్రజలుఉత్సాహముతో నిర్వర్తించుట కష్టమని గుర్తించబడింది.

ఆదినుండి ప్రజాప్రతినిధులు అభివృద్ధి కార్యక్రమాలలో ఎక్కువగా పాల్గొని తుదకు పాలనా భారమును వహించుటకు కావలసిన పరిస్థితులన్నీ కల్పించటానికి ప్రయత్నం జరుగుతున్నది. సమాజ వికాస కార్యక్రమం, జాతీయ విస్తరణ సేవా పథకాలను పరిశీలించుటకు శ్రీబలవంతరాయ్‌మెహతా అధ్యక్షతన ఏర్పడిన సంఘమువారు ప్రజాస్వామిక వ్యవస్థలో అధికారవికేంద్రీ కరణ ప్రాధాన్యమును స్పష్టంగా వివరించారు.

ఈ సందర్భంలో మెహతా సంఘము నివేదికలో ఏమని పేర్కొన బడిందంటే "ప్రజా ప్రభుత్వము సువిశాలమైనదేశమును పాలించవలసివుంది. కాగా ఆయా ప్రాంతాల పరిస్థితులను, ప్రజల స్థితిగతులను వివరంగా అవ గాహన చేసికొనలేకపోవచ్చు. అందుచే అధికార వికేంద్రీకరణ అవసరం. పరిపాలనా యంత్రాంగము, అధికారము, ప్రాంతీయ ప్రజాప్రతినిధుల స్వాధీన మందుంచడం శ్రేయస్కరం."

మెహతా సంఘము చేసిన యీ ముఖ్య సూచనను భారత ప్రభుత్వము, ప్రణాళికా సంఘము ఆమోదించాయి. మండల స్థాయిలో జిల్లా పరిషత్తులను, బ్లాకు స్థాయిలో పంచాయతీ సమితులను స్థాపించి, అధికారమును ప్రజలకు అప్పగించటానికి నిర్ణయం జరిగింది..

## వికేంద్రీకరణ అంటే ఏమిటి?

వికేంద్రీకరణ అంటే కేంద్రీకృతమైయున్న అధికారమును విభాగించి. ఆయా ప్రాంతీయ పంజా సంస్థలకు అప్పగించడం, ఈవిధంగా అధికారమును విభాగించి. ప్రజా సంస్థలైన సమితులకు, పంచాయతీలకు అప్పగించడంవల్ల నిజమైన ప్రజా వ్యవస్థ ఏర్పడుతుంది. అధికారం వికేంద్రీకృత మవుతుంది.

ప్రభుత్వ పరిపాలనా యంత్రాంగంలో జిల్లా ముఖ్యమైనది. లోగడ జిల్లా స్థాయిలోగల అధికారాలు అంతకంటె దిగువ స్థాయిలో ప్రజా సంస్థలకు అప్పగించ బడినవి. జిల్లాలలో బ్లాకు ప్రాంతాలకు చెందిన అభివృద్ధి కార్య క్రమాలు అమలుపరిచే అధికారం పంచాయతీ సమితులకు అప్పగించడం జరి గింది. ఆ విధముగ బోర్డులు నిర్వర్తించు విధులలో చాలా భాగం పంచాయతీ సమితులకు, మిగిలినవి జిల్లా పరిషత్తులకు అప్పగించబడినవి.

దీనిని దృష్టిలో ఉంచుకొని 1959 సంవత్సరములో ఆంధ్రశాసనసభ, ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సమితుల, జిల్లాపరిషత్తుల చట్టమును ఆమోదించింది. ఇది రాష్ట్రాభ్యుదయ మార్గంలో ఒక మైలురాయి వంటిది. పంచాయతీ సమి తులు 1-11-1959న, జిల్లా పరిషత్తులు 1-12-1959న ప్రారంభించబడి నవి. పంచాయతీ సమితులు నిర్వర్తించవలసిన విధులు, అధికారాలు. చట్టము యొక్క 18వ సెక్షన్‌లో విశదీకరించ బడినవి. గ్రామ సంక్షేమము, వ్యవ సాయాభివృద్ధి, పశుపోషణ, ప్రజారోగ్యము. ప్రాథమికవిద్య, గృహ పరిశ్ర మలు, సాంఘిక సంక్షేమము మొదలగు పనులు యిక నుండి పంచాయతీ సమి తులచే నిర్వర్తించ బడగలవు. అన్ని సంస్థలనుండి సిబ్బంది, ఆర్థిక సహాయ ము, పంచాయతీ సమితుల పరం చేయబడినవి.

సమాజ వికాస కార్యక్రమముక్రింద సేద్యపు నీటి పారుదల, గ్రామీణ గృహవసతికి ఋణ సహాయం నిమిత్తం కేటాయించిన మొత్తము పంచాయతీ సమితుల పరంగా యివ్వబడుతుంది. తిరిగి వాయిదాల మీద సమితుల నుండి

వసూలు చేస్తారు. అదే విధంగా మరికొన్ని అభివృద్ధి కార్యక్రమ శాఖలవద్ద, ప్రధానంగా వ్యవసాయము, పశుపోషణ, పరిశ్రమల అప్పుల రూపమున మంజూరు చేసిన ధనము కూడా పంచాయతీ సమితుల పరంగా యివ్వబడుతుంది.

## జిల్లా పరిషత్తుల అధికారాలు

జిల్లాపరిషత్తులు నిర్వర్తించ వలసిన విధులు, అధికారములు, చట్టము యొక్క 47వ సెక్షన్‌లో నిర్వచింప బడియున్నవి. సమితులకు సలహాలను యిచ్చుట, అజమాయిషీ చేయుట, బడ్జెటును ఆమోదించుట, సమితి ప్రణాళికలను సమన్వయ పరుచుట, ప్రభుత్వము బ్లాకులకు మంజూరు చేసిన ధనమును పంచి యిచ్చుట, పరిషత్తులు చేయవలసిన విధులు, ఆంధ్రప్రాంతములోని పురపాలక సంస్థలు, తెలంగాణా ప్రాంతంలోని పట్టణ పాలక సంస్థలు సహా జిల్లాలోని అన్ని అభివృద్ధి కార్యక్రమాలకు పథకములను తయారు చేయవలసిన బాధ్యత పరిషత్తులపైనే వుంది. పరిషత్తులు ముఖ్యమైన ప్రభుత్వ కార్యక్రమాలను నిర్వర్తించుటయందు, అంటే గ్రామజీవన ప్రమాణము వృద్ధిచేసి గ్రామీణ ప్రాంతాల అభివృద్ధి సాధించుటలో ప్రభుత్వముతో కలసి మెలసి పని చేయవలసి వుంటుంది.

జిల్లా పరిషత్తులు ప్రభుత్వముచే తమకు అప్పగించబడిన జిల్లాబోర్డుల విధులను కూడా నిర్వర్తిస్తుంటాయి. పరిషత్తులు, సమితులకు, ప్రజాసంస్థలు, గృహములు, విధులు, అధికారములు, ఆదాయ వ్యయములు, కేటాయించు అధికారము జిల్లాకలెక్టర్లకు యివ్వబడింది. ప్రాథమికవిద్య, రహదారులు ప్రజారోగ్యము, మొదలగు ముఖ్యవిషయాలు బ్లాకులకు సంబంధించినవన్నీ ఎక్కువగా పంచాయతీ సమితులకు యివ్వబడినవి. ప్రస్తుతానికి సమితులులేని, బ్లాకు ప్రాంతాలకు సంబంధించిన విధులు, ధనము జిల్లాపరిషత్తుల అధీనమందే వుంటాయి, రాష్ట్రములోవున్న 20 జిల్లాలలోను జిల్లాపరిషత్తులు పనిచేయు చున్నవి.

## ఎక్కువ అధికారాలు

అధికార వికేంద్రీకరణవల్ల జిల్లా స్థాయి పాలనలో పెద్ద విప్లవాత్మకమైన మార్పువచ్చింది. ఇంతకు పూర్వము అనేక పనులకు ప్రణాళికలకు డబ్బు మంజూరుచేయు అధికారము ఉన్నత ఉద్యోగులచేతుల్లో ఉండేది. ఇప్పుడు సమి

తులకు స్థాయీ సంఘములకు ఆ అధికారము యివ్వ బడింది. విధులను అధి కారమును విభాగించే పంచాయితీ సమితులు స్థాయిసంఘములు యిక నుంచి సమాజ వికాస పథకముల కగు ఖర్చును మంజూరు చేసుకోవచ్చు.

ఇకముందు గ్రామ ప్రణాళిక లాధారముగా బ్లాకు ప్రణాళికలు, బ్లాకు ప్రణాళిక లాధారంగా జిల్లా ప్రణాళికలు, తుదకు జిల్లా ప్రణాళికలన్నీ కలసి రాష్ట్రప్రణాళికగా రూపొందుతవి. ఈ విధంగా గ్రామ పంచాయతీలు రాష్ట్ర ప్రణాళికకు పునాదులై యదార్థ ప్రజావసరములను ప్రతిబింబింప చేయును.

ఈ ప్రజా సంస్థలయొక్క ముఖ్యవిధులు, అన్యోన్య ప్రజాసహకార ముతో ప్రణాళికలు తయారుచేసి, స్వయం సహాయంతో అమలుపర్చుట, ప్రజ లలో నూత్నోద్యమ్రక్పథమును స్వయంశక్తిని ఆత్మవిశ్వాసములనుపెంపొందించుట ఆర్థికాభివృద్ధిని పలువిధములైన సహకారపద్ధతులద్వారాను ప్రజాస్వామికసిద్ధాం తముల ద్వారాను సాధించుట, ప్రజాస్వామిక సంస్థలయొక్క ముఖ్య లక్ష్యము, గ్రామ సాంఘిక ఆర్థిక రంగాల్లో, చైతన్యమును కల్గించి మానవాభ్యుదయము నకు దేశ సౌభాగ్యమునకు తోడ్పడుటయే. వివిధ ప్రజాసౌకర్యాలు కలుగ జేయ డం దగ్గరనుండి గ్రామసీమలలో ప్రశాంత పద్ధతిలో సాంఘిక ఆర్థిక విప్లవం సాధించువరకు యీ వికేంద్రీకరణ గ్రామముయొక్క పరిధి పరివ్యాప్తమై ఉంటుంది.

## ఉద్దేశములు కారణములు యొక్క స్టేట్‌మెంటు

1958వ సంవత్సరము 47వ నెంబరుగల బిల్లులో నిర్దిష్టమైనవి ఈ క్రింద ఉద్దేశములు కారణములు అయి యున్నవి.

రెండవ పంచవర్ష ప్రణాళికలో, స్వయంసహాయము, పరస్పర సహ కారము అను రెండు సూత్రముల మీద గ్రామాభివృద్ధి అన్ని స్కీముల అంచనా, అమలు యొక్క బీజము, పంచాయతీ సమితులు అయి యుండ వలయునని ప్లానింగు కమీషను హెచ్చరించినది. శ్రీ బల్వంతరాయ్ మెహతాగారిచే నడుపబడి కమ్యూనిటీ అభివృద్ధిమీద పర్యవేక్షణ జరుపు సంఘము (ప్లానింగు కమీషనుచే ఏర్పరుపబడిన ప్లాను ప్రాజెక్టుల కమిటీచే నియమింప బడినది) ఈ సమస్య ధారాళముగ పరిశీలించి, గ్రామములలో పంచాయతీల

ఏర్పాటు బ్లాకు జిల్లా లెవెల్‌లో పరిపాలన, ప్రజాప్రభుత్వ వికేంద్రీకరణ మును సూచించెను. 12వ నవంబరు 1957 తేదీన ప్రభుత్వముచే ప్రచురింప బడిన స్థానిక పరిపాలనా పునఃనిర్మాణముమీద తెల్లకాగితములో, ప్రభుత్వము, ప్రస్తుతమున్న బ్లాక్ ప్లానింగు డెవలెప్‌మెంటు కమిటీలు స్థానే పంచాయతీ సమితిలు, ప్రస్తుతమున్న జిల్లా ప్లానింగు డెవలెప్‌మెంటు కమిటీలు, జిల్లా బోర్డులు స్థానే పరిషత్‌లు స్థాపించుట మూలముగా అట్టి వికేంద్రీకరణము వారు సాధించుటకు తలపెట్టిన మార్గములను, సంక్షిప్తముగ తెలియజేసిరి.

2. 1950వ ఆంధ్రప్రదేశ్ (ఆంధ్ర) గ్రామ పంచాయతీల చట్టము, 1956వ ఆంధ్రప్రదేశ్ (తెలంగాణా) గ్రామ పంచాయతీల చట్టము వరుసగా ఆంధ్ర, తెలంగాణా ప్రాంతములలో పంచాయతీలు ఏర్పాటును ఉద్దేశించి యున్నవి. రాష్ట్రమంతటను తొందరగా పంచాయతీలను నిర్మించుటకు ప్రభుత్వము చర్యలు తీసికొనినారు. కొన్ని ఎంచిన బ్లాకులలో తాత్కాలిక పద్ధతిని వారు పంచాయతీ సమితిలను కూడ స్థాపించియున్నారు. ఇప్పుడు రాష్ట్రములో పంచాయతీ సమితిలు జిల్లా పరిషత్‌లు స్థాపించుట కొరకు విస్తారమైన చట్టములు చేయుటకు ఉద్దేశింపబడినది, పంచాయతీ సమితి ఒక సంఘసంస్థ అయియుండి, పంచాయతీ సమితులతో దగ్గర బాంధవ్యము కలిగియుండి సంఘాభివృద్ధి కార్యకలాపము అమలు సహా బ్లాకు పరిపాలన సాధారణముగా పంచాయతీ సమితిలో చేరి యుండును. ప్రతి పంచాయతీ సమితి, వివేటి పంచాయతీలు లేక గ్రామ పంచాయతీల అన్ని అధ్యక్షులు లేక సర్‌పంచులు, స్థానిక పరిపాలన ఇన్‌స్పెక్టరు జనరల్‌చే ప్రకటింబబడిన పంచాయతీ లేక టవున్ కమిటీ యొక్క జూరిస్‌డిక్షనులోలేని బ్లాకులో ప్రతి స్థలముకు జిల్లా కలెక్టరుచే నియమింపబడిన ఒక సభ్యుడుగల పంచాయతీ సమితి సభ్యులచే కోఆప్టు చేయబడిన యింకను అయిదుగురు సభ్యుల కలియకతో ఉద్యోగమును బట్టి సభ్యులుగా బ్లాకులో టవున్ కమిటీల అధ్యక్షులు కలిగియుండును. బ్లాకు ఒక భాగముగా ఉన్న నియామకుల సముదాయమును తెలియజేయు లెజిస్లేటివ్ అసెంబ్లీ సభ్యులు వారి నియామకుల సముదాయములో ఉన్న పంచాయతీ సమితి ఏ సభల యొక్క చర్యలకైనను హాజరయి వాటిలో పాల్గొనుటకు హక్కుగలిగి యున్నారు. కాని వారు అట్టి సమావేశములలో ఓటు చేయుటకు హక్కులేదు. ప్రభుత్వముచే నిర్దిష్టము చేయబడు రాష్ట్రముయొక్క లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులు అదేహక్కును కలిగియున్నారు. జిల్లా పరిషత్ కూడ సంఘ సంస్థగా యుండి, జిల్లాలో

ప్లానింగ్ అభివృద్ధి పనుల నధీనములో నుంచుకొనును. జిల్లాలోని అన్ని పంచాయతీ సమితుల చర్యలు తనిఖీచేయుటయేగాక, అది జిల్లా లెవెల్‌లో సమానావశ్యకమైన సంస్థగా పనిచేయును. ఉద్యోగమునుబట్టి జిల్లాలో అన్ని పంచాయతీ సమితుల అధ్యక్షులు, జిల్లానుండి ఎన్నుకొనబడిన లెజిస్లేటివ్ అసెంబ్లీ సభ్యులు, జిల్లా ఒక భాగమైన నియామకుల సముదాయమునుండి ఎన్నుకొనబడిన లోక్‌సభ సభ్యులు, ప్రభుత్వముచే నిర్దిష్టము చేయబడినట్టి రాజ్య సభ సభ్యులు, రాష్ట్ర లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులు, జిల్లా కలెక్టరు, పంచా పంచాయతీ సమితి ఏర్పరచబడిన ప్రతి బ్లాకుకు ప్రభుత్వముచే నియమింపబడిన ఒక సభ్యుడు, జిల్లా పరిషత్ కలిగియుండును. ఉత్తరువువల్ల ప్రభుత్వము నిర్దిష్ట ము చేయు జిల్లా అధికారులు, జిల్లా పరిషత్ లేక దాని "ఏ" స్టాండింగ్ కమిటీ యొక్క సమావేశములయొక్క చర్యలను గురించి మాట్లాడుటకు, ఇతరముగా వాటిలో పాల్గొనుటకు హక్కుగలదు. కాని అట్టి ఏ సమావేశములలోను ఓటు చేయటకు వారికి అధికారము లేదు.

జిల్లాలో జిల్లాపరిషత్ ఏర్పడిన మీదట, జిల్లాబోర్డు రద్దు చేయబడును. జిల్లాబోర్డు అధికారములు, పనులు జిల్లా పరిషత్ పంచాయతీ సమితులచే చలా యింపబడి, నిర్వర్తించబడును. ఆంధ్ర ప్రదేశ్ (ఆంధ్ర) జిల్లాబోర్డుల చట్టము, ఆంధ్ర ప్రదేశ్ (తెలంగాణా) జిల్లా బోర్డుల చట్టము జిల్లా బోర్డులు రద్దు కాబడిన తరువాత కూడ అమలులో ఉండుట జరుగును. వాటి నిబంధనలు, రాష్ట్ర ప్రభు త్వముచేయు కావలసిన మార్పులతో పంచాయతీ సమితులకు జిల్లా పరిషత్‌లకు అనువర్తింప జేయబడును. తత్ఫలితముగ, జిల్లా బోర్డులచే యిప్పుడు నిర్వర్తింప బడు అనేక పనులకు సంబంధించిన ఏర్పాట్లు, ఈబిల్లులో చేర్చబడి యుండలేదు. గ్రామ లెవల్‌పైన బ్లాకులకు బ్లాకుపైన జిల్లాకు పనులు చెందజేయుటకు ప్రయ త్నించుటలో, స్థానిక జనము మొదటి యత్నము బాగుగ అభివృద్ధి చెందు ననియు, అభివృద్ధి కార్యకలాపములన్నిటిలో ప్రజలు ఎక్కువ స్వేచ్ఛగాను, ఉత్సాహముగాను పాల్గొనుదురనియు, జిల్లాలో అన్ని భాగములలోను ప్రజా ప్రభుత్వ సంస్థల జయమునకు ముఖ్యమైన మంచి యాజమాన్యము అభివృద్ధి చెందుననియు ప్రభుత్వము ఆశించుచున్నది.

3. ఈ బిల్లు, పై చెప్పబడిన ఉద్దేశములను అమలులోనికి తెచ్చుటకు ఉద్దేశింపబడియున్నది.

13

# ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సమితి-జిల్లా పరిషత్తుల చట్టము

## విషయసూచిక


| సెక్షను నెం. | | పేజీ |
|---|---|---|
| 1 | సంగ్రహనామము, వ్యాప్తి, ప్రారంభము | 17 |
| 2 | నిర్వచనములు | 17 |
| 3 | పంచాయతీసమితుల ఏర్పాటు, వాటి సంఘీకరణ | 19 |
| 4 | పంచాయతీసమితియొక్క నిర్మాణము | 20 |
| 5 | పంచాయతీసమితియొక్క లేక దాని స్థాయీసమితియొక్క వ్యవహారములలో పాల్గొనుటకు రాజ్య విధాన మండలి సభ్యులలో కొందరికి హక్కు | 25 |
| 6 | సభ్యులను ఎన్నుకొనుటకు ప్రత్యేక సమావేశము | 25 |
| 7 | పంచాయతీ సమితి అధ్యక్ష ఉపాధ్యక్షుల ఎన్నిక, వారి పదవీ కాల పరిమితి, ఖాళీలను భర్తీచేయుట | 26 |
| 8 | పంచాయతీసమితి సభ్యుల పదవీకాలపరిమితి, ఖాళీలను భర్తీచేయుట | 27 |
| 9 | సభ్యుడగుటకు అనర్హతలు | 28 |
| 10 | సభ్యుడుగా ఉండుటకు అనర్హతలు | 31 |
| 11 | సభ్యుల అనర్హతల సమస్యలను జిల్లా మునసబు నిర్ణయించుట | 32 |
| 12 | కొన్ని యాదృచ్ఛిక ఖాళీలను భర్తీచేయుట | 32 |
| 13 | అధ్యక్షుని, ఉపాధ్యక్షుని లేక సభ్యుని రాజీనామా | 32 |
| 14 | పంచాయతీసమితియొక్క స్థాయీసమితులు | 33 |
| 15 | పంచాయతీసమితి లేక దాని స్థాయీసమితి వ్యవహారములలో పాల్గొనుటకు కలెక్టరు హక్కు | 38 |
| 16 | తన స్థాయీ సమితులనుండి పత్రములను డాక్యుమెంట్లను తెప్పించుకొనుటకు పంచాయతీసమితి అధికారము | 38 |
| 17 | పంచాయతీ సమితియొక్క లేక దాని స్థాయీ సమితియొక్క సమావేశపు వ్యవహార నిర్వహణకు సంబంధించిన నియమావళి | 38 |
| 18 | పంచాయతీసమితి, అధికారములు, కర్తవ్యములు | 38 |
| 19 | ఉమ్మడి నీటి సరఫరా పనుల, ఇతర సంస్థల నిర్వహణ | 40 |

20 బ్లాకు అభివృద్ధి అధికారివద్దనుండి పత్రములను తెప్పించుకొనుటకు పంచాయతీ సమితి లేక దాని స్థాయీ సమితులకు అధికారము 40
21 గ్రామాధికారులనుండి సమాచారము కోరుటకు పంచాయతీ సమితి అధికారము 41
22 అధ్యక్ష, ఉపాధ్యక్షుల అధికారములు, కర్తవ్యములు 41
23 పంచాయతీ సమితి పనులు మున్నగువాటిని గురించి తెలియపరచుటకు సభ్యుల హక్కు 42
24 బ్లాకు అభివృద్ధి అధికారములు, కర్తవ్యములు 43
25 బ్లాకు అభివృద్ధి అధికారి, పంచాయతీ సమితియొక్క ఇతర అధికారులు, సిబ్బంది పంచాయతీసమితియొక్క అధీనసిబ్బందిగా ఉండుట 44
26 అధికారులయొక్కయు, ఇతర ఉద్యోగుల యొక్కయు పదవులను సృష్టించుట వాటిలో నియామకములు చేయుట 45
27 పంచాయతీ సమితి లేక దాని స్థాయీ సమితియొక్క సమావేశమునకు హాజరై నందుకు బత్తెములు 45
28 పంచాయతీసమితి నిధి 45
29 పంచాయతీసమితి ఆదాయ వ్యయములు 46
30 పంచాయతీసమితి బడ్జెటు 47
31 పంచాయతీలు పట్టణ సమితులు వాటి బడ్జెటులను పంచాయతీ సమితులకు సమర్పించుట 47
32 అకౌంట్లు, ఆడిటు 48
33 అధ్యక్షునిపై లేక ఉపాధ్యక్షునిపై అవిశ్వాస తీర్మానము 51
34 పంచాయతీ అధ్యక్షుని లేదా ఉపాధ్యక్షుని తొలగించుటకు ప్రభుత్వమువారికి అధికారము 53
35 పంచాయతీసమితికిని ఇతర స్థానిక అధికార వర్గములకును సంయుక్త సమితి 55
36 జిల్లాపరిషత్‌ల ఏర్పాటు, సంఘీకరణ, నిర్మాణము 56
37 జిల్లాపరిషత్ యొక్క చైర్మను, వైసు చైర్మను ఎన్నిక వారి పదవీ కాలపరిమితి, ఖాళీలను భర్తీచేయుట 58
38 జిల్లాపరిషత్ కార్యదర్శి 59
39 జిల్లాపరిషత్ సభ్యుల పదవీ కాలము, ఖాళీలను భర్తీచేయుట 60
40 అనర్హతలు 60

41 కొన్ని యాదృచ్ఛిక ఖాళీలను నింపుట 60
42 అధ్యక్షుని, ఉపాధ్యక్షుని, లేక సభ్యునియొక్క రాజీనామా 61
43 జిల్లాపరిషత్ స్థాయీసమితులు 61
44 కొందరు జిల్లా అధికారులకు జిల్లాపరిషత్‌యొక్కగాని, స్థాయీ సమితియొక్కగాని ప్రొసీడింగ్సులలో పాల్గొనుటకు హక్కు 63
45 జిల్లాపరిషత్‌యొక్కగాని, దాని స్థాయీ సమితియొక్కగాని సమావేశపు వ్యవహార నిర్వహణకు సంబంధించిన నియమావళి 63
46 కార్యదర్శివద్దనుండి రికార్డులను తెప్పించుకొనుటకు జిల్లాపరిషత్‌లకు లేక దాని స్థాయీసమితి అధికారము 64
47 జిల్లాపరిషత్ అధికారములు, కర్తవ్యములు 64
48 జిల్లాపరిషత్ చైర్మనుల అధికారములు, కర్తవ్యములు 66
49 జిల్లాపరిషత్ పనులు మున్నగువాటిని గురించి తెలియపరచుటకు ఆయా సభ్యులకుగల హక్కు 67
50 కలెక్టరుయొక్క ఇతర అధికారములు 67
51 అధికారులయొక్కయు, ఇతర ఉద్యోగులయొక్కయు పదవులను సృష్టించుట, ఆ పదవులలో నియామకములు చేయుట మున్నగునవి 68
52 జిల్లాపరిషత్‌యొక్క లేక దాని స్థాయీసమితియొక్క సమావేశమునకు హాజరైనందుకు బత్తెములు 68
53 జిల్లాపరిషత్ నిధి 69
54 జిల్లాపరిషత్‌యొక్క ఆదాయ వ్యయములు 69
55 జిల్లాపరిషత్‌యొక్క బడ్జెటు 70
56 అక్కౌంటు, ఆడిట్లు 71
57 జిల్లాపరిషత్ చైర్మనుపైగాని, వైస్ చైర్మనుపైగాని అవిశ్వాస తీర్మానం 71
58 జిల్లాపరిషత్ చైర్మన్‌నిగాని, వైస్ చైర్మన్‌నిగాని తొలగించుటకు ప్రభుత్వమువారి హక్కు 71
59 జిల్లాబోర్డుల అధికారములను, కర్తవ్యములను పంచాయతీసమితులకు జిల్లాపరిషత్‌లకు బదిలీచేయుట 71
60 జిల్లాబోర్డుల రద్దు 72
61 జిల్లాబోర్డుల చట్టము పంచాయతీసమితులకు మరియు జిల్లాపరిషత్‌లకు పర్తించుట 73

62 పంచాయతీసమితియొక్క తీర్మానమును రద్దుచేయుటకు లేక తాత్కాలికముగా ఆపియుంచుటకు అధికారము 74
63 పంచాయతీసమితిని లేక జిల్లాపరిషత్‌ను రద్దుచేయుటకు, విఘటన చేయుటకు ప్రభుత్వమువారి అధికారము 75
64 లాంఛన బద్ధము కాకుండుట, ఖాళీ ఏర్పడుట, మున్నగువాటివలన పంచాయతీ సమితులయొక్కయు, జిల్లాపరిషత్‌లయొక్కయు చర్యలు చెల్లనివి కాకుండుట 75
65 సభ్యులు విధేయతా ప్రమాణము చేయుట 76
66 పరిపాలనా నివేదిక 77
67 తనిఖీ అధికారుల ప్రవేశమునకు అధికారములు 77
68 సద్భావముతో చేయబడిన చర్యల విషయము రక్షణ 78
69 నియమము చేయు అధికారము 78
70 ఉపనిబంధనలు చేయుటకు పంచాయతీసమితికి జిల్లాపరిషత్‌నకు అధికారము 78
71 అధికార ప్రధానము 79
72 మార్పుచేయుటకు, సమీక్షించుటకు ప్రభుత్వమునకు అధికారము 79
73 చిక్కులను తొలగించు అధికారము 81
74 తాత్కాలిక పంచాయతీసమితుల సందర్భములో మినహాయించుట 81

# ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సమితుల, జిల్లాపరిషత్తుల చట్టము

## 1959 లో 35 వ చట్టము

పంచాయతీ సమితులను, జిల్లాపరిషత్తులను ఏర్పాటుచేయుటకును, అందుకు సంబంధించిన తదితర విషయములలో నిబంధనలు చేయుటకును అధికారమిచ్చు చట్టము.

భారత రిపబ్లిక్ పదవ సంవత్సరములో ఆంధ్రప్రదేశ్ రాజ్య విధాన మండలిచే ఈ క్రింది విధముగా శాసింపబడుచున్నది:-

# 1 వ అధ్యాయము

## ఉపక్రమణిక

1. సంగ్రహనామము, వ్యాప్తి, ప్రారంభము

(1) ఈ చట్టము 1959 ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సమితుల, జిల్లా పరిషత్తుల చట్టము అని పిలుపబడును.

(ఎ) ఇది ఆంధ్ర ప్రదేశ్ అంతటికిని వర్తించును.

(బి) ఇది ప్రభుత్వమువారు ఆంధ్రప్రదేశ్ గెజిటులో ప్రకటనద్వారా నిర్ణయించునట్టి తేదీన, అట్టి ప్రాంతములో అమలులోనికి రావలెను. వారు వేర్వేరు ప్రాంతములకు, వేర్వేరు నిబంధనలను, వేర్వేరు తేదీలను నిర్ణయింపవచ్చును.

2. నిర్వచనములు

ఈ చట్టములో సందర్భము అన్యథా అపేక్షించిననే తప్ప-

(ఎ) "ఆంధ్రప్రాంతము" అనగా 1953, ఆంధ్ర ప్రదేశ్ చట్టము (1953 లో 30వ కేంద్ర చట్టము)యొక్క 3వ విభాగము (1)వ ఉపవిభాగ ములో నిర్దిష్టపరుపబడిన ప్రదేశములు అని అర్థము;

(బి) "బ్లాకు" అనగా ఒక జిల్లాలోని ఏ ప్రాంతము ప్రభుత్వమువారిచే ప్రకటనద్వారా బ్లాకుగా ఉండవలెనని ప్రకటింపబడునో ఆ ప్రాంతము అని అర్థము;

(సి) "బ్లాకు అభివృద్ధి అధికారి" అనగా ప్రభుత్వముచేగానీ, ఆ విష యమున ప్రభుత్వముచే అధికార మీయబడిన మరొక అధికార వర్గముచేగానీ ఆ హోదాతో నియమింపబడిన అధికారి అని అర్థము ;

(డి) "కలెక్టరు" అనగా ఒక రెవిన్యూ డివిజను ఇన్‌చార్జిగా ఉన్న అధికారి అని అర్థము. డిప్యూటీ కలెక్టరు, సబ్ కలెక్టరు, అసిస్టెంటు కలెక్టరు కూడ ఇందులో చేరుదురు;

(ఇ) "ప్రభుత్వము" అనగా రాజ్య ప్రభుత్వము అని అర్థము;

(ఎఫ్) "ప్రకటన"అనగా "ఆంధ్రప్రదేశ్ గెజిటులో" ప్రచురించబడిన ప్రకటన అని అర్థము;

(జి) "పంచాయతీ' అనగా ఆంధ్రప్రాంతము విషయములో 1950 మదరాసు గ్రామ పంచాయతీల చట్టము (1950లో 10వ మదరాసు చట్టము) క్రింద ఏర్పాటు చేయబడిన పంచాయతీ అనియు, తెలంగాణా ప్రాంతము విషయములో 1956, హైదరాబాదు గ్రామ పంచాయతీలచట్టము (1956లో 17 వ హైదరాబాదు చట్టము) క్రింద ఏర్పాటు చేయబడిన గ్రామ పంచాయతీ అనియు అర్థము ;

(హెచ్) "పంచాయతీ సమితి" అనగా 3వ విభాగముక్రింద ఏర్పాటు చేయబడిన పంచాయతీ సమితి అని అర్థము ;

(ఐ) "నిర్ణయింపబడిన" అనగా ఈ చట్టముక్రింద చేయబడిన నియమావళిద్వారా నిర్ణయింపబడిన అని అర్థము ;

(జె) "సంబంధించిన జిల్లాబోర్డుల చట్టము" అనగా ఆంధ్రప్రాంతము విషయములో 1920, మదరాసు జిల్లాబోర్డుల చట్టము (1920 లో 14 వ ఆంధ్రప్రదేశ్ (ఆంధ్ర) చట్టము) అనియు, తెలంగాణా ప్రాంతమువిషయములో 1955, ఆంధ్రప్రదేశ్ (తెలంగాణా) జిల్లాబోర్డుల చట్టము (1956లో 1 వ హైదరాబాదు చట్టము అనియు అర్థము.

(కె) "షెడ్యూల్డు కులములు" "షెడ్యూల్డు తెగలు" అను మాటలు భారత సంవిధానముయొక్క (24), (25)వ ఖండములలో వాటికి తెలుపబడిన అర్థములనే కలిగి యుండవలెను ;

(ఎల్) "రాజ్యము" అనగా ఆంధ్ర ప్రదేశ్ రాజ్యము అని అర్థము ;

(ఎం) "తెలంగాణా ప్రాంతము" అనగా 1956, రాజ్య పునర్వ్యవస్థీకరణ చట్టము (1956లో 37వ కేంద్ర చట్టము) యొక్క 3వ విభాగము (1వ) ఉప విభాగములో నిర్దిష్ట పరుపబడిన ప్రదేశములు అని అర్థము;

(ఎన్) "పట్టణ సమితి" అనగా 1956, హైదరాబాదు జిల్లా మునిసిపాలిటీల చట్టము (1956లో 18వ హైదరాబాదు చట్టము)యొక్క 5వ విభాగము క్రింద ఏర్పాటు చేయబడిన పట్టణ మునిసిపాలిటీయొక్క సమితి అని అర్థము ;

(ఒ) "జిల్లా పరిషత్తు" అనగా 36వ విభాగము క్రింద ఏర్పాటు చేయబడిన జిల్లా పరిషత్తు అని అర్థము;

(పి) ఈ చట్టములో ఉపయోగింపబడియు, నిర్వచింపబడని మాటలు, పదసముదాయములు, సంబంధించిన జిల్లాబోర్డుల చట్టములోను, పంచాయతీలకు మునిసిపాలిటీలకు సంబంధించి రాజ్యములో తత్కాలమందు అమలులోనున్న సంబంధించిన శాసనములోను వాటికి ఏ అర్థములు తెలుపబడినవో ఆ అర్థములనే కలిగియుండవలెను.

# 2వ అధ్యాయము

## పంచాయతీ సమితుల ఏర్పాటు, సంఘీకరణ, నిర్మాణము, అధికారములు, కర్తవ్యములు మున్నగునవి.

3. పంచాయతీ సమితుల ఏర్పాటు, వాటి సంఘీకరణ

(1) ప్రభుత్వమువారు ప్రకటనద్వారా ఆ ప్రకటనలో నిర్దిష్టపరుపబడు తేదీనుండి ఒక బ్లాకును ఒక పంచాయతీ సమితిని ఏర్పాటు చేయవచ్చును.

(2) ప్రతి పంచాయతీ సమితియును అది ఏ బ్లాకుకై ఏర్పాటు చేయబడినదో ఆ బ్లాకు పేరుతో ఒక సంఘీభూత సంస్థగా ఉండి, నిరంతర ఉత్తరాధికారమును, సమిష్టిముద్రను, ఆస్తినిసంపాదించు, కలిగియుండు, పరిష్కరించు అధికారములు చేసికొను అధికారమును కలిగియుండవలెను. సంఘ నామముతో అది దావా వేయవచ్చును, వేయబడవచ్చును.

(3) (1)వ ఉపవిభాగముక్రింద ఒకబ్లాకుకై పంచాయతీసమితి ఏర్పాటు చేయబడిన తరువాత ఆ బ్లాకు సరిహద్దులు తిరిగి ఏర్పరుపబడిన యెడల ప్రభు

త్వమువారు, అట్లు సరిహద్దులు తిరిగి ఏర్పరుపబడిన బ్లాకులుగాను ఆ ఉపవిభాగపు విబంధనల క్రింద పంచాయతీ సమితిని తిరిగి ఏర్పాటు చేయవచ్చును:

అయితే, పంచాయతీ సమితిని తిరిగి ఏర్పాటు చేయునపుడు, అట్లు సరిహద్దులు తిరిగి ఏర్పరుపబడుటకు సద్యఃపూర్వము పనిచేయుచున్న పంచాయతీ సమితియొక్క అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు, ఎన్నికయిన సభ్యుడు లేక నామనిర్దేశము చేయబడిన సభ్యుడు, ఆయన తిరిగి ఏర్పాటు చేయబడిన పంచాయతీ సమితిలో అట్టి పదవియందుండుటకు ఇతర విధముగా అర్హుడైయున్నప్పుడు తిరిగి ఏర్పాటు చేయబడిన పంచాయతీ సమితిలో అట్టి పదవికి ఆయన సందర్భానుసారముగా ఎన్నుకొనబడిన లేక నామనిర్దేశము చేయబడిన ఎట్లో అట్లే ఆయన తిరిగి ఏర్పాటు చేయబడిన పంచాయతీ సమితియొక్క అధ్యక్షుడుగా ఉపాధ్యక్షుడుగా ఎన్నుకొనబడిన లేక నామ నిర్దేశము చేయబడిన సభ్యుడుగా ఉండవలెనని ప్రభుత్వమువారు ఆదేశించవచ్చును.

4. పంచాయతీ సమితి యొక్క నిర్మాణము

(1) ప్రతి పంచాయతీ సమితియును ఈ దిగువ సభ్యులలో కూడియుండవలెను.

(i) ఆంధ్రప్రాంతము విషయమున ప్రతి పంచాయతీ అధ్యక్షుడును, తెలంగాణా ప్రాంతము విషయమున ప్రతి పంచాయతీ, సర్పంచు మరియు ఆ బ్లాకులోని ప్రతి పట్టణ సమితి అధ్యక్షుడును, పదవిరీత్యా:

అయితే-

(ఎ) పంచాయతీల, పట్టణ మునిసిపాలిటీల విషయములో తత్కాలమందు రాజ్యములో అమలునందున్న సంబంధించిన శాసనములో ఏమియున్నప్పటికిని, ఎవరైన పంచాయతీ అధ్యక్షుడు లేక సర్పంచు లేక పట్టణసమితిఅధ్యక్షుడు పంచాయతీ సమితిలో సభ్యుడుగా ఉండ నిరాకరించినచో లేక అట్టి సభ్యత్వమునకు రాజీనామా ఇచ్చినచో లేక తన సభ్యత్వమును అన్యథా విరమించినచో ఆయన అట్టి నిరాకరణ రాజీనామా లేక విరమణ తేదీనుండి సందర్భానుసారముగా పంచాయతీ అధ్యక్షుడుగా లేక సర్పంచుగా లేక పట్టణ సమితి అధ్యక్షుడుగా ఉండరాదు. మరియు ఆయన అనంతరము అట్టి పదవిలోనికి వచ్చిన వ్యక్తి ఆయన స్థానమున పంచాయతీ సమితి సభ్యుడుగా ఉండవలెను;

(బి) రద్దు చేయబడిన లేక విఘటన చేయబడిన పంచాయతీ లేక పట్టణ సమితి సందర్భములో జిల్లాకలెక్టరు అట్టి పంచాయతీ లేక పట్టణసమితి అధికార

క్షేత్రములోని ప్రాంతమందు నివసించు ఒక వ్యక్తిని ఆ ప్రాంతమునకు ప్రాతినిధ్యము వహించు సభ్యుడుగా నామనిర్దేశము చేయవలెను.

(ii) ఆ బ్లాకులోని ఒక పంచాయతీ లేక పట్టణ సమితియొక్క అధికార క్షేత్రములో లేనిదై, పంచాయతీ ఏర్పాటుకు యూనిటుగా స్థానిక పరిపాలన ఇనస్పెక్టరు జనరలుచే ప్రకటనద్వారా నిర్దిష్ట పరుపబడినట్టి ప్రాంతమునకుగాను ఆ ప్రాంతమందు నివసించుచు ఆ ప్రాంతమునకు ప్రాతినిధ్యము వహించు సభ్యుడుగా జిల్లా కలెక్టరుచే నామనిర్దేశము చేయబడు వ్యక్తి ఒకరు;

(iii) ఆ బ్లాకులో నివసించు వారిలో నుండి (i), (ii) ఖండములలో నిర్దిష్ట పరుపబడిన సభ్యులచే నిర్ణయింపబడిన విధానమున ఎన్నుకొనబడు ఈ క్రింది వ్యక్తులు:—

(ఎ) ఒక స్త్రీ.

(బి) షెడ్యూల్డు కులముల ప్రతినిధి ఒకరు.

(సి) గల జనాభా లెక్కల ఆధారముగా ఆ బ్లాకులోని షెడ్యూల్డు తెగల వారి జనాభా, ఆ బ్లాకులోని మొత్తము జనాభాలో నిర్ణయింపబడిన,శాతముకంటె తక్కువగా లేదని జిల్లా కలెక్టరుచే ప్రకటింపబడినచో షెడ్యూల్డుతెగల ప్రతినిధి ఒకరు మరియు ఆ బ్లాకులోన షెడ్యూల్డు తెగలవారి జనాభా అట్టి శాతముకంటె తక్కువగా ఉన్నచో షెడ్యూల్డు కులముల ప్రతినిధి మరొకరు;

(డి) పరిపాలన, ప్రజాజీవనము, గ్రామీణ జీవనము, గ్రామీణ అభివృద్ధి లేక సాంఘిక సేవలో అనుభవముగల ఇద్దరు వ్యక్తులు - వీరిలో ఒకరు స్త్రీ అయి ఉండవలెను.

(ఇ) ఆ బ్లాకులో పనిచేయుచున్న సహకార సంఘ సభ్యుడొకరు.

(2) ఈ విభాగము మరియు 36వ విభాగము యొక్క కార్యముల నిమిత్తము ఒక వ్యక్తి ఒక బ్లాకులో లేక ప్రాంతములో సాధారణముగా నివసించుచున్నచో లేక అందు నివాస గృహమును కలిగియున్నచో ఆవ్యక్తిసందర్భాను సారముగా అట్టి బ్లాకులో లేక ప్రాంతములో నివసించు చున్నట్లు భావింపబడ వలెను.

# వ్యాఖ్యానము

## నిమ్న జాతులు, తెగలు :

వారు వెనుకబడుటవల్ల రాష్ట్రీయుల శాసనసభలలో, సామాన్య జనము సమావేశ గృహములో నిమ్న జాతులకు నిమ్న తెగలకు సీట్లను భద్రపరచి ఉండుటను రాజ్యాంగచట్టముయొక్క 334వ ఆర్టికలు ఏర్పాటుచేసియున్నది. అట్టి భద్రపరచి వుంచుట 1970 సంవత్సరములో అంత్యమగును. అదేమార్గములో, నిమ్నజాతులకు నిమ్న తెగలకు సీట్లను భద్రపరచి వుంచుట అను లాభము ప్రస్తుత చట్టములో ఏర్పాటు చేయబడియున్నది,

ఈ చట్టము 4వ సెక్షనుయొక్క (i) వ సబ్‌సెక్షనుయొక్క (iii) వ క్లాజుయొక్క (b) సబ్‌క్లాజు, పంచాయతీసమితికి ఎన్నుకొనవలసిన నిమ్న జాతులయొక్క ఒక ప్రతినిధి కావలసినదిగా కోరును.

నిమ్న తెగల విషయములో, 4వ సెక్షనుయొక్క (i) వ సబ్ సెక్షనుయొక్క (iii) వ క్లాజుయొక్క (c) సబ్‌క్లాజు. ఆ బ్లాకు మొత్తము జనాభాయొక్క నియమిత శాతముకన్న తక్కువకాకుండ యిప్పటి జనాభా లెక్కల నాధారము జేసికొని జిల్లాకలెక్టరుచే బ్లాకులోని వారి జనాభా ప్రకటింపబడినచో పంచాయతీ సమితికి నియమితపద్ధతిలో ఎన్నుకొనవలసిన నిమ్నతెగలయొక్క ఒక ప్రతినిధిని కావలసినదిగా కోరును; మరియు బ్లాకులోని నిమ్న తెగల యొక్క జనాభా అట్టి శాతముకన్న తక్కువ అయిన, నిమ్నజాతుల కింకొక ప్రతినిధి కావలసినదిగా కోరును.

నిమ్నజాతులు, నిమ్నతెగలు అనగా ఏమి ? రాజ్యాంగ చట్టముయొక్క ఆర్టికల్ 366 క్రింద 24, 25 క్లాజులు ఈ క్రిందివిధమున చెప్పుచున్నవి.

24. "నిమ్నజాతులు" అనగా ఈ రాజ్యాంగ చట్టముకొరకు 341 వ ఆర్టికలుక్రింద నిమ్నజాతులుగా భావింపబడినట్టి జాతులు, సంతతులు లేక తెగలు లేక అట్టి జాతులలో, సంతతులలో లేక తెగలలో భాగములు లేక సముదాయములు.

25. "నిమ్నతెగలు" అనగా ఈ రాజ్యాంగ చట్టముకొరకు 342 వ ఆర్టికలు క్రింద నిమ్నతెగలుగా భావింపబడునట్టి తెగలు, లేక తెగలకు సంబంధించిన సంఘములు లేక అట్టి తెగలు లేక తెగల సంఘములలో భాగములు లేక సముదాయములు.

రాజ్యాంగ చట్టముయొక్క 341, 342 ఆర్టికలులు ఇచ్చినఅధికారములను చలాయించి, ఇండియా ప్రసిడెంటు, గవర్నరులతో సంప్రదించి నిమ్నజాతుల తెగల పేర్లు నిర్దిష్టమైన ఒక ఉత్తరువును జారీచేసెను.

ఆంధ్రప్రదేశ్‌లో నిమ్నజాతులు, నిమ్న తెగలయొక్క జాబితా ఈ క్రింద తెలుపబడియున్నది.

(A) ఆంధ్రప్రదేశ్‌లో నిమ్నజాతుల జాబితా.

(1) రాష్ట్రమంతటను;

1. చలవది, 2. చామర్, మోచి లేక ముచ్చి, 3. మాదిగ 4. మాల

(2) హైదరాబాదు, మహబూబునగరు, ఆదిలాబాదు, నిజామాబాదు, మెదక్, కరీంనగర్, వరంగల్, ఖమ్మం, నల్గొండ జిల్లాలలో తప్ప రాష్ట్రమంతటను :

1. ఆదిఆంధ్ర 2. ఆదిద్రావిడ 3. అరుంధతీయ 4. బారికి 5. బావూరి 6. చచ్చటి, 7. చండాల, 8. దాంపసి, 9. డాం, డంబారా, పైడి లేక పానో, 10. ఘాసి, హడ్డి లేక రెల్లిచేహండి, 11. గొడగలి, 12. గోదరి, 13. గోసంగి 14. జగ్గలి, 15. జాంబువులో. మదాసి, 16. కారువా లేక మాదరి కారువ, 17. మాలదాసు, 18. మాదిగదాసు, మస్తిన్, 19. మాతంగి, 20. మండల 21. పాకి లేక మాటి, 22. పంబాద లేక పంబండ. 23, పమిడి, 24. పంచమ లేక పారయ్యా, 25. రేలి, 26. సాంబన్, 27. సప్రు, 28. తోటి.

(3) హైదరాబాదు, మహబూబ్‌నగర్, ఆదిలాబాదు, నిజామాబాదు, మెదకు, కరీంనగరు, వరంగల్, ఖమ్మం, నల్లగొండ జిల్లాలలో :

1 అనముల్ 2 ఆరె (మాల) 3 అర్వమాల 4 బేడ (బుడ్గ) జంగం 5 బిండ్ల 6 బ్యాగార 7 చాంబార్ 8 దక్కల్ (దొక్కల్‌వార్) 9 ఢోర్ 10 ఎల్లమాల్వార్ (ఎల్లమాలవాండ్లు) 11 హోలెయ 12 హోలెయదాసరి 13 కొలుపుల్

వాండ్లు 14 మహర్ 15 మాలదాసరి 16 మాలహన్నెయి 17 మాలజంగం 18 మాలమస్తి 19 మాలసాలె (నెట్కాని) 20 మాలసన్యాసి 21 మాంగ్ 22 మాంగ్‌గరోడి 23 మన్నె 24 మష్టి 25 మెహతార్ 26 మితఅయల్‌వార్ 27 సామగార 28 సిందొల్లు (చిందొల్లు).

(B) ఆంధ్రప్రదేశ్‌లో నిమ్న తెగల జాబితా :

(1) రాష్ట్రమంతటను.

1. చెంచు లేక చెంచువార్ 2. కోయ లేక గౌడ్ దాని ఉప తరగతి రాజ లేక రషకోయాలు, లింగధారికోయాలు (సాధారణ) కొట్టు కోయలు, బిన్నెకోయ, రాజ్‌కోయ.

(2) హైదరాబాదు, మహబూబ్‌నగర్, ఆదిలాబాదు, నిజామాబాదు, మెదక్, కరీంనగర్, వరంగల్, ఖమ్మం, నల్గొండ జిల్లాలు తప్ప రాష్ట్రమంతటను.

1 బేగటా 2 గడబాలు 3 జాటపులు 4 కమ్మర 5 కట్టునాయకన్ 6 కొండగోరలు 7 కొండకాపులు 8 కొండరెడ్డులు 9 కోంధులు (కోడి, కోధు) దేశీయ కోంధులు, దోంగ్రియ కోంధులు, కుతుయకోంధులు, టికిరియకోంధులు, ఎనిటి కోంధులు, 10 కోటియబెంతో ఒరియ, బార్టిక, ధులియ లేక దూలియ, హోల్వో, పాయికో, పుటియ సాంద్రోనా, సిధోపాయికో, 11 కులియా 12 మాలిస్ 13 మన్నదొర 14 మూఖదొర 15 నోకదొర పొర్జా (పరంజ్వార్జా) 16 రెడ్డి దొరలు 17 రోనా, రేనా, 18 సావరలు, రౌపుసావరలు, మాలియ సావరలు లేక ఖుట్టోసావరలు, 19 సుగాలీలు (లంబాడీలు) 20 యానాదులు, 21 ఎరుకలు.

(3) హైదరాబాదు, మహబూబునగరు, ఆదిలాబాదు, నిజామాబాదు, మెదక్, కరీంనగర్, వరంగల్, ఖమ్మం నల్గొండ జిల్లాలలో :

1 అంధ్ 2 భిల్ 3 గాంఢ్ (నాయిక్‌పాడ్ రాజ్‌గోండాతోసహా) 4 కొండరెడ్డులు, 5 కోలం (మన్నేరువార్లతోసహా) 6 పర్ధాన్ 7 తోటి.

(4) ఏజెన్సీ ప్రదేశములలో :

1 గౌడు (గౌడ్) 2 నాయకులు 3 వాల్మీకి.

5. "పంచాయతీ సమితి యొక్క లేక దాని స్థాయీ సమితి యొక్క వ్యవహారములలో పాల్గొనుటకు రాజ్య విధాన మండలి సభ్యులలో కొందరికి హక్కు :-"

(1) రాజ్య విధాన సభా సభ్యుడెవరైనను ఆయన ప్రాతినిధ్యము వహించునట్టి నియోజక వర్గములోనున్న బ్లాకు కొరకు ఏర్పాటు చేయబడిన పంచాయతీ సమితిలోగాని, అట్టి పంచాయతీ సమితి యొక్క ఏదైన స్థాయీ సమితిలోగాని సభ్యుడు కాకపోయినను, ఆయన అట్టి పంచాయతీ సమితి లేక స్థాయీ సమితి యొక్క ఏ సమావేశములోనైనను మాట్లాడుటకును దాని వ్యవహారములలో మరొకరీతిగా పాల్గొనుటకును హక్కు కలిగి యుండవలెను. అయితే ఈ ఉపవిభాగమును పురస్కరించుకొని అట్టి ఏదైన సమావేశములో ఓటు చేయుటకు ఆయన హక్కు కలిగి యుండరాదు. ఆయన నియోజక వర్గములో ఒకటికన్న ఎక్కువ బ్లాకులున్నచో, అట్టి ప్రతి బ్లాకునకు ఏర్పాటు చేయబడిన పంచాయతీ సమితి విషయములోను ఆయన అట్టి హక్కు కలిగి యుండవలెను. ఒక బ్లాకు ఒకటికంటె ఎక్కువ నియోజక వర్గములలో ఉన్నచో అట్టి ప్రతి నియోజక వర్గమునకు ప్రాతినిధ్యము వహించు సభ్యుడును అట్టి బ్లాకును ఏర్పాటు చేయబడిన పంచాయతీ సమితి విషయములో అట్టి హక్కు కలిగి యుండవలెను.

(2) ప్రభుత్వమువారు ఉత్తరవు ద్వారా నిర్దిష్ట పరచునట్టి రాజ్య విధాన పరిషత్సభ్యులు ఆ ఉత్తరువులో నిర్దిష్ట పరుపబడు పంచాయతీ సమితి విషయములో (1)వ ఉప విభాగముచే ఈయబడిన హక్కు కలిగి యుండవలెను.

6. "సభ్యులను ఎన్నుకొనుటకు ప్రత్యేక సమావేశము":-

(1) కలెక్టరు, 3వ విభాగము క్రింద పంచాయతీ సమితిని ఏర్పాటు చేయుటకు నిర్ణయింపబడిన తేదీలోగా లేక 3వ విభాగము (3)వ ఉపవిభాగము యొక్క నిబంధనకు లోబడి పంచాయతీ సమితి తిరిగి ఏర్పాటు చేయబడిన ప్రతిసారియును పంచాయతీ సమితి కార్యాలయములో నిర్ణయింపబడిన సమయమున 4వ విభాగము (1)వ ఉపవిభాగము (iii)వ ఖండములో నిర్దిష్ట పరుపబడిన సభ్యులను ఎన్నుకొనుటకై లిఖిత పూర్వకముగా కనీసము పది పూర్తి దినముల నోటీసు నిచ్చిన మీదట 4వ విభాగము (1)వ ఉపవిభాగము (i), (ii) ఖండములలో నిర్దిష్ట పరుపబడిన పంచాయతీ సమితి సభ్యుల ప్రత్యేక సమావేశము నొకదానిని ఏర్పాటు చేయవలెను.

(2) కలెక్టరుగాని, ఈ విషయమై జిల్లా కలెక్టరుచే అధికార మీయబడిన ప్రభుత్వ గెజిటెడు అధికారి ఒకరుగాని అట్టి సమావేశమునకు అధ్యక్షత వహించవలెను.

7. పంచాయతీ సమితి అధ్యక్షు, ఉపాధ్యక్షుల ఎన్నిక, వారి పదవీ కాల పరిమితి, ఖాళీలను భర్తీ చేయుట :-

(1) ప్రతి పంచాయతీ సమితికిని ఒక అధ్యక్షుడు, ఒక ఉపాధ్యక్షుడు ఉండవలెను. వీరిని పంచాయతీ సమితి సభ్యులు తమలోనుండి ఎన్నుకొన వలెను.

అయితే, (i) వ ఖండమునకు గల మినహాయింపు నిబంధన యొక్క (బి) ఖండము క్రిందగాని, 4వ విభాగము (1)వ ఉప విభాగము (ii)వ ఖండము క్రిందగాని నామనిర్దేశము చేయబడిన సభ్యుడు అధ్యక్షుడుగాగాని, ఎన్నుకొనబడరాదు.

(2) 4వ విభాగము (1)వ ఉపవిభాగము (iii)వ ఖండములో నిర్దిష్ట పరుపబడిన సభ్యుల ఎన్నిక జరిగిన మీదట వీలైనంత త్వరలో కలెక్టరు అధ్యక్ష, ఉపాధ్యక్షులను ఎన్నుకొను నిమిత్తము పంచాయతీ సమితి సమావేశ మును ఏర్పాటు చేయవలెను. మరియు నిర్ణయింపబడిన విధానమున ఎన్నిక జరుపబడవలెను. మొదట అధ్యక్షుడు ఎన్నుకొన బడవలెను. ఆయన ఎన్ను కొనబడిన తరువాత ఉపాధ్యక్షుడు ఎన్నుకొనబడవలెను. అధ్యక్షుని ఎన్ను కొను సమయమున కలెక్టరుగాని, ఈ విషయమై జిల్లా కలెక్టరుచే అధికార మీయబడిన ప్రభుత్వ గజిటెడు అధికారి ఒకరుగాని, ఉపాధ్యక్షుని ఎన్నుకొను సమయమున అధ్యక్షుడును అట్టి సమావేశమునకు అధ్యక్షత వహించవలెను.

(3) (ఎ) అధ్యక్ష పదవిలో యాదృచ్ఛిక ఖాళీ ఏర్పడినచో దానిని భర్తీ చేయు నిమిత్తము కలెక్టరు పంచాయతీ సమితి సమావేశము ఏర్పాటు చేయవలెను. మరియు నిర్ణయింపబడిన విధానమున ఎన్నిక జరుపబడవలెను. కలెక్టరు గాని, ఈ విషయమై జిల్లా కలెక్టరుచే అధికార మీయబడిన ప్రభుత్వ గెజిటెడు అధికారి ఒకరుగాని అట్టి సమావేశమునకు అధ్యక్షత వహించ వలెను.

(బి) ఉపాధ్యక్ష పదవిలో యాదృచ్ఛిక ఖాళీ ఏర్పడినచో దానిని భర్తీ చేయు నిమిత్తము అధ్యక్షుడు పంచాయతీ సమితి సమావేశమును ఏర్పాటుచేయ వలెను. మరియు నిర్ణయింపబడిన విధానమున ఎన్నిక జరుపబడవలెను. అట్టి సమావేశమునకు అధ్యక్షుడు అధ్యక్షత వహించవలెను.

(4) ఈ చట్టములో ఇతర విధముగా నిబంధింపబడినట్లు తప్ప అధ్య క్షుని లేక ఉపాధ్యక్షుని పదవీ కాలపరిమితి అయన ఎన్నికయిన తేదీనుండి

మూడు సంవత్సరములుగా ఉండవలెను. అధ్యక్షుని లేక ఉపాధ్యక్షుని పదవి కాలపరిమితి ముగియుటకు ముందే ఆ పదవిలో ఖాళీ ఏర్పడిన యెడల, ఆ ఖాళీలో అధ్యక్షుడుగా లేక ఉపాధ్యక్షుడుగా ఎన్నికగు వ్యక్తి ఆయనకు ముందున్న వ్యక్తియొక్క పదవీ కాలపరిమితిలో మిగిలిన కాలపరిమితి వరకు ఆ పదవిలో ఉండవలెను.

అయితే, ప్రభుత్వమువారు ప్రకటన ద్వారా, ఆ ప్రకటనలో తెలుపబడు తగు కారణమునుబట్టి అధ్యక్షుని లేక ఉపాధ్యక్షుని పదవీ కాలమును ఆ ప్రకటనలో నిర్దిష్టపరుపబడు తేదీవరకు పొడగింపవచ్చును. కాని అట్టి తేదీ, ఈ విభాగము క్రింద అట్టి కాలపరిమితి ఏ తేదీన ముగియునో ఆ తేదీ నుండి ఆరు నెలలకు మించినట్టిదిగా ఉండరాదు, మరియు ప్రభుత్వమువారు అప్పుడప్పుడు ప్రకటనద్వారా పై చెప్పబడిన ఆరు నెలల కాలము లోపల అట్టితేదీని మార్చి, దానికి బదులు మరొక తేదీని నిర్ణయించవచ్చును.

8. "పంచాయతీ సమితి సభ్యుల పదవీ కాలపరిమితి, ఖాళీలను భర్తీ చేయుట":-

(1) ఈ చట్టములో ఇతర విధముగా నిబంధింపబడి యున్నట్లు తప్ప-

(i) (ఏ) 4వ విభాగము (1)వ ఉపవిభాగము (i)వ ఖండములో నిర్దిష్ట పరుపబడిన పదవి రీత్యా నియమింపబడిన సభ్యుడు ఆయన సందర్భానుసారముగా పంచాయతీ అధ్యక్షుడుగా లేక సర్పంచుగా లేక పట్టణ సమితి అధ్యక్షుడుగా ఉండునంత కాలము సదరు సభ్యుడుగా ఉండవలెను;

(బి) 4వ విభాగము (1)వ ఉపవిభాగము (i) వ ఖండమునకు గల మినహాయింపు నిబంధనయొక్క (బి) ఖండము క్రింద నామనిర్దేశము చేయబడిన సభ్యుడు నామనిర్దేశము చేయబడిన తేదీ నుండి మూడు సంవత్సరముల వరకు లేక పంచాయతీ లేక పట్టణ సమితి పునర్నిర్మింపబడిన మీదట సందర్భానుసారముగా అట్లు పునర్నిర్మింపబడిన పంచాయతీ అధ్యక్షుడు లేక సర్పంచు లేక పునర్నిర్మింపబడిన పట్టణ సమితి అధ్యక్షుడు ఎన్నుకొన బడునంతవరకు ఈ రెండింటిలో ఏది ముందో అంతవరకు ఆయన సదరు సభ్యుడుగా ఉండవలెను.

(ii) 4వ భాగము (1)వ ఉప-విభాగము (ii)వ ఖండముక్రింద నామనిర్దేశము చేయబడిన సభ్యుడు నామ నిర్దేశము చేయబడిన తేదీనుండి మూడు

సంవత్సరముల వరకు లేక ఆయన ఏ ప్రదేశమునకు నామ నిర్దేశము చేయ బడెనో ఆ ప్రదేశము పంచాయతీలో లేక మునిసిపాలిటీలో చేర్చబడిన తేదీ వరకు లేక అట్టి ప్రదేశము పంచాయతీగా లేక పట్టణము మునిసిపాలిటీగా ఏర్పాటు చేయబడిన సందర్భములో అట్టి పంచాయతీ అధ్యక్షుడు లేక సర్పంచు లేక అట్టి పట్టణ మునిసిపాలిటీ యొక్క పట్టణ సమితి అధ్యక్షుడు ఎన్నుకొన బడునంతవరకు వీటిలో ఏది ముందు జరుగునో అంతవరకు ఆయన సదరు సభ్యుడుగా ఉండవలెను.

(iii) (ఏ) 4వ విభాగము (1) వ ఉప-విభాగము (iii) వ ఖండము యొక్క (ఎ), (బి), (సి) లేక (డి) ఉపఖండము క్రింద ఎన్నుకొనబడిన సభ్యుడు, ఆయన ఎన్నికైన తేదీనుండి మూడు సంవత్సరముల పాటు సభ్యుడుగా ఉండ వలెను ;

(బి) 4వ విభాగము (1)వ ఉప-విభాగము (iii) వ ఖండము (ఇ) ఉపఖండము క్రింద ఎన్నుకొనబడిన సభ్యుడు, ఆయన, మూడు సంవత్సరముల పదవీ కాలము ముగియుటకుముందే ఆ బ్లాకులో పని చేయుచున్న సహకార సంఘములో సభ్యత్వమును విరమించిననే తప్ప, మూడు సంవత్సరములపాటు సభ్యుడుగా ఉండవలెను ;

(2) నామ నిర్దేశము చేయబడిన లేక ఎన్నుకొనబడిన సభ్యుని పదవీ కాలము ముగియుటవలన ఆ పదవిలో ఏర్పడు ఖాళీ, 4వ విభాగములో నిబంధింపబడిన విధానమునకు మరొక వ్యక్తిని సందర్భానుసారముగా నామ నిర్దేశము చేయుట లేక ఎన్నుకొనుట ద్వారా భర్తీచేయబడవలెను.

9. సభ్యుడగుటకు అనర్హతలు:-

ఈ చట్టముయొక్క నిబంధనలకు లోబడి, పంచాయతీ సమితిని ఏర్పాటు చేయవలసిన తేదీన ఏ వ్యక్తికిగాని ఈ క్రింది విషయములలో ఏదైనను వర్తించుచో, ఆ వ్యక్తి పంచాయతీ సమితిలో సభ్యుడగుటకు అనర్హుడగును.

(ఎ) నైతికాపరాధముతో కూడని నేరమునకు గాక తదితర నేరమునకుగాను క్రిమినలు కోర్టుచే ఆ వ్యక్తి ఆరునెలలకు మించి ఖైదుశిక్ష విధింపబడి ఆ శిక్ష రద్దు చేయబడక లేక ఆ నేరము క్షమింపబడక శిక్ష పూర్తియైన తదుపరి ఐదు సంవత్సరముల కాలము గతింపకుండుట ;

ఐతే ప్రభుత్వము అట్టి శిక్ష అనర్హతగా వర్తింపరాదని ఆదేశింప వచ్చును.

(బి) ఆ వ్యక్తి మనస్థిమితము లేనివాడు, చెవిటివాడు, మూగవాడు లేక కుష్ఠురోగి అయియుండుట;

(సి) ఆ వ్యక్తి తనను దివాలాదారుగా ప్రకటించవలసినదిగా దరఖాస్తు పెట్టుకొనినవాడు లేక అవిముక్త దివాలాదారు అయి యుండుట;

(డి) ఏదైన కంపెనీలో డైరెక్టరుగా వాటాదారుగా తప్ప లేదా నిర్ణయింపబడిన ఇతర విధముగా తప్ప, పంచాయతీ సమితిలో చేసికొనబడి అమలునందున్న కంట్రాక్టుతో లేక పంచాయతీ సమితికొరకు చేయబడుచున్న పనితో సంబంధము కలిగియుండుట;

(ఇ) పంచాయతీ సమితి తరపున వేతనముపై న్యాయవాదిగా నియమింపబడుట లేదా దానికి ప్రతి పక్షమున న్యాయవాదిగా నియమింపబడుట,

(ఎఫ్) 1898, క్రిమినలు ప్రొసీజరుకోడు (1898 లో 5వ కేంద్ర చట్టము) క్రింద బ్లాకుయొక్క ఏ భాగముపై నైనను విచారణాధికారము గల గౌరవ మేజిస్ట్రేటుగా ఉండుట; లేక,

(జి) సదరు తేదీన పంచాయతీ సమితి సభ్యుడుగా ఉన్న వ్యక్తికి సేవకుడుగా, యజమానిగా, అధికారరీత్యా ఉన్నత అధికారిగా ఉండుట,

## వ్యాఖ్యానము

స్థానిక సంస్థల సభ్యులు, వారి ఆఫీసర్లుచేయు చర్యలను గురించి రక్షణఏర్పాటు చేయుచు క్లాజులను చేర్చుట శాసనాధికారుల నీతి అయియున్నది, ఒక వ్యక్తిని అనర్హునిగాచేయుటకు ప్రత్యేక పరిస్థితులు కారణమా అని నిర్ణయించుట తరచు క్లిష్టసమస్య అయియున్నది.

## ప్రస్తుతమున్న కాంట్రాక్టులు : (క్లాజు. డి)

ఒకనితో ఉమ్మడి వ్యాపారమున కౌన్సిలుతో కాంట్రాక్టుచేసి, ఉమ్మడి వ్యాపారమును విచ్ఛిన్నముచేసి, ఆ కాంట్రాక్టులను మొట్టమొదటి భాగస్థునికి

ఒప్పగించి, వప్పగింతకు పార్టీకాని కౌన్సిలుకు వాటిని నిర్వర్తించుట సంపాదించిన కాంట్రాక్టులు. వాండ్లక్రింద బాధ్యుడగుచు, ఉన్నవ్యక్తి అనర్హుడు అని చెప్పబడినాడు. "జి" అనువాడు ఒకడు మునిసిపల్ కార్పొరేషన్‌లో రసాయనికుడుగా ఉద్యోగమునకు నియమింపబడినాడు. ఆ ఉద్యోగమువల్ల పోలీసునకును, ఫయిరు బ్రిగేడునకును వ్యాపారములో వస్తువులను సరఫరా జేయుటకు అర్హత గలిగి యున్నాడు. "జి" తరువాత కౌన్సిలు సభ్యునిగా ఎన్నిక అయినాడు. కాని కార్పొరేషనుకు రసాయనికుడుగా "జి" ఉద్యోగమునకు రాజీనామా ఇవ్వలేదు. ఒకప్పుడు, అతడు ఎన్నికైన తరువాత కార్పొరేషను తరపున ఫయిర్ బ్రిగేడు ఒక సభ్యునకు నాలుగు పెన్నీలు విలువ గల నూనెను సరఫరా జేసెను. "జి" అనర్హుడుగా ఎంచబడినాడు.

కాంట్రాక్టు పూర్తిగా నివంపప రాకపోయినప్పటికి కాంట్రాక్టరు డబ్బు మాత్రము పుచ్చుకొనవలసి వచ్చినప్పుడు అనర్హత ఆగిపోవచ్చును.

సర్వేయర్ మరి యింకెవరిచేతను పనిచేయించలేకపోవుట వల్లను, ఆలస్యమువల్ల చాలా ఖర్చులు అగుటవల్లను "H" అను ఒకడు సర్వేయరుకోరికపైన లోకల్‌బోర్డునకు పని చేసెను. "H" పనికి క్రమమైన చేరము చేయలేదు. అతనికి కొంతడబ్బు యివ్వబడెను. ఆ పనివల్ల అతడు ఏ లాభమును పొందలేదు. బోర్డుతో కాంట్రాక్టులో "H" కి సంబంధమున్నట్లు కావలసినంత సాక్ష్యమున్నట్లుగా ఎంచబడినది.

టి. యమ్. ఆదికేశవులు నాయుడు, వ. యస్. ఏకాంబర మొదలియారు 1939 యమ్. డబ్ల్యూ. యన్. 257 = ఏ. ఐ. ఆర్. 1939 మద్రాసు 473 = 1939 (1) యమ్. యల్. జె. 420 లో నామినేషను తారీఖునకు ముందు, పూర్తిగా చెల్లించినది కాబట్టి కాంట్రాక్టు విషయములో ఉభయపక్షములవారు నిజముగా చేయవలసిన దేదియు లేదని, ఆడిట్ డిపార్టుమెంటుచే కాంట్రాక్టుక్రింద చేసిన చెల్లింపుకు ఆక్షేపణ చేయబడవచ్చుననే కారణముచేత నామినేషను తారీఖున కాంట్రాక్టు ఉన్నట్లు చెప్పుటకు వీలులేదు అని, ఆక్షేపణ చేయబడ్డ సొమ్ము కాంట్రాక్టరు చేసిన సెక్యూరిటీ డిపాజిట్టు నుండి వసూలు చేయవలయుననియు చెప్పబడినది.

10. సభ్యుడుగా ఉండుటకు అనర్హతలు:-

(1) 11వ విభాగముయొక్క నిబంధనలకు లోబడి పంచాయతీ సమితి యొక్క ఏ సభ్యుడుగాని—

(ఎ) 9వ విభాగములో తెలిపిన ఏదైన అర్హతకు లోనైయుండిన లేక లోనైన యెడల :

(బి) వరుసగా ఆరు నెలలకు మించి బ్లాకులో నివసించుట మానిన యెడల, లేక

(సి) పంచాయతీ సమితి యొక్క లిఖిత పూర్వకమైన పూర్వానుమతి లేకుండా పంచాయతీ సమితి సమావేశములకు వరుసగా మూడంటికి హాజరు కానియెడల—

ఆయన తన సభ్యత్వమును విరమించవలెను.

(2) 9వ విభాగము (ఏ) ఖండముక్రింద ఏ వ్యక్తియైన తన సభ్యత్వమును విరమించిన సందర్భములో, అప్పీలు లేక పునర్విచారణలో శిక్ష రద్దు చేయబడిన లేక కొట్టివేయబడిన యెడల లేక నేరము క్షమింపబడిన యెడల లేక శిక్ష మూలముగా ఏర్పడిన అనర్హతను ప్రభుత్వమువారు ఉత్తరువుద్వారా తొలగించినయెడల అతడు తిరిగి సభ్యుడుగా తీసికొనబడవలెను. అట్లు తిరిగి సభ్యుడుగా తీసికొనబడిన తేదీ నాటికి అతని సభ్యత్వకాలములో మిగిలియున్న కాలముపరకు అతడు సభ్యుడుగా ఉండవలెను. అతని స్థానే ఆ ఖాళీలో ఈ మధ్య కాలమునందు సభ్యుడుగా ఉన్న వ్యక్తి మొదటి సభ్యుడు తిరిగి తీసికొనబడిన మీదట ఆ స్థానము ఖాళీ చేయవలెను.

## వ్యాఖ్యానము

క్లాజు (c) లో నియమితమైన రీతిని సమావేశములు హాజరు కాకుండుటవల్ల పంచాయతీ సమితి సభ్యుడు ఒకమారు తన పదవి కోల్పోయిన యెడల ఆలోటు అతడు తరువాత హాజరగుచుండుటవల్ల పూర్తి కానేరదు. ఒక వ్యక్తి సభ్యుడుగా ఉండుట ఆగిపోయిన తరువాత నిర్వహణాధికారి అట్టి వ్యక్తికి వ్రాతపూర్వకముగా ఆ సమాచారము వెంటనే తెలియజేసి, తరువాత జరుగు సమావేశములో పంచాయితీ సమితికి దానిని రిపోర్టు చేయును.

### మూడు వరుస సమావేశములు :

మూడు వరుస సమావేశములు అనగా మూడు అవ్యవధి సమావేశముల కాలము. ఈ కాలము సమావేశము హాజరగుట మొదట అతిక్రమించిన తేదీ నుండి గుణించవలెను.

11. సభ్యుల అనర్హతల సమస్యలను జిల్లా మునసబు నిర్ణయించుట-

(1) పంచాయతీ సమితి యొక్క ఏ సభ్యుడుగాని 19వ విభాగము ననుసరించి అనర్హుడైనట్లు ఆరోపింపబడి, ఆ ఆరోపణను అట్టి సభ్యుడు ఒప్పుకొననియెడల లేక ఏ సభ్యుడుగాని తాను సదరు విభాగము క్రింద సభ్యత్వమునకు అనర్హుడైనదియు కానిదియు తనకే సందేహము కలిగిన యెడల అట్టి సభ్యుడు లేక ఎవరైన ఇతర సభ్యుడు పంచాయతీ సమితి కార్యాలయము ఏ ప్రదేశము నందున్నదో ఆ ప్రదేశముపై విచారణాధికారము గల జిల్లా మునసబుకు నిర్ణయము నిమిత్తము దరఖాస్తు పెట్టుకొనవచ్చును; పంచాయతీ సమితి కోరినచో అధ్యక్షుడు అట్లు దరఖాస్తు పెట్టుకొనవలెను.

(1) జిల్లా మునసబు తాను అవసరమని భావించు విచారణ జరిపిన మీదట అట్టి సభ్యుడు 10వ విభాగము క్రింద అనర్హుడైనదియు కానిదియు నిర్ణయించవలెను. ఆయన నిర్ణయము అంతిమమై యుండవలెను.

(3) అట్టి నిర్ణయము చేయబడుపరకు ఆ సభ్యుడు తాను అనర్హుడు కానట్లే వ్యవహరించుటకు హక్కు కలిగియుండవలెను.

వివరణ:- ఈ విభాగములో 'జిల్లా మునసబు' అనగా తెలంగాణా ప్రాంతం విషయములో 1954, హైదరాబాదు సివిలు కోర్టుల చట్టము 1954లో 36ను హైదరాబాదు చట్టము) 6వ విభాగము క్రింద నియమింపబడిన మునసబు అని అర్థము,

12. కొన్ని యాదృచ్ఛిక ఖాళీలను భర్తీ చేయుట :-

నామ నిర్దేశము చేయబడిన లేక ఎన్నుకొనబడిన ఏ సభ్యుని స్థానమైనను ఆయన సభ్యత్వ కాలము ముగియుటకు ముందే ఖాళీ అయిన యెడల 4వ విభాగములో నిబంధింపబడిన రీతిగా మరొక వ్యక్తిని సందర్భానుసారముగా నామ నిర్దేశము చేయుట లేక ఎన్నుకొనుట ద్వారా ఆ స్థానము భర్తీ చేయబడవలెను; అట్లు నామ నిర్దేశము చేయబడిన లేక ఎన్నుకొనబడిన వ్యక్తి అయినను ముందున్న సభ్యుని సభ్యత్వకాలములో మిగిలియున్న కాలపరిమితి వరకు సభ్యుడుగా ఉండవలెను.

13. అధ్యక్షుని, ఉపాధ్యక్షుని లేక సభ్యుని రాజీనామా:-

అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు లేక ఎవరైన సభ్యుడు పంచాయతీ సమితికి లిఖిత పూర్వకమైన నోటీసు నిచ్చి తన అధ్యక్ష ఉపాధ్యక్ష పదవికి లేక సభ్యత్వమునకు రాజీనామా చేయవచ్చును. రాజీనామా చేయు వ్యక్తి తనరాజీనామా

నోటీసును బ్లాకు అభివృద్ధి అధికారికి, స్వయముగా అందజేసిన సందర్భంలో తప్ప, బ్లాకు అభివృద్ధి అధికారి, రాజీనామా నోటీసు అందిన మీదట అది యదార్థమైనదోకాదో ధృవపరుచవలసినదిగా సంబంధించిన వ్యక్తిని కోరవలెను. స్వయముగా అంద జేయబడిన లేక పై రీతిగా ధృవ పరుపబడిన రాజీనామా, నోటీసు అందిన తేదీన మరియు ఆ తేదీనుండి అమలులోనికి రావలెను.

## వ్యాఖ్యానము

అధ్యక్షుడు ఉపాధ్యక్షుడు లేక యితర సభ్యుడు పదవినుండి విరమించు కొనుటను అంగీకరించుట అవుసరము లేదు. ఏ స్యక్షుని లేక ఉపాధ్యక్షుని లేక పదవీవిరమణ, పంచాయతీ సమితి నోటీసు తీసుకొన్న తారీఖు నుండి అమలు లోనికి వచ్చును. కాని పదవీ విరమణ దరఖాస్తు తేదీనుండి అమలులోనికిరాదు.

పదవీ విరమణ, దానిని యిచ్చునతనిని బైండుచేయును. కౌన్సిలు అనుమతితో నైనను దానిని తోసివేయుట అసాధ్యము రాజు. వ. వైగాన్ కార్పొరేషను 1885 (14) క్వ్యూ. బి. డి. 908 = 49 జె. పి-372 కాని స్థానిక అధికారి సభ్యుడుగా ఉండుటకు ఒక వ్యక్తి అనర్హుడైనపుడు, అతడు విరమించు కొనుటకు వీలులేదు. హార్టువిక్. వ. బ్రౌన్. 1873 యల్ ఆర్.&సి.పి. 406 అది మామూలుగా ఆ విధముగా ప్రకటింపబడిన తప్ప, పదవి ఖాళీగా నుండ నేరదు. కాని మధ్యకాలములో, పదవినుండి విరమించుకొను నతడు పని చేయ జాలడు. పీస్.వ. లవ్‌డెన్. (1899) I.క్వీన్. బెంచి. 386.

14. పంచాయతీ సమితియొక్క స్థాయీ సమితులు -

ప్రతి పంచాయతీ సమితికిని ఈ దిగువ తెలిపిన విషయములకు ఒక్కొక్క దానికి ఒక్కొక్క స్థాయీ సమితి ఉండవలెను.

(i) వ్యవసాయము, పశుపోషణ, చిన్న తరహా నీటి పారుదల, విద్యుచ్ఛక్తి, భూసార రక్షణ, హద్దు గట్లు పోయుటలతో సహా భూ పునరుద్ధారణము, మత్స్య సంవర్ధన,

(ii) సహకారము, మితవ్యయము, చిన్న మొత్తముల పొదుపు, కుటీర పరిశ్రమలు, గ్రామీణ గృహ నిర్మాణము గణాంక వివరములు, మద్య పానీయముల మరియు ఆరోగ్యమును చెడగొట్టు పదార్థముల వాడుకపై నిషేధము లేక నిగ్రహము;

(iii) సాంఘిక విద్యతోసహా విద్య, వైద్య సహాయము, గ్రామీణ నీటి సరఫరా, మురుగు కాలవల పథకముతోసహా ఆరోగ్య పారిశుద్ధ్యములు, సాంఘిక సంక్షేమము స్త్రీ శిశు సంక్షేమము, మహావిపత్కాలములలో కష్ట నివారణ :

(iv) రాకపోకల సౌకర్యములు, నిర్మాణములు, మరియు

(v) పన్నులు, ఆర్థిక విషయములు :

(2) (1) వ ఉప-విభాగములో పేర్కొనబడిన ఐదు స్థాయీ సమితులకు అదనముగా, పంచాయతీ సమితి ప్రభుత్వామోదములతో సదరు ఉప విభాగములో నిర్దిష్ట పరుపబడని విషయములలో వేటికైనను ఒకటి లేక అంతకెక్కువ స్థాయీ సమితుల ఏర్పాటు చేయవచ్చును :

(3) ప్రతి స్థాయీ సమితిలోను ఏడుగురు సభ్యులుండవలెను. ఇందులో పంచాయతీ సమితి అధ్యక్షుడు పదవి రీత్యా సభ్యుడుగాను, చైర్మనుగాను ఉండవలెను. మిగిలిన వారిని పంచాయతీ సమితి సభ్యులు నిర్ణయింపబడిన విధముగా తమలో నుండి ఎన్నుకొన వలెను.

అయితే పంచాయతీ సమితి నిశ్చయించినచో మిగిలిన ఆరుగురు సభ్యులకుగాను పంచాయతీ సమితి సభ్యులు కాకుండ స్థాయీ సమితికి అప్పగింపబడిన విషయములందు అనుభవము, పరిజ్ఞానముగల వ్యక్తులను ఇరువురికి మించకుండ నిర్ణయింపడిన విధముగా ఎన్నుకొనవచ్చును.

ఇంతేకాకుండ (1)వ ఉపవిభాగము (ii) వ ఖండములో నిర్దిష్ట పరుపబడిన విషయములకొరకు ఏర్పాటు చేయబడు స్థాయీ సమితి విషయములో మిగిలిన ఆరుగురు సభ్యులకుగాను ఇరువురిని పంచాయతీ సభ్యులు కాకుండ సహకారము, కుటీర పరిశ్రమలలో అనుభవము, పరిజ్ఞానము గల వ్యక్తులలో నుండి పంచాయతీ సమితి ఎన్నుకొనవలెను.

ఇంకను (1) వ ఉప విభాగము (iii) వ ఖండములో నిర్దిష్టపరుపబడిన విషయముల కొరకు ఏర్పాటు చేయుబడు స్థాయీ సమితి విషయములో కనీసము ఒక స్త్రీ మరియు షెడ్యూల్డు కులముల ప్రతినిధి ఒకరు అందులో సభ్యులుగా ఉండవలెను ;

(4) పై ఉప విభాగములో ఏమి యున్నప్పటికిని ప్రభుత్వము వారు తాము యుక్తమని భావించినచో ప్రకటన ద్వారా స్త్రీ, శిశు సంక్షేమముల కొరకు ఒక స్థాయీ సమితిని ఏర్పాటు చేయవచ్చును. అందులో ఏడుగురు లేక అంత కెక్కువ మంది సభ్యులు ఉండవలెను. పంచాయతీ సమితి అధ్యక్షుడు దానికి పదవిరీత్యా సభ్యుడుగాను, చైర్మనుగాను ఉండవలెను. మిగిలిన సభ్యులు పంచాయతీ సమితి సభ్యులలో నుండియు, ఆ ప్రకటనలో నిర్దిష్ట పరుపబడు విధానమున అట్టి సభ్యులు కాని వ్యక్తులలోనుండియు నియమింపబడవలెను. మొత్తము సభ్యులలో ఎక్కువమంది స్త్రీలు ఉండవలెను.

(5) ప్రతి స్థాయీ సమితియును తనకు అప్పగింపబడిన విషయములను పురస్కరించుకొని పంచాయతీ సమితియొక్క ఏ యే అధికారములను, కర్తవ్యములను ప్రభుత్వమువారు ఉత్తరువుద్వారా నిర్దిష్టము చేయుదురో ఆ యా అధికారములను వినియోగించవలెను. కర్తవ్యములను నెరవేర్చవలెను.

(6) పంచాయతీ సమితియొక్క అధ్యక్షుడు తప్ప మరి యే సభ్యుడైనను ఏక కాలమందు ఒకటి కంటె ఎక్కువ స్థాయీ సమితులలో సభ్యుడుగా ఉండరాదు.

అయితే పంచాయతీ సమితి సభ్యుల సంఖ్య పైన చెప్పబడిన విధముగా ప్రతి స్థాయీ సమితి యొక్క స్థానములను భర్తీ చేయుటకు చాలనిచో పంచాయతీ సమితి సభ్యుడు ఏదైన రెండు స్థాయీ సమితులలో సభ్యుడుగా ఉండవచ్చును.

## వ్యాఖ్యానము

సమితులు సాధారణముగా ముప్పదిఐదు మొదలు నలుబదిఐదు సభ్యులు, ఒకప్పుడు యింకను ఎక్కువ కలిగియుండుటవల్ల అవి అవంతట చాలా పెద్దవి అగుటచే ప్రయోజనకరముగా నిర్వహణ కర్తలుగా పని చేయజాలవు. అందువలన కమిటీపద్ధతి అవసరము. పంచాయతీ సమితులలో స్టాండింగు కమిటీల ఏర్పాటు ముఖ్యముగా చేయవలసినదై యున్నది. సమితులలో కమిటీలు ముఖ్య పాత్రను వహించి యుండును. రేనెల్.వ. రెవిస్ (1846)15 మంది, మరియు డబ్లుయూ. 529 వ పేజీలో సి. బి. పోలక్ ఈవిధముగా పరిశీలించి యున్నాడు.

"కమిటీ అను పదమునకు అర్థము ఏ మనగ ఒక ప్రత్యేక విధిని యితరులు యిచ్చిన లేక ఒప్పచెప్పిన వ్యక్తి లేక సంస్థ లేక వారు ప్రాతినిధ్యమువహించు లేక పనిచేయునను చెప్పుకొను సంస్థచే వారి పని రూఢీపరచబడునను ఆశతో వారంతట వారు దానిని చేయుటకు పూనుకొను వ్యక్తులు."

## ఉపయోగములు:

కమిటీ పద్ధతి ముఖ్య యుపయోగములు ఈ క్రింది విధముగా వున్నవి.

(a) అది పని విభాగము ఒప్పుకొనును. (b) తబిసీళ్ళ విషయములు బాగుగా పరిశీలించుటను ఒప్పుకొనును. (c) ఒక వ్యక్తికి బాగుగా తెలిసిన లేక అతనికి పరిచయముగల ఒక పనిలో ప్రత్యేక భాగములో దీక్ష బూనుటకు పంచాయతీ సమితి సభ్యునకు ఒక అవకాశము యిచ్చి, ఆ విధముగా అతని నౌకరీలను సమితి మంచి ఉద్దేశములకు ఉపయోగపడునట్లుగా చేయును. "సాధారణముగా, ఒక చట్టము ఒక కమిటీని నియమించమని కోరినపుడు, కమిటీయొక్క సిఫార్సు లేక రిపోర్టుమీద తప్ప అధికారి చర్య తీసికొనక పోవచ్చును." 40వ పేజీలో స్థానిక ప్రభుత్వ న్యాయశాస్త్రముమీద క్రాస్.

## అధికారములు వప్పగింత:

ఒక ఒప్పగింతదారు అతనికి ఒప్పజెప్పిన అధికారము లేక విధిని యింకను ఒప్పజెప్పజాలడు అని లాటిన్ లో చెప్పినది ఒక సాధారణ నిబంధన, కుక్. వ. వార్డు (1877) 2 ఛాన్సరీ ప్రోబెట్ డివిజన్ 255=36 యల్. టి 893 లో కమిటీకి యిచ్చిన అధికారములు, కమిటీ సంస్థగా పని చేయునప్పుడు కమిటీవల్లనే చలాయించబడవలెనే గాని కమిటీయొక్క వ్యక్తిగత సభ్యులకు కమిటీచే ఒప్పజెప్పబడకూడదు అని చెప్పబడినది. ఈ నిబంధన అనువర్తించి, పంచాయతీ సమితి కొన్ని పనులను ఒప్పజెప్పిన ఒక కమిటీ, పంచాయతీ సమితి ఒప్పగింత అనుమతించిన తప్ప లేక యింకొకమారుగా ప్రభుత్వముచే నియమింపబడిన నిబంధనలలో అట్టి ఒప్పగింతకు ఏర్పాటు జేసిన తప్ప, సబ్ కమిటీకి అట్టి పనులలో వేటిని తిరిగి ఒప్పజెప్పజాలదు. సబ్‌కమిటీకి ఒప్పగింత, ఒప్పగింత మంజూరు చేయు కమిటీచే యివ్వబడిన అధికారములను వదలుకొనుటకు అను అంతరార్థము లేదు, కాని, యితరముగా కమిటీయే చేయు పనులను చేయుటకు అధికారము యిచ్చును. సబ్‌కమిటీలకు అట్టి ఒప్పగింత అధికారములు, నియమించు అధికారముగల కమిటీచే ఎప్పుడైనను తిరిగి తీసికొనబడవచ్చును - హగ్. వ. క్లార్కు (1890) 25. క్వా. బి. డి. 391 పేజీలో.

సబ్ కమిటీలు నియమింపబడినప్పుడు, వారు నియమించు కమిటీకి రిపోర్టు చేయుట వారి విధియై యున్నది. ప్రధాన న్యాయమూర్తి లార్డు కోలెరిడ్జి హగ్. వ క్లార్కులో ఈ విధముగా చెప్పియున్నాడు. "ఒప్పగింత" అను పదములో వప్పజెప్పు అధికారిచే ఎల్లప్పుడు, నిబంధన పూర్వకముగా పునః సేకరింపబడుటకు బద్ధమై అధికారములు యింకొక వ్యక్తికి లేక సంస్థకు యివ్వబడినవని అర్థము యిమిడియున్నది. దీనికి చాల ఉదాహరణములు ఉన్నవి కాబట్టి అది చట్టమువల్ల నిర్బంధింపబడిన తప్ప, ఒప్పగింతచేయు అధికారి, ఎప్పుడైనను దాని అధికారము తిరిగి తీసికొనవచ్చును. మరియు న్యాయమూర్తి "విల్సు" ఈ విధముగా చెప్పియున్నాడు. "ఒప్పగింత" ఆ పదము సాధారణముగా ఉపయోగింప బడు నప్పుడు, ఒప్పగింత మంజూరుచేయు వ్యక్తిచే అధికారములు వదలుకొనబడుట కాదు. కాని ఆవ్యక్తి అట్లు కాని పక్షములో అతనే చేయు పనులను చేయుటకు అధికారము యిచ్చుట అయియున్నది. నాకు తెలిసినంతవరకు, న్యాయశాస్త్రవేత్తలు, అధికారము ఒప్పగించువ్యక్తి అతని హక్కులను పోగొట్టుకొను మాదిరిగా అతని అధికారమును వదలుకొనును అను అర్థము వచ్చునట్లు ఎన్నడు ఉపయోగించ లేదు".

చట్టబద్ధమైన విధులు గలిగిన చట్టముయొక్క అధికారముల క్రింద నియమింపబడి యుండి, ఏ విధుల పరిపాలన కలిగియున్న ఏ కార్పొరేషను లేక సంస్థకాని ఒక కమిటీ, అది కమిటీగా ఉపయోగింపబడుటకు వీలులేదు. మరియు సభ్యులు మంచి ఉద్దేశముతో పనిచేయుచున్నప్పుడు ఏ చర్యకు వ్యక్తిగతముగా బాధ్యులుగారు. (లెయిసెస్టర్ వాటర్ వర్క్సు కంపెనీ, వ. న్యూట్టల్లో. యల్. ఆర్. 4 క్వీ. బెం. 18,24-39 వద్ద యల్. టి. 624.

రాజు ర. సందర్లాండు కార్పొరేషను (1911) 2 కిం.బెం.458లో అతని కోరికలకు వ్యతిరేకముగా ఒక సభ్యుడు కమిటీలో పనిచేయుటకు నిర్బంధింపబడడు అని చెప్పబడినది. ఇదే విధముగా రాబోవు సంవత్సరముకు నియమింపబడినప్పటికి కమిటీలోనుండి ఒక సభ్యుని తొలగించుటకు కౌన్సిలుకు అధికారము కలదు. ఈ మధ్య ఇంగ్లీషు కేసు మాన్టన్ వ.బ్రిగ్టన్ కో ఆపరేషన్ (1951) 2. కి. బెం. 339లో ఒక కౌన్సిలు సభ్యుడు ఒక సంవత్సరములో మూడు కమిటీలకు నియమింపబడెను. ఆ సంవత్సరములో, కౌన్సిలు యొక్క ఏ కమిటీలోను యింక ఏ మాత్రము వాది పనిచేయకూడదని తాత్కాలిక కమిటీ యిచ్చిన రిపోర్టును కౌన్సిలు అనువర్తించినది.

కమిటీ అధికారమును రద్దుపరచుటకు కౌన్సిలుకు అధికారమున్నది కావున, ఆతని నియమిత ఉద్యోగ కాలము ముగియక మునుపే ఏ ఒక్క సభ్యుని అధికారమును రద్దు పరచుటకు కూడ దానికి అధికారము గలదు అని తీర్మానింప బడినది.

15. "పంచాయతీ సమితి లేక దాని స్థాయీ సమితి వ్యవహార ములలో పాల్గొనుటకు కలెక్టరు హక్కు"-

కలెక్టరు తన అధికార క్షేత్రపు స్థానిక హద్దుల లోపల పనిచేయుచున్న పంచాయతీ సమితియొక్క దాని స్థాయీ సమితి యొక్క ఏసమావేశములోనైనను మాట్లాడుటకును దాని వ్యవహారములలో మరొక రీతిగా పాల్గొనుటకును హక్కు కలిగియుండవలెను. అయితే ఈ విభాగమును పురస్కరించుకొని అట్టి ఏదైన సమావేశములో ఓటు చేయుటకు హక్కు కలిగి యుండరాదు.

16. తన స్థాయీ సమితులనుండి పత్రములను డాక్యుమెంట్లను తెప్పించుకొనుటకు పంచాయతీ సమితికి అధికారము"-

స్థాయీ సమితియొక్క అధీనములో ఉన్న ఏదైన పత్రమును ఆ స్థాయీ సమితి సమావేశపు ప్రొసీడింగుల ఉధృతాంశముతో సహా పంపవలసినదిగా పంచాయతీ సమితి ఆ స్థాయీ సమితిని కోరవచ్చును. సదరు స్థాయీ సమితి అట్టి ప్రతి అభ్యర్థనను పాటించవలెను.

17. పంచాయతీ సమితియొక్క లేక దాని స్థాయీ సమితి యొక్క సమావేశపు వ్యవహార నిర్వహణకు సంబంధించిన నియమావళి :-

ప్రతి పంచాయతీ సమితి లేక దాని స్థాయీ సమితి తన సమావేశమందలి వ్యవహార నిర్వహణకు సంబంధించి, నిర్ణయింపబడు నియమావళిని అనుసరించవలెను.

18. పంచాయతీ సమితి అధికారములు, కర్తవ్యములు :-

(1) ఈ చట్టముయొక్క నిబంధనలకు లోబడి, బ్లాకు పరిపాలనాధికారము పంచాయతీ సమితి పరమై యుండవలెను. ప్రతి పంచాయతీ సమితి తన అధికార క్షేత్రములోని ప్రజలయందు స్వయం సహాయ ప్రవృత్తిని, చొరవను వర్ధిల్ల చేయుటకును, జీవన ప్రమాణాభివృద్ధిపట్ల వారిలో వుత్సాహము పురికొల్పుటకును కృషి చేయవలెను. పంచాయతీ సమితి ఈ చట్టముచే గాని, దీని ననుసరించిగాని తనకీయబడిన అధికారముల నన్నిటిని వినియోగించవలెను. అప్పగింపబడిన కర్తవ్యముల నన్నింటిని నెరవేర్చవలెను, మరియు ఈచట్టముయొక్క కార్యములను వినియోగించవలెను. అప్పగింపబడు కర్తవ్యములను నెరవేర్చవలెను, అయితే పంచాయతీ సమితి ఈ చట్టముచే గాని, దీని ననుసరించిగాని

మరి యే యితర శాసనము క్రిందగాని దానియొక్క అధ్యక్షతను లేక బ్లాకు అభివృద్ధి అధికారికి లేక జిల్లా పరిషత్తుకు లేక ఏదైన ఇతర అధికార వర్గము నకు స్పష్టముగా అప్పగింపబడిన అధికారములను వినియోగించరాదు లేక కర్తవ్యములను నెరవేర్చరాదు. అది ఈ చట్టముయొక్క కార్యములను నెరవేర్చు నిమిత్తము ప్రభుత్వ పూర్వామోదముతోను, నిర్ణయింపబడు నిబంధనలకు షరతు లకు లోబడియు అప్పులు చేయవచ్చును. ఇంకను పంచాయతీ సమితి ఏదైన పన్నును లేక రుసుమును విధించు అధికారముతోసహా ఈ చట్టము క్రింద తనకు బదిలీ చేయబడినట్టి జిల్లాబోర్డు అధికారములను కూడ వినియోగించ వలెను. కర్తవ్యములను నెరవేర్చవలెను,

(2) ముఖ్యముగా పంచాయతీ సమితి షెడ్యూలులో నిర్దిష్ట పరుపబడిన అధికారములను వినియోగించవలెను. కర్తవ్యములను నెరవేర్చవలెను.

(3) (ఎ) రద్దు చేయబడిన లేక విఘటన చేయబడిన పంచాయతీ విష యములోను 4వ విభాగము (1) వ ఉప విభాగము (ii)వ ఖండములో పేర్కొ నబడిన ప్రతిప్రాంతము లేక అందలి భాగము విషయములోను, సందర్భాను సారముగా రద్దు లేక విఘటన చేయబడిన పంచాయతీ తిరిగి ఏర్పాటు చేయ బడునంతవరకు అట్టి ప్రాంతము లేక భాగము పంచాయతీగా లేక పట్టణ మ్యునిసిపాలిటీగా చేర్చబడునంతవరకు, లేక పంచాయతీలో లేక మునిసిపాలిటీ లో చేర్చబడు నంతవరకు పంచాయతీ సమితి, పంచాయతీలకు సంబంధించి రాజ్యములో తత్కాలమందు అమలునందున్న సంబంధించిన శాసనము క్రింద ఏదైన పన్నును లేక రుసుమును విధించు అధికారముతో సహా తాను యుక్తమని లేక అవశ్యమని భావించునట్టి పంచాయతీ అధికారము లను వినియోగించవచ్చును. కర్తవ్యములను నెర వేర్చవచ్చును.

(బి) రద్దుచేయబడిన లేక విఘటన చేయబడిన పట్టణ సమితి విషయ ములో అట్టి సమితి తిరిగి ఏర్పాటు చేయబడువరకు, పంచాయతీ సమితి 1956 హైద్రాబాదు జిల్లా మునిసిపాలిటీల చట్టము (1956లోని 18వ (ఆంధ్ర ప్రదేశ్, తెలంగాణ చట్టం) క్రింద ఏదైన పన్నును లేక రుసుమును విధించు అధికారము తో సహా తాను యుక్తమని లేక అవశ్యకమని భావించునట్టి పట్టణ సమితి అధి కారములను వినియోగించవచ్చును, కర్తవ్యములను నెరవేర్చవచ్చును.

(4) పంచాయతీలకు, పట్టణ సమితులకు సంబంధించి రాజ్యములో తత్కాలమందు అమలులోవున్న సంబంధించిన శాసనములో ఏమియున్నప్పటి కినీ, పంచాయతీ సమితి, జిల్లా పరిషత్తు యొక్క పూర్వామోదముతో బ్లాకు లోని పంచాయతీల పట్టణ సమితుల నిధులలోనుండి మొత్తములను వసూలు చేసికొన వచ్చును.

(5) ప్రతి పంచాయతీ సమితియు ప్రభుత్వ పూర్వానుమతితో, పంచాయ తీలకు పట్టణ సమితి విధించిన ఏదైన పన్నుపై లేక దాని అధికార క్షేత్రము లోపల విధింపబడు భూమిశిస్తు లేక స్థానిక శిస్తుపై సర్‌చార్జీ రూపములో డ్యూటీని నిర్ణయింపబడు విధానమున అట్టి గరిష్ఠ మొత్తమునకు మించకుండా విధించవచ్చును.

19. "ఉమ్మడి నీటి సరఫరా పనుల, ఇతర సంస్థల నిర్వహణ" -

(1) పంచాయతీలకు, పట్టణ సమితులకు సంబంధించి తత్కాలమందు రాజ్యములో అమలు నందున్న సంబంధించిన శాసనములో ఏమియున్నప్పటి కిని, ఈ చట్టము యొక్క నిబంధనలకును, దాని క్రింద చేయబడిన నియమ ములకును లోబడి రెండు లేక అంత కెక్కువ పంచాయతీలు కలసి-

(i) ఒకే ఉమ్మడి వనరునుండి బట్టలు ఉతుకుటకును, స్నానమునకును, త్రాగుటకై మంచి నీటిని సరఫరా చేయుటకు, నీటి సరఫరా కట్టడములను నిర్మించుకొని నిర్వహించవచ్చును.

(ii) ఒప్పందము చేసికొనబడు షరతులకు లోబడి ఏదైన సంస్థ నిర్వ హణ లేక ఏదైన నిర్మాణము లేక నిర్వహణ బాధ్యతలను పంచాయతీ సమితికి అది ఆమోదించినచో అప్పగించవచ్చును.

(2) ఈ చట్టము యొక్క నిబంధనలకును దాని క్రింద చేయబడిన నియమములకును లోబడి రెండు లేక అంత కెక్కువ పంచాయతీ సమితులు కలసి ఉమ్మడి వైద్యశాలలను శిశు సంక్షేమ కేంద్రములను. నిర్ణయింపబడు తద్విధమైన ఇతర సంస్థలను స్థాపించుకొని, నిర్వహించవచ్చును.

20. "బ్లాకు అభివృద్ధి అధికారి వద్ద నుండి పత్రములను తెప్పించుకొను టకు పంచాయతీసమితి లేక దానిస్థాయి సమితులకు అధికారము"

బ్లాకు అభివృద్ధి అధికారి తన అధీనములోవున్న ఏ పత్రమునైననుసమర్పిం చవలసినదిగా పంచాయతీసమితిగాని, దాని స్థాయీసమితిగాని ఎప్పుడైనను కోర

వచ్చును, బ్లాకు అభివృద్ధి అధికారి ఆ అభ్యర్థనను వెంటనే పోషించుట పంచాయతీ సమితియొక్క లేక ప్రజలయొక్క శ్రేయస్సుకు భంగకారి కాగలదని ఆయన అభిప్రాయపడిననే తప్ప అయన అట్టి ప్రతి అభ్యర్థనను పాటించవలెను. ఆయన అట్లు అభిప్రాయపడు సందర్భములో దానిని అధ్యక్షునకు నివేదించవలెను. దానిపై అయన నిర్ణయము అంతిమమై యుండవలెను.

21. "గ్రామాధికారులనుండి సమాచారము కోరుటకు పంచాయతీ సమితి అధికారము" -

పంచాయతీ సమితి తన అధికార క్షేత్రములో గల ఏగ్రామాధికారినైనను అట్టి గ్రామము విషయములో నిర్ణయింపబడు తరగతుల క్రిందికి వచ్చు ఏదైన విషయమును గురించి లేక ఆ గ్రామములోని ఎవరైన వ్యక్తి లేక ఏదైన ఆస్థిని గురించి ఈ చట్టముయొక్క కార్యముల నిమిత్తము అవసరమైన సమాచారమును అందజేయవలసినదిగా కోరవచ్చును.

22. "అధ్యక్షు, ఉపాధ్యక్షుల అధికారములు, కర్తవ్యములు"-పంచాయతీ సమితి అధ్యక్షుడు-

(ఎ) ఆ పంచాయతీ సమితి లేక దాని స్థాయీసమితి చేసిన తీర్మానములను అమలు జరుపు నిమిత్తము బ్లాకు అభివృద్ధి అధికారిపై పరిపాలనా నియంత్రణమును వినియోగించవలెను.

(బి) పంచాయతీ సమితి సమావేశములను ఏర్పాటుచేయవలెను, వాటికి అధ్యక్షత వహించవలెను. మరియు వాటిని జరుపవలెను;

(సి) పంచాయతీ సమితి రికార్డు లన్నిటిని చూచుటకు సంపూర్ణమైన అవకాశము కలిగియుండవలెను.

(2) అత్యవసర పరిస్థితిలో అధ్యక్షుడు బ్లాకు అభివృద్ధి అధికారితో సంప్రతించినమీదట, తక్షణము ఏదైన ఒకపనిచేయుట లేక చర్యతీసుకొనుట ప్రజా సేవ లేక భద్రతదృష్ట్యా అవసరమని భావించినచో అందుకు పంచాయతీ సమితియొక్క లేక దాని స్థాయీ సమితులలో ఒకదానియొక్క మంజూరు అవసరమై యున్నను ఆయన అట్టి పనిని పూర్తి చేయవలసినదిగా లేక చర్య తీసికొనవలసినదిగా ఆదేశించవచ్చును, కాని ఆయన ఈ ఉప-విభాగము క్రింద తీసికొనబడిన చర్యను గురించి దానికిగల కారణములను పంచాయతీ సమితికి లేక సంబంధించిన స్థాయీ సమితికి దాని తరువాతి సమావేశములలో నివేదించవలెను.

అయితే ఆయన ప్రభుత్వమువారి ఉత్తరువుకైనను విరుద్ధముగా ఏదైన పనిని చేయవలసినదిగా లేక చర్య తీసికొనవలసినదిగా ఆదేసించరాదు.

(3) ఉపాధ్యక్షుడు తనకు అధ్యక్షుడు అప్పుడప్పుడు లిఖితపూర్వకముగా అప్పగించు ఆయన అధికారములను వినియోగించవలెను. కర్తవ్యములను నెరవేర్చవలెను.

(4) అధ్యక్ష పదవి ఖాళీగా వున్నప్పుడు క్రొత్త అధ్యక్షుడు ఎన్నుకొనబడుపరకు పంచాయతీ సమితి ఉపాధ్యక్షుడు అధికారములను వినియోగించవలెను. కర్తవ్యములను నెరవేర్చవలెను.

(5) అధ్యక్షుడు వరుసగా పదునైదు దినములకంటె ఎక్కువ కాలముపాటు బ్లాకులో లేనిచో లేక అశక్తుడైనచో ఆ కాలములో ఆయన యొక్క అధికారములు, కర్తవ్యములు ఉపాధ్యక్షునకు సంక్రమించవలెను.

(6) అధ్యక్ష పదవి ఖాళీగావుండి లేక అధ్యక్షుడు వరుసగా పదునైదు దినములకంటె ఎక్కువకాలము పాటు బ్లాకులో లేకుండి లేక పదునైదు దినములకంటె ఎక్కువ కాలముపాటు అశక్తుడైయుండి ఉపాధ్యక్ష పదవి కూడా ఖాళీగా ఉన్నచో లేక ఉపాధ్యక్షుడుకూడ వరుసగా పదునైదు దినముల కంటె ఎక్కువ కాలముపాటు బ్లాకులో లేనిచో లేక అశక్తుడైనచో అధ్యక్షుని అధికారములు, కర్తవ్యములు పంచాయతీ సమితి సభ్యులచే నిర్ణయింపబడిన రీతిగా ఎన్నుకొనబడు పంచాయతీ సమితి సభ్యునకు సంక్రమించవలెను అట్లు ఎన్నుకొనబడు పంచాయతీ సమితి సభ్యుడు తాత్కాలిక అధ్యక్షుడని వ్యవహరింపబడవలెను. సందర్భమునుబట్టి క్రొత్త అధ్యక్షుడు లేక ఉపాధ్యక్షుడు ఎన్నుకొనబడి పదవిని స్వీకరించు వరకు లేక అధ్యక్షుడు లేక ఉపాధ్యక్షుడు బ్లాకుకు తిరిగి వచ్చువరకు లేక అశక్తత నుండి కోలుకొనువరకు నిర్ణయింపబడు నిర్బంధములకు, షరతులకు లోబడి ఆయన అధ్యక్షుని అధికారములను వినియోగించవలెను, కర్తవ్యములను నెరవేర్చవలెను.

23. పంచాయతీ సమితి పనులు మున్నగు వాటిని గురించి తెలియపరచుటకు సభ్యుల హక్కు:-

పంచాయతీ సమితి యొక్క ఏ సభ్యుడైనను పంచాయతీ సమితి పని నిర్వహణలో జరిగిన అశ్రద్ధను గురించి, వ్యర్థమై పోయిన పంచాయతీ సమితి ఆస్తిని గురించి లేక ఏదైన ప్రాంతపు అవసరములను గురించి అధ్యక్షుని లేక బ్లాకు అభివృద్ధి అధికారికి తెలియజేయవచ్చును. వాంఛనీయమని తోచు అభివృద్ధి నిమిత్తము సూచనలు చేయవచ్చును.

24. బ్లాకు అభివృద్ధి అధికారి యొక్క అధికారములు, కర్తవ్యములు

(1) బ్లాకు అభివృద్ధి అధికారి పంచాయతీ సమితియొక్క ప్రధానకార్య నిర్వహణాధికారిగా ఉండవలెను. పంచాయతీసమితి, స్థాయీ సమితులు చేసిన తీర్మానములను అమలు పరచుటకు ఆయన బాధ్యుడై యుండవలెను. ఆయన తనకు ప్రభుత్వమువారు అప్పగించు అధికారములను వినియోగించవలెను. కర్తవ్యములను నెరవేర్చవలెను. పంచాయతీలకు సంబంధించిన తత్కాలమందు రాజ్యములో అమలునందున్న సంబంధించిన శాసనములో ఏమి యున్నప్పటికిని, ఆయన బ్లాకులోని పంచాయతీలపై నిర్ణయింపబడు పర్యవేక్షణాధికారములను వినియోగించవలెను.

(2) బ్లాకు అభివృద్ధి అధికారి సాధారణముగా పంచాయతీ సమితి యొక్కయు, దాని స్థాయీ సమితుల యొక్కయు సమావేశములకు హాజరు కావలెను. అందు జరుగు చర్చలలో పాల్గొనుటకు ఆయన హక్కు కలిగి యుండవలెను. అయితే ఆయన ఓటు చేయుటకుగాని, ఏదైన తీర్మానమును ప్రసాదించుటకు గాని హక్కు కలిగి యుండరాదు.

(3) పంచాయతీ సమితి సిబ్బందిలోని ఉద్యోగులు, ప్రభుత్వము వారిచేగాని, ప్రభుత్వ శాఖాధిపతిచే గాని పంచాయతీ సమితికి బదిలీ చేయబడిన సంస్థలలోను, పథకములలోను పని చేయుచున్న ఉద్యోగులు బ్లాకు అభివృద్ధి అధికారియొక్క పరిపాలనా నియంత్రణ, పర్యవేక్షణల క్రింద ఉండవలెను.

(4) (ఎ) బ్లాకు అభివృద్ధి అధికారి ప్రాథమిక ఆరోగ్య కేంద్రముపై అజమాయిషీ వహించు వైద్యాధికారిపై తప్ప తన పరిపాలనా నియంత్రణ క్రింద పనిచేయుచున్నట్టియు బ్లాకు అంతటిపైన అధికారము కలిగియున్నట్టియు ఏ అధికారి లేక ఉద్యోగికైనను దిగువ తెల్పిన దండనలలో దేనినైనను నిర్ణయింపబడు షరతులకు లోబడి విధించవచ్చును. అవేవనగా:-

(i) అభిశంసన;

(ii) సంబంధించిన శాఖయొక్క జిల్లా అధికారితో ముందుగా సంప్రదించిన మీదట, ఇంక్రిమెంట్లను ఆపివేయుట;

(బి) (ఎ) ఖండములో నిర్దిష్ట పరుపబడిన దండనలు కాక యితరమైన వాటిని ఆ అధికారికి లేక ఇతర ఉద్యోగికి వర్తించు నియమావళి క్రింద విధించుటకు అధికారముగల అధికార వర్గముచే ఆ దండనలు విధింపబడవచ్చును.

(౫) (ఎ) బ్లాకు అభివృద్ధి అధికారి తన కార్యాలయములో నియమింపబడిన సిబ్బందితోసహా తన పరిపాలనా నియంత్రణ క్రింద పనిచేయుచున్న ఇతర సిబ్బంది మొత్తము విషయములోను ఈ దిగువ తెలపిన దండనలను విధించుటకు అర్హుడై యుండవలెను. అవేవనగా:—

(i) అభిశంసన;

(ii) ఇంక్రిమెంట్లను ఆపివేయుట;

(iii) పంచాయతీ సమితికి కలిగిన ఆర్థిక నష్టమును పూర్తిగాగాని, కొంత భాగమునుగాని జీతములో నుండి రాబట్టుట;

(iv) సస్పెన్షను.

(బి) అట్టి సిబ్బంది విషయములో అధ్యక్షుడు, నిర్ణయింపబడు నియమములకు లోబడి, బర్తరఫు చేయుట లేక ఉద్యోగమునుండి తొలగించుట లేక క్రింది ఉద్యోగమునకు పంపుటవంటి శిక్షణలను విధింపవచ్చును.

(6) (4) వ ఉప విభాగముక్రిందగాని, (౫)వ ఉప విభాగము క్రింద గాని విధింపబడిన ఏ శిక్షపైనను నిర్ణయింపబడిన అధికారికి అప్పీలు చేసికొనుటకు వీలుండవలెను.

(7) 18వ విభాగము (1)వ ఉప విభాగములో ఏమి యున్నప్పటికిని ఈ చట్టముయొక్క ఇతర నిబంధనల నన్నిటికిని దాని క్రింద చేయబడిన నియమావళికిని లోబడి చట్టము క్రింద బ్లాకు అభివృద్ధి అధికారికి అప్పగింపబడిన కర్తవ్యములను ఆయన నెరవేర్చు విషయములో పంచాయతీ సమితి తాను యుక్తమని భావించునట్టి నిర్దిష్టమైన ఆదేశములను ఇచ్చుటకు అధికారము కలిగియుండవలెను.

25. బ్లాకు అభివృద్ధి అధికారి, పంచాయతీ సమితియొక్క ఇతర అధికారులు, సిబ్బంది పంచాయతీసమితియొక్క అధీనసిబ్బందిగా ఉండుట -

బ్లాకు అభివృద్ధి అధికారి, పంచాయతీ సమితియొక్క ఇతర అధికారులు సిబ్బంది మరియు పంచాయతీ సమితిక్రింద గల సంస్థలలోను పాఠశాలలోను నియమింపబడిన సిబ్బంది ఆ పంచాయతీ సమితియొక్క అధీన సిబ్బందిగా ఉండవలెను.

26. అధికారుల యొక్కయు ఇతర ఉద్యోగులయొక్కయు పదవులను సృష్టించుట వాటిలో నియామకములు చేయుట -

ప్రతి పంచాయతీ సమితియు ఈ చట్టముయొక్క కార్యములను నెరవేర్చుటకుగాను తాను అవసరమని భావించు అధికారులయొక్కయు, ఇతర ఉద్యోగుల యొక్కయు పదవులను ప్రభుత్వ పూర్వామోదముతో సృష్టించుటకు అధికారము కలిగి యుండవలెను.

(2) ప్రభుత్వమువారు ఎప్పుడైనను ఈ చట్టముయొక్క కార్యములను నెరవేర్చుటకు తాము అవసరమని భావించునట్టి పదవులను సృష్టించవచ్చును.

(3) (1)వ ఉపవిభాగముక్రిందగాని (2)వ ఉప విభాగముక్రిందగాని సృష్టించబడిన అన్ని పదవుల నియామకములు, అట్టి పదవులలో వున్న వారి బదిలీలు నిర్ణయింపబడిన విధానమున చేయబడవలెను.

27. పంచాయతీ సమితియొక్క లేక దాని స్థాయీ సమితియొక్క సమావేశమునకు హాజరైనందుకు బత్తెములు -

(1) పంచాయతీ సమితి సమావేశమునకు హాజరైనందుకుగాను పంచాయతీ సమితి అధ్యక్ష ఉపాధ్యక్షులకును, సభ్యులకును, 5వ విభాగములో నిర్దిష్ట పరుపబడిన రాజ్య విధాన మండలి సభ్యులకును, పంచాయతీ సమితియొక్క స్థాయీ సమితి సమావేశమునకు హాజరైనందుకుగాను దాని చైర్మనుకును, సభ్యులకును నిర్ణయింపబడిన బత్తెములు చెల్లింపబడవలెను.

(2) అధ్యక్షుడు బ్లాకులో పర్యటనలు చేసినపుడుకూడ ఆయనకు నిర్ణయింపబడు బత్తెములు చెల్లింపబడవలెను.

28. "పంచాయతీ సమితి నిధి" -

(1) పంచాయతీ సమితికి వసూలగు ధనమంతయు 'పంచాయతీ సమితి నిధి' అను పేరుతో ఒక నిధిగా ఏర్పరుపబడవలెను. ఆ నిధి ఈ చట్టములో నిర్దిష్టపరుపబడిన కార్యములకొరకును, నిర్ణయింపబడు ఇతర కార్యముల కొరకును అట్టి పద్ధతిలో వినియోగింపబడవలెను.

(2) పంచాయతీ సమితికి వసూలైన ధనమంతయు సమీపములో ఉన్న ప్రభుత్వ ట్రెజరిలోగాని, ప్రభుత్వమువారి మంజూరుతో వారు అనుమతించిన బ్యాంకులోగాని ఉంచబడవలెను.

(3) పంచాయతీ సమితి నిధి పేరిట యీయబడు ఆర్డరులపై లేక చెక్కులపై బ్లాకు అభివృద్ధి అధికారి సంతకము చేయవలెను

## వ్యా ఖ్యా న ము :

పంచాయతీ సమితికి చేర్చదగు అన్ని ధనములు "పంచాయతీ సమితి నిధి" అని పిలువబడుచున్నవి. పంచాయతీ సమితి పరిస్థితి ఈ నిధికి చెంది. సంతవరకు ట్రిస్టీ పరిస్థితి, పంచాయతీ సమితి ట్రస్టుకు వ్యతిరేకముగా ప్రవర్తించిన, అట్లు ప్రవర్తించుటను ఆపవచ్చును.

29. "పంచాయతీ సమితి ఆదాయ వ్యయములు :-

(1) ఈ క్రింద పేర్కొనబడినవి పంచాయతీ సమితి ఆదాయ మార్గములుగా ఉండవలెను;—

(i) ప్రభుత్వమువారిచే గాని, ప్రభుత్వ శాఖాధిపతులచే గాని పంచాయతీ సమితిని బదిలీ చేయబడిన సంస్థకును, పథకములకును సంబంధించిన నిధులు;

(ii) సమాజ వికాస కార్యక్రమమునకు సంబంధించిన నిధులు;

(iii) కుటీర గ్రామ పరిశ్రమలు, ఖాది, సిల్కు, నార, చేతిపనులు మొదలగువాటి అభివృద్ధికై కేంద్ర, రాజ్య ప్రభుత్వములనుండి వచ్చు సహాయము, అఖిల భారత వ్యవస్థల నుండియు, సంస్థల నుండియు వచ్చు సహాయము;

(iv) పంచాయతీలు, పట్టణ సమితులు లేక ప్రజలు పంచాయతీ సమితికి ఏ రూపముతో నైనను యిచ్చు విరాళములు, మొత్తములు;

(v) జిల్లా బోర్డు ఆదాయములో నుండి ప్రభుత్వమువారు ఉత్తరువు ద్వారా కేటాయించు భాగము;

(vi) భూమి శిస్తు, రాజ్య పన్నులు లేక రుసుములలో నుండి నిర్ణయింపబడు వాటా;

(vii) ఈ చట్టము క్రింద లేక ఏదైన ఇతర శాసనముక్రింద ఈయబడిన అధికారమును పురస్కరించుకొని పంచాయతీ సమితి వసూలు చేయు పన్నులు, సర్‌చార్జీ లేక రుసుముల వలన వచ్చు ఆదాయము;

(viii) పంచాయతీ సమితి పంచాయతీల నుండియు పట్టణ సమితుల నుండియు, వసూలు చేయు మొత్తములు;

(2) పంచాయతీ సమితి ఖర్చులలో, దాని అధికారుల ఇతర ఉద్యోగుల వేతనములు, బత్తెములు, 27వ విభాగము క్రింద చెల్లింపబడవలసిన బత్తెములు, ఈ చట్టము యొక్క కార్యములను నెరవేర్చు నిమిత్తము ప్రభుత్వమువారు ఆదేశించు ఖర్చులు, అట్టి కార్యముల కొరకు అవసరము కాగల ఇతర ఖర్చులు చేరును.

30. పంచాయతీ సమితి బడ్జెటు :-

(1) బ్లాకు అభివృద్ధి అధికారి ప్రతి సంవత్సరము రానున్న సంవత్సర కాలమున రాగల ఆదాయమును కాగల ఖర్చును చూపు బడ్జెటు నొకదానిని నిర్ణయింపబడిన తేదీన లేక అంతకుముందు పంచాయతీ సమితి ఎదుట ఉంచవలెను. పంచాయతీ సమితి అది యుక్తమని భావించునట్టి మార్పులు ఏవైన వున్నచో వాటితో ఆ బడ్జెటును మంజూరు చేయవలెను.

(2) బ్లాకు అభివృద్ధి అధికారి, అట్లు మంజూరు చేయబడిన బడ్జెటును నిర్ణయింపబడు తేదీన లేక అంతకు పూర్వం జిల్లా పరిషత్తుకు, జిల్లా పరిషత్తు లేనిచో జిల్లా కలెక్టరుకు సమర్పించవలెను. సందర్భమును బట్టి జిల్లా పరిషత్తు లేక జిల్లా కలెక్టరు ఈ చట్టముయొక్క నిబంధనలను అమలు జరుపుటకు తగినంత మొత్తము ఆ బడ్జెటులో కేటాయింప బడలేదని విశ్వసించినచో, ఆ పరిషత్తు లేక కలెక్టరు అట్టి కేటాయింపు చేయుటకు అవసరమగు మార్పులతో ఆ బడ్జెటును ఆమోదించు అధికారము కలిగియుండవలెను.

(3) ఒక సంవత్సరములోపల పంచాయతీ సమితి దాని రాబడుల విషయములోగాని, ఖర్చుల విషయములో గాని ఏవైన మార్పులు చేయుట అవసరమని భావించినచో వీలైనంతవరకు (1), (2) ఉప విభాగములలో నిర్బంధింపబడిన విధానమున మార్చిన లేక అనుబంధపు బడ్జెటు తయారు చేయబడి సమర్పింప బడవచ్చును. మంజూరు చేయబడవచ్చును.

31. పంచాయతీలు, పట్టణ సమితులు వాటి బడ్జెటులను పంచాయతీ సమితులకు సమర్పించుట :-

పంచాయతీలకును, పట్టణ సమితులకును సంబంధించి తత్కాలమందు రాజ్యములో అమలునందున్న సంబంధించిన శాసనములోను దాని క్రింద చేయబడిన నియమములలోను ఏమి యున్నప్పటికిని, ప్రతి పంచాయతీ లేక పటణ సమితి ప్రతి సంవత్సరము ఇందు నిమిత్తము ప్రభు

త్వమువారిచే నిర్ణయింపబడు తేదీలోపల తన రానున్న సంవత్సరపు బడ్జెటును పంచాయతీ సమితికి సమర్పించవలెను. పంచాయతీ సమితి అది అందిన తేదీనుండి ఒక నెల లోపల తన సూచనలతోపాటు ఆ బడ్జెటును అట్టి శాసనము క్రింద బడ్జెటును మార్పు చేయుటకు అధికారముగల అధికారికి పంపవలెను, ఆ అధికారి ఆ సూచనలను ఉచితమైన రీతిని పరిశీలింపవలెను.

32 అకౌంట్లు, ఆడిటు -

(1) పంచాయతీ సమితి నిర్ణయింపబడు అకౌంట్లను వ్రాసి యుంచవలెను. మరియు ప్రభుత్వమువారికిని, జిల్లా పరిషత్తుకును ఆ జిల్లాకు జిల్లా పరిషత్తు ఏర్పాటు చేయబడనిచో జిల్లా కలెక్టరుకును నిర్ణయింపబడు స్టేటుమెంట్లను సమర్పించవలెను.

(2) (ఎ) ప్రతి పంచాయతీ సమితి ఆదాయ వ్యయముల అకౌంట్లు నిర్ణయింపబడు నమూనాలో ప్రతి ఆర్థిక సంవత్సరమునకు వ్రాసియుంచబడవలెను.

(బి) పంచాయతీ సమితి తన ఆదాయమును శీర్షికలవారీగాను, సిబ్బంది నిమిత్తమైన ఖర్చులను, చేపట్టిన పనులను, ఒక్కొక్క పనిపై పెట్టినఖర్చును ఖర్చుపెట్టబడక మిగిలిన మొత్తమేదైన ఉన్నచో ఆ మొత్తమును నియమావళిచే కోరబడు ఇతర సమాచారమును తెలుపుచు తన సంవత్సర వారి అకౌంటుయొక్క సారాంశమును నిర్ణయింపబడు నమూనాలో తయారు చేసి ప్రభుత్వమునకును, జిల్లా పరిషత్తుకును, ఆ జిల్లాకు జిల్లా పరిషత్తు ఏర్పాటు చేయబడనిచో జిల్లా కలెక్టరుకును తదుపరి ఆర్థికసంవత్సరపు రెండవమాసములో 15వ దినమునకు లోపుగా సమర్పించవలెను.

(3) సంవత్సరవారి అకౌంట్లు అన్నియును (1) వ ఉప విభాగము క్రింద వ్రాసియుంచబడిన అకౌంట్లు అన్నియును ప్రభుత్వమువారు ఇందు నిమిత్తమై నియమించు వ్యక్తి లేక అధికారవర్గముచే ప్రతి ఆర్థిక సంవత్సరము అంతమైనమీదట వీలైనంత త్వరలో తనిఖీ చేయబడవలెను. మరియు ఆడిటు చేయబడవలెను. అట్లు నియమింపబడిన ఆడిటర్లు భారతశిక్షాస్మృతి (1860లో 45వ కేంద్రచట్టము) 21వ విభాగపు అర్థములో సార్వజనికోద్యోగులుగా పరిగణింపబడవలెను.

(4) (i) చట్ట విరుద్ధముగా ఉండు ప్రతి ఖర్చు పద్దును నిరాకరించి, ఆ ఖర్చు చేసిన లేక చేయుటకు అధికార మిచ్చిన వ్యక్తిపై సర్‌చార్జి చేయవచ్చును. మరియు ఎవరైన వ్యక్తియొక్క నిర్లక్ష్యము లేదా దుష్ప్రవర్తన మూలముగా కలిగినలోటు, నష్టము లేక లాభదాయకము కానట్టి పెట్టుబడుల మొత్తమును లేక అకౌంట్లలో వ్రాయవలసియుండి వ్రాయక వదలి పెట్టబడిన మొత్తమును అందుకు బాధ్యుడైన వ్యక్తికి చార్జి చేయవచ్చును. అట్టి ప్రతి సందర్భములోను ఆ వ్యక్తినుండి రావలసిన మొత్తమెంతో ధృవపరుపవలెను,

వివరణ:- ఎవరి నిర్లక్ష్యము లేదా దుష్ప్రవర్తన అట్టి ఏదైన లోటు లేదా నష్టము సంభవించుటకు కారణమైనదో లేక సహాయ భూతమైనదో ఆ వ్యక్తి తనవలన నిర్లక్ష్యము లేదా దుష్ప్రవర్తన జరిగి నప్పటికిని మరొక్క వ్యక్తి వలన నిర్లక్ష్యము లేదా దుష్ప్రవర్తన జరిగియుండనచో ఆ లోటు లేదా నష్టము కలిగి యుండెడిది కాదని వాదించుటకు వీలుండరాదు.

(ii) ఆడిటర్లు ప్రతి నిరాకరణ, సర్‌చార్జి లేక చార్జి విషయములో తన నిర్ణయములకు గల కారణములను లిఖిత పూర్వకముగా తెలుపవలెను. అట్టి నిర్ణయపు ప్రతి ఒకటి అది ఏ వ్యక్తికి సంబంధించి చేయబడినదో ఆ వ్యక్తికి 1908, సివిలు ప్రొసీజరు కోడు(1908లో 5వ కేంద్ర చట్టము)లో సమనులను అంద జేయుటకు నిర్ణయింపబడిన విధానమున అందజేయబడవలెను,

(iii) ఏదైన పద్దు నిరాకరణవలన గాని, సర్‌చార్జి లేక చార్జి వలన నష్టపడిన ఏ వ్యక్తియైనను ఆడిటర్ల నిర్ణయము తనకు అందజేయబడిన తేదీ తరువాత పదునాలుగు దినములలోపల-

(ఎ) అట్టి నిరాకరణను లేక సర్‌చార్జి లేక చార్జి విధింపును తోసి పుచ్చవలసినదిగా కోరుచు ప్రాకంభ విచారణాధికారముగల ప్రధాన సివిలు కోర్టుకు దరఖాస్తు పెట్టుకొనవచ్చును. కోర్టు అవసరమైన సాక్ష్యమును తీసికొనిన మీదట ఆ పరిస్థితులలో వారు ఉచితమని తలంచు విధముగా ఖర్చుల విషయములో ఉత్తరువులను చేయుచు అట్టి పద్దు నిరాకరణను, సర్‌చార్జిని లేదా చార్జిని ఖాయ పరచవచ్చును, మార్పు చేయవచ్చును, లేక కొట్టివేయవచ్చును, లేక

(బి) అట్టి దరఖాస్తుకు బదులు ప్రభుత్వము వారికి అప్పీలు చేసికొనవచ్చును. వారు తాము యుక్తమని భావించు ఉత్తరువులను జారీ చేయవచ్చును.

(సి) ఉప ఖండము క్రింద కోర్టుకు దరఖాస్తు పెట్టుకొనబడినపుడు ఆడిటరు దానికి ప్రతి వాదులుగా ఉండవలెను. కాని దరఖాస్తుదారు ప్రభుత్వమును గాని మరొక వ్యక్తినిగాని ఆ ప్రొసీకింగుకు కక్షదారునిగా చేయరాదు.

(iv) (iii)వ ఖండము (ఏ) ఉపఖండము క్రింద కోర్టువారు చేసిన నిర్ణయముపై హైకోర్టుకు అప్పీలు చేసికొను అవకాశ ముండవలెను.

(v) ఈచట్టము క్రింద ఒకవ్యక్తినుండి రాబట్టవలెనని ఆడిటర్లచే ధృవ పరపబడిన ప్రతి మొత్తము. అడిట్ల నిర్ణయములు ఆ వ్యక్తికి తెలుపబడిన పిమ్మట పదునాలుగు దినముల లోపల, ఆ కాలము లోపల అట్టి వ్యక్తి ఆ నిర్ణ యముపై కోర్టుకు దరఖాస్తు పెట్టు కొనినసనే తప్ప లేక ప్రభుత్వము వారిక అప్పీలు చేసికొనినసనే తప్ప బ్లాకు అభివృద్ధి అధికారికి ఆ వ్యక్తిచే చెల్లింప బడవలెను. మరియు అట్లు చెల్లింపబడని యెడల అ మొత్తము లేక కోర్టుగాని ప్రభుత్వమువారు గాని ఆవ్యక్తి చెల్లింపవలెనని నిర్ణయించుమొత్తముఅదిభూమి శిస్తు అయిన ఎట్లో అట్లే రాబట్ట బడవలెను;

(vi) ఈ విభాగములో ఏమి యున్నప్పటికి ప్రభుత్వమువారు, ఈ చట్టము క్రింద ఏ వ్యక్తి నుండి యైనను రావలసిన మొత్తముగా ఆడిటర్లచే ధృవ పరుపబడిన లేక కోర్టుచే గాని ప్రభుత్వవారిచే నిర్ణయింపబడిన మొత్తమును పూర్తిగా గాని కొంత భాగముగాని వదలి వేయుట సమంజసమని ఆ కేసుకు సంబంధించిన పరిస్థితుల నన్నిటిని పరిశీలించిన మీదట భావించినచో ఆ మొత్తమును లేక అట్టి భాగమును రాబట్టక వదలి వేయవలసినదిగా ఎప్పు డైనను ఆదేశించ వచ్చును.

(5) పంచాయతీ సమితి, అట్టి ఆడిటర్ల వేతన బత్తెముల క్రింద లేక పంచాయతీ సమితి అకౌంట్లను ఆడిటు చేయుటలో అగు తదితర ఖర్చుక్రింద ప్రభుత్వము వారిచే నిర్ణయింపబడు మొత్తమును తన రాబడులలో నుండి ప్రభు త్వమువారికి చెల్లింపవలెను.

## వ్యాఖ్యానము

పంచాయతీ సమితుల పనికి ఆధ్వర్యము వహించుటకు, తనిఖీ చేయుటకు ముఖ్యావసర మైనదియు ప్రయోజన కరమైన పద్ధతులలో ఆడిట్ ఒకటైయున్నది. శాసనము ప్రభుత్వముచే చేయ బడ్డ నిబంధనలు పంచాయతీ

సమితులు వాటి ఆదాయము ఎట్లు ఖర్చు చేయవలయునో వాటికి హద్దులను ఏర్పరచ వచ్చును. ఆడిట్ వల్లనే పంచాయతీ సమితులు ఏర్పర్చిన హద్దులలో చరించు చున్నారనియు వారి కిచ్చిన అధికారములను జాగ్రత్తగా సద్వినియోగము చేయు చున్నారనియు ప్రభుత్వము తృప్తిపడగలదు. నిధులుగాను విరాళములు గాను, పన్నుల వరుంబడులు మొదలగువాటిగా (సెక్షను 29) పంచాయతీ సమితి తీసు కొనుటకు అర్హతగల మొత్తములు డిమాండు రిజిష్టరుకు చేర్చబడి న్యాయ ప్రకారము నియమితమైన కాలములో వసూలు కాబడుటకు తెలియ జేయ బడినవనియు, వసూళ్లు దగ్గరగావున్న గవర్నమెంటు ట్రెజరీలో గాని లేక వారిచే అనుమతింప బడిన ఏ బ్యాంకులో ప్రభుత్వము మంజూరుతో డెపాజిట్టు చేయబడిన దనియు చూచుట నియమింపబడిన ఆడిటర్ల ఉద్దేశమై యున్నది. నియమితమైన పనులకు పంచాయతీ సమితులచే ఖర్చు చేయబడుటను చూచుటకూడ ఆడిట్ ఉద్దేశములలో ఒకటై యున్నది. ప్రభుత్వ శాఖలకు అనువర్తించు నిబంధనల కన్న ఆడిట్ రెగ్యులేషన్లు, నిబంధనలు సాధారణముగా యుండవలెను.

33. "అధ్యక్షునిపై లేక ఉపాధ్యక్షునిపై అవిశ్వాస తీర్మానము"—

(1) పంచాయతీ సమితి అధ్యక్షునిపైగాని, ఉపాధ్యక్షునిపైగాని, విశ్వాసరాహిత్యమును ప్రకటించు తీర్మానము ఈ దిగువ ఉప విభాగములతో నిర్ణయింపబడిన కార్యవిధానము ప్రకారము ప్రతిపాదింప బడవచ్చును.

(2) తీర్మానమును ప్రతిపాదించు ఉద్దేశమును తెలుపు లిఖిత పూర్వకమైన నోటీసును నిర్ణయింపబడు నమూనాలో పంచాయతీ సమితి మొత్తము సభ్యులలో కనీసము సగము మంది దానిపై సంతకముచేసి ప్రతిపాదింపదలచిన తీర్మానపు ప్రతితోబాటు పంచాయతీ సమితిపై విచారణాధికారము గల కలెక్టరుకు నోటీసుపై సంతకము చేసిన సభ్యులలో యే ఇద్దరైనను స్వయముగా అందజేయవలెను.

(3) ఆ మీదట కలెక్టరు 2వ ఉప విభాగము క్రింద నసకు నోటీసు అందిన తేదీ తరువాత ఒక నెలలోపల తాను నిర్ణయించు తేదీన తీర్మానమును పరిశీలించు నిమిత్తము పంచాయతీ సమితికార్యాలయములో ఒక సమావేశమును ఏర్పాటు చేయవలెను. ఆయన నిర్ణయింపబడు విధానమున అట్టి సమావేశపు నోటీసును కనీసము పదునైదు దినములు ముందుగా సభ్యుల కీయవలెను.

"వివరణ:- ఈ ఉపవిభాగములో నిర్దిష్ట పరుపబడిన ముప్పది దినముల కాలమును లెక్కించునపుడు ఈ విభాగము ననుసరించి చేయబడిన ప్రతిపాదన పై ఒక అర్జీ దాఖలు చేసికొనబడిన మీదట అర్హతగల న్యాయస్థానముచే జారీచేయబడిన ఏదైన నిలుపుదల ఉత్తరువు అమలులో వున్న కాలమును అందులోనుండి మినహాయింపవలెను.

(4) అట్టి సమావేశమునకు కలెక్టరు అధ్యక్షత వహించవలెను. సమావేశమునకై నిర్ణయింపబడిన సమయము గడచిన పిమ్మట అరగంటలోగా ఆ సమావేశమునకు అధ్యక్షత వహించుటకు కలెక్టరు హాజరు కానియెడల, ఆ సమావేశము 5వ ఉపవిభాగము క్రింద ఆయన నిర్ణయించు తేదీనాటికి వాయిదా పడవలెను.

(5) సమావేశమునకు అధ్యక్షత వహించుటకు కలెక్టరుకు వీలుకానిచో, ఆయన అందుకుగల కారణములను లిఖిత పూర్వకముగా రికార్డుచేసిన మీదట తాను నిర్ణయించు మరొక తేదీకి సమావేశమును వాయిదా వేయవలెను. అట్లు ఆయనచే నిర్ణయింపబడిన తేది 3వ ఉపవిభాగము క్రింద సమావేశమునకు నిర్ణయింపబడిన తేదీనుండి ముప్పది దినములకు మించకుండ వుండవలెను. వాయిదా పడిన సమావేశము నోటీసు సభ్యులకు కనీసము పది పూర్తిదినములు ముందుగా యీయబడవలెను.

(6) 4, 5, ఉప విభాగములలో నిబంధింపబడినట్లు తప్ప, ఈ విభాగము క్రింద తీర్మానమును పరిశీలించుటకు ఏర్పరుపబడిన సమావేశము, ఏ కారణమునుబట్టిగాని వాయిదా వేయబడకూడదు.

(7) ఈ విభాగము క్రింద ఏర్పాటుచేయబడిన సమావేశము ప్రారంభమైన వెంటనే కలెక్టరు ఏ తీర్మానమును పరిశీలించుటకు సమావేశము ఏర్పాటు చేయబడినదో దానిని పంచాయతీ సమితికి చదివి వినిపించి, దానిపై చర్చించవచ్చునని ప్రకటించవలెను,

(8) ఈ విభాగము క్రింది తీర్మానముపై జరుపబడు ఎట్టి చర్చగాని వాయిదా వేయబడ కూడదు.

(9) అట్టి చర్చ, సమావేశము ప్రారంభమగుటకు నిర్ణయింపబడిన సమయము నుండి రెండుగంటలు గడచిన మీదట అంతకుముందే పూర్తి కానిచో

స్వతహాగా సమాప్తమై పోవలెను. చర్చ పూర్తియైన మీదట లేదా సదరు రెండు గంటల కాలపరిమితి గడచిన మీదట, ఈ రెండింటిలో ఏది ముందు జరిగిన అప్పుడు తీర్మానమును వోటుకు పెట్టవలెను.

(10) కలెక్టరు తీర్మానము యొక్క యోగ్యతను గురించి మాట్లాడ కూడదు. మరియు దానిపై ఓటు చేయుటకు ఆయనకు హక్కు ఉండరాదు.

(11) తీర్మానము ప్రతితోబాటు, సమావేశపు మినిట్ల ప్రతియు, దానిపై ఓటింగు ఫలితమును సమావేశము ముగిసిన వెంటనే కలెక్టరుచే ప్రభుత్వము వారికి పంపబడవలెను.

(12) పంచాయతీ సమితి మొత్తము సభ్యులలో కనీసము ఐదింట మూడువంతుల మంది సభ్యులచే బలపరుపబడి తీర్మానము ఆమోదింపబడినచో ప్రభుత్వమువారు ప్రకటనద్వారా అధ్యక్షుని లేదా సందర్భమును బట్టి ఉపాధ్య క్షుని తొలగించవలెను.

(13) పైన చెప్పబడినంతటి సంఖ్యాబాహుళ్యముతో తీర్మానము ఆమో దింపబడని యెడల లేదా కోరం కోరనందున సమావేశమును జరుపుటకు వీలు కాకుండిన యెడల, అదే అధ్యక్షుని లేదా ఉపాధ్యక్షునిపై అవిశ్వాసమును ప్రక టించు తదుపరి తీర్మానపు నోటీసు ఏదిగాని, సమావేశపు తేదీ నుండి ఆరు నెలలు గడచునంతవరకు యీయబడకూడదు.

(14) ఈ విధాగము క్రింద తీర్మానపు నోటీసు ఏదిగాని, అధ్యక్షుడు గాని సందర్భమును బట్టి ఉపాధ్యక్షుడుగాని పదవి స్వీకరించిన ఆరు మాసముల లోగా యీయబడ కూడదు.

34. పంచాయతీ సమితి అధ్యక్షుని లేదా ఉపాధ్యక్షుని తొలగించు టకు ప్రభుత్వమువారికి అధికారము :-

(1) పంచాయతీ సమితి అధ్యక్షుడు, లేదా ఉపాధ్యక్షుడు పంచాయతీ సమితి సరిగా పనిచేయు నిమిత్తము ప్రభుత్వమువారు జారీ చేయు ఉత్తరువు లను పాటించుట లేదని లేక పాటించుటకు నిరాకరించుచున్నారని లేదా ఆయన కీయబడిన అధికారములను దుర్వినియోగము చేయుచున్నాడని ప్రభుత్వము వారు అభిప్రాయ పడునెడల వారు సంజాయిషీ చెప్పుకొనుటకు ఆయనకు అవ కాశము నిచ్చిన మీదట ,ఉత్తరువుద్వారా ఆ అధ్యక్షుని లేదా సందర్భమును బట్టి ఉపాధ్యక్షుని తొలగించవచ్చును.

(2) పంచాయతీ సమితి అధ్యక్షుడుగాని, ఉపాధ్యక్షుడుగాని (1)వ ఉప విభాగము ననుసరించి లేక 33 వ విభాగము ననుసరించి తొలగింపబడినచో, ఆ ఖాళీని, (3)వ ఉపవిభాగముయొక్క నిబంధనలకు లోబడి, 7వ విభాగములో నిర్దిష్ట పరుపబడిన రీతిగా నిర్ణయింపబడిన కాలములోపల భర్తీ చేయవలెను.

(3) ఈ విభాగము లేదా 33 వ విభాగము ననుసరించి పదవినుండి తొలగింపబడిన అధ్యక్షుడు లేదా ఉపాధ్యక్షుడు, అట్లు తొలగింపబడిన తేదీనుండి రెండు సంవత్సరములవరకు అధ్యక్షుడుగా గాని, ఉపాధ్యక్షుడుగా గాని తిరిగి ఎన్నుకోబడుటకు అర్హుడై యుండకూడదు.

## వ్యాఖ్యానము

పదవినుండి తొలగింపబడిన అధ్యక్షుడు లేక ఉపాధ్యక్షుడు, అట్టి తొలగింపబడిన తేదీనుండి రెండు సంవత్సరములవరకు తిరిగి ఎన్నుకొనబడుటకు అర్హుడు కాడని చెప్పబడినది. కావున అట్టి తొలగింపు నిజముగా కఠినమైన పనియే చేసినది.

నిబంధనల నతిక్రమించుటవలన ఫలితము ఒక వ్యక్తిని పదవినుండి తొలగించవలసి వచ్చినప్పుడు, తొలగించుటకు ఏర్పరచిన క్రమమును జాగ్రత్తగ అనుసరించవలయునని రాజా. వ. ఇన్‌స్పెక్టరు మొదలగువారు 1955 (2) మ. లా. జ. 116 = 1955 ఆ. ఇం. రి. మదరాసు 584 లో ప్రధాన న్యాయమూర్తి రాజమన్నారు, న్యాయమూర్తి రాజగోపాల అయ్యంగారు ఉన్న మదరాసు ఉన్నత న్యాయస్థానము డివిజన్ బెంచిచే నిర్ణయింపబడినది. ఏర్పరచిన పద్ధతినుండి విపరీతమైన మార్పు యుండి వ్యక్తికి నష్టము కలిగినచో, చట్టమును అనుసరించనట్టుగా భావింపబడి అట్టి ఉత్తరువు త్రోసివేయవలసినదిగా యున్నది. చట్టము క్రింద అధ్యక్షుడు నిరూపణకు ఒక అవకాశము యివ్వబడవలయును. ప్రతి విషయములోను నేరముయొక్క గంభీరతను అధికారికి తెలియపరచవలసినదిగాను అతనిమీద ఉన్న సాక్ష్యము విషయములోని సంగతులను విశదీకరించుటకు ఒక అవకాశము యివ్వబడవలయునని అది ముందుగనే ఉద్దేశింపబడినది తొలగింపు ఉత్తరువు ఇన్‌స్పెక్టరును అట్టిచర్య తీసికొనుటకు నిర్బంధించు కారణములను తెలియజేయవలయును. విచారణ రిపోర్టుయొక్క నకలుకు అధ్యక్షునకు లేక ఉపాధ్యక్షునకు హక్కు లేదు. అధ్యక్షుడు ఉపాధ్యక్షునకును ఆతనిపైనున్న సాక్ష్యమును గురించి తెలిసికొనుటకు హక్కు ఉండి, అట్టి సాక్ష్యమును ఒప్పుకొనుట లేక దానికి వ్యతిరేకము చెప్పుట కవకాశ

మున్నప్పటికి, ఆ విషయములో విచారణ జరిపిన అధికారుల ఉద్దేశముల నకలు అతనికి యివ్వబడనవసరము లేదు. అధ్యక్షునకు లేక ఉపాధ్యక్షునకు వ్యతిరేకముగా వున్న రిపోర్టులోని అంశములను ఎదుర్కొనుటకు ప్రభుత్వము అవకాశ మిచ్చుటకు బాధ్యులైనప్పటికి, వారు అధ్యక్షునకు ఉపాధ్యక్షునకు రిపోర్టును విస్తరించుటకు బాధ్యత లేదు. ఒక స్థానిక అధికారి చేసిన వుత్తరువువల్ల అతని ఆస్తి చెడినయెడల అట్టి వ్యక్తి, బహిరంగ విచారణ జరుపుటకు ఆరోగ్య శాఖామంత్రిచే ఉత్తరువు చేయబడ్డ వ్యక్తి అట్టి మంత్రికి దాఖలుచేసిన రిపోర్టు చూచుటకు అర్హత కలిగియుండదు.

35. "పంచాయతీ సమితికిని ఇతర స్థానికాధికార వర్గమునకును సంయుక్త సమితి"—

(1) పంచాయతీ సమితికిని ఒకటి లేక అంతకెక్కువ ఇతర స్థానికాధికార వర్గములకును ఉమ్మడి బాధ్యతగల ఏదైన కార్యము నిమిత్తము సంయుక్త సమితిని ఏర్పరచుటలో ఆ పంచాయతీ సమితి అట్టి ఒక లేక అంత కెక్కువ స్థానికాధికార వర్గములతో కలియవచ్చును, అట్లు కలియవలెనని ప్రభుత్వము వారిచే ఆదేశింపబడినపుడు తప్పక అట్లు చేయవలెను.

(2) ఆ సంయుక్త సమితియొక్క నిర్మాణము, అధికారములు, కార్య విధానము, ఆ సంయుక్త సమితి విషయములో సంబంధించిన స్థానికాధికార వర్గములలో మధ్య ఉత్పన్నమగు అభిప్రాయ భేదములను పరిష్కరించు పద్ధతి నిర్ణయింపబడు నియమావళి ప్రకారము ఉండవలెను.

## వ్యాఖ్యానము

అధికారు లందరికు ఏక లాభముగల ఏకార్యమునకైనను లేక వారందరు కలసి బాధ్యతగల ఏవిషయమునకైనను ఒక జాయింటు కమిటీని ఏర్పాటు చేయుటలో ఇతర స్థానిక అధికారులతో కలియుటను ఈ సెక్షను పంచాయతీకి దోహదపడును. ఆ విధముగ ఏర్పడిన అధికారుల జాయింటు కమిటీకి సరిపడు వారి పనులను, నియమితముల షరతులతో లేక అవి లేకుండగా ఒప్పచెప్పవచ్చును. కాని రేటును విధించుట లేక ఆజ్ఞను యిచ్చుట లేక డబ్బును అప్పు తీసుకొనుటను ఒప్పచెప్పకూడదు. జాయింటు కమిటీకి సంఘస్థితి లేదు. కావున అది ఆస్తిని పొందియుండలేదు. అది ఉపయోగించిన ఏ ఆస్తియైనను, యితరులకు దానిని పూచీగా ఉంచుకొన్న ఏర్పాటు చేయబడిన ఏఒక్క అధి

కారిలో నైనను చేరవచ్చును. ఇంకొకమారుగ, ఏర్పాటు చేయబడిన అధికారులు ఆస్తిని కలిసి ఉంచుకొనవచ్చును.

జాయింటు కమిటీ- జాయింటు బోర్డుల వ్యత్యాసము :—

ప్రాథమికముగా "జాయింటు కమిటీ" "జాయింటుబోర్డు" నకు వ్యత్యాసము గలదు. "జాయింటుబోర్డు" ఒక సన్నిహిత సంస్థ. దానికి శాశ్వత వారసత్వము, ఒక సాధారణమైన ముద్రి గలదు. అది భూమిని పొందియుండ గలదు. జాయింటు కమిటీ మాదిరి కాకుండ, "జాయింటుబోర్డు" ఎగ్రిమెంటు వల్ల రద్దు చేయవచ్చును. అప్పు తీసికొను అధికారముతోసహా అది స్వాతంత్ర్య ఆర్థిక అధికారములను కలిగియున్నది. ఆజ్ఞల రూపేణా ఏర్పడిన అధికారుల నుండి దానికి కావలసిన ధనమును సేకరించును. జాయింటుబోర్డులను సృష్టించుటకు పంచాయతీ సమితులకు అధికారము లేదు.

# 3 వ అధ్యాయము

## జిల్లా పరిషత్తుల ఏర్పాటు, సంఘీకరణ, అంగవ్యవస్థ, అధికారములు, కర్తవ్యములు మొదలగునవి.

36. జిల్లా పరిషత్తుల ఏర్పాటు, సంఘీకరణ నిర్మాణము :—

(1) ప్రభుత్వమువారు ఒక ప్రకటనద్వారా అందులో నిర్దిష్ట పరుపబడినట్టి తేదీ నుండి ఒక జిల్లాకు గాను జిల్లా పరిషత్తును ఏర్పాటు చేయవచ్చును.

(2) ప్రతి జిల్లా పరిషత్తు అది ఏ జిల్లా కొరకు ఏర్పాటు చేయబడినదో ఆ జిల్లా పేరుతో ఒక సంఘీభూత సంస్థగా ఉండి నిరంతర ఉత్తరాధికారమును, సమిష్టి ముద్రిను, ఆస్తిని సంపాదించు, కలిగియుండు, పరిష్కరించు మరియు కరారులు చేసుకొను అధికారమును కలిగి వుండవలెను. సంఘ నామముతో అది దావా వేయవచ్చును, వేయబడవచ్చును.

(3) ప్రతి జిల్లా పరిషత్తులోను ఈ క్రింది సభ్యులు ఉండవలెను. వారెవరనగా :—

(i) జిల్లాలోని ప్రతి పంచాయతీ సమితి అధ్యక్షుడు, పదవి రీత్యా :

అయితే ఏ పంచాయతీ సమితి అధ్యక్షుడైనా జిల్లాపరిషత్తు సభ్యుడుగా ఉండుటకు నిరాకరించినయెడల లేక అట్టి సభ్యత్వమునకు రాజీనామా యిచ్చిన యెడల

లేక మరి యొక కారణము వలన అతని సభ్యత్వము విరమించిన యెడల ఆ వ్యక్తి అట్టి నిరాకరణ, రాజీనామా, లేక విరమణ తేదీనుండి పంచాయతీ సమితి అధ్యక్షుడుగా ఉండ కూడదు. మరియు అట్టి పదవిలో ఆయన అనంతరము వచ్చిన వ్యక్తి జిల్లాపరిషత్తు సభ్యుడుగా ఉండవలెను ;

(ii) జిల్లా కలెక్టరు ;

(iii) ఆ జిల్లానుండి ఎన్నికైన రాజ్యవిధాన సభా సభ్యులు ;

(iv) ప్రభుత్వమువారు ఉత్తరువు ద్వారా నిర్దిష్టపరచునట్టి విధాన పరిషత్సభ్యులు ;

(v) జిల్లాలో భాగమగు నియోజకవర్గమునుండి ఎన్నికైన లోకసభా సభ్యులు ;

అయితే ఒకటికంటే ఎక్కువ జిల్లాలలో చేరియున్న ప్రదేశములతో కూడిన నియోజక వర్గమునకు ప్రాతినిధ్యము వహించుట లోకసభా సభ్యుడుగా ఆయన కోరుకొను ఒకే ఒక జిల్లాయొక్క జిల్లాపరిషత్తులో మాత్రమే సభ్యుడు ఉండవలెను ;

(vi) ప్రభుత్వమువారు ఉత్తరువు ద్వారా నిర్దిష్ట పరచునట్టి రాజ్యసభా సభ్యులు ;

(vii) పంచాయతీ సమితి ఏర్పాటు చేయబడని ప్రతి బ్లాకునకును ;

(ఎ) ఆంధ్రప్రాంతము విషయములో, అట్టి బ్లాకులోని పంచాయతీల అధ్యక్షులును ;

(బి) తెలంగాణా ప్రాంతము విషయములో అట్టి బ్లాకులోని పంచాయతీల సర్పంచులు, మరియు పట్టణ సమితుల అధ్యక్షులను, తమలోనుండి నిర్ణయింపబడిన రీతిగా ఎన్నుకొను ఆ బ్లాకులోనే నివసించు ఒక వ్యక్తి ;

(viii) జిల్లా కలెక్టరు ఏర్పాటు చేసి అధ్యక్షత వహించిన ప్రత్యేక సమావేశములో ఆ జిల్లాలో నివసించు వ్యక్తులలోనుండి (i) నుండి (vii) వరకుగల ఖండములలో నిర్దిష్టపరుపబడిన సభ్యులచే, నిర్ణయింపబడిన విధానమున ఎన్నుకొనబడు ఈ క్రింది వ్యక్తులు :—

(ఎ) ఇద్దరు స్త్రీలు ;

(బి) షెడ్యూల్డు కులముల ప్రతినిధి ఒకరు ;

(సి) గత జనాభా అంకెల ఆధారముగా ఆ జిల్లాలో షెడ్యూల్డు తెగల వారి జనభా ఆ జిల్లా యొక్క మొత్తము జనాభాలో నిర్ణయింపబడిన శాతము కంటె తక్కువ కాదని జిల్లా కలెక్టరుచే ప్రకటింపబడినచో షెడ్యూల్డు తెగల వారి ప్రతినిధి ఒకరు ; ఆ జిల్లాలో షెడ్యూల్డు తెగలవారి జనాభా అట్టి శాతము కంటె తక్కువగా ఉన్నచో షెడ్యూల్డు కులముల ప్రతినిధి మరొకరు.

37. "జిల్లా పరిషత్తుయొక్క చైర్మను, వైస్‌చైర్మనుల ఎన్నిక వారి పదవీ కాలపరిమితి, ఖాళీలను భర్తీ చేయుట.—"

(1) ప్రతి జిల్లా పరిషత్తుకును, ఒక చైర్మను, వైస్ చైర్మను ఉండవలెను. వారిని జిల్లా పరిషత్తు సభ్యులు తమలోనుండి ఎన్నుకొనవలెను ;

అయితే జిల్లా కలెక్టరు చైర్మనుగా గాని, వైస్ చైర్మనుగా గాని ఎన్నుకొనబడరాదు.

ఇంతేకాకుండ ఒక పంచాయతీ సమితి అధ్యక్షుడు జిల్లా పరిషత్తు చైర్మనుగా ఎన్నికైనచో ఆయన అట్లు ఎన్నికైన తేదీనుండి అట్టి పంచాయతీ సమితి అధ్యక్ష పదవినుండి విరమించుకొనవలెను. అయితే అట్టి విరమణ ఆయన జిల్లా పరిషత్తులోను, పంచాయతీ సమితిలోను సభ్యుడుగా వుండుటకు ఏ విధముగాను భంగము కలిగించరాదు.

ఇంకను ఏ వ్యక్తిగాని ఒకటికంటె ఎక్కువ జిల్లా పరిషత్తులకు చైర్మనుగా వుండరాదు.

(2) 36వ విభాగము (1)వ ఉప-విభాగము క్రింద జిల్లా పరిషత్తు ఏర్పాటు చేయబడిన మీదట వీలైనంత త్వరలో చైర్మనును, వైస్‌చైర్మనును ఎన్నుకొను నిమిత్తము జిల్లా కలెక్టరు జిల్లా పరిషత్తు సమావేశమును ఏర్పాటు చేయవలెను. ఎన్నిక నిర్ణయింపబడిన విధానమున జరుపబడవలెను. మొదట చైర్మను ఎన్నుకొనబడవలెను. ఆయన ఎన్నికైన తరువాత వైస్‌చైర్మను ఎన్నుకొనబడవలెను. అట్టి సమావేశములో చైర్మను ఏన్నికకు జిల్లా కలెక్టరును, వైస్‌చైర్మను ఎన్నికకు చైర్మనుయు అధ్యక్షత వహించవలెను.

(3) (ఎ) చైర్మను పదవిలో ఏర్పడు యాదృచ్ఛిక ఖాళీని భర్తీచేయుటకుగాను జిల్లా కలెక్టరు జిల్లా పరిషత్తు సమావేశమును ఏర్పాటు చేయవలెను. నిర్ణయింపబడిన విధానమున ఎన్నిక జరుపబడవలెను అట్టి సమావేశమునకు జిల్లా కలెక్టరు అధ్యక్షత వహించవలెను.

(బి) వైస్ చైర్మను పదవిలో ఏర్పడు యాదృచ్ఛిక ఖాళీని భర్తీచేయుటకుగాను చైర్మను జిల్లా పరిషత్తు సమావేశమును ఏర్పాటు చేయవలెను. నిర్ణయింపబడిన విధానమున ఏన్నిక జరుపబడవలెను. అట్టి సమావేశమునకు చైర్మను అధ్యక్షత వహించవలెను

(4) ఇతర విధముగా నిబంధింపబడినట్లు తప్ప, చైర్మను లేక వైస్ చైర్మను పదవీ కాలపరిమితి ఆయన ఎన్నుకొనబడిన తేదీనుండి మూడు సంవత్సరములుగా ఉండవలెను చైర్మను లేక వైస్ చైర్మను పదవీ కాలము ముగియకముందే ఆ పదవితో ఖాళీ ఏర్పడినప్పుడు ఆ ఖాళీలో చైర్మనుగా లేక వైస్ చైర్మనుగా ఎన్నుకొనబడు వ్యక్తి తనకుముందు ఆ పదవిలో వున్న వ్యక్తి యొక్క పదవి కాలముతో మిగిలిన కాలము వరకు పదవిలో ఉండవలెను.

అయితే ప్రభుత్వమువారు ప్రకటనద్వారా ఆ ప్రకటనలో తెలుపబడు తగు కారణములను బట్టి చైర్మను లేక వైస్ చైర్మను పదవీ కాలమును ఆ ప్రకటనలో నిర్దిష్ట పరుపబడు వరకు పొడిగించవచ్చును. కాని అట్టి తేదీ, ఈ ఉప-విభాగము క్రింద అట్టి పదవీకాల పరిమితి ఏ తేదీన ముగియునో ఆ తేదీ నుండి ఆరు నెలలకు మించినట్టిదిగా ఉండరాదు. మరియు ప్రభుత్వమువారు అప్పుడప్పుడు ప్రకటనద్వారా పై చెప్పబడిన ఆరు నెలల కాలములోపల అట్టి తేదీని మార్చి దానికి బదులు మరొక తేదీని నిర్ణయింపవచ్చును,

38. "జిల్లా పరిషత్తు కార్యదర్శి.—"

(1) ప్రభుత్వము జిల్లా పరిషత్తుకు ఒక కార్యదర్శిని నియమించవలెను. ఆయన నిర్ణయింపబడిన అధికారములను వినియోగింపవలెను. కర్తవ్యములను నిర్వర్తింపవలెను.

(2) కార్యదర్శి సాధారణముగా జిల్లా పరిషత్తు లేక ఏదైన దాని స్థాయి సమితి సమావేశములకు హాజరు కావలెను. ఆ సమావేశములో జరుగు చర్చలలో ఆయన పాల్గొనుటకు హక్కు కలిగి యుండవలెను, కాని ఓటు చేయుటకు లేక ఏదైన తీర్మానమును ప్రతిపాదించుటకు హక్కు కలిగి యుండరాదు

39. "జిల్లా పరిషత్తు సభ్యుల పదవీకాలము, ఖాళీలను భర్తీచేయుట"

(1) ఈ చట్టములో మరియొక రీతిగా నిబంధింపబడి యుండిననే తప్ప.-

(i) 36వ విభాగము, (3) వ ఉప-విభాగము, (i) వ ఖండములో నిర్దిష్ట పరుపబడిన పదవి రీత్యా సభ్యుడు తాను ప్రాతినిధ్యము వహించు పంచాయతీ సమితికి తాను అధ్యక్షుడుగా ఉన్నంత కాలము పదవిలో ఉండ వలెను ;

(ii) 36వ విభాగము, (3) వ ఉప-విభాగము, (iii), (iv), (v) లేక (vi)వ ఖండములో నిర్దిష్ట పరుపబడిన సభ్యుడు తాను రాజ్య విధాన మండలిలో లేక సందర్భాను సారముగా పార్లమెంటులో సభ్యుడుగా వున్నంత కాలము పదవిలో ఉండవలెను ;

(iii) 36వ విభాగము, (3) వ ఉప-విభాగము, (vii) వ ఖండము క్రింద ఎన్నుకొనబడిన సభ్యుడు మూడు సంవత్సరములపాటు లేక అట్టి బ్లాకుకై పంచాయతీ సమితి ఏర్పాటు చేయబడు తేదీవరకు, వీనిలో ఏగి ముందైన అంతవరకు, పదవలో వుండవలెను.

(vi) 36వ విభాగము (3) వ ఉప-విభాగము (viii) వ ఖండము క్రింద ఎన్నుకొనబడిన సభ్యుడు ఆయన ఎన్నికైన తేదీనుండి మూడు సంవత్స రములపాటు పదవిలో ఉండవలెను.

(2) 36వ విభాగము, (3)వ ఉప-విభాగము, (vii)వ ఖండన క్రింద లేక (viii)వ ఖండము క్రింద ఎన్నుకొనబడిన సభ్యుని పదవి కాలము ముగి యుటవలన, ఆ పదవిలో ఏర్పడిన ఏదైన ఖాళీ, ఆ ఖండము క్రింద మరియొక వ్యక్తిని ఎన్నుకొనుటద్వారా పూరింపబడవలెను.

40. అన్హతలు.—

"36వ విభాగము, (3) వ ఉప-విభాగము, (ii) వ ఖండము నిర్దిష్ట పరుపబడిన వారికి తప్ప, జిల్లా పరిషత్తు సభ్యులందరికిని 9, 10, 11 విభా గములలోని నిబంధనలు వర్తించవలెను. అయితే "బ్లాకు" "పంచాయతీ" "జిల్లామునసబు" అను మాటలకుబదులు క్రమముగా "జిల్లాసమితి" "జిల్లా పరిషత్తు" "జిల్లా న్యాయాధికారి" అనుమాటలను ఉండవలెను.

41. "కొన్ని యాదృచ్ఛిక ఖాళీలను నింపుట.—"

36వ విభాగము, (3)వ ఉప-విభాగము (vii)వ ఖండము క్రింద లేక (viii)వ ఖండము క్రింద ఎన్నుకొనబడిన సభ్యుని పదవిలో ఆతని పదవి కాలము ముగియక పూర్వమే ఏదైన ఖాళీ ఏర్పడిన యెడల ఆ ఖాళీ

ఆ ఖండము క్రింద మరియొక వ్యక్తిని ఎన్నుకొనుట ద్వారా పూరింప బడవలెను. అట్లు ఎన్నుకొనబడిన వ్యక్తి తత్పూర్వ సభ్యుని పదవి కాలములో మిగిలియున్న కాలము వరకు అధికారములో ఉండవలెను.

42. అధ్యక్షుని, ఉపాధ్యక్షుని, లేక సభ్యుని యొక్క రాజీనామా:—

అధ్యక్షుడుగాని, ఉపాధ్యక్షుడుగాని, లేక సభ్యుడుగాని 36వ విభాగము, 3వ ఉప-విభాగము, (ii)వ ఖండములో నిర్దిష్ట పరుపబడిన సభ్యుడుగాక ఇంకే సభ్యుడుగాని జిల్లా పరిషత్తుకు లిఖితపూర్వకము నోటీసును ఇచ్చుట ద్వారా అట్టి అధ్యక్ష పదవికి, ఉపాధ్యక్ష పదవికి లేక సభ్యత్వమునకు రాజీనామా ఈయవచ్చును. రాజీనామా చేయు వ్యక్తి తన రాజీనామా నోటీసును స్వయముగా జిల్లా పరిషత్తు కార్యదర్శికి అందజేసిన సందర్భములో తప్ప, కార్యదర్శి రాజీనామా నోటీసు తనకు అందిన మీదట అది యదార్థమో కాదో తెలుపుమని సంబంధించిన వ్యక్తిని కోరవలెను. స్వయముగా అందజేయబడినను లేక పై విధముగా ధృవపరుపబడినను రాజీనామా అట్టి నోటీసు అందిన తేదీన మరియు ఆ తేదీనుండి అమలులోనికి రావలెను.

43. జిల్లా పరిషత్తు స్థాయీ సమితులు:—

(1) ప్రతి జిల్లా పరిషత్తుకును ఈ దిగువ తెలిపిన ఒక్కొక్క స్థాయీ సమితి ఉండవలెను:—

(i) ప్రణాళిక, సమాజ వికాసము, రాకపోక సౌకర్యములు;

(ii) ఆహారము, వ్యవసాయము, పశుపోషణ, అడవులు, నీటి పారుదల మరియు విద్యుచ్ఛక్తి;

(iii) పరిశ్రమలు, కుటీర, గ్రామ, లఘు పరిశ్రమలతో సహా;

(iv) విద్య, వైద్యము, ప్రజారోగ్యము, సాంఘిక సంక్షేమము;

(v) పన్నులు, ఆర్థిక విషయములు.

(2) 1వ ఉప విభాగములో తెలుపబడిన అయిదు స్థాయీసమితులకు అదనముగా జిల్లా పరిషత్తు, ప్రభుత్వ మోదముతో, సదరు ఉప విభాగములో నిర్దిష్ట పరుపబడని యే ఇతర విషయములకు సంబంధించి యైనను ఒకటి లేక అంత కెక్కువ స్థాయీ సమితులను ఏర్పాటు చేయవచ్చును.

(3) (ఎ) ప్రతిస్థాయీ సమితిలోను తొమ్మండుగురు సభ్యులు ఉండవలెను. (1)వ ఉప విభాగము (iv)వ ఖండములోని నిర్దిష్ట పరుపబడిన విషయములకొరకు ఏర్పాటు చేయబడు స్థాయీసమితిలో మాత్రము పదిమంది సభ్యులు ఉండవలెను. సందర్భానుసారముగా ఆ తొమ్మిది లేక పదిమంది సభ్యులకుగాను జిల్లా పరిషత్తు చైర్మను జిల్లా కలెక్టరు పదవి రీత్యా సభ్యులుగా ఉండవలెను. తక్కినవారిని జిల్లా పరిషత్తు సభ్యులు తమలో నుండి నిర్ణయింపబడిన విధముగా ఎన్నుకొనవలయును;

అయితే

(i) (1) వ ఉపవిభాగము (i) వ ఖండములో నిర్దిష్ట పరుపబడిన విషయములకొరకు ఏర్పాటు చేయబడు స్థాయీ సమితి విషయములో, మిగిలిన ఏడుగురు సభ్యులకుగాను ఆంధ్ర ప్రాంతమైనచో ఆ జిల్లాలలోని మునిసిపాలిటీల చైర్మనులలో నుండియు, తెలంగాణా ప్రాంతమైనచో ఆ జిల్లాలోని పట్టణ మునిసిపాలిటీల అధ్యక్షులలో నుండియు, జిల్లా పరిషత్తు సభ్యుడుకాని వ్యక్తి నొకరిని నిర్ణయింపబడిన విధానమున జిల్లా పరిషత్తు ఎన్నుకొనవలయును;

(ii) (1) వ ఉప విభాగము (ii), (iii) ఖండములలో నిర్దిష్ట పరుపబడిన విషయములకొరకు ఏర్పాటు చేయబడు స్థాయీ సమితుల విషయములో, మిగిలిన ఏడుగురు సభ్యులకుగాను జిల్లా పరిషత్తు సభ్యులు కాకుండ, సహకారములో లేక సందర్భానుబట్టి కుటీర పరిశ్రమలో అనుభవము, పరిజ్ఞానముగల వ్యక్తులలోనుండి ఒకరిని నిర్ణయింపబడిన విధానమున జిల్లా పరిషత్తు సభ్యుడుగా ఎన్నుకొనవలెను;

(iii) (1)వ ఉప విభాగము (iv) వ ఖండములో నిర్దిష్ట పరుపబడిన విషయములకొరకు ఏర్పాటు చేయబడు స్థాయీ సమితి విషయములో మిగిలిన ఎనిమిదిమంది సభ్యులలో ఒకరు స్త్రీ, మరొకరు షెడ్యూల్డు కులముల ప్రతినిధి అయి వుండవలెను. వారిని జిల్లా పరిషత్తు నిర్ణయింపబడిన విధానమున ఆ జిల్లా పరిషత్తు సభ్యులు కాకుండ, ఆ జిల్లాలో నివసించుచున్న వ్యక్తులలో నుండి ఎన్నుకొనవలెను;

(iv) ఏ యితర స్థాయీ సమితి విషయములోనైనను జిల్లా పరిషత్తు, అది నిర్ణయించినచో మిగిలిన ఏడుగురు సభ్యులకుగాను ఒకరిని నిర్ణయింప

బడిన విధానము జిల్లా పరిషత్తు సభ్యులు కాకుండ ఆ స్థాయీ సమితికి కేటాయింపబడిన విషయములలో అనుభవము, పరిజ్ఞానముగల వ్యక్తులలోనుండి ఎన్నుకొనవచ్చును.

(3) ప్రతి స్థాయీ సమితికిని జిల్లా కలెక్టరు చైర్మనుగా ఉండవలెను. జిల్లా కలెక్టరు హాజరుకానిచో జిల్లా పరిషత్తు చైర్మను, వారిద్దరు హాజరు కానిచో వైస్ చైర్మను ఆ స్థాయీ సమితిలో సభ్యుడైనచో ఆయన, ఆయన కూడ హాజరు కానిచో, స్థాయీ సమితి సమావేశమునకు హాజరైన సభ్యుడు ఆ సమావేశమునకు అధ్యక్షత వహించవలెను,

(4) ప్రతి స్థాయీ సమితియును తనకు అప్పగించబడిన విషయములను పురస్కరించుకొని జిల్లా పరిషత్తుయొక్క ఏ ఏ అధికారములను కర్తవ్యములను ప్రభుత్వమువారు ఉత్తరువుద్వారా నిర్దిష్టము చేయుదురో ఆ యా అధికారములను వినియోగించవలెను. కర్తవ్యములను నిర్వర్తింపవలెను.

(5) జిల్లా పరిషత్తు చైర్మను, లేక జిల్లా కలెక్టరు తప్ప ఇంకే సభ్యుడు గాని ఏక కాలమున రెండు స్థాయీ సమితులలో సభ్యుడుగా ఉండరాదు.

అయితే జిల్లా పరిషత్తు మొత్తము సభ్యుల సంఖ్య పైవిధముగా ప్రతి స్థాయీ సమితిలోవున్న అన్ని స్థానములను భర్తీ చేయుటకు చాలనిచో జిల్లా పరిషత్తు సభ్యుడు ఏ రెండు స్థాయీ సమితులలోనైనను సభ్యుడుగా వుండవచ్చును.

44. "కొందరు జిల్లా అధికారులకు జిల్లా పరిషత్తు యొక్కగాని, స్థాయీ సమితి యొక్కగాని ప్రొసీడింగులలో పాల్గొనుటకు హక్కు.--"

ప్రభుత్వమువారు ఉత్తరువుద్వారా నిర్దిష్ట పరచునట్టి జిల్లా అధికారులు జిల్లా పరిషత్తుయొక్కగాని, దాని ఏదేని స్థాయీ సమితియొక్కగాని ఏ సమావేశపు ప్రొసీడింగులలోనైనను మాట్లాడుటకును మరొక రీతిగా పాల్గొనుటకును హక్కు కలిగియుందురు. కాని ఈ విభాగమునుబట్టి అట్టి ఏ సమావేశములోనైనను ఓటు చేయుటకు హక్కు కలిగియుండరు.

45. "జిల్లా పరిషత్తు యొక్కగాని, దాని స్థాయీ సమితియొక్కగాని సమావేశపు వ్యవహార నిర్వహణమునకు సంబంధించిన నియమావళి":-

ప్రతి జిల్లా పరిషత్తు లేక దాని స్థాయీ సమితి తన సమావేశములోని వ్యవహార నిర్వహణ విషయములో నిర్ణయింపబడు నియమావళిని అనుసరింప వలెను.

46. "కార్యదర్శి వద్దనుండి రికార్డులను తెప్పించుకొనుటకు జిల్లా పరిషత్తుకు లేక దాని స్థాయీ సమితికి అధికారము:—

జిల్లా పరిషత్తు లేక దానియొక్క స్థాయీ సమితి ఎపుడైన కార్యదర్శి అధీనములో ఉన్న ఏదైన పత్రమును అందజేయవలసినదిగా ఆయనను కోర వచ్చును. తక్షణము ఆ అభ్యర్థనను పాటించుట జిల్లా పరిషత్తు యొక్కగాని, ప్రజల యొక్కగాని శ్రేయస్సుకు భంగకరమని కార్యదర్శి భావించినపుడు తప్ప, అట్టి ప్రతి అభ్యర్థనను కార్యదర్శి పాటింపవలెను కార్యదర్శి అట్లు భావించిన సందర్భములలో ఆయన ఆ విషయమును జిల్లా పరిషత్తు చైర్మనుకు నివేదించ వలెను. దానిపై చైర్మను నిర్ణయము అంతిమమై యుండ వలెను.

47. "జిల్లా పరిషత్తు అధికారములు, కర్తవ్యములు:—

(1) ప్రతి జిల్లా పరిషత్తు కూడా ఈ క్రింది అధికారములను కలిగి యుండవలెను:—

(i) ఆ జిల్లాలోని పంచాయతీ సమితుల బడ్జెట్లను పరిశీలించి ఆమోదించుట;

(ii) కేంద్ర లేక రాజ్య ప్రభుత్వము వారిచే ఆజిల్లాకుగాను కేటాయింపబడిన నిధులను ఆ జిల్లాలోని పంచాయతీ సమితులకును ఏర్పాటు చేయబడిన బ్లాకులకును పంచుట;

(iii) ఆ జిల్లాలోని బ్లాకుల విషయములో తయారు చేయబడిన ప్రణాళికలను సమన్వయించి; ఏకీకరించుట; జిల్లామొత్తమునకు సంబంధించిన ప్రణాళికలను రూపొందించుట;

(iv) జిల్లాలోని రెండు లేక అంతకంటె ఎక్కువ బ్లాకుల సమిష్టి ప్రణాళికల, ప్రాజెక్టుల లేక పథకముల నిర్వహణను సాధించుట:

(v) జిల్లాలోని పంచాయతీ సమితుల కార్యకలాపములపై సర్వసాధారణ పర్యవేక్షణ చేయుట;

(vi) ఏవైన పన్నులు లేక రుసుములను విధించు అధికారముతో దాటు జిల్లాబోర్డు యొక్క ఏయే అధికారములు కర్తవ్యములు ఈ చట్టము క్రింద తనకు బదిలీ చేయబడునో ఆయా అధికారములను కర్తవ్యములను వినియోగించుట, నెరవేర్చుట :

(vii) ప్రభుత్వమువారు ప్రకటన ద్వారా, ఏదైన అభివృద్ధి కార్య క్రమము విషయములో తనకు ఇచ్చునట్టి ఇతర అధికారములను వినియోగించుట, అప్పగించు ఇతర కర్తవ్యములను నెరవేర్చుట ;

(viii) స్థానిక సంస్థలచే లేక ప్రభుత్వమువారిచే ఆ జిల్లాలో నిర్వహింపబడుచున్న వికాస కార్యకలాపములను సేవా కార్యక్రమముల ,నిర్వహణకును సంబంధించిన అన్ని విషయములలో ప్రభుత్వమువారికి సలహా ఇచ్చుట :

(ix) పంచాయతీలకు. పంచాయతీ సమితులకు పని కేటాయింపును గురించియు. ఈ రెండు సంస్థల మధ్యను, వివిధ పంచాయతీల మధ్యను పరస్పరము పనియొక్క సమన్వయమును గురించియు, ప్రభుత్వమువారికి సలహా ఇచ్చుట ;

(x) జిల్లా పరిషత్తుకు ప్రభుత్వముచే ప్రత్యేకముగా తెలుపబడిన శాసన ప్రోక్త లేక కార్యనిర్వాహక ఉత్తరువుయొక్క అమలునకు సంబంధించిన విషయములను గురించి ప్రభుత్వమునకు సలహా ఇచ్చుట ;

(xi) తనకు అవసరమని తోచునట్టి వివరములను సేకరించుట;

(xii) స్థానిక సంస్థల కార్యకలాపములకు సంబంధించిన గణాంకములను లేక ఇతర సమాచారమును ప్రచురించుట ;

(xiii) తన కార్యకలాపములకు సంబంధించిన సమాచారమును పంపవలసినదిగా ఏ స్థానిక సంస్థనైనను కోరుట ;

(xiv) ఏయే కార్యములకై తన విధులను ఉపయోగింప వచ్చునో కేవలముగా అట్టి ఏ కార్యసిద్ధి నిమిత్తమైనను ఏర్పాటు చేయబడిన ట్రస్టులను అంగీకరించుట :

(xv) సెకండరీ పాఠశాలలను, వృత్తి విద్యా పాఠశాలలను, పారిశ్రామిక విద్యా పాఠశాలలను స్థాపించుట ; నిర్వహించుట ; విస్తరించుట :

(xvi) ఈ చట్టముయొక్క కార్యములను నిర్వర్తించు నిమిత్తము ప్రభుత్వ పూర్వామోదముతో, నిర్ణయింపబడిన నిబంధనలకు, షరతులకు లోబడియు అప్పులు చేయుట.

(2) 36వ విభాగము, (3)వ ఉపవిభాగము, (vi) వ ఖండములో తెలుపబడిన, ప్రతి బ్లాకు విషయములోను, ఆ బ్లాకుకై పంచాయతీ సమితి ఏర్పాటు చేయబడువరకు పంచాయతీ సమితి యొక్క సమస్త అధికారములను వినియోగించుటకును కర్తవ్యములను నెరవేర్చుటకును జిలా పరిషత్‌కు అధికారము ఉండవలెను.

(3) జిల్లా పరిషత్తు, ప్రభుత్వ పూర్వామోదముతో ఆ జిల్లాలోని పంచాయతీ సమితుల నిధులల్లో నుండి మొత్తములను వసూలు చేసికొనవచ్చును.

48. "జిల్లా పరిషత్ చైర్మను, వైస్ చైర్మనుల అధికారములు, కర్తవ్యములు":-

(1) జిల్లా పరిషత్ చైర్మను—

(ఎ) జిల్లా పరిషత్ యొక్క లేక దాని ఏదైన స్థాయీ సమితియొక్క తీర్మానములను అమలు జరుపు నిమిత్తము కార్యదర్శిపై పరిపాలనా నియంత్రణమును వినియోగించవలెను;

(బి) జిల్లా పరిషత్ సమావేశములను ఏర్పరచి, వాటి కధ్యక్షత వహించవలెను. ఆ సమావేశములను జరుపవలెను;

(సి) ఆయనకు జిల్లా పరిషత్ రికార్డు లన్నిటిని చూచు అవకాశము ఉండవలెను.

(2) వైస్‌చైర్మను తనకు చైర్మను అప్పుడప్పుడు లిఖితపూర్వకముగా అప్పగించు ఆయన అధికారములను వినియోగించవలెను. కర్తవ్యములను నెరవేర్చవలెను.

(3) చైర్మను పదవి ఖాళీ ఉన్నప్పుడు క్రొత్తచైర్మను ఎన్నుకొనబడునంతవరకు వైస్ చైర్మను ఆయన అధికారములను వినియోగించ వలెను. కర్తవ్యములను నెరవేర్చవలెను.

(4) పదునైదు దినములకంటె ఎక్కువ కాలముపాటు వరుసగా చైర్మను జిల్లాలో లేకపోయినచో లేక అశక్తుడైనచో అట్లు ఆయన లేనికాలములో లేక అశక్తుడై యున్నకాలములో ఆయన అధికారములు, కర్తవ్యములు వైస్ చైర్మనుకు సంక్రమించవలెను.

(5) చైర్మను పదవి ఖాళీగా ఉండి లేక చైర్మను వరుసగా పదునైదు దినములకంటె ఎక్కువ కాలముపాటు జిల్లాలో లేకుండి లేక పదునైదు దినముల కంటె ఎక్కువకాలముపాటు అశక్తుడై యుండి వైస్‌చైర్మను పదవికూడ ఖాళీగా ఉన్నచో లేక వైస్‌చైర్మనుకూడ వరుసగా పదునైదు దినములకంటె ఎక్కువ కాలముపాటు జిల్లాలో లేనిచో లేక అశక్తుడై యున్నచో చైర్మను యొక్క అధికారములు, కర్తవ్యములు నిర్ణయింపబడు విధానమున జిల్లాపరిషత్ సభ్యులచే ఎన్నుకొనబడు సభ్యునికి సంక్రమించవలెను. అట్లు ఎన్నుకొనబడు జిల్లా పరిషత్ సభ్యుడు తాత్కాలిక చైర్మను అని వ్యవహరింప బడవలెను. సందర్భమును బట్టి క్రొత్త చైర్మను లేక వైస్‌చైర్మను ఎన్నుకొనబడి ఆయన పదవిని స్వీకరించువరకు లేక చైర్మను లేక వైస్‌చైర్మను జిల్లాకు తిరిగి వచ్చు వరకు లేక అశక్తత నుండి కోలుకొనువరకు నిర్ణయింపబడు నిర్బంధములకు, షరతులకు లోబడి ఆయన చైర్మను అధికారములను వినియోగించవలెను. కర్తవ్యములను నెరవేర్చవలెను.

49. "జిల్లా పరిషత్ పనులు మున్నగు వాటిని గురించి తెలియపరచుటకు ఆయా సభ్యులకు గల హక్కు"—

జిల్లా పరిషత్ యొక్క ఏ సభ్యుడైనను జిల్లాపరిషత్తు పని నిర్వహణలో జరిగిన ఏదైన అశ్రద్ధను గురించి, వ్యర్థమైపోయిన ఏదైన జిల్లా పరిషత్ ఆస్తిని గురించి లేక ఏదైన ప్రాంతపు అవసరములను గురించి జిల్లా పరిషత్ చైర్మను లేక కార్యదర్శికి తెలియజేయ వచ్చును. మరియు వాంఛనీయమని తోచునట్టి అభివృద్ధి కొరకై సూచనలు చేయవచ్చును.

50. కలెక్టరుయొక్క అత్యవసర అధికారములు :-

(1) అత్యవసర పరిస్థితులలో కలెక్టరు తక్షణము ఏదైన ఒక పని చేయుట లేక చర్య తీసికొనుట ప్రజా క్షేమము లేక భద్రతదృష్ట్యా అవసరమని భావించినచో సాధారణముగా అందుకు జిల్లా పరిషత్ లేక దాని స్థాయీ సమితి మంజూరు కావలసియున్నను ఆయన అట్టి పనిని పూర్తి చేయవలసినదిగా లేక చర్య తీసికొనవలసినదిగా ఆదేశించ వచ్చును. మరియు అట్టి పని చేసినందుకు లేక చర్య తీసికొన్నందుకు

అగు ఖర్చు జిల్లా పరిషత్తు నిధిలోనుండి చెల్లించబడవలెనని కూడ ఆదేశించ వచ్చును.

(2) ఈ విభాగముద్వారా లభ్యమైన అధికారమును వినియోగించిన ప్రతి సందర్భములోను కలెక్టరు ఆ విషయమును అట్టి అధికారమును వినియోగించుటకుగల కారణములతోసహా ప్రభుత్వము వారికి నివేదించవలెను. జిల్లా పరిషత్తు ఎరుక నిమిత్తము దానినికూడ ఆ నివేదిక ప్రతి ఒకటి అపుడే పంపబడవలయును.

51. అధికారుల యొక్కయు ఇతర ఉద్యోగుల యొక్కయు పదవులను సృష్టించుట, ఆ పదవులలో నియామకములు చేయుట మున్నగునవి:-

(1) ప్రతి జిల్లా పరిషత్తు కూడ ప్రభుత్వ పూర్వామోదముతో ఈ చట్టపు కార్యములను నిర్వర్తించుటకుగాను తనకు అవసరమని తోచునట్టి అధికారుల మరియు ఇతర ఉద్యోగుల పదవులను సృష్టించుటకు అధికారము కలిగియుండవలెను.

(2) ఈ చట్టముయొక్క కార్యములను నిర్వర్తించు నిమిత్తము అవసరమని తాము భావించునట్టి పదవులను ప్రభుత్వము ఎప్పుడైనను సృష్టించ వచ్చును.

(3) (1) వ ఉప విభాగము లేక (2) ఉపవిభాగము ననుసరించి సృష్టింపబడిన పదవులలో నియామకము లన్నియును, ఆ పదవులలోనున్న వ్యక్తుల బదిలీలను నిర్ధయింపబడిన విధానమున జేయబడవలెను.

(4) ఈ విభాగము ననుసరించి నియమింపబడిన అధికారులును, తదితర ఉద్యోగులును నిర్ణయింపబడిన నియమములకు లోబడి జిల్లా పరిషత్తు చైర్మనుయొక్క పరిపాలనా నియంత్రణ క్రింద ఉండవలెను.

52. "జిల్లాపరిషత్తుయొక్క లేక దాని స్థాయీ సమితియొక్క సమావేశమునకు హాజరైనందుకు బత్తెములు :-

(1) ఒక జిల్లా పరిషతు లేక దాని స్థాయీ సమితియొక్క లనధికార సభ్యులకు నిర్ణయింపబడిన బత్తెములు జిల్లా పరిషత్ యొక్క లేక అట్టి సమితి యొక్క సమావేశమునకు హాజరైనందులకుగాను చెల్లింపబడవలెను.

(2) జిల్లా పరిషత్ చైర్మను జిల్లాలో చేసిన పర్యటనలకుగాను ఆయనకు నిర్ణయింపబడు బత్తెములు చెల్లింపబడవలెను.

53. "జిల్లా పరిషత్తు నిధి" :-

(1) జిల్లా పరిషత్తుకు వసూలగు ధనమంతయు "జిల్లా పరిషత్తు నిధి" అను పేరుతో ఒక నిధిగా ఏర్పరుపబడవలెను. ఆ నిధి ఈ చట్టములో నిర్దిష్ట పరుపబడినట్టి కార్యముల కొరకును, నిర్ణయింపబడు తదితర కార్యముల కొరకును నిర్ణయింపబడు విధముగా వినియోగింప బడవలెను.

* "(2) జిల్లాపరిషత్తుకు ముట్టిన పైకములన్నియు అత్యంత సమీప ములో వున్న ప్రభుత్వ ట్రెజరీలోగాని, ప్రభుత్వమువారి అనుమతి పొంది, వారిచే ఆమోదింపబడిన ఏదేని బ్యాంకులోగాని ఉంచబడవలెను".

(3) జిల్లాపరిషత్తు నిధి పేరిట ఈయబడు ఆర్డరుల పైనను, చెక్కుల పైనను కార్యదర్శి సంతకము చేయవలయును.

54. జిలా పరిషత్తుయొక్క ఆదాయ వ్యయములు :-

(1) జిల్లా పరిషత్తుయొక్క ఆదాయ మార్గములలో ఈ దిగువ పేర్కొనబడినవి చేర్చవలయును;

(i) జిల్లా పరిషత్తు కేటాయింప బడిన కేంద్ర లేక రాజ్య ప్రభుత్వ నిధులు;

(ii) కుటీర, గ్రామీణ, లఘు పరిశ్రమలు మున్నగువాటి అభివృద్ధి కొరకు గాను అఖిల భారత సంఘములు, సంస్థలు యిచ్చు గ్రాంట్లు;

(iii) భూమిపన్ను లేక స్థానిక సెస్సు మరియు రాజ్యపు పన్నులు లేక రుసుములలో నుంచి నిర్ణయింపబడిన భాగము,

(iv) ఏ శాసనము ననుసరించి యైనను జిల్లా పరిషత్తు విధింపగల పన్నుల లేక రుసుముల వలన వచ్చు ఆదాయము ;

(v) జిల్లా పరిషత్తుచే నిర్వహింపబడు ధర్మాదాయముల లేక ట్రస్టుల వలన వచ్చు ఆదాయము ;

(vi) జిల్లాబోర్డుయొక్క ఆదాయములలో నుంచి ప్రభుత్వము వారు ఉత్తరువు ద్వారా కేటాయించు ఆదాయము ;

---

* ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సమితుల జిల్లాపరిషత్తుల (సవరణ)చట్టము (1960లో 18వ చట్టము) ననుసరించి మార్చబడినది.

(vii) 36వ విభాగము (3)వ ఉప విభాగము (vii) వ ఖండములో పేర్కొనబడిన ప్రతి బ్లాకుయొక్క ఆదాయము :

(viii) పంచాయతీ సమితులుగాని ప్రజలుగాని ఏ రూపముననైనను యిచ్చు విరాళములు, మొత్తములు ;

(iv) ప్రభుత్వమువారి పూర్వామోదముతో పంచాయతీ సమితులవద్ద నుండి జిల్లా పరిషత్ వసూలుచేయు మొత్తములు.

(2) జిల్లా పరిషత్‌యొక్క ఖర్చులలో, దానిక్రింద పనిచేయు అధి కారుల ఇతర ఉద్యోగులయొక్క జీతములు, బత్తెములు, 52వ విభాగము క్రింద చెల్లింపదగు బత్తెములు, ఈ చట్టముయొక్క కార్యములను నిర్వర్తించు నిమిత్తము అవసరమగు తదితరమైన ఖర్చులను చేరవలయును.

55. జిల్లా పరిషత్ యొక్క బడ్జెటు:-

(1) జిల్లా పరిషత్‌యొక్క కార్యదర్శి ప్రతి సంవత్సరము, ముందు సంవత్సర కాలమునకు సంభావ్యమైన ఆదాయ వ్యయములను చూపుచు బడ్జెటును తయారుచేసి జిల్లా పరిషత్ ముందుంచ వలయును. జిల్లా పరిషత్ తాను తగినవని భావించునట్టి మార్పులేమైన వున్నచో ఆ మార్పులను చేసి, బడ్జెటును మంజూరు చేయవలయును.

(2) ఆ విధముగా మంజూరు చేయబడిన బడ్జెటును జిల్లా పరిషత్ యొక్క కార్యదర్శి చైర్మనుద్వారా ప్రభుత్వమువారికి, ప్రభుత్వమువారు నిర్ణయించునట్టి తేదీన లేక అట్టి తేదీకి ముందుగా సమర్పించ వలయును. అందులో చాలినంతటి కేటాయింపు చేయబడము లేదని లేక ఈ చట్టముయొక్క నిబంధనలను అమలు పరచుటకుగాను ఇతర విధముగా అసంతృప్తికరముగా ఉన్నదని గాని ప్రభుత్వమువారు విశ్వసించినచో వారు తాము అవసరమని భావించు రీతిగా ఆ బడ్జెటును మార్చవచ్చును.

(3) ఒక సంవత్సర కాలమున జిల్లా పరిషత్ ఆదాయముల విషయములోగాని ఈ చట్టముయొక్క ప్రయోజనముల కొరకుగాని ఖర్చు పెట్ట బడవలసిన మొత్తముల పంపిణీ విషయములోగాని బడ్జెటులో ఏవైన మార్పులు చేయవలసిన అవసరమున్నదని అది తలంచునెడల వీలైనంత వరకు (1), (2), ఉప విభాగములలో నిబంధింపబడిన విధముగా ఒక అనుబంధపు బడ్జెటు లేక మార్పు చేయబడిన బడ్జెటు తయారు చేయబడి సమర్పింపబడవచ్చును, మంజూరు చేయబడవచ్చును.

56. అకౌంటు, ఆడిటు:-

జిల్లా పరిషత్ యొక్క అకౌంటులకు, ఆడిటుకు యథోచితమైన మార్పులతో 32వ విభాగముయొక్క నిబంధనలే వర్తింపవలెను.

57. జిలా పరిషత్ చైర్మనుపైగాని, వైసు చైర్మనుపైగాని అవిశ్వాస తీర్మానము:-

జిల్లా పరిషత్ చైర్మనుపైగాని వైస్ చైర్మనుపైగాని విశ్వాస రాహిత్యమును ప్రకటించు తీర్మానమునకు 32వ విభాగపు నిబంధనలే ఈ క్రింది మార్పులకు లోబడి వర్తించవలెను, అవేమనగా—

(i) పంచాయతీ సమితి, "అధ్యక్షుడు" "ఉపాధ్యక్షుడు" "కలెక్టరు" అను మాటలు వచ్చు అన్నిచోట్లను వాటికి బదులు వరుసగా "జిల్లా పరిషత్" "చైర్మను", "వైస్ చైర్మను" "జిల్లా కలెక్టరు", అను మాటలు వుంచబడవలెను;

(ii) (10)వ ఉప విభాగములోవున్న "మరియు దానిపై ఓటు చేయుటకు హక్కు వుండరాదు" అను మాటలకు బదులు "అయితే ఆయన దానిపై ఓటు చేయుటకు హక్కు కలిగి యుండవలెను" అను మాటలు వుండవలెను.

58 జిల్లా పరిషత్ చైర్మనునుగాని, వైసుచైర్మనునుగాని తొలగించుటకు ప్రభుత్వమువారి హక్కు:-

ప్రభుత్వమువారు జిల్లా పరిషత్ చైర్మనును గాని వైస్ చైర్మనునుగాని తొలగించుటకు 34వ విభాగపు నిబంధనలే ఈ క్రింది మార్పుకు లోబడి వర్తించవలెను- "పంచాయతీ సమితి", "అధ్యక్షుడు", "ఉపాధ్యక్షుడు" అను మాటలకు బదులు "జిల్లా పరిషత్తు", చైర్మను", "వైస్ చైర్మను", అను మాటలు వుంచబడవలెను.

59. జిల్లా బోర్డుల అధికారములను, కర్తవ్యములను పంచాయతీ సమితులకు, జిలా పరిషత్‌లకు బదిలీచేయుట.-

(1) సంబంధించిన జిల్లాబోర్డుల చట్టమునందు లేక ఏదేని ఇతర శాసనమునందు ఏమి యున్నప్పటికి దానితో నిమిత్తము లేకుండ, ప్రభుత్వము వారు, ప్రకటనద్వారా మరియు అందు నిర్దేశింపబడునట్టి నియంత్రణము, నిర్బంధములు, షరతులు, మినహాయింపులకు లోబడి, సంబంధించిన జిల్లా బోర్డుల చట్టము ద్వారా లేక దాని క్రింద లేక తత్కాలమందు అమలులోవున్న ఏ ఇతర శాసనము ద్వారాగాని ఒక జిల్లా బోర్డుచే వినియోగింపబడదగు అధికారములను లేక నిర్వహింపబడదగు కర్తవ్యములను, ఏదేని పన్నును లేక రుసుమును వసూలు చేయు అధికారముతో

సహా ఒక పంచాయతీ సమితికి లేక జిల్లా పరిషత్తుకు బదిలీ చేయబడవలసి నదిగా ఆదేశింప వచ్చును. మరియు అందుమీదట ఆ పంచాయతీ సమితి లేదా జిల్లా పరిషత్ తనకు బదిలీ చేయబడిన అధికారములను, కర్తవ్యములను విని యోగింపవలయును. నిర్వర్తింప వలయును. అప్పటినుండి ఆ అధికారము లను జిల్లాబోర్డు వినియోగింపరాదు. కర్తవ్యములను నిర్వర్తింపరాదు.

(2) (1)వ ఉప విభాగము ననుసరించి అధికారములను, కర్తవ్యము లను బదిలీ చేసిన మీదట ప్రభుత్వమువారు జిల్లా బోర్డుక్రింద పని చేయుచున్న అధికారులు మరియు ఇతర ఉద్యోగులలో తాము అవసరమని భావించువారిని సందర్భమును బట్టి ఆ పంచాయతీ సమితికి గాని జిల్లా పరిషత్‌నకు గాని బదిలీ చేయవలయునని ఆదేశింపవచ్చును.

(3) (1)వ ఉప విభాగము ననుసరించి జిల్లా బోర్డుయొక్క ఏవేని అధికారములు, కర్తవ్యములు పంచాయతీ సమితికి లేక జిల్లా పరిషత్‌కు బదిలీ చేయబడినప్పుడు సంబంధించిన జిల్లా బోర్డుల చట్టములో గాని తత్కాలమందు అమలులో నున్న ఏ శాసనములోనైనను అట్టి అధికారములను కర్తవ్యము లను పురస్కరించుకొని జిల్లా బోర్డును గురించి చేయబడిన ప్రస్తావనలన్నియు పంచాయతీ సమితిని లేక సందర్భానుసారముగా జిల్లా పరిషత్‌ను గురించిన ప్రస్తావనలుగా అన్వయించు కొనబడవలెను.

60. జిలాబోర్డుల రద్దు ,-

(1) జిల్లా బోర్డుల చట్టములో గాని తత్కాలమందు అమలులో నున్న ఇతర ఏ శాసనములో గాని ఏమి యున్నప్పటికిని ప్రకటనద్వారా ప్రభుత్వము వారు అందులో నిర్దేశింపబడగల తేదీనుంచి ఏ జిల్లాబోర్డు నైనను రద్దు చేయ వచ్చును.

(2) (1)వ ఉప విభాగమును ననుసరించి ఒక జిల్లా బోర్డు రద్దు అయిన మీదట, ఆ రద్దు అయిన తేదీన జిల్లా బోర్డుల చట్టము లేక తత్కాల మందు అమలులో వున్న ఏదేని ఇతర శాసనము క్రింద దానికి గల ఆస్తులు అప్పులు అన్నియును ఆ జిల్లా యొక్క జిల్లా పరిషత్‌నకు గాని లేక అందలి పంచాయతీ సమితులకు గాని లేక ఆ రెండింటికి గాని ప్రభుత్వమువారు ఉత్త రువు ద్వారా ఆదేశింపగలమేరకు మరియు అట్టి విధముగా గాని సంక్రమింప వలయును.

(3) రద్దు చేయబడిన జిల్లా బోర్డుయొక్క అధికారులు, ఇతర ఉద్యోగులు జిల్లా పరిషత్ లేక పంచాయతీ సమితుల సిబ్బందితో లేదా ప్రభుత్వము ఉచితమని భావించిన ఇతర విధముగా చేర్చుకొనబడవలయును.

D. జిల్లా బోర్డుల చట్టము పంచాయతీ సమితులకు మరియు జిల్లా పరిషత్తులకు వర్తించుట :-

(1) ప్రభుత్వమువారు, ప్రకటన ద్వారా ఏదేని పన్ను లేక రుసుములను విధించుటకు వసూలు చేయుటకు సంబంధించిన నిబంధనలతో సహా సంబంధించిన జిల్లా బోర్డుల చట్టముయొక్క ఏయే నిబంధనలు ఆ ప్రకటనలో నిర్దిష్ట పరుపబడునో ఆ నిబంధనలు ఈ చట్టము క్రింద ఏర్పరుపబడిన పంచాయతీ సమితులకు లేక జిల్లా పరిషత్‌లకు వర్తింపవలెనని ఆదేశింపవచ్చును. ఆ నిబంధనలను పంచాయతీ సమితులకు, జిల్లా పరిషత్‌లకు వర్తింపజేయుటకు సులభసాధ్యముచేయు నిమిత్తము ప్రభుత్వమువారు ప్రకటన ద్వారా, జిల్లా బోర్డుల చట్టము మరియు దాని క్రింద చేయబడిన నియమములను అందులో వున్న ఏ నిబంధననైన రద్దుచేయుట, సవరించుట లేక తాత్కాలికముగా ఆపుచేయుట మూలముగా అవసరమైనట్లు లేక సమంజసమైనట్లు సానుకూలీకరించుకొనవచ్చును లేక మార్పు చేయవచ్చును. మరియు అందు మీదట జిల్లా బోర్డుల చట్టము క్రింద చేయబడిన నియమములు ఆ విధముగా చేయబడిన సానుకూలీకరణకు లేక మార్పులకు లోబడి అమలులో ఉండవలయును,

(2) జిల్లా బోర్డుల చట్టముయొక్క నిబంధనల లేక ఈ చట్టము క్రింద చేయబడిన నియమముల సానుకూలీకరణ కొరకు (1)వ ఉప విభాగము ననుసరించి ఎట్టి నిబంధనయు చేయబడకుండినను, దానితో లేక సరిపోని నిబంధన చేయబడినను నిమిత్తము లేకుండ, ఈ నిబంధనలను ఏదేని పంచాయతీ సమితికి లేక జిల్లా పరిషత్‌కు వర్తింపజేయుటకు సులభసాధ్యము చేయు నిమిత్తము ఆ నిబంధనలను అమలుపరచుటకు కోరబడిన లేక అధికార మీయబడిన ఏదేని న్యాయస్థానము, ట్రిబ్యునల్ లేక అధికారవర్గము ఆ న్యాయస్థానము, ట్రిబ్యునల్ లేక అధికారవర్గము సమక్షముననున్న విషయమునకు అవసరముకాగల లేక ఉచితముకాగల విధముగా ఆ నిబంధనలను వాటి భావమును మార్చకుండ, అన్వయము చేయవచ్చు.

62. పంచాయతీ సమితియొక్క లేక జిల్లా పరిష యొక్క తీర్మానములు రద్దు చేయుటకు లేక తాత్కాలికముగా ఆపి యుంచుటకు అధికారము :-

(1) పంచాయతీ సమితిచే గాని దానికి సంబంధించిన ఏదేని స్థాయీ సమితిచే గాని, జిల్లా పరిషత్ చే గాని దానికి సంబంధించిన ఏదేని స్థాయీ సమితిచే గాని అమోదింపబడిన ఏదేని తీర్మానము—

(ఎ) చట్ట సమ్మతముగా ఆమోదింపబడలేదని, లేదా

(బి) ఈ చట్టముచే లేక ఈ చట్టము క్రింద ఏదైన మరొక శాసనము క్రింద ఈయబడిన అధికారములను మించినట్టిదిగా లేక వాటిని దుర్వినియోగ పరచునట్టిదిగా ఉన్నదని, లేదా

(సి) దానిని అమలుపరచిన మీదట ప్రజా జీవనమునకు వారి ఆరోగ్యమునకు లేక క్షేమమునకు హాని కలుగగల అవకాశ మున్నదని లేక అది సంఘర్షణకు లేక కలహమునకు దారితీయగల అవకాశ మున్నదని-ప్రభుత్వమువారు అభిప్రాయ పడినచో వారు లిఖిత పూర్వకమైన వుత్తరువు ద్వారా దానిని రద్దు చేయవచ్చును.

(2) (1)వ ఉప విభాగము క్రింద ప్రభుత్వము చర్య తీసికొనుటకు ముందు సంజాయిషీ చెప్పుకొనుటకు సందర్భాను సారముగా ఆ పంచాయతీ సమితికి లేక ఆ జిల్లా పరిషత్ కు అవకాశ మీయవలయును.

(3) (1)వ ఉప విభాగము యొక్క (సి)ఖండములో పేర్కొనబడిన కారణములను బట్టి ఏదేని ఒక తీర్మానమును తాత్కాలికముగా ఆపుచేయుట అవసరమని జిల్లా కలెక్టరు అభిప్రాయ పడినచో, ఆయన లిఖిత పూర్వకమైన ఉత్తరువుద్వారా అట్టి తీర్మానమును తాత్కాలికముగా ఆపు చేయవచ్చును. మరియు ఆ విషయము ప్రభుత్వము వారికి తెలియజేయ వలయును.

(4) (3)వ ఉప విభాగము ననుసరించి ఉత్తరువు ఏ విషయమున చేయబడినదో ఆ విషయమునకు సంబంధించిన రికార్డును ప్రభుత్వమువారు స్వయముగా గాని, ఆ ఉత్తరువు వలన నష్టపడిన పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ కోరిన మీదట గాని తెప్పించుకొని దానిపై వారు యుక్తమని భావించెడి ఉత్తరువును జారీ చేయవచ్చును; అయితే సంజాయిషీ చెప్పుకొనుటకు పంచాయతీ సమితికి గాని, జిల్లా పరిషత్ కు గాని అవకాశము ఈయనిదే దానికి విరుద్ధముగా ఎట్టి ఉత్తరువు గాని జారీ చేయరాదు.

63. పంచాయతీ సమితిని లేక జిల్లా పరిషత్‌ను రద్దు చేయుటకు, విఘటన చేయుటకు ప్రభుత్వమువారి అధికారము :-

ఏ సమయములో నైనను పచాయతీ సమితి లేక జిల్లాపరిషత్‌ను తన అధికారములను వినియోగింపనట్లు లేక తన కర్తవ్యములను నిర్వర్తింపనట్లు లేక ఈ చట్టము లేదా తత్కాలమందు అమలులో వున్న ఏదేని ఇతర శాసనముచే లేక దానికింద ఈయబడిన అధికారములను అధిగమించినట్లు లేక దుర్వినియోగ పరచినట్లు ప్రభుత్వము వారికి తోచినచో ప్రభుత్వమువారు ఆ తప్పును, అధిగమించుటను - క దుర్వినియోగ పరచుటను సరిదిద్దుకొన వలసినదిగా లేక అందు నిమిత్తము సంతృప్తికరమగు సంజాయిషి ఈయ వలసినదిగా ఆ పంచాయతీ సమితిని లేదా సంధర్భమును బట్టి ఆ జిల్లా పరిషత్‌ను ఆదేశింపవచ్చును. మరియు ఆ పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ అట్టి ఆదేశానుసారముగా వర్తింపనిచో, ప్రభుత్వమువారు ఆ పంచాయతీ సమితిని లేదా సందర్భమును బట్టి ఆ జిల్లా పరిషత్‌ను ఒక నిర్ణీత తేదీనుండి ఒక సంవత్సరమునకు మించని కాలపరిమితి వరకు రద్దు చేయవచ్చును. లేదా ఒక నిర్ణీత తేదీనుండి దానిని విఘటన చేయవచ్చును. మరియు దానిని వెనువెంటనే కాని వేరొక నిర్ణీత తేదీనుండి గాని, తిరిగి ఏర్పాటు చేయవచ్చును. మరియు ప్రభుత్వమువారు అందుకొరకు గాను అది రద్దు అయియున్న కాలములో లేదా ఈ చట్టపు నిబంధనలకు అనుగుణముగా పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ తిరిగి ఏర్పాటు చేయబడునంతవరకు ప్రభుత్వము వారిచే ఇందు నిమిత్తమై నియమింపబడునట్టి వ్యక్తి లేక అధికార వర్గము ఆ పంచాయతీ సమితి యొక్క లేక జిల్లా పరిషత్‌యొక్క ఏవైన లేక అన్ని అధికారములను, కర్తవ్యములను, వినియోగించునట్లు, నిర్వర్తించునట్లు చేయవచ్చును మరియు ఆ విధముగా వినియోగింపబడిన ఎవరైన వ్యక్తి లేదా అధికారవర్గము ప్రభుత్వమువారు ఆ విధముగా ఆదేశించినచో పంచాయతీ సమితియొక్క లేదా సందర్భమును బట్టి జిల్లా పరిషత్‌యొక్క నిధులలోనుండి తాము చేసిన పనికి ప్రతిఫలము స్వీకరింప వచ్చును:

64. లాంఛన బద్ధము కాకుండుట, ఖాళీ ఏర్పడుట, మున్నగు వాటి వలన పంచాయతీ సమితుల యొక్కయు, జిల్లా పరిషత్తుల యొక్కయు చర్యలు చెల్లనివి కాకుండుట :-

(1) పంచాయతీ సమితి యొక్క లేక స్థాయీ సమితియొక్క ఏ చర్యయైనను, అట్టి పంచాయతీ సమితి లేక స్థాయీసమితి యొక్క ఏర్పాటులో లోపము కలదన్న కారణమున మాత్రమే, లేక ఆ పంచాయతీ సమితి యొక్క కాని, స్థాయీ సమితియొక్క గాని అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు, లేక ఎవరైన సభ్యుడు ఏదైన అనర్హత వలన లేక సందర్భాను సార

ముగా అతని నామ నిర్దేశములో, లేక ఎన్నికలోగల ఏదేని క్రమ రాహిత్యము లేక శాసన వైరుధ్యమువలన ఆ పదవిని స్వీకరించుటకు లేదా ఆ పదవియందు ఉండుటకు ఆయనకు హక్కు లేదను కారణమునగాని లేక ఆ చర్య ఆ పంచాయతీ సమితియొక్క లేక స్థాయీ సమితియొక్క అధ్యక్షుని, ఉపాధ్యక్షుని, చైర్మనుని లేక ఎవరైన సభ్యుని పదవియందు ఏదైన ఖాళీ ఏర్పడియున్న కాలములో చేయబడినదన్న కారణమునగాని చెల్లనిదయినట్లు భావింపబడరాదు.

(2) (1)వ ఉప-విభాగములోని నిబంధనలే అవసరమైన మార్పులతో జిల్లా పరిషత్‌యొక్క లేక దాని స్థాయీ సమితియొక్క చర్యలకును వర్తింపవలయును.

65. సభ్యులు విధేయతా ప్రమాణము చేయుట:-

(1) పంచాయతీ సమితియొక్క ప్రతి సభ్యుడును, జిల్లా పరిషతుయొక్క ప్రతి అనధికార సభ్యుడును పంచాయతీ సమితి లేక సందర్భమును బట్టి జిల్లా పరిషత్‌యొక్క సమావేశములో, తన స్థానమును స్వీకరించుటకు ముందు భారత సంవిధానమునకు విధేయుడనై యుండగలనని ఈ క్రింది నమూనాలో ప్రమాణము లేక శపథము చేయవలయును,

## ప్రమాణపు నమూనా

"పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్‌యొక్క సభ్యుడనైన ...అను నేను చట్టరీత్యా రూపొందింపబడిన భారత సంవిధానముపట్ల విశ్వాస విధేయతలు కలిగియుందుననియు, నేను స్వీకరింపబోవుచున్న విధిని విశ్వసనీయముగా నిర్వహింపగలననియు భగవత్సాక్షిగా ప్రమాణము చేయుచున్నాను. త్రికరణశుద్ధిగా శపథము చేయుచున్నాను."

(2) అట్టి యేసభ్యుడైనను తన పదవికాలము ఆరంభమగు తేదీ నుండి మూడు నెలలలోపున లేదా సదరు తేదీ తర్వాత జరిగిన మొదటి మూడు సమావేశములలో ఏ సమావేశములోనైనను—ఈ రెండింటిలో ఏది తర్వాత జరిగిన అప్పుడు (1)వ ఉప విభాగములో నిర్దిష్ట పరుపబడిన విధముగా ప్రమాణము లేక శపథము చేయకున్నచో, ఆయన పదవిలో నుండుట విరమింపవలయును మరియు ఆయన స్థానము ఖాళీ అయినట్లుగా భావింపబడవలయును,

(3) అట్టి ఏ సభ్యుడైనను, ఈ విభాగములో నిర్దిష్ట పరుపబడిన విధముగా ప్రమాణము లేక శపథము చేసిననే తప్ప, పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తుయొక్క సమావేశములో కూర్చుండరాదు లేదా అట్టి సభ్యుడుగా ఏ చర్యయు చేయరాదు,

66. పరిపాలనా నివేదిక:-

(1) సంవత్సరాంతము నందు నిర్ణయింపబడిన నమూనాలో అట్టి వివరములతో ప్రతి పంచాయతీ సమితియు జిల్లా పరిషత్‌కు, ప్రతి జిల్లా పరిషత్ ప్రభుత్వమునకు, ప్రతి సంవత్సరము తన పరిపాలనకు సంబంధించిన నివేదికను సమర్పింపవలెను. పంచాయతీ సమితి జిల్లా పరిషత్‌కు సదరు నివేదికను సమర్పించునప్పుడు, దాని నకలు నొకదానిని ప్రభుత్వమునకు పంపవలెను.

(2) ప్రతి పంచాయతీ సమితియొక్క నివేదికను జిల్లా పరిషత్ పరిశీలించ వలయును మరియు తన అభిప్రాయములతోపాటు దానిని ప్రభుత్వ వారికి అందజేయవలయును.

(3) పంచాయతీ సమితియొక్క నివేదికను బ్లాకు అభివృద్ధి అధికారియును, జిల్లా పరిషత్‌యొక్క నివేదికను దానియొక్క కార్యదర్శియును తయారు చేయవలయును మరియు పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ దానిని పరిశీలించి, దానిపై తన తీర్మానముతోపాటు సందర్భమునుబట్టి జిల్లా పరిషత్‌కు లేదా ప్రభుత్వమువారికి అందజేయవలయును.

67. "తనిఖీ అధికారుల ప్రవేశమునకు అధికారములు:-

(1) ఇందుకుగాను ప్రభుత్వమువారిచే అధికార మీయబడు ఎవరైన ఒక అధికారి లేక వ్యక్తి ఈ దిగువ పేర్కొన్న స్థలములలో ప్రవేశింపవచ్చును, మరియు వాటిని తనిఖీ చేయవచ్చును;

(ఏ) ఏదేని పంచాయతీ సమితియొక్క లేక జిల్లా పరిషత్‌యొక్క అధీనములోగల ఎట్టి స్థిరాస్తి లేదా వారి అధీనమున నిర్వహింపబడుచున్న ఏదేని పని,

(బి) ఏదేని పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ నిర్వహించుచున్న లేక దాని అధీనములోనున్న ఏదేని పాఠశాల, ఆస్పత్రి, దవాఖానా, టీకా కేంద్రము, సత్రము లేక ఇతర సంస్థ, మరియు అట్టి సంస్థలోగల ఏవైన రికార్డులు, రిజిష్టర్లు లేక ఇతర డాక్యుమెంట్లు మరియు,

(సి) పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తు యొక్క కార్యాలయము, మరియు దానియందుగల ఏవేని రికార్డులు, రిజిష్టర్లు లేక ఇతర డాక్యుమెంట్లు.

(2) (1) వ ఉప విభాగములో తెలుపబడిన అధికారికి లేక వ్యక్తికి, సదరు ఉప విభాగము క్రింద తన కర్తవ్యములను నిర్వర్తింప జాలుటకు అవసరమైన ప్రకారముగా, పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తు తన ఆస్తిని, ఆవరణలను, సమస్తములైన డాక్యుమెంట్లను భావ్యమైన అన్ని వేళలందును విధిగా అందుబాటులో ఉంచవలెను.

68. సద్భావముతో చేయబడిన చర్యల విషయము రక్షణ :-

ఈ చట్టము ననుసరించి లేక ఈ చట్టము క్రింద చేయబడిన నియమావళి ననుసరించి సద్భావముతో చేయబడిన లేక చేయనుద్దేశింపబడిన ఏ చర్యను పురస్కరించుకొనియైనను ఏ వ్యక్తిపైనైనను ఎట్టి దావాగాని, అభియోగముగాని తదితరమైన చట్టబద్ధ చర్యగాని ఆరంభింపబడరాదు.

69. నియమములు చేయు అధికారము :-

(1) ఈ చట్టము యొక్క కార్యములను నెరవేర్చు నిమిత్తము ప్రభుత్వమువారు ప్రకటన ద్వారా నియమములను చేయవచ్చును.

(2) ఈ విభాగము ననుసరించి చేయబడిన సమస్త నియమములు, అవి చేయబడిన తరువాత సాధ్యమైనంత త్వరలో రాజ్య విధాన మండలి యొక్క ఉభయ సభలయందు కనీసము పదునాలుగు రోజులపాటు వుంచబడవలెను. మరియు అవి అట్లు వుంచబడిన సమావేశ కాలమునందు రాజ్య విధాన మండలిచే రద్దు లేక సవరణ రూపమున చేయబడు మార్పులకు లోనై యుండవలెను.

70. ఉప నిబంధనలు చేయుటకు పంచాయతీ సమితికిని, జిల్లా పరిషత్తునకును అధికారము :-

(1) చేయబడు నియమములకు లోబడి, జిల్లా పరిషత్తు ఆమోదముతో పంచాయతీ సమితియు, ప్రభుత్వమువారి ఆమోదముతో జిల్లా పరిషత్తుయు, అది ఏ కార్యముల నిమిత్తము ఏర్పాటు చేయబడినదో వాటి నిర్వహణకై ఉప నిబంధనలను,

(2) ఈ విభాగము ననుసరించి ఉప నిబంధనలను చేయుట, వాటి ప్రచురణ, మరియు అవి అమలులోనికి రావలసిన తేదీకి సంబంధించిన కార్య విధానమును గూర్చి నియమములను చేయు అధికారము ప్రభుత్వమునకు వుండవలెను.

71. అధికార ప్రధానము మరియు సంస్థలను, నిర్మాణములను బదిలీ చేయుటకు అధికారము :-

(1) ప్రభుత్వమువారు ప్రకటన ద్వారా, ఈ విభాగము మరియూ 69'వ విభాగము ద్వారా తమకు సంక్రమించిన అధికారములను తప్ప ఈ చట్టము క్రింద తమకు గల అన్ని లేదా ఏవేని కొన్ని అధికారములను, తమ క్రింది ఎవరేని వ్యక్తికిగాని అధికారవర్గమునకుగాని సంక్రమింప జేయ వచ్చును. మరియు అదే విధముగా అట్లు సంక్రమింపజేసిన ఏదేని అధికారమును ఉపసంహరించుకొనవచ్చును. ఈ ఉప విభాగము క్రింద సంక్రమింప జేయబడిన ఏవేని అధికారముల వినియోగము, ప్రకటనలో నిర్దిష్ట పరుపబడునట్టి నిర్బంధములకును, పరిమితులకును, షరతులకును అందు నిర్దిష్టపరుపబడు అధికారవర్గపు నియంత్రణకును, మార్పులకును లోబడి యుండవలెను.

(2) ఈ చట్టము యొక్క నిబంధనలచే లేదా వాటి ననుసరించి ఏవేని అధికారములను వినియోగించు చున్నట్టి లేదా కర్తవ్యములను నిర్వహించునట్టి పంచాయతీ సమితిగాని, జిల్లా పరిషత్‌గాని ఇతర వ్యక్తిగాని దానియొక్క అధికారములను లేక కర్తవ్యములను ఎవరేని వ్యక్తిగాని లేదా అధికారవర్గమునకుగాని లిఖిత పూర్వకముగా సంక్రమింప జేయవచ్చును. అయితే అట్టి ప్రధానము, నిర్ణయింపబడు నిర్బంధములకును పరిమితులకును మరియు ప్రభుత్వము వారి నియంత్రణకును మార్పులకును లోబడి యుండవలెను.

(3) ప్రభుత్వమువారు తమ క్రింద లేక నియంత్రణ క్రింద ఉన్న ఏదేని సంస్థను లేక నిర్మాణమును జిల్లా పరిషత్‌కు లేక పంచాయతీ సమితికి బదిలీ చేయవచ్చును. జిల్లా పరిషత్తు తన నిర్వహణ క్రింద లేక నియంత్రణ క్రింద ఉన్న ఏదేని సంస్థను ఏదేని పంచాయతీ సమితికి లేక పట్టణ సమితికి బదిలీ చేయవచ్చును. ఈ బదిలీ ప్రభుత్వము వారిచే గాని సందర్భానుసారముగా జిల్లా పరిషత్‌చే గాని నిర్దిష్టపరుపబడినట్టి షరతులకును, పరిమితులకును, నిర్బంధములకును లోబడి జరుగవలెను.

అయితే సంబంధించిన జిల్లా పరిషత్, పంచాయతీ సమితి లేక పట్టణ సమితియొక్క పూర్వాంగీకారము పొందనిదే అట్టి బదిలీ చేయబడరాదు.

72. మార్పుచేయుటకు, సమీక్షించుటకు ప్రభుత్వమునకు అధికారము :-

(1) ప్రభుత్వమువారు, తమంత తాముగా గాని లేదా సంబంధించిన ఎవరైన వ్యక్తి దరఖాస్తు పెట్టుకొనినచో గాని ఏదేని పంచాయతీ సమితి లేదా జిల్లా పరిషత్ లేదా వాటి స్థాయీ సమితుల వద్దనుండి ఏవేని ప్రొసీడింగులకు

సంబంధించిన రికార్డులను, అట్టి ప్రొసీడింగుల సక్రమత్వము లేదా అందులో చేయబడిన ఏదేని నిర్ణయము లేదా ఉత్తరువుయొక్క నిర్దిష్టత్వమును, న్యాయ సమ్మతత్వమును లేదా ఔచిత్యమును గూర్చి నిర్ధారణ చేసికొను నిమిత్తము తెప్పించుకొనవచ్చును. పరీక్షింపవచ్చును. మరియు ఏ సందర్భములో నైనను అట్టి ఏదేని నిర్ణయము లేక ఉత్తరువు మార్చబడవలెనని, రద్దుచేయబడవలెనని, తారుమారు చేయబడవలెనని లేదా పునఃపరిశీలనకు తిరిగి పంపించబడవలెనని ప్రభుత్వమువారికి తోచినచో, ఆవిధముగా వారు ఉత్తరువులను జారీ చేయ వచ్చును.

అయితే విజ్ఞాపన చేసికొనుటకు ఏ కక్షిదారున కైనను అవకాశము నిచ్చుననే తప్ప అట్టి కక్షిదారునకు విరుద్ధముగా ఎట్టి ఉత్తరువులను జారీ చేయరాదు.

(2) అట్టి నిర్ణయము లేక ఉత్తరువు విషయములో (1)వ ఉప విభాగము ననుసరించి తమకు గల అధికారములను వినియోగించునంతవరకు, ప్రభుత్వము వారు అట్టి నిర్ణయము లేక ఉత్తరువుయొక్క అమలును నిలుపు చేయవచ్చును.

(3) (1)వ ఉప విభాగము ననుసరించి జారీ చేయబడిన ఉత్తరువు న్యాయశాస్త్రమైనట్టి లేక వాస్తవికాంశ సంబంధమైనట్టి ఏదేని పొరపాటువలన లేదా ఏదైన ముఖ్యాంశము తెలిసి యుండకపోయినందువలన ప్రభుత్వమువారిచే జారీ చేయబడి యుండినచో అది జారీ చేయబడిన తరువాత ప్రభుత్వమువారు ఎప్పుడైనను తమంత తాముగాని లేదా అ ఉత్తరువు జారీ చేయబడిన తరువాత తొంబది దినములలో సంబంధించిన ఏ వ్యక్తియైనను దరఖాస్తు పెట్టుకొనిన మీదటగాని అట్టి యే ఉత్తరువు పైనను సమీక్షింపవచ్చును. (1)వ ఉపవిభాగము యొక్క మినహాయింపు నిబంధనలోను (2)వ ఉప విభాగములోను గల నిబంధనలు, (1) వ ఉప విభాగము ననుసరించి జరుపబడు ప్రొసీడింగులకు వర్తించు విధముననే ఈ ఉప విభాగము ననుసరించి జరుపబడు ప్రొసీడింగులకు కూడ వర్తించవలెను.

(4) ఈ విభాగము యొక్క (1) వ ఉప విభాగముక్రిందగాని (3)వ ఉప విభాగము క్రిందగాని పెట్టుకొనబడు ప్రతి దరఖాస్తు పదునైదు రూపాయల రుసుముతో సహా దాఖలు చేయబడవలెను.

73. చిక్కులను తొలగించు అధికారము:-

చట్టపు నిబంధనలను అమలు జరుపుటలో ఏదేని చిక్కు సంభవించిన చో, ప్రభుత్వము, ఆ చిక్కును తొలగించుటకు తాము అవసరమని తలంచిన ఏ చర్యనైనను ఆ సమయమునకు అనుగుణముగా చేయించు ఉత్తరువులను జారీ చేయవచ్చును.

74. తాత్కాలిక పంచాయతీ సమితుల సందర్భములో మినహా యింపులు:-

(1) ఈ చట్టము అమలులోనికి రాకపూర్వము ప్రభుత్వమువారి నిర్వహక ఉత్తరువుల క్రింద ఏ బ్లాకులోనైనను ఏర్పాటు చేయబడిన పంచాయతీ సమితి (ఈ విభాగములో ఇట తరువాత "తాత్కాలిత పంచాయతీ సమితి" అని పేర్కొన బడినట్టిది) ఈ చట్టపు నిబంధనల ప్రకారము ఆ బ్లాకులో సక్ర మముగా పంచాయతీ సమిత ఏర్పాటు చేయబడిన తేదీనుండి అస్తిత్వమును కోల్పోవలెను.

(2) ఒక తాత్కాలిక పంచాయతీ సమితిచే చేయబడిన అన్ని పనులును, తీసికొనబడిన ఇతర చర్యలును, ఈ చట్టముక్రింద దాని స్థానములో ఏర్పాటు చేయబడిన పంచాయతీ సమితిచే చేయబడినట్లు లేదా తీసికొనబడినట్లు భావింప బడవలెను. మరియు ఆరోజున ఆ పంచాయతీ సమితికి గల అన్ని ఆస్తులు, అప్పులు, దాని స్థానే ఈ చట్టముక్రింద చేయబడిన పంచాయతీ సమితిక సంక్ర మించవలెను.

## షెడ్యూలు

(18వ విభాగము చూడుడు)

పంచాయతీ సమితుల యొక్క అధికారములు, కర్తవ్యములు

1. సమాజ వికాసము -

పంచాయతీల. సహకార సంఘముల స్వచ్ఛంద సంస్థల మరియు ప్రజల సహకారముతో సమాజ వికాసమునకు సంబంధించిన కార్యక్రమము అన్నియు నిర్వహించుట,

2. వ్యవసాయము :

వ్యవసాయోత్పత్తిని పెంచుటకు అవసరమైన ప్రతి పనిని, విశేషించి దిగువ పనులచేయుట.

(6)

(i) మేలిరకపు విత్తనములను ప్రోగుచేయుట మరియు పంపిణీ చేయుట ;

(ii) రసాయనిక ఎరువుల పంపిణీ;

(iii) మేలిరకపు విధానములను, పద్ధతులను, అలవాట్లను మరియు పనిముట్లను ప్రచారమునకు తెచ్చుట:

(iv) పచ్చి ఎరువులందు స్వయం సమృద్ధిని సాధించుట మరియు పెరటి ఎరువులను తయారుచేయుట;

(v) పండ్ల మరియు కూరగాయ తోటలు వేయుటను ప్రోత్సహించుట;

(vi) భూమి పునరుద్ధారణ, భూసార రక్షణ;

(vii) వ్యవసాయ కార్యముల నిమిత్తము అప్పులు ఇచ్చుట;

(viii) మొక్కల సంరక్షణ పద్ధతులను ప్రచారము చేయుట మరియు ఆ పనులలో సహాయము చేయుట;

(ix) ప్రయోగపు పొలములను ప్రదర్శించి, ఉత్తమమైన క్షేత్రనిర్వాహక పద్ధతులను రూపొందించుట ;

(x) పాతబావులను పునరుద్ధరించి, క్రొత్తబావులను త్రివ్వి, ప్రయివేటు చెరువులను మరమ్మతుచేసి, క్రొత్తగా త్రవ్వి, ప్రభుత్వపు చిన్నతరహా నీటి పారుదల వనరులను సరఫరా కాలువలను మంచిస్థితిలో ఉంచుచు అధికముగా భూమిని నీటిపారుదల క్రిందికి తెచ్చుట;

(xi) వ్యవసాయ కార్యముల నిమిత్తము అధికముగా విద్యుచ్ఛక్తిని వినియోగించుట ;

(xii) బావుల త్రవ్వకము ద్వారా, ఫిల్టరు పాయింటుల ద్వారా, గొట్టము బావుల ద్వారా, భూగర్భములోని నీటి వనరులను ఉపయోగములోనికి తెచ్చుట;

(xiii) చెట్లు నాటుట ;

(xiv) గ్రామ అడవులను పెంచుట,

3. పశు పోషణ మరియు మత్స్య సంవర్ధన:-

(i) మంచిజాతి ఆబోతు కోడెలనుతెచ్చి హీనజాతి కోడెలు విత్తులు తీసి, స్థానిక పశుసంపదయొక్క శ్రేష్టతను పెంచుట;

(ii) పశువుల, గొర్రెల, పందుల మరియు కోళ్ళ సంతానాభి వృద్ధికై ఉత్తమ పద్ధతులను అవలంభించుట ;

(iii) క్రిమబద్ధమైన రక్షణ పద్ధతులనవలంభించి, అంటువ్యాధులను అరికట్టుట;

(iv) మేలిరకపు గడ్డిని, మేతలను పెట్టుట;

(v) కృత్రిమ సంతానవృద్ధి కేంద్రములను, ప్రథమ చికిత్సాకేంద్రములను, చిన్నతరిహా పశువైద్య శాలలనుఏర్పాటు చేయుట, వాటిని నిర్వహించుట;

(vi) క్షౌరశాల స్థాపన, మరియు పాల సరఫరా;

(vii) మత్స్య సంవర్ధన పరిశ్రమను అభివృద్ధి చేయుట;

(viii) పాలకొరకును, బరువుల లాగుట కొరకును మేలిరకపు పశువుల ప్రాముఖ్యతను గురించి ప్రజలకు బోధించుట.

4. ఆరోగ్యము మరియు గ్రామ పరిశుభ్రత:-

(i) ప్రస్తుతమున్న వైద్య మరియు ఆరోగ్య సౌకర్యములను ఎక్కువ చేయుట, అవి ప్రజల అందుబాటులో ఉండునట్లు చేయుట;

(ii) ప్రాథమిక ఆరోగ్య కేంద్రములను, ప్రసూతి కేంద్రములను స్థాపించుట, వాటిని నిర్వహించుట;

(iii) మంచినీటి సౌకర్యముల నేర్పాటు చేయుట;

(iv) టీకాలు వేయించుటను పద్ధతి ప్రకారముగా ఏర్పాటు చేయుట;

(v) ఉపద్రవకరమైన రోగములను నివారించుట;

(vi) గ్రామములోనియు, ఇండ్లలోనియు మురికి నిమిత్తము మురికి కాలువలను, మురికి గుంటలను ఏర్పాటు చేయుట;

(vii) శుభ్రమైన పాకీదొడ్లను వాడుటను, మలములను ఎరువుగా వాడుటను ప్రోత్సహించుట;

(viii) పొగరాని పొయ్యిని ప్రచారమునకు తెచ్చుట ;

(ix) ప్రభుత్వ ఆస్పత్రుల యొక్క పనులపై పర్యవేక్షణచేయుట ;

(x) అట్టి ఆస్పత్రుల అభివృద్ధి పనులలో ప్రజలు పాల్గొనునట్లు చేయుట :

(xi) ఉపద్రవకరమైన వాధ్యులు వ్యాపించిన సమయములలో ప్రజల యొక్కయు పంచాయతీల యొక్కయు సహకారమును పొందుట :

(xii) పరిసర పారిశుద్ధ్య ఉద్యమములను కొనసాగించుట మరియు (ఎ) బలవర్ధకాహారము (బి) ప్రసూతి మరియు శిశు ఆరోగ్యము (సి) సోకుడు వ్యాధులు (డి) కుటుంబ నియంత్రణ మున్నగు వాటిని గురించి ప్రజలకు బోధించుట.

(xiii) సంబంధించిన జిల్లా అధకారుల యొక్క సాంతిక నియంత్రణకు లోబడి ఆరోగ్య కార్యక్రమములను అమలుపరచుట.

5. విద్య :

ఎలిమెంటరీ మరియు బేసిక్ పాఠశాలలను, విశేషించి ఈ దిగువవాటిని ఆధికము చేయుట, వాటిని నిర్వహించుట :-

(i) ప్రభుత్వము యొక్కయు ప్రభుత్వము స్వాధీనపరచు కొన్నట్టియు ఎయిడెడ్ ఎలిమెంటరీ మరియు హైయరు ఏలిమెంటరీ పాఠశాలల నిర్వహణ,

(ii) వయోజన విద్యా కేంద్రములను వయోజన అక్షరాస్యతా కేంద్రములను స్థాపించుట ;

(iii) ప్రజల సహకారముతో పాఠశాలా భవనముల నేర్పాటుచేయుట, వాటిని అభివృద్ధి చేయుట ;

(iv) ప్రస్తుతమున్నట్టి ఎలిమెంటరీ పాఠశాలలను బేసిక్ పాఠశాలలుగా మార్చుట ;

(v) పదునాలుగు సంవత్సరముల వయస్సు నిండువరకు పిల్లలందరి యొక్కయు విద్యాభివృద్ధి కొరకు అవసరమైన చర్యలు తీసుకొనుట ;

6. సాంఘిక విద్య :

ప్రజలలో క్రొత్త దృక్పథము కలిగించుట మరియు వారిని స్వశక్తిపై ఆధారపడు వారినిగను, కష్టించి పనిచేయువారినిగను, సాముదాయక కార్యము

లలో పాల్గొనువారినిగను తయారుచేయుట, విశేషించి ఈ దిగువ పనులను చేయుట :-

(i) సమాచార కేంద్రములను సాముదాయక కేంద్రములను, మనోల్లాస కేంద్రములను స్థాపించుట,

(ii) యువజన సంఘముల, మహిళామండలుల, కర్షక సమాజముల మున్నగువాటిని స్థాపించుట,

(iii) గ్రంథాలయములను స్థాపించుట, వాటిని ప్రచారమునకు తెచ్చుట,

(iv) కాపలాదళములను వ్యవస్థీకరించుట,

(v) వ్యాయామ కార్యకలాపములను సాంస్కృతిక కార్యకలాపములను ప్రోత్సహించుట,

(vi) స్వచ్ఛంద పారిశుద్ధ్య దళములను వ్యవస్థీకరించుట,

(vii) గ్రామ సహాయకులకు శిక్షణ ఇచ్చుట, వారి సేవలను వినియోగించు కొనుట.

7. రాకపోకలు :

(i) గ్రామముల మధ్య రోడ్ల నిర్మాణము-నిర్వహణ,

(ii) గ్రామ రోడ్లను, కలుపుడు రోడ్లను ఏర్పాటు చేయుటకు, నిర్వహించుటకు అవసరమైన సహాయము చేయుట,

8. సహకారము :

నానావిధ రూపముల సహకార పద్ధతులను అవలంభించి, విశేషించి దిగువవాటిద్వారా ప్రజాస్వామ్య పద్ధతులలో ఆర్థికాభివృద్ధిని సాధించుట :-

(i) సాధ్యమైనన్ని అధిక సంఖ్యాక కుటుంబములకు ఉపయోగకరముగా నుండుటకు పరపతి, పారిశ్రామిక, నీటిపారుదల, సేద్య మరియు బహుళార్థ ప్రయోజక సహకార సంఘములను స్థాపించుట,

(ii) మితవ్యయములను మరియు చిన్న మొత్తముల పొదుపును ప్రోత్సహించుట,

9. కుటీర పరిశ్రమలు :

అధికతర ఉద్యోగావకాశములను కల్పించుటకును, జీవన ప్రమాణమును పెంచుటకును, కుటీర, గ్రామ, చిన్నతరహా పరిశ్రమలను అభివృద్ధి పరచుటకును విశేషించి ఈ దిగువ పనులను చేయుట;-

(i) ఉత్పత్తి మరియు శిక్షణా కేంద్రములను స్థాపించుట, వాటిని నిర్వహించుట;

(ii) చేతి పనివాండ్ర యొక్కయు, కళాకారుల యొక్కయు నిపుణతను అభివృద్ధి పరచుట,

(iii) మేలిరకపు పనిముట్లను ప్రచారమునకు తెచ్చుట ;

(iv) ఖాదీ, గ్రామ పరిశ్రమల సంఘముచేత మరియు అఖిల భారత మండలులచేత ఆర్థిక సహాయము చేయబడిన కుటీర, గ్రామీణ మరియు చిన్నతరహా పరిశ్రమల అభివృద్ధి పథకములను అమలు పరచుట.

10. మహిళా సంక్షేమము :

స్త్రీల యొక్కయు పిల్లల యొక్కయు సంక్షేమము కొరకు ప్రత్యేకముగా ఉద్దేశింపబడిన పథకములను అమలు పరచుట; విశేషించి మహిళా, శిశు సంక్షేమ కేంద్రములు, అక్షరాస్యతా కేంద్రములు, చేతిపని మరియు కుట్టుపని కేంద్రములు మున్నగువాటిని స్థాపించుట.

11. సాంఘిక సంక్షేమము :

(i) షెడ్యూల్డు కులముల యొక్కయు షెడ్యూల్డు తెగల యొక్కయు, వెనుకబడిన తరగతుల యొక్కయు ఉపయోగార్థము ప్రభుత్వముచే సహాయము చేయబడు వసతి గృహముల నిర్వహణ ;

(ii) గ్రామీణ గృహ నిర్మాణ పథకములను అమలు పరచుట ;

(iii) రోగపీడిత భిక్షుకులను పోషించుట, తిరుగుబోతు తనమును అరికట్టుట ;

(iv) స్వచ్ఛంద సాంఘిక సంక్షేమ సంస్థలను బలపరచుట, వాటి కార్యకలాపములను సమన్వయ పరచుట ;

(v) మద్య నిగ్రహమును మద్యనిషేధమును ప్రచారము చేయుట.

12. ఆపత్కాల సహాయము :

అగ్నివలన, వరదలవలన, ఉపద్రవకరమైన వ్యాధుల వలన మరియు ఇతర అరిష్టములవలన కలిగెడి విపత్తుల సందర్భములో స్వచ్ఛంద ప్రయత్నముల ద్వారా సహాయము చేయుట.

13. గణాంక వివరముల సేకరణ :

పంచాయతీ సమితికి గాని, జిల్లాపరిషత్తుకు గాని, ప్రభుత్వమునకు గాని అవసరమైనట్టి గణాంక వివరములను సేకరించుట, క్రోడీకరించుట.

14. స్వయం సహాయ కార్యక్రమము :

ఉత్పత్తిని అధికము చేయుటకు, ఆదాయములను జీవన ప్రమాణములను పెంచుటకు, పారిశుద్ధ్యమును బాగుచేయుటకు ప్రజలకు సదుపాయములు కలిగించుటకు యుక్తమగు కార్యక్రమములను రూపొందించుట, వాటిని అమలుపరచుట.

15. ట్రస్టులు :

పంచాయతీ సమితి యొక్క నిధులను ఏ కార్యముల నిమిత్తము వినియోగింపనగునో ఆ కార్యములను సాధించుటకు ఉద్దేశింపబడిన ట్రస్టుల నిర్వహణ.



# నిబంధనలు

ఆంధ్ర ప్రదేశ్ పంచాయతీ సమితుల జిల్లా పరిషత్తుల చట్టము 1959. క్రింద గవర్నమెంటువారిచే అనేక నిబంధనలు (రూల్సు) జారీచేయబడుతూ వచ్చినవి. ఈ పుస్తకములో 1961 ఆగస్టు 15 వ తేదీ వరకు జారీ చేయబడిన నిబంధనలు (రూల్సు) చేర్చబడినవి.

89

# విషయ సూచిక

## పంచాయతీ సమితుల జిల్లా పరిషత్తుల చట్టము క్రింద గవర్న్మెంటు వారిచే జారీచేయబడిన నిబంధనలు


| | | పేజి |
|---|---|---|
| 1 | పంచాయతీ సమితుల జిల్లా పరిషత్తు సభ్యుల ఎన్నికల నిబంధనలు | 93 |
| 2 | షెడ్యూల్డుతెగల ప్రతినిధిని ఎన్నుకొనువిషయములో ఉండుశాతము | 104 |
| 3 | నిమ్నతెగలనుండి ఎన్నికఅయిన సభ్యుల శాతమునకు సంబంధించిన ఉత్తరువులు | 105 |
| 4 | సమితి అధ్యక్ష ఉపాధ్యక్షుల యొక్కయు, పరిషత్తు చైర్మను, వైస్ చైర్మనుయొక్కయు ఎన్నికనిర్వహణకు సంబంధించిన నియమావళి | 106 |
| 5 | సభ్యులగుటకు అనర్హతలు, ప్రస్తుతమున్న కంట్రాక్టులలో లాభము మినహాయింపులు | 113 |
| 6 | సమితుల పరిషత్తుల యొక్క స్థాయీ సమితుల ఎన్నిక నిర్వహణ | 114 |
| 7 | స్త్రీల, పిల్లల క్షేమముకొరకు స్టాండింగు కమిటీ ఏర్పాటు | 121 |
| 8 | సమితియొక్క స్థాయీ సమితి అధికార విధులు | 123 |
| 9 | సమితి, పరిషత్తు లేక దాని స్థాయీ సమితియొక్క సమావేశములో వ్యవహార నిమిత్తము చేసిన నిబంధనలు | 127 |
| 10 | సమితి, పరిషత్తుల ఋణముల నియమావళి | 145 |
| 11 | సంస్థలు రెండు లేక ఎక్కువ పంచాయతీలచే ఉమ్మడిగా స్థాపింపబడి, నిర్వహింపబడుట | 152 |
| 12 | గ్రామాధికారులవద్దనుండి సమాచారములు తెప్పించుటకు నిబంధన | 153 |
| 13 | ఆంధ్రప్రదేశ్ ఎన్నికల నిర్వహణ, పంచాయతీ సమితి తాత్కాలిక అధ్యక్షుని యొక్కయు, జిల్లా పరిషత్తు తాత్కాలిక అధ్యక్షుని యొక్కయు అధికారముల విధుల నియమావళి | 154 |
| 14 | పంచాయతీలపై బ్లాకు డెవలప్మెంటు ఆఫీసర్ల పర్యవేక్షణాధికారములకు సంబంధించిన నియమావళి | 161 |
| 15 | చట్టరూపేణా నిర్మింపబడిన పంచాయతీ సమితుల జిల్లా పరిషత్తుల వివిధ తరగతి సభ్యులను నియమించుటకు లేక బదిలీ చేయుటకు అర్హతగల అధికారికి సంబంధించిన నిబంధనలు | 163 |
| 16 | జిల్లా తరగతిలో చేరిన పదవులకు ఎన్నిక కమిటీ నిర్మాణమునకు సంబంధించిన నిబంధనలు | 180 |

17 ఏన్నిక తరగతికి విలేజి లెవెల్ వర్కర్లు, గ్రామ సేవికల యొక్క ఉద్యోగముల పెంపుకు సంబంధించిన నిబంధనలు 186

18 సమితి సభ్యులు సమితి సమావేశములకు హాజరైనందులకు చెల్లించు బత్తెములు 193

19 సమితి అధ్యక్షులు బ్లాకులో పర్యటించినందుకు మైలేజీ, దిన బత్తెములకు సంబంధించిన నియమావళి 193

20 సమితి విధిని వినియోగింపదగు కార్యములను నిర్ణయించు నియమావళి 194

21 సమితి, పరిషత్‌లలోని ఆఫీసర్ల, ఉద్యోగుల జీతము, భత్యముల బకాయీలు, జీతభత్యములలో పెంపులు ఇచ్చుటకు నిబంధనలు 208

22 స్టాంపు రుసుములపై వచ్చు సర్‌చార్జీని పరిషత్‌లకు, సమితులకు పంపకము చేయుటకు సంబంధించిన నియమము 210

23 సమితులకు, పరిషత్‌లకు రాష్ట్రి పన్నులలో ఒక భాగమును చెల్లించుటకు నిబంధనలు 211

24 సమితులకు భూమి ఆదాయములో ఒక భాగము చెల్లించుటకు నిబంధనలు 211

25 పంచాయతీలు బడ్జెటును పంచాయతీ సమితికి సమర్పించవలసిన ఆఖరు తేదీ 212

26 సమితులు, పరిషత్‌లు రిజిష్టర్లను, అక్కౌంట్లను నిర్వహించుటకు సంబంధించిన నియమావళి 212

27 లోకల్‌ఫండు అక్కౌంట్ల పరిశీలకుని ఆడిటరుగా నియమించుట 220

28 అవిశ్వాస తీర్మానమునకు సంబంధించిన నియమావళి 221

29 సమితి, పరిషత్‌లలో ఖాళీలను భర్తీచేయుట 223

30 సంయుక్త సమితుల ఏర్పాటు, అధికారములు విధానక్రమమునకు సంబంధించిన నియమావళి 223

31 పంచాయతీ సమితి కాని బ్లాకులనుండి మెంబర్లను ఎన్నుకొను నియమావళి 225

32 జిల్లా పరిషత్ యొక్క కార్యదర్శి అధికారములకు, కర్తవ్యములకు సంబంధించిన నియమావళి 230

33 జిల్లా పరిషత్ యొక్క స్థాయీ సమితి అధికారములను, విధులను నిర్ణయించు నియమావళి 232

34 ప్లానింగు, స్థానిక పరిపాలనశాఖ 1 వ ఏప్రెల్ 1960 నుంచి జిల్లా పరిషత్‌లకు వప్పజెప్పిన గ్రామ రోడ్డు అభివృద్ధి కో-ఆపరేటివ్ స్కీములు, గ్రామ ప్లానులలోని రోడ్డులు 237

35 గవర్నమెంటు శాఖల పనులు, అధికారములు జిల్లా పరిషత్‌లకు బదిలాయింపు 245
36 అనధికార సభ్యులకు ప్రయాణ బత్తెములు చెల్లించు నియయావళి 261
37 పరిషత్ చైర్మన్‌కు అతని ప్రయాణములకు భత్యములను చెల్లించుటకు సంబంధించిన మార్పు నిబంధనలు 252
38 పరిషత్ నిధి ఏ కార్యములకొరకు వినియోగింపబడవలెనో వాటిని నిర్ణయించు నియమావళి 253
39 పట్టణ సమితుల, పంచాయతీ సమితుల నిధులు ఖర్చు చేయుటకు నిబంధనలు 265
40 పన్నుల విధింపుకు సంబంధించిన తీర్మానములను ప్రకటనలను ప్రచురించవలసిన విధానము 266
41 పంచాయతీ సమితులకును, జిల్లా పరిషత్‌లకును రావలసిన ఆదాయములకు సంబంధించిన రికార్డులను రిజిష్టర్లను పరిశీలించుటకై నియమావళి 268
42 సమితి చేపట్టిన నిర్మాణములను, పథకములను మంజూరుచేయు అధికారములను నిర్ణయించు నియమావళి 268
43 పరిషత్ చేపట్టిన నిర్మాణములను, పథకములను మంజూరుచేయు అధికారములను నిర్ణయించు నియమావళి 272
44 ప్రొసీడింగుల యొక్క గాని, రికార్డుల యొక్క గాని ప్రతుల మంజూరీకి సంబంధించిన నియమావళి 276
45 వస్తువులు, సరకులు, నిర్వాసుల సరఫరా కొరకు ఖరారులకు సంబంధించిన నియమావళి 278
46 రాబట్టుకొనుటకు వీలులేని పన్నులు, రుసుములు మున్నగువాటిని రైటాఫ్ చేయు అధికారములను నిర్ణయించు నియమావళి 282
47 కౌలుదార్లకు, కంట్రాక్టర్లకు శిస్తుమాఫీ, మంజూరు చేయు అధికారమును నిర్ణయించు నియమావళి 284
48 ఎన్నికలు ఏర్పాటు చేయుటను గురించిన నిబంధనను భాషాంతరీకరణకు సంబంధించిన నిబంధనలు 286
49 పంచాయతీ సమితుల, జిల్లా పరిషత్తుల ఎన్నికల వివాదముల తీర్పుకు సంబంధించిన నియమములు 87
50 పంచాయతీ సమితి కేంద్రమును నిర్ణయించుటకు నిబంధనలు 296
51 సమితుల, పరిషత్‌ల వాటి స్టాండింగు కమిటీల సమావేశముల నోటీసులు యిచ్చుటకు నిబంధనలు 299
52 సమితుల, పరిషత్‌లచే శెలవు దినములు మంజూరు చేయుటకు నిబంధన 300

53 పంచాయతీ సమితులకు ప్రాథమిక ఆరోగ్య కేంద్రములకు శాశ్వత అడ్వాన్సు-పంచాయతీ సమితులకు అధికారములను ఒప్పగించుట 300
54 నియమించే ప్రాథమిక ఆరోగ్య కేంద్రముల స్థాపితము, నిర్వహణ కొరకు నిబంధనలు 301
55 సమితుల, పరిషత్తుల చట్టము క్రింద వ్యక్తిగతమైన విషయములలో నిబంధనలను సడలించుటకు ప్రభుత్వపు అధికారములను గురించిన నిబంధనలు 307
56 ప్రభుత్వ ఉద్యోగస్తులు కానివారి విషయములో శెలవు మంజూరు చేయుటకు, ప్రొబేషను డిక్లేరు చేయుటకు అర్హతగల అధికారులు 307
57 ఉప నిబంధనలను చేయుటకు సంబంధించిన నియమావళి 308
58 కంటెంజన్సీలనుండి చెల్లింపబడు పదవుల మంజూరుకొరకు స్థానిక పరిపాలనా ఇనస్పెక్టరు జనరలుకు అధికారముల ఒప్పగింపు 309
59 పంచాయతీ సమితులు, జిల్లా పరిషత్తులు యొక్క ఆఫీసర్లు, ఉద్యోగస్తులకు బయానా చెల్లింపును క్రమపరచు నిబంధనలు 310
60 జిల్లా పరిషత్తుల కార్యదర్శుల జీతములకు సంబంధించిన నిబంధనలు 319
61 పంచాయతీ సమితుల, జిల్లా పరిషత్తుల క్రింద ప్రాథమిక పాఠశాలలలో నియమించబడిన నేతపని, వడకుట నేర్పువారికి అర్హతలను నిర్ణయించు నిబంధనలు 319
62 పంచాయతీ సమితులు. జిల్లా పరిషత్‌ల ఆఫీసర్లు ఉద్యోగుల విషయములో పెన్షనుకు సంబంధించిన విరాళములు; పెన్షనుల విషయములో నిబంధనలు 320
63 కలెక్టరు కార్యాలయములో ఉప భూస్వాముల రిజిష్టరుకు సంబంధించిన ఆంధ్రప్రదేశ్ (ఆంధ్ర) జిల్లా బోర్డు నిబంధనల అన్వయము, అనువర్తింపు 321
64 ప్రభుత్వపు ముద్రణాలయములో ఫారములు, రిజిష్టర్లుయొక్క కొనుగోలుకు సంబంధించిన నిబంధన 323
65 పంచాయతీలు లేక టౌను కమిటీలచే విధింపబడిన పన్నులమీద లేక భూమిపన్ను మీద పంచాయతీ సమితులచే సర్‌చార్జీ విధించుటకు పరిమితులు నిర్ణయించు నిబంధనలు 324
66 పంచాయతీ సమితులు, జిల్లా పరిషత్‌ల ఆఖరి తరగతుల ఉద్యోగులకు శెలవు.భత్యములు మంజూరుచేయుటను క్రమపరచు నిబంధనలు 324
67 పంచాయతీ సమితులు జిల్లా పరిషత్‌లచే వారి ఆఫీసర్లకు, ఉద్యోగులకు పారితోషికముల మంజూరును క్రమపరచుటకు నిబంధనలు 328

## 1. పంచాయతీ సమితుల జిల్లాపరిషత్తు సభ్యుల ఎన్నికల నిబంధనలు

(జి. ఓ. యస్ నెం. 889 ప్రణాళిక – అభివృద్ధిశాఖ, సెప్టెంబరు 1959)

# నియమావళి

## ఉపక్రమణిక

1. ఈ నియమావళిలో, సందర్భము అన్యథా కోరిననే తప్ప—

(i) "చట్టము" అనగా 1959 ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సమితుల. జిల్లా పరిషత్‌ల చట్టము అని అర్థము;

(ii) "విభాగము" అనగా ఈ చట్టములోని విభాగము అని అర్థము.

(iii) ఈ నియమావళిలో వాడబడినను నిర్వచింపబడని మాటలు పదజాలములు చట్టములో వాటికి యీయబడిన అర్థములనే కలిగి యుండవలెను.

# 2వ భాగము

2. పంచాయతీ సమితి సభ్యుల ఎన్నిక-

(i) 4వ సెక్షనులోని సబ్ సెక్షను (1) యొక్క క్లాజు (iii) లో తెలిపిన సభ్యుల ఎన్నిక, ఈ నిబంధనలకు చేర్చిన నమోనా (ఫారము) లో దీనికొరకు ఏర్పరుపబడి జిల్లా కలెక్టరు లేక ఆయన దీనికొరకు అధికారమిచ్చిన ఏ గవర్నమెంటు గెజిటెడ్ ఆఫీసరు చేతగాని అధ్యక్షత వహింపబడిన ఒక ప్రత్యేక సమావేశమువద్ద 4వ సెక్షనులోని సబ్ సెక్షను (1) యొక్క క్లాజులు (i), (ii)లో తెలుపబడిన పంచాయతీ సమితి సభ్యులవల్ల పంచాయతీ సమితి ఆఫీసులో జరుపబడును.

(ii) సమావేశమగు తేదీకి కనీసము 14 పూర్తియైన దినములకు ముందుగా సమావేశపు నోటీసు తేదీని, సమావేశపు కాలమును శెక్షను 4 లోని సబ్ శెక్షను (1) యొక్క (i), (ii) క్లాజులలో తెలియపరచిన పంచాయతీ సమితి సభ్యులకు ఈ నిబంధనలకు అంటించిన నమోనా (ఫారము) లో యివ్వబడును.

(iii) సబ్ రూలు (ii) లో సూచించిన నోటీసును అందజేయుట లేక దానిని పంపుట ఈ క్రింది విధమున జరుపబడును.

(a) ఆ వ్యక్తికి ఆ నోటీసు యిచ్చుట లేక అందజేయుట, లేక

(b) ఆ వ్యక్తి కానరాకుండిన, అతని కుటుంబములోని ఏ పెద్దవారికి గాని లేక పనిచేయువానికి గాని దానిని యిచ్చుట లేక అందజేయుట లేక ఆ నోటీసును అతడు ఆఖరున వున్న తెలిసిన నివాస స్థలము లేక వ్యాపారము చేయు స్థలమువద్ద వదలివేయుట; లేక

(c) పైన తెలుపబడిన పద్ధతులు ఏమియు వీలు లేకుండిన, ఆ స్థలము లోని ప్రాముఖ్య భాగములో గాని, నివాస స్థలములో గాని, అతడు వ్యాపారము చేయు స్థలములో గాని అతికించుట, మరియు

(d) ఆ వ్యక్తి పంచాయతీ సమితి కేంద్రములో నివసించకపోయిన పక్షమున, అతని వేరే స్థలపు చిరునామా పంచాయతీ సమితి బ్లాక్ డెవలప్ మెంటు ఆఫీసరుకు తెలిసిన పక్షమున, సర్టిఫికేట్ అఫ్ పోష్టింగు పొందిన తరువాత దానిని తపాలాద్వారా ఆతనికి పంపుట,

(2) 2వ నిబంధన తరువాత, ఈ క్రింది నిబంధన చేర్చవలయును.

"2. A (i) 4వ సెక్షనులోని 1వ సబ్ సెక్షనుయొక్క క్లాజు(iii)లో తెలిపిన పంచాయతీ సమితి సభ్యుడు క్రింద ఎన్నికకు ఒక వ్యక్తిని నియమించుటకు యిష్టపడు ఏ సభ్యుడైనను, నోటీసు జారీచేసిన తరువాత ఆరవ దినము దాటకుండా వున్న అధ్యక్షత వహించు ఉద్యోగస్థుడు నియమించు తేదీన ఈ నిబంధనలకు అంటించిన ఫారము నెం III లో రెండవ సభ్యునిచే యుక్తముగా ఆమోధింపబడిన నామినేషనును పంచాయతీ సమితి ఆఫీసులో బ్లాక్ డెవలప్‌మెంటు ఆఫీసరువద్ద దాఖలు చేయవలెను.

(ii) అధ్యక్షత వహించు ఉద్యోగస్థుడు, సబ్‌రూలు (i) లో తెలుపబడిన నామినేషన్లు గ్రహించుటకు తేదీ అంత్యమయిన తరువాత రెండవ దినము మించకుండ ఆతనిచే నియమింపబడిన తేదీన పంచాయతీ సమితి ఆఫీసు వద్ద నామినేషనులు తనిఖీ చేయును. నామినేషను చెల్లునా, చెల్లదా అను విషయములో అతని తీర్పు ఆఖరు.

(iii) అధ్యక్షత వహించు ఉద్యోగస్థుడు, తనిఖీ చేయుటకు నియమితమయిన తేదీ అంత్యమయిన తరువాత మూడవ దినము దాటకుండగా ఉన్న దినమున పంచాయతీ సమితి నోటీసు బోర్డుమీద ఎవరి నామినేషనులు చెల్లదగినవో వారి పేర్లను ప్రచురించును.

(iv) నామినేషను విడుచుకొనుటకు యిష్టపడు ఏ దరఖాస్తుదారుడైనను పంచాయతీ సమితి మెంబర్ల ఎన్నిక కొరకు ఏర్పరుపబడిన సమావేశపు దినమునకు ముందు దినమున ఆ విధముగా చేయవచ్చును.

(3) ప్రస్తుతమున్న 4, 4A నిబంధనలు వదలబడినవి.

(4) 11వ నిబంధనలో, సబ్‌రూలు (a) కు, ఈ క్రింది ప్రత్యామ్నాయముగా నుంచబడును.

(a) "పంచాయతీ సమితి" "బ్లాక్ డెవలప్‌మెంటు ఆఫీసరు" ఎచ్చట వున్న, అచ్చట ''జిల్లా పరిషత్", "సెక్రిటరీ" వరుసగా ప్రత్యామ్నాయముగా ఉంచబడును.

(5) ప్రస్తుతము ఈ నిబంధనలు చివర యున్న అధికారమిచ్చు ఫారము "ఫారము నెం. 1" గా గుర్తింపబడును.

(6) ప్రస్తుతమున్న ఈ నిబంధనలకు అంటించిన "నోటీసు ఫారము" నకు ఈ క్రింద యివ్వబడిన ఫారము, ఫారము నెం. IIగా ప్రత్యామ్నాయము చేయబడును.

## ఫారము II

# ఎన్నిక నోటీసు

(2 (ii) నిబంధన చూడుము)

1959వ ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సమితుల, జిల్లా పరిషత్తులచట్టము యొక్క 4వ శెక్షనులోని సబ్‌సెక్షను (1) యొక్క క్లాజు (iii) లో నిర్దిష్టమైన సభ్యుల ఎన్నిక కొరకు నోటీసు, శ్రీ ............ పంచాయతీ సమితి సభ్యుడు గారికి, పంచాయతీ సమితి సభ్యుల ఒక ప్రత్యేక సమావేశము...వ దినమున... గంటలకు సమితి కార్యాలయమువద్ద జరుపబడునని ఇందు మూలముగా యివ్వడమైనది. సభ్యుడు వీలు చేసుకొని సమావేశమునకు హాజరు కావలసినదిగా కోరబడుచున్నాడు,

సభ్యునకు అతని ఎఋకకు నామినేషన్లకు సంబంధించిన ఈక్రింది వివరములు కూడ యివ్వబడుచున్నవి.

(i) నిబంధనలో నిర్ణయించబడిన ఫారము II లో నామినేషన్ కాగితములు, దరఖాస్తుదారు చేత గాని లేక అతనిని సంకల్పించే వ్యక్తిచేత గాని

...తారీఖున పంచాయతీ సమితి కార్యాలయమువద్ద బ్లాక్ డెవలప్‌మెంటు ఆఫీసరుకు ప్రొద్దుట... గంటలమధ్య, మధ్యాహ్నము... గంటలమధ్య దాఖలు చేయబడవలయును.

(i)... తేదీన... గంటలమధ్య, నామినేషను పేపర్లు పంచాయతీ సమితి ఆఫీసువద్ద తనిఖీకి తీసుకొనబడును.

(iii) ... తారీఖున, పంచాయతీ సమితి కార్యాలయపు నోటీసు బోర్డు మీద ఎవరి నామినేషన్లు చెల్లదగినవో వారి పేర్లు ప్రచురింపబడును.

(iv) ఎన్నిక నుండి విడుదలగుటకు దరఖాస్తు దారుని నోటీసు ... తారీఖున... గంటలమధ్య పంచాయతీ సమితి కార్యాలయమువద్ద, దరఖాస్తు దారునిచే గాని లేక అతనిని సంకల్పించే వ్యక్తిచేతగాని బ్లాక్ డెవలప్‌మెంటు అఫీసరుకు యివ్వబడవలయును.

7. ఈ క్రింది ఫారము ఫారము III గా చివర చేర్చట మయినది.

## ఫా ర ము III

# నామినేషను కాగితము

(నిబంధన 3 (1) చూడుము)

1959 వ ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సమితుల జిల్లా పరిషత్తుల చట్టముయొక్క 4వ సెక్షనులోని సబ్ సెక్షను (1) యొక్క క్లాజు (iii) యొక్క... సబ్ క్లాజు క్రింద నిర్దిష్టమయిన సభ్యుని ఎన్నిక కొరకు దరఖాస్తు దారునిగా శ్రీ/శ్రీమతి/కుమారి ... ను నేను యిందుమూలముగా నియమించు చున్నాను.

1) ప్రొపోజరు యొక్క పూర్తి విలాసము.

2) సెకండరుయొక్క పూర్తి విలాసము.

3) దరఖాస్తు దారుని తండ్రి/భర్త పేరు.

4) దరఖాస్తు దారుని పూర్తి తపాలా అడ్రసు.

తారీఖు

ప్రపోజరు సంతకము

సెకండరు సంతకము

---

(దరఖాస్తుదారునిచే నింపబడవలయును)

పై తెలుపబడిన దరఖాస్తుదారుడు అయిన నేను......నామినేషనుకు యిందుమూలముగా సమ్మతిని తెలుపుచున్నాను.

తారీఖు ............................ దరఖాస్తుదారుని సంతకము.

ఆదనపు ప్రకటన నిమ్నజాతి కాని కులముకు చెందిన దరఖాస్తుదారునిచే యివ్వబడవలయును.

నేను నిమ్నజాతికి లేక కులమునకు చెందిన వాడనని నేను......... ఇందుమూలముగా ప్రకటించుచున్నాను.

దరఖాస్తుదారుని సంతకము.

(3) (i) అట్టి సమావేశములో అధ్యక్షత వహించు అధికారి అట్టి ఎన్నికలో ఓటు చేయు హక్కు కలిగియుండరాదు.

(ii) సభ్యుల ఎన్నిక, 4వ విభాగము (1)వ ఉప విభాగము (iii)వ ఖండములో తెలుపబడిన వరుస ప్రకారము జరుపబడవలెను. స్థానములలో ఒక స్థానమునకు సభ్యుడు ఎన్నుకొనబడనిచో, ఆ వరుసలో తరువాతి స్థానమునకు ఎన్నిక జరుపబడవలెను.

అయితే—

(ఎ) ఒక బ్లాకులోని షెడ్యూల్డు తెగల జనాభా ఆ బ్లాకుయొక్క మొత్తము జనాభాలో నిర్ణీత శాతముకంటె తక్కువగా ఉన్నదని జిల్లా కలెక్టరు ప్రకటించు నెడల 4వ విభాగము 1 వ ఉప విభాగము (iii)వ ఖండముయొక్క (బి),(సి) ఉప ఖండములలో నిర్దిష్టపరుపబడిన రెండు స్థానములకు షెడ్యూల్డు కులముల ప్రతినిధుల ఎన్నిక ఒకే సమయమున జరుపబడవలెను.

(బి) 4వ విభాగము (1)వ ఉప భాగము (iii) వ ఖండములోని (డి) ఉప ఖండముక్రింద ఎన్నుకొనబడవలసిన ఇరువురు వ్యక్తుల విషయములో మొదట ఒక స్త్రీయును, అటుపిదప అందు నిర్దిష్టపరుపబడిన అనుభవము గల వ్యక్తులలో ఒక వ్యక్తియు ఎన్నుకొనబడవలయును.

4 (i) ఎన్నిక కొరకు ఒక అభ్యర్థి ఒక సభ్యునిచే ప్రతిపాదింపబడి, మరియొక సభ్యునిచే బలపరుప బడవలెను.

అయితే ప్రతిపాదించు సభ్యుడు ఏ అభ్యర్థినైన ప్రతిపాదించునపుడు ఎన్నికకు ఒక సభ్యుడుగా నిలచుటకు ఆ అభ్యర్థి అంగీకారమును తెలుపుచు

లిఖిత పూర్వకమైన డిక్లరేషనును అధ్యక్షత వహించు అధికారికి అందజేయ వలెను. అట్టి డిక్లరేషనుపై ఆ అభ్యర్థిచేతను ప్రతిపాదించు సభ్యుని చేతను సంతకము చేయబడవలెను.

(ii) ఏ అభ్యర్థుల నామ నిర్దేశములు చెల్లవో వారి పేర్లను అధ్యక్షత వహించు అధికారి నిరాకరించవలెను. షెడ్యూలు కులములకు లేక షెడ్యూలు తెగలకు గాను కేటాయింపబడిన స్థానములకు ఎన్ని విషయములో, ప్రతిపాదింపబడిన అభ్యర్థులు, సందర్భానుసారముగా షెడ్యూలు కులములకు లేక షెడ్యూలు తెగలకు చెందిన వారేనని అధ్యక్షత వహించు అధికారి నిర్ధారణ చేసికొనవలెను.

(iii) సక్రమముగా ప్రతిపాదింపబడి బలపరుపబడిన తదితర అభ్యర్థు లందరి పేర్లు అధ్యక్షత వహించిన అధికారిచే చదివి వినిపించబడవలెను.

(iv) A * ఒక అభ్యర్థి ఎన్నికల ఫలితములు ప్రకటనకు ముందు ఎప్పుడైనా, తన అభ్యర్థిత్వము ఉపసంహరించుకొన వచ్చును.

(v) అభ్యర్థుల సంఖ్య స్థానముల సంఖ్యకు సమానముగా నున్నచో, ఏట్టి ఎన్నిక లేకుండగనే, వారు సక్రమముగా ఎన్నిక అయినట్లు ప్రకటింపబడవలెను.

(vi) అట్టి అభ్యర్థుల సంఖ్య స్థానముల సంఖ్యకు తక్కువ ఉన్నచో, అధ్యక్షత వహించు అధికారి వారందరును సక్రమముగా ఎన్నికయినట్లు ప్రకటించి క్రొత్త నామ నిర్దేశములను కోరవచ్చును లేదా మిగిలిన ఖాళీని లేక ఖాళీలను నింపుటకుగాను ఎన్నికలను పంచాయతీ సమితి యొక్క తరువాతి సమావేశమునకు వాయిదా వేయవలెను.

(vii) (1) అట్టి అభ్యర్థుల సంఖ్య స్థానముల సంఖ్యకు మించుచో రహస్య బేలెటుద్వారా ఎన్నిక జరుపబడి ఆ సమావేశములో హాజరై యున్న సభ్యుల వోట్లు తీసికొనబడవలెను.

(2) (1) వ ఉప నియమము క్రింద సభ్యుల వోట్లు తీసుకొనబడ వలసి యున్నపుడు, (ఇంగ్లీషు/తెలుగులో వ్రాయబడిన) అభ్యర్థుల పేర్ల అక్షర క్రమములో వారికి వరుస నెంబర్లు కేటాయించ బడవలెను.

* ఈ నిబంధన క్రొత్తగా చేర్చబడినది. జి. ఓ. మిస్. నెం. 397 ప్లానింగు అభివృద్ధి శాఖ, మార్చి 21, 1960.

అటు పిదప అధ్యక్షత వహించు అధికారి, ప్రతి అభ్యర్థికి కేటాయింపబడిన వరుస నెంబరును సభ్యులకు తెలుపవలెను.

(viii) (1) అధ్యక్షత వహించు అధికారి బ్యాలెటు పెట్టెను ఏర్పరుపవలెను, అట్లు బ్యాలెటుపెట్టె వోటు పత్రములను దానిలో వేయుటకేగాని ఆ పెట్టె తాళము తీయకుండ దానిలోనుండి వాటిని పైకి తీయుటకు వీలు లేకుండునట్లు తయారు చేయబడవలెను.

(2) అధ్యక్షత వహించు అధికారి వోట్లను తీసికొనుటకు సద్యఃపూర్వము అచ్చట హాజరై ఉన్న సభ్యులు ఆ బ్యాలెటు పెట్టె ఖాళీగా ఉన్నట్లు చూచునట్లుగా దానిని వారికి ఖాళీగా చూపించి పిదప తాళమును వేసి, దానిపై తన సీలును వేయవలెను. ఆ సీలు పగులగొట్టకుండ దానిని తీయుటకు వీలులేనట్టి విధముగా వేయబడవలెను.

(3) వోటు చేయదలచిన ప్రతి సభ్యునకు వోటు పత్రము సరఫరా చేయబడవలెను. ఆ కాగితముపై ఈ క్రింది నమూనాలో (ఇంగ్లీషు/తెలుగులో) అట్టి అందరు అభ్యర్థుల పేర్లు ప్రెపు చేయబవవలెను లేదా స్పష్టముగా వ్రాయబడవలెను.—

| పేరు. | వోటు. |
|---|---|
| (1) | |
| (2) | |
| (3) | |

అధ్యక్షత వహించు అధికారి ఆ వోటు పత్రమును వోటర్లకు సరఫరా చేయుటకు ముందు దాని నిజాయితీని సూచించుటకుగాను దానిపై ఒక ముద్రను కూడ వేయవలెను. అటుపిదప వోటర్లు వోటింగునకు గాను ప్రత్యేకింపబడిన స్థలమునకు పోయి అచ్చట వోటు పత్రములో తాను ఏ అభ్యర్థికి వోటు చేయదలచెనో ఆ అభ్యర్థి పేరున కెదురుగా ఒక గుర్తు పెట్టవలెను. ఆయన అటు పిదప రహస్యము కాపాడు నిమిత్తము ఆ వోటు పత్రమును మడచి అధ్యక్షత వహించుచున్న అధికారికి తదితర సభ్యులకును కనపడునట్లు ఉంచబడిన బ్యాలెటు పెట్టెలో దానిని వేయవలెను. చదువు రాని లేక వోటు చేయుటకు అశక్తుడైన సభ్యుని విషయములో అధ్యక్షత వహించు అధికారి ఆ సభ్యుని కోర్కెపై, వోటింగునకు గాను ప్రత్యేకింపబడిన స్థలమునకు ఆయనను తీసి

కొనిపోయి, ఆయన ఎవరికో వోటు చేయవలసినది అడిగి తదనుసారముగా గుర్తుపెట్టి, రహస్యము కాపాడుటకై దానిని మడచి, బ్యాలెటు పెట్టెలో వేయ వలెను. అధ్యక్షత వహించు అధికారి బ్యాలెటు రహస్యముగా నుండునట్లు చేయుటకై అవసరమగువట్టి అన్ని ఏర్పాట్లను చేయించవలెను.

(4) అధ్యక్షత వహించు అధికారి వోటింగు ముగిసిన వెంటనే హాజరై ఉన్న సభ్యుల సమక్షమున ఆ బ్యాలెటు పెట్టును తెరచి దానిలోనుండి వోటు పత్రములను తీసి లెక్కించి, వాని సంఖ్యను ఒక స్టేటుమెంటులో రికార్డు చేయ వలెను. వోటు పత్రము ఈ దిగువ సందర్భములో చెల్లనేరదు.

(ఏ) దానిపై వోటరు సంతకము ఉన్నయెడల, లేక దానిలో ఆయనను పోల్చుకొనుటకు వీలగు ఏదైన మాట, చిహ్నము, కనబడుగుర్తు ఉన్నచో లేక

(బి) దానిపై భర్తీ చేయబడవలసిన ఖాళీలకు మించి అభ్యర్థులకు ఎదురుగా గుర్తులు పెట్టబడి యున్నచో, లేక

(సి) దానిపై, ఇరువురు లేక ఎక్కువ మంది అభ్యర్థులలో ఏ ఒక్కరికి వోటు ఈయవలెనని ఉద్దేశింప బడినదో అనుమానాస్పదముగా నుండునట్లు గుర్తుపెట్టబడి యున్నచో, లేక

(డి) దానిపై ఎట్టి గుర్తు గాని పెట్టబడి యుండనిచో, లేక

(ఇ) (3) వ ఉప నియమములలో నిర్ణయింపబడిన ముద్ర దానిపై లేనిచో,

(5) అధ్యక్షత వహించు అధచారి :-

అందరికంటె ఎక్కువ వోట్లు వచ్చిన అభ్యర్థి, లేక ఒకటి కంటె ఎక్కువ స్థానములు ఉన్నచో: ఎన్ని స్థానములు భర్తీ చేయబడవలసి యున్నవో అంతమంది ఎక్కువ వోట్లు వచ్చి సక్రమముగా ఎన్నికైనట్లు ప్రకటింపవలెను. ఎవరైన ఇద్దరు అభ్యర్థులకు లేక ఎక్కువ మంది అభ్యర్థులకు సమాన సంఖ్య గల వోట్లు వచ్చియుండి. ఆ అభ్యర్థులలో ఒకరికి లేక ఎక్కువ మందికి ఒక వోటు కలిపినచో ఆయన లేక వారు సక్రమముగా ఎన్నిక అయినట్లు ప్రకటింపబడుటకు అవకాశ మున్నచో అధ్యక్షత వహించు అధికారి, సభ్యుల సమక్షమున చీట్లు వేయుటద్వారా నిర్ణయింపవలెను. ఏ అభ్యర్థి పేరు చీటీ తీయబడునో ఆ అభ్యర్థి అట్టి అదనపు వోటును పొందు నట్లుగా భావింప బడవలెను.

(6) అధ్యక్షత వహించు అధికారి సమావేశము ముగిసిన వెంటనే—

(ఎ) సమావేశములోని ప్రొసీడింగుల రికార్డును తయారు చేసి, దానిపై సంతకము చేసి అంది సరిదిద్ద బడిన ప్రతిచోట తన చిన్న సంతకముచేసి, ఆ సమావేశములకు హాజరైన సభ్యుడెవ్వరైన అట్టి రికార్డుపై సంతకము చేయ గోరినచో అట్లు సంతకము చేయుటకు కూడ అనుమతింపవలెను.

(బి) పంచాయతీ సమితి సభ్యులుగా ఎన్నుకొనబడిన వ్యక్తుల పేర్లను తెలుపు ఒక నోటీసుపై తాను సంతకము చేసి దానిని పంచాయతీ సమితి నోటీసు బోర్డుపై ప్రకటింపవలెను. అట్టి నోటీసు ప్రతి నొక దానిని జిల్లా కలెక్టరుకు, ప్రభుత్వము వారికి పంపవలెను.

(7) (1) అధ్యక్షత వహించు అధికారి, అటు పిదప ప్రతి అభ్యర్థి విషయములో లెక్కపెట్టబడిన లేక నిరాకరింపబడిన ఓటు పత్రములను వేర్వేరు కట్టలుగా కట్టి, ప్రతి కట్టను సీలు చేసి, అందులో వున్నవాటి వివరములను అవి యే ఎన్నికకు చెందినవో ఆ ఎన్నికను, దాని తేదీని వ్రాయవలెను.

(2) ఒక ఎన్నిక న్యాయాలయము, లేక అందుకు అధికారము గల ఇతర న్యాయాలయము యొక్క ఉత్తరువు క్రింద తప్ప, ఈ కట్టలు విప్పబడరాదు, వాని లోనివి పరిశీలింపబడరాదు, లేక తెచ్చి చూపబడరాదు.

(3) ఈ కట్టలు సంబంధించిన పంచాయతీ సమితి కార్యాలయములో ఒక సంవత్సరముపాటు పదిలపరుపబడి, అందుకు అధికారముగల న్యాయాలయముచే అందుకు అన్యథా ఆదేశింపబడిననే తప్ప, నాశనము చేయబడవలెను.

# 3వ భాగము

## 11. జిల్లా పరిషత్తునకు కొందరు సభ్యుల ఎన్నిక

పంచాయతీ సమితి సభ్యుల ఎన్నికకు సంబంధించిన 2వ భాగములోని నిబంధనలు, 3 (ii) నియమములోని మినహాయింపు నిబంధనయొక్క (బి) ఖండము తప్ప, మిగిలిన వన్నియు ఈ క్రింది మార్పులకు లోబడి, 36 వ విభాగము (3) వ ఉప విభాగములో (8) వ ఖండము క్రింది జిల్లా పరిషత్తు సభ్యుల ఎన్నికకు వర్తింపవలెను, అవేవనగా ;—

(ఏ) "పంచాయతీ సమితి" అని ఎక్కడ పేర్కొనబడినను అక్కడ దానికి బదులు "జిల్లా పరిషత్" అని పేర్కొనబడవలెను.

(బి) 3 వ నియమములో (i) వ ఉప నియమమునకు బదులు ఈ క్రిందిది ఉంచబడవలెను. "సమావేశ అధ్యక్షుడు అట్టి ఎన్నికలో ఓటు చేయుటకు హక్కు కలిగి యుండవలెను."

(సి) 2 వ నియమములో 4 వ విభాగము (1) వ ఉప విభాగము (i), (ii) ఖండములు అనువానికి బదులు 36 వ విభాగము, (3) వ ఉప విభాగములో (i) నుండి (vii) ఖండములు వుంచబడవలెను.

(డి) 2 వ నియమములో 4 వ విభాగము, (1) వ ఉప విభాగము (iii) వ ఖండము అను దానికి బదులు, 36 వ విభాగము 3 వ విభాగము యొక్క (viii) వ ఖండము ఉంచబడవలెను.

(ఇ) 3 వ నియమము (ii) వ ఉప నియమములో 4 వ విభాగము, (1) వ ఉప విభాగము (iii) ఖండము అను దానికి బదులు, 36 వ విభాగము 3 వ విభాగము (3) వ ఉప విభాగముయొక్క (viii) వ ఖండము ఉంచబడవలెను.

(ఎఫ్) 3వ నియమము (ii)వ ఉప నియమములోని (ఏ) మినహాయింపు నిబంధనలో (4)వ విభాగము, (1)వ ఉప విభాగము (iii)వ ఖండము (బి), (సి) ఉప ఖండములు అను దానికి బదులు 36 వ విభాగము, (3)వ ఉప విభాగము, (viii) వ ఖండము, (బి), (సి) ఉప ఖండములు అని ఉంచబడవలెను.

మరియు,

(జి) 6 వ నియమము, (బి) ఉప నియమములో తెలుపబడిన నోటీసు ప్రతిని ప్రభుత్వమునకు పంపవలెను.

## 4 వ భాగము

### 12. సాధారణ లేక యాదృచ్ఛిక ఖాళీల భర్తీ

సందర్భానుసారముగా, ఒక పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ సభ్యుని పదవిలో సాధారణ లేక యాదృచ్ఛికమగు ఖాళీ ఏర్పడునప్పుడు అది భర్తీ చేయబడుటకు ఈ చట్టముయొక్క 8 వ విభాగములోని (2)వ ఉప విభా

గము, 12 వ విభాగము, 39 వ విభాగములోని (2) వ ఉప విభాగము 41 వ విభాగములోని నిబంధనలకు లోబడి, I నుంచి III భాగములలోని నియమావళి వర్తింపవలెను.

అయితే—

(ఎ) 2 వ నియమములో "ప్రత్యేక" అను మాటకు బదులు "సాధారణ" అను మాట వుంచవలెను.

(బి) ఖాళీ కాలము సాధారణముగా సభ్యత్వ కాలము ముగియుటకు సద్యఃపూర్వము మూడు నెలలకు తక్కువ వున్నచో ఎట్టి యాదృచ్ఛిక ఖాళీయును భర్తీ చేయరాదు.

(సి) పంచాయతీ సమితి అధ్యక్షుడు లేక ఆయన హాజరుగా లేనిచో ఉపాధ్యక్షుడు లేక ఆయన హాజరుగా లేనిచో ఆ సమావేశమునకు అధ్యక్షత వహించుటకుగాను హాజరైవున్న సభ్యులలో నుండి ఎంచుకొనబడిన ఒక సభ్యుడు ఆ యాదృచ్ఛికపు ఎన్నికను నిర్వహింపవలెను. అట్టి ఎన్నికలో ఓటు చేయు హక్కు ఆయనకు ఉండవలెను, మరియు

(డి) జిల్లా పరిషత్తు చైర్మను లేక ఆయన హాజరుగా లేనిచో వైస్ చైర్మను లేక ఆయన హాజరుగా లేనిచో, ఆ సమావేశమునకు అధ్యక్షత వహించుటకుగాను, హాజరైవున్న సభ్యులలోనుండి ఎంచుకొనబడిన ఒక సభ్యుడు ఆ యాదృచ్ఛికపు ఎన్నికను నిర్వహింపవలెను. అట్టి ఎన్నికలో ఓటు చేయు హక్కు ఆయనకు ఉండవలెను.

అధికార ప్రధాన పత్రపు నమూనా

[ 2 (i) వ నియమము చూడుడు ]

జిల్లా కలెక్టరునగు.......................(పేరు) అను

నేను 1959, ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సమితుల, జిల్లా పరిషత్తుల చట్టము (1959 లో 35వ ఆంధ్రప్రదేశ్ చట్టము)యొక్క 4వ విభాగము, (1) వ ఉప విభాగము, (iii) ఖండములో నిర్దిష్టపరుపబడిన సభ్యుల ఎన్నిక కొరకు సదరు చట్టము యొక్క 6 వ విభాగము, (1) వ ఉప విభాగము క్రింద ఏర్పాటు చేయబడిన...............పంచాయతీ సమితి సభ్యుల ప్రత్యేక సమావేశమునకు అధ్యక్షత వహించుటకై............(హోదా)

అగు శ్రీ..................................... గారికి ఇందుమూలమున అధికార మిచ్చుచున్నాను.

స్థలము. సంతకము.
తేది జిల్లా కలెక్టరు.
సీలు.

## నోటీసు నమూనా

(2 (i) నియమము చూడుడు.)

నెం. ...............కార్యాలయము.
తేదీ.........................

పంచాయతీ సమితి బ్లాకు సభ్యుడగు శ్రీ .................. గారికి ఇందుమూలమున తెలియజేయున దేమనగా,

1959 ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సమితుల జిల్లా పరిషత్తుల చట్టము యొక్క 4 వ విభాగము, (1) వ ఉప విభాగము, (iii) వ ఖండములో నిర్దిష్ట పరుపబడిన సభ్యుల ఎన్నికకై పంచాయతీ సమితి ప్రత్యేక సమావేశము ......... .. ....... ... తేదీన............... గంటలకు (సమయము) జరుప బడును. సభ్యుడు వీలు కలుగజేసుకొని సమావేశమునకు హాజరు కావలసినదిగా ప్రార్థన.

సంతకము
హోదా
సీలు

## 2. షెడ్యూలు తెగల ప్రతినిధిని ఎన్నుకొను విషయములో వుండు శాతము

1959, ఆంధ్ర ప్రదేశ్ పంచాయతీ సమితుల, జిల్లా పరిషత్తుల చట్టము (1959 లో 35 వ ఆంధ్రి ప్రదేశ్ చట్టము) యొక్క 4 వ విభాగపు (1) వ ఉప విభాగము (iii) వ ఖండము (సి) ఉప ఖండముతోను 36 వ విభాగము (3) వ ఉప విభాగము (viii) వ ఖండము (సి) ఉప ఖండముతోను చేర్చి చదువబడిన 69 వ విభాగపు (1) వ ఉప విభాగము ననుసరించి లభ్యమైన అధికారములను పురస్కరించుకొని ఆంధ్రి ప్రదేశ్ గవర్నరుగారు ఇందు మూలముగా ఈ క్రింది నియమమును చేయుచున్నారు. అదేదనగా :-

## నియమము

పంచాయతీ సమితి/జిల్లా పరిషత్తులో సభ్యుడుగా ఉండుటకు గాను షెడ్యూలు తెగల ప్రతినిధిని ఎన్నుకొను విషయములో షెడ్యూలుతెగల జన సంఖ్య, బ్లాకు/జిల్లాలోని మొత్తము జనసంఖ్యలో అయిదు శాతము ఉండవలెను.

## 3. నిమ్న తెగలనుండి ఎన్నిక అయిన సభ్యుల శాతముకు సంబంధించిన ఉత్తరువులు

[జి. ఒ. యమ్. యస్ నెం. 969, ప్లానింగు అభివృద్ధి (సమితి IV). 47వ అక్టోబరు 1959]

వారి బ్లాకులోని జనాభా ఆ బ్లాకు మొత్తము జనాభా నియమిత శాతము కన్న తక్కువ కాదని ఈ మధ్య తీసుకొన్న జనాభా లెక్కల నాధారము చేసి కొని జిల్లా కలెక్టరుచే ప్రకటింపబడినచో, 1959వ ఆంధ్ర ప్రదేశ్ పంచాయతీ సమితుల జిల్లా పరిషత్తు చట్టము (1959 ఆంధ్రప్రదేశ్ చట్టము XXXV) 4వ సెక్షను యొక్క (1)వ సబ్ సెక్షను యుక్క (iii)వ క్లాజు యొక్క సబ్ క్లాజు (c) ప్రకారము నిమ్న తెగలనుంచి ఒక ప్రతినిధి నియమితమైన పద్ధతిలో పంచాయతీ సమితికి ఎన్నిక కావలయును గాన; మరియు 1951 వ జనాభా రికార్డులలో నిమ్నజాతుల జనాభా బ్లాకు వరుసగా, గ్రామ వరుసగా కాకుండ టాక్టు వరుసగా మాత్రమే యిచ్చి వుండుటవల్ల:

పంచాయతీ సమితులకు ఎన్నిక కార్యముల కొరకు చెప్పబడిన చట్టము యొక్కదైన తెల్పిన ఏర్పాటు అమలు జరుపుటకు కష్టము ఏర్పడినందున. 1959వ ఆంధ్ర ప్రదేశ్ పంచాయతీ సమితి జిల్లా పరిషత్తుల చట్టము (1959వ XXXVవ ఆంధ్ర ప్రదేశ్ చట్టము) యొక్క 73వ సెక్షను యిచ్చిన అధికార ములను చలాయించి, ఆంధ్ర ప్రదేశ్ గవర్నరు, ఆ కష్టమును తొలగించు టకు ఈ క్రింది వుత్తరువును ఇందు మూలముగా చేయడమైనది.

ఆ చట్టము 3వ సెక్షను (1)వ సబ్‌సెక్షను యొక్క (iii)వ క్లాజు యొక్క సబ్‌క్లాజు (c) క్రింద బ్లాకులో నిమ్న తెగల జనాభా శాతమును ప్రక టించుటకు, జిల్లా కలెక్టరు, ఈ క్రింది సూత్రమునను సరించి బ్లాకులో నిమ్న తెగల జనాభాను అంచనా వేయును,

X = తాలుకాలో నిమ్న తెగల జనాభా.

Y = తాలుకా మొత్తము జనాభా.

Z=బ్లాకు మొత్తము జనాభా.

బ్లాకులో నిమ్న తెగల జనాభా $= \frac{X}{Y} \times Z$

## 4. పంచాయతీ సమితి అధ్యక్ష ఉపాధ్యక్షుల యొక్కయు, జిల్లా పరిషత్తు చైర్మను, వైస్‌చైర్మను యొక్కయు ఎన్నిక నిర్వహణకు సంబంధించిన నియమావళి

### 1 వ భా గ ము

ఉపక్రమణిక

1. ఈ నియమావళి 1959, ఆంధ్ర ప్రదేశ్ (పంచాయతీ సమితి అధ్యక్ష, ఉపాధ్యక్షుల యొక్క లేక జిల్లా పరిషత్తు చైర్మన్, వైస్ చైర్మన్‌ల యొక్క ఎన్నిక నిర్వహణ) నియమావళి అని పిలువబడును.

2. ఈ నియమావళిలో సందర్భము అన్యథా కోరిననే తప్ప—

(i) "చట్టము" అనగా 1959, ఆంధ్ర ప్రదేశ్ (పంచాయతీ సమితుల; జిల్లా పరిషత్తుల చట్టము (1959లో 35వ ఆంధ్రప్రదేశ్ చట్టము) అని అర్థము,

(ii) "విభాగము" అనగా చట్టము యొక్క విభాగము అని అర్థము;

(iii) ఈ నియమావళిలో ఉపయోగించబడి నిర్వచించబడని మాటలు, పదజాలములు చట్టములో వాటికిగల అర్థములనే కలిగి యుండవలెను.

### 2 వ భా గ ము

పంచాయతీ సమితి అధ్యక్షుని ఎన్నిక.

3. పంచాయతీ సమితి అధ్యక్షుని ఎన్నిక, పంచాయతీ సమితి కార్యలయములో ఇందు నిమిత్తము కలెక్టరుచే ప్రత్యేకముగా ఏర్పాటు చేయబడిన సమావేశములో జరుగవలెను; అట్టి సమావేశమునకు కలెక్టరు లేక ఈ నియమావళికి అనుబంధింపబడిన నమూనాలో జిల్లా కలెక్టరుచే అధికార మీయబడిన ఎవరేని ప్రభుత్వ గెజిటెడు అధికారి అధ్యక్షత వహించవలెను. అట్టి అధికారి ఎన్నికలో ఓటు చేయుటకు హక్కు కలిగి యుండరాదు.

4. (1) పంచాయతీ సమితి సభ్యులకు, అట్టి సమావేశము యొక్క తేదీని, సమయమును తెలుపుచు ఈ నియమావళికి అనుబంధింపబడిన నమూనాలోనున్న నోటీసు, ఆ సమావేశము జరుగు దినమునకు కనీసము పూర్తిగా అయిదు దినములు ముందు ఈయబడవలెను.

(2) అత్యవసర సందర్భములో కలెక్టరు, 3వ నియమములో తెలుపబడిన సమావేశమును (1)వ ఉపనియమములో నిర్దిష్ట పరుపబడిన వ్యవధికన్న తక్కువ వ్యవధి నోటీసును యిచ్చి సమావేశ యేర్పాటు చేయవచ్చును.

5. పంచాయతీ సమితి అధ్యక్ష పదవికి పోటీచేయు అభ్యర్థి ఒక సభ్యునిచే ప్రతిపాదింపబడిన మరియొక సభ్యునిచే బలపరుప బడవలెను. అట్లు సక్రమముగా ప్రతిపాదింపబడిన బలపరుపబడిన అభ్యర్థులందరి పేర్లు సమావేశమునకు ఆధ్యక్షత వహించు అధికారిచే చదివి వినిపించబడవలెను.

6. (1) ఒక అభ్యర్థి మాత్రమే సక్రమముగా ప్రతిపాదింపబడినచో ఎన్నిక ఉండకూడదు. ఆ అభ్యర్థి ఎన్నిక అయినట్లు ప్రకటింపబడవలెను.

(2) అట్టి అభ్యర్థులు ఇద్దరు లేక అంతకెక్కువ మంది యున్నచో రహస్య బ్యాలెటు పద్ధతిలో ఎన్నిక జరుపబడి సమావేశములో హాజరైఉన్న సభ్యుల ఓట్లు తీసుకొనవలెను.

(3) (2)వ ఉప నియమము క్రింద సభ్యుల ఓట్లు తీసికొన వలసినపుడు, అభ్యర్థులకు (ఇంగ్లీషు/తెలుగులో వ్రాయబడిన) వారి పేర్లు యొక్క అక్షర క్రమములో క్రమ సంఖ్యను కేటాయించవలెను. అటు తరువాత, అధ్యక్షత వహించు అధికారి ప్రతి అభ్యర్థికి కేటాయించబడిన క్రమ సంఖ్యను ప్రకటించవలెను.

7. (1) అధ్యక్షత వహించు అధికారి ఒక బ్యాలెటు పెట్టెను ఏర్పాటు చేయవలెను. అట్టి బ్యాలెటు పెట్టె, అందులో వోటు పత్రములు వేయుటకు వీలుండునట్లుగాను తాళము తీయకుండ పత్రములను అందులోనుండి వెలుపలకు తీయుటకు వీలులేకుండునట్లుగాను తయారు చేయబడవలెను.

(2) అధ్యక్షత వహించు అధికారి, వోట్లు తీసికొనుటకు సద్యఃపూర్వము బ్యాలెటు పెట్టె ఖాళీగా ఉన్నట్లు అచట హాజరైఉన్న సభ్యులకు చూపి

దానికి తాళమువేసి దానిపై తన సీలు వేయవలెను. అట్టి సీలు, దానిని పగలు గొట్టనిదే ఆ తాళము తీయుటకు సాధ్యము కాకుండు విధముగా వేయ వలెను.

(3) వోటు చేయగోరు ప్రతి సభ్యునికి ఈ క్రింది నమూనాలో ఇంగ్లీషు తెలుగులో అభ్యర్థులందరి పేర్లు టైపుచేయబడిన లేక స్పష్టముగా వ్రాయబడిన వోటు పత్రము ఈయబడవలెను:—

| పేరు. | వోటు. |
| --- | --- |
| (1) | |
| (2) | |
| (3) | |

అధ్యక్షత వహించు అధికారి, వోటు పత్రమును ఇచ్చుటకు పూర్వము దాని నిజాయితీని సూచించటకు దానిపై ముద్ర వేయవలెను. అటు తరువాత వోటరు, వోటు వేయుటకు ప్రత్యేకింపబడినట్టి స్థలమునకు పోయి వోటు పత్రములో తాను ఏ అభ్యర్థికి వోటు చేయగోరునో ఆ అభ్యర్థి పేరుకు ఎదురుగా గుర్తు పెట్టవలెను. అటుతరువాత అతడు, రహస్యమును కాపాడుటకుగాను వోటు పత్రమును మడతపెట్టి అధ్యక్షత వహించు అధికారికిని ఇతర సభ్యుల కును కనుపించునట్లు ఉంచబడి యుండు బ్యాలెటు పెట్టెలో దానిని వేయవలెను. సభ్యుడు నిరక్షరాస్యుడుడైనచో లేక వోటు చేయుటకు శారీరకముగా అశక్తు డైనచో అతడు కోరినమీదట అధ్యక్షత వహించు అధికారి అతనిని వోటుచేయు టకు ప్రత్యేకింపబడిన స్థలమునకు తీసికొని పోయి అతడు ఎవరికి వోటు వేయ దలచినాడో తెలిసికొనిన తరువాత ఆ ప్రకారము వోటు పత్రముపై గుర్తు పెట్టి రహస్యము కాపాడబడుటకుగాను, ఆ పత్రమును మడతపెట్టి దానిని బ్యాలెటు పెట్టెలో వేయవలెను. అధ్యక్షత వహించు అధికారి బ్యాలెటు రహస్యము కాపాడబడుటకు ఏర్పాట్లు చేయించవలెను.

(4) అధ్యక్షత వహించు వ్యక్తి, వోటింగు పూర్తి అయిన వెంటనే, హాజరైవున్న సభ్యుల సమక్షములో బ్యాలెటు పెట్టెను తెరచి అందులోనుంచి వోటు పత్రములను బయటకుతీసి వాటిని లెక్కించి, వాటి సంఖ్యను ఒక స్టేటుమెంటులో వ్రాయవలెను. ఈ క్రింది సందర్భములలో వోటు పత్రము చెల్లనేరదు :—

(ఎ) వానిపై ఓటరు సంతకమున్నచో లేక అది ఓటరును గుర్తించుటకు వీలుండెడి ఏదేని మాట, ఈ చిహ్నము లేక స్పష్టముగా కనిపించు గుర్తును కలిగియున్నదో, లేదా

(బి) ఒకటి కంటె ఎక్కువ పేర్లకు ఎదురుగా గుర్తులు వేయబడినచో, లేదా

(సి) ఇద్దరు లేక అంత కెక్కువ అభ్యర్థులలో ఏ ఒక్కరికి ఓటు వేయబడినదో తెలిసికొనుటకు సందేహాస్పదమగు విధముగా దానిపై గుర్తు పెట్టబడినచో, లేదా

(డి) దానిపై గుర్తు పెట్టబడనిచో, లేదా

(ఇ) అది (3) వ ఉప నియమములో నిర్ణయింపబడిన ముద్ర కలిగియుండనిచో

(5) అధ్యక్షత వహించు అధికారి అటు తరువాత,

(i) ఇద్దరు అభ్యర్థులు మాత్రమే ఉన్నచో. వాటిలో ఎక్కువ ఓట్లు వచ్చిన అభ్యర్థి సక్రమముగా ఎన్నిక అయినట్లు ప్రకటించవలెను. ఇద్దరు అభ్యర్థులకు ఓట్లు సమానముగా వచ్చినచో, అధ్యక్షత వహించు అధికారి సభ్యుల సమక్షములో చీట్లువేసి ఏ అభ్యర్థిపేర చీటీ మొదట తీయబడునో ఆ అభ్యర్థి సక్రమముగా ఎన్నిక అయినట్లు ప్రకటించవలెను.

(ii) అభ్యర్థులు ఇద్దరికి మించియున్నచో, అందరికంటె తక్కువ ఓట్లు వచ్చిన అభ్యర్థిని తొలగించి తిరిగి ఓట్లు తీసుకొనవలెను. అభ్యర్థు లందరికి ఓట్లు సమానముగా వచ్చిన సందర్భములో లేక జాబితాలో చివరగల అభ్యర్థులలో ఇద్దరు లేక అంతకు మించిన అభ్యర్థులకు ఓట్లు సమానముగా ఉన్నచో. అధ్యక్షత వహించు అధికారి, సభ్యుల సమక్షములో చీట్లను తీయుట ద్వారా అట్టి అభ్యర్థులలో ఎవరిని తొలగింపవలసినది నిర్ణయించవలెను. ఇట్టి తొలగింపు పద్ధతి చివరకు–ఇద్దరు అభ్యర్థులు మాత్రమే మిగులు వరకు మరల మరల అవలంభింపబడవలెను. అప్పుడు అక్షరుసారిగా ఓట్లు తీసికొనబడి ఏ అభ్యర్థికి ఎక్కువ ఓట్లు వచ్చునో ఆ అభ్యర్థిని సక్రమముగా ఎన్నిక అయినట్లు ప్రకటించవలెను. చివరి దశలోకూడ మిగిలిన ఇద్దరు అభ్యర్థులకు వచ్చిన ఓట్లు సమానముగా వున్నచో, అధ్యక్షత వహించు అధికారి, సభ్యుల సమక్షములో చీట్లు తీసి ఏ అభ్యర్థి పేరుగల చీటి మొదట తీయబడునో ఆ అభ్యర్థి సక్రమముగా ఎన్నిక అయినట్లు ప్రకటించవలెను.

8. ఏ అభ్యర్థియు బ్యాలెటులో పాల్గొనరాదు. అయితే ఒక అభ్యర్థి ఏదశలోనైనను తన అభ్యర్థిత్వమును ఉపసంహరించుకొనవచ్చును. అట్లు ఉపసంహరించుకొనిన తరువాత ఏ బ్యాలెటులోనైనను పాల్గొన వచ్చును. అదే విధముగా 7వ నియమము (5) వ ఉప నియమము (ii)వ ఖండము క్రింద ఏ దశలో నైనను తొలగింపబడిన ఒక అభ్యర్థి ఆ తరువాత దశలలో బ్యాలెటులో పాల్గొన వచ్చును.

9. అధ్యక్షత వహించు అధికారి, సమావేశము పూర్తిఅయిన వెంటనే:-

(ఎ) ఆ సమావేశము యొక్క ప్రొసీడింగుల రికార్డును తయారు చేసి దానిపై సంతకము చేయవలెను. దానిలో చేయబడిన ప్రతి దిద్దుబాటుపై తన చిన్న సంతకమును చేయవలెను; ఆ సమావేశమునకు హాజరై వున్న సభ్యుడెవరైనను ఆ రికార్డుపై సంతకము చేయగోరినచో అతనిని సంతకము చేయుటకు అనుమతింపవలెను.

(బి) పంచాయతీ సమితి నోటీసు బోర్డుపై, పంచాయతీ సమితికి అధ్యక్షుడుగా ఎన్నికైన వ్యక్తి పేరును తెలియజేయునట్టియు తనచే సంతకము చేయబడినట్టియు ఒక నోటీసును ప్రకటించవలెను. అట్టి నోటీసుయొక్క ఒక ప్రతిని జిల్లా కలెక్టరుకు పంపవలెను.

(సి) పంచాయతీ సమితికి అధ్యక్షుడుగా ఎన్నికైన వ్యక్తి పేరును, ఆంధ్ర ప్రదేశ గెజిటులో ప్రచురణ నిమిత్తము హైదరాబాదులోని ప్రభుత్వ ముద్రణాలయపు డైరెక్టరుకు కూడా పంపవలెను.

10. (1) అధ్యక్షత వహించు అధికారి, ఆ తరువాత ఒక్కొక్క అభ్యర్థికి సంబంధించిన వోటు పత్రములను,— అవి లెక్కింపబడిన వైనను లేక త్రోసివేయబడినవైనను— వేరువేరు కట్టలుగా కట్టి ప్రతి కట్టను సీలుచేసి ఆ కట్టలో వున్నవాటి వివరములను అది ఏ ఎన్నికకు సంబంధించినది ఎన్నిక తేదీని దానిపై వ్రాయవలెను.

(2) ఎన్నిక కోర్టు లేక ఇతర అర్హతగల కోర్టు ఉత్తరువు క్రింద తప్ప ఈ కట్టలను విప్పరాదు. వాటిలో వున్నవాటిని తనిఖీ చేయరాదు, లేదా తెచ్చి చూపరాదు.

(3) ఈ కట్టలు, పంచాయతీ సమితి కార్యాలయములో ఒక సంవత్సరము వరకు భద్రపరుప బడవలెను.

## 3 వ భా గ ము

### పంచాయతీ సమితి ఉపాధ్యక్షుని ఎన్నిక

11. అధ్యక్షుడు ఎన్నుకొనబడిన వెంటనే ఆయన ఆ సమావేశమునకు అధ్యక్షత వహించి 3 నుండి 10 వరకు గల నియమములందు ఏర్పరుపబడిన విధానములో పంచాయతీ సమితి ఉపాధ్యక్షుని ఎన్నికను జరిపించవలెను. సమావేశాధ్యక్షుడు అట్టి ఎన్నికలో వోటు చేయుటకు హక్కు కలిగియుండవలెను.

## 4 వ భా గ ము

### జిల్లా పరిషత్తు చైర్మను ఎన్నిక

12. పంచాయతీ సమితి అధ్యక్షుని ఎన్నికకు సంబంధించిన 2వ విభాగపు నిబంధనలు, ఈ క్రింది మార్పులకు లోబడి జిల్లా పరిషత్తు చైర్మను ఎన్నికకు వర్తించవలెను. ఆ మార్పు లేవనగా ;—

(ఎ) "పంచాయతీ సమితి" మరియు "అధ్యక్షుడు" అను మాటలు అందులో ఎచట వచ్చినను వాటికి బదులు క్రమముగా "జిల్లా పరిషత్తు" మరియు "చైర్మ"న్ అను మాటలు ఉంచబడవలెను;

(బి) 3 వ నియమములో పేర్కొనబడిన సమావేశము జిల్లా కలెక్టరుచే ఏర్పాటు చేయబడి ఆయనచే అధ్యక్షత వహించబడవలెను. ఆయన, ఎన్నికలో వోటు వేయుటకు హక్కు కలిగి యుండవలెను.

## 5 వ భా గ ము

### జిల్లా పరిషత్తు వైస్ చైర్మను ఎన్నిక

13. పంచాయతీ సమితి అధ్యక్షుని ఎన్నికకు సంబంధించిన 2 వ భాగపు నిబంధనలు, ఈ క్రింది మార్పులకు లోబడి, జిల్లా పరిషత్తు వైస్ చైర్మన్ ఎన్నికకు వర్తింపవలెను. అ మార్పు లేవనగా ;—

(ఎ) "పంచాయతీ సమితి" మరియు "అధ్యక్షుడు" అను మాటలు అందులో ఎచట వచ్చినను వాటికి బదులు క్రమముగా "జిల్లా పరిషత్తు"మరియు "వైస చైర్మన్" అను మాటలు ఉంచబడవలెను.

(బి) చైర్మన్ ఎన్నికయిన వెంటనే అతడు అధ్యక్షత వహించి 3 నుండి 10 వరకు గల నియమములందు ఏర్పరుపబడిన విధానములో వైస్ చైర్మన్ ఎన్నిక జరిపించవలెను. చైర్మన్, అట్టి ఎన్నికలో వోటు చేయుటకు హక్కు కలిగి యుండవలెను.

(సి) 9 వ నియమము యొక్క (బి) ఖండములో పేర్కొనబడిన నోటీసు యొక్క నకలును చైర్మను ప్రభుత్వమునకు పంపవలెను.

## 6 వ భాగము

### 14. యాదృచ్ఛిక ఖాళీలను భర్తీ చేయుట

7 వ విభాగములోని (3) వ ఉప విభాగము యొక్కయు, 37 వ విభాగములోని (3) వ ఉప విభాగము యొక్కయు నిబంధనలకు లోబడి, 1 నుండి 5 వరకు గల భాగముల యందలి నియమములు, సందర్భానుసారముగా, పంచాయతీ సమితి అధ్యక్ష, ఉపాధ్యక్షుల పదవిలో లేక జిల్లా పరిషత్తు చైర్మన్, వైస్ చైర్మను పదవిలో ఏర్పడు యాదృచ్ఛిక ఖాళీని భర్తీ చేయుటకు వర్తించవలెను :-

అయితే, ప్రతి యాదృచ్ఛిక ఖాళీ అట్టి ఖాళీ ఏర్పడిన తేదీ నుండి ఎనిమిది వారముల లోపల భర్తీ చేయవలెను.

అధికార ప్రదాన పత్రపు నమూనా

(3 వ నియమము చూడుడు)

జిల్లా కలెక్టరునగు ........................ (పేరు) అను నేను పంచాయతీ సమితి అధ్యక్షుని ఎన్నిక నిమిత్తము 1959, ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సమితుల, జిల్లా పరిషత్తుల చట్టము (1959 లో 35 వ ఆంధ్ర ప్రదేశ్ చట్టము యొక్క 7వ విభాగపు (2)వ ఉప విభాగము ననుసరించి ఏర్పాటు చేయబడిన.................. పంచాయతీ సమితి సభ్యుల ప్రత్యేక సమావేశమునకు అధ్యక్షత......వహించుటకై................ (హోదా) అగు శ్రీ.....................గారికి ఇందుమూలముగా అధికార మిచ్చుచున్నాను.

స్థలము (సంతకము)

తేదీ జిల్లా కలెక్టరు

(సీలు)

## నోటీసు నమూనా

(4 వ నియమము చూడుడు)

నెం. ............కార్యాలయము
తేదీ......................

..................పంచాయతీ సమితి/జిల్లా పరిషత్తు సభ్యుడనగు శ్రీ.........................గారికి ఇందుమూలమున తెలియజేయున దేమనగా పంచాయతీ సమితి/ జిల్లా పరిషత్తుయొక్క అధ్యక్ష, ఉపాధ్యక్షుల/ చైర్మన్‌ల యెన్నిక నిమిత్తము ప్రత్యేక సమావేశము.........తేదీ...... గంటలకు (సమయమున) పంచాయతీ సమితి/జిల్లా పరిషత్తు కార్యాలయములో కలుపబడును. సభ్యుడు వీలుకలుగజేసుకొని సమావేశమునకు హాజరు కావలసి నదిగా కోరడమైనది.

(సంతకము)...............
హోదా............ ... ...
(సీలు)

## 5. సభ్యులగుటకు అనర్హతలు ప్రస్తుతమున్న కాంట్రాక్టులలో లాభము-మినహాయింపులు-నియమించుట

[జి. ఒ. యమ్. యస్. నెం. 46. ప్లానింగు, స్థానిక పరిపాలన (సమితి–IV), 12 వ జనవరి 1960.]

నిబంధన

ఒక వ్యక్తి అతడు కేవలము ఈ క్రింది వాటిలో అతనికి భాగము లేక లాభమున్నదను కారణముచే బ్లాకుకు ఏర్పడిన పంచాయతీతో చేసిన కాంట్రాక్టు లేక దానికి చేయబడుచుండిన ఒక పనిలోగాని ఏ విధమైన ప్రయోజనమున్న ట్లుగా భావింపబడు (i) ఏదైన నియమము (లీజు), విక్రియము లేక స్థిరాస్తిని కొనుట లేక ఏదైన అగ్రిమెంటు; లేక (ii) డబ్బు అప్పు కొరకు ఏదైన అగ్రిమెంటు లేక డబ్బు చెల్లించుట కొరకు మాత్రమే ఏదైన సెక్యూరిటీ (iii) పంచాయతీ సమితి వ్యవహారములకు సంబంధించిన ఏ ప్రకటనగాని చేర్చిన

ఏ వార్తా పత్రిక; లేక (iv) అతడు క్రమము తప్పక వ్యాపారముచేయు ఏ వస్తువులనైనను పంచాయతీ సమితికి అమ్మట లేక కాంట్రాక్టుగాని లేక పని కాలములోగాని ఏ సంవత్సరములోనైనను మొత్తము మీద పదిహేను వందల రూపాయలకు మించకుండా ఏ విషయములోనైననను వున్న విలువకు ఏ వస్తువులనైనను పంచాయతీ సమితి నుండి కొనుట (v) అట్టి బ్లాకులో ఏ గ్రామము లేక తెగ లాభము కొరకు వాటి తరపున గ్రామ ప్రతినిధి లేక పూచీదారుడుగా, కాంట్రాక్టరుగా కాకుండ అట్టి బ్లాకుకు ఏర్పటిన చెప్పబడిన చట్టముయొక్క 74వ సెక్షనులో తెల్పిన తాత్కాలిక పంచాయతీ సమితి నుండి ఏ వ్యక్తివల్లనైన తీసికొనబడిన సహకార పని.

*[23 వ అక్టోబరు 1959 వ ఆంధ్రప్రదేశ్ అసాధారణ పార్టు I కు రూల్సు సప్లిమెంటులో 1 నుండి 65 పుటలలో ప్రచురింపబడినది.]

## 6. పంచాయతీ సమితుల, జిల్లా పరిషత్తుల యొక్క స్థాయీ సమితుల సభ్యుల ఎన్నిక నిర్వహణ

(మెమో నెం. 2084 ఎస్. II/159-2, ప్రణాళిక, అభివృద్ధి (సమితి IV) తేదీ 10-1959.)

### 1 వ విభాగము

ఉపక్రమణిక

1. ఈ నియమావళి 1959, ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సమితుల జిల్లా పరిషత్తుల యొక్క స్థాయీ సమితుల సభ్యుల నిర్వహణ నియమావళి అని పిలువబడును.

1. ఈ నియమావళిలో సందర్భము అన్యథా అపేక్షించిననే తప్ప,

(i) "చట్టము" అనగా 1959. ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సమితుల జిల్లా పరిషత్ల చట్టము (1959 లో 35 వ ఆంధ్రప్రదేశ్ చట్టము) అని అర్థము,

(ii) "విభాగము" అనగా చట్టములోని ఒక విభాగము అని అర్థము.

(iii) ఈ నియమావళిలో ఉపయోగింపబడియు నిర్వచింపబడని పదములను, పదజాలములను క్రమముగా వాటికి చట్టములో తెలుపబడిన అర్థమునే కలిగి యుండవలెను.

## 2 వ భాగము

### పంచాయతీ సమితియొక్క స్థాయీ సమితుల సభ్యుల ఎన్నిక

3. పంచాయతీ సమితి యొక్క ప్రతి స్థాయీ సమితికిని పంచాయతీ సమితి కార్యాలయమందు విడివిడిగా ఎన్నిక జరుగవలెను.

4. ఒకటికంటె ఎక్కువ స్థాయీ సమితులకు పంచాయతీ సమితి యొక్క ఒకే సమావేశమందు ఎన్నికలు జరుగు సందర్భములో ఆ స్థాయీ సమితులు 14వ విభాగమందు పేర్కొనబడిన క్రమములో ఆ ఎన్నికలు జరుప బడవలెను. అయితే ఏదైన స్థాయీ సమితి ఎన్నికలు 11 వ నియమము క్రింద వాయిదా వేయబడినచో ఆ క్రమములో తరువాత గల స్థాయీ సమితికి ఎన్నికలు జరుపవలెను.

5. స్థాయీ సమితి సభ్యుల ఎన్నిక నిమిత్తమైన సమావేశమునకు అధ్యక్షుడు అధ్యక్షత వహించవలెను. ఆయన హాజరుగానిచో ఉపాధ్యక్షుడు అధ్యక్షత వహించవలెను. అధ్యక్ష ఉపాధ్యక్షు లిరువురును హాజరు కానిచో, యెన్నికలో అభ్యర్థిగా పోటీ చేయుటకు ఉద్దేశించనట్టియు సమావేశమందు హాజరైవున్న సభ్యునిచే యెంచుకొనబడినట్టియు సభ్యుడు అధ్యక్షత వహించ వలెను. సమావేశాధ్యక్షుడు యెన్నికలో ఓటు చేయుటకు హక్కు కలిగి యుండవలెను.

6. సమావేశాధ్యక్షుడు అటు పిమ్మట 14 వ విభాగము (3) వ ఉప విభాగము యొక్క మొదటి మినహాయింపు నిబంధన క్రింద యెన్నుకొనవలసిన సభ్యుల సంఖ్యను గూర్చిన ప్రతిపాదనను పంచాయతీ సమితి నిర్ణయమునకు పెట్టవలెను. అభిప్రాయ భేదము ఏర్పడిన సందర్భములో చేతులెత్తు పద్ధతిని ఓటు జరుపుటద్వారా ఓట్ల వాహుళ్యమునుబట్టి నిర్ణయము జరుగవలెను. ఆ తరు వాత సమావేశాధ్యక్షుడు స్థాయీ సమితిలోని యెన్ని స్థానములు అట్టి సభ్యులు గానివారిలో నుండి భర్తీ చేయబడవలెనో ప్రకటించవలెను.

7. సమావేశాధ్యక్షుడు పంచాయతీ సమితి సభ్యులలోనుండి భర్తీ చేయ వలసిన స్థానములకు మొదట యెన్నిక జరుపవలెను.

8. సమావేశాధ్యక్షుడు ఏ స్థాయీ సమితికి యెన్నిక జరుగుచున్నదో దానిపేరును, సభ్యులలోనుండి భర్తీ చేయబడవలసిన స్థానముల సంఖ్యను తెలియజేయవలెను.

9. (1) యెన్నికకు నిలిచిన ప్రతి అభ్యర్థి ఒక సభ్యునిచే ప్రతిపాదింప బడి మరొక సభ్యునిచే బలపరుపబడవలెను.

అయితే 14వ విభాగము, (6)వ ఉప విభాగము యొక్క మినహాయింపు నిబంధనలకు లోబడి, ఏ సభ్యుడుగాని, ఆయన పంచాయతీ సమితియొక్క ఒక స్థాయీ సమితికి సభ్యుడుగా ఇదివరకే ఎన్నిక అయిన యెడల మరొక స్థాయీ సమితి సభ్యుడుగా ప్రతిపాదింపబడకూడదు.

(2) సక్రమముగా ప్రతిపాదింపబడి బలపరుపబడిన అభ్యర్థులందరి పేర్లను సమావేశాధ్యక్షుడు చదివి వినిపించవలెను.

9. (ఎ) అభ్యర్థి ఎన్నికల ఫలితములు ప్రకటనకు ముందు ఎప్పుడైనా తన అభ్యర్థిత్వము ఉపసంహరించుకొన వచ్చును.

10. అట్లు చదివి వినిపించిన అభ్యర్థుల సంఖ్య సభ్యుల సంఖ్యకు సమానముగా వున్నయెడల సమావేశాధ్యక్షుడు ఆ అభ్యర్థులందరు సక్రమముగా ఎన్నిక అయినట్లు ప్రకటించవలెను.

11. ఆ అభ్యర్థుల సంఖ్య స్థానముల సంఖ్యకంటె తక్కువగా వున్నచో సమావేశాధ్యక్షుడు ఆ అభ్యర్థులందరు సక్రమముగా ఎన్నికైనట్లు ప్రకటించి క్రొత్త నామనిర్దేశములను కోరవలెను లేక మిగిలిన ఖాళీనిగాని ఖాళీలనుగాని భర్తీచేయుటకు ఎన్నికను పంచాయతీ సమితియొక్క తదుపరి సమావేశమునకు వాయిదా వేయవలెను.

12. (1) ప్రతిపాదించిన అభ్యర్థుల సంఖ్య స్థానముల సంఖ్య కంటె ఎక్కువగా వున్నయెడల, రహస్య బ్యాలెటు పద్ధతిని ఎన్నిక జరుపబడి సమావేశమందు హాజరైవున్న సభ్యుల ఓట్లు తీసికొనబడవలెను.

(2) (1)వ ఉపనియమము క్రింద సభ్యుల ఓట్లు తీసికొనబడ వలసియున్నప్పుడు అభ్యర్థులకు వారి పేర్లయొక్క (ఇంగ్లీషు/తెలుగు) అక్షర క్రమములో వరుస సంఖ్యలు కేటాయింపబడవలెను. సమావేశాధ్యక్షుడు అటుపిమ్మట ప్రతి అభ్యర్థికి కేటాయింపబడిన వరుస సంఖ్యను సభ్యులకు తెలుపవలెను.

13. సమావేశాధ్యక్షుడు ఒక బ్యాలెటు పెట్టెను ఏర్పాటు చేయవలెను. అట్టి బ్యాలెటుపెట్టె, ఓటు పత్రములను దానిలో వేయుటకేగాని ఆ పెట్టె తాళము తీయకుండ వాటిని బయటకు తీయుటకు వీలు లేకుండునట్లు తయారు చేయబడినదై ఉండవలెను.

(2) సమావేశాధ్యక్షుడు, ఓట్లను తీసికొనుటకు సద్యఃపూర్వము అచ్చట హాజరైయున్న సభ్యులందరకును ఖాళీగావున్న బ్యాలెటు పెట్టెను అవి ఖాళీగా ఉన్నట్లు వారందరకు కనిపించు విధముగా చూపించి, ఆ పిదప దానికి తాళము

వేసి దానిపై తన సీలు వేయవలెను. ఆ సీలును పగుల గొట్టిననేగాని పెట్టెను తెరచుటకు వీలులేని విధముగా సీలు వేయవలెను.

(3) ఓటు చేయదలనిన ప్రతి సభ్యునకు ఒక ఓటు పత్రిము ఈయ బడవలెను. ఆ పత్రముపై ఈ క్రింది నమూనాలో ఇంగ్లీషులో లేక తెలుగులో ఆ అభ్యర్థులందరి పేర్లు పైపు చేయబడవలెను లేక స్పష్టముగా వ్రాయబడ వలెను.

| | పేరు | ఓటు |
|---|---|---|
| (1) | | |
| (2) | | |
| (3) | | |

సమావేశాధ్యక్షుడు, ఓటు పత్రమును ఇచ్చుటకుముందు, దాని ప్రామాణి కతను సూచించుటకుగాను దానిపై ముద్రకూడ వేయవలెను. అటు పిమ్మట ఓటరు ఓటు చేయుటకు ప్రత్యేకింపబడిన స్థలమునకుపోయి, ఖాళీ లెన్నిగలవో, అంతమంది అభ్యర్థులలో ఎవరెవరికి తాను ఓటు చేయదలచెనో ఆ యా అభ్య ర్థుల పేర్ల కెదురుగా ఆ ఓటుపత్రమందు గుర్తుపెట్టవలెను. ఆయన అటు పిదప రహస్యమును కాపాడు నిమిత్తము ఆ ఓటు పత్రిమును మడచి, సమావేశాధ్య క్షునకును ఇతర సభ్యులకును కనుపించునట్లు వుంచబడిన బ్యాలెటు పెట్టెలో దానిని వేయవలెను. చదువురాని లేక ఓటు చేయుటకు శారీరకముగా అశక్తు డైన సభ్యుడు ఎవరైన కోరినచో, సమావేశాధ్యక్షుడు ఓటు చేయుటకు ప్రత్యే కింపబడిన స్థలమునకు అయనను తీసికొనిపోయి, ఆయన ఎవరెవరికి ఓటు చేయదలచినది అడిగి తెలిసికొని, తదను సారముగా ఓటు పత్రముపై గుర్తు పెట్టి రహస్యమును కాపాడుటకై దానిని మడచి, బ్యాలెటు పెట్టెలో వేయ వలెను. సమావేశాధ్యక్షుడు బ్యాలెటు రహస్యముగా జరుగుటకు తగు ఏర్పాట్లు చేయించవలెను.

(4) సమావేశాధ్యక్షుడు, ఓటింగు ముగిసిన వెంటనే, హాజరై యున్న సభ్యుల సమక్షమున ఆ బ్యాలెటు పెట్టెను తెరచి దానిలో నుండి ఓటు పత్రము లను తీసి, లెక్కించి వాటి సంఖ్యను ఒక పట్టికలో వ్రాయవలెను.

ఓటు పత్రము ఈ దిగువ సందర్భములలో చెల్లనేరదు :-

(ఎ) దానిపై ఓటరు సంతకము ఉన్నచో, దానిలో ఆయనను పోల్చు కొనుటకు వీలగు ఏదైన మాట, చిహ్నము లేక కనబడు గుర్తు ఉన్నచో, లేక

(బి) దానిపై భర్తీ చేయబడవలసిన ఖాళీలకన్న ఎక్కువమంది అభ్యర్థు లకు ఎదురుగా గుర్తులు పెట్టబడియున్నచో; లేక

(సి) దానిపై, ఇరువురు లేక అంతకంటె ఎక్కువమంది అభ్యర్థులలో ఎవరికి ఓటు చేయవలెనని ఉద్దేశింపబడినదో తెలిసికొనుట అనుమానాస్పద ముగా ఉండునట్లు గుర్తు పెట్టబడియున్నచో, లేక

(డి) దానిపై ఎటి గుర్తుగాని పెటబడి యుండనిచో; లేక

(ఇ) దానిపై 3 వ ఉప నియమములో నిర్ణయింపబడిన ముద్ర లేనిచో

(5) ఆ తరువాత సమావేశాధ్యక్షుడు అందరికంటె ఎక్కువ ఓట్లు వచ్చిన అభ్యర్థి లేక ఒకటికంటె ఎక్కువ స్థానములున్నచో ఎన్ని స్థానములు భర్తీ చేయబడవలసి యున్నవో అంతమంది ఎక్కువ ఓట్లు వచ్చిన అభ్యర్థులు సక్రమముగా ఎన్నిక అయినట్లు ప్రకటించవలెను. ఎవరైన ఇరువురు లేక అంతకు ఎక్కువమంది అభ్యర్థులకు ఓట్లు సమానముగా వచ్చియుండి, ఆ అభ్యర్థులలో ఎవరైన ఒకరికి లేక అంతకు ఎక్కువ మందికి ఒక ఓటు కలిపినచో, ఆయన లేక వారు సక్రమముగా ఎన్నిక అయినట్లు ప్రకటింపబడుటకు అవకాశమున్నచో, సమావేశాధ్యక్షుడు సమావేశమందు హాజరైయున్న సభ్యుల సమక్షమున చీట్లు వేయుటద్వారా దానిని నిర్ణయించవలెను. ఏ అభ్యర్థిపేరు గల చీటీ, ముందు తీయబడునో ఆ అభ్యర్థి అట్టి అదనపు ఓటు పొందినట్లు భావింపబడవలెను.

14. అభ్యర్థులుగా సక్రమముగా ప్రతిపాదింపబడి, బలపరుపబడిన సభ్యులుకూడ బ్యాలెటులో పాల్గొనవచ్చును.

15. అ తరువాత సమావేశాధ్యక్షుడు, పంచాయతీ సమితి సభ్యుడు గాని వ్యక్తులకు ప్రత్యేకింపబడిన స్థానము లేక స్థానములకు, 8 నుండి 14 వరకు గల నియమములలో నిర్దేశింపబడిన విధముగను 14 వ విభాగము, (3) ఉప విభాగములో గల నిబంధనలకు అనుగుణముగను ఎన్నిక జరుపవలెను.

అయితే

(i) ప్రతిపాదించు వ్యక్తి, ఏ అభ్యర్థి యొక్క పేరును ప్రతిపాదించు నప్పుడు, సంబంధించిన స్థాయీ సమితి ఎన్నికలో పోటీ చేయుటకు అభ్యర్థి సమ్మతించినట్లు వ్యక్తపరచుచు సమావేశాధ్యక్షునకు లిఖితపూర్వకమైన డిక్లరేషనును అందజేయవలెను. ఆ డిక్లరేషనుపై అభ్యర్థియు ప్రతిపాదించు వ్యక్తియు సంతకము చేయవలెను.

(ii) సమావేశాధ్యక్షుడు, నామనిర్దేశములు చెల్లుబడి కాని అభ్యర్థుల పేర్లను తోసిపుచ్చవలెను. షెడ్యూలు కులములవారికి ప్రత్యేకింపబడిన స్థానమునకు జరుగు ఎన్నిక సందర్భంలో, అభ్యర్థి షెడ్యూలు కులములకు జెందిన వాడేనని కూడ ఆయన నిర్ధారణ చేసికొనవలెను.

(iii) 14వ విభాగము; (i) వ ఉప విభాగము, (iii)వ ఖండములో నిర్దిష్ట పరుపబడిన విషయాలకు సంబంధించిన స్థాయీ సమితి సందర్భమున, ఎన్నిక మొదట స్త్రీ ప్రతినిధికిని అటు పిమ్మట షెడ్యూలు కులముల ప్రతినిధికిని జరుపవలెను. /

16. సమావేశాధ్యక్షుడు, సమావేశము ముగిసిన వెంటనే —

(ఎ) సమావేశపు ప్రొసీడింగుల రికార్డును తయారుచేసి, దానిపై సంతకము చేసి; సరిదిద్దబడిన ప్రతిచోట తన చిన్న సంతకము చేయవలెను; ఆ సమావేశమునకు హాజరైన సభ్యు డెవరైనను; అట్టి కార్డుపై సంతకము చేయ గోరినచో, అట్లు సంతకము చేయుటకు అనుమతింప వలెను; మరియు

(బి) ప్రతి స్థాయీ సమితికిని సభ్యులుగా ఎన్నుకొనబడిన వ్యక్తుల పేర్లను తెలుపుచు ఒక నోటీసును, దానిపై తాను సంతకము చేసి, పంచాయతీ సమితి నోటీసు బోర్డుపై ప్రచురింపవలెను. అట్టి నోటీసు ప్రతి నొకదానిని కలెక్టరునకును, ప్రభుత్వమునకును పంపవలెను.

17. (1) సమావేశాధ్యక్షుడు, అటు పిమ్మట, ప్రతి స్థాయీ సమితికి సంబంధించిన లెక్క పెట్టబడినట్టియు లేక త్రోసిపుచ్చబడినట్టియు ఓటు పత్రములను వేర్వేరు ప్యాకెట్లలో పెట్టి ప్రతి ప్యాకెట్టుకు సీలువేసి, అందులో వున్న పత్రముల వివరములను, అవి ఏ ఎన్నికకు చెందినవో ఆ ఎన్నిక వివరమును అది జరిగిన తేదీని దానిపై వ్రాయవలెను.

(2) ఎన్నికల న్యాయాలయము లేక అర్హమైన ఇతర న్యాయాలయము యొక్క ఉత్తరువు క్రింద తప్ప ఈ ప్యాకెట్లను విప్పుటగాని అందలి పత్రములను పరిశీలించుటగాని ఎవరికైనను చూపుటగాని చేయరాదు.

(3) ఈ ప్యాకెట్లు పంచాయతీ సమితి కార్యాలయములో ఒక సంవత్సరముపాటు పదిల పరుపబడి, అటుపిమ్మట, అర్హమైన న్యాయాలయము అన్యథా ఆదేశించిననే తప్ప, నాశనము చేయబడవలెను.

## 3వ భాగము

### జిలా పరిషత్తుయొక్క స్థాయీ సమితుల సభ్యుల ఎన్నిక

18. పంచాయతీ సమితియొక్క స్థాయీ సమితి సభ్యుల ఎన్నికకు సంబంధించిన 2వ భాగపు నిబంధనలు ఈ క్రింది మార్పులకు లోబడి, జిల్లా పరిషత్తుయొక్క స్థాయీ సమితి సభ్యుల ఎన్నికకు వర్తింపవలెను;

అవేవనగా—

(ఎ) "పంచాయతీ సమితి" "అధ్యక్షుడు", "ఉపాధ్యక్షుడు" అను మాటలు ఎచ్చట వచ్చినను వాటికి బదులు వరుసగా "జిల్లాపరిషత్తు" "చైర్మను" "వైస్ చైర్మను" అను మాటలను ఉంచవలెను.

(బి) 4వ నియమములో "14వ విభాగము" అను దానికి బదులు "43వ విభాగము" అను దానిని ఉంచవలెను;

(సి) 6వ నియమములో "14వ విభాగము, (3)వ ఉప విభాగము యొక్క మొదటి మినహాయింపు నిబంధన" అను దానికి బదులు, "43వ విభాగము, (3)వ ఉప విభాగము, (ఎ) ఖండము యొక్క (iv)వ మినహాయింపు నిబంధన" అనుదానిని ఉంచవలెను;

(డి) 9వ నియమము, (1)వ ఉప నియమము యొక్క మినహాయింపు నిబంధనలో "14వ విభాగము, (6)వ ఉప విభాగము" అను దానికి బదులు "43వ విభాగము, (5)వ ఉప విభాగము" అను దానిని ఉంచవలెను;

(ఇ) 15వ నియమములో "14వ విభాగము, (3)వ ఉప విభాగము" అను దానికి "43వ విభాగము (3)వ ఉప విభాగము" అను దానిని ఉంచవలెను.

(ఎఫ్) 15 వ నియమముయొక్క (iii)వ మినహాయింపు నిబంధనలో "14వ విభాగము, (1)వఉపవిభాగము, (iii)వ ఖండము" అనుదానికిబదులు "43వ విభాగము, (1)వ ఉపవిభాగము, (iv) వ ఖండము" అను దానిని ఉంచవలెను;

(జి) 16వ నియమముయొక్క (బి) ఉప నియమములో తెలుపబడిన నోటీసు ప్రతిని సమావేశాధ్యక్షుడు ప్రభుత్వమునకు పంపవలెను.

## 4 వ భాగము

19. పంచాయతీ సమితియొక్కయు, జిల్లాపరిషత్తుయొక్కయు స్థాయీ సమితి సభ్యుల ఎన్నికకు సంబంధించిన 2వ భాగము, 3వ భాగములయొక్క నిబంధనలు యాదృచ్ఛిక ఖాళీలకు సభ్యులను ఎన్నుకొను సందర్భములోను వర్తించవలెను.

అయితే సాధారణముగా సభ్యత్వ కాలము ముగియుటకు సద్యః పూర్వము మూడు నెలలకు తక్కువ ఉన్నచో ఎట్టి యాదృచ్ఛిక ఖాళీగాని భర్తీ చేయబడరాదు.

సమితి—I

## 7. స్త్రీల, పిల్లల క్షేమముకొరకు స్టాండింగు కమిటీ ఏర్పాటు

(జి. ఒ యమ్. యస్. నెం. 1553, ప్లానింగు స్థానిక పరిపాలన (స-1) 1 వ డిసెంబరు 1960 నెం. 578.)

### 1 వ షెడ్యూలు

(1) పంచాయతీ సమితి అధ్యక్షునితోసహా స్టాండింగు కమిటీ తొమ్మండుగురు సభ్యులను కలిగియుండును. వారిలో అధమము ఆరుగురు సభ్యులు స్త్రీలుగను, ఇద్దరు సభ్యులు నిమ్నజాతుల, తెగల నుండి ఉందురు.

(2) చట్టముయొక్క 4వ సెక్షను (1)వ సబ్ సెక్షనుయొక్క (iii)వ క్లాజు (a), (b) సబ్ క్లాజులక్రింద ఎన్నికఅయిన పంచాయతీసమితి ఇద్దరు స్త్రీ సభ్యులు స్టాండింగు కమిటీయొక్క ఉద్యోగధర్మమునుబట్టి సభ్యులుగా ఉందురు.

(3) బ్లాకు నివాసస్థులు అయిన పంచాయతీ సమితి సభ్యులుగాని ఇద్దరు స్త్రీలు, బ్లాకులో పనిచేయుచున్న మహిళామండలుల యొక్క సభ్యులనుండి ఎన్నుకొనబడుదురు.

(4) పంచాయతీ సమితి సభ్యురాలుకాని ఒక స్త్రీని నిమ్నజాతుల నుండి ఎన్నుకొనబడును,

(5) ముగ్గురు వ్యక్తులలో కనీసము ఒక స్త్రీ మరియు నిమ్నజాతుల లేక నిమ్నతెగలకు చెందిన ఒకవ్యక్తి పంచాయతీ సమితి సభ్యులనుండి గాని లేక పంచాయతీ సమితి సభ్యులు కాని వ్యక్తులనుండిగాని ఎన్నుకొనబడుదురు.

(6) (3) నుండి (5) పేరాలలో నిర్దిష్టమైన సభ్యులు, పంచాయతీ సమితిసభ్యులచే 69వ శెక్షను యొక్క (1)వ సబ్‌సెక్షను, 15వ సెక్షను యొక్క (3)వ సబ్‌సెక్షను క్రింద చేయబడిన నిబంధనల ననుసరించి ఎన్నుకొన బడుదురు,

## IIవ షెడ్యూలు

1. గ్రామ సేవికలు ముఖ్య సేవికలచే చేయబడినపని.
2. స్త్రీలకు జాతి సంస్థలు, ఉదా: మహిళా మండలులు, బాల్‌వాడిస్ పిల్లల క్లబ్బులు.
3. వయోజన విద్య, స్త్రీల సాహిత్యము.
4. స్త్రీలకు ఆర్థిక కార్యకలాపము-కుటీర గ్రామ పరిశ్రమలు, పంటతోటలు, కోళ్ళు మొదలగు జంతువులను పెంచుట.
5. గృహాభివృద్ధి.
6. సంసారమును పోషించుట.
7. సంసారముకు గుడ్డలు యిచ్చుట.
8. శిశు సంరక్షణ.
9. క్లుప్తముగా డబ్బు జాగ్రత్త పెట్టుకొనుట.
10. జాతిలో అబలమైన తరగతులు — హరిజనులు, వెనుకబడిన తరగతి స్త్రీలు.

11. ప్రసూతి స్త్రీల, శిశు సంరక్షణ కేంద్రములు.
12. స్థానిక విద్యకు పూర్వపు విద్య పాఠశాలలు.
13. స్త్రీల, పిల్లల క్షేమముకు సంబంధించిన కాలము వెంబడి ప్రారంభించు ప్రత్యేక స్కీములు.
14. స్త్రీల గృహములు, తలదాచుకొను స్థలములు మొదలైనవి.
15. సాంస్కృతిక కార్య కలాపములు.
16. స్త్రీలకు పిల్లలకు కేవలము ఉద్దేశించబడిన ఏ యితర అభివృద్ధి కార్యములు.

నియమావళి

## 8. సమితియొక్క స్థాయీ సమితి అధికారములు, విధులు

1. ఈ నియమావళిలో ఏదైన ప్రత్యేక అంశమునకు సంబంధించి పంచాయతీ సమితియొక్క "తద్విషయ పరిశీలక సమితి" అనగా పన్ను విధింపు ఆర్థిక విషయములు మినహా 14వ విభాగము (1)వ ఉప విభాగము క్రింద అప్పగింపబడిన ప్రకారము ఏ స్థాయీ సమితియొక్క విషయమును అట్టి అంశమునకు సంబంధించి యుండునో ఆ స్థాయీ సమితి అని అర్థము.

2. సౌలభ్యము నిమిత్తము, దిగువ పట్టికయందలి (1)వ కాలంలో పేర్కొనబడిన విషయములకు సంబంధించిన పంచాయతీ సమితి యొక్క స్థాయీ సమితులు ఆ పట్టిక యందలి (2)వ కాలంలో ప్రతిదానికి ఎదురుగా తెలుపబడిన పేరుతో వ్యవహరింప బడును.

పట్టిక

| (1) | (2) |
|---|---|
| వ్యవసాయము, పశుపోషణ; చిన్నతరహా నీటిపారుదల, విద్యుచ్ఛక్తి, భూసారసంరక్షణ, హద్దుగట్లు భూమి పునరుద్ధరణము, మత్స్య సంవర్ధన — వీటికి సంబంధించిన స్థాయీ సమితి; ...... | **మొదటిస్థాయీ సమితి |
| సహకారము, మితవ్యయము మరియు చిన్న మొత్తాల పొదుపు, కుటీర పరిశ్రమలు, గ్రామీణ గృహ | |

నిర్మాణము, గణాంక వివరములు, ఆరోగ్యమునకు హానికరమైన మద్యపానీయములయు, పదార్థములయు నిషేధము, నిగ్రహము—వీటికి సంబంధించిన స్థాయీ సమితి ... X రెండవ స్థాయీసమితి

సాంఘక విద్యతోసహా విద్య, వైద్యసహాయము, గ్రామీణ నీటి సరఫరా, మురుగు కాల్వలు కలుపు కొని ఆరోగ్యము, పారిశుద్ధ్యము, సాంఘిక సంక్షేమము స్త్రీల, పిల్లల సంక్షేమము, మహాపత్కాలములలో సహాయము వీటికి సంబంధించిన స్థాయీ సమితి ... XX మూడవస్థాయీసమితి

రహదారులు, కట్టడములు – వీటికి సంబంధించిన స్థాయీసమితి XX నాల్గవ స్థాయీసమితి

పన్ను విధింపు, ఆర్థిక విషయములు-వీటికి సంబంధించిన స్థాయీ సమితి XX ఐదవ స్థాయీ సమితి

3. చట్టములో తెలుపబడిన అంశములను పరిశీలించెడి స్థాయీ సమితులు, సాధారణముగా అనుబంధములో చూపబడిన రీతిగా ఉండవలెను.

4. తనకు అప్పగింపబడిన విషయములు సంబంధించిన వరకు ప్రతి స్థాయీ సమితియు పంచాయతీ సమితియొక్క పనులు పథకముల అమలుకు పనులు అమలు జరుగుటకు సంబంధించిన అభివృద్ధిని గమనించుచుండవలెను.

5. ఏదేని స్థాయీ సమితి, తన విధులను వేటిపైనను నిర్వర్తింపలేకపోయినచో, ఆ విధుల నన్నిటిని, లేక వాటిలో కొన్నింటిని పంచాయతీ సమితి నిర్వర్తింపవలెనని ప్రభుత్వమువారు ఆదేశింపవచ్చును.

| వరుస సంఖ్య | విభాగము, ఉప విభాగములసంఖ్య | విధుల సంగ్రహ వివరణ | స్థాయీ సమితి లేక సమితుల సంఖ్య |
|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) |
| 1. | 18 (1) | XX ప్రభుత్వమువారిచే అప్పగింపబడిన అధికారములు, విధులు | |

| (1) | (2) | (3) | (4) |
|---|---|---|---|
| | | మరియుపన్ను వసూలుతోకలుపుకొనిజిల్లా బోర్డులయొక్క అధికారములు, విధులు. | తద్విషయ పరిశీలక సమితి మరియు ఐదవ స్థాయీ సమితి |
| 2. | (18) (2) (షెడ్యూలు). | xx1. సమాజవికాసము | XX తద్విషయపరిశీలక మరియుఐదవస్థాయీసమితి |
| | | 2. వ్యవసాయము | |
| | | 3. పశుపోషణ, మత్స్యసంవర్ధన | |
| | | 4. ఆరోగ్యము, గ్రామీణపరిశుభ్రత | |
| | | 5. విద్య | |
| | | 6. సాంఘిక విద్య | |
| | | 7. రహదారులు | |
| | | 8. సహకారం | |
| | | 9. కుటీరపరిశ్రమలు | |
| | | 10. స్త్రీ సంక్షేమం | |
| | | 11. సాంఘికసంక్షేమం | |
| | | 12. ఆపత్కాలసహాయం | |
| | | 13. గణాంకసేకరణxx | తద్విషయకపరిశీలకసమితి |
| | | 14. స్వయం సహాయ కార్యక్రమముXX | డిటో |
| | | 15. ట్రస్టులుXX | XXత్వదిషయపరిశీలకసమితి మరియు ఐదవస్థాయీసమితి |
| 3. | 18(3) (ఏ) | పంచాయతీలేని ప్రాంతాలలో పంచాయతీల అధికారములు విధులు | తద్విషయ పరిశీలక సమితి, మరియు ఐదవ స్థాయీ సమితి. |
| | 18(3)(బి)XX | పట్టణ సమితిలేని ప్రాంతాలలో పట్టణసమితులఅధికారములు,విధులు | డిటో |

| 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|
| 4. | 18 (4) | బ్లాకులోని పట్టణ సమితుల పంచాయతీల నిధులలో నుండి విరాళాల వసూలు. | తద్విషయ పరిశీలక సమితి, మరియు ఐదవ స్థాయీ సమితి. |
| 5. | 18 (5) | పంచాయతీ లేక పట్టణ సమితిచే విధింపబడు ఏదైన పన్నుపై లేదా తన అధికారక్షేత్రములో వసూలు చేయబడు ఏదైన స్థానిక సెస్సుపై సర్‌చార్జి రూపంలో సుంకము విధించుట. | ఐదవ స్థాయీ సమితి |
| 6. | 19 (1) (i) | నీటి సరఫరా పనుల నిర్మాణము, నిర్వహణ. | మూడవ, ఐదవ స్థాయీ సమితులు. |
| 7. | 19 (1) (ii) | ఏదేని సంస్థయొక్క లేక ఏదైన పనియొక్క నిర్వహణ. | తద్విషయ పరిశీలక సమితిమరియుఐదవ స్థాయీ సమితి. |
| 8. | 19 (2) | ఉమ్మడి వైద్యశాలలను, శిశు సంక్షేమ కేంద్రాలను సంస్థలను స్థాపించుట - నిర్వహించుట | మూడవ, ఐదవ స్థాయీ సమితులు. |
| 9. | 20 | బ్లాకు అభివృద్ధి అధికారి వద్ద నుండి పత్రిములను తెప్పించు కొనుట. | అన్ని స్థాయీ సమితులు. |
| 10. | 21 | గ్రామాధికారుల వద్ద నుండి ఏనియమునకు సంబంధించిన సమాచారము నైనను అడుగుట. | డిటో |
| 11. | 26 (1) | క్రొత్త పదవులను సృష్టించుట. | ఐదవ స్థాయీ సమితి. |
| 12. | 26 (3) | పంచాయతీ సమితి అధికారములో ఉద్యోగస్థుల స్థితిగతులు పునర్విమర్శ చేయుట. | డిటో |
| 13. | 30 (1) | పంచాయతీ సమితి బడ్జెటును పరీక్షించి సిఫారసు చేయుట. | డిటో |

| 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|
| 14. | 30 (3) | మార్పు చేయబడిన లేక అనుబంధపు బడ్జెటును పరీక్షించి సిఫారసు చేయుట. | ఐదవ స్థాయీ సమితి. |
| 15. | 31 | పంచాయతీల పట్టణ సమితుల యొక్క బడ్జెటుల పరిశీలన. | ఐదవ స్థాయీ సమితి. |
| 16. | 32 (1) | అకౌంట్లు వ్రాసి యుంచుట, సవరణలను సమర్పించుట. | డిటో |
| 17. | 32 (2) | ప్రతి ఆర్థిక సంవత్సరపు ఆదాయ వ్యయపు అకౌంట్ల నిర్వహణ. | డిటో |
| 18. | 35 | సంయుక్త సమితి నిర్మాణము. | తద్విషయ పరిశీలక సమితి, మరియు ఐదవ స్థాయీసమితి |
| 19. | 59 | పంచాయతీ సమితులకు బదిలీ చేయబడిన జిల్లాబోర్డుల విధులు, అధికారములు. | అన్ని స్థాయీ సమితులు |
| 20. | 70 (1) | ఉపనియమములను చేయు అధికారము | డిటో |
| 21 | 71 (2) | ఏవ్యక్తిగాని, అధికారికాని అధికారములను అప్పగించు అధికారము. | తద్విషయ పరిశీలక సమితి మరియు స్థాయీ సమితి. |
| 22. | 71 (3) | ఏదైన పంచాయతీగాని పట్టణసమితిగాని సంస్థలకు బదిలీచేయు అధికారములు. | డిటో |

## 9. పంచాయతీ సమితి, జిల్లా పరిషత్తు లేక దాని స్థాయీసమితి యొక్క సమావేశములో వ్యవహార నిర్వాహణ నిమిత్తము చేసిన నిబంధనలు

### నియమావళి

### 1 వ భాగము

### ఉపక్రమణిక

1. ఈ నియమావళిలో సందర్భము అన్యథా అపేక్షించిననే తప్ప:-

(i) "చట్టము" అనగా 1959, ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సమితుల, జిల్లా పరిషత్తుల చట్టము (1959లో 35వ ఆంధ్రప్రదేశ్ (ఆంధ్ర) చట్టము, అని అర్థము;

(ii) "విభాగము" అనగా చట్టములోని ఒక విభాగము అని అర్థము;

(iii) ఈ నియమావళిలో ఉపయోగింపబడియు, నిర్వచింపబడని పదములను పదజాలములును క్రమముగా వాటికి చట్టములో తెలుపపడిన అర్థమునే కలిగియుండవలెను.

## 2 వ భాగము

1. పంచాయతీ సమితుల, జిల్లాపరిషత్తుల సాధారణ విషయములు

2. (ఇందులో ఇటు తరువాత సమితి అని పేర్కొనబడు) ప్రతిపంచాయతీ సమితి (ఇందులో ఇటు తరువాత పరిషత్తు అని పేర్కొనబడు) జిల్లా పరిషత్తు వ్యవహార నిర్వహణమునకై కనీసము 3 నెలల కొకసారియైనను అది ఏర్పరచుకొన్నట్టి దినములలో సమావేశము కావలెను. మరియు ఇతర సమయములందు అధ్యక్షుడు ఎన్ని పర్యాయములు ఏర్పాటుచేసిన అన్ని పర్యాయములు సమావేశము కావలెను.

3. సమితి/పరిషత్తు సెలవుదినముగా పరిగణించు ఏ దినమున సమావేశము ఏర్పాటు చేయబడరాదు.

4. (1) సమావేశము ఏ స్థలమున, ఏ దినమున ఏ సమయమున జరుపబడునదియు, సమావేశమున ఏయే వ్యవహారము నిర్వహింపబడునదియు సమావేశపు తేదీకి కనీసము ఆరు పూర్తి రోజులు ముందు నోటీసు యివ్వనిదే ఏ సమావేశముకూడ జరుపబడరాదు.

(2) సత్వర సందర్భములలో అధ్యక్షుడు/చైర్మన్ (1)వ ఉప నియమములో నిర్దేశింపబడి దానికన్న తక్కువ వ్యవధి నోటీసు యిచ్చి సమావేశమును ఏర్పాటు చేయవచ్చును;

5. సమావేశపు ఎజండాను అధ్యక్షునితో/చైర్మనుతో సంప్రదించిన తరువాత బ్లాకు అభివృద్ధి అధికారి/కార్యదర్శి తయారుచేయవలెను. సమితి,

పరిషత్తుచే పరిశీలింపబడవలెనని తాను అభిప్రాయపడిన ఏ విషయమునైనను బ్లాకు అభివృద్ధి అధికారి/కార్యదర్శి ఎజండాలోచేర్చవచ్చును. మరియు అధ్యక్షునిచే/చైర్మనుచే నిర్దిష్టపరుపబడిన విషయములనుకూడ అందులో చేర్చవలెను.

6. తాము ప్రతిపాదింప దలచిన తీర్మానమును నిర్దిష్టపరచుచు సమితి/పరిషత్తు సభ్యుల సంఖ్యలో కనీసము మూడింట ఒక వంతు సభ్యులు సంతకము చేసి వ్రాతమూలకముగా అభ్యర్థన పంపినచో అది అందిన మీదట అధ్యక్షుడు/చైర్మను ప్రత్యేక సమావేశమును ఏర్పాటు చేయవలెను.

7. ప్రత్యేక సమావేశమును జరుపవలసిన అవసరమును నిర్దిష్ట పరచుచు, అట్టి సమావేశము యొక్క స్థలము, తేది మరియు సమయమును తెలియ జేయుచు ప్రతి సభ్యునికి వేరే లేఖద్వారా కనీసము ఏడు పూర్తి దినములు ముందుగా నోటీసు నీయకుండ ఏ ప్రత్యేక సమావేశము కూడ జరుపబడరాదు.

8. ప్రతి సమావేశమునకు అధ్యక్షుడు/చైర్మను, అతడు హాజరులేనిచో ఉపాధ్యక్షుడు/వైస్‌చైర్మను అధ్యక్షత వహించవలెను. అధ్యక్షుడు,/ఉపాధ్యక్షుడు/చైర్మను/వైస్ చైర్మను ఇరువురును హాజరు కాని పక్షమున హాజరైన సభ్యులచే ఎన్నికొనబడిన సభ్యుడు అధ్యక్షత వహించవలెను.

9. అధ్యక్షుడు/చైర్మను తాత్కాలికముగా అవసర కార్యముల నిమిత్తము అధ్యక్ష పీఠము, దిగదలచినప్పుడు ఆయన ఉపాధ్యక్షుని- వైస్ చైర్మనుని లేదా ఆయన హాజరు లేనిచో మరొక ఏ సభ్యునైనను అధ్యక్షత వహించ వలసినదిగా కోరవచ్చును.

10. అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు/చైర్మను, వైస్‌చైర్మనుల స్థానములు ఖాళీగా నున్నప్పుడు, ఈ నియమములయొక్క 4, 5 నియమముల ననుసరించి అధ్యక్షునకు/చైర్మనుకు ఒప్పగింపబడిన విధులను బ్లాకు అభివృద్ధి అధికారి-కార్యదర్శి నిర్వహింపవలెను.

11. ఏదేని సమావేశములో సమితి, పరిషత్తు సమక్షమున ఉంచబడు అన్ని విషయములు హాజరై ఓటు చేసిన సభ్యుల బాహుళ్యమును బట్టి నిర్ణయింపబడవలెను. సమానమైన ఓట్లు వచ్చిన పక్షములో అధ్యక్షత వహించు సభ్యునికి రెండవ ఓటు లేక నిర్ణాయక ఓటు ఉండవలెను. మరియు దానిని

అయన వినియోగించవలెను. ఏదేని తీర్మానము ఏకగ్రీవముగా ఆమోదింప బడని పక్షమున, ఆ సమావేశమునకు హాజరైన సభ్యులలో 4 వ వంతు సభ్యులు కోరినచో అనుకూలముగను, ప్రతికూలముగను వోటు చేసిన సభ్యుల పేర్లను నమోదు చేయవలెను.

13. సమితి/పరిషత్తుయొక్క ఏ సమావేశములోను, అప్పటి సమితి/పరిషత్తులోగల సభ్యుల సంఖ్యలో నుండి కనీసము మూడవ వంతు సభ్యులు హాజరైన తప్ప ఎట్టి వ్యవహారము కూడ నిర్వహింపబడరాదు.

14. ఒక సమావేశమునకై ఏర్పాటు చేయబడిన సమయము తరువాత అరగంట వరకు కోరం హాజరుకానిచో ఆ సమావేశము, హాజరైన మొత్తము సభ్యులు యింకను కొంత కాలమువరకు వేచియుండుటకు ఒప్పుకొనిననే తప్ప, వాయిదా పడవలెను.

15. ఒక సమితి/పరిషత్తుయొక్క ఏ తీర్మానము కూడ, అది ఆమోదింపబడిన తరువాత మూడు నెలలలోగా, ఈ విషయమునకై ప్రత్యేకముగా ఏర్పాటు చేయబడిన సమావేశములో అప్పుడు, ఆ సమితి/పరిషత్తులోగల సభ్యులలో సగము మంది సభ్యులచే బలపరుపబడిన తీర్మానముద్వారా తప్ప, మార్చబడరాదు లేదా రద్దు చేయబడరాదు.

16. (1) సమితి/పరిషత్తు యొక్క ప్రొసీడింగులు సాధ్యమైనంత వరకు తెలుగులో వుంచవచ్చును.

(2) ప్రతి సమావేశమునందు ప్రొసీడింగుల మినిట్సు ఈ అవసరము నకై ఉంచబడిన పుస్తకములో నమోదు చేయబడవలెను మరియు అధ్యక్షత వహించు సభ్యునిచే ప్రతి సమావేశానంతరము సంతకము చేయబడవలెను.

(3) సమితి/పరిషత్తు యొక్క ప్రతి సమావేశము ప్రొసీడింగుల మినిట్సు ప్రతి నొకదానిని బ్లాకు అభివృద్ధి అధికారి/కార్యదర్శి అట్టి సమావేశానంతరము ఏడు రోజులలోగా పరిషత్తుకు/ప్రభుత్వమువారికి సమర్పింపవలెను.

(4) లిఖిత భిన్నాభిప్రాయము వ్రాసి ఈయదలచిన ఏ సభ్యుడైనను ఆ భిన్నాభిప్రాయమును ఏ సమావేశమునకు సంబంధించినట్టిదో, ఆ సమావేశము ముగిసిన 48 గంటల లోపల ఈయవచ్చును. సభ్యుడు తన భిన్నాభి

ప్రాయమును మామూలుగా అధ్యక్షునకు/చైర్మనుకు సమర్పించవలెను. ఆయన లేనిచో బ్లాకు అభివృద్ధి అధికారికి/కార్యదర్శికి అందజేయవలెను.

(5) అధ్యక్షుడు/చైర్మను తనకు అందిన భిన్నాభిప్రాయమును తన వివరణతో సహా పరిషత్తుకు/ప్రభుత్వమువారికి సకాలమున పంపించవలెను. ఆ భిన్నాభిప్రాయము యొక్కయు తన వివరణ యొక్కయు ప్రతి నొకదానిని ఆఫీసు రికార్డు నిమిత్తము కూడ ఉంచవలెను. అట్టి భిన్నాభిప్రాయము బ్లాకు అభివృద్ధి అధికారికి/కార్యదర్శికి అందిన సందర్భములో ఆయన దానిని మూడు రోజుల లోపల అధ్యక్షునకు/చైర్మనుకు సమర్పించవలెను. ఆ పైన మూడు రోజుల లోపల అధ్యక్షుడు/చైర్మను దానిని తన వివరణతో సహా పరిషత్తుకు/ప్రభుత్వమువారికి పంపించవలెను.

17. ఒక సభ్యుడు మాట్లాడుచున్నప్పుడు ;—

(1) న్యాయస్థానమువారిచే విచారణ చేయబడుచున్న ఏ విషయముపై నైనను వ్యాఖ్యానము చేయరాదు ;

(2) ఒక సభ్యునిపై వ్యక్తిగతమైన ఆరోపణ చేయరాదు ;

(3) పార్లమెంటుయొక్కగాని, ఏ రాజ్య విధాన మండలియొక్కగాని, ఏ పరిషత్తు లేక సమితియొక్కగాని నిర్వహణ లేక ప్రొసీడింగులను గురించి తీక్షణమైన మాటలను ఉపయోగించరాదు ;

(4) అపఖ్యాతి హేతువులగు మాటలు వాడరాదు ;

(5) మాట్లాడుటకు తనకుగల హక్కును, సమితి/పరిషత్తు యొక్క వ్యవహారములకు అవరోధమును కలిగించు ఉద్దేశముతో ఉపయోగింపరాదు.

18. ఒక ప్రతిపాదనపై సమావేశములో ఒకసారి మాట్లాడిన సభ్యుడు, తరువాత దానికి సవరణను ప్రతిపాదించుటగాని బలపరచుటగాని ఏవిధముగాను ఆ చర్చలో పాల్గొనుటగాని చేయరాదు

19. అధ్యక్షత వహించు సభ్యునిచే ప్రతిపాదన ఓటుకు పెట్టబడిన మీదట ఏ సభ్యుడు అట్టి ప్రతిపాదనను గురించి మాట్లాడరాదు.

20. ఒక ప్రతిపాదనను గురించి సమాధాన మిచ్చుటకు హక్కు కలిగి యున్నట్టి ప్రతివాదకుడు తప్ప, ఏ యితర సభ్యుడు ఆ ప్రతిపాదనను గురించి ఒకసారి కంటె ఎక్కువ మాట్లాడకూడదు. ప్రతిపాదకుడు సమాధాన మిచ్చిన

మీదట ఆ ప్రతిపాదనను గూర్చి ఏ సభ్యుడును మాట్లాడరాదు. ప్రతిపాదకుడు ప్రతిపాదనకు సూచింపబడిన సవరణను గురించి మాట్లాడినచో, ఆయన సమాధానము నిచ్చు హక్కును కోల్పోవును.

21. అధ్యక్షత వహించు సభ్యుడు అనుమతించిననే తప్ప యే ఉపన్యాసము యొక్క సమయము కూడ 7 నిమిషములకు మించరాదు. అయితే ఒక ప్రతిపాదనను ప్రతిపాదించు సభ్యుడు దానిని ప్రతిపాదించునప్పుడు 10 నిమిషముల వరకు మాట్లాడవచ్చును.

22. (1) సమితి/పరిషత్తు యొక్క సమావేశములో పరిశీలింపబడుచున్న ఏ విషయమైనను అది ప్రజలకు సర్వసాధారణముగా వర్తించునట్టిదే అయినను, ఏ సభ్యుడైనను ప్రత్యక్షముగాగాని, పరోక్షముగాగాని, స్వయముగా గాని, వాటాదారుగాగాని, ఆర్థిక ప్రయోజనము కలిగి యున్నట్టిదైనచో అట్టి ఏ సభ్యుడును దానిని గురించిన చర్చలో పాల్గొనరాదు, ఓటు చేయరాదు.

(2) ఏదేని విషయములో ఏ సభ్యుడైనను ఆర్థిక ప్రయోజనము కలిగి యున్నాడని అధ్యక్షత వహించు సభ్యుడు విశ్వసించినచో, ఆయన అట్టి విషయమును గురించిన చర్చలో ఆ సభ్యుడు పాల్గొనరాదని, ఓటు చేయరాదని నిషేధించ వచ్చును లేదా అట్టి చర్చా సమయమున హాజరు కారాదని ఆదేశింప వచ్చును.

(3) ఆ సభ్యుడు, అధ్యక్షత వహించు సభ్యుని నిర్ణయమును అధిక్షేపించ వచ్చును. ఆ పైని ఆయన ఆ ప్రశ్నను ఆ సమావేశము సమక్షమున నుంచవలెను. సమావేశముయొక్క నిర్ణయము అంతిమమై యుండవలెను.

(4) చర్చింపబడునట్టి విషయములో అధ్యక్షత వహించు సభ్యునకు ఆర్థిక ప్రయోజనము కలదని సమావేశమునకు హాజరైన సభ్యులలో ఎవరేని విశ్వసించినచో, అధ్యక్షత వహించు సభ్యుడు అందుకుగాను ఒక ప్రతిపాదన ఆమోదింపబడినచో, అట్టి చర్చాసమయమున ఆ సమావేశమునకు హాజరు కారాదని కోరబడవచ్చును.

వివరణ :— ఛైర్మనుగాని వైస్ ఛైర్మనుగాని హాజరు కానందున జిల్లా కలెక్టరు పరిషత్తుయొక్క సమావేశమునకు అధ్యక్షత వహించి నప్పుడు ఈ ఉపనియమము వర్తించదు.

(5) ఉపనియమము (3)లో పేర్కొనబడిన ప్రశ్నపై అందుకు సంబంధించిన సభ్యుడును ఉప నియమము (4)లో పేర్కొనబడిన ప్రతిపాదనపై అధ్యక్షత వహించు సభ్యుడును ఓటుచేయు హక్కును కలిగియుండరాదు.

## దిన కార్యక్రమము

23. దిన కార్యక్రమముయొక్క పట్టిక అధ్యక్షత వహించు సభ్యునిచే ఈ దిగువ క్రమములో తయారు చేయబడవలెను ;

(1) అవాంతర ప్రశ్నలు, ప్రశ్నలు.

(2) మొదటిసారిగా సమితి/పరిషత్తువారి మేజాపై ఉంచవలసిన కాగితము. (ఈ కాగితములపై ఆరోజున ఎట్టి చర్చలు అనుమతింపబడరాదు).

(3) యాదృచ్ఛిక ఖాళీలలో సమితికి సభ్యులను ఎన్నుకొనుట.

(4) స్థాయీ సమితులకు సభ్యులను ఎన్నుకొనుట.

(5) అధ్యక్షత వహించు సభ్యునిచే సూచింపబడిన అత్యవసర అధికార వ్యవహారమునకు సంబంధించిన విషయములు ;

(6) వ్యవహార క్రమమును మార్చుటకు సంబంధించిన ఏదేని ప్రతిపాదన.

(7) స్థాయీ సమితుల ప్రొసీడింగులు.

(8) తీర్మానములు.

(9) ఇతర అధికార వ్యవహారములు.

## స భా మ ర్యా ద

24. అధ్యక్షత వహించు సభ్యుడు ఏర్పాటు చేసినట్టి క్రమములో సభ్యులు కూర్చుండవలెను. సభ్యులు తమ స్థానములలో నుండియే మాట్లాడవలెను.

25. సమితి/పరిషత్తు సమక్షమున నున్న ఏదేని విషయముపై మాట్లాడదలచిన సభ్యుడు, తన స్థానమున లేచి నిలుచుండవలెను. అయితే ఉపన్యాసకుని పేరును అధ్యక్షత వహించు సభ్యుడు పిలువనిదే ఆయన మాట్లాడరాదు. అట్లు పిలిచినప్పుడు ఆయన అధ్యక్షత వహించు సభ్యుని సంబోధించి మాట్లాడవలెను. ఇద్దరు లేక అంతకెక్కువ మంది సభ్యులు ఒకేసారి లేచి నిలచినచో అధ్యక్షత వహించు సభ్యుడు వారిలో ఎవరిని ముందు చూచునో ఆ సభ్యుని

మొదట మాట్లాడవలసినదని కోరవలెను. ఇతర సభ్యుడు లేక సభ్యులు వెంటనే తమ స్థానములో కూర్చుండవలెను. ఏ సమయమందైనను అధ్యక్షత వహించు సభ్యుడు తన స్థానమునుండి లేచినచో అప్పుడు మాట్లాడుచున్న సభ్యుడు కూర్చుండవలెను.

26. అధ్యక్షత వహించు సభ్యుడు ఏ సభ్యునైనను క్రమముగా ప్రవర్తించ వలసినదని కోరినచో ఆ సభ్యుడు వెంటనే కూర్చుండవలెను.

## సత్వర తీర్మానములు

27. (1) ప్రతిపాదన రూపములో తప్ప మరియు అధ్యక్షత వహించు సభ్యుని యొక్కయు, సమితి/పరిషత్తు యొక్కయు అనుమతి వున్ననే తప్ప, ఆ దినము యొక్క వ్యవహారపు పట్టికలో చేర్చబడని ఏ విషయమునైనను ఏ సమావేశములో కూడ చర్చింపబడరాదు.

(2) (i) ఆ సమావేశములో అట్టి ప్రతిపాదనను ఒకటికి మించి చేయరాదు.

(ii) ఒకే ప్రతిపాదనపై ఒకటికన్న ఎక్కువ అంశములు చర్చింపబడరాదు. మరియు ఆ ప్రతిపాదన కొలది కాలము క్రిందట జరిగిన సంఘటనకు సంబంధించిన నిర్దిష్ట విషయమునకు మాత్రమే పరిమితమై యుండవలెను.

(iii) ప్రతిపాదన గత మూడు నెలలలోగా జరిగిన సమితి/పరిషత్తు సమావేశములో చర్చింపబడిన అంశముపై చర్చను లేవదీయరాదు.

(iv) ఏ ప్రతిపాదనయు పరిశీలనార్థము ఇంతకు పూర్వమే నిర్ణయింపబడిన విషయమును గురించి గాని, ఇంతకు పూర్వమే నోటీసు యియ్యబడిన విషయమును గురించి గాని మున్ముందుగా చర్చించునదిగా ఉండరాదు.

(v) తీర్మానము ప్రతిపాదించుటకు వీలులేనట్టి విషయమునకు సంబంధించనదిగా ఆ ప్రతిపాదన ఉండరాదు.

28. అట్టి ప్రతిపాదనను ప్రవేశపెట్టుటకు అనుమతిని, సాధారణ సమావేశములలో ప్రశ్నల తరువాతను, మరియు ఇతర సమావేశములలో ఆ దినపు వ్యవహారమును ఆరంభించుటకు ముందుగాను కోరవలెను.

29. అట్టి ప్రతిపాదనను ప్రవేశపెట్టు సభ్యుడు ప్రతిపాదనను వ్రాసి అధ్యక్షత వహించు సభ్యునకు సమావేశము ప్రారంభము కాకపూర్వము సమర్పించవలెను. అయితే ఆయన దానిపై మాట్లాడరాదు.

**30.** అధ్యక్షత వహించు సభ్యుడు ఆ ప్రతిపాదన క్రమముగా వున్నదని అభిప్రాయ పడినచో ఆయన దానిని సమితికి/పరిషత్తుకు చదివి వినిపించి సమితి/పరిషత్తు అందుకు అనుమతించునేమో అడుగవలెను, హాజరై ఓటు చేసిన సభ్యులలో ముప్పాతిక భాగము సభ్యులు తమ అంగీకారమును తెలిపినచో అధ్యక్షత వహించు సభ్యుడు ఆ ప్రతిపాదన సమావేశములో పరిశీలింపబడునని ప్రకటించవలెను,

**31.** అట్టి ప్రతిపాదనపై చర్చ ఆ దినముననే స్వతహాగా సమాప్తము కాగలదు. దానిపై ఆ తర్వాత ఎట్టి ప్రశ్నయు అడుగబడరాదు.

## తీ ర్మా న ము లు

**32.** సమితి/పరిషత్తుయొక్క పరిపాలనకు సంబంధించిన ఏ విషయముపైనైనను ఏ సభ్యుడైనను తీర్మానమును ప్రతిపాదింపవచ్చును.

**33.** తీర్మానము ప్రతిపాదనకు అర్హమా కాదా అను విషయమును అధ్యక్షత వహించు సభ్యుడు నిర్ణయించవలెను. యేదైన తీర్మానము చట్టము యొక్క నిబంధన లేక చట్టము క్రింద చేయబడిన నియమములకు విరుద్ధముగా వున్నట్లు ఆయన అభిప్రాయపడినచో, దానికి అనుమతి నిరాకరించ వచ్చును. ఆయనదే అంతిమ నిర్ణయమై వుండవలెను; అయితే తీర్మానము సమితి/పరిషత్ యొక్క పరిపాలనతో సంబంధములేని విషయమునకు సంబంధించి, అవాంఛనీయమైన వాదోపవాదములకు దారితీయునట్టిదైనచో, ఆయన ఆ తీర్మానమును జిల్లా కలెక్టరుకు, ప్రభుత్వమువారికి పంపి, అది అనుమతింపబడవచ్చునో, కూడదో అను విషయముపై ఆయన, వారి ఉత్తరువులను పొందవలెను.

**34.** ప్రతి తీర్మానములోను అంశములు స్పష్టముగను, ఖచ్చితముగను తెలుపబడవలెను. మరియు అది ఖచ్చితమైన ఒకే సమస్యకు సంబంధించి యుండవలెను.

**35.** తీర్మానములలో వాదవివాదములు, గర్భితార్థములు, వ్యంగ్యోక్తులు లేదా అసభ్యాలి హేతువులైన వాక్యములు వుండరాదు. వ్యక్తుల అధికార జీవి

తమునకు సంబంధించి తప్ప వారి వ్యక్తిగతమైన ప్రవర్తనను గురించి గాని, స్వభావమును గురించి గాని వాటిలో ప్రసక్తి ఉండగూడదు.

36. తీర్మానములు ఒక విషయమును గురించి రూఢిగా చెప్పునవిగా ఉండవలెను.

37. తీర్మానము నోటీసు లిఖిత పూర్వకముగా ఉండవలెను. అది ప్రతిపాదకునిచే సంతకము చేయబడవలెను.

38. తీర్మానమును ప్రతిపాదించ దలచు సభ్యుడు తన ఉద్దేశమును తెలుపుచు కనీసము ఎనిమిది పూర్తి దినములు ముందుగా నోటీసును ఈయవలెను. మరియు నోటీసుతో పాటు తాను ప్రతిపాదించ దలచిన తీర్మానపు నకలు నొకదానిని సమర్పించవలెను. అయితే అధ్యక్షత వహించు సభ్యుడు కారణములను తెలియచేయుచు, ఎనిమిది దినములకంటె తక్కువ నోటీసుతోనే, తీర్మానము వ్యవహారపు పట్టికలో చేర్చబడుటకు అనుమతించ వచ్చును.

39. సమితి/పరిషత్తు సమావేశములో ప్రతిపాదింపబడుటకు సభ్యులచే నోటీసు ఈయబడిన తీర్మానముల యొక్క ఒడొంటి అగ్రిమత్వమును బ్యాలెటు ద్వారా నిర్ణయింప వలెను,

40. ఏ సభ్యుడును ఏక కాలమున ఒకటి కెక్కువ తీర్మానములపై బ్యాలెటుకు హక్కు కలిగి యుండడు.

41. బ్యాలెటు జరిగియు, సమయము చాలని లేక పరిష్కరింపబడని తీర్మానములు మురిగి పోవలెను.

42. మురిగిపోయిన తీర్మానములకు సంబంధించి, క్రొత్త నోటీసును ఇచ్చుటకు సభ్యులకు ఆటంకము వుండదు.

43. బ్యాలెటు ద్వారా నిర్ణయింప బడిన అగ్రిమత్వము, ప్రకారము ఒక్కొక్క సమావేశములో పదికంటె ఎక్కువ తీర్మానములు తీసికొన బడరాదు.

45. వ్యవహారపు పట్టికలో తీర్మానము ఏ సభ్యుని పేర నున్నదో ఆ సభ్యుడు కోరబడినప్పుడు——

(1) తీర్మానమును ప్రతిపాదించ వలెను, లేదా

(2) తీర్మానమును ఉపసంహరించు కొనవలెను. ఈ సందర్భములో, అందుకు సంబంధించి కేవలము ఒక ప్రకటన మాత్రమే చేయవలెను.

45. సభ్యుడు కోరబడినపుడు హాజరై, లేనిచో, ఆయన పేరున నున్న తీర్మానము ఉపసంహరించు కొనబడినట్లు భావింపబడవలెను.

46. ప్రతిపాదింపబడిన ప్రతి తీర్మానము బలపరుచబడవలెను .లేనిచో అది చర్చించబడరాదు. దానిపై ఏ ప్రశ్నయు వేయబడరాదు.

47. తీర్మానముపై చర్చ ఖచ్చితముగా తీర్మానపు విషయమునకు పరిమితమై వుండవలెను.

48. అనేక అంశములతో కూడియున్నట్టి ఏదైన తీర్మానము చర్చించబడినప్పుడు, అధ్యక్షత వహించు సభ్యుడు, తాను యుక్తమని భావించు విధముగా తీర్మానమును విభజించి, ప్రతి అంశమును లేక ఏదైన ఒక అంశమును విడిగా ఓటుకు పెట్టుట ఆయన ఇష్టమును బట్టి ఉండవలెను.

49. మామూలు తీర్మానములను, ఉదాహరణకు, నియమిత కాలిక వివరణలు స్థాయీసమితుల ప్రొసీడింగులు మున్నగువాటికి సంబంధించిన వాటిని, అవి ప్రతిపాదింపబడకుండగనే లేక బలపరచకుండగనే అధ్యక్షత వహించు సభ్యుడు సమావేశములో పెట్టవచ్చును.

50. తీర్మానమును లేక ప్రతిపాదనను ప్రతిపాదించుటకు లేక బలపరచుటకు లేక దానిపై మాట్లాడుటకు ఎవరైన ఇతర సభ్యునకు హక్కు వున్న విధముగానే అధ్యక్షత వహించు సభ్యునకును హక్కు వుండవలెను.

## ప్రశ్నలు

51. ప్రశ్నను సమితి/పరిషత్తు యొక్క ఏ సమావేశములో అడుగవలసి యున్నదో ఆ సమావేశమునకు కనీసము ఎనిమిది పూర్తి దినములు ముందుగా ప్రశ్నయొక్క నోటీసు ఈయబడవలెను, మరియు నోటీసుతోబాటు ప్రశ్నయొక్క నకలు నొక దానిని సమర్పించ వలెను:

అయితే అధ్యక్షత వహించు సభ్యుడు ఎనిమిది దినములకంటె ఎక్కువ నోటీసుతోనే ప్రశ్న వేయబడుటకు అనుమతించ వచ్చును. లేక ప్రశ్నకు సమాధాన మొసగ బడుటకు వ్యవధిని పొడిగించ వచ్చును. బ్లాకు అభివృద్ధి అధికారి/కార్యదర్శి, అధ్యక్షత వహించు సభ్యునియొక్క అనుమతితో, ఆ ప్రశ్నపై అవాంతరపు ప్రశ్నలకు అనుబంధ ప్రశ్నలకు సమాధాన మొసగ వచ్చును.

52. సమితి/పరిషత్‌యొక్క పరిపాలనకు సంబంధించిన ఏ విషయమును గురించియైనను సమాచారము తెలిసి కొనుటకు ప్రశ్న వేయబడ వచ్చును.

53. ఒక ప్రశ్న అనుమతింపబడుటకు అది ఈ క్రింది పరిస్థితులను పాటించవలెను :—

(1) ప్రశ్న అర్థమగుటకు తప్పనిసరిగా అవసరమైననే తప్ప అందులో ఏదైన పేరుగాని కథనముగాని వుండకూడదు.

(2) ఒక ప్రశ్నలో ఒక కథనము వున్నయెడల ఆ ప్రశ్నను వేయు సభ్యుడే ఆ కథనముయొక్క నిర్దిష్టత్వమునకు బాధ్యత వహించవలెను;

(3) అందులో వాద వివాదములు, కల్పితార్థములు, వ్యంగ్యోక్తులు లేదా అపఖ్యాతి హేతువులైన వాక్యములు ఉండరాదు.

(4) ఆ ప్రశ్న అభిప్రాయమును అడుగునదిగా గాని, అవ్యక్తమైన న్యాయ సూత్రమునకు లేక ఊహాత్మకమైన సమస్యకు పరిష్కారమును సూచించవలెనని కోరునదిగా,గాని వుండకూడదు.

(5) అది వ్యక్తియొక్క అధికారము, జీవితమునకు లేక ప్రజా జీవితమునకు సంబంధించి తప్ప, ఆయన వ్యక్తిగతమైన శీలమును గురించి గాని, ప్రవర్తనను గురించిగాని అడుగరాదు.

(6) అది సమితి/పరిషత్‌యొక్క సిబ్బందిని, వ్యక్తులయొక్క వ్యక్తిగత ఇబ్బందులకు లేక ఫిర్యాదులకు సంబంధించి వుండరాదు.

(7) ప్రశ్న మిక్కిలి పెద్దదిగా వుండరాదు.

(8) ఒకసారి పూర్తిగా సమాధాన మొసగబడిన ప్రశ్న మరల వేయబడరాదు.

**54.** నోటీసు గడువులోపల, ఏదైన ప్రశ్నకు లేక ప్రశ్నయొక్క ఏదైన భాగమునకు, అది సమితి, పరిషత్తు వ్యవహారమునకు ప్రధానముగా సంబంధింపనట్టిది కాదను కారణముపై అధ్యక్షత వహించు సభ్యుడు అనుమతిని నిరాకరించవచ్చును, మరియు ఆయన అట్లు చేసినచో, ప్రశ్న లేక ప్రశ్నయొక్క భాగము ప్రశ్నల జాబితాలో వుంచబడరాదు.

**55.** ప్రశ్నను అంగీకరించు విషయమును అధ్యక్షత వహించు సభ్యుడు నిర్ణయించ వలెను మరియు ప్రశ్న వేయుటకు గల అధికారము దుర్వినియోగపరచబడుచున్నదని లేక ఈ నియమావళికి వ్యతిరేకముగా నున్నదని భావించుచో లేక ప్రజా శ్రేయస్సుదృష్ట్యా అప్రశ్నకు సమాధానమీయదగు కారణముపై ఆయన ఏ ప్రశ్నకైనను అనుమతిని నిరాకరించవచ్చును.

**56.** అనుమతి నిరాకరింపబడని ప్రశ్నలు ఆ దినపు ప్రశ్నల జాబితాలో చేర్చబడవలెను. ప్రశ్నలకు కేటాయింపబడిన సమయము సరిపోయినచో, సమావేశములో ఏ ఇతర వ్యవహారము ప్రారంభింపబడక పూర్వము, జాబితాలో అవి వున్న వరుస ననుసరించి ఒక్కొక్కటిగా వేయవలసినదిగా కోరవలెను.

**57.** ప్రతి సాధారణ సమావేశములోను మొదటి ముప్పది నిమిషములు ప్రశ్నలను అడుగుటకు సమాధాన మొసగుటకు కేటాయించవలెను.

**58.** అవాంతరపు ప్రశ్నలు వాయిదా వేయబడరాదు.

**59.** ఏ సభ్యుడైనను, ఎప్పుడైనను అధ్యక్షత వహించు సభ్యుని నిర్ణయము కొరకు క్రమతాంశము (పాయింట్ ఆఫ్ ఆర్డరును), ప్రస్తావించవచ్చును. అయితే అట్లు చేయుటలో ఆయన కేవలము ఆ అంశమును మాత్రమే తెలుపవలెను.

ఓటుకు పెట్టుట

**60.** ఒక విషయముపై చర్చ ముగిసిన తరువాత, అధ్యక్షత వహించు సభ్యుడు ఆ విషయను ఓటుకు పెట్టవలెను.

61. విషయము ఓటుకు పెట్టబడినప్పుడు, అధ్యక్షత వహించు సభ్యుడు సభవారిని చేతు లెత్త వలసినదిగా కోరవలెను, మరియు ఆయన అనుకూలముగా లేక వ్యతిరేకముగా ఎత్తబడిన చేతులను లెక్కించి ఫలితమును ప్రకటించి వలెను.

62. ఏ సమావేశములో నైనను సమితి/పరిషత్తు సమక్షమునకు వచ్చు అన్ని విషయములకు సమావేశమునకు హాజరై ఓటు చేసిన సభ్యుల బాహుళ్యమును బట్టి నిర్ణయింపబడవలెను. ఓట్లు సమముగా నున్న ప్రతి సందర్భములోను; అధ్యక్షత వహించు సభ్యుడు రెండవ ఓటు లేక నిర్ణాయక ఓటును కలిగియుండవలెను, మరియు ఆయన దానిని వినియోగించవలెను.

63. వ్యవహారములోని ఒక అంశమునకు సంబంధించి ఎట్టి ప్రతిపాదనయు ప్రతిపాదింపబడనిచో, దానిని వదలివేయవచ్చును.

## క్రమ భంగము

64. ఈ క్రింది సందర్భములలో సభ్యుడు క్రమభంగ మొనరించినట్లు భావించబడవలెను :—

(1) ఆక్షేపణీయమైన లేక తీక్షణమైన మాటలను ఉపయోగించి, వాటిని ఉపసంహరించుటకు లేక క్షమాపణ కోరుటకు నిరాకరించుట ;

(2) సమావేశము శాంతియుతముగాను క్రమబద్ధముగాను నిర్వహింపబడకుండ బుద్ధిపూర్వకముగా అడ్డు తగులుట ;

(3) అధ్యక్ష పీఠము యొక్క ఆదేశము పాటింప నిరాకరించుట, లేక

(4) అధ్యక్షత వహించు సభ్యుడు తన స్థానమున లేచి నిలచినప్పుడు లేక అధ్యక్షత వహించు సభ్యుడు కోరినప్పుడు సభ్యుడు తనస్థానమున కూర్చుండక పోవుట ;

65. ఏ సభ్యుడైనను ఏ తీక్షణమైన మాటలకైనను అభ్యంతరము తెలుపవచ్చును.

66. తీక్షణమైన మాటలకు అభ్యంతరము తెలుపు సభ్యుడు "ఈ మాటలను తొలగింపవలెను" అని ప్రతిపాదించ వలెను; ఆయన ప్రతిపాదన ఆమోదింపబడినచో అధ్యక్షత వహించు సభ్యుడు ఆమాట తొలగింపబడవలసినదిగా ఆదేశించ వలెను.

67 తీక్షణమైన మాటలకు అభ్యంతరములు ఆ మాటలు ఉపయోగింపబడినపుడే తెలుపబడ వలెను, ఇతర సభ్యుడు మాట్లాడుటకు ప్రారంభించిన తరువాత తెలుపకూడదు.

63. ఎవరి మాటలు తొలగింపబడెనో ఆ సభ్యుడు క్రమ భంగ నేరమును చేసిన వాడగును;

69. అధ్యక్షత వహించు సభ్యుడు ఒక సభ్యుడు అసంగతమైన విషయములను ప్రస్తావించుచునే ఉన్నప్పుడు లేక చర్చలో తాను స్వయముగా చేసిన వాదమును కాని, ఇతర సభ్యులు చేసిన వాదములను గాని విసుగుపుట్టించునట్లుగా పునశ్చరణము చేయుచునే వున్నప్పుడు, ఆ సభ్యుని ప్రవర్తనను సమితి/పరిషత్తు దృష్టికి తెచ్చి, ఉపన్యాసమును విరమించ వలసినదిగా ఆ సభ్యుని ఆదేశించవచ్చును.

70. అధ్యక్షత వహించు సభ్యుడు ఏ సభ్యుని ప్రవర్తనయైననుపూర్తిగా క్రమ భిన్నముగా నున్నదని భావించినచో, ఆ సభ్యుని వెంటనే సమావేశములో నుండి వెడలిపోవలసినదిగా ఆదేశించవచ్చును, అట్లు వెడలిపోవలసినదిగా ఆదేశింపబడిన ఏ సభ్యుడైనను వెంటనే అట్లు చేయవలెను, మరియు ఆ దినమున సమావేశములో మిగిలిన కాలమునకు ఆయన హాజరు కారాదు. ఎవరైన సభ్యుడు, రెండవసారి ఆ విధముగా అధ్యక్షత వహించు సభ్యునిచే ఆదేశింపబడినచో, ఆ సభ్యుడు నాలుగు నెలలకు మించకుండ ఒక నిర్ణీతకాలము వరకు సమితి/పరిషత్తు సమావేశములకు హాజరు కాకూడదని కూడ అధ్యక్షతవహించు సభ్యుడు ఉత్తరువు చేయవచ్చును.

71. సమితి/పరిషత్తు సమావేశములో తీవ్ర అశాంతి ఏర్పడిన సందర్భములో అధ్యక్షత వహించు సభ్యుడు తాను పేర్కొనునంత కాలమువరకు ఏ సమావేశమునైనను నిలుపుదల చేయవచ్చును.

ముగింపు

72. ప్రతిపాదన చేయబడిన తరువాత మరియు ఉపన్యాసము ముగిసిన తరువాత ఎప్పుడైనను ఏ సభ్యుడైనను "ఇక ఈ విషయమును ఓటుకు పెట్ట వలెను" అని ప్రతిపాదించ వచ్చును. అధ్యక్షత వహించు సభ్యుడు, అట్టి ప్రతి పాదన సమితి/పరిషత్తు నియమావళిని దుర్వినియోగము చేయనిదిగా నున్నదని గాని సబబైన చర్చ జరుపుటకు గల హక్కును న్యూనపరచునదిగా నున్నదని గాని భావించిననే తప్ప "ఇక ఈ విషయమును ఓటుకు పెట్టవలెను" అను ప్రతిపాదనను వెంటనే ఓటుకు పెట్టి సవరణగాని చర్చగాని లేకుండ దానిని నిర్ణయించ వలెను. ఆ ప్రతిపాదన ఆమోదింపబడినచో, ప్రతిపాదకుడు సమా ధాన మిచ్చుటకు అనుమతింపబడవచ్చునా అనువిషయముపై అధ్యక్షతవహించు సభ్యుడు సభవారి ఉద్దేశమును గమనింపవలెను. ప్రతిపాదకుడు ఆ విధముగా అనుమతింపబడనచో, ఆయన తమ సమాధానమును ఐదు నిమిషములలో ముగించవలెను. దాని తరువాత లేక ప్రతిపాదకుడు సమాధాన మిచ్చుటకు అను మతింపబడనిచో చర్చింపబడుచున్న అసలు ప్రతిపాదనను లేక సవరణను లేక సవరణలను వెంటనే ఓటుకు పెట్టవలెను.

3వ విభాగము

పంచాయతీ సమితుల/జిల్లా పరిషత్తుల యొక్క స్థాయీ సమితులు.

73 ప్రతి స్థాయీ సమితి కనీసము రెండు నెలలకు ఒక సారియైనను, సమితి ఆ యా సమయములందు నిర్ణయించునట్టి దినమున, సమయమున, సమితి/పరిషత్తు కార్యాలయములో సమావేశము కావలెను.

74. స్థాయీ సమితియొక్క చైర్మను ఎప్పుడైనను సమితి సమావేశ మును ఏర్పాటు చేయవచ్చును మరియు నిర్వహింపబడవలసిన కార్యక్రమమును తెలుపుచు బ్లాకు అభివృద్ధి అధికారిచే/కార్యదర్శిచే లేక సమితిలోని ముగ్గురి సభ్యులచే సంతకము చేయబడిన అభ్యర్థన అందిన మీదట వారము దినముల లోపల ఆయన అట్లు ఏర్పాటు చేయవలెను.

75. స్థాయీసమితి యొక్క ఏ సమావేశములోనైనను సమితియొక్క స్థాయీ సమితులకు నలుగురు సభ్యుల కోరం, పరిషత్తు యొక్క స్థాయీ సమితులకు ఐదుగురు సభ్యుల కోరం లేకపోయినచో ఏ కార్యక్రమముగాని నిర్వహింపబడరాదు. అయితే వాయిదా పడిన సమితి/పరిషత్తు స్థాయీ సమితి సమావేశములకు మాత్రము కోరం ముగ్గురు ఉండవలయును.

76. ఏ సమావేశములోనైనను స్థాయీ సమితి, సమక్షమునకు వచ్చు అన్ని విషయములను సమావేశమునకు హాజరై ఓటు చేసిన సభ్యుల బాహుళ్యమునుబట్టి నిర్ణయింపబడవలెను. ఓట్లు సమముగా నున్న ప్రతి సందర్భములోను అధ్యక్షత వహించు సభ్యుడు రెండవ ఓటు లేక నిర్ణాయక ఓటును కలిగి యుండవలెను, మరియు ఆయన దానిని వినియోగించవలెను.

77. స్థాయీ సమితియొక్క ప్రతి సమావేశమునకు దాని చైర్మను ఆయన లేనిచో, ఆ స్థాయీ సమితి సభ్యునిగా వున్న పక్షములో దాని వైస్ చైర్మనును ఆయనకూడ లేనిచో సమావేశమునకు హాజరైన సభ్యులు ఎన్నుకొన్న సభ్యుడు అధ్యక్షత వహించ వలెను.

78. స్థాయీ సమితులచే పరిష్కరింపబడదగు ప్రతి విషయముకూడ, మొదట ఆ విషయమునకు సంబంధించిన స్థాయీ సమితిచే నిర్ణయింపబడవలెను తరువాత ఆ విషయము ఆర్థిక సంబంధ మైనదయినచో, పన్ను విధింపు, ఆర్థిక విషయములను చూచు స్థాయీ సమితిచే అది నిర్ణయింపబడవలెను. రెండు లేక అంతకు ఎక్కువ స్థాయీ సమితుల మధ్య ఏ విషయములోనైనను అభిప్రాయబేధ మేర్పడిన సందర్భములో అట్టి స్థాయీ సమితులన్నిటి యొక్క సంయుక్త సమావేశము ఏర్పాటు చేయబడి అందులో ఆ విషయమై నిర్ణయముగా కొనబడవలెను. అట్టి సంయుక్త సమావేశమునకు కోరం తొమ్మిది అయి యుండవలెను. వారిలో ప్రతి స్థాయీ సమితి నుండియు కనీసము ముగ్గురు సభ్యులు వుండవలెను.

79. (1) ప్రొసీడింగుల మినిట్సు అన్నియు ఒకపుస్తకములో నమోదు చేయబడి, ప్రతి సమావేశము తరువాత అధ్యక్షత వహించు సభ్యునిచే సంతకము చేయబడవలెను ;

(2) మినిట్ల పుస్తకము సమితి/పరిషత్తు ముందు, అది నిర్ణయించునట్టి సమయములలో ఉంచవలెను ;

(3) సమితి/పరిషత్తు యొక్క ప్రతి స్థాయీ సమితియొక్క ప్రతి సమావేశపు ప్రొసీడింగు మినిట్ల నకలును, అట్టి సమావేశము తరువాత ఏడు దినముల లోపల, బ్లాకు అభివృద్ధి అధికారి కార్యదర్శి పరిషత్తుకు/ప్రభుత్వమునకు పంపవలెను.

**80.** రెండు లేక అంతకంటె ఎక్కువ స్థాయీ సమితులు పరస్పర విరుద్ధ మగు నిర్ణయములను చేసి అట్టి వైరుధ్యము ఆ సమితుల సంయుక్త సమావేశముద్వారా తొలగింపబడక పోయిన ఏ సందర్భములోనైనను, బ్లాకు అభివృద్ధి అధికారి/కార్యదర్శి ఆ విషయమును సమితి పరిషత్తు ముందు వుంచవలెను. అది తీర్మానించు లోపల, ఆయన వివాదాంశముపై చర్యనంతటిని ఆపి యుంచ వలెను.

**81.** సమితి అధ్యక్షుడు, పరిషత్తు చైర్మను, జిల్లా కలెక్టరు తప్ప, స్థాయీ సమితిలోని ఏ సభ్యుడైనను వరుసగా నాలుగు సమావేశములకు హాజరు కాకపోయినచో, ఆయన ఆ స్థాయీ సమితిలో తన సభ్యత్వమును కోల్పోవును. అయితే ఆయనయొక్క లిఖితపూర్వకమైన కోరికపై సమితి పరిషత్తు ఆయనను మరల తీసికొన వచ్చును.

**82** సమితి, పరిషత్తుయొక్క ప్రతి స్థాయీ సమితియొక్క కార్యక్రమములను నిర్వహించుటకును మరియు అది ఏ కార్యము కొరకు ఏర్పాటు చేయబడినచో ఆ కార్యమును నెరవేర్చుటకును, సమితి పరిషత్తు యొక్క సిబ్బంది సేవలను వినియోగించు కొనవచ్చును.

**83.** సమితి, పరిషత్తు సమావేశములకు సభామర్యాద, తీర్మానములు, ప్రశ్నలు, క్రమ భంగమునకు వాటికి సంబంధించిన ఏ నియమములు వర్తించునో అవే నియమములు స్థాయీ సమితుల సమావేశములకును కూడ వర్తించును.

# నాల్గవ భాగము

## వివిధ విషయములు

**84.** సమితి, పరిషత్తు యొక్కయు, వాటియొక్క అన్ని స్థాయీ సమితుల యొక్కయు ప్రొసీడింగులను, రికార్డులను బ్లాకు అభివృద్ధి అధికారి, కార్యదర్శి అధీనములో ఉండవలెను.

**85.** ప్రభుత్వమువారు ప్రకటించునట్టి రుసుములను చెల్లించిన వారికి సమితి/పరిషత్తు యొక్కయు, స్థాయీ సమితుల యొక్కయు ప్రొసీడింగుల రికార్డుల నకళ్ళను బ్లాకు అభివృద్ధి అధికారి, కార్యదర్శి ఈయవచ్చును.

# 10. పంచాయతీ సమితుల, జిల్లా పరిషత్తుల ఋణముల నియమావళి :-

1. సంగ్రహ నామము ఆరంభము :—

(1) ఈ నియమావళి 1959 ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సమితుల, జిల్లా పరిషత్తుల ఋణముల నియమావళి అని పిలువబడ వచ్చును.

(ii) ఇది తక్షణము అమలులోనికి రావలెను.

2. నిర్వచనములు :-

ఈ నియమావళిలో. సందర్భము అన్యధా అపేక్షించిననే తప్ప—

(i) "చట్టము" అనగా 1959, ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సమితుల జిల్లా పరిషత్తుల చట్టము (1959 లో 35వ ఆంధ్రప్రదేశ్ చట్టము) అని అర్థము.

(ii) "ప్రభుత్వ ఋణము" అనగా ప్రభుత్వ నిధుల నుండి గైకొనబడిన ఋణము అని అర్థము ;

(iii) "ఋణము" అనగా ఈ చట్టము క్రింద చేసిన, తీసి కొనిన లేక తెచ్చిన ఋణము అని అర్థము.

(iv) "ప్రభుత్వేతర ఋణము" అనగా ప్రభుత్వ నిధులనుండి గాక వేరొక విధముగా తెచ్చిన ఋణము; మరియు

(v) "ఋణ కాలపరిమితి" అనగా ఋణము చేయబడిన, తీసికొనబడిన లేక తేబడిన తేదీకిని అది పూర్తిగా తీర్చబడిన తేదీకిని నడుమ గల కాలము అని అర్థము.

3. కార్యములు :—

ఒక పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తు, ఈ చట్టపు కార్యములను నిర్వర్తించుటకు గాను తన నిధులు లేక వానిలో నేదైన భాగమును హామీగా వుంచి అప్పు తెచ్చుకొన వచ్చును.

4. దరఖాస్తు :—

ఒక పంచాయతీ సమితి లేక ఒక జిల్లా పరిషత్తు ఋణము తీసికొనగోరినచో, అది ఈ దిగువ తెలిపిన వివరములను తెలుపుచు ఒక దరఖాస్తును ప్రభుత్వమువారికి దాఖలు చేయవలెను.

(i) ఋణము ఏ కార్యమునకై కావలసినది;

(ii) అప్పుతెచ్చుకొనదలచిన మొత్తము;

(iii) ఏ నిధిని హామీగా వుంచి అప్పుతెచ్చుకొనదలచినది;

(iv) ఏ ఏ తేదీలలోపల ఆ పైకము అప్పుతెచ్చుకొనవలసి యున్నది.

మరియు ఆ ఋణము కిస్తులలో పొందవలెనని తలచినచో ప్రతి కిస్తు మొత్తము ఏంత ఏ ఏ తేదీలలో మొదటి కిస్తు తీసికొనబడినది లేక పొందబడినది. మరియు తక్కినకిస్తులు ఏసంవత్సరములలోతీసికొన లేకపొందదలచినది.

(v) ఎంత వడ్డీకి అప్పుతెచ్చుకొనదలచినది.

(vi) ఎన్ని సంవత్సరముల కాలమునకుగాను పైకము అప్పు తెచ్చుకొనవలసియున్నది మరియు అది తీర్చబడు విధము (ఆ ఋణము నిక్షేపనిధి మూలమున తీర్చదలచినచో, అట్టి నిక్షేపనిధి వృద్ధి ఏ వడ్డీ రేటుతో లెక్కకట్టబడునదియుకూడ తెలుపబడవలెను) మరియు

(vii) ఒక పంచాయతీ సమితి లేక ఒక జిల్లా పరిషత్తుయొక్క నిధులపై ప్రస్తుతము వున్న పూర్వపుచార్జీల స్టేటుమెంటుతోసహా, దాని ఆర్థికస్థితి యొక్క వివరములు.

5. దర్యాప్తు ప్రచురణ;—

ప్రభుత్వమువారు తమకు అవసరమని తోచునట్టి దర్యాప్తు జరిపిన పిదప, ఒక పంచాయతీ సమితిచే లేక ఒక జిల్లాపరిషత్తుచే కోరబడిన పైకము అప్పు తెచ్చుకొనవలసియే యున్నదని భావించిన ఎడల, వారు ఆ దరఖాస్తు ప్రతిని మరియు తమకు అవసరమని తోచునట్టి ఇతర వివరములకు ఆంధ్ర ప్రదేశ్ గెజిటులో ప్రచురించవలెను.

6. ప్రభుత్వమువారు నిరాకరింపవచ్చును లేక మంజూరు చేయవచ్చును:—

5 వ నియమము క్రింద దరఖాస్తుయొక్క ప్రతి ప్రచురింపబడిన తేదీనుండి ఒక నెల గడచిన పిదప మరియు తాము కోరెడి ఏదైన మరికొంత సమాచారమును తెప్పించుకొనిన పిదప, దాఖలు చేయబడిన ఏవైన ఆక్షేపణలను పరిశీలించి ప్రభుత్వమువారు—

(i) దరఖాస్తును నిరాకరింపవచ్చును, లేక

(ii) ఈ క్రింది షరతులకు లోబడి ఋణమును ఈయవచ్చును. లేక దానిని తెచ్చుకొనుటకు మంజూరు చేయవచ్చును. ఆ షరతు లేవనగా—.

(ఎ) ఋణ కాల పరిమితి సాధారణముగా 30 సంవత్సరములకుమించ రాదు; కాని నీటి సరఫరా, మురికినీటి కాల్వల పథకములకుగాను ఈయబడు ఋణముల సందర్భములలో, అది 30 సంవత్సరములకు మించవచ్చునుగాని 40 సంవత్సరములకు మించరాదు.

(బి) ఆ రుణముపై చెల్లింపదగు వడ్డీ కాలానుగుణముగా ప్రభుత్వము వారిచే నిర్ణయింపబడునట్టి రేటు చొప్పున ఉండవలెను; మరియు

(సి) లక్షరూపాయలకు మించు ప్రభుత్వేతర రుణము విషయములో ఆ రుణములయొక్క ప్రవచనారంభపు తేదీ ప్రభుత్వమువారిచే ఆమోదింపబడు నట్టిదై వుండవలెను.

7. తక్షణము కావలసిన సందర్భములలో—

ఒక పంచాయతీ సమితి లేక జిల్లాపరిషత్తు ఈ చట్టము కార్యములలో దేనినైన నిర్వర్తించుట నిమిత్తము పైకము తక్షణము కావలసియున్నదను కారణముపై రుణమును తక్షణము ఈయవలెనని లేక దానిని తెచ్చుటను తక్షణము మంజూరు చేయవలెనని తమ దరఖాస్తులో కోరినఎడల ప్రభుత్వము వారు, దరఖాస్తు అందిన పిదప ఎప్పుడైన, అట్టి ఏదైన కార్యము నిమిత్తము ఆ రుణము తక్షణము కావలయునని తాము సంతృప్తిజెందినచో, ఉచితమని తమకు తోచునట్టి దర్యాప్తు జరిపిన పిదప, 5, 6 నియమములలో ఏమి యున్నప్పటికిని, ఆ రుణమును ఈయవచ్చును లేక దానినితెచ్చుటను మంజూరు చేయవచ్చును.

8. నిర్ణీత షరతులు—

(1) ఒక రుణమును ఇచ్చుటలో లేక మంజూరు చేయుటలో, ప్రభుత్వమువారు, ఈ నియమావళికి విరుద్ధముగా వుండనట్టి, తమకు ఉచితమని తోచునట్టి ఏవైన మరికొన్ని షరతులను నిర్ణయింపవచ్చును.

(2) ముఖ్యముగా మరియు 3వ నియమములలో ఉన్న నిబంధనల సర్వ సాధారణతకు భంగము లేకుండ ఈ క్రింది షరతులు నిర్ణయింపబడవలెను. అవేవనగా:—

(i) ప్రతి రుణము సందర్భములోను ఈ క్రింది ఖర్చులను ప్రభుత్వము వారు నిర్ణయింపవలెను. మరియు పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తు ఆ ఖర్చులను చెల్లింపవలెను:-

(ఎ) 8వ నియమము క్రింద చేయబడిన ఏదైన దర్యాప్తు ఖర్చు మరియు ప్రచురింపబడిన ప్రకటన ఖర్చు.

(బి) 9వ నియమము క్రింద చేయబడిన తనిఖీ ఖర్చు మరియు నియంత్రణము నిమిత్తము గైకొనబడిన ఇతర చర్యల ఖర్చు, మరియు

(సి) ఈ నియమముల క్రింద ప్రభుత్వమువారి ఉత్తరువు ద్వారా తీసికొనబడిన ఏవైన ఇతర ప్రొసీడింగుల ఖర్చు.

(ii) ప్రతి ఋణము సందర్భములోను, ఒక పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తు, తమ విధుల విషయములోను ఆ ఋణము యొక్క వ్యయము విషయములోను ఆంధ్రప్రదేశ్ అక్కౌంటెంటు జనరల్ లేక ప్రభుత్వమువారు యేదైన సమాచారమును కోరిన యెడల దానిని వారికి పంపవలెను.

(iii) ప్రభుత్వ ఋణము సందర్భములో—

(ఎ) కోరబడిన మొత్తమును దరఖాస్తులో నిర్దిష్ట పరురిబడిన తేదీన పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ యొక్క జమకు సర్దుబాటు చేయుహక్కు లేదా ఆ తేదీనుండి ఆ మొత్తముపై వడ్డీ చెల్లింపబడవలెనని కోరుహక్కు ప్రభుత్వమువారికి వుండవలెను, మరియు

(బి) ప్రభుత్వమువారు, పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ రుణము విషయములో నిర్ణయింపబడిన షరతులలో దేనినైనను పాటింపలేదని లేక ఈ నియమావళి ప్రకారము చేయవలసిన వానిలో దేనినైన చేయలేదని తమకు తోచిన యెడల, ఎప్పుడైనను అట్టి రుణమును పురస్కరించుకొని ఆ పైన వడ్డీ ఎట్టి చెల్లింపులును చేయబడవనియు అప్పటికి యీయబడిన ఏదైన మొత్తము వడ్డీతో సహా తక్షణము వాపసు చెల్లింపబడవలెననియు ఉత్తరువు చేయవచ్చును:

(iv) ప్రభుత్వేతర రుణము సందర్భములో, పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ ప్రభుత్వమువారి పూర్వామోదమును పొందకుండా, ఆ రుణమును ఏయే తేదీలలో రుణము తెచ్చుకొనుట లేక దాని మొదటి కిస్తు మంజూరు చేయబడెనో దానిని మార్చరాదు. మరియు రుణమును కిస్తుల ప్రకారము తెచ్చుకున్నచో, పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్, అటుపై ప్రతి కిస్తు ఏయే తేదీలలో లేబడునో ఆ తేదీలు, ప్రభుత్వమువారి పూర్వామోదము నిమిత్తము తెలుపబడవలెను.

9. పనులను అకౌంట్లను నియంత్రణము చేయుట, తనిఖీ చేయుట—ప్రభుత్వమువారు—

(i) అప్పు తెచ్చుకున్న ధనము అది ఏ కార్య నిమిత్తము అప్పుతెచ్చుకొనబడెనో దానికే సక్రమముగా వినియోగింపబడుచున్నదనియు ఆ ఋణములో ఖర్చుపెట్టగా మిగిలిన మొత్తము ఈ నియమావళి ప్రకారముగా కాక మరియొక రీతిగా ఉపయోగింపబడుట లేదనియు నిర్ధారణ చేసికొనుటకు, ఆ ప్రకారమే జరిపించుటకును.

(ii) దానికిగాను నిర్వహింపబడు లెక్కలు ఇందు నిమిత్తము ప్రభుత్వమువారిచే ఈ నియమావళి క్రింద నియమింపబడు అధికారిచే తనిఖీ చేయబడుటకును,—

తమకు అవసరమని తోచునట్టి నిబంధనలను చేయవలెను.

10. జప్తు;—

ఈ నియమావళి నిబంధనలను అనుసరించి అప్పు తీసికొనబడిన పైకము లేక దాని విషయములో రావలసిన వడ్డీ లేక ఖర్చులు అప్పు షరతుల ప్రకారము వాపసు చెల్లింపబడనిచో ప్రభుత్వమువారు అప్పు ఇచ్చినది అయినచో ఆ అప్పు ఏ నిధుల హామీపై ఈయబడెనో వాటిని జప్తు చేయవచ్చును. మరియు అప్పు ఇచ్చినది తాము కానియెడల, అప్పు ఇచ్చిన వ్యక్తి దరఖాస్తు పెట్టుకొనినమీదట ఆ నిధులను తప్పక జప్తు చేయవలెను. అట్టి జప్తునకు పిదప, ఇందుకుగాను ప్రభుత్వమువారిచే నియమింపబడిన అధికారి తప్ప ఇంకే వ్యక్తియు జప్తుచేయబడిన నిధులతో ఏ రీతిగనైనను వ్యవహరింపరాదు—అట్టి అధికారి మాత్రము ఆ నిధులు జప్తు చేయబడకుండినచో ఆ నిధులు వాటి విషయమున అప్పు తీసుకొన్న వ్యక్తి చేసియుండెడు చర్యల నన్నిటిని తాను చేయవచ్చును. మరియు అట్లు జప్తు చేయగా లభించిన పైకముతో ఆ అప్పును, దాని మీద మొత్తము వడ్డీని, ఖర్చులను, జప్తు మరియు ఇతర ప్రొసీడింగుల నిమిత్తము పెట్టబడిన ఖర్చుల నన్నిటిని తీర్చవచ్చును.

అయితే ఆ జప్తు చేయబడిన నిధులు అంతకు పూర్వమే ఏదైన అప్పు క్రింద చట్ట సమ్మతముగా కుదువపెట్టబడి యున్నచో అట్టి అప్పు ఈ జప్తు మూలమున నిరాకరింపబడరాదు. లేక భంగపరుచబడరాదు. ఏ అప్పు విషయములో అట్టి జప్తు చేయబడెనో దానిని తీర్చు నిమిత్తము నిధి పైకములో యే భాగమునైనను వినియోగించుటకు పూర్వమే అట్టి వెనుకటి అప్పులన్నియు ఆ నిధి పైకమునుండి చెల్లింపబడవలెను.

**11. జప్తు చేసిన తరువాత కార్య విధానము:-**

ఏ నిధుల హామీపై అప్పు తీసికొనబడెనో ఆ నిధులను జప్తు చేయవలెనని ప్రభుత్వమువారు నిశ్చయించినప్పుడు ఈ దిగువ కార్య విధానము అనుసరింపబడవలెను. అదేదనగా:-

(i) ప్రభుత్వమువారు, అట్టి నిధుల వసూలు లేక నిర్వహణమును ఆ పంచాయతీ సమితి లేక జిల్లాపరిషత్తు చేయరాదని నిషేధించుచు వానితో వ్యవహరించుటకై ప్రభుత్వముచే నియమింపబడు అధికారికి అధికారమిచ్చుచు ఆ పంచాయతీ సమితికి లేక జిల్లా పరిషత్తుకు ఒక నోటీసును జారీ చేయవలెను. ప్రభుత్వమువారు ఆ నోటీసును స్థానిక అధికార గెజిటులోను, ఆ పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తు నియంత్రణలోగల ప్రదేశముల హద్దులలో తమకు ఉచితమని తోచు ఇంకేదైన ఇతర రీతిగను ప్రచురింప చేయవలెను.

(ii) ప్రభుత్వముచే నియమింపబడిన అధికారి అట్టి జప్తుక్రింద వసూలైన లేక అందిన పైకమును ఋణదాతకు లేక ప్రభుత్వ ఋణము విషయములో ప్రభుత్వ ట్రెజరీలోను చెల్లించవలెను.

(iii) సదరు అధికారి అట్లు వసూలు చేయబడిన పైకము యొక్కయు వసూలు ఖర్చు యొక్కయు అకౌంటును ప్రభుత్వమువారు కాలానుగుణముగా ఆదేశించునట్టి నమూనాలో తయారు చేయవలెను. ఆయన ఆ అకౌంట్ల ప్రతినొకదానిని ఆ పంచాయతీ సమితికి లేక జిల్లా పరిషత్తుకు అందజేసి, ఒక ప్రతిని ఆంధ్రప్రదేశ్ గెజిటులో ప్రచురింపజేయవలెను.

**12. ఖర్చుగాని శేషములు:-**

ఏ పనికై లేక ఏ వ్యవహారమునకై పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తు పైకమును అప్పు తెచ్చెనో ఆపని పూర్తిచేయబడగనే లేక ఆ వ్యవహారము యొక్క అకౌంట్లు ముగింపబడగనే, ఏ కార్యము నిమిత్తము అప్పు చేయబడెనో దానికిగాను పూర్తి పైకము ఖర్చుపెట్టబడలేదని ప్రభుత్వమువారు అసంతృప్తి చెందుచో, వారు ఈ దిగువ రీతిగా జరుపవలెను, అనగా,—

(i) ప్రభుత్వ ఋణము విషయములో—ఖర్చు గాని శేషము—

(ఎ) తక్షణము ప్రభుత్వమునకు వాపసు చెల్లింపబడవలెనని ఆదేశించవచ్చును. ఆ సందర్భములో ఋణముయొక్క అసలులో కూడ అంతే మొత్తము తగ్గింపబడవలెను. దీనివలన, రుణమును తీర్చుటకై నిర్ణయింపబడిన కిస్తులలో కూడ తమకు అవసరమని తోచునట్టి మార్పు చేయవలెను, లేదా

(బి) పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తు చట్టబద్ధముగా నిర్వహించుటకై అధికార మీయబడిన పనులను నిర్వహించు నిమిత్తము వినియోగింపబడవలెనని ఆదేశించవచ్చును.

(ii) ప్రభుత్వేతర రుణము విషయములో—ఖర్చుగాని రుణ శేషము పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ రుణమును ఏ విధముగానైన తగ్గించుటకు గాని లేదా తాము నిర్వహించుటకై చట్టబద్ధముగా అధికార మీయబడిన ఏవైన పనులను నిర్వహించుటకై వినియోగింపబడవలెనని ఆదేశింపవచ్చును-

**13.** ప్రభుత్వ ఋణములపైన వడ్డీ—

ఈ క్రింది నిబంధనలు ప్రభుత్వ రుణములపై వడ్డీకి వర్తింపవలెను, అవేవనగా :—

(i) వరుస సంవత్సరములలో తీసికొనబడిన రుణములు, అవి ఒకే మంజూరు క్రిందికివచ్చు ఒక్క రుణముయొక్క కిస్తులే అయినను, వేర్వేరు రుణములుగను వానిలో ప్రతిదానిపై అది తీసుకొనబడిన సంవత్సరములో అట్టి రుణాలకుగాను నిర్ణయింపబడిన రేటు ప్రకారము వడ్డీ చెల్లింపబడవలసినవిగను భావింపబడవలెను. వడ్డీ ప్రభుత్వము నిర్ణయించు రీతిగా అంగీకరింపబడిన రేటు ప్రకారము సాలీనా లేక ఆరు నెలల కొకమారు వసూలు చేయబడవలెను.

(ii) ప్రభుత్వమువారు, తమకు ఉచితమని తోచుచో, బాకీపడిన అన్ని వడ్డీ కిస్తుల లేక అసలు వృద్ధుల కిస్తుల బకాయిలపై నూటికి సంవత్సరమునకు 7 1/2 కు తక్కువ కానట్టి రేటు చొప్పున చక్రవడ్డీ చెల్లించబడవలెనని ఆదేశింప వచ్చును.

**14.** ప్రభుత్వ రుణముల వాపసు చెల్లింపు—

ఒక పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తు, ప్రభుత్వ పూర్వామోదముతో ఎపుడైన రుణము షరతుల ప్రకారము నిర్ణయింపబడిన వ్యవధికి ముందుగనే ఒక ప్రభుత్వ రుణమును పూర్తిగాగాని, దానిలో ఏదైన భాగమును గాని వాపసు చెల్లింపవచ్చును.

**15.** ప్రభుత్వ ఋణముల లెక్కలు—

ప్రతి ప్రభుత్వ రుణముయొక్క లెక్కలును, ఆంధ్రప్రదేశ్ అకౌంటెంటు జనరలుచే నిర్వహింపబడవలెను.

**16.** ప్రభుత్వేతర రుణముల నిమిత్తము రుణ విమోచన నిధి-

ఒక ప్రభుత్వేతర రుణముల విషయములో, అది వార్షికములద్వారా లేక

సాలువారి డ్రాయింగ్సు ద్వారా వాపసు చెల్లింపబడవలసి యుండనిచో, పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తు ఈ దిగువ రీతిగా ఒక ఋణవిమోచన నిధిని స్థాపించవలెను.–

(i) అది తన రాబడిలో నుండి, ఋణమును మంజూరుచేయు అధికారి నిర్ణయించునట్టి చక్రవడ్డీ రేటుప్రకారము జమ అగుచు ఋణము వాపసు చెల్లింపు నిమిత్తము నిర్ణయింపబడిన వ్యవధిలో ఆ ఋణమును తీర్చుటకు సరిపోవునంత మొత్తమును అట్టి నిధులకు చేర్చవలెను.

(ii) మంజూరుచేయు అధికారి అన్యథా ఆదేశించిననే తప్ప, అది ఆ ఋణమును గైకొనిన లేక తెచ్చిన తేదినుండి ఒక సంవత్సరములోగా అట్టి చెల్లింపులలోని మొదటి చెల్లింపును చేయవలెను.

(iii) అది తన ఋణవిమోచన నిధి లెక్కలను ఆంధ్రప్రదేశ్ అక్కౌంటెంటు జనరలుకు సాలీనా దాఖలు చేయవలెను. మరియు ఆ నిధిలో ఎంత మొత్తము తక్కువైనదని ఆయనచే సర్టిఫై చేయబడునో అంత మొత్తమును క్రమక్రమముగా సర్దుబాటు చేయుటకు ప్రభుత్వమువారు అనుమతించిననే తప్ప తన రాబడినుండి తక్షణము చెల్లింపవలెను.

## 11. సంస్థలు రెండు లేక ఎక్కువ పంచాయతీలచే ఉమ్మడిగా స్థాపింపబడి, నిర్వహింపబడుట :–

ఈ దిగువ సంస్థలు రెండు లేక ఎక్కువ పంచాయతీ సమితులచే ఉమ్మడిగా స్థాపింపబడి, నిర్వహింప బడవచ్చును;—

(1) (i) వ్యవసాయక స్టోర్సు, మ్యూజియములు కలిసి ఉండునవి;

(ii) నారు సరఫరా నిమిత్తము నర్సరీలు ;

(2) వ్యావసాయక పరికరములను, యంత్రములను తయారు చేయు, మరమ్మతుచేయు వర్కుషాపులు ;

(3) కృత్రిమ స్థలన కేంద్రములు, పౌల్ట్రీ యూనిట్లు :

(4) వంట చెరకు, కలప, పశుగ్రాసము, పచ్చి ఆకుల సరఫరాకై అడవులను లేక వుడ్‌లాండ్సును అభివృద్ధిచేయు నిమిత్తము సంస్థలు :

(5) (i) కుటీర పరిశ్రమల సర్వీసు కేంద్రము ;

(ii) గ్రామీణ శిల్పుల ఉపయోగమునకై ఉమ్మడి సౌకర్యముల కేంద్రము;

(iii) ఉమ్మడి గ్రామీణ కళలు, చేతిపనులు మరియు పరిశ్రమల శిక్షణ కేంద్రము;

(6) హాస్పిటల్సు; శానిటేరియంలు;

(7) మలేరియా నిరోధక, ఫైలేరియా నిరోధక చర్యలను నిర్వహించుటకై సంస్థలు;

(8) చేతిపనులు మరియు దుస్తులను చేయు కేంద్రములు;

(9) భిక్షుక గృహములు, అనాథ శరణాలయములు;

(10) సహకార సంస్థలు, మరియు

(11) ఈ చట్టపు షెడ్యూలులో నిర్దిష్ట పరుపబడిన పనులను నిర్వర్తించు నిమిత్తము అవసరమగునట్టి యితర సంస్థలు.

## 12. గ్రామాధికారుల వద్దనుండి సమాచారమును తెప్పించుటకు నిబంధన.

1959వ ఆంధ్ర ప్రదేశ్ పంచాయతీ సమితుల జిల్లా పరిషత్తులచట్టము (1959వ ఆంధ్ర ప్రదేశ్, ఆంధ్రి చట్టము XXXV) యొక్క 21వ సెక్షను 69వ సెక్షనుయొక్క (1)వ సబ్ సెక్షను సహా యిచ్చిన అధికారములను చలాయించి, ఆంధ్రప్రదేశ్ గవర్నరు ఈ క్రింది నిబందన యిందు మూలముగా చేయడమైనది :-

### నిబంధన

ఒక పంచాయతీ సమితి వ్రాతపూర్వకమైన వుత్తరువులవల్ల పంచాయతీ సమితి జూరిస్‌డిక్షనులో యున్న గ్రామములోని గ్రామాధికారిని, అతని అధీనములో యున్న ఏ గ్రామముయొక్క లేక గ్రామములో భాగము యొక్క లేక చట్టము పనులకు కావలసిన దానిలోని ఆస్తియొక్క ఈ క్రింది వివరములకు సంబంధించిన సమాచారము యివ్వమని కోరవచ్చును.

(a) సర్వే నెంబరు, సబ్ డివిజన్, తరగతి భూమి మెరకా పల్లమా అను సమాచారము, వైశాల్యము, పన్ను, భూమి రిజిష్టరు అయిన వాని పేరు లేక గ్రామరికార్డులలో దొరకు గ్రామ హద్దులలోని భూమి ఆక్రమణదారు—

(b) (i) వైటల్ స్టాటిస్టిక్సు :

(ii) ధరల స్టాటిస్టిక్సు—పంట ధరలు;
చిల్లర వ్యవసాయ సంబంధమైన ధరలు.

(iii) వ్యవసాయ సంబంధమైన కూలి భత్యములు.

(iv) వివిధ రకములైన పంటల క్రింద వైశాల్యము.

(v) ముఖ్యమైన ఆహార సంబంధమైన పంటలు ఆహారసంబంధము కాని పంటలకు సంబంధించిన ఉత్పత్తి స్టాటిస్టిక్సు, సాధారణ పంట, ప్రతి పంటకు కండిషన్ ఫాక్టరు.

(vi) ఇరిగేషన్ స్టాటిస్టిక్సు ; మరియు

(viii) వ్యవసాయపు పనులు ఎలాభివృద్ధి.

## 13. ఆంధ్రప్రదేశ్ ఎన్నికల నిర్వహణ, పంచాయతీ సమితి తాత్కాలిక అధ్యక్షునియొక్కయు, జిల్లా పరిషత్తు తాత్కాలిక చైర్మనుయొక్కయు అధికారముల విధుల నియమావళి :—

### 1 వ భాగము

#### ఉపక్రమణిక

1. ఈ నియమావళి 1959, ఆంధ్రప్రదేశ్ ఎన్నికలనిర్వహణ, పంచాయతీ సమితి తాత్కాలిక అధ్యక్షునియొక్కయు, జిల్లా పరిషత్తు తాత్కాలిక చైర్మనుయొక్కయు అధికారముల విధుల నియమావళి అని పిలువబడవచ్చును.

2. ఈ నియమావళిలో సందర్భము అన్యధా అపేక్షించిననే తప్ప—

(i) "చట్టము" అనగా 1959, ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సమితుల జిల్లా పరిషత్‌ల చట్టము (1959 లో 35 వ ఆంధ్రప్రదేశ్, ఆంధ్ర చట్టము) అని అర్థము ;

(ii) "విభాగము" అనగా చట్టములోని ఒక భాగమని అర్థము;

(iii) ఈ నియమావళిలో ఉపయోగింపబడియు నిర్వచింపబడని పదములు, పదజాలములు క్రమముగా చట్టములో వాటికి తెలుపబడిన అర్థమే కలిగి యుండవలయును.

## రెండవ విభాగము

### పంచాయతీ సమితి తాత్కాలిక అధ్యక్షుని ఎన్నిక

3. పంచాయతీ సమితి తాత్కాలిక అధ్యక్షుని ఎన్నిక పంచాయతీ సమితి కార్యాలయములో అందునిమిత్తమై బ్లాకు అభివృద్ధి అధికారి ఏర్పాటు చేసిన సమావేశములో జరుపబడవలయును. అట్టి సమావేశమునకు హాజరైన సభ్యులలో అధిక సంఖ్యాకులచే ఎన్నుకొనబడినట్టియు ఎన్నికలో పోటీకి నిలబడనట్టియును పంచాయతీ సభ్యుడు అధ్యక్షత వహించవలయును. అట్టి సమావేశముయొక్క అధ్యక్షుడు, ఎన్నికలో ఓటు చేయుటకు హక్కు కలిగి యుండవలయును.

4. అట్టి సమావేశము జరుగగల తేదీని, సమయమును తెలుపుచు ఈ నియమావళికి అనుబంధింపబడిన నమూనాలో పంచాయతీ సభ్యులందరకును ఆ సమావేశపు తేదీకి అయిదు పూర్తి రోజులు ముందుగా ఒక నోటీసు ఈయబడవలయును.

5. పంచాయతీ సమితి తాత్కాలిక అధ్యక్ష పదవి యొక్క అభ్యర్థిని ఒక సభ్యుడు ప్రతిపాదింప వలయును. వేరొక సభ్యుడు బలపరుచవలయును. ఆ సమావేశముయొక్క అధ్యక్షుడు సక్రమముగా ప్రతిపాదింపబడి, బలపరుచబడిన అభ్యర్థులందరి పేర్లను చదివి వినిపింపవలయును.

అయితే, 4వ విభాగము, (1) వ ఉప విభాగము, (i)వ ఖండపు లేక (ii) వ ఖండపు మినహాయింపు నిబంధన యొక్క (బి) ఖండము క్రింద నామ నిర్దేశము చేయబడిన పంచాయతీ సమితి సభ్యుడు పంచాయతీ సమితి తాత్కాలిక అధ్యక్షుడుగా ఎన్నుకొన బడుటకు అర్హుడు కాడు.

6. (1) ఒక్క అభ్యర్థిని మాత్రమే సక్రమముగా ప్రతిపాదింపబడి నప్పుడు ఇక ఎట్టి ఎన్నికగాని ఉండరాదు. మరియు ఆయన ఎన్నుకొనబడి నట్లుగా ప్రకటింపబడవలయును.

(2) ఇద్దరు లేక అంతకెక్కువమంది అభ్యర్థులున్న సందర్భములో ఎన్నిక రహస్య బ్యాలెటు పద్ధతిపై జరుపబడవలయును. మరియు ఆసమావేశ మునకు హాజరైన సభ్యుల ఓట్లు తీసికొనబడవలయును.

(3) (2)వ ఉప నియమము క్రింద ఓట్లు తీసికొనవలసి వచ్చిన సంద ర్భములో ఆ అభ్యర్థుల పేర్ల (ఇంగ్లీషు/తెలుగు) అక్షర క్రమము ననుసరించి అభ్యర్థులకు వరుస సంఖ్యలు కేటాయింపబడవలయును. ఆ సమావేశపు అధ్యక్షుడు ఒక్కొక్క అభ్యర్థికి కేటాయింపబడిన వరుస సంఖ్యను ప్రకటింప వలయును.

7. (1) ఆ సమావేశపు అధ్యక్షుడు బ్యాలెటు పెట్టెను ఏర్పాటు చేయ వలయును. ఆ పెట్టె వోటు పత్రములను అందులో వేయుటకు మాత్రమే వీలుండి తాళము తీయకుండ వోటు పత్రములను బయటకు తీయుటకు వీలు లేనివిధముగా తయారుచేయబడినదై ఉండవలయును.

(2) ఆ సమావేశపు అధ్యక్షుడు వోట్లు తీసికొనబడుటకు సద్యః పూర్వము హాజరైన సభ్యులందరకును ఖాళీగా ఉన్న బ్యాలెటు పెట్టెను, అది ఖాళీగా ఉన్నట్లు వారందరికు కన్పించువిధముగా చూపించి ఆ పిమ్మట దానికి తాళమువేసి, దానిపై తన సీలు వేయవలెను. ఆ సీలును పగులకొట్టిననేగాని పెట్టె తెరచుటకు వీలులేని విధముగా సీలువేయవలెను.

8. ఓటు చేయదలచిన ప్రతి సభ్యునకు ఒక వోటు పత్రము ఈయబడ వలయును. ఆ పత్రముపై ఈ క్రింది నమూనాలో అభ్యర్థులందరియొక్క పేర్లు సైపుచేయబడి లేక స్పష్టముగా వ్రాయబడి యుండవలయును.

| | పేరు | ఓటు |
|---|---|---|
| (1) | | |
| (2) | | |
| (3) | | |

ఆ సమావేశాధ్యక్షుడు వోటు పత్రమును ఇచ్చుటకుముందు, దాని ప్రామాణికతను సూచించుటకుగాను దానిపై ముద్రకూడవేయవలయును. అటుపిమ్మట వోటరు వోటు జేయుటకు ప్రత్యేకింపబడిన స్థలమునకు పోయి, అచ్చట తాను వోటు ఈయదలచుకొనిన వ్యక్తి పేరు కెదురుగా వోటు పత్రముపై గుర్తుపెట్టవలయును. అప్పుడు రహస్యమును కాపాడు నిమిత్తము ఆ వోటు పత్రమును మడచి సమావేశాధ్యక్షునకును ఇతర సభ్యులకును కన్పించునట్లు వుండబడిన బ్యాలెటుపెట్టెలో దానిని వేయవలయును. చదువురాని లేక ఓటు చేయుటకు శారీరకముగా అశక్తుడైన సభ్యుడు ఎవరైన కోరినచో ఆ సమావేశాధ్యక్షుడు, వోటు చేయుటకు ప్రత్యేకింపబడిన స్థలమునకు ఆయనను తీసుకొనిపోయి, ఆయన ఎవరికి వోటు చేయదలచినది అడిగి తెలిసికొని తదనుసారముగా ఓటు పత్రిముపై గుర్తుపెట్టి, రహస్యమును కాపాడుటకై దానిని మడచి బ్యాలెటు పెట్టెలో వేయవలయును. ఆ సమావేశాధ్యక్షుడు బ్యాలెటు రహస్యముగా జరుగుటకు తగు ఏర్పాటు చేయించవలయును.

(4) ఓటింగు ముగిసిన వెంటనే సమావేశాధ్యక్షుడు హాజరైన సభ్యుల ఎదుట ఆ బ్యాలెటు పెట్టెను తెరచి దానిలోనుండి ఓటు పత్రములను తీసి లెక్కించి వాటి సంఖ్యను ఒక పట్టికలో వ్రాయవలయును. ఓటు పత్రము ఈ క్రింది సందర్భములలో చెల్లనేరదు;—

(ఏ) దానిపై వోటరు సంతకము ఉన్నచో, లేక దానిలో ఆయనను పోల్చుకొనుటకు వీలగు ఏదైన మాట, చిహ్నము లేక కనబడు గుర్తు ఉన్నచో;

(బి) దానిపై ఒకటికంటె ఎక్కువ పేర్లకు ఎదురుగా గుర్తుపెట్టబడియున్నచో ;

(సి) దానిపై ఇద్దరు లేక అంతకంటె ఎక్కువమంది అభ్యర్థులలో ఎవరికి ఓటు చేయవలెనని ఉద్దేశింపబడెనో తెలిసికొనుటకు అనుమానాస్పదముగా ఉండునట్లు గుర్తుపెట్టబడియున్నచో; లేక

(డి) దానిపై ఎట్టిగుర్తుకాని పెట్టబడనిచో, లేక

(ఇ) దానిపై (3)వ ఉపనియమములో నిర్ణయింపబడిన ముద్ర లేనిచో;

5. ఆ తరువాత సమావేశాధ్యక్షుడు ఫలితములను ఈ క్రింది విధముగా ప్రకటింప వలయును :—

(i) అభ్యర్థులు ఇద్దరు మాత్రమే ఉన్నప్పుడు ఆ ఇద్దరిలో ఎక్కువ ఓట్లు వచ్చిన వ్యక్తి సక్రమముగా ఎన్నుకొనబడినట్లు ప్రకటింప వలయును. ఇర్వురకు ఓట్లు సమానముగా వచ్చిన సందర్భములో హాజరైన సభ్యుల ఎదుట సమావేశాధ్యక్షుడు చీట్లు వేయవలయును. ఏ అభ్యర్థి పేరుగల చీటీ మొదట తీయబడునో ఆ అభ్యర్థి సక్రమముగా ఎన్నుకొనబడినట్లు ప్రకటింప బడ వలయును.

(ii) ఇద్దరికంటె ఎక్కువ మంది అభ్యర్థులున్నప్పుడు అందరికంటె తక్కువ ఓట్లు వచ్చిన వ్యక్తిని మినహాయించి తిరిగి చీట్లు తీసికొనబడవల యును. అభ్యర్థుల అందరకును ఓట్లు సమానముగా వచ్చినప్పుడు లేక తక్కువ ఓట్లు వచ్చిన అభ్యర్థులలో ఇర్వురకు లేక అంతకంటె ఎక్కువ మందికి ఓట్లు సమానముగా వచ్చినప్పుడు సభ్యుల సమక్షములో చీట్లువేసి అట్టి అభ్యర్థులలో ఎవరిని మినహాయించవలయునో తేల్చుకోవలయును. ఈ మినహాయింపు పద్ధతి ఇర్వురు అభ్యర్థులు మాత్రమే మిగులువరకు కొనసాగించి చివరిసారిగా ఓట్లు తీసుకొని ఆ ఇద్దరిలో ఎవరికి ఎక్కువ ఓట్లు వచ్చునో ఆయన సక్రమముగా ఎన్నుకొనబడినట్లు ప్రకటింపబడవలయును. చివరకు మిగిలిన ఇద్దరు అభ్యర్థు లకు ఓట్లు సమానముగా వచ్చిన సందర్భములో సమావేశాధ్యక్షుడు సభ్యుల సమక్షములో చీట్లు వేయవలయును. మొదట తీయబడిన చీటీలో ఎవరి పేరుండునో ఆయన సక్రమముగా ఎన్నుకొనబడినట్లు ప్రకటింపబడవలయును.

(8) ఏ అభ్యర్థిగాని బ్యాలెటులో పాల్గొనరాదు కాని ఒక అభ్యర్థి ఏ దశ లోనైనను ఏన్నికనుండి ఉపసంహరించుకొనవచ్చును. అట్లు ఉపసంహరించు కొనిన పిమ్మట ఆయన ఏదేని బ్యాలెటులో పాల్గొనవచ్చును. 7వ నియమము, (5)వ ఉప నియమము (ii) ఖండము ననుసరించి మినహాయింపబడిన అభ్యర్థి ఆ తర్వాత దశలో జరుగు బ్యాలెటులో పాల్గొన వచ్చును.

9. సమావేశము ముగిసిన వెంటనే సమావేశాధ్యక్షుడు—

(ఎ) సమావేశపు ప్రొసీడింగులను రికార్డుగా తయారు చేసి దానిపై సంతకము చేసి సరిదిద్దబడిన ప్రతిచోట తన చిన్న సంతకము చేయవలయును. సమావేశమునకు హాజరైన ఎవరేని సభ్యుడు అట్టి రికార్డుపై సంతకము చేయ గోరినచో అట్లు సంతకము చేయుటకు అంగీకరింప వలయును.

(బి) పంచాయతీ సమితికి తాత్కాలిక అధ్యక్షుడుగా ఎన్నుకొనబడిన వ్యక్తి పేరును తెలియజేయుచు పంచాయతీ సమితి యొక్క నోటీసు బోర్డుపై ఒక నోటీసును అంటించవలయును. అట్టి నోటీసు యొక్క ప్రతులను ఒకటి జిల్లా కలెక్టరుకు వేరొకటి ప్రభుత్వమునకు పంపవలయును.

10. సమావేశాధ్యక్షుడు అటుపిమ్మట ప్రతి అభ్యర్థికిని సంబంధించిన లెక్కింపబడినట్టియు త్రోసిపుచ్చబడినట్టియు ఓటు పత్రములను వేర్వేరు ప్యాకెట్లలో పెట్టి ప్రతి ప్యాకెట్టును సీలుచేసి. అందులోవున్న పత్రముల వివరములను అవి ఏ ఎన్నికకు చెందినవో ఆ ఎన్నిక వివరములను అది జరిగిన తేదీని దానిపై వ్రాయవలయును.

(2) ఎన్నికల న్యాయాలయము లేక అర్హమైన ఇతర న్యాయాలయము ఉత్తరువు క్రింద తప్ప ఈ ప్యాకెట్లను విప్పుటగాని. అందులోని పత్రములను పరిశీలించుట గాని ఎవరికైనను చూపుటగాని చేయరాదు.

(3) ఈ ప్యాకెట్లు పంచాయతీ సమితి కార్యాలయములో ఒక సంవత్సరముపాటు పదిల పరుపబడి అటు పిమ్మట అర్హమైన న్యాయాలయము అన్యథా ఆదేశించిననే తప్ప, నాశనము చేయబడవలయును,

## మూడవ భాగము

తాత్కాలిక అధ్యక్షుని అధికారములు, విధులు :—

చట్టము యొక్క 22 విభాగము (6)వ ఉప విభాగము క్రింద ఎన్నుకొనబడిన తాత్కాలిక అధ్యక్షుడు చట్టముయొక్క 24 విభాగము (5)వ ఉప విభాగము (బి) ఖండములో నిర్దిష్ట పరుపబడిన అధికారములను ఉపయోగింపరాదను షరతునకు లోబడి చట్టము ప్రకారము అధ్యక్షునకు గల అన్ని అధికారములను ఉపయోగింప వలయును. మరియు అన్ని విధులను నిర్వహింప వలయును.

## నాల్గవ భాగము

### జిల్లా పరిషత్తు తాత్కాలిక చైర్మను ఎన్నిక

12. పంచాయతీ సమితి తాత్కాలిక అధ్యక్షుని ఎన్నికకు సంబంధించిన రెండవభాగపు నిబంధనలు జిల్లా పరిషత్తు తాత్కాలిక చైర్మను ఎన్నికకు

కూడః దిగువ పేర్కొనబడిన మార్పులకు లోబడి వర్తించును. ఆ మార్పు లేవనగా :—

(ఏ) అందులో "పంచాయతీ సమితి", "తాత్కాలిక అధ్యక్షుడు" అను మాటలు ఎక్కడెక్కడ వచ్చినను వాటి స్థానములో "జిల్లా పరిషత్తు" "తాత్కాలిక చైర్మను" అను మాటలు క్రిమానుసారముగా ఉంచబడ వలయును.

(బి) 3వ నియమములో పేర్కొనబడిన సమావేశమునకు జిల్లా కలెక్టరు అధ్యక్షత వహింపవలయును. ఆయనకు ఎన్నికలో ఓటు చేయు అధి కారము ఉండవలయును,

(సి) 6వ నియమమునకు గల మినహాయింపు నిబంధన వదలివేయ బడవలయును,

(డి) 9వ నియమము (బి) ఖండమువో పేర్కొనబడిన నోటీసు యొక్క ప్రతి జిల్లా కలెక్టరుకు ప్రభుత్వము వారికి అందజేయ వలయును.

## ఐదవ భాగము

## తాత్కాలిక చైర్మను అధికారములు, విధులు

చట్టముయొక్క 48 విభాగము (5)వ ఉపవిభాగము ననుసరించి ఎన్ను కొనబడిన తాత్కాలిక చైర్మను చట్టము ప్రకారము చైర్మనుకు గల అన్ని అధికారములను ఉపయోగింప వలయును మరియు అన్ని విధులను నిర్వహింపవలయును.

## నోటీసు నమూనా

కార్యాలయము

నెం. తేదీ 19

తాత్కాలిక అధ్యక్షుని తాత్కాలిక చైర్మనుని ఎన్నుకొను నిమిత్తము పంచాయతీ సమితి.........జిల్లా పరిషత్తు సమావేశము................ (తేదీన)........................ (సమయమున) దానికార్యాలయములో జరుప బడునని పంచాయతీ సమితి...............జిల్లా పరిషత్తు సభ్యులైన

శ్రీ.............................గారికి ఇందు మూలముగా నోటీసు అంద జేయబడుచున్నది. సభ్యులు సమావేశమునకు హాజరగుట వీలు కల్పించు కొనవలసినదిగా కోరడమైనది.

(సంతకము)
హోదా
ముద్ర

## 14. పంచాయతీలపై బ్లాకు డెవలెప్‌మెంటు ఆఫీసర్ల పర్యవేక్షణాధికారములకు సంబంధించిన నియమావళి

[జి. ఓ. ఎమ్‌ నెం 1202. ప్రణాళిక, స్థానిక పరిపాలన సమితి-IV శాఖ 1959 డిసెంబరు, 6.]

### ప్రకటన

### నియమావళి

1. (1) పంచాయత్ సమితి అధికార క్షేత్రములోని పంచాయతీలకు అప్పగించబడిన ఏదైన పథకము, ప్రాజెక్టు, సంస్థ లేక ఇతర పని విషయము లోను, పంచాయతీ సమితియొక్క అభివృద్ధి కార్యకలాపములో ప్రత్యక్ష సంబం ధముగల పంచాయతీ కార్యక్రమము విషయములలోను బ్లాకు అభివృద్ధి అధికారి ఈ దిగువ వాటియందు ప్రవేశించి, తనిఖీ చేయవచ్చును—

(ఎ) ఏదైన స్థిరాస్తి, లేక పంచాయతీ యొక్కగాని దాని నిర్వహ ణాధికారి యొక్కగాని నియంత్రణ క్రింద జరుగుచున్న ఏదైన పని;

(బి) ఏదైన పంచాయతీచే నిర్వహింపబడుచున్న లేక దాని నియంత్రణ క్రింద ఉన్న ఏదైన సంస్థ; అట్టి సంస్థలో నిర్వహింపబడుచున్న ఏదైన రికా ర్డులు, రిజిష్టర్లు లేక ఇతర పత్రములు;

(సి) ఏదైన పంచాయతీ కార్యాలయము, దానిలో నిర్వహింపబడు చున్న ఎవైన రికార్డులు రిజిష్టర్లు లేక ఇతర పత్రములు;

(2) పంచాయతీలు, వాటి అధ్యక్షులు, కార్యనిర్వాహకాధికారవర్గ ములు, అధికారులు, ఉద్యోగులు—బ్లాకు అభివృద్ధి అధికారి ఇందు నిమిత్తము తన విద్యుక్త ధర్మములను నిర్వర్తించుటలో అవసరమని భావించు పంచా యతీ అస్తిని లేక భవనములను అన్ని పత్రములను సబబైన అన్ని వేళల లోను పరిశీలించుటకు, అవకాశము ఆయనకు కల్పించవలెను.

2. బ్లాకు అభివృద్ధి అధికారి పంచాయతీ సమితి లేక దాని స్థాయీ సమితి సిఫారసుల ప్రకారము—

(ఎ) పంచాయతీ సమితి యొక్క ఏదైన పథకమును సంబంధించిన లేక దానితో ప్రత్యక్ష సంబంధముగల ఏదైన ప్రజాకార్యము లేక సర్వీసునకై అవకాశమును కల్పించి అమలు పరచవలెనని లేక వాటిని ఏర్పరుపవలెనని ఆదేశింప వచ్చును.

(బి) ఏదైన పంచాయతీ లేక కార్యనిర్వాహకాధికార వర్గము స్వాధీన ములోనున్న లేక వారి నియంత్రణ క్రిందనున్న ఏదైన రికార్డును, రిజిష్టరును లేక ఇతర పత్రమును తెప్పించ వచ్చును.

(సి) ఏదైన రిటర్ను ప్లాను, అంచనా, స్టేటుమెంటు, అకౌంటు లేక సంఖ్యా వివరములను అందజేయ వలసినదని ఏదైన పంచాయతీని లేక కార్య నిర్వాహకాధికార వర్గమును కోరవచ్చును.

(డి) అట్టి పంచాయతీకి సంబంధించిన ఏదైన విషయముపై ఏదైన సమాచారమును లేక నివేదికను పంపవలసినదని ఆ పంచాయతీని లేక దాని కార్యనిర్వాహకాధికార వర్గమును కోరవచ్చును;

(ఇ) ఏదైన పంచాయతీ లేక కార్యనిర్వాహకాధికార వర్గము యొక్క ప్రొసీడింగుల లేక కర్తవ్యముల విషయములో తన అభిప్రాయములను ఆ పంచాయతీ లేక కార్యనిర్వాహకాధికార వర్గము పరిశీలనార్థము లిఖితపూర్వ కముగా రికార్డు చేయవచ్చును,

3. పంచాయతీ సమితి యొక్క పథకము లేక పని ఉమ్మడిగా రెండు లేక ఎక్కువ పంచాయతీలకు అప్పగింపబడినపుడు, పంచాయతీ సమితి యొక్క అభివృద్ధి కార్యకలాపముతో ప్రత్యక్ష సంబంధముగల ఏదైన పథకము లేక పని రెండు లేక అంతకెక్కువ పంచాయతీలు ఉమ్మడిగా అరంభించినపుడు, బ్లాకు అభివృద్ధి అధికారికి అట్టి పథకము లేక పని విషయములో ఆ పంచాయతీలపై 1, 2 నియమములో నిర్దిష్ట పరుపబడిన అధికారములే ఉండవలెను.

4. బ్లాకు అభివృద్ధి అధికారిచే 1, 2, 3 నియమముల క్రింద వినియోగింపనగు అధికారములు, స్థానిక పరిపాలన ఇన్స్పెక్టరు జనరలు నియంత్రణ క్రిందనున్న అర్హులగు ఇతర ప్రభుత్వాధికారులచే వినియోగింపబడదగు ఏవైన అధికారములకు అదనముగా ఉండవలెనేగాని వాటికి భిన్నముగా ఉండ కూడదు.

## 15. చట్ట రూపేణా నిర్మింబడిన పంచాయతీ సమితుల జిల్లా పరిషత్‌ల వివిధ తరగతి సభ్యుల నియమించుటకు లేక బదిలీ చేయుటకు అర్హతగల అధికారికి సంబంధించిన నిబంధనలు

[జి. ఒ. యమ్. యస్. నెం. 1175, ప్లానింగు స్థానిక పరిపాలన (సమితి-iv), 3వ డిసెంబరు 1959]

### నిబంధనలు

(1) పంచాయతీ సమితులలోను జిల్లా పరిషత్‌లలోను నియమింపబడవలసిన సిబ్బందిని నియమించుటకు, బదిలీచేయుటకు అర్హతగల అధికారి జంటించిన షెడ్యూళ్ళలో తెల్పిన మాదిరిగా ఉండును.

(2) పంచాయతీ సమితులలో లేక జిల్లా పరిషత్‌లలో పనిచేయుచుండి, కాని రాష్ట్రి తరగతిలో చేరిన సిబ్బందిని, బదిలీచేయుటలో ఈ క్రింది బాహుళ్యమైన సిద్ధాంతములను అమలు జరుపవలెను :—

(ఎ) వీలైనంతవరకు వ్యక్తులను వారి స్వంత జిల్లాలకు పంపించవలెను.

(బి) ఒకమారు పంపబడిన తరువాత ప్రతివిషయములోను ఆయా పంచాయతీ సమితులు, జిల్లా పరిషత్‌లు, జిల్లా అధికారులచే మరియు డిపార్టు మెంటుల హెడ్డులచే ప్రభుత్వమునకు వ్రాతపూర్వకముగా రికార్డు చేయబడి తెలుపబడిన సబబు అయిన కారణములకు తప్ప సాధారణముగా మూడు సంవత్సరముల వరకు కదుపుటకు వీలులేదు. మూడు సంవత్సరముల తదుపరి కూడ ఒకవ్యక్తి తన పనిని సక్రమముగా చేసికొనునప్పుడు, అతనిని కదుపవలసిన అవసరములేదు.

3. మొదట నియమింపబడుటకు తర్ఫీదు పొందిన "విలేజి లెవెల్ వర్కర్లు' లేక గ్రామ సేవికలు ఏప్పుడు దొరికిన అప్పుడు, జిల్లా తరగతిలో చేరిన విలేజి లెవెల్ వర్కర్లు లేక గ్రామసేవికలను ఒక జిల్లా నుండి మరియొక జిల్లాకు బదిలీ చేయుటకు అధికారముకూడ ప్రభుత్వముచే చలాయించబడును.

4. (i) జిల్లా తరగతి సిబ్బంది, ప్రభుత్వపు, ప్రభుత్వముకాని ఉద్యోగులను కలిగియుండును. తరగతిలో అన్ని భవిష్యత్ ఖాళీలు, ప్రభుత్వపు ఉద్యోగి విషయములో లేక ప్రభుత్వము కాని ఉద్యోగికి ఉండిన పదవి విషయములో–ఎవరి విషయములో నైనను ఖాళీ ఏర్పడినచో, IIవ షెడ్యూలులో తెలుపబడిన రీతిని పూర్తి చేయబడును.

(ii) వ్యక్తులను నియమించుటకు, అనుమతింపబడిన పానల్ తయారు చేయుటకుముందు, కావలసిన నియమములను పొందిన వ్యక్తులు 'ఎంప్లాయిమెంటు ఎక్స్ఛేంజీ' ల నుండి తీసికొనబడి, షెడ్యూలు II కారము (2) లో తెల్పిన అర్హతగల అధికారిచే నియమింపబడవలెను.

(iii) సివిల్‌సర్వీసస్ (తరగతి, అధీనము, అప్పీలు) నిబంధనల క్రింద వివిధ తరగతుల ప్రభుత్వపు ఉద్యోగుల విషయములో క్రమశిక్షణ చర్యలు తీసికొనుటకు అర్హతగల అధికారిని నిర్ణయించుచు ఉత్తరువులు వేరుగా జారీ చేయబడును,

# 1 వ షెడ్యూలు

## సబ్బందిని నియమించుటకు, బదిలీ చేయుటకు అర్హతగల అధికారి

| పదవి | ఉద్యోగమిచ్చు అధికారి. | జిల్లాలో బదిలీచేయుటకు అర్హతగల అధికారి | జిల్లాకు అవతల బదిలీ చేయుటకు అర్హతగల అధికారి | నాలుగువారములు పైన తర్ఫీదు కాలములో ఖాళీలను లేక ఒక నెల పై కాలములో సెలవు ఖాళీలను నింపుటకు అర్హతగల అధికారి |
|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) |
| 1, జిల్లా పరిషత్తుకార్యదర్శి | ప్రభుత్వము | రాష్ట్రేతరగతి జిల్లా పరిషత్తు | ప్రభుత్వము | ప్రభుత్వము |
| 2. జిల్లాపరిషత్తు డిప్యూటీ కార్యదర్శి | ప్రభుత్వము | — | ప్రభుత్వము | ప్రభుత్వము |
| 3. అసిస్టెంటు ఇంజనీరు (ప్లానింగ్) | ప్రభుత్వము | — | ప్రభుత్వము | ప్రభుత్వము |
| 4. లోకల్ ఇంజనీరు | ప్రభుత్వము | — | ప్రభుత్వము | ప్రభుత్వము |
| 5. జిల్లా ప్లానింగు ఆఫీసరు కార్యాలయమునుండి బదిలీ కాబడిన హుజూరు హెడ్ క్లార్కు అసిస్టెంటు ఇజంనీరు (ప్లానింగు) క్రింద | జిల్లా కలెక్టరుచే పంపబడిన డిప్యూటీ తహసీలుదారు తరగతిలో చైర్మన్ ఖాళీ ఏర్పడినపుడు ఆఫీసరును నియమించును | చైర్మన్ జిల్లా పరిషత్తు సంప్రదింపుతో జిల్లా కలెక్టరు, జిల్లా పరిషత్తు నుండి, ప్రభుత్వపు కార్యాలయముకు | | |

| | (1) | (2) | (3) | (4) | (5) |
|---|---|---|---|---|---|
| 6. | డ్రాఫ్ట్సమన్ | చీఫ్ ఇంజనీరు (ప. వ. డి) | ఆయా జిల్లాఅధికారి అతడు డిపార్టుమెంటు హెడ్‌ను, జిల్లా పరిషత్తు సెక్రెటరీకి తెలియజేయుచుండ వలెను. | చీఫ్ ఇంజనీరు (ప. వ. డి) | చీఫ్ ఇంజనీరు (ప. వ. డి) |
| 7. | స్థానిక అభివృద్ధి పనుల సూపర్‌వైజర్లు | డిటో. | డిటో. | డిటో. | డిటో. |
| 8. | బ్లాక్ డెవలెప్‌మెంటు ఆఫీసరు | డెవలెప్‌మెంటు కమీషనరు. | జిల్లా కలెక్టరు. కారణములు తెల్పుచు అతడు డెవలెప్‌మెంటు కమీషనరుకు తెలియ జేయుచుండవలెను. | డెవలెప్‌మెంటు కమీషనరు. | జిల్లా బ్లాక్ డెవలప్‌మెంటు ఆఫీసరు ఆమోదింపబడిన 'పానల్ నుండి' ప్రాముఖ్య మివ్వ వలసిన వరుసలో కలెక్టరు, (1) పై ఉద్యోగమునకు అనుమతింప బడి, జిల్లాలలో పని చేయు చున్న వ్యక్తుల పానల్‌లో ఎక్స్టెన్షన్ ఆఫీసరు లేక సోషల్ ఎడ్యుకేషన్ ఆర్గనైజరు. |

| (1) | (2) | (3) | (4) | (5) |
|---|---|---|---|---|
| 9. (a) వ్యవసాయ శాఖకు చెందిన ఎక్స్టెన్షను ఆఫీసరు, పశుశాఖకు చెందిన ఎక్స్టెన్షను ఆఫీసరు సహకార శాఖకు చెందిన ఎక్స్టెన్షన్ ఆఫీసరు, పంచాయతీలకు చెందిన ఎక్స్టెన్షను ఆఫీసరు; మరియు ఇంజనీరింగు సూపర్వైజరు. | కావలసిన యోగ్యతలు. అనుభవము కలిగి, సరియైనశాఖా తరగతి సభ్యులనుండి డిపారుమెంటు హెడ్. | ఆ యా జిల్లా ఆఫీసరు, అన్ని బదలాయింపు విషయములలో అతడు, డిపార్టుమెంటు హెడ్కు, జిల్లా పరిషత్తు కార్యదర్శి, అయా బ్లాకు డెవలప్ మెంటు ఆఫీసర్లకు తెలియ జేయుచుండవలెను. పరిశ్రమల అసిస్టెంటు డైరక్టరు అన్ని బదిలీల విషయములలోను, అతడు డిపార్టుమెంటు హెడ్కు, జిల్లా పరిషత్తు సెక్రెటరీకి. ఆ యా బ్లాక్ డెవలప్మెంట్ ఆఫీసర్లకు తెలియ జేయుచుండవలెను. | డిపార్టుమెంటు హెడ్ | 2. బ్లాక్ డెవలప్ ఆఫీసరు ఆమోదించబడిన పానల్ లో చేర్చబడిన తాసిల్దారు లేక డెప్యూటీ తాసిల్దారు అతని శాఖ యొక్క సరియైన తరగతిలో యోగ్యత గలిగి, అనుభవము గల సభ్యులనుండి. అయా డిపార్టుమెంటు హెడ్. |

| (1) | (2) | (3) | (4) | (5) |
|---|---|---|---|---|
| (b) పరిశ్రమలకు ఎక్స్టెన్షను ఆఫీసరు | ప్రభుత్వముచే ఆమోదింపబడిన వ్యక్తుల జాబితా నుండి పరిశ్రమలు వాణిజ్యము డైరెక్టరు. (ఈ పదవులు నేరుగా నియమింపబడుటద్వారా నింపబడును) | పరిశ్రమల అసిస్టెంటు డైరక్టరు, అన్ని బదిలీల విషయములలోను, అతడు డిపార్టుమెంటు హెడ్‌కు, జిల్లా పరిషత్తు సెక్రటరీకు, ఆ యా బ్లాక్ డెవలప్‌మెంటు ఆఫీసర్లకు తెలియజేయుచుండవలెను. | పరిశ్రమల వాణిజ్య డైరక్టరు. | అనుమతింపబడిన వ్యక్తుల జాబితా నుండి పరిశ్రమల వాణిజ్య డైరెక్టరు. |
| (c) సోషల్ ఎడ్యుకేషన్ ఆర్గనైజరు. | ప్రభుత్వముచే ఆమోదింపబడిన వ్యక్తుల జాబితా నుండి పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ డైరెక్టరు (ఈ పదవులు నేరుగా నియమింప బడుట ద్వారా నింపబడును) | జిల్లా విద్యాధికారి అన్ని బదిలాయింపుల విషయములలో అతడు డిపార్టుమెంటు హెడ్, జిల్లా పరిషత్తు కార్యదర్శి ఆ యా బ్లాక్ డెవలప్‌మెంటు ఆఫీసర్లకు తెలియ జేయవలెను | పబ్లిక్ ఇన్‌స్ట్రక్షను డైరక్టరు. | ఆమోదింపబడిన వ్యక్తుల జాబితానుండి పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ డైరెక్టరు. |

| (1) | (2) | (3) | (4) | (5) |
| --- | --- | --- | --- | --- |
| (డి) ముఖ్యసేవిక | ప్రభుత్వముచే ఆమోదింపబడిన వ్యక్తుల జాబితా నుండి స్త్రీక్షేమ డైరెక్టరు (ఈ పదవులు నేరుగా నియమింపబడుట ద్వారా నింపబడును. | స్త్రీ క్షేమ డైరెక్టరు. అన్ని బదలాయింపుల విషయములలో ఆమె, జిల్లా పరిషత్తు కార్యదర్శి ఆయా బ్లాక్ డెవలప్‌మెంటు ఆఫీసరు. | స్త్రీ క్షేమ డైరెక్టరు. | ఆమోదింపబడిన వ్యక్తుల జాబితానుండి స్త్రీ క్షేమ మెడికల్ సర్వీసెస్ డైరెక్టరు. |
| 10. వైద్యాధికారులు | మెడికల్ సర్వీసెస్ డైరెక్టరు. | జిల్లా వైద్యాధికారి. అన్ని బదలాయింపుల విషయములలో, అతడు మెడికల్ సర్వీసు డైరెక్టరును, జిల్లా పరిషత్తు సెక్రటరీని ఆయా బ్లాక్ డెవలప్‌మెంటు ఆఫీసర్లకు తెలియజేయవలెను. | మెడికల్ సర్వీసెస్ డైరెక్టరు. | మెడికల్ సర్వీసెస్ డైరెక్టరు. |
| 11. లేడీ హెల్తు విజిటరు, హెల్తు ఇనస్పెక్టరు. | ప్రజారోగ్య డైరెక్టరు. | జిల్లా ఆరోగ్య అధికారి. | ప్రజారోగ్య డైరెక్టరు. | జిల్లా ఆరోగ్య అధికారి. |

| (1) | (2) | (3) | (4) | (5) |
|---|---|---|---|---|
| 12. ప్రోగ్రెసు అసిస్టెంటులు | ఎకనామిక్సు, స్టాటిస్టిక్సు బ్యూరో డైరెక్టరు. (ఈ పదవులు నేరుగా నియమించుట ద్వారా నింపబడుచు.) | జిల్లా స్టాటికల్ అధికారి అతడు, అన్ని బదలాయింపుల విషయములలోను ఎకనామిక్సు, స్టాటిస్టిక్సు బ్యూరో డైరెక్టరుకు, జిల్లా పరిషత్తు కార్యదర్శికి ఆయా బ్లాకుడెవలప్‌మెంటు ఆఫీసర్లకు తెలియ జేయవలెను. | ఎకనామిక్సు స్టాటిస్టిక్సు బ్యూరో డైరెక్టరు. | జిల్లా స్టాటిస్టిక్సు అధికారి. |
| 13. లైవుస్టాకు ఇన్‌స్పెక్టరు | పశు శాఖా డైరుక్టరు. | జిల్లా వెటరినరీ ఆఫీసరు అన్ని బదిలాయింపుల విషయములలోను, అతడు పశు శాఖ డైరెక్టరుకు, జిల్లా పరిషత్తు సెక్రటరీకు ఆయా బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసర్లకు తెలియ జేయవలెను. | పశు శాఖా డైరెక్టరు. | జిల్లా వెటరినరీ ఆఫేసరు. |

# II వ షెడ్యూలు

## జిల్లా తరగతి (జిల్లా పరిషత్తు)

| పదవి | నియమించు అధికారి | జిల్లాలో బదిలీచేయుటకు అర్హతగల అధికారి | జిల్లాలో బదిలీ చేయుటకు అర్హతగలఅధికారి | జిల్లా అవతలకు బదిలీ చేయుటకు అర్హతగల అధికారి. | నాలుగు వారములకు పై కాలము తర్ఫీదు కాలము లేక ఒక నెల పై కాలము శలవు ఖాళీల కాలములో ఖాళీలను నింపుటకు అర్హతగల అధికారి |
|---|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
| జిల్లా పరిషత్తు ఆఫీసు అంతలోను ప్లానింగు సెక్షను, అసిస్టెంటు ఇంజనీరు (ప్లానింగు) సిబ్బంది, దాని సంస్థలతో సహా. 1. ఆఫీసు మేనేజరు, సూపరింటెండెంట్లు, అప్పరు డివిజను క్లర్కులు, లోవరు డివిజను క్లర్కులు, టైపిస్టులు. | నేరుగా నియమింపబడుటకు, యితర విషయములలో ప్రొమోషను ద్వారా నియమించబడుటకు ఆమోదింపబడిన పానల్‌లో వ్యక్తుల నుండి జిల్లా పరిషత్తు చైర్మను. | | జిల్లా పరిషత్తు నుండి ప్రభుత్వ కార్యాలయముకు, జిల్లా పరిషత్తు చైర్మన్ సంప్రతింపుతో జిల్లా కలెక్టరు, జిల్లా పరిషత్తు నుండి పంచాయతీ సమితికి, పంచాయతీ సమితి అధ్యక్షుడు సంప్రతింపుతో జిల్లా పరిషత్ చైర్మన్, జిల్లా పరిషత్. | వ్యక్తి బదలాయింపు మీద పోవుటకు యిష్టపడు జిల్లా పరిషత్ చైర్మను సంప్రదింపులతో జిల్లా పరిషత్ చైర్మను. | జిల్లా పరిషత్ చైర్మను. |

| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
| --- | --- | --- | --- | --- | --- |
| 2. 'టీచర్లు(సెకండరీ సీనియర్ బేసిక్) | జిల్లా పరిషత్తు చైర్మను ఆమోదింపబడిన పానల్ వ్యక్తులనుండి. | | చైర్మను జిల్లాపరిషత్. | వ్యక్తి బదలాయింపు మీద పోవుటకు యిష్టపడు జిల్లా పరిషత్తు చైర్మను సంప్రదింపుతో జిల్లా పరిషత్తు చైర్మను. | జిల్లా పరిషత్ చైర్మను ఆమోదింపబడిన పానల్ వ్యక్తుల నుండి. |
| 3. జిల్లా పరిషత్తు జూరిస్ డిక్షనులోని సమితి కాని బ్లాకులలో ప్రాథమిక (జూనియర్ బేసిక్ టీచరు. | డిటో. | | | వ్యక్తి బదలాయింపు మీద పోవుటకు యిష్టపడు జిల్లా పరిషత్ చైర్మను సంప్రదింపుతో జిల్లా పరిషత్ చైర్మను. | |
| 4. మెడికల్ అఫీసరు రూరల్ డెస్పెన్సరీ. | చైర్మను, జిల్లా పరిషత్ జిల్లా పరిషత్తుచే నిర్వహింపబడిన డిస్పెన్సరీల విషయములో | | డిటో | | చైర్మను జిల్లా పరిషత్ ఆమోదింపబడిన పానల్‌లో వ్యక్తుల నుండి. |

| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
|---|---|---|---|---|---|
| | పంచాయతీ సమితి అధ్యక్షుడు, అనుమతింపబడి పానల్ నుండి పంచాయతీ సమితిచే నిర్వహింపబడిన డిస్పెన్సరీల విషయములో | అధ్యక్షుడు పంచాయతీ సమితి. | చైర్మను జిల్లా పరిషత్ పంచాయతి సమితి అధ్యక్షుని సంప్రదింపుతో | డిటో | ఆమోదింపబడిన పానల్ వ్యక్తుల నుండి పంచాయతీ సమితి అధ్యక్షుడు. |

x జిల్లా పరిషతు చైర్మన్ సంప్రదింపుతో డైరెక్టరు పబ్లిక్ ఇన్‌స్ట్రక్షనుచే ప్రభుత్వోదోగియైన ఒక ఉపాధ్యాయుడు తొలగింపబడినచో, పబ్లిక్ ఇన్‌స్ట్రక్షను డైరెక్టరు ప్రభుత్వోద్యోగియైన వేరొకనిని ప్రత్యామ్నాయ మించుట కాని లేక ఆ ఖాళీ జిల్లా పరిషత్ చైర్మనుచే నింపబడుటకుగాని వదలివేయును.

| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
|---|---|---|---|---|---|
| 5. మంత్రసానులు మరియు<br>6. జిల్లా పరిషత్ చే నిర్వహింపబడిన రూరల్ డిస్పెన్సరీలలో పనిచేయు కంపౌండర్లు | ఆమోదింపబడిన పానల్‌లోని వ్యక్తుల నుండి జిల్లా పరిషత్ చైర్మన్, | = | చైర్మన్ జిల్లా పరిషత్ | వ్యక్తి బదిలాయింపు మీద పోవుటకు యిష్టపడు జిల్లా పరిషత్ చైర్మన్ సంప్రదింపులో జిల్లా పరిషత్ చైర్మన్ | ఆమోదింప బడిన పానల్ వ్యక్తుల నుండి జిల్లాపరిషత్ చైర్మన్. |
| 7. జీప్ డ్రయివర్లు | ఆమోదింపబడిన పానల్‌లోని వ్యక్తుల నుండి జిల్లా పరిషత్ చైర్మన్. | | డిటో | డిటో | డిటో |
| 8. జిల్లాపరిషత్ లలో, జిల్లా పరిషత్‌ల క్రింద సంస్థలలో నియమింపబడిన అటెండర్లు బంట్రోతులు మొదలైనవారు. | డిటో | | డిటో | డిటో | డిటో |

## జిల్లా తరగతి పంచాయతీ సమితులు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 9. విలేజి లెవెల్ వర్కర్లు, గ్రామ సేవికలు. | బ్లాకుకు కేటాయించిన వ్యక్తుల జాబితానుండి పంచాయతీ సమితి అధ్యక్షుడు. | బ్లాక్ డెవలప్‌మెంటు ఆఫీసరు. | ఇతర పంచాయతీసమితి అధ్యక్షుడు సంప్రదింపుతో పంచాయతీ సమితి అధ్యక్షుడు | అతని జిల్లాలో ఆయా పంచాయతీ సమితి అధ్యక్షుడు సంప్రదింపుతోను మరియు వ్యక్తి పరస్పర బదలాయింపు మీద పోవుటకు యిష్టపడు జిల్లా పరిషత్ చైర్మను సంప్రదింపుతో జిల్లా పరిషత్ చైర్మను. | ఆమోదింపబడిన పానల్ వ్యక్తుల నుండి పంచాయతీ సమితి అధ్యక్షుడు. |
| 10. పంచాయతీ సమితి కార్యాలయములో మినిస్టీరియల్ సిబ్బంది | బ్లాకుకు కేటాయింపబడిన వ్యక్తుల పట్టిక నుండి పంచాయతీ సమితి అధ్యక్షుడు. | = | ఒక పంచాయతీ సమితి నుండి వేరొక పంచాయతీ సమితికి ఆయా ఇతర పంచాయతీ సమితి అధ్యక్షుడు సంప్రదింపుతో | అతని జిల్లాలో ఆయా పంచాయతీ సమితి అధ్యక్షుడు సంప్రదింపుతో మరియు పరస్పర బదలాయింపు మీద వ్యక్తి పోవుటకు | ఆమోదింప బడిన పానల్‌లో వ్యక్తుల నుండి పంచాయతీ సమితి అధ్యక్షుడు. |

| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
| --- | --- | --- | --- | --- | --- |
| | | | పంచాయతీ సమితి అధ్యక్షునివల్ల పంచాయతీ సమితినుండి జిల్లా పరిషత్‌కు బదలాయింపు పంచాయతీ సమితి అధ్యక్షుడు సంప్రదింపుతో చైర్మన్ పంచాయతీ నుండి జిల్లా కలెక్టరు అధీనములో యున్న ప్రభుత్వపు కార్యాలయముకు. పంచాయతీ సమితి అధ్యక్షుని సంప్రదింపుతో జిల్లా కలెక్టరు. | ఇష్టపడు జిలా పరిషత్ చైర్మను సంప్రదింపుతో జిల్లా పరిషత్ చైర్మను చివర చెప్పిన వ్య_ ఆయా పంచాయతీ సమితి అధ్యక్షునితో సంప్రతింపవలెను. | |

(12)

| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
|---|---|---|---|---|---|
| 11. కుట్టుపని; సంగీత ఉపాధ్యాయులతో సహా ఉపాధ్యాయులు, (ప్రాథమిక జూనియర్ బేసిక్). వయోవిద్యా పాఠశాల ఉపాధ్యాయులు. | బ్లాకులకు కేటాయింప బడిన వ్యక్తుల జాబితా నుండి పంచాయతీ సమితి అధ్యక్షుడు. | బ్లాక్ డెవలప్‌మెంటు ఆఫీసరు. | ఆయా ఇతర పంచాయతీ అధ్యక్షుడు సంప్రదింపుతో పంచాయతీ సమితి నుండి వేరొక పంచాయతి సమితికి పంచాయతీ సమితి నుండి పంచాయతీ కాని బ్లాకులో ప్రభుత్వపు పాఠశాలకు ఆయా పంచాయతీ సమితి అధ్యక్షుడు సంప్రదింపుతో జిల్లా విద్యాధికారి. పంచాయతీసమితి నుండి సమితి కాని ప్రదేశములో జిల్లా పరిషత్ క్రింద పాఠ | అతని జిల్లాలో ఆయా పంచాయతీ సమితి అధ్యక్షుడు. పరస్పర బదలాయింపు మీద వ్యక్తి పోవుట కిష్టపడు జిల్లా పరిషత్ చైర్మన్ సంప్రదింపుతో జిల్లా పరిషత్ చైర్మన్ | ఆమోదింప బడిన పానల్‌లోని వ్యక్తుల నుండి పంచాయతీ సమితి అధ్యక్షుడు. |

| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
|---|---|---|---|---|---|
| | | | శాలకు, పంచాయతీ సమితి అధ్యక్షుడు సంప్రదింపుతో జిల్లా పరిషత్తు చైర్మను. | | |

X గమనిక:—పంచాయతీ సమితి అధ్యక్షుని సంప్రదింపుతో జిల్లా విద్యాధికారిచేత ప్రభుత్వోద్యోగి అయిన ఉపాధ్యాయుడు తొలగించబడినచో జిల్లా విద్యాధికారి, ప్రభుత్వోద్యోగి అయిన మరియొకనిని ప్రత్యామ్నాయముగా నియమించుట లేక పంచాయతీ సమితి అధ్యక్షునితో ఆ ఖాళీని నింపబడుటకు వదలివేయుట చేయవచ్చును.

| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
|---|---|---|---|---|---|
| 12. కుటీరపరిశ్రమలు పరిశ్రములు దుస్తులు చేయుట మొద లైనవి. పంచాయతీ సమితుల క్రింద పని చేయుటకు ఒప్పచెప్ప బడిన తర్ఫీదు కేంద్రములలో ఉపాధ్యాయులు. | వాణిజ్యము అసిస్టెంటు డైరెక్టరు సంప్రదింపుతో పంచాయతీ సమితి అధ్యక్షుడు. | బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు. | ఇతర పంచాయతీ సమితి అధ్యక్షుని సంప్రదింపుతో పంచాయతీ సమితి అధ్యక్షుడు. | డిటో | డిటో |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 13. జీప్ డ్రయివర్లు. 14. కాంపౌండర్లు మరియు | బ్లాకుకు కేటాయింపబడిన వ్యక్తుల జాబితానుండి పంచాయతీ సమితి అధ్యక్షుడు | డిటో | ఇతర పంచాయతీ సమితి అధ్యక్షుని సంప్రదింపుతో పంచాయతీ సమితి అధ్యక్షుడు. | అతని జిల్లాలో ఆ యా పంచాయతీ సమితి అధ్యక్షుడు పరస్పర బదలాయింపు మీద వ్యక్తి పోవుటకు ఇష్టపడు జిల్లా పరిషత్ చైర్మను ప్రసందింపుతో జిల్లా పరిషత్ చైర్మను. | ఆమోదింపబడిన పానల్‌లోని వ్యక్తుల నుండి పంచాయతీ సమితి అధ్యక్షుడు. |
| 15. ప్రాథమిక ఆరోగ్య కేంద్రములలో పంచాయతీ సమితి క్రింద గ్రామ మండుల షాపులలో పనిచేయుచున్న మంత్రసానులు. | బ్లాకుకు కేటాయించిన వ్యక్తుల జాబితా నుండి పంచాయతీ సమితి అధ్యక్షుడు, అధ్యక్షుడు పంచాయతీ సమితి. | | ఇతర పంచాయతీ సమితి అధ్యక్షుని సంప్రదింపుతో పంచాయతీ సమితి అధ్యక్షుడు. | అతని జిల్లాలో ఆ యా పంచాయతీ సమితి అధ్యక్షుడు, పరస్పర బదలాయింపు మీద వ్యక్తి పోవుటకు ఇష్టపడు జిల్లా పరిషత్ చైర్మను సంప్రదింపుతో జిల్లా పరిషత్ చైర్మను. | ఆమోదింపబడిన పానల్ వ్యక్తులనుండి పంచాయతీ సమితి అధ్యక్షుడు. |

ఈ క్రిందిది గమనించుము.

పై అయిటములలో లేని అన్ని రకముల సిబ్బంది, సాధారణ ఉత్తరువుల కొరకు అట్టి విషయములను, బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసర్లు, జిల్లా పరిషత్తుల సెక్రటరీలు ప్రభుత్వమునకు తెలియజేయవలెను.

## IIIవ షెడ్యూలు

### బ్లాకు తరగతి సిబ్బంది

| | | |
|---|---|---|
| 16. అటెండర్లు బంట్రోతులు, సేవకులు, పాఠశాలదాదులు, ఊడ్చువారు మరియు కాపలా కాయువారు మొదలైనవారు. | అధ్యక్షుడు పంచాయతీ సమితి. | బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు. |

## 16. జిల్లా తరగతిలో చేరిన పదవులకు ఎన్నిక కమిటీ నిర్మాణమునకు సంబంధించిన నిబంధనలు.

(జి. ఓ. యమ్. యస్. 1292, ప్లానింగు స్థానిక పరిపాలన సమితి-iv) 28 వ డిసెంబరు 1959)

### నిబంధనలు

1\. జిల్లా తరగతిలో చేరిన, 1వ షెడ్యూలులో తెలుపబడిన పదవులకు ఎన్నిక. కాలక్రమముగా ప్రతి జిల్లాకు ప్రభుత్వముచే ఏర్పరచబడిన ఎన్నిక కమిటీచే జరుపబడును.

2\. 1 వ షెడ్యూలులో తెలుపబడిన జిల్లా తరగతిలో భవిష్యత్ ఖాళీలకు వ్యక్తుల ఎన్నిక, జిల్లా ఎన్నిక కమిటీలచే సాధారణ పద్ధతి క్రిమము ననుసరించుచు అనగా వార్తా పత్రికలలో ఖాళీలను ప్రచురించుట, యోగ్యత గలిగిన వ్యక్తులనుండి దరఖాస్తులను తెపించుట చేయుచు జరుపబడును అనేక తరగతి పదవులకు దరఖాస్తులు తెప్పించుటకు ప్రచురణ నమోనాయొక్క గుర్తు నకలు (స్పెసిమన్ కాపీ) ii వ షెడ్యూలుగా జటింపబడినది.

2\. జిల్లా పరిషత్‌లు పంచాయతీ సమితులు క్రింద పదవులకు నేరుగా నియమింపబడు ఉద్యోగములు ఈ క్రింది పద్ధతిమీద యివ్వబడును.

(I) ఉద్యోగమునకు నియమించుటకు పరిమితి ఒక వంద పదవులు. వాటిలో 16 పదవులు నిమ్న జాతులకు, నిమ్న తెగలకు ఉంచబడును. 25 పదవులు వెనుకబడిన తరగతులకు ఉంచబడును. మిగిలిన 59 పదవులు యోగ్యత ఆధారముమీద నింపబడును ;

(ii) నిమ్న జాతుల, నిమ్నతెగల, వెనుకబడిన తరగతుల సభ్యుల యోగ్యతలు, యోగ్యత నాధారముమీద నింపబడు ఏబదితొమ్మిది ఉద్యోగములకు కూడ విచారింపబడును. మరియు నిమ్నజాతిక, నిమ్నతెగకు, వెనుకబడిన తరగతికి చెందిన వ్యక్తి యోగ్యత నాధారముమీద ఎన్నుకొనబడినయెడల, నిమ్నజాతులకు, నిమ్నతెగలకు, వెనుకబడిన తరగతులకు ఉంచబడిన పదవుల సంఖ్య ఏ విధముగను మార్పు చెందదు.

(iii) ఈ నిబంధన క్రింద ఉద్యోగములు, ఇరువదిఐదు ఖాళీల ప్రతి "సైకిల్" లో క్రింద నిర్దిష్టము చేయబడిన త్రిప్పుట పద్ధతిలో చేయబడును.

1. బహిరంగ పోటీ.
2. నిమ్నజాతులు మరియు నిమ్నతెగలు.
3. బహిరంగ పోటీ.
4. వెనుకబడిన తరగతులు.
5. బహిరంగ పోటీ.
6. బహిరంగ పోటీ.
7. వెనుకబడిన తరగతులు.
8. బహిరంగ పోటీ.
9. నిమ్నజాతులు, నిమ్నతెగలు.
10. బహిరంగ పోటీ.
11. బహిరంగ పోటీ.
12. వెనుకబడిన తరగతులు.
13. బహిరంగ పోటీ.
14. వెనుకబడిన తరగతులు.
15. బహిరంగ పోటీ.
16. నిమ్నజాతులు, నిమ్నతెగలు.
17. బహిరంగ పోటీ.
18. బహిరంగ పోటీ.
19. వెనుకబడిన తరగతులు.
20. బహిరంగ పోటీ.
21. బహిరంగ పోటీ.
22. నిమ్నజాతులు, నిమ్నతెగలు.
23. బహిరంగ పోటీ.
24. వెనుకబడిన జాతులు.
25. బహిరంగ పోటీ.

---

గమనిక; ప్రతి నాల్గవ "సైకిల్"లో ఇరువది ఐదవవంతు వెనుకబడిన తరగతులకు ఉంచబడును.

(iv) "సైకిల్"లో వాటికి కేటాయించబడిన వంతుకు ఉద్యోగములకు, ఏ నిమ్నజాతులు, నిమ్నతెగలు లేక వెనుకబడిన తరగతులకు చెందిన యోగ్యత కలిగిన తగిన వ్యక్తి లేకపోయినపక్షమున, వంతు పోయి, త్రిప్పువరుసలో ముందు వచ్చు వంతుచే ఖాళీ నింపబడును. నిమ్నజాతులు, నిమ్నతెగలు లేక వెనుకబడిన తరగతులయొక్క పోయినవంతులు లెక్కలోనికి తీసికొనబడ కూడదు.

2. (B) ప్రజాక్షేమముకొరకు ఒక ఖాళీ వెంటనే నింపవలసిన అగత్యమున్నపుడు, 2 (A) నిబంధన ననుసరించి అట్టి ఖాళీ నింపుటలో విపరీతమైన ఆలస్యము ఉన్నట్లయిన, ఉద్యోగమునకు నియమించుటకు అర్హతగల అధికారి, ఆ నిబంధన ప్రకారము ఒక వ్యక్తి నియమింపబడువరకు, తాత్కాలికముగా, 2 (A) నిబంధన ప్రకారము కాకుండ వేరొక రీతిగా ఒక వ్యక్తిని నియమించవచ్చును. కాని అట్టి తాత్కాలిక ఉద్యోగము ప్రతికాలమందు ఏ విషయములోను మూడు నెలలకు మించకూడదు.

2 ఈ నిబంధనయొక్క (1)వ సబ్ రూలు క్రింద నియమింపబడిన వ్యక్తి, ఆ ఖాళీ నియమింపబడుటకు అర్హతగల వ్యక్తిచే సాధ్యమైనంత త్వరలో తొలగింపబడును, మొదట చెప్పబడిన వ్యక్తి, అతడు తాత్కాలికముగా పని చేసిన పదవులమీద ఏ హక్కులను పొందుటకు అర్హత గలిగియుండడు.

2. (C) పదవులు, ఒకే తరగతిలో ఉద్యోగపు పెంపులకు ఈ నిబంధనల లోని దేదియు అనువర్తించదు

3. వ్యక్తుల ఎన్నిక, ప్రతి విషయములో ప్రభుత్వముచే నిర్ణయింపబడిన తారీకుకు ముందు నిర్దిష్టమయిన పదవుల విషయములో, నిర్దిష్టమయిన సంఖ్యలకు జిల్లా ఎన్నిక కమిటీలచే పూర్తికావించబడును.

4. జిల్లా తరగతిలో చేరిన ప్రతి పదవి విషయములో యోగ్యతలు మరియు యితర నౌకరీ షరతులు నిర్ణయించుచు-ఉత్తరువులు విడిగా జారీ చేయబడును.

5. ఈ ఉత్తరువుకు జంటించిన 1వ షెడ్యూలులో లేని యితర పదవులకు ఉద్యోగము, 3వ డిసెంబరు 1952 తేదీగల జి. ఒ. యమ్ యస్. నెం. 1175, ప్లానింగు స్థానిక పరిపాలనలో జారీచేయబడిన ఉత్తరువుల ననుసరించి యివ్వబడును.

## 1వ షెడ్యూలు

### జిల్లా తరగతి (జిలా పరిషత్)

1. ప్లానింగుసెక్షను, అసిస్టెంటు ఇంజనీరు (ప్లానింగు) దాని సంస్థలు.

2. టీచర్లు (సెకండరీ, సీనియర్ బేసిక్)

3. జిల్లా పరిషత్ జూరిస్ డిక్షనులోని సమితి కాని బ్లాకులలో ఉపాధ్యాయులు. (ప్రాథమిక జూనియరు బేసిక్)

4. జిల్లాపరిషత్ జూరిస్ డిక్షనులోని సమితి కాని బ్లాకులలో లోకల్ ఫండు (రెగ్యులర్) డిస్పెన్సరీలు. ఆసుపత్రు (ఆయుర్వేదము. అల్లోపతి, మరియు విరాళ మివ్వబడిన, విరాళ మివ్వబడని)లలో వైద్యాధికారులు, కాంపౌండరు, మెటర్నటి అసిస్టెంటులు, మగనర్సింగు ఆర్డర్లీలు, ఆడనర్సింగు ఆర్డర్లీలు.

5. జిల్లా పరిషత్ జూరిస్‌డిక్షనులో సమితి కాని బ్లాకులలో రూరల్ డిస్పెన్సరీ (ఆయుర్వేదము, అల్లోపతి మరియు విరాళమివ్వబడని)లలో రూరల్ మెడికల్ ప్రాక్టీషనర్లు, మెటర్నిటీ అసిస్టెంటులు,

6. జిల్లా పరిషత్ జూరిస్ డిక్షనులో సమితికాని బ్లాకులలో రిజర్వు ఆరోగ్య అసిస్టెంటులు, రిజర్వు ఆడ ఆరోగ్య అసిస్టెంటులు (టీకాలు) మరియు మెటర్నిటీ అసిస్టెంటులు,

7. జీప్ డ్రయివర్లు.

8. అన్ని సమితికాని బ్లాకులలో విలేజి లెవల్ వర్కర్లు గ్రామసేవికలు.

### జిల్లా తరగతి (పంచాయతీ సమితులు)

9. విలేజి లెవెల్ వర్కర్లు.

10. గ్రామ సేవికలు.

11. పంచాయతీ సమితి కార్యాలయములో జూనియర్ ఎకౌంటెంటు-మరియు స్టోరుకీపరు, లోవర్ డివిజన్ గుమాస్తాలు, టైపిస్టులు.

12. వయోవిద్య మరియు ప్రయోజ్ఞానపు పాఠశాలలో పనిచేయుచున్న కుట్టుపని, సంగీతము చెప్పు ఆడవారు, ఉపాధ్యాయులసహా ఉపాధ్యాయులు (ప్రాథమిక మరియు జూనియర్ బేసిక్).

13. పంచాయతీ సమితులకు ఒప్పజెప్పిన తర్ఫీదు కేంద్రములు, కుటీర పరిశ్రమలు, దుస్తులు తయారు చేయుట మొదలైన వాటిలో ఇన్‌స్ట్రక్టర్లు.

14. లోకల్‌ఫండు (రెగ్యులర్) డిస్పెన్సరీలు, ఆసుపత్రుల (ఆయుర్వేదము, అల్లోపతి విరాళ మివ్వబడిన మరియు యివ్వబడని) లో మెడికల్ ఆఫీసర్లు, కంపౌండర్లు, మెటర్నిటీ అసిస్టెంటులు, మగ నర్సింగు ఆర్డర్లీలు, ఆడ నర్సింగు ఆర్డర్లీలు.

15. రూరల్ డిస్పెన్సరీల (అయుర్వేదము, అల్లోపతి విరాళ మివ్వబడని) లో రూరల్ మెడికల్ ప్రాక్టీషనర్లు, మెటర్నిటీ అసిస్టెంటులు.

16. ఆరోగ్య అసిస్టెంటులు (టీకాలు), మెటర్నిటీ అసిస్టెంటులు.

17. ప్రాథమిక ఆరోగ్య కేంద్రములలో పనిచేయు కాంపౌండర్లు మరియు మంత్రసానులు.

18. జీప్ డ్రయివర్లు.

## II వ షెడ్యూలు

### ప్రకటన గుర్తు నమోనా

* (......................................) పేరు.

జిల్లా పరిషత్........................ (పదవి పేరు) దరఖాస్తులు-పిలువబడినవి.

పంచాయతీ సమితి బ్లాకు ... ... ... ... ... ...
జిల్లా పరిషత్ క్రింద ... ... ... ... ... ... యొక్క-
పదవి/పులు ... ... ... ... ... ... కు నియమించుటకు
... ... ... ... దరఖాస్తులు ... ... వరకు పిలువబడినవి.

యోగ్యత గలిగిన వ్యక్తులు జిల్లా పరిషత్ కార్యాలయమువద్ద పిలువబడినపుడు వారి స్వంత ఖర్చుమీద జిల్లా ఎన్నిక కమిటీ ముందు పరీక్షకు హాజరగు

టకు సిద్ధముగా యుండవలెను. ఎక్కడ కావలెనన్న అచ్చట ఎన్నుకొనబడిన వ్యక్తులు నిర్ణీతమైన తర్ఫీదు పొందవలయును. దరఖాస్తులు సాధారణమైన కాగితముమీద ఉండి ఈ క్రిందివాటిని కలిగియుండవలెను.

1) దరఖాస్తుదారుని పూర్తి పేరు, 2) తండ్రి పేరు 3) ప్రస్తుత విలాసము 4) శాశ్వతవిలాసము, 5) పుట్టుక తేదీ మరియు స్థలము, 6) విద్యాయోగ్యతలు 7) గత 5 సంవత్సరములలో ఒకసంవత్సరముకుపైగా వ్యక్తి నివసించిన స్థలము విలాసము; మరియు 8) ఇంతకు ముందు ఏమైనఉద్యోగమున్నయెడల దాని తబిసీళ్లు.

దరఖాస్తులు ఈ క్రింద సంతకముచేసిన వారికి కవరుమీద"..................గా ఎన్నుకొనబడుటకు దరఖాస్తు" అని ఉండునటుల ఉద్దేశింపబడవలెను. క్రమముగా నిజమైనవని రుజువుపరచిన యోగ్యతాపత్రముల నకళ్ళను మాత్రము జతించవలయును. యోగ్యతలకు, వయస్సు, పరిమితి ఇతర షరతులు నిబంధనలకు సంబంధించిన తబిసీళ్లు ఉచితముగా ఈ క్రింద సంతకము చేసినవారినుండి వ్రాతపూర్వకమైన కోరికపైన వారి స్వంత విలాసముగల సైజుగల దానికి న. పై. పోస్టేజి అంటించబడిన కవరు పంపిన యెడల పొందవచ్చును.

సరియైనసైజుగల కవరు, కావలసిన స్టాంపులు లేక కోరికలు మన్నింపబడవు.

జిల్లా పరిషత్ నిధికి చేరునటుల ఏ ప్రభుత్వపు ఖజానాలోనైన X( ) ప్రతి దరఖాస్తుదారునిచే రూ. 5.(ఐదుమాత్రమే) రుసుము చెల్లింపబడవలెను. ఆ విధముగా చెల్లించిన గుర్తుగా చలానా దరఖాస్తుతో యుండవలెను. రుసుము చెల్లింపు మనిఆర్డరుద్వారా Xలేక (ఇండియన్ పోస్టలు ఆర్డరుద్వారా కూడ అంగీకరింపబడును). నిమ్నజాతికి లేక నిమ్నతెగకు లేక వెనుకబడిన తరగతికిచెందిన దరఖాస్తుదారులచే ఏ రుసుము చెల్లింపబడనవసరములేదు.

—కార్యదర్శి, జిల్లాపరిషత్.

---

X1వ జూన్ 1960 తేదీగల జి ఓ. యమ్. యస్. నెం. 794 ప్లానింగు స్థానిక పరిపాలన (స. IV) లో సవరణచే "ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము" అను మాటలు వదలబడినవి.

# 17. ఎన్నిక తరగతి విలేజి లెవెల్ వర్కర్లు, గ్రామసేవికల యొక్క ఉద్యోగముల పెంపుకు సంబంధిచిన నిబంధనలు

[జి. ఒ. యమ్. యస్. నెం. 168, ప్లానింగు స్థానిక పరిపాలన (సమితి-IV), 10వ ఫిబ్రవరి 1960.]

## నిబంధనలు

1. ఎన్నిక తరగతికి విలేజి లెవెల్ వర్కర్లు, గ్రామ సేవికల ప్రమోషను, నింపవలసిన ఎన్నిక తరగతి ఖాళీల సంఖ్య, ఎన్నిక పద్ధతి మొదలైన వాటికి సంబంధించిన కాలక్రమముగా ప్రభుత్వముచే జారీ చేయబడు ఉత్తరువుల ననుసరించి కనీసము నాలుగు సంవత్సరముల నౌఖరీగల విలేజి లెవెల్ వర్కర్లు, గ్రామ సేవికలనుండి జిల్లా ఎన్నిక కమిటీచే జరుపబడును.

2. ఎన్నిక తరగతికి ప్రమోషనుకు అర్హతగల వ్యక్తుల ఎన్నికకొరకు, విలేజి లెవెల్ వర్కర్ల ప్రమోషనుకు జిల్లా వ్యవసాయాధికారి, గ్రామ సేవికల ప్రమోషనుకు అసిస్టెంటు స్త్రీ క్షేమ అధికారి-ఒక సభ్యుని ఎక్కువగా జిల్లా ఎన్నిక కమిటీ దానికి చేర్చును.

3. ఎన్నిక తరగతికి ప్రమోషనుకు అర్హతగల వ్యక్తుల ఎన్నిక అయిన తరువాత, వ్యవసాయములో గ్రాడ్యుయేట్లు కాని ఎన్నిక తరగతి పదవులలో విలేజి లెవెల్ వర్కర్ల సంఖ్య ఆంధ్ర ప్రాంతములో లేక తెలంగాణా ప్రాంత ములలో బ్లాకుకు యిద్దరు ఎట్టి సమయందైనను దాటకుండు పద్ధతిని (గ్రామ, సేవికల విషయములో IIవ తరగతిలో మాత్రము ప్రతి ఆరు పదవులలో ఒకటి ఎన్నిక తరగతి (తరగతి I)కి ఎక్కువ తరగతికి చేయు పద్ధతి మీదను జిల్లా ఎన్నిక కమిటీ, జిల్లాలో పంచాయతీ సమితి బ్లాకులకు వ్యక్తులను కేటా యించును,

4. ఎన్నిక తరగతి పదవులకు ప్రమోటు చేయబడు విలేజి లెవెల్ వర్కర్లు, (గ్రామ)సేవికల యొక్క పనిని అంచనావేయుటకు సబ్జక్టులు జాబితా తెలియుట కొరకు చేర్చబడ మయినది. వ్యక్తులను ఎన్నుకొను సమయములో,

ఈ క్రింద తెలియజేసిన మార్గములో యించు మించుగా జిల్లా ఎన్నిక కమిటీ సభ్యులచే మార్కులు కేటాయించబడును. ఎక్కువ సంఖ్య మార్కులు పొందిన వ్యక్తులు కావలసిన పద్ధతుల ప్రకారము ఎన్నుకొనబడవలెను.

విలేజి లెవెల్ వర్కర్ల విషయములో

| | |
|---|---|
| మార్కుల మొత్తము సంఖ్య ... ... | 100 |
| సబ్జక్టులు | కేటాయించవలసిన మార్కుల సంఖ్య |
| (i) వ్యవసాయము ... (పరిశుభ్రమైన విత్తనము తోడుగు, ఆకుపచ్చ ఎరువు, ఎరువుల ప్రదర్శనములు, మాదిరి వ్యవసాయ దారులు, పొలములు, గ్రామ పంచాయతీలు మొదలగు వాటి ద్వారా, తెగులు మందులు, చల్లు పరికరములు) | 75 (ప్రతి అయిటముకు మార్కులుండును) |
| (ii) పశు వైద్యశాల ... ... | 10 |
| (iii) సహకారము ... ... | 10 |
| (iv) సాధారణ విషయములు ... ... | 5 |
| | 100 |

గ్రామ సేవికల విషయములో

మార్కుల మొత్తము సంఖ్య 100

x 1వ జూన్ 1960 తేదీగల జి. ఒ. యమ్. యన్. నెం 7941 ప్లానింగు స్థానిక పరిపాలన (సమితి-IV)లో సవరణచే 'లేక ఒక స్టేట్ బ్యాంక్' అను మాటలు వదల బడినది.

x x పై చెప్పిన సవరణచే "లేక పోస్టేజి స్టాంపులద్వారా లేక ఇండియన్ పోస్టలు ఆర్డరుద్వారా లేక ఏ యితర ఫారములోనైన అంగీకరింప బడదు" అను మాటలకు, ఈ మాటలు ప్రత్యామ్నాయము చేయబడినవి.

| సబ్జక్టులు | | | కేటాయించవలసిన మార్కుల సంఖ్య |
|---|---|---|---|
| (i) మాతృ శిశు సంరక్షణ | ... | ... | 30 |
| (ii) వ్యవసాయము (పంటతోట, పూలతోట, పండ్లతోట, డయిరీ ఫార్మింగు, కోళ్ల మొదలైన వాటి పెంపకము) | ... | ... | 10 (ప్రతి అయిటముకు మార్కులుండును.) |
| (iii) ఆరోగ్యము పరిశుభ్రత | ... | ... | 20 |
| (iv) ఆహారము, పోషణ | ... | ... | 10 |
| (v) ఇంటి యాజమాన్యము | ... | ... | 10 |
| (vi) దుస్తులు | ... | ... | 10 |
| (vii) పరికరములు | ... | ... | 5 |
| (viii) సాధారణ విషయములు | ... | ... | 5 |
| | | | 100 |

## అనుబంధము

విలేజి లెవెల్ వర్కర్ల పనిని అంచనా వేయుటకు సబ్జక్టుల జాబితా

1 పశు వైద్యశాల :

చిన్న జబ్బులకు గ్రామములలో చికిత్స పొందిన జంతువుల సంఖ్య. నపుంసకత్వము కలుగజేయబడిన వాటి సంఖ్య—

ఉత్పత్తి చేయుట, పెంచుట, యాజమాన్యము వహించుట, జబ్బునరి కట్టుటలో అభివృద్ధి చేయబడిన పద్ధతులకు గ్రామస్థుల వైఖరి.

కృత్రిమ వీర్యము నెక్కించు కేంద్రము ఆ స్థలములో ఏమైన ఉన్న యెడల అది.

కోళ్ల మొదలగు పశుల పెంపకము ప్రారంభించుటకు ఉత్సాహ మివ్వ బడిన బహిరంగ వ్యక్తుల సంఖ్య.

యివ్వబడిన కోళ్ళు మొదలైనవాటి మరియు లేక పొదగబడుచున్న గ్రుడ్లయొక్క సంఖ్య.

యివ్వబడిన మేరకు వేయు విత్తనములు, మొక్కలు కోయబడిన మొక్కలు, వేరుల సంఖ్య మరియు మొత్తము.

పాతబడినమేరకు ఉపయోగించు వృక్షముల సంఖ్య, ఏర్పాటుచేయబడిన మరియు లేక సహాయము యివ్వబడిన కోళ్ల మొదలగు వాటికి సంబంధించిన జీవులతో సహా జీవజంతువులకు సంబంధించిన జీవుల సంఖ్య.

విలేజి లెవల్ వర్కరుకు నేరుగాగాని యితరముగాగాని బాధ్యతగల పశువైద్యశాలలో ఏ యితర ప్రాముఖ్యమైనపని.

2. సహకారము :

నౌకరీ సహకారములున్న గ్రామముల శాతము, నౌకరీ సహకారము లున్న గ్రామీణ కుటుంబములయొక్క శాతము.

దగ్గర మార్కెటింగు కో-ఆపరేటివులద్వారా బజారుకుపంపిన ఉత్పత్తి మొత్తము సహకారసంఘముచే పంచబడిన గింజలు, ఎరువులు, ఇతర సరఫరాల మొత్తము.

3. వ్యవసాయము :

ఎరువు ఉత్పత్తిచేయు గ్రామీణ కుటుంబముల శాతము.

నికర పంట ప్రదేశము, శాతముగా పచ్చ ఎరువు ప్రదేశము.

వారి స్వంత ఉపయోగమునకు, యితరులకు పంచుటకు పచ్చ ఎరువు, బాగుచేయబడిన గింజలు అభివృద్ధి చేయుటకు రిజిష్టరు అయిన కుటుంబముల శాతము.

ఈ క్రింది ఏ మూడింటిని అవలంబించుచున్న కుటుంబముల శాతము :

(a) సిఫార్సు చేయబడిన భూమిని జాగ్రత్తపరచు పద్ధతుల నవలంబించుట.

(b) సిఫార్సు చేయబడిన నీటిని జాగ్రత్తపరచు పద్ధతుల నవలంబించుట.

(c) ఎరువుల ఉపయోగము.

(d) మొక్కలను జాగ్రత్తపరచు పరికరముల ఉపయోగము.

(e) వ్యవసాయపు అభివృద్ధి పద్ధతుల ఉపయోగము.

ఇటీవల నెలలో ఈ క్రింది ఏ రెండింటిలో పాల్గొనిన గ్రామీణ కుటుంబముల శాతము ;

(1) ఖారిఫ్ ఉత్పత్తి కార్యకలాపము.

(2) వ్యవసాయ తర్ఫీదు కాంప్యు.

(3) యువక వ్యవసాయదారుల క్లబ్బులు.

4. నీటిపారుదల :

బ్లాకులో వ్యవసాయము చేసిన మొత్తము ప్రదేశము నీటి పారుదల సదుపాయములున్న ప్రదేశము. 1958-59 సంవత్సరములో నీటి పారుదల కావింపబడిన నికరమైన ప్రదేశము.

గ్రామ సేవికలు పొందిన కార్యములు
అంచనా వేయుటకు సబ్జక్టుల జాబితా.

1. వ్యవసాయము దానికి సంబంధించిన సబ్జక్టులు :

వారి వ్యవసాయపు పనిలో, పొలములో పనిచేయు కాపురముచేయు, ఆడు వారికి యిచ్చిన సహాయము. గ్రామములో చేసిన ఆహారోత్పత్తి పెంపు.

మంచి విత్తనములు, ఎరువులు, అభివృద్ధి చేయబడిన పనిముట్లు, కంపోస్టు ఉపయోగించుట తెలియుట.

పంటతోటలు ఏర్పరచిన సంఖ్య. కూరగాయల విత్తనముల ఉత్పత్తి, వాటిని జాగ్రత్త పరచుట.

పువ్వుల చెట్లను, పండ్ల చెట్లను నాటుట.

డయిరీ ఫార్మింగు, ఆరోగ్యకరమగు పాలను సేకరించు పద్ధతి.

కోళ్ల మొదలగు వాటిని పెంచు కేంద్రముల నిర్వహణ. పందులు, మేకలు, గొర్రెలు, పిచ్చికలు మరియు బాతులు.

నిర్వహింపబడిన తేనెటీగ గూళ్ల కేంద్రముల సంఖ్య.

సెరికల్చర్.

చాపల పరిశ్రమ.

2. ఆరోగ్యము, శుభ్రత :

స్వంత జీవితములో ఎంతవరకు ఆరోగ్యము అలవాటులు సాధనము చేయబడినది.

గ్రామములలో ఇళ్లు కట్టుకొనవారు ఎంతవరకు వారి ఇళ్ళను, చుట్టు ప్రక్కలను శుభ్రముగా వుంచుటకు, వారి కుటుంబములలో మంచి ఆరోగ్యము నుంచుటకు సహాయపడినారు. ఎంతవరకు జబ్బులు అరికట్టబడినవి.

ప్రాథమిక చికిత్స ఉపయోగము, జబ్బు వారికి ఇంటిలో శ్రద్ధ తీసి కొనుట.

చికిత్సచేయు ఆరోగ్య స్థలము ఉపయోగము అందరికి తెలియజేయుట, గ్రామీణ కుటుంబములచే సదుపాయములు.

3. మాతృ శిశు సంరక్షణ :

ప్రసవించుటకు ముందు, తరువాత తీసుకొనవలసిన శ్రద్ధను గురించి తెలిసికొనుట, పసిపిల్లలను గురించి శ్రద్ధ, పిల్లల జబ్బులను గురించి తెలిసి కొనుట.

## కుటుంబ నియంత్రణ విద్య

4. ఆహారము, పుష్టిని కలిగించు పదార్థములు :

ఉన్నటువంటి మూలములతో కుటుంబమునకు ఆరోగ్యకరమైన, పుష్టిని కలిగించు ఆహారములను ఏర్పాటు చేయుట.

పుష్టి విలువలను జాగ్రత్తపరచు ఆహారములను తయారు చేయుట; జాగ్రత్తపరచుట.

5. ఇంటి యాజమాన్యము :

సౌఖ్యవంతమైన, ఆరోగ్యకరమైన, బాగుగా కంజాయింపుగల ఇంటిని నిర్వహించుట, గరిష్ట తృప్తికి వున్న మూలములను ఉపయోగించుటకు అభివృద్ధి చెందుచున్న సామర్థ్యత; గృహ సంబంధమైన యాజమాన్యము,

ఇళ్ళ ఏర్పాటు చేయుట, ఇంటికి ప్లాను వేయుట ఏర్పాటు చేయుట మొదలైనవి.

6. దుస్తులు :

ఉన్న మూలములలో కుటుంబమునకు సరియైన దుస్తులు ఏర్పాటు చేయుట, దుస్తులు తయారుచేయుట, దుస్తులను ఉతుకుట, దుస్తులను జాగ్రత్త పరచుకొనుట.

7. పనులు :

పేము, వెదురుగడ్డిమొదలగువాటినుండి విసనకర్రలు, బుట్టలు, చాపలు మొదలైన స్థానికముగా చవుకగా దొరకువాటితో, పనులద్వారా ఆదాయమునకు దోహదము చేయుటకు వస్తువులను తయారుచేయుట.

8. సహకారము :

సహకార సమస్య సూత్రములు; సహకార సమస్యలో ఆడవారి పాత్ర, మితవ్యయము.

9. సాధారణ :

కుటుంబ క్యాంపులను, పిల్లల క్యాంపులను, ఆడవారి క్యాంపులు మొదలైనవాటిని సమావేశపరచుట.

గ్రామ సంతలు, మేళములు, ప్రదర్శనములలో పాల్గొనుట మహిళా మండలులు, బాలికా మండలులు ఏర్పాటు చేయుట, వారి పనులను నిర్వహించుట.

డబ్బు జాగ్రత్తపరచుటను ప్రోత్సహించు సంఘములు.

అజ్ఞానము తొలగించుటకు, టీకాలు వేయుటకు కృషిని అందరికితెలియజేయుట.

సర్వోదయ, వన మహోత్సవ, భూదానము మొదలైనవి.

## 18 పంచాయతీ సమితి సభ్యులు సమితి సమావేశములకు హాజరైనందులకు చెల్లించు బత్తెములు

(ఎ) అధ్యక్ష ఉపాధ్యక్షులను కలుపుకొని పంచాయతీ సమితి, యొక్క ప్రతి సభ్యునకు చట్టము యొక్క 6వ విభాగములో నిర్దిష్ట పరుపబడిన రాజ్య విధాన మండలి యొక్క ప్రతి సభ్యునకు పంచాయతీ సమితి సమావేశమునకు హాజరైనందులకు;

(బి) చైర్మనును కలుపుకొని, పంచాయతీ సమితి స్థాయీ సమితి యొక్క ప్రతి సభ్యునకు అట్టి సమితి సమావేశమునకు హాజరైనందుకు సమావేశపు మొదటిదినమునకు ఐదురూపాయలను ఆ తర్వాత దినములకు రోజుకు మూడు రూపాయలు చొప్పునను బత్తెము చెల్లింపబడవలయును, మరి ఏ ఇతర బత్తెముగాని చెల్లింపబడరాదు.

కాని పంచాయతీ సమితి లేక దాని స్టాండింగ్ కమిటీ సమావేశములకు హాజరగుటకు ఇరవై మైళ్ళ దూరము మించిన దూరమునుండి రావలసిన పంచాయితీ సమితి ప్రతి సభ్యుని విషయములో, మొదటి దినమునకు ఏడు రూపాయల భత్యము, సమావేశము అయిన ప్రతి తరువాత రోజునకు మూడు రూపాయలు యివ్వబడును ఇతర భత్యము యివ్వబడదు

## 19. సమితి అధ్యక్షులు బ్లాకులో పర్యటించినందుకు మైలేజీ, దిన బత్తెములకు సంబంధించిన నియమావళి

పంచాయతీ సమితి అధ్యక్షునకు, అధికార రీత్యా ఆయనకు గల విధులను నిర్వర్తించుచు బ్లాకులో పర్యటించినందుకు మైలేజీ దిన బత్తెములకు బదులుగా ఏ దినమున అయినను ఆయన పర్యటించిన దూరముతో నిమిత్తము లేకుండా——

(ఎ) సొంతవాహనము ఉపయోగించుకొనునపుడు రోజుకు రూ. 5 (అయిదు రూపాయలు.) మాత్రమే.

(బి) ప్రభుత్వమువారి వాహనము ఉపయోగించు నపుడు రోజుకు రూ. 3 (మూడు రూపాయలు) మాత్రమే మొత్తము అలవెన్సు చెల్లింపబడ వలయును.

గమనిక:—"దినము" అనగా అర్ధరాత్రి సమయమున ఆరంభమై అంత మగు ఒక క్యాలెండరు దినము అని అర్థము.

## 20. పంచాయతీ సమితి నిధిని వినియోగింపదగు కార్యములను నిర్ణయించు నియమావళి

(1960 జనవరి 27 వ తేదీ ప్రణాళిక; స్థానిక పరిపాలన (సమితి-4) మెమో నెం. 666)

### 1వ భాగము

1. ఈ నియమావళిలో, సందర్భము అన్యథా అపేక్షించిననే తప్ప-

(i) "చట్టము" అనగా 1959, ఆంధ్ర ప్రదేశ పంచాయతీ సమితుల, జిల్లా పరిషత్తుల చట్టము (1959 లో 35 వ ఆంధ్రప్రదేశ్ చట్టము, అని అర్థము ;

(ii) "విభాగము" అనగా చట్టములోని ఒక విభాగము అని అర్థము ;

(iii) ఈ నియమావళిలో ఉపయోగింపబడియు నిర్వచింపబడని పదములు, పద సముదాయములును, చట్టములో వాటికి గల అర్థములనే కలిగి యుండవలెను.

2. పంచాయతీ సమితి నిధిని వినియోగింపదగు కార్యములలో, సంబంధించిన శాసనములచే లేక వాటిక్రింద చేయబడిన నియమావళిచే, అవశ్యముగా చేయవలసినవిగా గాని వివేచనానుసారముగా చేయదగినవిగా గాని స్పష్టముగా ప్రకటింపబడిన అన్ని విషయములను, సాధారణముగా పరిపాలనకు సంబంధించిన ప్రతి విషయమును చేరును. ఆ నిధి ఈ నియమావళికిని, ప్రభుత్వమువారు చేయు ఇంకేదైన నియమావళికిని, జారీ చేయు ఉత్తరువులకును లోబడి బ్లాకు లోపల వినియోగింపబడవలెను. ఖర్చు నిమిత్తము ఈ చట్టము

అధికార మిచ్చునెడల లేక ప్రభుత్వము ప్రత్యేకముగా మంజూరు చేయు నెడల పంచాయతీ సమితి వెలుపల కూడ అట్టి కార్యముల నిమిత్తము ఆ నిధిని వినియోగింపవలెను.

3. పంచాయతీ సమితి పరిపాలనకు సంబంధించిన ఖర్చు పద్దులలో ఇతర విషయములతో బాటు, ఈ దిగువ విషయములు చేర్చవలెను.

(ఎ) పంచాయతీ సమితి ప్రధాన కార్యాలయము యొక్కయు ఇతర కార్యాలయముల యొక్కయు ఏర్పాటు; నిర్వహణ పరికరములు, ఫిట్టింగుల ఖర్చు, భీమా, పన్నులు కూడా యిందు చేరును;

(బి) సిబ్బంది, సభ్యుల జీతములు, భత్యములు, దుస్తులు పెన్షనరీ మరియు ప్రావిడెంటు నిధి, గ్రాడ్యుయిటీలకు విరాళములు, పంచాయతీ సమితికి చెందిన బండ్లను నడుపుటకు వాటి నిర్వహణకు కాగల ఖర్చు, పై వాటిని పురస్కరించుకొని అగు ఖర్చంతయును ;

(సి) దాని నియంత్రణలో వున్న అన్ని కార్యాలయముల నిమిత్తము స్టేషనరీ, ముద్రణ ;

(డి) శాసన సంబంధమైన ఖర్చులు ;

(ఇ) ఎన్నికల ఖర్చులు ,

(ఎఫ్) ఆడిటర్ల ఫీజు ;

(జి) పాఠశాల యొక్కయు ఇతర సంస్థల యొక్కయు ఏర్పాటు నిర్వహణ ;

(హెచ్) చట్టపు కార్యము లన్నిటికి, లేక వాటిలో దేని నిమిత్తమైన భూమి సేకరణ ;

(ఐ) ప్రకటన ఖర్చులు ;

4. పంచాయతీ సమితి నిధి ఆ బ్లాకులోని ఏదైన పంచాయతీ సమితికై నిధులకు లేక ఆ జిల్లాయొక్క జిల్లా పరిషత్తు నిధికి విరాళ మిచ్చుటకు వినియోగింపబడవచ్చును. ఆ నిధిని, ప్రభుత్వము మంజూరును పొంది, ఈ దిగువ వాటికి కూడ వినియోగింప వచ్చును ;

(1) తన అధికార క్షేత్రములో జరుగు ఏదైన సార్వజనిక ప్రదర్శనము, ఉత్సవము లేక వినోద కార్యక్రమములకగు ఖర్చుల క్రింద విరాళము;

(2) ఏదైన ధర్మనిధికి గాని బీదల సహాయము నిమిత్తము లేక రోగుల, వికలాంగుల చికిత్స నిమిత్తము లేక కారణముల పరిశోధన నిమిత్తము గల ఏదైన సంస్థ నిధులకు విరాళము ;

(3) ఇదేవిధమగు కార్యముల నిమిత్తము ఏవైన ఇతర అసాధారణ వ్యయములు,

5. బడ్జెటు కేటాయింపు లేనిపక్షమున బ్లాకు అభివృద్ధి అధికారి ఈ దిగువ సందర్భములో పంచాయతీ సమితి నిధినుండి ఏదైన మొత్తమును చెల్లింపవచ్చును లేక చెల్లింపు నిమిత్తము అధికారము యీయవచ్చును :—

(ఎ) ఈ చట్టము లేక ఏదైన శాసనము క్రింద పన్నులు సర్‌చార్జి లేక రుసుము వాపసు;

(బి) డిపాజిట్టులో వుంచిన కంట్రాక్టర్ల లేక ఇతర వ్యక్తుల పైకము పొరపాటున వసూలు చేసిన లేదా పంచాయతీ సమితి నిధికి జమ కట్టబడిన పైకము వాపసు చెల్లింపు ;

(సి) పంచాయతీ సమితిపై సివిల్‌కోర్టు ఇచ్చిన డిక్రీ లేక జారీ చేసిన ఉత్తరువు క్రింద లేక ఏదైన వ్యాజ్యము లేక లీగలు ప్రొసీడింగు లేక క్లయిము విషయములో చేసుకొన్న రాజీక్రింద చెల్లింపదగు మొత్తములు ;

(డి) బ్లాకు అభివృద్ధి అధికారి ఏదైన చట్టము క్రింద నష్టపరిహారము నకు లేక ఖర్చుల క్రింద చెల్లింపవలసిన ఏదైన మొత్తము ;

(ఇ) ఏదైన పట్టపు నిబంధన క్రింద బాధ్యుడైన వ్యక్తి వద్దనుంచి రాబట్టుకొనవచ్చునని ఆశించి న్యాయముగా పెట్టబడిన ఖర్చులు :

అయితే బ్లాకు అభివృద్ధి అధికారి పరిస్థితులను వెంటనే పంచాయతీ సమితికి తెలియపరచవలెను. ఆ సమితి బడ్జెటు గ్రాంటు క్రిందకి రానట్టి ఏదైన ఖర్చును భర్తీ చేయుటకు ఆ పరిస్థితులలో అవసరమని లేక సమంజసమని తోచునట్టి చర్యలను తీసుకోవలెను.

6. బ్లాకు అభివృద్ధి అధికారి తప్పక అవసరమగు లేక తక్షణము కావలసిన పైకముకంటె ఎక్కువగా పంచాయతీ సమితి నిధిలోనుండి తీయరాదు.

6. (ఎ) పంచాయతీ సమితి ఉపయోగము కొరకు జీవ జంతువులు, పరికరములు, స్టోరు సామానులు, తదితరములు కొనుటకు ఒక్క మారుగా వెంటనే కావలసిన 1500 రూపాయల పరిమితి వరకు అడ్వాన్సును తీయుటకు బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరుకు అధికారము గలదు. ఆ విధముగా తీసిన అడ్వాన్సును, అది తీయబడిన పదిహేను దినముల లోపల, అతడు దానిని వినియోగించి, ఆ సమాచారమును స్టాండింగ్ కమిటీ (పన్నులు, ఆర్థికము) కి తెలియజేయవలెను.

7. పంచాయతీ సమితి, పంచాయతీ నిధిని వినియోగించు నిమిత్తము ఏజంట్లుగా పంచాయతీలను సాధ్యమైన ఎక్కువగా ఉపయోగించుకొనవలెను.

8. (1) సమాజ వికాస కార్యక్రమము క్రింద కేటాయించబడిన నిధులు ప్రతి పంచాయతీ సమితికి ప్రతి ఆర్థిక సంవత్సరములోను రెండు వాయిదాలలో ఈయబడవలెను. ఆ నిధులు యీ దిగువ షరతులకు లోబడి వినియోగించబడవలెను ;—

(ఎ) భారత ప్రభుత్వము మొదటిదశ, రెండవదశ బ్లాకులకుగాను నిర్ణయించిన సిబ్బంది వ్యవస్థ అనుసరింపబడవలెను ;

(బి) పథకపు బడ్జెటులోని "రికరింగు", "నాన్‌రికరింగు", "ఋణము" "ఋణేతరము"ల క్రింద గరిష్ట పరిమితులను మొత్తముమీద పాటించవలెను ;

(సి) ఆ యీయబడిన మొత్తములను పంచాయతీ సమితి బడ్జెటులో చేర్చబడిన సమాజ వికాస కార్యక్రమము క్రింద ఆమోదించబడిన కార్యక్రమముల మొత్తములో చేర్చబడిన పద్దులపై ఖర్చు చేయవలెను ;

(డి) సమాజ వికాస కార్యక్రమము క్రింది ప్రతి వికాసపు పద్దు క్రింద యిచ్చిన మొత్తముకన్న తగ్గకున్న ఖర్చు అగునట్లు పంచాయతీ సమితి చూడవలెను ;

(ఇ) అయినప్పటికీ పంచాయతీ సమితి ఒక వికాసపు పద్దునుండి మరియొక పద్దుకు నిధులను మరల కేటాయించుట అవసరమని భావించిన యెడల ప్రభుత్వమువారి పూర్వామోదముతో మరల అట్లు కేటాయించవచ్చును. సాధార

ణముగా అట్టి కేటాయింపులు జరుపరాదు. ప్రతి వికాసపు పద్దు క్రిందను ఈయబడిన నిధులకు పంచాయతీ సమితి నిధులుకూడ కొంత చేర్చవలెను.

(ఎఫ్) బడ్జెటులో చేర్చబడిన పనుల మరియు పథకముల విషయములలో, ప్రభుత్వమువారు జారీచేసిన లేక కాలానుగుణముగా జారీచేయగల ఉత్తరువులద్వారా నిర్ణయించిన మేరకు ప్రజల వద్దనుంచి రావలసిన కనీసపు విరాళము ఆ పనుల లేక పథకముల నిర్వహణ నిమిత్తము సందర్భానుసారముగా ప్రజలవద్దనుంచి లేక పంచాయతీ వద్దనుంచి వసూలు చేయబడవలెను.

9. "గ్రామీణ కళలు, చేతిపనులు, పరిశ్రమల" క్రింద చేయబడు కేటాయింపులకు ఖాదీ మరియు గ్రామపరిశ్రమల కమీషనువారున్నూ, భారత ప్రభుత్వ వాణిజ్య పరిశ్రమల యంత్రాంగ శాఖక్రింద యితర అఖిలభారత బోర్డులున్నూ ఇచ్చే గ్రాంటులను, అప్పులను చేర్చవలెను :—

ఖాదీ గ్రామ పరిశ్రమలకును అఖిల భారత బోర్డులకును సంబంధించిన పథకములను కాలానుగుణముగా వారిచే నిర్దిష్టపరుపబడు షరతులకును నియమావళికి లోబడి అమలు పరచవలెను.

10. పంచాయతీ సమితికి బదిలీ చేయబడిన మామూలు ప్రభుత్వ అభివృద్ధిశాఖల నిధులు, సంబంధించిన శాఖలచే విధింపబడిన షరతులకు లోబడి ఖర్చు చేయబడవలెను. సంబంధించిన అధికారుల సాంకేతికాభిప్రాయమును పంచాయతీ సమితి పాటించ వలెను.

11. పంచాయతీ సమితి ఈ దిగువ కార్యముల నిమిత్తము విరాళములను ఈయవలెను. అవేవనగా :—

(i) బ్లాకులోని ఏదైన నిర్మాణముకు లేక సంస్థకు, అట్టి నిర్మాణము లేక సంస్థ పంచాయతీ సమితి యొక్క అధికార క్షేత్రమునకు వెలుపల ఆరంభింప బడునది లేక నిర్వహింపబడునది కావచ్చును ;

(ii) పంచాయతీ సమితి యొక్క అధికారము లోపలగాని, వెలుపల గాని ఉన్నట్టి ప్రాంతములో మానవ లేక జంతుబాధా నివారణ నిమిత్తము వసూలు చేయబడు ఏదైన సార్వజనిక నిధికి.

12. (i) పంచాయతీ సమితికి సమర్పించబడిన బిల్లు విషయములో చేయబడు అన్ని చెల్లింపులున్నూ, ఆ బిల్లులు బ్లాకు అభివృద్ధి అధికారిచే ఆమోదించబడిన పిదప మాత్రమే చెల్లింపబడవలెను.

(2) శాశ్వత అడ్వాన్సునుంచి కొద్దిపాటి కంటింజెన్సి ఖర్చు నిమిత్తము ఈ నియమావళిలో నిబంధించబడిన రీతిగా తప్ప, చెల్లింపులు ప్రభుత్వ ట్రెజరీ పేర యివ్వబడు చెక్కుల ద్వారా మాత్రమే చేయబడవలెను.

13. బ్లాకు అభివృద్ధి అధికారి తాత్కాలికముగాగాని, శాశ్వముగా గాని మరియొకరికి చార్జి యిచ్చునపుడు, ఆయన స్థానే, ఆ ఉద్యోగములోనికి వచ్చు అధికారి యొక్క నమూనా సంతకమును, ఈ దిగువ ఈయబడిన నమూనాలో ఒక సర్టిఫికెటుతోబాటు ట్రెజరీ ఆఫీసరుకు లేక బ్యాంకు యొక్క స్థానిక అధికారికి పంపవలెను.

## సర్టిఫికేటు నమూనా

... ... ... ... ... గారికి,

నేను ఈ దినమున ..............పంచాయతీ సమితి బ్లాకు అభివృద్ధి అధికారి పదవి యొక్క చార్జిని శ్రీ ..........గారికి ఇచ్చినాను. వారి నమూనా సంతకము ఈ దిగువ కలదు :—

స్వీకరించిన అధికారి. అప్పగించిన అధికారి.

(1)
(2)
(3)

14. చెక్కు బుక్కులు బ్లాకు అభివృద్ధి అధికారి స్వాధీనములో ఉండవలెను. బ్లాకు అభివృద్ధి అధికారి బదిలీ అయిన యెడల ఏదైన మార్పు కలిగిన యెడల, క్యాషు బుక్కు లో ఆ పదవిని అప్పగించిన మరియు స్వీకరించిన అధికార్ల ఇద్దరి సంతకములకు పైన, క్రమానుసారముగా వారు అప్పగించిన మరియు స్వీకరించిన ఉపయోగించని చెక్కుల యొక్కయు చెక్కు బుక్కుల యొక్కయు నంబర్లను వ్రాయవలెను.

15. (1) పంచాయతీ సమితి నిధిలో నుండి ఏ వ్యక్తికైన పైకము రావలసి యున్నచో ఆ వ్యక్తి ఒక బిల్లును పంచాయతీ సమితి కార్యాలయము

ములో సమర్పించవలెను, సాధ్యమగునపుడు అట్టి బిల్లు ఆ కార్యము నిమిత్తము నిర్ణయింపబడిన నమూనాలో ఉండవలెను. క్లయిము చేయువ్యక్తి దానిపై సక్రమముగా సంతకముచేసి, తేదీనివేసి, అవసరమైనచోట స్టాంపును అంటించవలెను.

(2) సాధ్యమైనపుడెల్ల బిల్లులను తయారు చేయుటలో అచ్చునమూనాలనే వాడవలెను.

(3) పైకము కావలసిన వ్యక్తి ఆ కార్యముల నిమిత్తము నిర్ణయింపబడిన నమూనాలోగాక వేరొక నమూనాలో బిల్లును సమర్పించిన యెడల కార్యాలయమువారు తమ ఖర్చులో సరియైన నమూనాలో విడిగా బిల్లును తయారుచేసి పైకము రావలసిన వ్యక్తి సమర్పించిన బిల్లును సబ్-వోచరుగా దానికి చేర్చవలెను.

(4) ప్రతి బిల్లుకూడ బ్లాకు అభివృద్ధి అధికారికి సమర్పించబడవలెను. ఆయన దానిని అక్కౌంటెంటుకు పంపించవలెను. అక్కౌంటెంటు దానిని బిల్లుల రిజిష్టరులో నమోదుచేసి మంజూరీ లేదా ఇతరపత్రముల దృష్ట్యా ఆ పైకము చెల్లించదగినదేనా అనియు, అడిగిన పైకము సమంజసముగా ఉన్నదియు, సరిగా లెక్క కట్టబడినదియు సరిచూచి పరిశీలించవలెను బిల్లు సరిచూడబడి పరిశీలింపబడిన పిదప అది సరిగను, సక్రమముగానున్నట్లు కనుగొనబడిన యెడల, ఆ బిల్లులోని చెల్లింపు ఉత్తరువుపై సంతకముచేయు నిమిత్తము దానిని బ్లాకు అభివృద్ధి అధికారికి సమర్పించవలెను. ఆ చెల్లింపు ఉత్తరువు ఈ దిగువ రీతిగా ఉండవలెను :—

"చెక్కు ద్వారా (మొత్తము మాటలలో, అంకెలలోను) మాత్రమే చెల్లించి (మేజరు, మైనరు లేక సవివర పద్దులకు) ఖర్చు వ్రాయవలెను." నగదుగా చెల్లింపులు చేయవలసిన వచ్చినపుడు, చెక్కులను బ్లాకు అభివృద్ధి అధికారి పేరుమీదా తీయవలెను. అట్టి అన్ని మొత్తములు అక్కౌంటెంటుచే నిర్వహింపబడు చిన్న మొత్తాల క్యాషు బుక్కులో నమోదు చేయబడవలెను.

16. (1) జీతము లేక బత్తెము చెల్లింపబడిన ప్రతి అధికారికిని లేక ఉద్యోగికిని అవి ముట్టినట్లు వారి సంతకములు విడివిడిగా అన్ని సందర్భములలోను చెల్లింపుల రిజిష్టరులో (అవసరమైనప్పుడు స్టాంపు యుక్తముగా) తీసుకొనబడవలెను. (చెల్లింపులు పంచాయతీ సమితి కార్యాలయములోనే చేయబడినపుడు మాత్రము బిల్లుయొక్క ఆఖరు కాలములోనే తీసుకొనబడవలెను.) బిల్లు

తీసిన వ్యక్తికి ఒక్కనికి మాత్రమే చెల్లింపు చేయవలసియుండి, అతడు ఇదివరకే (అవసరమైనపుడు రశీదు యుక్తముగా) బిల్లుపైనే రసీదు ఇచ్చి యుండినచో, చెల్లింపుల రిజిష్టరులో విడిగా సంతకము తీసికొనవలసిన అవసరము లేదు.

(2) బ్లాకు అభివృద్ధి అధికారి, ట్రెజరీలోనుంచి లేక ప్రభుత్వమువారిచే ఆమోదించబడి పంచాయతీ సమితి పైకము వుంచబడిన ఏదైన బ్యాంకులో నుంచి తాను తీసిన మొత్తములోనుండి ఏదైన చెల్లింపును చేసినచో (అవసరమైనచోట స్టాంపు యుక్తముగా) బిల్లుపైననే రశీదు ఈయబడినపుడు తప్ప, ఆయన (అవసరమైనచోట స్టాంపు యుక్తముగా) ప్రత్యేకముగా రసీదును పొంది దానిని బిల్లుకు జతపరచవలెను.

(3) ఏదైన ఖర్చు పద్దుకు ఆ బిల్లును తీసిన అధికారి లేక ఉద్యోగి కన్న పై అధికారి యొక్క మంజూరు కావలసినయెడల, అట్టి మంజూరు పొందబడి అందలి షరతులు ఆ బిల్లుపై వ్రాయబడవలెను, మంజూరు ఉత్తరువు యొక్క ఒక ప్రతిని చట్టముయొక్క 32 (3)వ విభాగము క్రింద నియమింపబడిన ఆడిటరుకు కూడ పంపవలెను.

**17.** (1) ఏదైన ఖర్చు పద్దు విషయములో ఈ క్రింది నమూనాలో సర్టిఫికేటు దాఖలు చేయబడనిదే దానిని బ్లాకు అభివృద్ధి అధికారి మంజూరు చేయరాదు ;

| | రూ. నపై. |
|---|---|
| .........బడ్జెటు కేటాయింపులోనుంచి ఈ మొత్తమును చెల్లింపవలెను. | |
| ఈ పద్దు క్రింద ... ... ... ... ... | |
| తేదీవరకు ఖర్చు పెట్టబడిన మొత్తము... ... ... | |
| ఈ తేదీవరకు మంజూరైనను, ఖర్చుపెట్టబడని మొత్తము | |
| ఇపుడు మంజూరు చేయవలసిన మొత్తము... ... | |
| వెరశి ... | |
| నిల్వవుండు శేషము ... | |

(2) బడ్జెటులో సంబంధించిన పద్దు క్రింద ఎట్టి కేటాయింపు కూడ లేకుండి, పంచాయతీ సమితి ఆ మొత్తమును మరియొక పద్దునుంచి మరల కేటాయింపు ద్వారా పొందదలచిన యెడల, "చెల్లింపవలెను" అను పదమునకు పూర్వము "మరల కేటాయింపు ద్వారా" అను మాటలను చేర్చవలెను.

(3) సమావేశమునకు పూర్వము సర్క్యులేటు చేయబడు ఎజెండాలో ఆ సర్టిఫికేటు నమోదు చేయబడవలెను. పంచాయతీ సమితి దానిని ఆమోదించి నచో తీర్మానములో ఒక భాగమును దానిని మినిట్సు బుక్కులో వ్రాయనవ సరములేదు. అయితే, పంచాయతీ సమితి ఖర్చు అక్కౌంటుతోగాని ఆ ఖర్చు మొత్తమును ఏ పద్దులోనుంచి చెల్లించవలెనో ఆ పద్దులో గాని ఏదైన మార్పును చేసిన యెడల అట్లు మార్చబడిన రీతిగా ఆ సర్టిఫికేటు ఆ సమితి తీర్మానములో ఒక భాగముగా వుంచబడి అదే రీతిగా మినిట్సు బుక్కులో నమోదు చేయబడవలెను.

(4)ఏదైన ఖర్చుక్రొత్తనిమిత్తము యీయబడిన మంజూరీ ఒకసంవత్స రము పాటు అమలు పరచబడనియెడల, అది నిర్దిష్టముగా పునర్నవీకరింప బడిననే తప్ప, మురిగిపోయినట్లు భావింపబడవలెను.

ఇయితే ఈ ఉప నియమము ఈ దిగువ సందర్భములలో వర్తించదు:-

(ఎ) ఒక ఉద్యోగమునకు లేక ఒక అధికారుల తరగతికి మంజూరైన భత్యమును ఆ ఉద్యోగమునందలి ఒకానొక వ్యక్తి లేక అధికారుల ఒకానొక తరగతికి చెందినవారు తీసికొనియుండని సందర్భములో ;

(బి) తగు అధికారిచే మంజూరు చేయబడిన సాధారణ పథకము క్రింద శాశ్వత సిబ్బందిలో ఏదేటా క్రమేణా చేయబడు చేర్పుల సందర్భములో ;

(సి) (5)వ ఉప నియమములోని నిబంధన క్రిందికి రావలసిన పనులపై అగు ఖర్చు సందర్భములో ;

(5) (ఎ) సాధారణ సాలీనా నిర్వహణ అంచనా యొక్క మంజూరీ దానికి సంబంధించిన ఆర్థిక సంవత్సరము ఆఖరు రోజున మురిగిపోవలెను. అయితే; ఏదైన అసాధారణ సందర్భములో ఆ తేదీన ఆ పనులను ఆపివేయ వలసిన ఇబ్బంది కలుగు నెడల, ఆ మరమ్మతులను పూర్తిచేసి, ఆ అంచనా ముగిసిన తేదీకి పిదప పెట్టబడిన ఖర్చు, తరువాతి సంవత్సరములో క్రొత్త మరమ్మతు ఖర్చుగా భావింపబడవలెను.

(బి) ప్రత్యేక మరమ్మతుల అంచనాలు క్రొత్త పనుల అంచనాలవలెనే, ఆ మరమ్మతులు పూర్తి అగునంతవరకు అమలులో ఉండవలెను.

(సి) పాలీనా నిర్వహణకాక తదితరమైన ఏదైన సార్వజనిక కార్యము నిమత్తము ఈయబడిన ఆమోదము లేక మంజూరి, ఆ పని ఆరంభింపబడి యుండిననే తప్ప, ఆ ఆమోదము లేక మంజూరి ఈయబడిన తేదీనుండి మూడు సంవత్సరముల కాలమునకు పిమ్మట అమలులో ఉండరాదు.

18. (1) ఒక బిల్లుద్వారా అడుగబడిన ఏదైన పైకమును చెల్లింప వలెనని నిర్దేశించుచు ఈయబడిన ఉత్తరువు ఆరు నెలల పాటు మాత్రమే అమలులో ఉండవలెను. అటు తరువాత చెల్లింపు చేయవలసియున్నచో అది పునర్న్వీకరింపబడవలెను.

(2) ఈ దిగువ సందర్భములలో ఆ పంచాయతీ సమితిపై ఎట్టి క్లయిము కూడా

(i) ఆ క్లయిము చెల్లింపబడవలసిన తేదీనుండి, ఆరు నెలలకు పిమ్మట, సంవత్సరము లోపల దాఖలు చేయబడిన బిల్లు, సమితి అధ్యక్షుని ఉత్తరువు లేకుండా చెల్లింపు నిమిత్తము ఆమోదింపబడరాదు.

(ii) ఆ క్లయిము చెల్లింపబడవలసిన తేదీనుంచి ఒక సంవత్సరము దాటిన పిదప దాఖలు చేయబడిన బిల్లు పంచాయతీ సమితి ఉత్తరువు లేకుండా చెల్లింపు నిమిత్తము ఆమోదింపబడరాదు.

19. (1) చెల్లింపవలసిన దానికంటె ఎక్కువ చెల్లింపబడినపుడు ఆ బాధ్యత ప్రాథమికముగా బిల్లును తీసిన వ్యక్తిపై ఉండవలెను. ఆ ఎక్కువ చెల్లించిన మొత్తమును ఆ వ్యక్తి పూరింపవలెను. అయన వద్దనుంచి వసూలు కాని యెడల, ధృవీకరణ సంతకము చేసిన అధికారి నుండిగాని మంజూరు చేసిన అధికారి నుండిగాని, ఆ ఇరువురిలో ఎవరివల్లనైనను అపరాధ పూర్వకమైన ఉపేక్ష జరిపినపుడు మాత్రమే ఆ ఎక్కువ చెల్లింపు వసూలు చేయబడవలెను.

(2) ఏ వ్యక్తియొక్క ఉపేక్ష లేక దుర్నడతవల్లనైనను జరిగిన ఏదైన లోటు, నష్టము లేక లాభదాయకము కానట్టి పెట్టుబడినిగూర్చి, అది జరిగినదని తెలిసిన వెంటనే చట్టము యొక్క 32వ విభాగము, (3)వ ఉప విభాగము

క్రింద నియమింపబడిన ఆడిటర్లకు తెలియజేయవలెను. ఆ విషయము పూర్తిగా పరిశీలింపబడిన పిదప సాధ్యమైనంత త్వరలో ఎట్టి, ఎంత లోటు లేక నష్టము జరిగిదనియు, ఏ దోషమువలన లేక ఏ నియమావళిని ఉపేక్షించి నందువలన అట్టి లోటు లేక నష్టము సాధ్యమైనదనియు, వాటిని వసూలు చేయుటకుగల అవకాశము వున్నదియు తెలుపుచు మరియొక పూర్తి రిపోర్టునుకూడ ఆడిటర్లకు పంపవలెను.

(3) ఏదైన ఇతర ఆస్తి తొలగింపబడిన యెడల లేక మరియొక రీతిగా పోయిన యెడల, అట్లు పోయిన ఆస్తి విలువ పది రూపాయలకు మించిన యెడల, దానిని గూర్చి కూడ ఆడిటర్లకు తెలియచేయబడవలెను.

(4). (2). (3) ఉప నియమముల ద్వారా నిర్ణయింపబడిన రిపోర్టులు దాఖలు చేయబడుటచే, బ్లాకు అభివృద్ధి అధికారి తనకు అవసరమని తోచునట్టి ఇంకేదైన చర్యను తీసుకొనుటకు ఎట్టి ఆటంకముకూడ ఉండరాదు.

సిబ్బంది బిల్లులు

20. (1) కాలానుగుణముగా ప్రభుత్వముచే నిర్ణయింపబడునట్టి నమూనాలో వేతనపు బిల్లులు తయారు చేయబడవలెను.

(2) పంచాయతీ సమితి సిబ్బంది మాసవారి వేతనపు బిల్లులో కూడ కాలానుగుణముగా ప్రభుత్వమువారిచే నిర్ణయింపబడునట్టి నమూనాలో గైరు హాజరీ స్టేటుమెంటు లేదా ఆ సిబ్బందిలో ఎవ్వరికికూడ సెలవు ఈయబడలేదని ఆ బిల్లులోనే ఒక సర్టిఫికేటు పంపబడవలెను.

(3) నిర్ణీత వ్యవధులలో వచ్చు ఇంక్రిమెంటు కోరబడు మొదటి వేతనపు బిల్లుకు, కాలానుగుణముగా ప్రభుత్వముచే నిర్ణయింపబడు నమూనాలో ఒక ఇంక్రిమెంటు సర్టిఫికేటు జత పరుపబడవలెను.

(4) ప్రభుత్వమువారు పంపించిన లేక ఇంకేదైన స్థానిక సంస్థనుంచి బదిలీ చేయబడిన ఆఫీసరు లేక ఉద్యోగి వేతనము ఆయన పూర్వపు కార్యాలయముయొక్క ప్రధానాధికారిచే (కాలానుగుణముగా ప్రభుత్వముచే నిర్ణయింపబడినట్టి నమూనాలో) ఈయబడిన గతవేతన సర్టిఫికేటు అందిన పిదప మాత్రమే కోరబడవలెను. అట్టి సర్టిఫికేటు అట్లు ఆయన పంపించబడిన లేక బదిలి

చేయబడిన పిదప తయారు చేయబడు మొదటి వేతనపు బిల్లునకు జత పరుప బడవలెను.

(5) వేతనము, సెలవు వేతనము, భత్యము లేక పెన్షను, ఒక మనిషి చనిపోయిన రోజునకు కూడ క్లయిము చేయబడవలెను. ఏ గంటకు చనిపోయినను అట్టి క్లయిమునకు భంగము వాటిల్లదు.

(6) 1925 భారతీయ వారసత్వ చట్టము (1925 లో 39వ కేంద్ర చట్టము). 214వ విభాగము (1)వ ఉప విభాగము, (బి) ఖండము (i) (ii), (iii), (iv), (v) ఉప ఖండములో నిర్దిష్టపరుపబడిన రీతిగా అధికార పత్రము దాఖలు చేయబడిననే తప్ప, మరణించిన పంచాయతీ సమితి ఆఫీసరునకు లేక ఉద్యోగికి రావలసిన మొత్తములు చెల్లింపబడరాదు. అయితే అట్టి అధికారి లేకుండ ఈ దిగువ సందర్భములో చెల్లింపులు చేయవచ్చును ;—

(i) అయిదు వందల రూపాయల వరకైతే, హక్కుదారునని చెప్పుకొను వ్యక్తియొక్క హక్కు లేక అధికారము విషయమున ఆర్థిక పన్ను నిర్ణాయక స్థాయీ సంఘమువారు తమను చాలునని తోచు రీతిగా దర్యాప్తు చేసిన పిదప సంతృప్తిచెందిన యెడల, వారి ఉత్తరువులపై ;

(ii) అయిదు వందల రూపాయలకు మించితే, హక్కుదారునని చెప్పుకొను వ్యక్తియొక్క హక్కు, అధికారము విషయమున పంచాయతీ సమితి తమకు తగునని తోచు దర్యాప్తును చేసిన పిదప సంతృప్తి చెందిన యెడల, సమితి కోరునట్టి జామీను లేక జామీను యుక్తముగా హామీ బాండును వ్రాసి ఇచ్చిన పిదప, మరియు అట్టి అధికార పత్రము తెచ్చి చూపవలసినదని నిర్బంధించుచో అసమంజసమైన ఆలస్యము, ఇబ్బంది కలుగగలదని తోచుచో, పంచాయతీ సమితి ఉత్తరువులపై ;

21. ఒక ఉద్యోగియొక్క చిట్టచివరి వేతనమును, భత్యములను లేక ఆయన తనకు యీయబడిన సెలవు ఆఖరున పంచాయతీ సమితి కొలువును అంతిమముగా వదలివేయుచున్న యెడల ఆయనయొక్క చిట్టచివరి సెలవు వేతనము ఆయన వద్దనుండి రావలసిన బాకీ లేమియు లేవని తెలుసుకొనునంత వరకు చేయబడరాదు. ఆ విషయము తెలుపుచు బ్లాకు అభివృద్ధి అధికారిచే సంతకము చేయబడిన సర్టిఫికేటు, అట్టి వేతనము, భత్యము లేదా సెలవు వేతనము కోరబడు బిల్లుకు జత పరుపబడవలెను.

22. వేతనపు బకాయిలు మాసవారి బిల్లు ద్వారాగాక, విడిగా ఒక బిల్లు ద్వారా కోరబడుచు. ఆ క్లయిము ఏ బిల్లులో వదలివేయ బడినదో లేక అపివేయ బడినదో లేక కోతపెట్టి వాసను చేయబడినదో ఆ బిల్లు నెంబరు పేర్కొన బడవలెను.

23. (1) ఆ వేతనపు బిల్లుల సంబంధించిన వ్యవస్థ లేక సంస్థయొక్క ప్రధానాధికారిచే సంతకము చేయబడి బ్లాకు అభివృద్ధి అధికారిచే మంజూరు చేయబడవలెను.

(2) వేతనము నిర్ణీత భత్యముల చెల్లింపులకు సంబంధించిన చెక్కులు, ఆ చెల్లింపు ఏ నెలకుగాను చేయబడుచున్నచో దాని తరువాత నెల మొదటి పది దినములకు ముందుగా జారీ చేయబడరాదు. అయితే పంచాయతీ సమితి అధికారి లేక ఉద్యోగి కొలువును అంతిమముగా వదలి వేయుచున్న యెడల లేక మరియొక స్థానిక సంస్థకు లేక ప్రభుత్వమునకు బదిలీ చేయబడుచున్న యెడల అట్లు వదలి వేయుచున్న లేక బదిలీ తేదీన అతని చెక్కులు జారీచేయ బడవచ్చును.

అంతేగాక ఒక్క నెలలోని మొదటి ఆరు రోజులు ట్రెజరీలోగాని, లేక ప్రభుత్వామోదమును పొందిన పంచాయతీ సమితి పైకము ఉంచబడిన ఏదైన బ్యాంకులోగాని చెల్లింపులు చేయనట్టి సార్వజనిక సెలవు దినములు అగు యెడల, ఆ సెలవు దినములకు పూర్వము ఆఖరు పని దినమున చెక్కులు జారీ చేయ బడవచ్చును.

24. బిల్లు మొత్తమును తెప్పించు బ్లాకు అభివృద్ధి అధికారి, అట్లుతెప్పించిన పైకముకు సంబంధించిన వ్యక్తికి లేక వ్యక్తులకు చెల్లింపబడి (అవసర మైనచో స్టాంపుయుక్తముగా) వారి సంతకములు తీసుకొనుబడు నంతవరకు ఆ పైకము విషయముతో వ్యక్తి గతముగా బాధ్యుడు కావలెను. పైకము తెప్పించిన తేదీనుండి ముప్పది దినములలోగా సదరు వ్యక్తి హాజరు కానిచో ఆయన నిమిత్తము తెప్పించిన పైకము తరువాత బిల్లులో తక్కువ పైకము తెప్పించుటద్వారా వాపసు చేయబడవలెను. తెప్పించిన వేతన భత్యముల మొత్తమును ఎట్టిపరిస్థితులలో కూడ డిపాజిట్ క్రింద ఉంచరాదు,

25. సిబ్బంది, ఇంటి అద్దె, నిర్ణీత ప్రయాణ, వాహన భత్యములవంటి రికరింగు చార్జీలు నెలవారీ బిల్లును సులభముగా సరిచూచుటకుగాను ఒక అడిటు

రిజిష్టరు నిర్ణయింపబడిన నమూనాలో పంచాయతీ సమితి కార్యాలయములో నిర్వహింపబడవలెను.

26. నిర్ణీత ప్రయాణభత్యము కాక తదితరమైన ప్రయాణభత్యము కాలానుగుణముగా ప్రభుత్వముచే నిర్ణయింపబడు నమూనాలో ఒక ప్రత్యేకమైన బిల్లు ద్వారా తెప్పించుకొనబడవలెను.

27. ఏ వాహనము విషయములో వాహన భత్యము తెప్పించుకొనబడుచున్నదో ఆ వాహనము తాత్కాలికముగా వాడుకలో లేనపుడు, ఆ వాహనము వాడుకలో లేని తేదీనుండి పది దినముల గరిష్ఠ వ్యవధివరకు అట్టి వాహన భత్యమును తెప్పించుకొనవచ్చును.— అట్టి సందర్భములో ఆ వాహన భత్యమును తెప్పించుకొను అధికారి లేక ఉద్యోగి ఆ నెలలో ఆ వాహనమును వాస్తవముగా ఎన్ని దినములు ఉపయోగింపలేదో ఆ సమాచారమును సర్టిఫికేటులో తెలియజేయవలెను.

28. నిర్ణీత ప్రయాణ, వాహన భత్యములకు సంబంధించిన అధికారి లేక ఉద్యోగి యొక్క వేతనపు బిల్లుద్వారా తెప్పించుకొనబడవలెనే కాని ప్రయాణ భత్యముల బిల్లుద్వారా కాదు. వాహన భత్యముయొక్క ప్రతి బిల్లుకు, ఆ వాహనము వాస్తవముగా మంచి స్థితిలో ఉండినదనిన్నీ ఆ నెల అంతయు సంబంధించిన అధికారిచే లేక ఉద్యోగిచే ఉపయోగింపబడినదనిన్నీ తెలుపు ఒక సర్టిఫికేటు జతపరుపబడవలెను.

29. ఈ దిగువ తెలిపిన ప్రత్యేక నిధులు అవి ఏకార్యము నిమిత్తము వసూలు చేయబడినవో లేక కేటాయించబడినవో వాటికిగాక ఇంకేమైన ఇతర కార్యముల నిమిత్తము తాత్కాలికముగానైనాసరే ప్రభుత్వమునుండి ముందుగానే మంజూరు పొందకుండా ఉపయోగింప బడరాదు :—

(i) ప్రాథమిక పాఠశాలల స్థాపన నిర్వహణ నిమిత్తము వసూలు చేయబడిన నిధులు ;

(ii) నిర్దిష్ట కార్యముల నిమిత్తము మంజూరు చేయబడిన ప్రత్యేక స్టేటు గ్రాంటులు ;

(iii) మూలధనపు ఆస్తుల అమ్మకము ద్వారా లభించిన ఆదాయము,

(iv) దేవాదాయములు, ట్రస్టుల ద్వారా వచ్చిన రాబడి ;

(v) డిపాజిట్లు (ప్రావిడెంటు ఫండుతో సహా)

(vi) ప్రభుత్వముచే లేదా ప్రభుత్వ శాఖల అధిపతులచే పంచాయతీ సమితికి బదిలీ చేయబడిన సంస్థలు, పథకములకు సంబంధించిన నిధులు ;

(vii) సమాజ వికాస కార్యక్రమమునకు సంబంధించిన నిధులు :

(viii) కుటీర, గ్రామీణ పరిశ్రమలు, ఖాదీ; పట్టు, పీచు, చేతిపనులు మొదలగు నిర్దిష్ట కార్యముల నిమిత్తము అఖిల భారత బోర్డుల సంస్థల ద్వారా లభించు గ్రాంట్లు ;

(ix) ప్రజల నుండి లభించు దానములు, విరాళములు ;

(x) రాజ్యపు పన్నుల నుండి నిర్దిష్టముగా రోడ్ల నిర్మాణము, నిర్వహణ, మరమ్మతులు విస్తరణ లేక అభివృద్ధికి సంబంధించిన ఖర్చుల నిమిత్తము కేటాయించబడిన పైకము ;

(xi) హరిజని గృహస్థలముల నిమిత్తము లేక హరిజనులు, షెడ్యూల్డు తెగల బాగుకై ఉద్దేశింపబడిన ఇతర కార్యక్రమములకుగాను కేటాయించబడిన నిధులు ;

## 21. పంచాయతీ సమితి, జిల్లా పరిషత్తులలోని ఆఫీసర్ల ఉద్యోగుల జీతము, భత్యముల బకాయీలు, జీత భత్యములలో పెంపులు యిచ్చుటకు నిబంధనలు

[జి. ఒ. యమ్. యస్. నెం. 1297, ప్లానింగు స్థానిక పరిపాలన (అకవుంట్స్-II) 26 వ సెప్టెంబరు 1960]

నిబంధనలు

1. కొంతకాలము వరకు నిలిపి యుంచబడిన జీతము, భత్యముల లేక జీతములోని పెంపుల కొరకు పంచాయతీ సమితి/జిల్లా పరిషత్తు ఆఫీసరు లేక ఉద్యోగియొక్క ఏదైన చెల్లించుటకు ముందు—

(i) ఆరు నెలలకు మించి రెండు సంవత్సరములు దాటకుండా వున్న హక్కుల విషయములో పంచాయతీ సమితి/జిల్లా పరిషత్తు యొక్క శివ స్టాండింగ్ కమిటీ అనుమతితోను; మరియు

(ii) రెండు సంవత్సరములు దాటిన హక్కుల విషయములో పంచాయతీ సమితి/జిల్లా పరిషత్తు అనుమతితోను,

బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు/పంచాయతీ సమితి జిల్లా పరిషత్తు కార్యదర్శి చేత తనిఖీ చేయబడును.

2. ఒకటవ నిబంధనక్రింద ఉత్తరువు చేయబడిన బకాయి బట్వాడా తక్కువ యిచ్చుటను కనుగొనిన తేదీకి వెంటనే ఒక సంవత్సరము ముందుగా ఉన్న కాలముకు ఖచ్చితముగా యివ్వ తేలబడ్డ మొత్తమును దాటకూడదు. జీత భత్యముల బకాయిలకొరకు లేక ఆరు నెలలకు మించి యుంచబడిన ఇంక్రిమెంటు (పెంపు) కొరకు ఆఫీసరు లేక ఉద్యోగియొక్క హక్కు, పై కాలమునకు హక్కును మితము చేయుటయే కాక, కంట్రోలింగు అధారిటీ, ఆలస్యము, హక్కుదారుని అశ్రద్ధ ఉపేక్ష లేక నిబంధనలను గురించి తెలియకపోవుట వలన కాదని తనకు తాను తృప్తిపడిన విషయములో తప్ప, అదనముగా 100 కి 15 పాళ్ళు డిస్కవుంటుకు లోనవును. ఒక ప్రత్యేకమైన విషయములో కొన్ని ప్రత్యేక కారణములవలన ఎక్కువ కన్‌సెషన్ యివ్వవలసి వచ్చినపుడు లోకల్‌ఫండు ఎక్కౌంట్సు అడిషనల్ ఎగ్జామినరు సలహామీద ఆ విషయము పంచాయతీ సమితి జిల్లా పరిషత్తులకు పరిష్కారమునకు పంపబడును.

గమనిక:- (1) ప్రయాణ భత్యముకొరకు హక్కు, దానికి చెందిన ప్రయాణము పూర్తి అయిన తేదీనుంచి మూడునెలల తరువాత కనుక చేసినచో అంగీకరింపబడదు. కొంటరు సైను చేయు ఆఫీసర్లు, ప్రయాణ భత్యముకోరిన ప్రయాణము ముగిసిన తేదీనుండి మూడు నెలల తరువాత దాఖలు చేయబడ్డ బిల్లులను కొంటరు సైను చేయుటకు నిరాకరించవలెను.

(2) ఈ నిబంధన నుద్దేశించినంతవరకు, తక్కువ యిచ్చుటకు కనుగొనిన తేదీ, బ్లాక్ డెవలప్‌మెంటు ఆఫీసరు / పంచాయతీ సమితి / జిల్లా పరిషత్తు సెక్రటరీ కనుగొనిన లేక వీరి గమనికలోనికితేబడ్డ తక్కువ యిచ్చిన తేదీ, లేక అది అడిట్‌లో మొదట కనుగొనిన పక్షమున. ఆడిటు డిపార్టుమెంటు వారివల్ల కనుగొనిన తేదీ, వెనుకనుండి అనువర్తించు ఉత్తరువు జారీ చేయుట

వల్ల ఏర్పడిన బకాయిహక్కు, ఉత్తరువు జారీ చేయబడవిదే ఏర్పడదు. కాబట్టి ఉత్తరువు చేసిన తేదీకి పూర్వపుకాలమునందు నిలిపి యుంచబడిన హక్కుగా పరిగణింపబడదు. ఈ గమనిక నుద్దేశించినంతవరకు, వెనుకనుండి అనువర్తించుచు జారీ చేయబడిన ఉత్తరువు, ఆ పరిస్థితులలో అంతకంటె ముందుగా జారీ చేయబడుటకు వీలులేనిదిగను లేక ప్రత్యేకముగా విచారణ కొరకు ఆపివేయ బడినదిగాను పరిగణింపబడవలెను.

3. 1వ నిబంధనలోని పంచాయతీ సమితి/జిల్లా పరిషత్తులకు యిచ్చిన అధికారము, పంచాయతీ/జిల్లా పరిషత్తు యితరులకు ఒప్పగింప కూడదు.

## 22. స్టాంపు రుసుములపై వచ్చు సర్‌చార్జీని, జిల్లా పరిషత్తులకు పంచాయతీ సమితులకు పంపకము చేయుటకు సంబంధించిన నియమము

ఆంధ్ర ప్రదేశ్ గవర్నరుగారు 1959. ఆంధ్ర ప్రదేశ్ పంచాయతీ సమితుల, జిల్లా పరిషత్తుల చట్టము (1959లో 35వ ఆంధ్ర ప్రదేశ్ చట్టము) 29వ విభాగము, (1)వ విభాగము, (v)వ ఖండము ద్వారా, మరియు 54వ విభాగము, (1)వ ఉప విభాగము, (vi) వ ఖండముద్వారా, తమకు లభించిన అధికారములను పురస్కరించుకొని, పంచాయతీ సమితి/జిల్లా పరిషత్‌లు ఏర్పాటు చేయబడిన తేదీనుండి ఆంధ్ర ప్రాంతములోని జిల్లా బోర్డులచే 1920 ఆంధ్ర జిల్లాబోర్డుల చట్టము, (1920 లో 14 వ మద్రాసు చట్టము) 110-ఎ విభాగము క్రింద 1950 మద్రాసు గ్రామ పంచాయతీల చట్టము 1950లో 10వ ఆంధ్ర చట్టము) 67 (4) (బి) విభాగము క్రింద స్టాంపు రుసుముపై వసూలు చేయబడు సర్‌చార్జి రాబడులను సదరు ప్రాంతములోని పంచాయతీ సమితులకు, జిల్లా పరిషత్‌లకు సరిసమానముగా పంపకము చేయబడవలెనని ఇందుమూలముగా ఉత్తరువు ఇచ్చుచున్నారు.

## 23. పంచాయతీ సమితులకు, జిల్లా పరిషత్తులకు రాష్ట్ర పన్నులలో ఒక భాగమును చెల్లించుటకు నిబంధనలు

### ని బం ధ న లు

1. 1959-60వ సంవత్సరము అమలు నుండి, రాష్ట్ర పన్నుల వరుంబడులనుండి ప్రభుత్వముచే ప్రతి సంవత్సరము ఈ క్రిందివారికి చెల్లింప బడవలెను.

(i) ఈ మధ్య తీసిన జనాభా లెక్కల ననుసరించి బ్లాకులో జనాభా యొక్క ప్రతిమనిషికి ముప్పది నయాపైసల చొప్పున లెక్క చూడగా వచ్చిన మొత్తమును బ్లాకు ఏర్పరచిన ప్రతి పంచాయతీ సమితికి;

(ii) ఈమధ్య తీసిన జనాభా లెక్కల ననుసరించి బ్లాకులో జనాభా యొక్క ప్రతి మనిషికి ముప్పది నయాపైసల చొప్పున లెక్క చూడగా వచ్చిన మొత్తమును పంచాయతీ సమితి ఏర్పరచని బ్లాకు విషయములో ప్రతి జిల్లా పరిషత్‌కు.

2. ఆ విధముగా పంచాయతీ సమితులకు జిల్లా పరిషత్‌లకు చెల్లించిన మొత్తములు ఉత్తర ప్రత్యుత్తరములమీదనే ఖర్చు చేయబడుటకు ఏడిగా యుంచబడును.

## 24. పంచాయతీ సమితులకు భూమి ఆదాయములో ఒక భాగము చెల్లించుటకు నిబంధనలు

### నిబంధనలు

1959-60 అమలు సంవత్సరము నుండి, ప్రతి సంవత్సరము ప్రభుత్వముచే భూమి ఆదాయమునుండి ఈ మధ్య తీసికొనిన జనాభా లెక్కల ప్రకారము బ్లాకులో జనాభా యొక్క ప్రతి మనిషికి ఇరువైఐదు నయాపైసల చొప్పున లెక్క చూడగా వచ్చిన మొత్తమును, బ్లాకు ఏర్పరచిన ప్రతి పంచాయతీ సమితికి యివ్వబడవలెను.

---

X జి. ఓ. యమ్. యస్. నెం. 568, ప్లానింగు స్థానిక పరిపాలన (స.II) 14వ ఏప్రియల్ 1960 28వ ఏప్రియల్ 1960 ఆంధ్ర ప్రదేశ్ గెజిట్ పార్టు II రూల్సు సప్లిమెంటులో 173వ పుటలో ప్రచురింప బడినది.

## 35. పంచాయతీలు బడ్జెటును పంచాయతీ సమితికి సమర్పించవలసిన ఆఖరు తేదీ

**1959** ఆంధ్ర ప్రదేశ్ పంచాయతీ సమితుల జిల్లా పరిషత్‌ల చట్టము (**1959**లో **35**వ ఆంధ్రప్రదేశ్ చట్టము) యొక్క **31**వ విభాగము ననుసరించి ఆంధ్రప్రదేశ్ గవర్నరుగారు, ప్రతి సంవత్సరము ప్రతిపంచాయతీ లేక పట్టణ పమితి రానున్న సంవత్సరపు బడ్జెటును పంచాయతీ సమితికి సమర్పించవలసిన ఆఖరుతేదీ **31** డిశంబరు అని ఇందుమూలముగా నిర్ణయించుచున్నారు.

## 26. పంచాయతీ సమితులు, జిల్లా పరిషత్తులు రిజిష్టర్లు, అక్కౌంట్లు నిర్వహించుటకు సంబంధించిన నియమావళి

### రిజిష్టర్లు అక్కౌంట్లు నిర్వహణ

(1) పంచాయతీ సమితి, జిల్లా పరిషత్ ఆ పంచాయతీ సమితి జిల్లా పరిషత్ కార్యాలయములో ఈ దిగువ రిజిష్టర్లను, అక్కౌంట్లను నిర్వహించవలెను. వాటిని నిర్దోషముగను, రాజాగను నిర్వహించురుకు బాధ్యత వహింపవలెను.

వసూళ్ళు

1. వివిధ డిమాండ్ల రిజిష్టరు
2. వివిధ అమ్మకముల రిజిష్టరు
3. చందాల విరాళముల రిజిష్టరు
4. పన్నుల. రుసుముల డిమాండు రిజిష్టరు
5. పన్నుల, రుసుముల బకాయి డిమాండు రిజిష్టరు
6. వివిధములగు లైసెన్సుల రిజిష్టరు
7. ధర్మాదాయముల రిజిష్టరు
8. శాఖవారిగా నిర్వహింపబడు రుసుముల అక్కౌంటు
9. వివిధములగు వసూళ్ళ రిజిష్టరు
10. మిస్‌లేనియస్ బిల్లు పుస్తకములు

11. పన్నులు, రుసుములు, వారంట్లు. జప్తులకై బిల్లు పుస్తకములు
12. పన్నుల అప్పీళ్ళ రిజిష్టరు
13. రైటాపులు. మాఫీల రిజిష్టరు
14. ప్రాసెక్యూషను రిజిష్టరు
15. అతిక్రమణ రుసుముల రిజిష్టరు
16. బాటలపై పండ్లచెట్ల రిజిష్టరు (పంచాయతీ సమితులు)
17. కేంద్ర, రాజ్య ప్రభుత్వములనుండి గ్రాంటుల రిజిష్టరు

## ఖర్చు

### I సాధారణము

18. నగదు పుస్తకము
19. చెక్కు పుస్తకము
20. ట్రెజరీ ప్యాస్ పుస్తకము

### II సిబ్బంది

21. ఎష్టాబ్లిషుమెంటు ఆడిటు రిజిష్టరు
22 ప్రొబేషన్ల రిజిష్టరు
23. ఇంక్రిమెంటు సర్టిఫికేట్ల రిజిష్టరు
24. సర్వీసు రిజిష్టర్ల రిజిష్టరు
25. ఎక్విటెన్సు రిజిష్టరు
26. లాస్టు పే సర్టిఫికేటు
27. సర్వీసు రిజిష్టరు

### III కంటింజెన్సీలు

28. కంటింజెన్సీ చార్జీల రిజిష్టరు
29. పెట్టుబడుల రిజిష్టరు
30. పర్మనెంటు అడ్వాన్సు రిజిష్టరు
31. పర్యటన బదిలీ అడ్వాన్సుల రిజిష్టరు

### IV ప్రావిడెంటు ఫండు బోనసు ఫండు

తన ఉద్యోగుల నిమిత్తము ప్రావిడెంటు ఫండు లేక బోనసు ఫండు నిర్వహింపబడు చున్నచో :

32. ప్రావిడెంటు ఫండ్, బోనసు ఫండ్ నగదు పుస్తకము
33. ప్రావిడెంటు ఫండ్ లెడ్జరు
34. పావిడెంటు ఫండ్, బోనసు ఫండ్ అబ్‌స్ట్రాక్టు రిజిష్టరు
35. ప్రావిడెంటు ఫండ్, బోనసు ఫండ్ చెల్లించు వారి నామ నిర్దేశముల రిజిష్టరు
36. తాత్కాలిక తీసుకోళ్లు వాటివసూళ్లతో ప్రావిడెంటు ఫండ్ బోనసు ఫండ్ రిజిష్టరు
37. భీమా పట్టాల రిజిష్టరు
38. ప్రీమియముల రిజిష్టరు

V. పనులు

39. పనుల రిజిష్టరు
40. టెండరు రిజిష్టరు
41. కంట్రాక్టర్ల రిజిష్టరు
42. అంచనాల, కేటాయింపుల రిజిష్టరు
43. కట్టడముల రిజిష్టరు
44. కొలతల పుస్తకము
45. లేబరు కంట్రిబ్యూషను రిజిష్టరు

VI. అకౌంట్లు

46. బడ్జెటు
47. సాధారణ నిధులకు, సెకండరీవిద్య, ఎలిమెంటరీ విద్యా నిధికి వసూళ్ల, చార్జీల పోష్టింగు రిజిష్టరు
48. బదిలీ నమోదు రిజిష్టరు
49. ధర్మాదాయముల వలన రాబడి, ఖర్చు రిజిష్టరు
50. సవివరమగు మాసవారి అక్కౌంటు
51. వసూళ్ల, ఖర్చుల అబ్‌స్ట్రాక్టు రిజిష్టరు
52. అందిన చెక్కుల రిజిష్టరు
53. అందిన మనియార్డర్ల రిజిష్టరు
54. గడువుదాటిన డిపాజిట్ల రిజిష్టరు
55. ఋణముల రిజిష్టరు
56. సాలీనా అక్కౌంటు

57. వసూళ్ల, ఖర్చుల సవివర పుస్తకము
58. పరిశ్రమలు, ఫ్యాక్టరీల లైసెన్సులు

VII. వివిధములు

59. పరికరముల, ప్లాంటుల నిల్వ రిజిష్టరు
60. కొలతల పుస్తకముల నిల్వ అకౌంటు
61. నమూనాల నిల్వ అకౌంటు
62. ఆదాయముల నిచ్చు ఆస్తుల రిజిష్టరు
63. స్థిరాస్థుల రిజిష్టరు
64. స్టాంపు అకౌంటు పుస్తకములు
65. సెక్యూరిటీ డిపాజిట్ల రిజిష్టరు
66. ప్లీడర్లు ఉపయోగించనగు నగదు పుస్తకము
67. ప్లీడర్లు ఉపయోగించనగు లెడ్జరు
68. మోటారు బండ్లకై లాగ్ బుక్కు
69. దావాల రిజిష్టరు
70. అతిక్రమణల రిజిష్టరు
71. సభ్యుల హాజరీ రిజిష్టరు
72. పుస్తకముల జాబితా
73. స్టేషనరీ సామాగ్రి నిల్వ రిజిష్టరు
74. కలు సామాను నిల్వ రిజిష్టరు
75. వేతనము బిల్లు రిజిష్టరు
76. ప్రయాణ భత్యము బిల్లు రిజిష్టరు
77. చెల్లింపబడని వేతనముల రిజిష్టరు
78. చెల్లింపు మంజూరైన బిల్లుల రిజిష్టరు

VIII సహాయక సంస్థలకు ప్రత్యేక రిజిష్టర్లు
(పంచాయతీ సమితులు) హాస్టళ్లు
చేతిపనుల కేంద్రములు, స్త్రీ సంక్షేమ కేంద్రములు

79. ముడిసరకుల నిల్వ అకౌంటు
80. తయారైన సస్తువుల నిల్వ అకౌంటు
81. ఉత్పత్తి రిజిష్టరు లేక తయారీ రిజిష్టరు

2. పోస్టింగు రిజిష్టరు—పంచాయతీ సమితి/జిల్లా పరిషత్తు (ఇటుపై ప్రభుత్వము అనబడు) ఆంధ్రప్రదేశ ప్రభుత్వముచే ఆ యా సమయములందు నిర్ణయింపబడు నమూనాలో పోస్టింగు రిజిష్టరును నిర్వహింపవలెను లేక నిర్వహింప జేయవలెను. అందులో ప్రతి నెలకును పూర్తి సంవత్సరములోను ప్రారంభపు, ముగింపు నిల్వలను ప్రస్తుతపు మరియు వెరశి, మొత్తపు వసూళ్ళను చార్జీలను చూప వలెను. ప్రతి నెలలో జరిగిన వ్యవహారములు రిజిష్టరులో నమోదు చేసి నెలాఖరు మించకుండా ప్రతినెల అక్కౌంటును తరువాత తేల్చవలెను.

3. పోస్టింగు రిజిష్టరు కొన్ని వివరములు— పోస్టింగు రిజిష్టరులో వసూళ్ళను చూపు భాగమును నగదు పుస్తకము, ట్రాన్సుఫరు ఎంట్రీ రిజిష్టరులోగల నమోదులనుండి వ్రాయవలెను. వసూలు పద్దులన్నింటిని వర్గీకరించి పోస్టింగు రిజిష్టరులో ఆ యా శీర్షికల క్రింద వ్రాయవలెను. ఒక సవివర శీర్షిక క్రింద ఒకటికి మించిన పద్దులున్న సందర్భములలో అట్టి పద్దుల మొత్తముకు సంబంధించిన శీర్షిక క్రింద వ్రాయవలెను. వివరములను క్రింది భాగములో వ్రాయవలెను. పోస్టింగు రిజిష్టరులోని చెల్లింపు భాగమును, నగదు పుస్తకము ట్రాన్సుఫరు ఎంట్రీ రసీదులనుండి వ్రాయవలెను. ఈ రసీదులను ముందుగా పోస్టింగు రిజిష్టరులోని శీర్షికల వరుస ప్రకారము ఉంచవలెను. ఏదైన శీర్షిక క్రింద ఒకటికి మించి రశీదులు ఉన్నచో, ఆ పద్దులన్నిటిని ఆయా రశీదుల నంబర్లతో కూడ పోస్టింగు రిజిష్టరు క్రింది భాగములో వ్రాయవలెను. మొత్తములను మాత్రమే, సంబంధించిన శీర్షిక క్రింద వ్రాయవలెను. ఈ రెండింటికిని గల సంబంధమును సూచన అక్షరములతో తెలుపవలెను. నెల అక్కౌంట్లను పూర్తి చేయగనే, అన్ని శీర్షికల క్రింద వెరశి మొత్తములను అందుకుగాను ఉద్దేశింప బడిన కాలంలో వేయవలెను.

4. నెలవారి అకౌంటు అబ్‌స్ట్రాక్టు—పంచాయతీ సమిత/జిల్లా పరిషత్తు ఆ పోస్టింగు రిజిష్టరునుండి, ఆ యా సమయములందు ప్రభుత్వమువారు నిర్ణయించు నమూనాలో ప్రతి నెలకు అబ్‌స్ట్రాక్టును తయారు చేసి దానిని తరువాతి నెలాఖరు మించకుండ వెరిఫికేషను సర్టిఫికేటుతో గూడ ఆడిటరుకు పంపించవలెను.

5. సాలీనా అకౌంటు :—పంచాయతీ సమితి జిల్లా పరిషత్తుయొక్క ప్రతి సాలీనా అకౌంటు అబ్‌స్ట్రాక్టును నిర్ణీత నమూనాలో ఆ పంచాయతీ సమితి జిల్లా పరిషత్తు తయారుచేసే తరువాతి ఆర్థిక సంవత్సరము రెండవ నెల 15 వ తేదీ మించకుండ జిల్లా పరిషత్తుకు, ప్రభుత్వమునకు దాఖలు చేయవలెను. ఆ అబ్‌స్ట్రాక్టులో ప్రతి వసూలు శీర్షిక క్రింద ఆదాయము, సిబ్బంది చార్జీలు, ప్రారంభించిన పనులు, ప్రతి పనిమీద ఖర్చు పెట్టబడిన మొత్తము ఖర్చు పెట్టగా ఏమైన నిల్వ వున్నచో ఆ నిల్వ ప్రభుత్వమువారు అపుడపుడు కోరు యేదైన సమాచారము చూపవలెను. జిల్లాకు జిల్లా పరిషత్తు ఏర్పాటు చేయబడని సందర్భములో, ఈ రిటర్నును పంచాయతీ సమితి కలెక్టరుకు దాఖలు చేయవలెను.

6. సవివరమగు సాలీనా అకౌంటు :—పంచాయతీ సమితి జిల్లా పరిషత్తుకు సవివరమగు సాలీనా అకౌంటును తరువాతి ఆర్థిక సంవత్సరములో రెండవ నెల 15వ తేదీ మించకుండ జిల్లా పరిషత్తుకు ప్రభుత్వమువారికి దాఖలు చేయవలెను.

7. నెలవారీ డిమాండు, వసూలు, శేషము స్టేటుమెంటు—పంచాయతీ సమితి జిల్లా పరిషత్తు వసూళ్ళ పద్దుల నన్నిటిని చూపు నెలవారీ డిమాండు, వసూలు, శేషము స్టేట్‌మెంటును, ఆ యా సమయములందు ప్రభుత్వమువారు నిర్ణయించు నమూనాలో తయారుచేసి, తరువాతి నెల 15 వ తేదీ నాటికి ఆ యా జిల్లా పరిషత్తులకు, ఆడిటర్లకు, ప్రభుత్వమువారికి దాఖలు చేయవలెను.

8. ఆర్థిక మంజూర్ల నెలవారి స్టేటుమెంటు—ప్రతి పంచాయతీ సమితి పరిషత్ దాని స్థాయీ సమితులు కూడ ఆ నెలలో తమచే ఈయబడిన అన్ని ఆర్థిక మంజూర్ల ప్రతులను తరువాతి నెల 20 వ తేదీనాటికి, ఆడిటర్లకు పంపవలెను. పంచాయతీ సమితుల విషయములో జిల్లా పరిషత్తులకు కూడ పంపవలెను.

9. సమాజాభివృద్ధి కార్యక్రమము క్రింద మంజూరైన సిబ్బందికై రిజిష్టర్లు—పంచాయతీ సమితులు, సమాజాభివృద్ధి కార్యక్రమము క్రింద మంజూరైన సిబ్బందికై వేతనపు బిల్లులు, ప్రయాణ భత్యపు బిల్లులు మొదలగు వాటి నిమిత్తము ప్రత్యేక రిజిష్టర్లను నిర్వహింపవలెను.

10. సమాజాభివృద్ధి కార్యక్రమము క్రింద పెట్టబడిన ఖర్చు నిమిత్తము సబ్సిడియల్, కంటింజెంటు రిజిష్టర్లు—పంచాయతీ సమితి, సమాజాభివృద్ధి కార్యక్రమము క్రింద పెట్టబడిన ఖర్చు నిమిత్తము ప్రత్యేక సబ్సిడియల్ "వర్కు రిజిష్టర్లను", "కంటింజెంటు రిజిష్టర్లను" నిర్వహింపవలెను.

11. ట్రాన్సుఫరు సర్దుబాట్లు—పంచాయతీ సమితి, జిల్లా పరిషత్తు అకౌంట్లలో చేయబడిన ప్రతి మార్పు, అందు నిమిత్తము నిర్వహింపబడు ట్రాన్సుఫరు ఎంట్రి రిజిష్టరు అను రిజిష్టరులో చేయబడు ట్రాన్సుఫరు ఎంట్రీ ద్వారా చేయబడవలెను.

ఆ రిజిష్టరు, ఆ యా సమయములందు ప్రభుత్వమువారు నిర్ణయించు నమూనాలో వుండవలెను. అందులో చేయబడు ప్రతి నమోదు, అకౌంటులో ఏ శీర్షికకు లేక శీర్షికలకు ఖర్చు వ్రాయవలెనో, శీర్షికకు లేక శీర్షికలకు జమ కట్టవలెనో, ఆ ట్రాన్సుఫరు ఏ కారణములపై ప్రతిపాదింపబడెనో చూపవలెను.

ప్రతి ట్రాన్సుఫరు నమోదు అది రిజిష్టరులో నమోదు చేయబడుటకు పూర్వము, బ్లాకు అభివృద్ధి అధికారిచే పంచాయతీ సమితి, జిల్లా పరిషత్ కార్యదర్శిచే సక్రమముగా మంజూరు చేయబడవలెను.

అకౌంటు నమూనాల కొనుగోలు, వాటిని సాధారణ నిర్వహణ, వాటిని నిల్వను గూర్చి లెక్క చెప్పుట.

12. పంచాయతీ సమితి, జిల్లా పరిషత్తు ప్రభుత్వమువారిచే ఆదేశింపబడిన ఈ క్రింది నమూనాలను నిర్ణయింపబడు రూపములో ఉపయోగించవలెను.

నమూనాలు

1. వేతనము బిల్లులు.
2. ప్రయాణ భత్యము బిల్లులు.
3. కంటింజెంటు బిల్లులు.

4. పాఠశాలల డి. సి. బి. స్టేటుమెంటు (జిల్లా పరిషత్‌లకు మాత్రమే)
5. ఇంక్రిమెంటు సర్టిఫికెట్లు
6. గైరుహాజరీల స్టేటుమెంట్లు
7. ఎగ్రిమెంటు నమూనాలు
8. నామినలు మస్టరు పట్టీలు
9. కాలదోషము పట్టిన డిపాజిట్ల వాపసు వోచర్లు
10. అంచనా
   (i) సవివరమగు కొలత షీటు
   (ii) అంచనా అబ్స్ట్రాక్టు
11. వ్యత్యాసములను సరిపోల్చుకొను స్టేటుమెంటు
12. సమాప్తి రిపోర్టు
13. కంట్రాక్టు సర్టిఫికేటు
14. సాలీనా వెరిఫికేషను సర్టిఫికేటు
15. నెలవారి అకౌంటు అబ్స్ట్రాక్టు
16. నెలవారి డి. సి. బి. స్టేటుమెంట్లు
17. కేటాయింపుల బదిలీ నిమిత్తము అర్జీ
18; ప్రొపోజిషను స్టేటుమెంటు
19. చలాను

ప్రావిడెంటు ఫండు నమూనాలు

20. నామినేషను నమూనా
21. చందాదార్ల డిపాజిటు అకౌంటు
22. రిజిష్టర్డు నోటీసు నమూనా
23. ప్రావిడెంటు ఫండునుండి తిరిగి చెల్లింపు నిమిత్తము ఓచరు
24. వసూలైన ప్రావిడెంటు ఫండు చందాల సేటుమెంటు
25. హామీ పత్రము
26. స్థిరాస్తుల సంపాదన, బదిలీకి సంబంధించిన నమూనాలు

నమూనాల సరఫరాకై ఇండెంటు, ఆ యా సమయములందు ప్రభుత్వము వారు నిర్ణయించు నమూనాలో ఉండవలెను.

చట్టముచే లేక దాని క్రింద చేయబడిన నియమముల ద్వారా తమకు లభించిన అధికారములను పురస్కరించుకొని ప్రభుత్వము వారు నిర్ణయించు

అకౌంటు నమూనాలు తప్ప తదితరములు ప్రభుత్వమువారి పూర్వా మోదము లేకుండ పంచాయతీ సమితులు జిల్లా పరిషత్‌లు ఉపయో గించరాదు.

13. నమూనాల నిల్వ అకౌంటు—బ్లాకు అభివృద్ధి అధికారి పంచా యతీ సమితి జిల్లా పరిషత్ యొక్క కార్యదర్శి ఆ యా సమయములందు ప్రభు త్వము వారిచే నిర్ణయింపబడు రీతిగా నిల్వ అకౌంటు శీర్షికలలో నిర్దిష్ట పరుపబడిన నమూనాలకు డిపార్టుమెంటుల శిస్తు వసూలు నిమిత్తము ఉపయో గింపబడుటకై ముద్రింపబడిన అన్నిరకముల టిక్కట్లకు కూడ సక్రమముగా అకౌంటు నిర్వహింపబడునట్లు ఏర్పాటు చేయవలెను. నమూనాల నిల్వ అకౌంటు సరిగా వున్నదాయని ప్రతి ఆరు నెలలకు బ్లాకు అభివృద్ధి అధికారి, కార్యదర్శి వున్నచో ఆయన సరిచూడ వలెను.

14. రికార్డులు—అన్ని అకౌంట్లు, రిజిష్టర్లు ఇంగ్లీషులో నిర్వహింప బడవలెను, అయితే ఏదైన సబ్సిడీ అకౌంటు లేక రిజిష్టరు, లోకల్‌ఫండు అకౌంట్ల ఎగ్జామినరు పూర్వామోదముతో ఆ జిల్లా భాష లేక భాషలలో నిర్వహింప బడవచ్చును.

15. అకౌంట్లలో అన్ని సరిదిద్దుటలు, మార్పులు, శుభ్రముగా ఎఱ్ఱ సిరాతో చేయబడి బ్లాకు అభివృద్ధి అధికారి, కార్యదర్శిచే లేక బ్లాకు అభి వృద్ధి అధికారి సక్రమముగా అధికారమిచ్చిన బాధ్యుడగు అధికారిచే సంతకము చేయబడవలెను. అదేవిధముగా జిల్లాలలో మార్పులు, దిద్దుబాట్లు సొమ్ము తీసికొనువారిచే ధృవపరుపబడవలెను,

బాధ్యుడగు అధికారిచే సంతకము చేయబడవలెను. అదేవిధముగా జిల్లా లలో మార్పులు, దిద్దుబాట్లు సొమ్ము తీసికొను వారిచే ధృవపరుప బడవలెను.

## 27. లోకల్ ఫండు అకౌంట్ల పరిశీలకుని ఆడిటరుగా నియమించుట

1959 ఆంధ్ర ప్రదేశ్ పంచాయతీ సమితుల జిల్లా పరిషత్తుల చట్టము (1959లో 35వ ఆంధ్ర ప్రదేశ్ చట్టము) యొక్క 56వ విభాగముతో బాటు 2వ విభాగపు (3)వ ఉప విభాగము ద్వారా లభ్యమైన అధికారములను

పురస్కరించుకొని ఆంధ్రప్రదేశ్ గవర్నరుగారు ప్రతి పంచాయతీ సమితి యొక్కయు, జిల్లా పరిషత్తు యొక్కయు సాలీనా లెక్కలన్నింటిని మరియు సదరు చట్టము యొక్క 32 వ విభాగము (1) వ ఉప విభాగము ననుసరించి అట్టి ప్రతి పంచాయతీ సమితి మరియు జిల్లా పరిషత్తుచే వ్రాసియుంచబడు సమస్త లెక్కలను ప్రతి ఆర్థిక సంవత్సరం ముగిసిన పిదప పరిశీలించుటకును, ఆడిటు చేయుటకును లోకల్ ఫండు అక్కౌంట్ల పరిశీలకుని ఆడిటరుగా ఇందు మూలముగా నియమించుచున్నారు.

## 28. అవిశ్వాస తీర్మానమునకు సంబంధించిన నియమావళి

1. అధ్యక్షునిపైగాని, ఉపాధ్యక్షునిపైగాని అవిశ్వాస తీర్మానమును ప్రతిపాదించు వుద్దేశమును తెలియపరచు లిఖిత పూర్వకమైన ప్రతి నోటీసు ఈ క్రింద నమూనాలో వుండవలెను, అదేదనగా—

రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు.
డిప్యూటీ కలెక్టరు.
సబ్ కలెక్టరు.
అసిస్టెంటు కలెక్టరు,

అయ్యా, గారికి

ఈ దిగువ సంతకము చేసిన.................పంచాయతీ సమితి సభ్యులమగు మేము, ఆ పంచాయతీ సమితి అధ్యక్షుడు/ఉపాధ్యక్షుడు అగు శ్రీ.......................గారిపై మాకు విశ్వాసము లోపించినదను తీర్మానమును, ఇందు నిమిత్తమై ఏర్పాటు చేయబడు సమావేశములో, ప్రతిపాదించుటకు మాకుగల ఉద్దేశమును గూర్చి 1959, ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సమితుల, జిల్లా పరిషత్తుల చట్టము (1959లోని 35వ ఆంధ్రప్రదేశ్ చట్టము) యొక్క 33వ విభాగము, (2) వ ఉప విభాగముచే కోరబడిన విధముగా ఇందుమూలముగా నోటీసు ఇచ్చుచున్నాము.

ప్రతిపాదింప దలచిన తీర్మానపు నకలు దీనికి జత చేయబడినది.

................సం॥..................నెల..............
తేదీ......................న సంతకము చేయబడినది.

1 ... ... ... ...

2 ... ... ... ...

2. పై 1వ నియమములో తెలుపబడిన అవిశ్వాస తీర్మానమును పరిశీలించుటకై సమావేశమును ఏర్పాటు చేయుటను గూర్చిన నోటీసు ఈ క్రింది నమూనాలో ఉండవలెను, అదేదనగా —

" ... .... పంచాయతీ సమితి సభ్యులగు .........గారికి

అయ్యా/అమ్మా

............... పంచాయతీ సమితి అధ్యక్షునిపై/ఉపాధ్యక్షునిపై అవిశ్వాస తీర్మానమును ప్రతిపాదించు ఉద్దేశమును గూర్చిన నోటీసు 1959, ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సమితులు, జిల్లా పరిషత్‌ల చట్టము (1959లోని 35వ ఆంధ్రప్రదేశ్ చట్టము) యొక్క 33వ విభాగము, (2)వ ఉప విభాగముచే కోరబడిన విధముగా నాకు అందజేయ బడినందువలన;

ఆ అవిశ్వాస తీర్మానమును పరిశీలించు నిమిత్తము............... తేదీ............గంటలకు పంచాయతీ సమితి కార్యాలయమందు పంచాయతీ సమితి సమావేశము జరుపబడవలెనని ఆ చట్టముయొక్క (1)వ ఉప విభాగము క్రింద నేను ఇందుమూలముగా నోటీసు ఇచ్చుచున్నాను.

ఆ అవిశ్వాస తీర్మానము యొక్క నకలు దీనికే జతపరుపబడినది.

(సంతకము)

రెవిన్యూ డివిజనులు ఆఫీసరు.
డిప్యూటీ కలెక్టరు
సబ్ కలెక్టరు
అసిస్టెంటు కలెక్టరు

3. 33వ విభాగము (3)వ ఉప విభాగములో తెలుపబడిన సమావేశపు నోటీసు పంచాయతీ సమితి యొక్క ప్రతి సభ్యునకు ఈ క్రింది విధముగా పంపబడవలెను:—

(ఎ) సభ్యునకు ఆ నోటీసును ఇచ్చుట లేక యిాయజూపుట; లేక

(బి) ఆ సభ్యుడు కనుపించనిచో, ఇంతకుపూర్వము ఆయనయొక్క నివాస లేక వ్యాపార స్థలముగా తెలియవచ్చినచోట ఆ నోటీసు ఉంచుట లేక

ఆయన కుటుంబమందలి వయోజనుడైన వ్యక్తికి లేక నౌఖరుకు దానిని ఇచ్చుట లేక యీయజూపుట; లేక

(సి) అట్టి సభ్యుడు పంచాయతీ సమితి ప్రాంతములో నివసింపకుండా ఇతరత్రా ఆయన చిరునామా బ్లాకు అభివృద్ధి అధికారికి లేక పంచాయతీ సమితి అధ్యక్షునకు తెలిసియున్నచో, ఆయనకు దానిని రిజిష్టరు పోస్టు ద్వారా పంపుట; లేక

(డి) పై తెల్పిన మార్గములేవియు లభ్యపడనిచో, అట్టి నివాస లేక వ్యాపార స్థలముయొక్క ప్రధానమైన భాగమందు దానిని అంటించుట.

4. పంచాయతీ సమితి యొక్క అధ్యక్షుడు లేక ఉపాధ్యక్షుడు లేక జిల్లా పరిషత్తుయొక్క చైర్మను లేక వైస్ చైర్మన్‌లో అవిశ్వాస తీర్మానము మీద ఓటింగు చేతులు చూపుట ద్వారా జరుగును. మీటింగు వద్ద హాజరయిన మెంబర్ల ఓట్లు, కలెక్టరు లేక జిల్లా కలెక్టరుచేత తీసికొనబడును.

## 29. సమితి, పరిషత్తులో ఖాళీలను భర్తీ చేయుట

1959 ఆంధ్ర ప్రదేశ్ పంచాయతీ సమితుల జిల్లా పరిషత్తుల చట్టము (1959లో 35వ ఆంధ్రప్రదేశ చట్టము) యొక్క 69వ ఉప విభాగముతో బాటు 34వ విభాగపు (2)వ ఉపవిభాగము, 58వ విభాగము ద్వారా లభ్యమైన అధికారములను పురస్కరించుకొని ఆంధ్ర ప్రదేశ్ గవర్నరుగారు, పంచాయతీ సమితి యొక్క అధ్యక్షుడు లేక ఉపాధ్యక్షుడు లేక జిల్లాపరిషత్తుయొక్కచైర్మను లేక వైస్‌చైర్మను ప్రభుత్వమువారిచే తొలగించబడినపుడు అట్టి తొలగింపు తేదీ నుండి ఎనిమిది వారముల లోపల ఆఖాళీ భర్తీ చేయబడవలెనని ఇందు మూలముగా నిర్ణయించుచున్నారు.

## 30. సంయుక్త సమితుల ఏర్పాటు, అధికారముల విధాన క్రమమునకు సంబంధించిన నియమావళి

1. ఒకటి లేక అంతకంటె ఎక్కువ ఇతర స్థానిక అధికార వర్గములు చేరియున్న పంచాయతీ సమితియొక్క సంయుక్త సమితియందు సంబంధించిన స్థానిక అధికారవర్గముల సభ్యులు కానట్టి అయితే ప్రభుత్వమువారి ఉద్దేశములో అట్టి సంయుక్త సమితిలో పనిచేయుటకు ప్రత్యేక అర్హతలు లేక ప్రత్యేక ఆసక్తి కలిగియున్నట్టి వ్యక్తులు చేర్చుకొన బడవచ్చును.

అయితే, ఆ వ్యక్తుల సంఖ్య సంయుక్త సమితి యందలి మొత్తము సభ్యుల సంఖ్యలో మూడవ వంతుకు మించకూడదు.

2. సంయుక్త సమితియొక్క ఏర్పాటు నిబంధనల ప్రకారము జరుగవలెను. ఇది 5, 6 నియమములలో తెలుపబడిన సందర్భములలో తప్ప, సంబంధించిన ప్రతి స్థానిక అధికారవర్గము అనుమతి నిచ్చిననేగాని అమలు కలిగియుండ కూడదు.

3. ఈ నిబంధనలు దిగువ వాటిని నిర్ణయింపవచ్చును.

(ఎ) సంయుక్త సమితి యందలి మొత్తము సభ్యుల సంఖ్య ;

(బి) స్థానిక అధికార వర్గముల సభ్యులుగా నుండవలసిన వ్యక్తుల సంఖ్య, వెలుపలివారుగా నుండదగు వ్యక్తుల సంఖ్య ;

(సి) సంయుక్త సమితి సభ్యులుగా నుండవలసిన వ్యక్తులు లేక వారు ఎన్నుకొనబడవలసిన లేక నియమింపబడవలసిన పద్ధతి :

(డి) సంయుక్త సమితి చైర్మనుగా వుండవలసిన వ్యక్తి లేక ఆయన ఎన్నుకొనబడవలసిన లేక నియమింపబడవలసిన పద్ధతి :

(ఇ) సభ్యుల యొక్కయు, చైర్మనుయొక్కయు పదవీకాలపరిమితి:

(ఎఫ్) సంబంధించిన ఒకటి లేక అంతకు ఎక్కువ స్థానిక అధికార వర్గములచే వినియోగింపబడ దగినవై యుండి, సంయుక్త సమితిచే వినియోగింపబడదగు అధికారములు ; మరియు

(జి) సంయుక్త సమితి యొక్క విధాన క్రమము.

4. 2, 3 నియమముల క్రింద చేయబడిన నిబంధనల మార్పు చేయబడవచ్చును లేక రద్దు చేయబడవచ్చును.

అయితే, సంబంధించిన స్థానిక అధికారవర్గములన్నియు అట్టి మార్పుకు లేక రద్దుకు అనుమతింపవలెను.

5. ప్రభుత్వమువారు వాంఛించినచో 2, 3వ నియమములలో తెలుపబడిన విషయములన్నిటి సందర్భములో లేక అందు వేటి సందర్భములోనైనను 35వ విభాగము, (1)వ ఉప విభాగము క్రింద తాము అవసరమని లేక భావించు ఆదేశములను యీయవచ్చును.

6. పై నియమములలో వేటి క్రిందనైనను స్థానిక అధికార వర్గముల మధ్య ఏదైన అభిప్రాయ భేదము ఏర్పడినచో, దానిని ప్రభుత్వము వారికి నివేదించవలెను. వారి నిర్ణయము అంతిమమైనదిగా వుండవలెను.

## 31. పంచాయతీ సమితికాని బ్లాకుల నుండి మెంబర్లను ఎన్నుకొను నియమావళి

### 1వ భాగము

#### ఉపక్రమనిక

1. ఈ నియమావళిలో సందర్భము అన్యథా అపేక్షించిననే తప్ప,—

(i) "చట్టము" అనగా 1959, ఆంధ్ర ప్రదేశ్ పంచాయతీ సమితుల, జిల్లా పరిషత్తుల చట్టము (1959 లో 35 వ ఆంధ్ర ప్రదేశ్ చట్టము) అని అర్థము ;

(ii) "విభాగము" అనగా చట్టము యొక్క విభాగము అని అర్థము ;

(iii) ఈ నియమావళిలో ఉపయోగించబడియు నిర్వచింపబడని పదములు, పదజాలములు చట్టములో వాటికిగల అర్థములనే కలిగి యుండవలెను.

### 2 వ భాగము

#### పంచాయతీ సమితి ఏర్పాటు చేయబడనట్టి బ్లాకుల నుండి జిల్లా పరిషత్తు సభ్యుని ఎన్నిక

2. పంచాయతీ సమితి ఏర్పాటు చేయబడనట్టి ప్రతి బ్లాకునుండి జిల్లా పరిషత్తుకు ఒక సభ్యుని ఎన్నిక, ఆంధ్రప్రాంతములో అట్టి బ్లాకులోగల పంచాయతీల అధ్యక్షుల యొక్కయు, తెలంగాణా ప్రాంతములో అట్టి బ్లాకులలో గల పంచాయతీల సర్పంచుల మరియు పట్టణ సమితుల అధ్యక్షుల యొక్కయు సమావేశములో జరుగవలెను. ఈ సమావేశము ప్రత్యేకముగా ఇందు నిమిత్తమై కలెక్టరుచే లేక జిల్లా కలెక్టరుచే ఈ నియమావళికి అనుబంధింపబడిన

నమూనాలో అధికార మీయబడిన ఎవరేని ఇతర గెజిటెడు అధికారిచే ఏర్పాటు చేయబడి ఈ కార్యమునకై ఆయన నిర్దిష్ట పరుపబడిన కేంద్ర స్థలములో జరుపబడవలెను.

3. అట్టి సమావేశముయొక్క తేదీని, సమయమును గురించిన నోటీసు ఈ నియమావళికి అనుబంధింపబడిన నమూనాలో 2వ నియమములో పేర్కొన బడిన వ్యక్తులకు సమావేశమునకు కనీసము పూర్తి అయిదు దినములు ముందు ఈయబడవలెను.

4. ఎన్నిక జరుపుటకై ఏర్పాటు చేయబడిన సమావేశమునకు కలెక్టరు లేక జిల్లా కలెక్టరుచే అధికార మీయబడిన ఎవరేని ఇతర గెజిటెడు అధికారి అధ్యక్షత వహించవలెను. అట్టి అధికారి ఎన్నికలో ఓటు వేయుటకు హక్కు కలిగి ఉండరాదు.

5. (i) ఎన్నికకై నిలబడు అభ్యర్థి ఒక సభ్యునిచే ప్రతిపాదింపబడి మరొక సభ్యునిచే బలపరుపబడవలెను ;

(ii) సక్రమముగా ప్రతిపాదింపబడి బలపరుపబడిన అభ్యర్థు లందరి పేర్లు సమావేశమునకు అధ్యక్షత వహించిన అధికారిచే చదివి వినిపించబడవలెను.

5. (a) ఎన్నికల ఫలితముల ప్రకటనకు పూర్వము ఎప్పుడైనా ఒక అభ్యర్థిత్వము ఉపసంహరించుకొనవచ్చును.

6. ఒక అభ్యర్థి మాత్రమే సక్రమముగా ప్రతిపాదింపబడినచో బ్యాలెటు వుండకూడదు. ఆ అభ్యర్థి ఎన్నిక అయినట్లు ప్రకటింప బడవలెను.

(2) అట్టి అభ్యర్థులు ఇద్దరు లేక అంత కెక్కువమంది ఉన్నచో రహస్య బ్యాలెటు పద్ధతిలో ఎన్నిక జరుపబడి సమావేశములో హాజరై వున్న సభ్యుల ఓట్లు తీసికొనబడవలెను.

(3) అభ్యర్థులకు వారి పేర్లయొక్క (ఇంగ్లీషు/తెలుగు) అక్షర క్రమములో క్రమసంఖ్య కేటాయించ బడవలెను. అటు తరువాత, అధ్యక్షత వహించు అధికారి, ప్రతి అభ్యర్థికి కేటాయించ బడిన క్రమసంఖ్యను ప్రకటించవలెను.

7. (1) అధ్యక్షత వహించు అధికారి ఒక బ్యాలెటు పెట్టెను ఏర్పాటు చేయవలెను. అట్టి బ్యాలెటుపెట్టె, ఓటు పత్రములను వానిలో వేయు

టకు గాని ఆ పెట్టె తాళము తీయకుండ వాటిని బయటకు తీయుటకు వీలు లేకుండునట్లు తయారు చేయబడినవై ఉండవలెను.

(2) అధ్యక్షత వహించు అధికారి, ఓట్లను తీసికొనుటకు సద్యః పూర్వము, అచ్చట హాజరైయున్న సభ్యులందరకును ఖాళీగావున్న బ్యాలెటు పెట్టెను అది ఖాళీగా వున్నట్లు వారందరికును కనుపించు విధముగా చూపించి ఆ పిదప దానికి తాళము వేసి దానిపై తన సీలు వేయవలెను. అట్టి సీలును పగుల గొట్టిననేగాని పెట్టె తెరచుటకు వీలులేని విధముగా వేయవలెను.

(3) ఓటు చేయదలచిన ప్రతి సభ్యునకు ఒక ఓటు పత్రము ఈయబడవలెను. ఆ పత్రముపై ఈ క్రింది నమూనాలో (ఇంగ్లీషు/తెలుగులో) అభ్యర్థులందరి పేర్లు పైపు చేయబడవలెను లేక స్పష్టముగా వ్రాయబడవలెను :—

| | పేరు | ఓటు |
|---|---|---|
| (1) | | |
| (2) | | |
| (3) | | |

అధ్యక్షత వహించు అధికారి, ఓటు పత్రమును ఇచ్చుటకుముందు దాని ప్రామాణికతను సూచించుటకుగాను దానిపై ఏాద ముద్రవేయవలెను. అటు తరువాత ఓటరు, ఓటు చేయుటకు ప్రత్యేకింపబడిన స్థలమునకు బోయి, తాను ఏ అభ్యర్థికి ఓటు చేయ గోరునో ఆ అభ్యర్థి పేరుకు ఎదురుగా ఆ ఓటు పత్ర మందు గుర్తు పెట్టవలెను. ఆయన ఓటు పిదప రహస్యమును కాపాడు నిమిత్తము ఆ ఓటు పత్రిమును మడచి అధ్యక్షత వహించు అధికారికిని ఇతర సభ్యులకును కనుపించునట్లు ఉంచబడి బ్యాలెటు పెట్టెలో దానిని వేయవలెను. చదువురాని లేక ఓటు చేయుటకు శారీరకముగా అశక్తుడైన సభ్యుడు ఎవరైన కోరినచో అధ్యక్షత వహించు అధికారి ఓటు చేయుటకు ప్రత్యేకింపబడిన స్థలమునకు ఆయనను తీసికొనిపోయి ఆయన ఎవరికి ఓటు చేయదలచినది అడిగి తెలిసికొని తదనుసారముగా ఓటు పత్రముపై గుర్తుపెట్టి రహస్యమును కాపాడుటకై దానిని మడచి బ్యాలెటు పెట్టెలో వేయవలెను. అధ్యక్షత వహించు అధికారి, బ్యాలెటు రహస్యము కాపాడబడుటకు తగు ఏర్పాట్లు చేయించవలెను.

(4) అధ్యక్షత వహించు అధికారి, ఓటింగు ముగిసిన వెంటనే హాజరైయున్న సభ్యుల సమక్షములో బ్యాలెటు పెట్టెను తెరచి దానిలో నుండి. ఓటు పత్రములను తీసి లెక్కించి, వాటి సంఖ్యను ఒక పట్టికలో వ్రాయవలెను ఓటు పత్రము ఈ క్రింది సందర్భములలో చెల్లనేరదు—

(ఎ) దానిపై ఓటరు సంతకము వున్నచో లేక దానిలో ఆయనను పోల్చుకొనుటకు వీలగు ఏదైన మాట, చిహ్నము లేక కనబడు గుర్తు వున్నచో: లేక

(బి) ఒకటికంటె ఎక్కువ పేర్లకు ఎదురుగా గుర్తులు పెట్టబడి యున్నచో; లేక

(సి) దానిపై ఇద్దరు లేక అంతకంటె ఎక్కువ అభ్యర్థులలో ఎవరికి ఓటు చేయవలెనని ఉద్దేశింపబడినదో తెలిసికొనుట అనుమానాస్పదముగా వుండునట్లు గుర్తు పెట్టబడి యున్నచో; లేక

(డి) దానిపై ఎట్టి గుర్తుగాని పెట్టబడి యుండనిచో;

(5) అధ్యక్షత వహించు అధికారి—

(i) అందరికంటె ఎక్కువ ఓట్లు వచ్చిన అభ్యర్థి సక్రమముగా ఎన్నికైనట్లు ప్రకటించవలెను.

(ii) ఎవరైన ఇద్దరు లేక అంతకెక్కువ అభ్యర్థులకు ఓట్లు సమానముగా వచ్చియుండి ఆ అభ్యర్థులలో ఎవరికైనను ఒక ఓటు కలిపినచో ఆయన సక్రమముగా ఎన్నికైనట్లు ప్రకటింపబడుటకు అతనికి హక్కు కలిగించునట్లుండు నెడల, అధ్యక్షత వహించు అధికారి, సభ్యుల సమక్షములో చీట్లు వేయవలెను. ఏ అభ్యర్థి పేరుగల చీటీ మొదట తీయబడుదో ఆ అభ్యర్థి అట్టి అదనపు ఓటును పొందినట్లు భావింపబడవలెను.

8. అధ్యక్షత వహించు అధికారి సమావేశము ముగిసిన వెంటనే—

(ఎ) ఆ సమావేశపు ప్రొసీడింగుల రికార్డును తయారు చేసి దానిపై సంతకము చేసి, సరిదిద్దబడిన ప్రతిచోట తన చిన్న సంతకమును చేయవలెను. ఆ సమావేశమునకు హాజరైన సభ్యుడెవరైనను అట్టి రికార్డుపై సంతకము చేయగోరినచో, అట్లు సంతకము చేయుటకు అనుమతింపవలెను;

(బి) జిల్లా పరిషత్తు సభ్యుడుగా ఎన్నికైన వ్యక్తి పేరును తెలుపుచు ఒక నోటీసును దానిపై తాను సంతకము చేసి ఎన్నిక జరిగిన స్థలములో నోటీసు బోర్డుపై ప్రచురింపవలెను. అట్టి నోటీసు ప్రతి నొకదానిని జిల్లా కలెక్టరుకు పంపవలెను.

9. (1) అధ్యక్షత వహించు అధికారి, అటు పిమ్మట ప్రతి అభ్యర్థికి సంబంధించిన లెక్క పెట్టబడినట్టియు త్రోసివేయబడినట్టియు ఓటు పత్రములను వేరు వేరు ప్యాకెట్లలో పెట్టి ప్రతి ప్యాకెట్టును సీలుచేసి అందులో ఉన్న పత్రముల వివరములను అవి ఏ ఎన్నికకు సంబంధించినవో ఆ ఎన్నిక వివరములను అది జరిగిన తేదీని దానిపై వ్రాయవలెను.

(2) ఎన్నికల న్యాయాలయము లేక ఇతర అర్హతలుగల న్యాయాలయముయొక్క ఉత్తరువు క్రింద తప్ప ఈ ప్యాకెట్లను విప్పుటగాని అందలి పత్రములను పరిశీలించుటగాని, ఎవరికైనను చూపుటగాని చేయరాదు ;

(3) ఈ ప్యాకెట్లు కలెక్టరు కార్యాలయములో ఒక సంవత్సరము పదిలపరుపబడి అటు పిమ్మట అర్హమైన న్యాయాలయము అన్యథా ఆదేశించిననే తప్ప నాశనము చేయబడవలెను.

నోటీసు నమూనా

(3 వ నియమము చూడుడు)

నెం. కార్యాలయము

తేదీ ... ... ...

... ... ... పంచాయతీ అధ్యక్షులైన/
పంచాయతీ సర్పంచులైన/ పట్టణ సమితి అధ్యక్షులైన
శ్రీ... ... ... ...గారికి ఇందుమూలమున తెలియజేయునదేమనగా పంచాయతీ సమితి ఏర్పాటు చేయబడి లేని బ్లాకు నుండి ఒక ప్రతినిధిని ఎన్నుకొను నిమిత్తము............(సమయమున).........(తేదీన).........(స్థలములో) సమావేశము జరుపబడును.

(సంతకము)
(హోదా)
( సీలు )

అధికార ప్రధాన పత్రము నమూనా

(2వ నియమము చూడుడు)

పంచాయతీ సమితి ఏర్పాటు చేయబడని............ బ్లాకునుండి ఒక ప్రతినిధిని ఎన్నుకొను నిమిత్తము 1959, ఆంధ్రప్రదేశ్ పంచాయితీల, జిల్లా పరిషత్తుల చట్టము (1959లో 35వ ఆంధ్రప్రదేశ్ చట్టము) యొక్క 36వ విభాగము (vii) ఖండము ననుసరించి ఏర్పాటు చేయబడిన ప్రత్యేక సమావేశమునకు అధ్యక్షత వహించుటకు శ్రీ ..................... (హోదా) గారికి ఇందుమూలముగా (జిల్లాపేరు) ......... జిల్లా కలెక్టరుపైన (పేరు) అను నేను అధికార మొసంగుచున్నాను.

స్థలము
తేదీ

సంతకము
(జిల్లా కలెక్టరు)
(ముద్ర)

## 32. జిల్లా పరిషత్తు యొక్క కార్యదర్శి అధికారములకు, కర్తవ్యములకు సంబంధించిన నియమావళి

చట్టముయొక్క నిబంధనల ద్వారా లేక వాటి ననుసరించి చేయబడిన నియమావళి ద్వారా నిర్దిష్టముగా ఈయబడిన అధికారములను వినియోగించుటకును, విధించబడిన కర్తవ్యములను నిర్వహించుటకును అదనముగా జిల్లా పరిషత్తుయొక్క కార్యదర్శి—

(i) జిల్లా పరిషత్తు యొక్కయు, దానికి సంబంధిన ఏదైన స్థాయీ సమితి యొక్కయు తీర్మానములను అమలు పరచుటకు బాధ్యుడై యుండవలెను.

(ii) జిల్లా పరిషత్తులోని సిబ్బందిపైనను, ప్రభుత్వము వారిచే జిల్లా పరిషత్తుకు బదిలీ చేయబడిన సంస్థలలోను, పనులలోను పని చేయుచున్న సిబ్బందిపైనను ఇందు నిమిత్తమై నిర్దిష్టపరుపబడిన షరతులకు లోబడి పరిపాలనా సంబంధమైన నియంత్రణను, పర్యవేక్షణను కలిగియుండవలెను.

(iii) ఆయనకు చట్టముక్రింద ఈయబడిన ఏవైన కర్తవ్యములు అయనచే నిర్వహింపబడు విషయమై జిల్లా పరిషత్తు యుక్తమని భావించి జారీ చేయు నిర్దిష్టమైన ఆదేశములను అమలు పరచుట ;

అయితే, ఆ ఆదేశములు ప్రభుత్వమువారిచేగాని, ఇతర అధికార వర్గముచేగాని వప్పగింపబడిన ప్రణాళిక, సమాజ వికాస తదితర అభివృద్ధి కార్యక్రమములకు వర్తించు షరతులకును, నిబంధనలకును అనుగుణముగా ఉండవలెను :

(iv) ప్రతి సందర్భములోను రూ. 50 లకు మించని కంటింజెన్సీ ఖర్చును పెట్టుటకు అధికారము కలిగి యుండవలెను :

(v) జిల్లా పరిషత్తుకు చెందియున్న భవనములపై అజమాయిషీ వహింప వలెను ;

(vi) జిల్లా పరిషత్తు యొక్కగాని, దాని ఏదైన స్థాయీ సమితి యొక్కగాని వివిధ సభ్యుల పదవిలో యాదృచ్ఛిక ఖాళీలను లేక కాలము గడచుట వలన ఏర్పడు ఖాళీలను గూర్చి తెలియపరచవలెను. జిల్లా పరిషత్తు చైర్మనుతో సంప్రదించి సాధారణ సమావేశములందు ఎన్నిక నిమిత్తము తేదీలను నిర్ణయించవలెను.

(vii) జిల్లా పరిషత్తుచే నిర్ణయింపబడు పరిమితులకు లోపల జిల్లా పరిషత్తు నిమిత్తమై చరాస్తిని సంపాదించుటకును హక్కును కలిగియుండవలెను ;

(viii) ప్రతి సందర్భములోను రూ. 250 లకు మించని విలువ గల జిల్లా పరిషత్తు చరాస్తిని అమ్మకము ద్వారా పరిష్కరించుటకు హక్కు కలిగి యుండవలెను :

(ix) సందర్భమునుబట్టి జిల్లాపరిషత్తు యొక్కగాని దాని స్థాయీ సమితి యొక్కగాని మంజూరుపొంది జిల్లాపరిషత్తు యొక్క ఏదైన చరాస్తినిగాని స్థిరాస్తినిగాని గుత్తకిచ్చుటకు లేక ఇతర విధముగా పరిష్కరించుటకు అధికారము కలిగి యుండవలెను ;

(x) జిల్లా పరిషద్ యాజమాన్యమునందున్న ఏదైన పని, పథకము లేక సంస్థలో ప్రవేశించుటకును, దానిని తనిఖీ చేయుటకును అధికారము కలిగి యుండవలెను ;

(xi) జిల్లా పరిషత్‌గాని, దాని స్థాయీ సమితిగాని ఆదేశించినచో, పంచాయతీ సమితి యొక్క అజమాయిషీలోనున్న ఏదైన పని, పథకము లేక సంస్థలో ప్రవేశించుటకును, దానిని తనిఖీ చేయుటకును అధికారము కలిగి యుండవలెను.

## 33. జిల్లా పరిషత్తుయొక్క స్థాయీ సమితి అధికారములను విధులను నిర్ణయించు నియమావళి

**1.** ఏదైన ప్రత్యేక అంశమునకు సంబంధించి జిల్లా పరిషత్ యొక్క "తద్విషయ పరిశీలక సమితి" అనగా పన్ను విధింపు, ఆర్థిక విషయముల మినహా చట్టము యొక్క 43 వ విభాగము (1) వ ఉప విభాగము క్రింద అప్పగింపబడిన ప్రకారము జిల్లా పరిషత్ యొక్క ఏ స్థాయీ సమితియొక్క విషయములు అట్టి అంశమునకు సంబంధించియుండునో ఆ స్థాయీ సమితి అని అర్థము.

**2.** సౌలభ్యము నిమిత్తము దిగువ పట్టికయందలి (1) వ కాలములో పేర్కొనబడిన విషయములకు సంబంధించిన జిల్లా పరిషత్ యొక్క స్థాయీ సమితులు ఆ పట్టిక యందలి (2) వ కాలములో ప్రతిదానికిని ఎదురుగా తెలుప బడిన పేరుతో వ్యవహరింపబడును.

పట్టిక

| (1) | (2) |
|---|---|
| ప్రణాళిక, సమాజ వికాసము మరియు రహదారులు— వీటికి సంబంధించిన స్థాయీ సమితి | మొదటి స్థాయీ సమితి |
| ఆహారము, వ్యవసాయము, సహకారము, పశుపోషణ, అడవులు, నీటిపారుదల, విద్యుచ్ఛక్తి-వీటికి సంబంధించిన స్థాయీ సమితి | రెండవ స్థాయీ సమితి |

కుటీర పరిశ్రమలు, గ్రామీణ-పరిశ్రమలు, చిన్నతరహా పరిశ్రమలతోసహా పరిశ్రమలు—వీటికి సంబంధించిన స్థాయీ సమితి — మూడవ స్థాయీ సమితి

విద్య, వైద్యము, ప్రజారోగ్యము, సాంఘిక సంక్షేమము—వీటికి సంబంధించిన స్థాయీ సమితి — నాల్గవ స్థాయీ సమితి

పన్ను విధింపు, ఆర్థిక విషయములు—వీటికి సంబంధించిన స్థాయీ సమితి — ఐదవ స్థాయీ సమితి

**3.** చట్టములో తెలుపబడిన అంశములను పరిశీలించెడి జిల్లా పరిషత్ యొక్క స్థాయీ సమితులు, సాధారణముగా అనుబంధములో చూపబడిన రీతిగా ఉండవలెను.

**4.** తనకు ప్రత్యేకించబడినట్టి విషయములకు సంబంధించినంతవరకు ప్రతి స్థాయీ సమితియు, జిల్లా పరిషత్ యొక్క పనులు, పథకముల అమలుకు సంబంధించిన అభివృద్ధిని గమనించు చుండవలెను,

**5.** ఏదేని స్థాయీ సమితి తన విధులను వేటిపైనను నిర్వర్తించ లేక పోయినచో, ఆ విధుల నన్నింటిని లేక వాటిలో కొన్నింటిని జిల్లా పరిషత్ నిర్వర్తించవలెనని ప్రభుత్వమువారు ఆదేశింప వచ్చును.

అనుబంధము

| వరుస సంఖ్య | విభాగము మరియు ఉప విభాగము | అధికారముల, విధుల సంగ్రహ వివరణ | జిల్లా పరిషత్‌ల యొక్క స్థాయీ సమితి లేక సమితులు |
|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) |
| 1. | 47(1) (i) | జిల్లాలోని పంచాయతీ సమితుల బడ్జెటులను పరీక్షించి ఆమోదించుట | ఐదవ స్థాయీ సమితి |
| 2. | 47(1)(ii) | కేంద్రప్రభుత్వముచేగాని రాజ్యప్రభుత్వముచేగాని కేటాయింపబడిన ధనమును పంచాయతీ సమితులకును, పంచాయతీ సమితులు ఏర్పాటు చేయబడని బ్లాకులకును పంపకము చేయుట. | తద్విషయపరిశీలక సమితి మరియు ఐదవ స్థాయీసమితి |

| | | |
|---|---|---|
| 3. 47(1(iii) | జిల్లాలోని బ్లాకులకు సంబంధించిన ప్రణాళికలను సమన్వయ పరచి ఏకీకరించుట మరియు మొత్తము జిల్లాకు సంబంధించిన ప్రణాళికలను తయారు చేయుట | మొదటి స్థాయీసమితి |
| 4. 47(1)(iv) | జిల్లాలో రెండు లేక అంతకంటె ఎక్కువ బ్లాకులకు సంబంధించిన ప్రణాళికలు, ప్రాజెక్టులు, పథకములు లేక ఇతర పనుల అమలును సాధించుట | తద్విషయ పరిశీలక సమితి |
| 5. 47(1)(v) | జిల్లాలో పంచాయతీ సమితుల కార్యకలాపములను పర్యవేక్షించుట | మొదటి స్థాయీ సమితి |
| 6. 47(1)(vi) | పన్నులు, రుసుములు విధించుటతో సహా జిల్లా బోర్డుల యొక్క అధికారములను, విధులను నిర్వర్తించుట | తద్విషయ పరిశీలక సమితి మరియు ఐదవ స్థాయీ సమితి |
| 7. 47(1)(vii) | అభివృద్ధి కార్యకలాపములకు సంబంధించిన అధికారములను, విధులను నిర్వర్తించుట | తద్విషయ పరిశీలక సమితి మరియు ఐదవ స్థాయీ సమితి |
| 8. 47(1)(viii) | అభివృద్ధి కార్యకలాపములకు సంబంధించిన అన్ని విషయాలను గురించి, ఉద్యోగుల నిర్వహణ గురించి ప్రభుత్వమునకు సలహా యిచ్చుట | తద్విషయ పరిశీలక సమితి |
| 9. 47(1)(ix) | పంచాయతీ సమితులకు పనుల కేటాయింపును గురించి ప్రభుత్వమునకు సలహాయిచ్చుట మరియు ఆ సంస్థల పనులను సమన్వయము చేయుట | తద్విషయ పరిశీలక సమితి |

| 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|
| 10. | 47 (1) (x) | శాసనమునకు సంబంధించిన లేక కార్యనిర్వాహక వర్గమునకు సంబంధించిన ఉత్తరువులను అమలుపరచు విషయములో ప్రభుత్వమునకు సలహా ఇచ్చుట. | తద్విషయ పరిశీలక సమితి |
| 11. | 47 (1) (xi) | వివరముల సేకరణ ... | డిటో |
| 12. | 47 (1)(xii) | స్థానిక అధికార వర్గములకు సంబంధించిన గణాంకవివరములను లేక వాటి కార్యకలాపములకు సంబంధించిన సమాచారములను ప్రచురించుట. | తద్విషయ పరిశీలక సమితి మరియు నాల్గవ స్థాయీ సమితి |
| 13. | 47(1) (xiii) | ఏ స్థానిక అధికార వర్గము పైనను తన కార్య కలాపములకు గురించిన సమాచారమునుఅంపచేయుమనికోరుట. | తద్విషయ పరిశీలక సమితి |
| 14. | 47(1) (xiv) | ఏ కార్యము కొరకు తన నిధులు ఉపయోగింప బడవచ్చునో కేవలముగా ఆ కార్యాభివృద్ధికి సంబంధించిన ట్రస్టులను అంగీకరించుట. | తద్విషయ పరిశీలక సమితి మరియు ఐదవ స్థాయీ సమితి |
| 15. | 47(1) (xv) | సెకండరీ, వృత్తి విద్య మరియు పారిశ్రామిక పాఠశాలలను స్థాపించుట, నిర్వహించుట లేక విస్తృతి చేయుట. | నాల్గవ, ఐదవ స్థాయీ సమితులు |
| 16. | 47(1)(xvi) | చట్టముయొక్క కార్యములను అమలు పరచుట కొరకు ఋణములు తీసికొనుట. | తద్విషయ పరిశీలక సమితి మరియు ఐదవ స్థాయీసమితి. |

| 1 2 | 3 | 4 |
| --- | --- | --- |
| 17.47 (2) | పంచాయతీ సమితి ఏర్పాటుచేయబడని బ్లాకులో పంచాయతీ సమితి వినియోగించవలసిన అన్ని అధికారములను, నిర్వర్తించవలసినవిధులను విని యోగించుట, నిర్వర్తించుట | తద్విషయ పరిశీలక సమితి మరియు ఐదవ స్థాయీసమితి |
| 18.47 (3) | జిల్లాలోని పంచాయతీ సమితుల నిధులలో నుండి మొత్తములు వసూలు చేయుట | * ఐదవస్థాయీసమితి |
| 19.51 (1) | అధికారులయు తదితర ఉద్యోగులయు పదవులను సృష్టించుట | డిటో |
| 20.51 | అధికారులయు తదితర ఉద్యోగులయు పదవుల నియామకములుచేయుట | డిటో |
| 21.55 (1) | జిల్లాపరిషత్తు యొక్క బడ్జెటును పరీక్షించి సిఫారసు చేయుట | డిటో |
| 22.55 (3) | మార్పున లేక అనుబంధపు బడ్జెటును పరీక్షించి సిఫారసు చేయుట | డిటో |
| 24.59 (3) | జిల్లా పరిషత్తుకు బదిలీ చేయబడిన జిల్లా బోర్డుయొక్క అధికారములు, విధులు | తద్విషయ పరిశీలక సమితి మరియు ఐదవ స్థాయీసమితి |
| 24.66 (2) | పంచాయతీ సమితి పరిపాలనా నివేదికలను పరిశీలించుట | ఐదవ స్థాయీ సమితి |
| 25,70 (1) | ఉప నిబంధనలు చేయు అధికారము | తద్విషయ పరిశీలక సమితి |
| 26.71 (2) | ఏ వ్యక్తికి గాని, అధికార వర్గమునకు గాని అధికారములను, విధులను అప్పగించుట | తద్విషయ పరిశీలక సమితి మరియు ఐదవ స్థాయీ సమితి |
| 27.71 (3) | ఏదేని పంచాయతీ సమితికిగాని,పంచాయతీకిగాని లేక పట్టణ సమితికిగాని సంస్థలను బదిలీచేయు అధికారములు | తద్విషయ పరిశీలక సమితి |

## 34. ప్లానింగు, స్థానిక పరిపాలనశాఖ 11వ ఏప్రిల్ 1960 నుంచి జిల్లా పరిషత్తులకు వప్పజెప్పిన గ్రామ రోడ్డు అభివృద్ధి, కో-ఆపరేటివు స్కీములు, గ్రామ ప్లానులలోని రోడ్డులు

(జి. ఓ. యం. యస్. నెం. 1575, ప్లానింగు, స్థానికపు పరిపాలన, 10వ నవంబరు 1960)

1959వ ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సమితులు జిల్లా పరిషత్‌ల చట్టము (1959వ ఆంధ్రప్రదేశ్ 35వ చట్టము) యొక్క 47వ శెక్షను యొక్క 1వ సబ్ శెక్షనులోని క్లాజు (vii) యిచ్చిన అధికారములను చలాయించ ఆంధ్ర ప్రదేశ్ గవర్నరు, స్థానికపు అభివృద్ధి పనులు, గ్రామ రోడ్డు అభివృద్ధి సహకార స్కీములు, గ్రామ ప్లానులలో రోడ్డులకు సంబంధించిన అభివృద్ధి కార్యక్రమములకు సంబంధించిన అధికారములు, పనులు పై చెప్పిన చట్టము క్రింద నిర్మింప బడిన జిల్లా పరిషత్‌లకు యిందు మూలముగా చెందచేసి ఒప్ప చెప్పట మయినది. వీటిని జిల్లా పరిషత్‌లు కావలసినంత మేరకు, ఈ క్రింది షెడ్యూలులో తెలిపిన నిబంధనల పద్ధతికి కట్టుబడి మరియు ప్రభుత్వమువారు దఫ దఫా ఈ విషయములో చేయు ఉత్తరువులకు కట్టుబడి చలాయించి నెర వేర్చవలయును.

1. ఈ ప్రకటన 1వ ఏప్రియల్ 1960 సంవత్సరమున అమలులోనికి వచ్చినట్లు భావింపవలయును.

### 1వ షెడ్యూలు

జిల్లా పరిషత్‌లు, గ్రామ రోడ్డు అభివృద్ధి సహకార స్కీము పరిపాలన విషయములో బాధ్యత వహించవలెను. కేటాయించిన సెంట్రల్ గ్రాంటు క్రమముగాను పూర్తిగాను వినియోగింపబడునట్లు వారు చూడవలయును.

2. జిల్లా పరిషత్‌లు, 1వ స్టాండింగ్ కమిటీ, పంచాయితీల నుండి ప్రజల నుండి వచ్చిన దరఖాస్తులను, ఎస్టిమేట్లను పరీక్ష చేసి తరువాత ముఖ్యమైన వాటి వరుసలో స్కీము క్రింద సహాయమునకు అర్హత గల పనుల లిస్టును తయారుచేసి వాటిని జాగ్రత్తగా పూరించిన ఎస్టిమేట్లు ఫారాలతో సహా ఇండియా ప్రభుత్వము అనుమతి పొందుటకు ప్రభుత్వమునకు దాఖలు

చేయును. ఇండియా ప్రభుత్వము అనుమతి వచ్చునను ఉద్దేశముతో ఏ పనిని ప్రారంభించకూడదు.

3. ప్రతి జిల్లా పరిషత్, జిల్లా పురోగమనమును పరీక్ష జేసి ప్రతి నెల 15వ తారీకుకు రాష్ట్రీయ ప్రభుత్వము దాని మీద ఒక రిపోర్టును దాఖలు చేయును. కాలక్రమపు అభివృద్ధిని ప్రభుత్వము పరీక్ష చేయుటకు వీలు కలుగ జేయుటకు, దీని వెంటనున్న ప్రొఫార్మాలో ఒక ప్రతి నెల వ్యయపు స్టేట్ మెంటును కూడ, ప్రతి నెల 15వ తారీకునకు ముందు వారు ప్రభుత్వమునకు దాఖలు చేయుదురు.

4. ఇతర జిల్లా పరిషత్ పనుల మాదిరిగనే, గ్రామ రోడ్డు అభివృద్ధి సహకార స్కీముక్రింద పనులకు టెక్నికల్ శాంక్షను, చెక్ మెజరుమెంటు, బిల్లుల పేమెంటు ఉండును.

5. పనుల రిజిష్టరు ఒంటి జిల్లా పరిషత్ కార్యాలయములో ఉంచబడును. పనిని చెక్ మెజరు చేయుటకు తగిన అధికారిచేత క్రమముగా కొలవబడి సరిగా ఉన్నదని రూఢి పరచబడిన తరువాతను, ఆపని, పంచాయతీ, ప్రజల వాటా కలిసిన విలువ వరకు జరినదని జిల్లా పరిషత్ తృప్తిపడిన వెనుకనే, మంజూరు అయిన గ్రాంటు ప్రతి విషయములోను యివ్వబడును. వెనుక బడిన ప్రదేశములలో, ప్రజలు యిచ్చునది వస్తురూపముగను మాత్రము వున్న ప్రత్యేక విషయములలో, సెంట్రల్ గ్రాంటు, జరిగినపని పని రూపముగాను విలువలో నూటికి 50 పాళ్ళ వరకు పూర్వదార్లకు యివ్వవచ్చును.

6. ఈ స్కీము, దానిలో కొన్ని భాగములు బ్లాకు ప్రదేశములలోను, కొన్ని బ్లాకులు కాని ప్రదేశములలోను ఉన్నప్పటికి, మొత్తము రాష్ట్ర మంతకును అనువర్తించును. ఈ స్కీము క్రింద, మార్కెట్లతోను లేక దగ్గిర మెయిన్ రోడ్ల తోను కలుపుటకు ఉద్దేశింపబడిన చిన్న రోడ్లు మరియు వాగుల మీద, రోడ్లమీద, వంతెనలు వేయుటయు జరిగింపబడును.

7. ప్రతి రోడ్డు పనికి సెంట్రల్ గ్రాంటు, పని విలువలో 50% రాష్ట్ర ప్రభుత్వము, ప్రజలు, స్థానికపు సంస్థలనుండి వచ్చున చందాలు సహా, సమానముగా పంచుకొందురు. ప్రజల చందా ఏ విషయములోను పని విలువలో 16 2/3% కు తక్కువ కాకూడదు.

8. పనులను జరిపించుటకు నియమింప బడువారు, పంచాయతీ లేక అది యిష్టము లేకపోయిన పూచీదారుగా ఉండును.

9. స్కీము క్రింద జరుగు ప్రతి రోడ్డు పని మీద వ్యయము మైలునకు 20,000 రూపాయలు దాటకుండా ఉండవలెను.

10. జిల్లా పరిషత్ ఏ ప్రొపోజలు అయిన ఆలోచించుటకు ముందు పంచాయతీ లేక పూచీదారు—

(i) పూర్తిగా పనిని నిర్వహించుటకు బాధ్యత వహించుటకు.

(ii) సహాయముతో తయారైన పనిని తనఖా, అప్పు, అన్యాక్రాంతము చేయకుండుటకు,

(iii) మరియు పని యివ్వవలసిన సదుపాయములు ప్రజలకు యిచ్చుటలో ఏ విధమైన తేడా, విచక్షణ చూపకుండుటకు ఒప్పుకొందురు.

11. జిల్లా పరిషత్తుకు సంబంధించిన అసిస్టెంటు ఇంజనీరు బ్లాకు మరియు బ్లాకు కాని ప్రదేశములలోని అధీనములో గల ఇంజనీరింగు సిబ్బంది, ఎస్టిమేట్లను తయారు చేయుటలోను, పనులను నిర్వర్తించుటను జరుపుదురు. బ్లాకు కాని ప్రదేశములలోని జిల్లా పరిషత్తు, ఆ యా బ్లాకులలోని పంచాయతీ సమితులు పనుల తొందరగా జరుపుటను గురించి మాట యిచ్చెదరు

2వ షెడ్యూలు

1. స్థానికపు అభివృద్ధి పనులయొక్క కార్యక్రమము నిర్వర్తించుటలో జిల్లా పరిషత్ బాధ్యత వహించి దాని వినియోగము నిమిత్తమై యిచ్చిన గ్రాంటుల యొక్క సరియైన పూర్తి వినియోగమును చూడవలయును. జిల్లా పరిషత్తు దానికి సంబంధించిన (i. iv) స్టాండింగ్ కమిటీలు, గ్రామములో ప్రతి పనికి వరుసగా 15,000; 20,000 రూ॥లు విలువగల పనులను మంజూరు చేయుటకు వరుసగా 10,000; 7,500 రూ॥లు వరకు గ్రాంట్లు మంజూరు చేయుటకు అధికార మివ్వబడినది. 20,000 రూ॥లు దాటిన పనులన్నిటికిని, ప్రభుత్వము వద్ద ముందు అనుజ్ఞ, జిల్లా పరిషత్తు వలన పొందబడవలయును.

2. మంజూరుకు సంబంధించిన అన్ని వుత్తరువుల నకళ్ళు ఎకౌంటెంటు జనరల్ (ఆంధ్రప్రదేశ్)కు, లోకల్ ఫండు ఎకౌంట్సు ఎక్జామినరుకు, ఆ యా

పంచాయితీలకు యివ్వబడును అట్టి అన్ని వుత్తరువులు తప్పకుండగా సెంట్రల్ గ్రాంటు, ఏమైన ఉన్నచో ప్రజలనుండి, స్థానికపు సంస్థలనుండి విరాళములు యొక్క తబిసీళ్ళను తెలియజేయును.

3. ప్రతినెల 15వ తారీకుకు జిల్లా పరిషత్తు జిల్లాలోని అభివృద్ధిని పరీక్షించి, దానిమీద ఒక రిపోర్టును ప్రభుత్వమునకు దాఖలు చేయును. ఇంకను ప్రతి నెల 15 వ తారీకుకు ముందు దీని వెంటవున్న ఫార్మాలో నెల, మూడు నెలల వ్యయపు స్టేటుమెంటులు వారు క్రమము తప్పకుండా ప్రభుత్వమునకు దాఖలు చేయుదురు.

4. స్థానికపు అభివృద్ధి పనుల కార్యక్రమము క్రింద జరుగు పనులకు టెక్నికల్ శాంక్షను, చెక్ మెజరుమెంటు, బిల్లుల పేమెంటు, సంఘము అభివృద్ధి కార్యక్రమము క్రింద జరుగు పనులకు మాదిరిగనే యుండును.

5. జిల్లా పరిషత్తు కార్యాలయములో పనుల రిజిష్టరు ఒకటి ఉంచబడును. పనిని చెక్ మెజరు చేయుటకు తగిన అధికారిచేత క్రమముగా కొలవబడి సరిగా యున్నదని రూఢిపరచిన తరువాతను, ఆ పని, పంచాయతీయొక్క ప్రజల యొక్క వాటా కలసిన విలువ వరకు జరిగినదని జిల్లాపరిషత్తు తృప్తిపడిన వెనుకనే, శాంక్షను అయిన గ్రాంటు, ప్రతి విషయములోను యివ్వబడును. వెనుకబడిన ప్రదేశములలోను ప్రజలు యిచ్చునది వస్తురూపముగను పనిరూపముగను మాత్రము ఉన్న ప్రత్యేక విషయములలో, సెంట్రల్‌గ్రాంటు జరిగిన పని విలువలో 50% వరకు, పూచీదార్లకు యివ్వవచ్చును,

6. శాశ్వతమైన స్వభావము కలవియు, గ్రామములలో పరిస్థితులను బాగుచేయునని అనుకొనునవియు అగు ఈ క్రింది తెగలకు చెందిన చిన్న పనులు, ముఖ్యముగా సంఘ అభివృద్ధి కార్యక్రమములవల్ల యితర విధముగా లాభపడని ప్రదేశములలో కార్యక్రమముక్రింద తీసికొనబడును.

(1) నీటి సరఫరా స్కీము,

(2) వ్యవసాయ అభివృద్ధియొక్క శాశ్వత పనులు,

(3) గ్రామ ఆరోగ్య రక్షణ అభివృద్ధియొక్క శాశ్వత పనులు,

(4) వంతెనలు, చిన్న వంతెనలో సహా గ్రామ వీధులు,

(5) పాఠశాలల మందులషాపు బిల్డింగుల అభివృద్ధి.
(6) గిడ్డంగులను నిర్మించుట, మరియు
(7) అందరికి ఉపయోగించు ఇతర స్కీములు.

7. 1960-61 వ సంవత్సరమునకు, కార్యక్రమము ఈ క్రింది పనులకు నియమిత మగును.

(1) త్రాగునీటి సరఫరా పనులు,
(2) గ్రామ పాఠశాలలు, మరియు
(3) మెయిన్ రోడ్లను, రైలుస్టేషనులను కలుపు గ్రామవీధులు,

8. స్కీము క్రింద పనులన్నియు సరియైన విరాళము నాధారముగా జేసికొని శాంక్షను కాబడును అనగా పనియొక్క విలువలో 50%, సహాయ రూపేణా గ్రాంటుగా ప్రతి పని లేక గ్రామముకు 10,000 రూపాయల వరకు యివ్వబడి, తతిమ్మాది ప్రజలు, స్థానిక సంస్థలచే భరింపబడును.

9. అంచనా వేసిన ఏ పని విలువ సాధారణముగా 20,000 రూపాయలకు మించదు, ప్రత్యేక విషయములలో 40,000 రూపాయల వరకు విలువగల పనులు ప్రభుత్వము ముందు అనుమతితో మంజూరు కాబడును, అయినప్పటికిని, సెంట్రల్ గ్రాంటు 10,000 రూపాయల వరకు నియమితము చేయవచ్చును. 20,000 రూపాయలకు మించిన విలువగల పనులన్నియు, అవి జిల్లా పరిషత్‌చే మంజూరు కాబడుటకు పూర్వము, ప్రభుత్వమునకు, వారి అనుమతి కొరకు దాఖలు చేయబడును. జిల్లా పరిషత్, దాని స్టాండింగ్ కమిటీలు I, IVలు సహాయ రూపేణా గ్రాంటు వరుసగా 10,000 రూపాయలు 7,500 రూపాయల వరకు ప్రతి పనికి మంజూరు చేయును. ఏవిషయములోను గ్రాంటు పని విలువలో సగమును మించకూడదు లేక ఏ పనికినిగాని లేక స్కీము క్రింద యిది వరకు యిచ్చిన గ్రాంటులు సహా, ఒక గ్రామమునకుగాని 10,000 రూపాయలకు మించకూడదు.

10. కార్యక్రమము క్రింద మంజూరు కాబడిన ప్రతి పని విలువలోని 50% సెంట్రలు గ్రాంటు నుండి ఖర్చు పెట్టబడును. జిల్లా పరిషత్తు, ప్రతి పని

యొక్క విలువలో అధికము 25% వరకు విరాళ మివ్వవచ్చును. పంచాయతీ స్థలములలోని పనుల విషయములో, ఆ యా పంచాయతీ. ఏ విషయములోను పని విలువలో 16 2/3% తక్కువ కాకుండా ప్రజల భాగముండునట్లు, అధికము 33 1/3% వరకు విరాళ మివ్వవచ్చును. ప్రజల విరాళము, ధనరూపమునగాని వస్తురూపమునగాని, పనిరూపమునగాని ఉండును. సెంట్రల్ గ్రాంటు దఫాల వారీగను, టెక్నికల్ అధారిటీచేత క్రమముగా కొలవబడి, రూఢిపరచిన పనివిలువలో సగము వరకు చెల్లించవచ్చును.

11. పనుల నెన్నుకొనుటలో, ఎక్కువ తిరిగి సంభవించెడు వ్యయములో కూడని పనులకు, సెంట్రల్ లేక రాష్ట్రప్రభుత్వము ప్లానులలో చేర్చబడిన స్కీముల నుండి నేరుగా ఇంతకుముందే లాభము పొందని స్థలములకు అగ్రస్థానము యివ్వబడును. వెనుకబడిన ప్రదేశములకు ప్రత్యేక ఆసక్తి చూపబడును.

12. జి. ఒ. ఆర్. టి. నెం. 669, ప్లానింగ్ మరియు డెవలప్‌మెంటు 18 ఆగస్టు 1958లో నియమింపబడిన ఫారములో పూచీదారుల నుండి, పూచీని పొందవలెను. ఏపనినైనను ప్రారంభించుటకు ముందు పంచాయతీ లేక పూచీదారు ఈ క్రింది నాటికి పూచీపడును.

(ఎ) పనిని పూర్తిగా నిర్వహించుటకు బాధ్యత వహించుటను ఒప్పుకొనుట;

(బి) ఈ సహాయములో నిర్మించిన పనిని తనఖా, అప్పు లేక అన్యాక్రాంతము చేయకుండుట; మరియు

(సి) పని ఇవ్వవలసిన సదుపాయములు ప్రజల కిచ్చుటలో తేడా, విచక్షణ చూపకుండుట.

13. సహాయమునకు అర్హతగల విషయములలో వెనుకబడిన ప్రదేశములలో జరుపుటకు తీసుకున్న త్రాగు నీటి పనుల విషయములో సెంట్రల్ సహాయమున కదనముగాపని విలువలో 25% వరకు రాష్ట్రసహాయము పొందవచ్చును. కాని అటువంటి విషయాలలో కూడ ప్రజల విరాళము పని విలువలో 16 2/3%కు తక్కువ ఉండకూడదు.

14. పంచాయతీలు పూచీపడిన పనుల విషయములో, పనులను నిర్వర్తించుటకు వారికి అగ్రస్థానము ఇవ్వబడును. వారు పూచీపడుటకు యిష్టగింపనప్పుడే ఇతర సరియైన వ్యవహారిగా ఎన్నుకొన బడును.

15. జి. ఒ. యం. యస్.నెం. 1132 ప్లానింగ్ మరియు డెవలప్‌మెంటు, 27 సెప్టెంబరు 1957లో నియమింపబడిన రిజిష్టర్‌లో ఉంచబడును.

16. జిల్లా పరిషత్‌నకు సంబంధించిన అసిస్టెంట్ ఇంజినీరు మరియు బ్లాక్ ఇంజనీరింగ్ సిబ్బంది పనుల నిర్వర్తించుటను తనిఖీచేయును.

3వ షెడ్యూలు

(1) 20,000 రూపాయలు వరకు ఒక్కొక్కటి విలువచేయు పనులను, గ్రామప్లానులలోని రోడ్లక్రింద వరుసగా 10,000 రూపాయలు 7,500 రూపాయలు వరకు సహాయరూపేణా గ్రాంటులు, జిల్లా పరిషత్ దాని స్టాండింగ్ కమిటీ నెం. 1 మంజూరు చేయును, ఏవిషయములోను, ఏపని విలువ 20,000 రూపాయలకు దాటకూడదు.

2) మంజూరునకు సంబంధించిన అన్ని ఉత్తరువుల నకళ్ళు లోకల్ ఫండ్ ఎకౌంట్సు ఎగ్జామినరుకు ఆ యా పంచాయతీ సమితులకు ఇవ్వబడును. శాంక్షన్ యొక్క అన్ని ఉత్తరువులు తప్పకుండగా ప్రభుత్వగ్రాంటు, ప్రజల విరాళము, స్థానిక సంస్థలనుండి విరాళము యొక్క తబిసీళ్ళను తెలియజేయును.

3. స్కీము క్రింద శాంక్షనైన పనులన్నియు పంచాయతీలకు నిర్వహణ కొరకు ఒప్పగించబడును. పంచాయతీలు వాటిని తీసుకొనుటకు నిరాకరించిన వెనుకనే, పూటీదారుల గురించి విచారింపబడును.

4. స్కీము క్రింద పనులకు టెక్నికల్ శాంక్షన్, చెక్ మెజర్‌మెంటు, బిల్లులను చెల్లించుట, ఇతర జిల్లా పరిషత్ పనుల విషయములలో వలెనే ఉండును.

5. పంచాయతీ సమితులు, వాటి జూరిస్‌డిక్షనులో ఉన్న పంచాయితీల విషయములో పనుల అభివృద్ధిని పరీక్షించి, ప్రతి నెల 10వ తారీఖునకు జిల్లా పరిషత్‌నకు దానిమీద ఒకరిపోర్టును పంపించును. జిల్లాపరిషత్ యొక్క స్టాండింగ్ కమిటీ నెం 1 జిల్లాకు సంబధించిన అభివృద్ధిని పరీక్షించి ప్రతి నెల 15వ తారీఖునకు దానిమీద ఒక రిపోర్టును ప్రభుత్వమునకు దాఖలుచేయును. నిర్ణీతమైన ఫారములో వ్యయసంబంధమైన స్టేట్‌మెంట్లను ప్రతి నెల 15వ తారీఖునకు జిల్లా పరిషత్ రాష్ట్రప్రభుత్వమునకు పంపును

6 గ్రామ ప్లానులలోని స్కీము రోడ్ల క్రింద గ్రాంటులు, కొత్త గ్రామ రోడ్లు గ్రామములోని రోడ్లు తయారగుటకును. వాటిమీద నీటి ప్రవాహముల మీద చిన్న వంతెనలు, నిర్మించుటకు పంచాయతీలకు మంజూరు కాబడును.

7. ప్రభుత్వపు తరఫూను ఈ స్కీముకు చేసిన ఏర్పాటు (ప్రొవిజన్), ప్రతి జిల్లా అవసరముల ననుసరించి జిల్లా పరిషత్తుమీద విభజింపబడును. జిల్లా పరిషత్తు, జిల్లాలోని పంచాయతీలకు సహాయ రూపేణా గ్రాంటులు మంజూరు చేయుటకు అధికారి అయివున్నది.

8. సహాయ రూపేణా గ్రాంటులకు దరఖాస్తులు, సమితి కాని బ్లాకుల విషయములో జిల్లా పరిషత్తుకు నేరుగాను, సమితి బ్లాకులలో వున్న పంచాయతీ విషయములో ఆ యా పంచాయతీ సమితుల ద్వారాను, పంచాయతీలవల్ల దాఖలు చేయబడును. పంచాయతీ సమితి కార్యాలయములకు దాఖలు కాబడిన దరఖాస్తులు స్టాండింగ్ కమిటీ (iv) చే విచారింపబడి, జిల్లా పరిషత్తుకు దాని సిఫారసులతో పంపబడును.

9. జిల్లా పరిషత్తు, దాని స్టాండింగ్ కమిటీ I, అదే పంచాయతీలో ఏ ఒక పని లేక పనుల విలువలో 50% వరకు, మొత్తముమీద ఏ పని లేక గ్రామమునకు వరుసగా 1,000 రూపాయలు, 7,500 రూపాయలుదాటకుండగా సహాయ రూపేణా గ్రాంటు శాంక్షను చేయుటకు అర్హత గలిగియున్నవి, మిగిలిన పని విలువలో 33 1/3 వరకు, ప్రజల విరాళము పని విలువలో 16 2/3% కు తక్కువ కాకుండా యుండునట్లు, పంచాయతీచే భరింపబడును. పంచాయతీ సమితి పంచాయతీ పని విలువలో 16 2/3% వరకు తోడ్పడవచ్చును.

10. పంచాయతీల నుండి దరఖాస్తులు, బ్లాకులుగాని స్థలముల విషయములో బ్లాకు ఇంజనీరింగు సిబ్బందివల్లగాని లేక ఇతర స్థానికపు ఇంజనీరింగు సిబ్బందివల్లగాని తయారుకాబడ్డ ఎస్టిమేటులతోను, విరాళము క్రింద ప్రతి పని యొక్క మొత్తము అంచనా విలువలో 1/3 వంతు దాటకుండగా భరించుటకు ఆ యా పంచాయతీల తీర్మానముతోను కూడియుండును.

11. జిల్లా పరిషత్తు కార్యాలయములో పనులకు సంబంధించిన ఒక రిజిష్టరు వుంచబడును.

21. పని చెక్ మెజరు చేయుటకు తగిన అధికారిచేత క్రమముగా కొలవబడి సరిగా యున్నదని రూఢిపరచిన తరువాతను, ఆ పని పంచాయతీ యొక్క ప్రజలయొక్క వాటా కలసిన విలువవరకు మొత్తము విలువలో జరిగినదని జిల్లా పరిషత్తు తృప్తి పడిన వెనుకనే, మంజూరు అయి గ్రాంటు ప్రతి విషయములోను యివ్వబడును. వెనుకబడిన ప్రదేశములలోను, ప్రజలు యిచ్చునది వస్తురూపముగను పనిరూపముగను ఉన్న ప్రత్యేక విషయములో, గ్రాంటు జరిగిన పని విలువలో 50% వరకు పూచీదార్లకు ఇవ్వవచ్చును.

## 35. గవర్నమెంటుశాఖల పనులు, అధికారములు జిలా పరిషత్తులకు బదలాయింపు

(జి. ఒ. యం. యస్. నెం. 1379, ప్లానింగు స్థానిక పరిపాలన (ప్రోజక్టులు I), 24 వ అక్టోబరు 1960)

1959 వ ఆంధ్ర ప్రదేశ్ పంచాయతీ సమితుల, జిల్లా పరిషత్తుల చట్టము (1959వ ఆంధ్రప్రదేశ చట్టము 35) యొక్క 47 వ సెక్షను యొక్క సబ్ సెక్షను (1) లోని క్లాజు (vii) యిచ్చిన అధికారములు చలాయించి ఆంధ్రప్రదేశ్ గవర్నరు, ఎనెక్చరు, "మూడవ కాలము" లో తెల్పిన పద్ధతిని కావలసినంత మేరకు, ఎనెక్చరు (2) వ "కాలము"లో నిర్దిష్టమైన స్కీముల క్రింద గవర్నమెంటు శాఖల అధికారములు పనులను, అభివృద్ధి కార్యక్రమముకు సంబంధించిన ప్రతి జిల్లా యొక్క జిల్లా పరిషత్తుకు యిందుమూలముగా చెందజేసి ఒప్పజెప్పుచున్నారు.

ఎనెక్చరు

| వరుస నెంబరు | గవర్నమెంటు శాఖల స్కీము పేరు | జిల్లా పరిషత్తుకు ఇచ్చిన అధికారముల, ఒప్పజెప్పిన పనుల పేరు మరియు పద్ధతి |
|---|---|---|
| (1) | (2) | (3) |

1 వ్యవసాయము

| 1 | 2 | 3 |
| --- | --- | --- |
| 1. | నీటిని పారించు నిమిత్తము నూనె యంత్రములు, పంపు సెట్టులు బదులు యిచ్చుట. | స్కీము పనిచేయుటను గురించిన నోటు రెండు నెలలకు ఒక పర్యాయము జిల్లా పరిషత్తు (స్టాండింగ్ కమిటీ-II) వద్ద అసిస్టెంటు ఇంజనీరు (వ్యవసాయము) లేక జిల్లా వ్యవసాయ అధికారి వల్లగాని ఉంచబడును. |
| 2. | నూనె యంత్రములు, ఎలక్ట్రిక్ మోటారు పంపు సెట్టులు బదులు యిచ్చుట, కొనుట పద్ధతి మీద సంతకము. | జిల్లా పరిషత్తు (స్టాండింగ్ కమిటీ-II), జిల్లాకు యిచ్చిన యంత్రముల కోటా బ్లాక్‌ల ననుసరించియే ఎలాట్‌మెంటుచేసి, అట్లు చేసినట్లు జిల్లా వ్యవసాయ అధికారికిని, పంచాయతీ సమితులకును తెల్పును. |
| 3. | ఫిల్టరు పాయింటు స్కీము-అప్పులకు ఆజ్ఞ యిచ్చుట మరియు ఫిల్టరు పాయింటు పనిముట్ల సరఫరా. | డిటో |
| 4. | తోటపనికి సంబంధించిన అప్పుల విభజన. | జిల్లా పరిషత్తు (స్టాండింగు కమిటీ-II-నిధుల) జిల్లా కోటాను బ్లాకులవారిగానే విభజించును. |
| 5. | విస్తారమైన ఎరువుల స్కీము. | డిటో |
| 6. | 'తక్కావీ' అప్పులు. | జిల్లా పరిషత్తు (స్టాండింగ్ కమిటీ-II) బ్లాక్‌ల ననుసరించిన, అగ్రికల్చరల్ డైరక్టరువల్ల జిల్లాకు కేటాయించబడిన లేక జిల్లా కలెక్టరు వల్ల జిల్లా వ్యవసాయ అధికారికి వదలిపెట్టబడిన, నిధులను మాత్రమే విభజించు, తాలూకాల వరుసను వ్యవసాయ అప్పుల చటముక్రిందను |

| 1 | 2 | 3 |
|---|---|---|
| | — | భూమి అభివృద్ధి అప్పుల చట్టము క్రిందను యివ్వబడు "తక్కావీ" అప్పులను, అది తాలుకా వారీగా కూడ కేటాయించును. |
| 7. | ఎరువుల పంపకము | మొత్తము ఎకరములు వ్యవసాయదారులకు కావలసినవి, పంటల మోస్తరులను అధారముగా తీసికొనబడి జిల్లా మార్కెటింగ్ సొసైటీ అధ్యక్షుడు, జిల్లా వ్యవసాయ అధికారి, కో - ఆపరేటివు, సొసైటీల డెప్యూటీ రిజిష్ట్రారులు సంప్రదించబడి, బ్లాకులవారీ జిల్లా కోటా కేటాయింపు, జిల్లా పరిషత్తు స్టాండింగ్ కమిటీ-II వారిచే చేయబడును. |
| 8 | చేతిబోరింగ్ సెట్ల పంపకము | జిల్లా వ్యవసాయ అధికారి కాలక్రమముగా దాఖలుచేయు రిపోర్టుల మీద స్కీములు పనిచేయుటను గురించి, జిల్లా పరిషత్తు (స్టాండింగ్ కమిటీ-II) పరీక్ష జేయును. |
| 9. | ఉపద్రవములు, రోగములు | డిటో |
| 10. | పంను, కాయగూరలను విస్తారముగా పండించుట. | డిటో |
| 11. | జీడిమామిడిచెట్ల నుత్పత్తి చేయుటలో అభివృద్ధి. | డిటో |
| 12. | యువకులుగానున్న వ్యవసాయదారులకు వ్యవసాయములో | బ్లాకులనుండి పంచాయతీలచే ఎన్నుకొనబడిన యువక వ్యవసాయ |

| | |
|---|---|
| తర్ఫీదు, నూనె యంత్రములను పనిచేయించుటలో వ్యవసాయ దారులకు తర్ఫీదు, తోటపనిలో వ్యవసాయ దారులకు, తోటమాలులకు తర్ఫీదు. | దారుల తోటమాలుల మరియు వ్యవసాయదారులలిస్టు వారిశిక్షణ ఏర్పాటు చేయుటకు జిల్లా పరిషత్తుద్వారా జిలా వ్యవసాయ అధికారికి దాఖలు చేయబడును. |

## II. జంతు సంబంధమైన కృషి

| | | |
|---|---|---|
| 1. | కోళ్ళు మొదలైన జంతువుల అభివృద్ధి. | జిల్లాకు కేటాయించిన ఈ శాఖ నిధులు, జిల్లా పరిషత్తు (స్టాండింగ్ కమిటీ-II)చే బ్లాకుల వారీగా విభజింపబడును. జిల్లా పరిషత్తు, జిల్లాలో యున్న ఆ స్కీముల పనిచేయుటకు పరీక్షచేయును, |
| 2. | పెంచబడుచున్న ఎద్దులు, మేకపోతులు, మేకలు మొదలైన వాటి సరఫరా. | డిటో |
| 3. | పాలిచ్చు పశువులు మొదలైన వాటిని కొనుటకు అప్పులు. | డిటో |
| 4. | దూడలను పెంచు స్కీములు | డిటో |
| 5. | ఉమ్మడి మేత స్థలములను బాగు చేయుట. | ఎవరి బ్లాకులలో ఆ స్కీములు పని చేయవచ్చునో ఆ పంచాయతీ సమితులను, జిల్లా పరిషత్తు (స్టాండింగ్ కమిటీ-II) ఎన్నుకొని, డిపార్టుమెంటుకు సిఫారసు చేయును. జిల్లా పరిషత్తు, జిల్లాలలో ఈ స్కీము పనిచేయుటను కాలక్రమముగా పరీక్ష కూడ చేయును. |
| 6, | ముఖ్యమయిన గ్రామ కేంద్రములు, చిన్న ఆసుపత్రులు తెరుచుట. | జిల్లా పరిషత్తు, ఈ కేంద్రములు ఆసుపత్రులు ఎచ్చట నుండవల |

| | | |
|---|---|---|
| | | యునో పశుశాఖ డైరెక్టరుకు అతని ఆలోచనకు నిశ్చయమునకు సిఫార్సు చేయును. |

## III. చేపల కృషి

| | | |
|---|---|---|
| 1. | ప్లాను స్కీము పనిచేయుట. | జిల్లా పరిషత్ (స్టాండింగ్ కమిటీ II) నెలకొక పర్యాయము జిల్లాలోని స్కీముల పనిచేయుటను పరీక్షించును. |
| 2. | నల్లగొండ, ఖమ్మం, ఆదిలాబాదు జిల్లాలలో చేపల అభివృద్ధి స్కీము. | జిల్లా పరిషత్తు (స్టాండింగ్ కమిటీ II) జిల్లాలో ఈ స్కీము పని చేయును. |
| 3. | పల్లెవాండ్రకు పాఠశాలలు, ఇళ్ళు | జిల్లా పరిషత్తు స్టాండింగ్ కమిటీII) కాలక్రమముగా జిల్లాలో ఈ స్కీము పనిచేయుటను పరీక్షించును. |

## IV. ప్లానింగ్, స్థానిక పరిపాలన

| | |
|---|---|
| పల్లెటూరి ఇళ్ళ ప్రాజెక్టు స్కీము క్రింద మంజూర్ల విభజన. | జిల్లా పరిషత్తులు స్కీము పని చేయుటకు బ్లాకుల నెన్నుకొనును. |

## V. విద్య

| | | |
|---|---|---|
| 1. | ప్రాథమిక విద్య-ఒకే ఉపాధ్యాయుడు గల పాఠశాలలను తెరచుట | జిల్లా పరిషత్తుచే (స్టాండింగ్ కమిటీ II) జిల్లా కోటా నుండి పాఠశాలల సంఖ్యను పంచాయతీ సమితి, పంచాయతీ కాని స్థలములో పంచి ఇచ్చును |
| 2. | వర్కు క్యాంపులలో విద్యార్థులను పనిచేయించుట. సెంటరు మంజూరులు. | పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ డైరెక్టరు చేసిన జిల్లా కేటాయింపు పాఠశాలలకు జిల్లా పరిషత్తుచే విభజించబడును. |

| | |
|---|---|
| 3. హైయ్యరు సెకండరీ పాఠశాలలు | జిల్లా పరిషత్తు స్టాండింగు కమిటీ (II) ప్రైమరీ పాఠశాలలను సెకండరీ పాఠశాలలుగా హెచ్చించుటను ప్రస్తుతమున్న పాఠశాలలో టెక్నికల్ భాగములను స్థాపించుట లేక జిల్లా పరిషత్ల యాజమాన్యముక్రింద పాఠశాలలలో క్రొత్త ప్రత్యేకపు చదువులను, డిపార్టుమెంటుకు సిఫారసు చేయును. |
| 4. ప్రస్తుతపు పాఠశాలలలో టెక్నికల్ భాగములు స్థాపించుట లేక క్రొత్త ప్రత్యేక చదువులు అందులో ప్రారంభించుట. | డిటో |

## VI గ్రామ లఘు పరిశ్రమలు

| | |
|---|---|
| 1. ప్లాను స్కీములు—ట్రెయినింగు మరియు వుత్పత్తి కేంద్రములు పనిచేయుట. | జిల్లా పరిషత్తు (స్టాండింగు కమిటీ III) మూడు నెలకొకక పర్యాయము కేంద్రములు పనిచేయుటను పరీక్ష చేయును. |
| 2. పల్లెటూరి కళలు, పనులు | క్రొత్త ప్రాంతీయ తర్ఫీదు కేంద్రము లెచ్చట నుండవలయునో అను విషయములో జిల్లా పరిషత్తు సలహా పొందవలయును. తర్ఫీదుకు ప్రతి బ్లాకుకు స్థలముల కేటాయింపు, జిల్లా పరిషత్తు (స్టాండింగు కమిటీ III) చే చేయబడును. కాలక్రమముగా అది అట్టి క్రొత్త కేంద్రములు పనిచేయుటను పరిశీలించును. |

# 36. అనధికార సభ్యులకు ప్రయాణ బత్తెములు చెల్లించు నియమావళి

1. (ఎ) చైర్మను, వైస్ చైర్మను, తాత్కాలిక చైర్మనులతో సహా జిల్లా పరిషత్తుయొక్క ప్రతి అనధికార సభ్యులకు పైన పేర్కొనబడిన చట్టము యొక్క 36 వ విభాగము, (3)వ ఉప విభాగమునందలి (i) మరియు (iii) నుండి (viii) వరకున్న అంశములలో వివరించబడిన ప్రతి సభ్యునకు మరియు జిల్లా పరిషత్ యొక్క సమావేశములకు హాజరైనందులకు గాను ; మరియు

(బి) జిల్లా పరిషత్ యొక్క ఏదేని స్థాయీ సమితికి సంబంధించిన అధికార సభ్యులు ఆ స్థాయీ సమితి యొక్క సమావేశములకుగాని లేక రెండు లేక అంతకన్న ఎక్కువ సంయుక్త సమావేశములకు గానీ హాజరై నందుకుగాను చెల్లించవలసిన ప్రయాణ బత్తెములకు ఆంధ్ర ప్రదేశ్ ప్రయాణ బత్తెముల నియమావళి వర్తించును.

2. (1) వ నియమములలో పేర్కొనబడిన వ్యక్తులకు చెల్లించదగు ప్రయాణ బత్తెమును నిర్ణయించు కార్యమునకై వారు రెండవ తరగతి కమిటీ రేట్ల సభ్యులుగా పరిగణించబడవలెను. వారికి "ఆంధ్ర ప్రదేశ్ ప్రత్యేక బత్తెముల మాన్యువలు"లోని రెండవ భాగము యొక్క 8 వ అనుబంధములోని 20 వ నియమము తరువాత గల (8) వ రూలింగు ననుసరించి రెండవ తరగతి కమిటీల యొక్క అనధికార సభ్యులకు వర్తించెడి రేట్ల ప్రకారము ప్రయాణ బత్తెములు చెల్లింప బడవలయును.

3. (1) వ నియమములో పేర్కొనబడిన వ్యక్తులు, వారి నివాస ప్రదేశములో గాని లేక వారికి నివాస స్థానమునకు 5 మైళ్ళ పరధిలో గాని ఏర్పాటు చేయబడిన జిల్లా పరిషత్తుయొక్క సమావేశములకు గాని లేక దాని స్థాయీ సమితుల సమావేశములకు గాని లేక రెండు లేక అంతకన్న ఎక్కువ స్థాయీ సమితుల సంయుక్త సమావేశములకు గాను హాజరైన ప్రతి దినమునకు మొత్తము రూ. 5 లు (అయిదు రూపాయలు మాత్రమే) వారికి ఒకే మొత్తముగా చెల్లింపబడవలయును.

# 37. జిల్లా పరిషత్తు చైర్మనుకు ప్రయాణముల భత్యములను చెల్లించుటకు సంబంధించిన మార్పు నిబంధనలు

జి. ఓ. నెం. 835—ప్రణాళిక, అభివృద్ధి శాఖ (సమితి III), జూన్ 11, 1960.

ఈ నిబంధనలు 23 వ అక్టోబరు 1959 నుండి అమలులోనికి వచ్చినట్లుగా భావింపబడవలెను.

ప్రయాణ భత్యములు ఈ క్రింది రేటుల చొప్పున జిల్లా పరిషత్తు చైర్మనుకు అతడు ఉద్యోగ సంబంధమైన విధుల నిర్వర్తించుటలో జిల్లాలో అతని ప్రయాణములకు ఇవ్వబడును.

| దినభత్యము దినమునకు | మైలేజి మైలునకు | రైలు ప్రయాణము. | స్టీమరు ప్రయాణము |
|---|---|---|---|
| రూ. 7-50 న. పై. | 37 న. పై. | ఒకటవ తరగతిఖర్చు దిన భత్యముతో సహా | రెండవ తరగతి స్థలము |

పై రేట్లు ఈ క్రింద నియమింపబడిన షరతులు హద్దులకు లోనై యుండును.

రైలు ప్రయాణము :—రైలు ఖర్చు దిన భత్యముతో సహా రోడ్డు ప్రయాణము; చైర్మను అతని స్వంత వాహనమును దానికి నూనెను ఉపయోగించిన యెడల, మొదటి 40 మైళ్ళకు పూర్తి మైలేజిని, ప్రతి ప్రయాణమునకు గరిష్ఠము రూ. 22-50 వరకు, తరువాత మైలేజీ రేటులో సగము తీసికొనవచ్చును.

అతడు ప్రభుత్వ వాహన ముపయోగించిన యెడల, అతడు దిన భత్యమునకు మాత్రమే అర్హత గలిగియుండును. ఒక ప్రయాణము క్రమమైన బహిరంగ మోటారు సర్వీసులో చేయబడిన యెడల, అతడు సరియైన బస్సు ప్రయాణ ఖర్చును, దినభత్యమును తీసికొనవచ్చును.

ప్రయాణములు కొంత రైలు, కొంత రోడ్డు మీద; ఒక ప్రయాణము రైలు మార్గముచే లేక కొంత రైలు, కొంత రోడ్డుచే కలుపబడిన స్థలముల మధ్య ఒక క్రమమైన బహిరంగ మోటారు సర్వీసులో చేయబడినయెడల,

ప్రయాణపు ఖర్చు, రైలు భాగమునకు రైలు ఖర్చునకును, మిగతా భాగమునకు బస్సు ఖర్చునకును దినభత్యముతో సహా నియమితము చేయవలెను.

వివరణ : ఈ నిబంధన నుద్దేశించి నంతవరకు, "చైర్మన్" ఈ చట్టము క్రింద చైర్మన్ అధికారములను చలాయించుచు, అతని విధులను నిర్వర్తించు చున్న వైస్ చైర్మను, తాత్కాలిక చైర్మను కూడ అయి వున్నాడు.

## 38. జిల్లా పరిషత్ నిధి ఏ కార్యముల కొరకు వినియోగింపబడవలెనో వాటిని నిర్ణయించు నియమావళి

### 1 వ భాగము

#### ప్రారంభ విషయములు

1. ఈ నియమావళిలో సందర్భము అన్యథా కోరిననే తప్ప :—

(i) "చట్టము" అనగా 1959, ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సమితుల, జిల్లా పరిషత్తుల చట్టము (1959 లోని 35 వ ఆంధ్రప్రదేశ్ చట్టము) అని అర్థము ;

### 2 వ భాగము

2. జిల్లా పరిషత్తు నిధి ఏ కార్యములకు వినియోగింపవచ్చునో అందుకు సంబంధించిన వాహనములకు లేదా వాటి క్రింద చేయబడిన నియమములను బట్టి నిధీ యుక్తమని లేదా, విచక్షణా పూర్వకమని స్పష్టముగా ప్రకటింపబడిన విషయములన్నియు, సాధారణముగా పరిపాలనకు సంబంధించిన ప్రతి విషయమును చేరును. ఈ నియమములకును, ప్రభుత్వమువారు చేయు అదనపు నియమావళికిని లేదా జారీచేయు ప్రత్యేక ఉత్తరువులకును లోబడి ఈ నిధి జిల్లా లోపల వాటిని వినియోగింపబడవలెను. జిల్లా వెలుపలి కార్యముల ఖర్చు, చట్టముచే అధీకృతమైనప్పుడు లేదా ప్రభుత్వమువారిచే ప్రత్యేకముగా మంజూరు చేయబడినప్పుడు అట్టి కార్యమునకు వినియోగింపబడవలెను.

3. పరిపాలనకు సంబంధించిన ఖర్చు అంశములలో ఈ క్రిందివి చేరును :—

(ఎ) ఉపకరణములు, ఫిట్టింగులు భీమా ఖర్చులతో సహా జిల్లా పరిషత్ ప్రధాన కార్యాలయము రికార్డు రూముల ఇతర కార్యాలయముల ఏర్పాటు, నిర్వహణ,

(బి) జీతములు, బత్తెములు, డెలివరీలు, పెన్షనుకు విరాళములు, ప్రావిడెంటు ఫండు గ్రాట్యుటీలు పెన్షనులు, జిల్లా పరిషత్తు వాహనముల నిర్వహణకగు ఖర్చు, వాటికి సంబంధించియుండు ఖర్చంతయు,

(సి) జిల్లా పరిషత్తు సమావేశములందలి ప్రొసీడింగులను నివేదించుట కగు ఖర్చుతోసహా స్టేషనరీ, ముద్రణ, కార్యాలయమునకు, ప్రచారమునకగు ఖర్చంతయు,

(డి) లా చార్జీలు,

(ఇ) ఎలక్షను ఖర్చులు,

(ఎఫ్) ఆడిటర్ల రుసుములు,

(జి) జిల్లా పరిషత్తు వర్కు షాపుల ఏర్పాటు, నిర్వహణ,

(హెచ్) జిల్లా పరిషత్తు సర్వేలు, జిల్లా యొక్కయు, విస్తరణ భాగము, యొక్కయు పటముల తయారీ,

(ఐ) స్థిరాస్తి విషయములో హక్కుల రికార్డును తయారుచేయుట, దాని నిర్వహణ,

(జె) ఈ చట్టము యొక్క కార్యము లన్నిటికిని లేక అందు వేటికైనను భూమిని సేకరించుట ;

4. జిల్లా పరిషత్తు నిధి, జిల్లాలోని ఏవైన పంచాయతీ సమితుల నిధులకు చందాల నిచ్చుటకు వినియోగింపబడవచ్చును. ప్రభుత్వమువారి మంజూరీతో ఈ క్రింది వాటికిగూడ వినియోగింపబడవచ్చును.

(1) దాని అధికార క్షేత్రములోని స్థానిక ప్రాంతములందలి ఏవైన సార్వజనిక ప్రదర్శనములు, ఉత్సవములు లేక వినోద ప్రదర్శనములకగు ఖర్చులకు చందా ఇచ్చుట ;

(2) ఏదైన ధర్మనిధికి, బీదవారి సహాయమునకు లేక వ్యాధిగ్రస్తుల లేక అశక్తులైనవారి చికిత్సలకు లేదా రోగ విధానమునకు ఏర్పడిన ఏదైన సంస్థల నిధులకు చందా ఇచ్చుట;

(3) ఏవైన ఇతర అసాధారణమైన ఖర్చులను పెట్టుట;

5. ఈ దిగువ తెలుపబడిన సందర్భములో బడ్జెటు కేటాయింపు లేనప్పుడు జిల్లా పరిషత్తు కార్యదర్శి జిల్లా పరిషత్తు నిధినుండి ఏ మొత్తము నైనను చెల్లించ వచ్చును లేక అందుకు అధికార మీయవచ్చును.

(ఎ) చట్టము లేక ఏదైన శాసనము క్రింది పన్నులు, సర్ చార్జీ లేక రుసుముల వాపసు.

(బి) కంట్రాక్టర్లకు లేక ఇతర వ్యక్తులకు చెందివుండి డిపాజిట్టులో వున్నటువంటి ద్రవ్యమును, పొరపాటున వసూలు చేయబడిన లేక జిల్లా పరిషత్ నిధికి కట్టబడిన ద్రవ్యమును తిరిగి ఇచ్చివేయుట.

(సి) జిల్లా పరిషత్తుపై చేయబడిన సివిలు కోర్టు డిక్రీ లేక ఉత్తరువు క్రింద ఏదేని దావా లేక న్యాయసంబంధమైన ప్రొసీడింగు లేక క్లయిము విషయములో రాజీ క్రింద చెల్లింపదగు మొత్తములు,

(డి) నష్టపరిహారము లేక ఖర్చుల రూపములో ఏదైన శాసనము క్రింద జిల్లా పరిషత్తు కార్యదర్శి చెల్లించవలెనని ఆదేశింపబడిన ఏదైన మొత్తము,

(ఇ) శాసనము యొక్క ఏదైన నిబంధన క్రింద బాధ్యుడగు వ్యక్తి నుండి తిరిగి రాబట్టు ఉద్దేశముతో చట్టసమ్మతముగా పెట్టిన ఖర్చులు,

అయితే జిల్లా పరిషత్తు కార్యదర్శి ఆ పరిస్థితులను గూర్చి ప్రభుత్వము వారికి వెంటనే తెలియపరచవలెను. ప్రభుత్వమువారు ఆ పరిస్థితులలో బడ్జెటు గ్రాంటు క్రిందికి రానట్టి ఏదైన ఖర్చు నిమిత్తము అవసరము లేక ఆవశ్యకము అగునట్టి చర్యను తీసికొనవలెను.

6. జిల్లా పరిషత్ కార్యదర్శి జిల్లా-పరిషత్తు నిధినుండి అందున్న దానికంటె ఎక్కువ మొత్తమును తీసికొన కూడదు.

7. (1) జిల్లా పరిషత్తుకు దాఖలు చేసిన బిల్లుల విషయములో జిల్లా పరిషత్ నిధులనుండి చేయు చెల్లింపు లన్నియు జిల్లా పరిషత్తు కార్యదర్శిచే బిల్లులు మంజూరు చేయబడిన మీదట మాత్రమే జరుగవలెను.

(2) పర్మినెంటు అడ్వాన్సు నుండి కొద్దిపాటి కంటింజెంటు ఖర్చును పెట్టుటకు ఈ నియమములలో నిబంధింపబడినట్లు తప్ప, జిల్లా పరిషత్తు ద్రవ్య ముంచబడిన ట్రెజరీలో లేక ప్రభుత్వమువారిచే ఆమోదింపబడిన ఏదైన బ్యాంకులో డ్రా చేసిన చెక్కుల ద్వారా మాత్రమే చెల్లింపులు చేయబడవలెను.

8. జిల్లా పరిషత్ కార్యదర్శి తన పదవిని తాత్కాలికముగాగాని శాశ్వతముగా గాని ఒకరికి అప్పగించునప్పుడు తన స్థానే వచ్చెడి కార్యదర్శి యొక్క మాదిరి సంతకమును ఈ దిగువ యీయబడిన నమూనాలో సర్టిఫికేటుతోసహా జిల్లా పరిషత్ ద్రవ్యము ఉంచబడు ట్రెజరీ ఆఫీసరునకు లేక ప్రభుత్వము వారిచే ఆమోదింపబడు ఏదైన ఇతర బ్యాంకుకు పంపవలెను.

సర్టిఫికేటు నమూనా

శ్రీ... .................గారికి, నేను ఈ దినమున జిల్లా పరిషత్ కార్యదర్శి పదవి చార్జిని శ్రీ......................గారికి అప్పగించితిని. వారి మాదిరి సంతకము దిగువ యీయబడినది.

పదవికి వచ్చు అధికారి — పదవీ విరమణచేయు అధికారి

(1)

(2)

(3)

9. (1) చెక్కు పుస్తకములు జిల్లా పరిషత్ కార్యదర్శి వ్యక్తిగత అధీనములో ఉంచబడవలెను. బదిలీగాని, మార్పుగాని జరిగినప్పుడు, ఎన్ని ఉపయోగింపబడని చెక్కులు, చెక్కు పుస్తకములు పదవీ విరమణ చేయు అధికారిచే అప్పగింపబడి పదవికి వచ్చు అధికారిచే తీసికొనబడినవో తెలుపుచు నగదు పుస్తకములో రికార్డు చేయబడి వారిద్దరిచే సంతకములు చేయబడవలెను.

(2) జిల్లాపరిషత్ నిధిపై ఎట్టి క్లయిముగాని కలిగియున్న ప్రతి వ్యక్తి జిల్లా పరిషత్ కార్యాలయమందు ఒక బిల్లును దాఖలు చేసికొనవలెను. సాధ్యమగునపుడెల్ల అట్టి బిల్లులు అందు నిమిత్తమై నిర్ణయింపబడు నమూనాలో ఉండవలెను. క్లయిముదారు దానిపై సరిగా తేదీని వేసి, సంతకము చేసి, అవసరమగునప్పుడు స్టాంపు అంటించవలెను.

(3) సాధ్యమగునపుడెల్ల బిల్లులను తయారు చేయుటలో ముద్రింపబడిన నమూనాలను ఉపయోగించవలెను.

(4) క్లయిముదారు అందుకు నిర్ణయింపబడిన నమూనాకు భిన్నమైనట్టి నమూనాలో బిల్లును దాఖలు చేయునెడల ఖర్చు భరించు అధికారిచే సరియైన నమూనాలో వేరొక బిల్లు చేయబడవలెను. క్లయిముదారు యొక్క బిల్లును సబ్ ఓచరుగా దానికి జత చేయవలెను.

(5) ప్రతి బిల్లును జిల్లాపరిషత్తు కార్యదర్శికి దాఖలు చేయవలెను. దానిని ఆయన అక్కౌంటెంటుకు అప్పగించవలెను. అక్కౌంటెంటు బిల్లుల రిజిష్టరులో దానిని రిజిష్టరుచేసి, మంజూరు దృష్ట్యా లేక తదితర పత్రముల దృష్ట్యా స్వీకరించు విషయమై దానికి గల తరవాత, క్లయిము యొక్క యుక్తత, లెక్కల యథార్థత వీటికి సంబంధించి బిల్లును తనఖీచేసి పరిశీలించవలెను. బిల్లును ఆ విధముగా తనిఖీచేసి పరిశీలించిన మీదట అది సరిగాను, సక్రమమైన పద్ధతిలోను ఉన్నట్లు కనుగొనబడిన యెడల, దానిని బిల్లులో చెల్లింపు ఉత్తరువుపై సంతకము చేయుటకుగాను జిల్లా పరిషత్తు కార్యదర్శి ఎదుట ఉంచవలెను. చెల్లింపు ఉత్తరువు ఈ క్రింది విధముగా ఉండవలెను—

"చెక్కుద్వారా మొత్తమును అంకెలలోను, అక్షరముల లోను మాత్రమే చెల్లించి దానిని (మేజరు, మైనరు లేక వివరమైన శీర్షికల క్రింద) ఖర్చు వ్రాయుడు" చెల్లింపులు నగదు రూపములో చేయవలసి యున్నప్పుడు జిల్లా పరిషత్తు కార్యదర్శి పేరిట చెక్కులు డ్రా చేయబడవలెను. అట్టి మొత్తములన్నియు అక్కౌంటెంటుచే నిర్వహింపబడు పెటీ క్యాషు బుక్కులో వ్రాయబడవలెను.

10. (1) బిల్లును డ్రా చేయు వ్యక్తియే పైకము తీసికొను వ్యక్తియై యుండి ఇదివరకే బిల్లులో రసీదును (అవసరమైనపుడు స్టాంపు అంటించి) పొందుపరచినపుడు తప్ప, ఏదైన జీతము లేక భత్యము చెల్లింపబడు ప్రతి అధి

కారి లేక ఉద్యోగి వద్ద విడివిడిగా (అవసరమైనప్పుడు స్టాంపు అంటించి) రశీదులను (చెల్లింపులు జిల్లా పరిషత్తు కార్యాలయములోనే జరిగినప్పుడు బిల్లు చివరి కాలములోను తదితర సందర్భములో అక్విటెన్సు రిజిష్టరులోను) తీసి కొనవలెను.

(2) జిల్లా పరిషత్ కార్యదర్శి జిల్లా పరిషత్తు ద్రవ్యములుంచబడునట్టి ట్రెజరీనుండి లేక ప్రభుత్వము వారిచే ఆమోదింపబడిన ఏదైన ఇతర బ్యాంకు నుండి తాను డ్రాచేసిన మొత్తములో ఏదైన చెల్లింపును చేసిన ఎడల ఆయన బిల్లులోనే రసీదును (అవసరమైనపుడు స్టాంపు అంటించి) పొందుపరచబడిననే తప్ప, ప్రత్యేక రసీదును (అవసరమైనపుడు స్టాంపు అంటించి) తీసికొని బిల్లుకు జత చేయవలెను.

11. (1) ఖర్చులోని ఏ అంశమునకైనను బిల్లును డ్రాచేయు అధికారి లేక ఉద్యోగికంటె పెద్ద హోదాలోగల ఎవరైన అధికారియొక్క మంజూరు అవసరమైనచో అట్టి మంజూరు పొందబడి అందుకుగల నిబంధన బిల్లుపై వ్రాయబడవలెను. మంజూరు ఉత్తరువు నకలొకటి చట్టముయొక్క 32 (3) విభాగము క్రింద నియమించబడిన ఆడిటరుకు కూడ పంపబడవలెను.

(2) ఖర్చులో ఏ అంశముగాని అందు నిమిత్తమై దిగువ తెలుప బడిన నమూనాలో సర్టిఫికేటు పొందుపరుపబడిననే తప్ప జిల్లా పరిషత్ కార్య దర్శిచే మంజూరు చేయబడకూడదు.

రూ. న.పై.

బడ్జెటు కేటాయింపులో ఖర్చు చేనయగు మొత్తము
ఇప్పటివరకు ఈ శీర్షిక క్రింద ఖర్చు పెట్టిన మొత్తము
ఇప్పటివరకు మంజూరు చేయబడినను, ఖర్చుపెట్టని మొత్తము
ఇప్పుడు మంజూరు చేయవలసియున్న మొత్తము

మొత్తము

మిగిలిన మొత్తము

(3) సంబంధించిన శీర్షిక క్రింద బడ్జెటు కేటాయింపు లేకుండి, జిల్లా పరిషత్ మరొక శీర్షిక క్రింద పైకమును వినియోగించుట ద్వారా ఈ

మొత్తమును సర్దుబాటు చేయుటకు నిర్ణయించు నెడల "మరియొక శీర్షిక కింది మొత్తము వినియోగించుట ద్వారా" అనుమాటలను "బడ్జెటు కేటాయింపులో" అనుమాటల తరువాత యుంచవలెను.

(4) సమావేశమునకు ముందు సర్క్యులేటు చేయబడు అజెండాలో సర్టిఫికేటు నమోదు చేయబడవలెను. అది పరిషత్/స్థాయీ సమితిచే ఆమోదింపబడినప్పుడు మినిట్లు పుస్తకములో తీర్మానపు భాగముగా దానిని తిరిగి వ్రాయనవసరములేదు. అయితే పరిషత్/స్థాయీ సమితి ఖర్చు లెక్కలోగాని, ఖర్చు సర్దుబాటు చేయవలసియున్న శీర్షికలోగాని ఏదైన మార్పు చేయునెడల సవరింపబడిన రూపములో సర్టిఫికేటు పరిషత్/స్థాయీ సమితి తీర్మానపు భాగముగా మినిట్సు పుస్తకములో నమోదు చేయబడవలెను.

(5) ఏదైన క్రొత్త మార్పుకొరకు చేయబడు మంజూరు ఒక సంవత్సరములో వినియోగించుకొనబడనిచో అది నిర్దిష్టముగా పునరుద్ధరింపబడిననే తప్ప మురిగిపోయినట్లు భావింపబడవలెను.

అయితే ఈ ఉపనియమము ఈ క్రింది వాటికి వర్తించకూడదు,—

(ఎ) ఒక నియామకమునకు లేదా ఒక తరగతి ఉద్యోగులకు మంజూరు చేయబడిన ఆ పదవిలోగల ఒకానొక ఉద్యోగి లేదా కొంతమంది ఉద్యోగులు తీసికొనని సందర్భము;

(బి) తగిన అధికార వర్గముచే మంజూరు చేయబడిన సాధారణ పథకము క్రింద శాశ్వత సిబ్బందికి క్రమక్రమముగా సాలుసాలుకు జరుగు చేర్పులు;

(సి) (6)వ ఉప నియమములో పొందుపరుపబడిన నిబంధనలు వర్తించవలసిన పనులపై ఖర్చు.

(6) (ఎ) సాధారణ వార్షిక నిర్వహణ అంచనా యొక్క మంజూరు అవి ఏ ఆర్థిక సంవత్సరమునకు చెందునో ఆ ఆర్థిక సంవత్సరపు చివరి రోజున మురిగిపోవును. అయితే ఏ దేని అసాధారణ సందర్భములో ఆతేదీన పని ఆపు చేయుట వలన అసౌకర్య మేర్పడునెడల మరమ్మత్తులు పూర్తియగు వరకు

చేయబడవచ్చును. ఆ తేదీ తరువాత అయిన ఖర్చు తరువాత సంవత్సరపు క్రొత్త మరమ్మతు అంచనాకు చెందిన ఖర్చుగా పరిగణింపబడవలెను.

(బి) ప్రత్యేక మరమ్మతుల అంచనాలు అసలు పనుల అంచనాలకు వలెనే మరమ్మతులు పూర్తి యగువరకు అమలులో వుండవలెను.

(సి) వార్షిక నిర్వహణకాక ఏదేని సార్వజనిక పని అంచనా కొసగబడిన అనుమతి లేక మంజూరి, అట్టిపని ప్రారంభింపబడిననే తప్ప, అది ఒసగబడిన తేదీ నుండి మూడు సంవత్సరముల కాలము తరువాత రద్దు కావలెను.

**12.** ఒక బిల్లులో చేయబడిన ఏదేని క్లయిము చెల్లింపబడవలెనని ఆదేశించు ఉత్తరువు ఆరు నెలల వరకు మాత్రమే చెల్లవలెను. చెల్లింపు ఆ తరువాత చేయబడవలసియున్నచో ఆ ఉత్తరువు పునరుద్ధరింపబడవలెను.

**13.** (జిల్లా పరిషత్తు యొక్క ఎవరేని అధికారికి లేక ఉద్యోగికి సంబంధించి, అందు నిమిత్తమై ప్రత్యేకముగా రూపొందింపబడిన నియమావళి క్రిందికి వచ్చు క్లయిము తప్ప) జిల్లా పరిషత్తుపై చేయబడు ఎట్టి క్లయిము గాని—

(1) క్లయిము చెల్లింపబడవలసిన తేదీ నుండి ఆరునెలలకు మించని కాలపరిమితి తరువాత జిల్లా పరిషత్తు కార్యదర్శి ఉత్తరువు లేకుండా బిల్లు సమర్పింపబడినపుడు;

(2) క్లయిము చెల్లింపబడవలసిన తేదీ నుండి సంవత్సరమునకు మించిన కాలపరిమితి తరువాత జిల్లాపరిషత్ యొక్క స్థాయీ సమితి చైర్మను ఉత్తరువు లేకుండా బిల్లు సమర్పింపబడినపుడు చెల్లింపుకై స్వీకరింపబడరాదు.

**14.** అదనపు మొత్తమును చెల్లించినందుకు గాను బిల్లును డ్రా చేసిన వ్యక్తియే ప్రధాన బాధ్యుడై యుండవలెను. చెల్లించిన అదనపు మొత్తమును ఆ వ్యక్తి భర్తీ చేయవలసి యుండును. ఆయన వద్ద వసూలు చేయలేక పోయినపుడు, ఆ మొత్తము కౌంటరు సైనుచేయు అధికారి వద్దనుండిగానీ మంజూరు చేయు అధికారి వద్దనుండిగానీ, వారిలో ఎవరైనను అక్రమమైన అలక్ష్యము చేసిన సందర్భములో మాత్రమే రాబట్టబడవలెను.

**15.** (1) ఏ వ్యక్తియొక్కయైన అలక్ష్యము లేక దుష్ప్రవర్తన వలన సంభవించిన ఏదేని లోటు నష్టము లేక లాభసాటికాని పెట్టుబడిని గూర్చి, అది

సంభవించినట్లు తెలిసికొనిన వెంటనే చట్టము యొక్క 32 వ విభాగము (3) వ ఉపవిభాగము క్రింద నియమింపబడిన ఆడిటర్లకు తెలుపబడవలెను. ఆ విషయమై పూర్తి విచారణ జరుపబడిన వెంటనే లోటు లేక నష్టము యొక్క స్వభావమును, విస్తృతిని, అట్టిలోటు లేక నష్టము సంభవించుటకు కారణమైన తప్పిదములు నియమముల యెడ అలక్ష్యము, ఆ మొత్తమును రాబట్టుటకుగల అవకాశములను తెలుపుచు మరొక సంపూర్ణమైన నివేదిక కూడ ఆ ఆడిటర్లకు పంపబడవలెను.

(2) దొంగతనము వలన లేక మరొక విధముగా ఏదేని ఇతర ఆస్తికి వాటిల్లిన నష్టమును గూర్చి కూడ, నష్టము వాటిల్లిన ఆస్తి విలువ పది రూపాయలకు మించినపుడు, ఆడిటర్లకు తెలుపబడవలెను.

(3) (1), (2) ఉప నియమములలో నిర్ణయింపబడిన నివేదికల సమర్పణ, అవసరమని భావింపబడు ఇతర చర్య తీసికొనుటలో జిల్లా పరిషత్తు కార్యదర్శిని ఆటంకపరచరాదు.

## సిబ్బంది బిల్లులు

16. వేతనముల బిల్లులు ప్రభుత్వమువారు ఆ యా సమయములందు నిర్ణయించు నమూనాలో తయారు చేయబడవలెను.

17. జిల్లా పరిషత్తు సిబ్బంది యొక్క నెలవారీ వేతనముల బిల్లులతో ప్రభుత్వమువారు ఆ యా సమయములందు నిర్ణయించు నమూనాలో గైరుహాజరీ స్టేటుమెంటుగాని, సిబ్బందిలో ఎవరికిని శలవు మంజూరు చేయబడలేదని తెలుపు సర్టిఫికేటుగానీ జతపరుపబడవలెను.

18. ఇంక్రిమెంటు డ్రా చేయబడిన మొదటి వేతనపు బిల్లునకు ప్రభుత్వమువారు ఆ యా సమయములందు నిర్ణయించునట్టి నమూనాలో ఇంక్రిమెంటు సర్టిఫికేటు జతపరుపబడవలెను.

19. ప్రభుత్వమువారిచే పంపబడిన లేక ఏదేని స్థానిక అధికారవర్గము నుండి బదిలీ చేయబడిన అధికారి లేక ఉద్యోగి వేతనము, ఆయన అంతకు ముందు పనిచేసిన కార్యాలయ అధిపతి మంజూరు చేసిన కడపటి వేతనపు సర్టిఫికేటు (ఇది ప్రభుత్వమువారు ఆ యా సమయములందు నిర్ణయించు నమూనాలో ఉండవలెను) అందిన మీదట మాత్రమే డ్రా చేయబడవలెను.

ఆ సర్టిఫికేటు అట్టి పంపుదల లేక బదిలీ తరువాత డ్రా చేయబడు మొదటి వేతనపు బిల్లునకు జతపరుప బడవలెను.

20. ఎవరేని వ్యక్తి మరణించిన తేదీకి వేతనము, శలవు వేతనము భత్యములు లేక ఫించను డ్రా చేయబడ వచ్చును. మరణము సంభవించిన సమయము క్లెయిమును మార్చరాదు.

21. జిల్లా పరిషత్తుయొక్క మరణించిన అధికారికి లేక ఉద్యోగికి రావలసిన పైకము 1925, భారత వారసత్వపు చట్టము (1925 లో 39 వ కేంద్ర చట్టము యొక్క) 214 వ విభాగము (1) వ ఉప విభాగము (బి) ఖండములోని (i), (ii), (iii), (iv), (v) ఉప ఖండములందు నిర్దిష్ట పరుపబడి నటువంటి అధికార పత్రమును హాజరు పరచిననే తప్ప చెల్లింప బడరాదు ;

అయితే—

(i) చెల్లింపుకు బాధ్యుడైన జిల్లా పరిషత్తు కార్యదర్శి తాను యుక్తమని తలంచు విచారణ జరిపిన మీదట క్లెయిముదారుకు హక్కు, అధికారము కలవని విశ్వసించినచో ఆయన ఉత్తరువులపై అయిదు వందల రూపాయల వరకును,

(ii) జిల్లా పరిషత్ యొక్క స్థాయీ సమితి ఛైర్మను తాను యుక్తమని భావించు విచారణ జరిపి క్లెయిము దారుకుహక్కు, అధికారములు కలవనియు, అట్టి అధికార పత్రమును తేవలెనని పట్టు పట్టుటవలన అమితమైన ఆలస్యము కష్టము కలుగుననియు విశ్వసించినచో తాను కోరునట్టి పూచీ లేక పూచీలతో హామీ పత్రము వ్రాసి యీయబడిన మీదట ఆయన ఉత్తరువులపై అయిదు వందల రూపాయలకు మించిన మొత్తము,

అట్టి అధికార పత్రమును హాజరు పరచక పోయినను చెల్లింపబడ వచ్చును.

22. ఒక ఉద్యోగియొక్క ఆఖరి వేతనము భత్యముల చెల్లింపు లేక ఆయనకు మంజూరు చేయబడిన ఏదేని శలవు అంతమున ఆయన జిల్లా పరిషత్ కొలువు నుండి అంతిమముగా విరమించుచున్న సందర్భములో ఆయన

శలవు వేతనములో ఆఖరి చెల్లింపు. ఆయన ఎట్టి పైకమును గాని బాకీలేడని సిర్ధారింపబడునంతవరకు, చేయబడరాదు. అట్లు నిర్ధారణచేయు సర్టిఫికేటు జిల్లా పరిషత్ కార్యదర్శిచే సంతకము చేయబడి, అట్టి వేతన బత్తెములు లేక శలవు వేతనము క్లయిము చేయబడుచున్న బిల్లుకు జత పరుపబడవలెను.

23. వేతనపు బకాయీలు నెలవారి బిల్లులో డ్రా చేయబడరాదు. అవి ఒక ప్రత్యేక బిల్లులో డ్రా చేయబడవలెను. ఆ బిల్లులో అట్టి క్లయిము ఏ బిల్లులో చేయబడలేదో లేక ఆపివేయబడినదో లేక తగ్గింపు ద్వారా వాపసు చేయబడినదో పేర్కొనబడవలెను. వేతనముల బిల్లులకు సంబంధించిన సిబ్బంది లేక సంస్థపై అజమాయిషీ వహించుచున్న ప్రధానాధికారిచే సంతకము చేయబడి, జిల్లా పరిషత్ కార్యదర్శిచే మంజూరు చేయబడవలెను.

24. వేతనము మరియు నిర్ణీత భత్యముల చెల్లింపులకు సంబంధించిన చెక్కులు, ఆ చెల్లింపు ఏ నెలకు చెందునో ఆ నెల తరువాత నెలలోని మొదటి పది దినములలోగా జారీచేయబడరాదు.

అయితే ఎవరేని అధికారి లేక ఉద్యోగి అంతిమముగా జిల్లా పరిషత్ కొలువు విరమించుచున్నపుడు లేక ఆయన మరొక స్థానిక అధికార వర్గము యొక్క లేక ప్రభుత్వమువారి కొలువునకు బదిలీ చేయబడు చున్నపుడు, చెక్కులు అట్టి విరమణ లేక బదిలీ తేదీన మంజూరు చేయబడ వచ్చును.

ఇంతే కాకుండ, ఒక నెలలోని మొదటి ఆరు దినములు జిల్లా పరిషత్ యొక్క పైకములు ఉంచబడిన ట్రెజరీ లేక ప్రభుత్వమువారిచే ఆమోదింప బడిన ఏదేని ఇతర బ్యాంకు చెల్లింపులు చేయని పబ్లికు శలవు దినములైనచో శలవులకు ముందు కడపటి పని దినము చెక్కులు జారీ చేయబడవచ్చును.

25. వేతన భత్యముల కొరకు బిల్లు డ్రా చేయు జిల్లా పరిషత్ కార్యదర్శి, అట్లు డ్రా చేసిన మొత్తముకు సంబంధించిన వ్యక్తికి లేక వ్యక్తులకు చెల్లింపబడి, రశీదు (అవసరమైనచోట స్టాంపు అంటించి) పొందబడు నంత వరకు, ఆ మొత్తమునకు స్వయముగా బాధ్యుడై యుండవలెను. వేతనము తీసికొనవలసిన వ్యక్తి పైకము డ్రా చేయబడిన తేదీనుండి ముప్పది దినముల

లోగా హాజరు కానియెడల ఆయన కొరకు డ్రా చేయబడిన పైకము తరువాత బిల్లులో తగ్గింపుచేసి డ్రాయి చేయుట ద్వారా వాపసు చేయబడవలెను. డ్రాయి చేయబడిన వేతన భత్యముల మొత్తము ఎట్టి సందర్భములోగాని డిపాజిటు చేయబడరాదు.

26. సిబ్బంది, ఇంటి అద్దె, నిర్ణీత ప్రయాణ వాహన భత్యములు మున్నగు వాటి క్రింద ఆవృత వ్యయమునకైన నెలవారీ బిల్లును తనిఖీచేయ వీలు కల్పించుటకుగాను నిర్ణయింపబడిన నమూనాలో ఆడిటు రిజిష్టరు జిల్లా పరిషత్ కార్యాలయములో నిర్వహింపబడవలెను.

27. (1) నిర్ణీత ప్రయాణ భత్యముకానట్టి ప్రయాణ భత్యము నిర్ణయింపబడిన నమూనాలో ఒక ప్రత్యేక బిల్లులో డ్రా చేయబడవలెను.

(2) ఏ వాహనము విషయములో వాహన భత్యము డ్రా చేయబడినదో ఆ వాహనము తాత్కాలికముగా ఉపయోగపడనపుడు పది రోజుల గరిష్ట కాలపరిమితివరకు అట్టి వాహన భత్యము డ్రా చేయబడు చుండవచ్చును. అట్టి సందర్భములో వాహన భత్యమును క్లయిముచేయు అధికారి లేక ఉద్యోగి ఆ వాహనము నెలలో వాస్తవముగా ఎన్ని రోజులపాటు ఉపయోగ పడలేదో తెలుపు సర్టిఫికేటును సమర్పించవలెను.

28. నిర్ణీత ప్రయాణ, వాహన భత్యములు సంబంధించిన అధికారి లేక ఉద్యోగి యొక్క వేతనపు బిల్లులో డ్రా చేయబడవలెననే కాని ప్రయాణ భత్యపు బిల్లులలోకాదు. ప్రతి వాహన భత్యపు బిల్లునకు, ఆ నెలలో వాహనము వాస్తవముగా మంచిస్థితిలో ఉంచబడినదనియు, సంబంధించిన అధికారి లేక ఉద్యోగిచే వాడబడినదనియు తెలుపు సర్టిఫికేటు జతపరుపబడవలెను.

29. జిల్లా పరిషత్ ప్రభుత్వమువారి పూర్వానుమతి లేకుండ ఈ క్రింది వాటికొరకు నిర్దిష్ట పరుపబడిన నిధులను అవి ఏ కార్యముల నిమిత్తము వసూలు చేయబడెనో లేక కేటాయింపబడెనో ఆ కార్యములకొరకు తప్ప ఇతరమైన వాటికొరకు కేవలము తాత్కాలికముగా నైనను వినియోగించ రాదు :—

(i) పాఠశాలల ఏర్పాటు కొరకు నిర్వహణకొరకు వసూలు చేయబడిన నిధులు ;

(ii) నిర్దిష్ట కార్యముల కొరకు మంజూరు చేయబడిన ప్రత్యేక రాజ్య గ్రాంటులు

(iii) పెట్టుబడి ఆస్తుల అమ్మకము వలన వచ్చిన వసూళ్ళు ;

(iv) ధర్మాదాయముల నుండి లేక ట్రస్టుల నుండి లభించు ఆదాయము;

(v) డిపాజిటులు (ప్రావిడెంటు ఫండుతో కలుపుకొని) ;

(vi) ప్రభుత్వమువారిచే బదిలీ చేయబడిన సంస్థలకు, పథకములకు చెందిన నిధులు ;

(vii) సమాజాభివృద్ధి కార్యక్రమమునకు చెందిన నిధులు ఏవైన వున్నచో అవి ;

(viii) కుటీర చిన్న తరహా పరిశ్రమలు మున్నగువాటి అభివృద్ధి నిమిత్తము అఖిల భారత వ్యవస్థలు, సంస్థలు ఇచ్చిన గ్రాంటులు ;

(ix) పంచాయతీ సమితులనుండి లేక ప్రజలనుండి ఏ రూపములోనైనను ముట్టిన విరాళములు, చందాలు ;

(x) రోడ్ల నిర్మాణము, నిర్వహణ, మరమ్మతు విస్తరణ, అభివృద్ధులకు సంబంధించిన నిర్దిష్ట కార్యముల నిమిత్తము రాజ్యపు పన్నులలోనుండి యీయబడిన మొత్తములు.

## 39. పట్టణ సమితుల, పంచాయతీ సమితుల నిధుల ఖర్చు చేయుటకు నిబంధనలు

సదరు చట్టము యొక్క 18 వ విభాగము (4)వ ఉప విభాగము మరియు 47వ విభాగము (3)వ ఉప విభాగము క్రింద. పంచాయతీల. పట్టణ సమితుల లేక పంచాయతీ సమితుల నిధులనుండి వసూలు చేయబడిన మొత్తములు.

(1) (i) పంచాయతీ సమితి విషయములో, బ్లాకులోని రెండు లేక ఎక్కువ పంచాయతీలకు లేక పట్టణ సమితులకును, జిల్లా పరిషత్తు విషయములో

రెండు లేక ఎక్కువ పంచాయతీ సమితులకును లాభదాయకముగా నుండు పనులను :

(ii) ఒక పంచాయతీ మరియు పట్టణ సమితి లేక పంచాయతీ సమితిచే ఆరంభింపబడుటకు వీలుకానట్టి లేక ఉమ్మడిగా నిర్వహించుట పొదుపుగా నుండగల పనిని ;

(iii) ఒకటికంటె ఎక్కువ పంచాయతీలకు, పట్టణ సమితులకు లేక పంచాయతీ సమితులకు లాభదాయకముగా వుండు ఉమ్మడి సర్వీసు స్టేషను, ఉమ్మడి వాటర్ వర్క్స్ పథకము, పెద్ద రోడ్డు లేక వంతెన పనులను లేక ఉమ్మడి వైద్య సంస్థ మొదలగు పనులను అమలు జరుపుటకును, నిర్వహించుటకు,

(2) సర్వసాధారణముగా ప్రజలకు ఉపయోగించు పరికరములను లేక యంత్రములను కొనుగోలు చేయుటకు ;

(3) ప్రభుత్వమువారు అమోదించు ఇంకేదైన ఇతర కార్యమునకు ఖర్చు చేయబడవలెను, మరియు

(4) ఏ సంవత్సరములోనైన అట్లు వసూలు చేయబడిన పూర్తి మొత్తములు, ఆ సంవత్సరమునకుగాను అంచనా వేయబడిన ఖర్చును మించరాదు.

## 40. పన్నుల విధింపుకు సంబంధించిన తీర్మానములను, ప్రకటనలను ప్రచురించవలసిన విధానము.

1. (ఎ) ఏదైన పన్నును విధించుటకు నిర్ణయించుచు పంచాయతీ సమితి/జిల్లా పరిషత్తుచే చేయబడిన తీర్మానములోనైనను, అట్టి పన్ను ఏ ప్రాంతపు స్థానిక హద్దులలోపల, ఏరేటు చొప్పున, ఏ తేదీనుండి, ఎంతకాల పరిమితి వరకు విధింపబడవలెనో నిర్దిష్టపరచవలెను.

(బి) అట్టి ఏదైన తీర్మానము ద్వారా పంచాయతీ సమితి/జిల్లా పరిషత్ ఏదైన పన్నును విధించుటకు నిర్ణయించినచో, బ్లాకు అభివృద్ధి అధికారి/కార్యదర్శి వెంటనే ఒక ప్రకటన చేయవలెను.

2. 1వ నియమములో (బి) ఉప నియమములో పేర్కొనబడిన ప్రతి ప్రకటన కూడ—

(1) అన్ని సందర్భములలోను (ఎ) జిల్లా గజిటు ఏదైన ప్రచురింపబడుచున్నచో దానిలోను, జిల్లాలో ప్రచారమందున్న ఒక వార్తా పత్రికలో ప్రకటింపబడవలెను. మరియు

(బి) పంచాయతీ సమితి/జిల్లా పరిషత్ కార్యాలయములో స్పష్టముగా కన్పించు స్థలములో ఒక ప్రతి అంటించబడవలెను.

(2) ఏ పన్ను రాబడి మొత్తముగాని కొంత భాగముగాని ఏదైన పంచాయతీ సమితికి లేక ఏవైన పంచాయతీ సమితులకు జమకట్టబడునో అట్టి పన్నుకు సంబంధించిన ప్రకటన అయినచో, దాని ప్రతి యొకటి అట్టి పంచాయతీ సమితి కార్యాలయములో లేక పంచాయతీ సమితుల కార్యాలయములలో స్పష్టముగా కన్పించు స్థలములో అంటించబడవలయును.

(3) ఏ పన్ను రాబడి మొత్తమునుగానీ కొంత భాగమునుగానీ ఏదైన పంచాయతీకి లేక పంచాయతీలకు జమకట్టబడునో అట్టి పన్నుకు సంబంధించిన ప్రకటన అయినచో దాని ప్రతి యొకటి—

(i) అట్టి పంచాయతీ కార్యాలయములో లేక పంచాయతీల కార్యాలయములలోను;

(ii) సంబంధించిన గ్రామము లేక గ్రామముల యొక్క చావిడి లేక చావిడీలు ఉన్నచో, వాటిలోను;

(iii) సంబంధించిన పంచాయతీ సమితి కార్యాలయములో లేక పంచాయతీ సమితుల కార్యాలయములలోను;

స్పష్టముగా కన్పించు స్థలములో కూడ అంటించబడవలెను.

## 41. పంచాయతీ సమితులకును, జిల్లా పరిషత్తులకును రావలసిన ఆదాయములకు సంబంధించిన రికార్డులను, రిజిష్టరను పరిశీలించుటకై నియమావళి

1. పంచాయతీ సమితి యొక్క బ్లాకు అభివృద్ధి అధికారి పంచాయతీ సమితికి రావలసిన ఆదాయములకు సంబంధించిన రికార్డులను, రిజిష్టర్లను అప్పుడప్పుడు స్వయముగా పరిశీలించవలెను. ఆయన వసూలు కాని బకాయీలకు చెందిన అన్ని స్టేటుమెంట్లను ప్రతి అర్ధ సంవత్సరం ప్రారంభములోను సంబంధించిన క్రింది ఉద్యోగులనుండి తెప్పించుకొని, వాటిని వసూలు చేయుటకై సకాలములో చర్య తీసికొనవలెను. బ్లాకు అభివృద్ధి అధికారి చేసిన ఏదైన పొరపాటు వలన పంచాయతీ సమితికి రావలసిన ఏదైన మొత్తము వసూలు చేసికొనుటకు వీలులేనిదై పోయినచో, దానికి ఆయనే స్వయముగా బాధ్యుడగును.

2. 1వ నియమములోని నిబంధనలు జిల్లా పరిషత్తులకుకూడ వర్తించును. అయితే అందులో "బ్లాకు అభివృద్ధి అధికారి" "పంచాయతీ సమితి" అను మాటలు వచ్చు అన్ని చోట్లను వాటికి బదులు వరుసగా "కార్యదర్శి" "జిల్లా పరిషత్తు" అను మాటలను ఉంచవలెను.

## 42. పంచాయతీ సమితి చేపట్టిన నిర్మాణములను పథకములను మంజూరు చేయు అధికారములను నిర్ణయించు నియమావళి

1. పంచాయతీ సమితి చేపట్టిన నిర్మాణములయొక్కయు, పథకముల యొక్కయు మొత్తము వ్యయము లేక ఖర్చు దిగువ పట్టియందు (1)వ కాలంలో పేర్కొనబడిన పద్దులకు ఎదురుగా వరుసగా (2) (3), (4), (5), మరియు (6) కాలములలో నిర్దిష్ట పరుపబడినంతగా ఉన్న సందర్భములలో వాటి విషయమున పరిపాలనా సంబంధముగను ఆర్థిక సందర్భముగను మంజూరు నిచ్చుటకుబ్లాకు అభివృద్ధి అధికారి, పంచాయతీ సమితియొక్క స్థాయీ సమితులు, పంచాయతీ సమితి, జిల్లా పరిషత్తుయొక్క స్థాయీ సమితులు, రాజ్య ప్రభుత్వము అధికారము కలిగి ఉండవలెను.

# పట్టిక

| పదు. | బ్లాకు అభివృద్ధి అధికారి | పంచాయతీ సమితి యొక్క తద్విషయ పరిశీలక సమితి మరియు ఐదవ స్థాయీ సమితి | పంచాయతీ సమితి | జిల్లా పరిషత్తు యొక్క తద్విషయ పరిశీలన సమితి మరియు ఐదవ స్థాయీ సమితి. | రాజ్యప్రభుత్వము |
|---|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
| 1. నిర్మాణముల, పథకముల విషయములో పరిపాలనా సంబంధమైన మంజూరు నిచ్చుటకు (ఏ) అనావృత్తి వ్యయము ఒక్కొక్క పద్దుకు (బి) ఆవృత్తి వ్యయము ఒక్కొక్క | రూ. 250 లకు, అంతకు లోపు. | రూ. 250 కు పైన రూ. 10,000 లకు లోపు<br>రూ. 5 000 లు అంతకు లోపు | రూ. 1,000 లకు పైన రూ. 30,000 లకు లోపు<br>రూ. 5,000 లకు పైన 10,000 లకు లోపు | రూ. 30,000 లకు పైన 50,000 లకు లోపు<br>రూ. 10,000 లకు పైన 20,000 లకు లోపు | రూ. 50,000 లకు పైన<br>రూ. 20,000 లకు పైన |

| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
|---|---|---|---|---|---|
| 2. ప్రతి పథకము విషయములోను గ్రాంట్సు-ఇన్-కం ఎయిడ్‌లను మంజూరుకు. | | | | | |
| (ఎ) అనావృత్తి | | | రూ. 5,000 లు అంతకు లోపు | రూ. 5,000 లకు పైన, 10,000 లకు లోపు | రూ. 10,000 లకు పైన |
| (బి) ఆవృత్తి | | | రూ. 2,000 లు అంతకు లోపు. | రూ. 2,000 లకు పైన, 5,000 లకు లోపు. | రూ. 5,000 లకు పైన |
| 3. వివరమైన అంచనాలు లేకుండానే సహాయ నిర్మాణములు ఒక్కొక్కదానిని – అనావృత్తి వ్యయములు మంజూరు చేయుటకు | రూ. 3,000 లు అంతకు లోపు. | | | | |

అయితే—

(ఎ) బ్లాకు అభివృద్ధి అధికారి మంజూరు చేసిన ప్రతి వ్యయపు లేక ఖర్చు పద్దు పంచాయతీ సమితియొక్క తద్విషయ పరిశీలక సమితి మరియు ఐదవ స్థాయీ సమితి ఎదుటను, ఏదైన స్థాయీ సమితి మంజూరు చేసినవి పంచాయతీ సమితి ఎదుటను, వాటి ఎరుక నిమిత్తము వుంచబడవలెను.

(బి) పంచాయతీ సమితియొక్క స్థాయీ సమితి నిరాకరించిన ఏదైన వ్యయము లేక ఖర్చు పద్దును పరిశీలించుటకును, అది ప్రజలకు ఉపయోగకారిగా వుండగలదని భావించినచో, దానిని మంజూరు చేయుటకును పంచాయతీ సమితి అధికారము కలిగి వుండవలెను.

(సి) పంచాయతీ సమితి యొక్క తద్విషయ పరిశీలక సమితియును ఐదవ స్థాయీ సమితియును పట్టికయొక్క (3)వ కాలము క్రింద నిర్దిష్ట పరుప బడిన గరిష్ట మొత్తమును మించిన ప్రతి వ్యయపు లేక ఖర్చు పద్దును మొదట పరిశీలించి తమ సిఫార్సులతోపాటు దానిని పంచాయతీ సమితి ఏదుట వుంచ వలెను. పంచాయతీ సమితి తన ఎదట వుంచబడిన వ్యయపు లేక ఖర్చుపద్దును పరిశీలించవలెను. అట్టి పద్దు (4)వ కాలములో నిర్దిష్ట పరుపబడిన ఖర్చును మించనిదైనచో పంచాయతీ సమితి ఆ పద్దును నిరాకరించవచ్చును లేక దానిని పూర్తిగాగాని, కొన్ని మార్పులు చేసిగాని మంజూరు చేయవచ్చును. అట్టి వ్యయపు లేక ఖర్చుపద్దు (4)వ కాలములో నిర్దిష్టపరుపబడిన గరిష్ట మొత్తమును మించినచో, అది తన సిఫార్సులతోపాటు ఆ పద్దును జిల్లా పరిషత్తుకు పంప వచ్చును. జిల్లా పరిషత్తుయొక్క తద్విషయ పరిశీలక సమితియును, ఐదవ స్థాయీ సమితియును, తమ ఎదట వుంచబడిన ప్రతి వ్యయపు లేక ఖర్చుపద్దును పరిశీలించవలెను. అట్టి పద్దు (5)వ కాలములో నిర్దిష్ట పరుపబడి ఖర్చును మించనిదైనచో వారు దానిని నిరాకరించవచ్చును లేక పూర్తిగాగాని, కొన్ని మార్పులు చేసిగాని మంజూరు చేయవచ్చును. వ్యయపు లేక ఖర్చు పద్దు (5)వ కాలములో నిర్దిష్టపరుపబడిన గరిష్ట మొత్తమునకు మించినచో, అవి తమ సిఫార్సులతోపాటు దానిని ప్రభుత్వము వారికి పంపవచ్చును. ప్రభుత్వము వారు దానిని నిరాకరించవచ్చును లేక పూర్తిగాగాని, కొన్ని మార్పులు చేసిగాని మంజూరు చేయవచ్చును.

2. ఎట్టి నిర్మాణముగాని లేక పథకముగాని అది మార్పులతోగాని, మార్పు లేకుండాగాని సందర్భానుసారముగా జిల్లా పరిషత్ యొక్క తద్విషయ పరిశీలక సమితి మరియు ఐదవ స్థాయీ సమితిచే ప్రభుత్వమువారిచే మంజూరు చేయబడునంత వరకు ప్రారంభింపబడరాదు

3. పైన చెప్పబడిన విధముగా మంజూరు చేయబడిన వ్యయపు లేక ఖర్చు పద్దులోగాని అధికారము గలవారికి మంజూరు లభించనిదే ఎట్టి పెద్ద మార్పుగాని చేయబడరాదు.

4. పంచాయతీ సమితి తరపున ఏ అధికారిగాని ఏదైన వ్యయము లేక ఖర్చును దానకొరకు పంచాయతీ సమితి యొక్క మంజూరైన బడ్జెటులో తగు నిధులు కేటాయింపబడిననే తప్ప చేయరాదు.

## 43. జిల్లా పరిషత్తు చేపట్టిన నిర్మాణములను, పథకములను మంజూరుచేయు అధికారములను నిర్ణయించు నియమావళి

1. జిల్లా పరిషత్తు చేపట్టిన నిర్మాణముల యొక్కయు, పథకముల యొక్కయు మొత్తము వ్యయము లేక ఖర్చు దిగువ పట్టీయందు (1) వ కాలములో పేర్కొనబడిన పద్దులకు ఎదురుగా వరుసగా (2), (3), (4), (5) కాలములలో పేర్కొనబడినంతగా వున్న సందర్భములో వాటి విషయమున పరిపాలనా సంబంధముగాను, ఆర్థిక సంబంధముగాను మంజూరు నిచ్చుటకు జిల్లా పరిషత్ కార్యదర్శి, జిల్లా పరిషత్తు స్థాయీ సమితులు జిల్లా పరిషత్ రాజ్య ప్రభుత్వము అధికారము కలిగి వుండవలెను.

18)

## ప ట్టి క

| పద్దు | జిల్లా పరిషత్తు కార్యదర్శి | జిల్లా పరిషత్తు యొక్క ద్వితీయ పరిశీలక సమితి, మరియు ఐదవ స్థాయీ సమితి. | జిల్లా పరిషత్ | ప్రభుత్వము. |
|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 |
| (i) నిర్మాణముల విషయములో పరిపాలనా సంబంధమైన మరియు ఆర్థిక సంబంధమైన మంజూరు నిచ్చుటకు | | | | |
| (ఏ) అనావృత్తి వ్యయము ఒక్కొక్క పద్దుకు | రూ, 500 లు అంతకులోపు | రూ. 500 లకు పైన రూ. 50,000 లకు లోపు | రూ, 50,000 లకు పైన రూ, 1,00,000 కు లోపు | లక్ష రూపాయలకు పైన |
| (బి) ఆవృత్తి వ్యయము ఒక్కొక్క పద్దుకు | | రూ. 10,000 లు అంతకు లోపు. | రూ. 10,000 లకు పైన రూ. 20,000 లకు, లోపు | రూ, 20,000 లకు పైన |

| (1) | (2) | (3) | (4) | (5) |
| --- | --- | --- | --- | --- |
| (ii) ప్రతి పథకము విషయములోను గ్రాంట్సు లేక ఎయిడ్లు మంజూరుకు | | | | |
| (ఎ) అనావృత్తి | | రూ. 10,000 లు అంతకు లోపు | రూ. 10,000 లకు పైన, 20,000 లకు లోపు | రూ. 20,000 లకు పైన |
| (బి) ఆవృత్తి | | రూ. 25,000 లు అంతకు లోపు | రూ. 25,000 లకు పైన, రూ. 10,000 లకు లోపు | రూ. 10,000 లకు పైన |
| (iii) వివరమైన అంచనాలు లేకుండానే సహాయ నిర్మాణం లేక పథకము ఒక్కొక్క దానికి అనావృత్తి వ్యయమును మంజూరు చేయుటకు | | రూ. 3,000 లు అంతకు లోపు | | |

అయితే—

(ఎ) కార్యదర్శి మంజూరు చేసిన ప్రతివ్యయపు లేక ఖర్చు పద్దు తద్విషయ పరిశీలక సమితి మరియు ఐదవ స్థాయీ సమితి యెదుటను, ఏదైన స్థాయీ సమితి మంజూరు చేసిన పద్దు జిల్లా పరిషత్తు ఎదుట వాటి ఎరుక నిమిత్తము పంపబడవలెను.

(బి) జిల్లా పరిషత్తుయొక్క ఏదైన స్థాయీ సమితి నిరాకరించిన ఏదైన వ్యయపు లేక ఖర్చు పద్దును పరిశీలించుటకును, అది ప్రజలకు ఉపయోగకారిగా వుండగలదని భావించినచో దానిని మంజూరు చేయుటకు జిల్లా పరిషత్తు అధికారము కలిగియుండవలెను.

(సి) తద్విషయ పరిశీలక సమితి మరియు ఐదవ స్థాయీ సమితి పట్టీ యొక్క (3) వ కాలములో నిర్దిష్ట పరుపబడిన గరిష్ట మొత్తమును మించినట్టి ప్రతి వ్యయపు లేక ఖర్చు పద్దును పరిశీలించి తమ సిఫార్సులతోపాటు దానిని జిల్లా పరిషత్తు యెదుట వుంచవలెను.

(డి) జిల్లా పరిషత్తు తన యెదుట వుంచబడిన వ్యయపు లేక ఖర్చు పద్దును పరిశీలించవలెను. ఆ పద్దు (4) వ కాలములో నిర్దిష్ట పరుపబడిన మొత్తమును మించనిదైనచో, జిల్లా పరిషత్తు దానిని నిరాకరింపవచ్చును లేక పూర్తిగాగాని కొన్ని మార్పులు చేసిగాని మంజూరు చేయవచ్చును :

(ఇ) జిల్లా పరిషత్తు యెదుట వుంచబడిన వ్యయపు లేక ఖర్చు పద్దు (4) వ కాలములో నిర్దిష్ట పరుపబడిన గరిష్ట మొత్తమును మించినదైనచో జిల్లా పరిషత్ దానిపై తన నివేదికతోపాటు దానిని మంజూరు నిమిత్తము ప్రభుత్వమువారికి పంపవలెను.

2. ఏదైన వ్యయపు లేక ఖర్చుపద్దు మంజూరు నిమిత్తము ప్రభుత్వము వారికి సమర్పింపబడినప్పుడు—

(i) ప్రభుత్వమువారు దానిని నిరాకరించవచ్చును లేక దానిని పూర్తిగా గాని కొన్ని మార్పులు చేసిగాని మంజూరు చేయవచ్చును ;

(ii) ఏ నిర్మాణము లేక పథకము గాని మార్పులతోను లేక మార్పులు లేకుండ ప్రభుత్వము వారిచే మంజూరు చేయబడునంతవరకు ప్రారంభింప బడరాదు.

(iii) పై రీతిగా మంజూరు చేయబడిన ఏ వ్యయపు లేక ఖర్చు పద్దులో గాని అధికారము గలవారి మంజూరు లభించనిదే ఎట్టి పెద్ద మార్పుగాని చేయ బడరాదు.

3. జిల్లా పరిషత్తు తరపున ఏ అధికారిగాని ఏదైన వ్యయము లేక ఖర్చును, దానికొరకు జిల్లా పరిషత్తు యొక్క మంజూరయిన బడ్జెటులో తగు నిధులు కేటాయింపబడిననే తప్ప చేయరాదు.

## 44. ప్రొసీడింగుల యొక్క గాని, రికార్డులయొక్క గాని ప్రతుల మంజూరీకి సంబంధించిన నియమావళి

1. పంచాయతీ సమితి/జిల్లా పరిషత్తు లేక స్థాయీ సమితి ప్రొసీడింగుల యొక్క గాని, రికార్డులయొక్క గాని నకళ్ళను లేక భాగములను కోరు వ్యక్తి (తన పూర్తి పేరు, చిరునామా, ప్రొసీడింగుల లేక రికార్డుల వివరములను వీలైనంతవరకు సరిగా తెలుపుచు) సందర్భమునుబట్టి బ్లాకు అభివృద్ధి అధికారి/కార్యదర్శికి దరఖాస్తు పెట్టుకొనవలెను. ఏ ప్రొసీడింగుల నకళ్లు లేక ఏ రికార్డు భాగములు కోరబడినవో ఆ ప్రొసీడింగులు లేక రికార్డులు జరుగుచున్న సంవత్సరమునకు పూర్వము ఏదైన ఒక సంవత్సరమునకు సంబంధించినవైనచో, దిగువ నిర్దిష్ట పరుపబడిన స్కేలు ప్రకారము వెదకుడు రుసుమును, దరఖాస్తు స్వీకరింపబడిన వెంటనే పంచాయతీ సమితి/జిల్లా పరిషత్తుకు జమకట్టవలెను.

(ఎ) ఏదేని ఒక సంవత్సరపు రికార్డులు వెదకుటకు ఒక పత్రమునకు లేక నమోదుకు 50 నయా పైసలు.

((బి) ప్రతి అదనపు సంవత్సరము యొక్క రికార్డులను వెదకుటకు, 30 నయాపైసలు.

గమనిక:— (1) ఏ ప్రొసీడింగు లేక రికార్డుయొక్క నకలు లేక భాగము కావలెనో అట్టి ప్రతి ప్రొసీడింగు లేక రికార్డు విషయములోను విడిగా దరఖాస్తును సమర్పింప పనిలేదు.

(2) లెక్కలకు, అకౌంట్లకు లేక ఇతర పత్రములకుగల ఎంక్లోజర్లు ఎనెక్చెర్లు, అవి ఏ పత్రములకు సంబంధించినట్టివో ఆ పత్రముల భాగముగా యుండును వెదకు కార్యము నిమిత్తము ప్రత్యేక పత్రములుగా లెక్కింప బడరాదు.

2. రికార్డు దొరకనిచో చెల్లింపబడిన రుసుము వాపసు చేయబడరాదు. కాని కోరబడిన పత్రము దొరుకలేదని తెలుపు సర్టిఫికేటు దరఖాస్తుదారునకు అందజేయబడవలెను,

3. (1) రికార్డు దొరికి, బ్లాకు అభివృద్ధి అధికారి / కార్యదర్శి దాని నకళ్ళను లేక భాగములను మంజూరుచేయ నిశ్చయించినచో, దరఖాస్తుదారు ప్రతి 360 (మూడు వందల అరువది) మాటలకు లేక అందలి భాగమునకు ఒక రూపాయి చొప్పున రుసుము నగదు రూపములో డిపాజిటు చేయవలెను.

(2) రిజిష్టర్లనుండి అంకెలను నకలు తీయవలసిన స్టేటుమెంట్లు లేక భాగముల విషయములో ఐదు అంకెలు ఒక మాటగా పరిగణింపబడవలెను.

(3) మ్యాపులు లేక ప్లానుల సందర్భములో బ్లాకు అభివృద్ధి అధికారి/ కార్యదర్శి పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తు పనులపై అజమాయిషీ వహించు ఇంజనీరింగు సిబ్బందిని సంప్రదించిన మీదట పటబైన రుసుమును నిర్ణయింపవలెను,

4. బ్లాకు అభివృద్ధి అధికారి / కార్యదర్శి ప్రొసీడింగు లేక రికార్డుల యొక్క నకలు లేక భాగముకొరకు విధింపబడు రుసుములను గురించి దరఖాస్తుదారునకు తెలియజేయవలెను. ఆయన రుసుము అందిన మీదట నకళ్ళను, భాగములను లేక ట్రేసింగులను తయారుచేయించవలెను. తరువాత కార్యాలయములో పరిశీలన మీదట ఆయన ఆ నకళ్ళు లేక భాగములు యదార్థమైనవని సర్టిఫై చేయవలెను. అవి దరఖాస్తుదారు వానిని తీసికొను నిమిత్తము స్వయముగా హాజరైనచో ఆయనకు అందజేయబడవలెను లేక దరఖాస్తుదారు అందు నిమిత్తము అవసరమైన తపాలా బిళ్ళలను డిపాజిటు చేసినచో ఆయనకు పోస్టుద్వారా పంపబడవలెను,

5. బ్లాకు అభివృద్ధి అధికారిచే కార్యదర్శిచే లేక ఇందు నిమిత్తమై ఆయనచే అధీకృతుడైన ఎవరేని వ్యక్తిచే సంతకము చేయబడిన రసీదు వెదకుడు రుసుములను లేక నకలు తీయుటకైన రుసుములను డిపాజిటు చేయు ప్రతి వ్యక్తికి అందజేయ బడవలెను.

6. బ్లాకు అభివృద్ధి అధికారి, కార్యదర్శి ఏదేని ప్రొసీడింగు లేక రికార్డు యొక్క నకలును లేక భాగమును మంజూరు చేయుట ఆక్షేపణీయమని భావించినచో ఆయన కారణములను సంగ్రహముగా వ్రాసి దరఖాస్తును నిరాకరించ వచ్చును.

## 45. వస్తువులు, సరకులు, సర్వీసుల సరఫరా కొరకు కంట్రాక్టులకు సంబంధించిన నియమావళి.

1. పనుల నిర్వహణకు సంబంధించినట్టివి కాక ఇతరమైన వస్తువులు, సరకులు లేక సర్వీసుల విషయములో, పంచాయతీ సమితి, జిల్లా పరిషత్ 1,000 రూపాయలకు మించకుండ ఎంత పరిమితివరకు టెండర్లు కోరబడ నవసరములేదో నిర్ణయించ వచ్చును. టెండర్లు కోరబడినప్పుడు అవి బ్లాకు అభివృద్ధి అధికారిచే, కార్యదర్శిచే ఒక పట్టీగా వ్రాయబడి పరిశీలింపబడవలెను. తరువాత ఉత్తరువులకొరకు ఆయన సిఫార్సులతోపాటు, పంచాయతీ సమితి జిల్లా పరిషత్తు సమక్షములో ఉంచబడవలెను.

2. సాధారణముగా, అన్నిటికంటె తక్కువ టెండరు అంగీకరింప బడవలెను. తగు కారణములపై అన్నిటికంటె తక్కువ టెండరును అంగీకరించుట అవాంఛనీయమని భావింపబడినపుడు అట్టి కారణము స్పష్టముగా వ్రాసి యుంచబడి ఆడిటు కార్యములకొరకు అందుబాటులో ఉంచబడవలెను.

గమనిక:—అన్నిటికంటె తక్కువ టెండరు, ఒకటికంటె ఎక్కువ వస్తువులకు ఉదాహరణకు-స్టేషనరి వస్తువులకు-సంబంధించినదైన యెడల, అట్టి టెండరు చేయబడిన ధరలు ప్రతి వస్తువు విషయములో వేరువేరుగా లేక వస్తువులన్నింటిని కలిపి లేక వస్తువుల నిర్దిష్ట సముదాయములను బట్టి, పరిశీలింపబడ వచ్చును; అయితే వీటిలో ఏ పద్ధతిపైనైనను అన్నిటికంటె తక్కువగా టెండరు అంగీకరింపబడునని పంచాయతీ సమితి / జిల్లా పరిషత్

యొక్క ఉద్దేశము టెండరు నోటీసుతో స్పష్టముగా తెలుపబడి ఉండవలెను. వస్తువు లన్నింటిని కలిపి లేక వస్తువుల సముదాయమును బట్టి టెండరు పరిశీలింపబడినచో, సందర్భానుసారముగా, వస్తువులన్నింటి ధర లేక ప్రతి సముదాయములోని వస్తువులన్నింటిధర, ప్రతి టెండరులో ఈయబడిన ధరల ప్రకారము గుణించబడవలెను. తీసుకొనుటకు ఉద్దేశింపబడిన బహుశః అవసరము కాగల వస్తువులన్నింటి యొక్క వెరశి ధర అన్నిటికంటె తక్కువ ఏ టెండరు విషయములో వుండునో, ఆ టెండరు అన్నిటికంటె తక్కువ టెండరుగా ఉండును.

3. వస్తువులను సరఫరా చేయుటకు సంబంధించి టెండరుదారు యొక్క శక్తి మరియు నిజాయితీ విషయము తెలియని యెడల లేక సందేహాస్పదముగా ఉన్నయెడల, ఆయన టెండరు తప్పక త్రోసివేయబడు నవసరము లేదు; కాని, పంచాయతీ సమితి/జిల్లా పరిషత్ అవసరమని భావించు అదనపు హామీ టెంటరుదారునుండి తీసికొనబడవలెను.

4. అన్నిటికంటె తక్కువ టెండరు త్రోసివేయబడినపుడు, దాని తరువాత ఎక్కువదిగా ఉండు టెండరు:— దానిని కూడ త్రోసివేయుటకు తగు కారణములు నిర్ణీతమగు రిజిష్టరులో వ్రాయబడిననే తప్ప — అంగీకరింపబడవలెను.

5. ఏ సందర్భములోను, ఏ టెండరుగాని అట్టి టెండరులో నిర్దిష్ట పరుపబడిన రేట్ల ప్రకారము కాక వేరే రేట్ల ప్రకారము అంగీకరించ బడరాదు.

6. టెండరు తెరువబడిన తరువాత వాటిని పరిష్కారము చేయుటలో ఎట్టి అవసరమైన ఆలస్యము చేయబడరాదు.

7. (1) టెండర్లు, బ్లాకు అభివృద్ధి అధికారి/కార్యదర్శిచే సీలు చేయబడిన కవరులో ఉండవలెననియు సాధ్యమైనంత మేరకు ఎక్కువ బహిరంగముగను అందరికి ఎరుక అగునట్లుగను, తరచు ఈ క్రింద తెలిపిన విధముగను కోరబడవలెను:-

(ఎ) జిల్లా భాష లేక భాషలలో నోటీసును పంచాయతీ సమితి/జిల్లా పరిషత్ కార్యాలయములోను బ్లాకు అభివృద్ధి అధికారి, కార్యదర్శి యుక్తమని భావించు ఇతర స్థలములలోను అంటించుట ;

(బి) వస్తువుల ధర రూ. 1,000 కి మించి యుండునని తలంచబడి నపుడు, జిల్లాలో ప్రచార మందున్న కనీసము ఒక వార్తా పత్రికలోనైనను ప్రకటించుట,

(2) ఉప నియమము (1) ననుసరించి ప్రకటించిన ప్రతి నోటీసు లేక ప్రకటనలో ఇతర విషయములతో పాటు ఈ క్రింది విషయము తెలుపబడ వలెను ;—

(ఎ) వివిధ రకముల వస్తువులయొక్క పరిమాణములు నోటీసు లేక ప్రకటనలోనే వివరముగా యీయబడజాలనిచో అట్టి పరిమాణముల షెడ్యూలు యొక్క ప్రతి ఏ షరతుల క్రింద, ఏ అధికారినుండి దానికి ఏదైన ధర ఉన్నచో ఏ ధరకు పొందబడవచ్చునో ; అవి :

(బి) టెండరు ఇదమిద్ధమైన ఏ నమూనాలో చేయబడవలెనో ఆ నమూనా అనగా, వివిధ వస్తువుల విషయములో ధరలు తెలుపబడవలెనో, టెండరు విలువలో గల వ్యత్యాసము పరిమాణముల షెడ్యూలులో తెలుపబడిన ప్రతి వస్తువు విషయములో వేరువేరుగా పరిశీలించబడునా లేక అట్టి అన్ని వస్తువులను కలిపి లేదా అట్టి వస్తువుల సముదాయమునకు ధరలు తెలుపబడ వలెనా ;

(సి) టెండర్లను దాఖలు చేయుటకు సమయము, స్థలము, అట్టి సమయము పంచాయతీ సమితి/జిల్లా పరిషత్ యొక్క కార్యాలయములో నోటీసు ప్రకటింపబడిన తేదీ నుండి లేక (1) వ ఉప నియమము (బి) ఖండము క్రింద ప్రకటన చేయబడు సందర్భములో వార్తా పత్రికలో మొదటి సారిగా ప్రకటన చేయబడిన తేదీ నుండి కనీసము పది దినముల వ్యవధి వుండునట్లు నిర్ణయింప బడవలెను ;

(డి) టెండర్లను తెరచుటకు సమయము, స్థలము ;

(ఇ) టెండరుతో పంపబడవలసిన ఎర్నెస్టు పైకము : టెండరు అంగీకరింపబడుచో చెల్లింపబడవలసిన ధరావతు పైకము మరియు దాని స్వభావము ;

(ఎఫ్) టెండరును అంగీకరించుటకు అర్హమైన అధికారి ;

(జి) టెండరును అంగీకరించుటకు అర్హమైన అధికారి ఎట్టి కారణములు లేకుండనే ఏవేని లేక అన్ని టెండర్లను త్రోసివేయుటకు హక్కు కలిగియుండురని ;

(హెచ్) ఒక టెండరుదారు, సముచితమైన కారణములు లేకుండనే తన టెండరును ఉపసంహరించుకొనినచో—(ఈ విషయము టెండరును అంగీకరించుటకు అర్హమైన అధికారిచే నిర్ణయించబడవలెను)— ఆయన తరువాత పెట్టుకొను టెండర్లు సత్వరము త్రోసివేయబడునని ;

8. ఈ నియమావళిలోనున్న దేదియు ఈ క్రింద తెలిపిన వాటి కొనుగోలునకు వర్తించకూడదు—

(i) భారత స్టోర్ల శాఖద్వారా స్టోర్లు ;

(ii) మాజీ సైనికుల పునరావాసము నిమిత్తము ప్రభుత్వమువారిచే స్థాపించబడిన లోహము, కలప పరిశ్రమల ఫ్యాక్టరీల నుండి వస్తువులు ;

(iii) కన్సర్వెన్సీ తదితర కార్యముల కొరకు ఎద్దులు ;

(iv) ప్రభుత్వ ఉత్తరువులపై జారీ చేయబడిన పర్మిటు ద్వారా లేక ప్రభుత్వ ఏజంట్ల ద్వారా కంట్రోలు ధర ప్రకారము కంట్రోలు వస్తువులు ;

(v) సెకండరీ పాఠశాలలలో ఏర్పాటు చేయబడిన అధ్యయనాంశముల పాఠ్యక్రమములో సూచింపబడిన సామగ్రి వస్తువులు ;

(vi) సెకండరీ పాఠశాలలలోని చేతిపని శిక్షణ విభాగములకు అవసరమైన వస్తువులు ;

(vii) పెట్రోలు పంపిణీ సరఫరా కొరకు ఏర్పాటు చేయబడిన ప్రామాణిక సంస్థల నుండి లేక వారి అధీకృత ఏజంట్ల నుండి, ప్రస్తుతము అమలులోనున్న రేట్ల చొప్పున పెట్రోలు ;

(viii) జైళ్ళనుండి కొనుగోలు చేయబడిన వస్తువులు ;

(ix) మెడికలు స్టోర్ల శాఖద్వారా పొందబడిన మందులు ;

(x) పంచాయతీ సమితులచే జిల్లా పరిషత్‌చే నెలకొల్పబడినట్టియు వారికి చెందినట్టియు ఉత్పత్తి కేంద్రములనుండి పొందబడిన వస్తువులు.

(xi) బ్లాకులలో గవర్నమెంటుచే నెలకొల్పబడిన ట్రయినింగు-ఉత్పత్తి (Training-Cum-Production Centres) కేంద్రముల నుండి పొందబడిన వస్తువులు.

9. ఈ నియమావళిలో ఏమి యున్నను, తగు కారణములను పురస్కరించుకొని ప్రభుత్వమువారు, పంచాయతీ సమితి, జిల్లా పరిషత్ ఏదేని ప్రత్యేక సందర్భములో లేక ఏదేని రకపు సందర్భములలో టెండర్లు కోరకుండుటకు అనుమతించవచ్చును లేక ఈ నియమావళిలో గల ఏవేని నిబంధనలను పాటించకుండుటను క్షమించవచ్చును,

## 46. రాబట్టుకొనుటకు వీలులేని పన్నులు, రుసుములు మున్నగువాటిని మాఫీ (write off) జేయు అధికారములను నిర్ణయించు నియమావళి

పంచాయతీ సమితి యొక్క స్థాయీ సమితియు పంచాయతీ సమితియు, జిల్లా పరిషత్ యొక్క స్థాయీ సమితియు జిల్లా పరిషత్‌ను ఆ పంచాయితీకి, జిల్లా పరిషత్‌కు ఒప్పందము ననుసరించిగాని ఇతర విధముగా గాని రావలసి యుండి, రాబట్టుకొనుటకు వీలులేని పన్ను, రుసుము లేక ఇతర మొత్తమును ఈ క్రింది నిర్బంధములకును, నియంత్రణకును లోబడి మాఫీ చేయుటకు అధికారము కలిగి యుండవలెను.

(1) పన్నులు, రుసుములు మున్నగువాటిని వసూలుచేయు పని ఒక ఏజన్సీకి అప్పగింపబడినపుడు, రాబట్టుకొనుటకు వీలులేదని కనుగొనబడిన మొత్తములు, అందుకు గల కారణములతో సహా అట్లు వసూలుజేయు ఏజన్సీచే నివేదింపబడివలెను, బ్లాకు అభివృద్ధి అధికారి, కార్యదర్శి వాటిని సరిచూడవలెను. అట్టి మొత్తములన్నిటి జాబితా ఒకటి, మూడు మాసముల కొకసారి తయారు చేయబడి ఆ పద్దులను మాఫీ చేయుటకు బ్లాకు అభివృద్ధి అధికారి, కార్యదర్శిచే చూపబడిన కారణములు, చేయబడిన సిఫారసులతోసహా, పంచాయతీ సమితి, జిల్లాపరిషత్ యొక్క సంబంధించిన విషయ పరిశీలనా సమితి, 5వ స్థాయీ సమితి సమక్షములో దాని తరువాతి సమావేశములో మంజూరు నిమిత్తము సమర్పింపబడవలెను, ఏదైన స్థాయీ సమితిచే మంజూరు చేయ

బడిన పద్దుల జాబితా పంచాయతీ సమితి, జిల్లా పరిషత్‌కు ఎరుక నిమిత్తము దాని సమక్షములో ఉంచబడవలెను.

(2) పంచాయతీ సమితి, జిల్లా పరిషత్ యొక్క ఏదైన స్థాయీ సమితిచే త్రోసివేయబడిన ఏదేని పద్దును పునఃపరిశీలించుటకును, ఉచితమని భావించినచో ఆ పద్దును మాఫీ చేయుటకునుపంచాయతీ సమితి, జిల్లా పరిషత్ అధికారములు కలిగివుండవలెను.

(3) పంచాయతీ సమితి, జిల్లా పరిషత్తుయొక్క సంబంధించిన విషయ పరిశీలనా సమితి, ర్వ స్థాయీ సమితి మొదట (7)వ ఉప నియమములో నిర్దిష్టపరుపబడిన గరిష్ట పరిమితులను మించు ప్రతి పద్దును పరిశీలించి దాని సిఫారసులతో సహా పంచాయతీ సమితి, జిల్లా పరిషత్తు సమక్షములో ఉంచవలెను. పంచాయతీ సమితి, జిల్లా పరిషత్తు దాని సమక్షమున ఉంచబడిన అట్టి పద్దును పరిశీలించి అట్టి మొత్తమును లేక మొత్తములను మాఫీ చేయవలసినదిగా కోరుచు దానిని, పంచాయతీ సమితి విషయములో జిల్లా పరిషత్తుకు జిల్లా పరిషత్తు విషయములో ప్రభుత్వము వారికి పంపించవలెను.

(4) బ్లాకు అభివృద్ధి అధికారి, కార్యదర్శి, అట్టి మొత్తము మాఫీ చేయుటకు పంచాయతీ సమితి, జిల్లా పరిషత్ యొక్క స్థాయీ సమితికి సిఫారసు చేయుటకు ముందు తన అధికార క్షేత్రములోపల ఆ బాకీదారుకు జప్తి చేయదగు ఎట్టి ఆస్తిగాని లేదనియు, వసూలు చేయుటకు అన్ని మార్గములు ఉపయోగింపబడి విఫలమైన వనియు నిర్ధారణ చేసికొనవలెను.

(5) కొన్ని పద్దులను మాఫీ చేయుటకు, అర్హమైన అధికారవర్గముచే మంజూరు చేయబడిన పిదప, ఆ పద్దులు ఒక రిజిష్టరులో వ్రాయబడవలెను. పన్ను, రుసుము లేక ఇతర మొత్తము యొక్క స్వభావము (పన్నుకు చెందిన పద్దుల విషయములో అసెస్మెంటు నెంబరు కూడ.) మాఫీ చేయబడిన మొత్తము, అది ఏ కాలమునకు సంబంధించనదో ఆ కాలమునకు సంబంధించిన వివరములు సవిస్తరముగా మినిట్సు పుస్తకములో నమోదు చేయబడవలెను. పంచాయతీ సమితి, జిల్లా పరిషత్ మాఫీల రిజిష్టరులోని క్రమసంఖ్య యొక్క రిఫరెన్సు మాత్రమే ఇచ్చుటకు సరిపోవునని భావించినచో అట్లు చేయవచ్చును, ఈ రెండు సందర్భములలోను ప్రతిసారి మాఫీ చేయుటకు అధికామీయబడిన వెరశి మొత్తము అక్షరములలో వ్రాయబడవలెను.

(6) మాఫీ చేయబడిన పన్నులు, రుసుములు లేక ఇతర మొత్తముల యొక్క బిల్లులపైనను వారంటులపైనను (అసలు ప్రతి, ఎదురు ప్రతి రెండింటిపైకూడ) మాఫీ నిమిత్తము మంజూరు యీయబడిన తరువాత సాధ్యమైనంత త్వరలో, "మాఫీ చేయబడినది" అని స్టాంపు వేయబడి, అప్పుడే డిమాండు రిజిష్టర్లలో అవసరమైన నమోదులు కూడ వ్రాయబడ వలెను.

(7) రాబట్టుకొనుటకు వీలులేదని మాఫీ చేయబడు ఏదేని పన్ను, రుసుము లేక ఇతర మొత్తము యొక్క ఏదైన ఒక పద్దు ఏదేని పంచాయతీ సమితి, జిల్లా పరిషత్ యొక్క స్థాయీ సమితి విషయములో రూ. 250 లకు మించి వున్నపుడు పంచాయతీ సమితి, జిల్లా పరిషత్ యొక్క మంజూరి పొంద బడవలెను; పంచాయతీ సమితి, జిల్లా పరిషత్ విషయములో అది 500 రూపాయలకు మించి యున్నప్పుడు 1000 రూపాయల వరకు స్థానిక పరిపాలన ఇనస్పెక్టర్ జనరల్ యొక్క మంజూరి, అంత కెక్కువ ఉన్నప్పుడు ప్రభుత్వమువారి మంజూరి పొందబడవలెను.

## 47. కౌలుదార్లకు, కంట్రాక్టర్లకు శిస్తు మాఫీ మంజూరుచేయు అధికారమును నిర్ణయించు నియమావళి

1. పంచాయతీ సమితియొక్క స్థాయీ సంఘమున్న పంచాయతీ సమితి యున్నూ, జిల్లా పరిషత్ యొక్క స్థాయీ సంఘమున్నూ, జిల్లా పరిషత్తున్నూ, కౌలుదార్లకు, కంట్రాక్టర్లకు శిస్తును మాఫీచేసే అధికారము కలిగియుండవలెను. శిస్తు మాఫీ చేయవలసిన సందర్భముల నన్నిటిని బ్లాకు అభివృద్ధి అధికారి, కార్యదర్శి అందుకు గల కారణములతో సహా నివేదింపవలయును. అట్టి సందర్భములన్నిటి యొక్కయు జాబితా ఒకటి తయారు చేయబడి శిస్తు మాఫీ విషయమున బ్లాకు అభివృద్ధి అధికారి, కార్యదర్శి తెలిపెడి కారణములు, సిఫారసులతో సహా అది మొదట అందుకు సంబంధించిన స్థాయీ సంఘము ముందుంచబడవలయును అటు పిమ్మట పన్ను విధింపు ఆర్థిక విషయముల స్థాయీ సంఘము ముందు దాని తరువాత సమావేశములో వుంచబడవలయును. ఏ స్థాయీ సంఘము చేతనైనను, తన అధికారములకు లోబడి మంజూరు చేయబడినట్టి సందర్భములనన్నిటిని పంచాయతీ సమితి, జిల్లా పరిషత్ ముందు ఎరుక కొరకు వుంచబడవలయును.

2. కౌలుదార్లకు, కంట్రాక్టర్లకు మాఫీ మంజూరుచేయుట ఈ క్రింద పరిమితులకు, హద్దులకు లోబడి ఉండవలయును, అవేవనగా—

(ఎ) ముందుగా ఊహించుకొనరాని ఏ అసాధారణ బాహ్య పరిస్థితుల వల్లనో కౌలుదారుగాని కంట్రాక్టరుగాని తన పనిని కొనసాగించ లేక పోయినచో ఉదహరణకు కౌలు కీయబడిన మార్కెటు ఏదేని రోగము ప్రబలుటవల్ల బలవంతముగా మూసివేయబడిన పక్షములో మాత్రమే కౌలుదారునకుగాని కంట్రాక్టరునకు గాని శిస్తు మాఫీ మంజూరు చేయబడవలెను,

(బి) అటువంటి అసాధారణ సందర్భములవల్ల కౌలుదారుగాని, కంట్రాక్టరుగాని తన పనిని కొనసాగించ లేక పోయిన కాలమునకై కౌలు క్రింద లేదా కంట్రాక్టుక్రింద ఎంత మొత్తమైతే చెల్లించబడి వుందో ఆ మొత్తాన్ని మాపు చేయబడిన శిస్తు మొత్తం మించకూడదు.

(సి) శిస్తు మాఫీ విషయములో స్థాయీ సంఘము లేదా పంచాయతీ సమితి, జిల్లా పరిషత్తుకుగల అధికారము ఈ క్రింది పరిమితులకు, హద్దులకు లోబడి ఉండవలయును, అవేవనగా:—

(i) స్థాయీ సంఘం సందర్భంలో అయితే, శిస్తు మాఫీ రెండు వందల ఏభై రూపాయలకు మించి ఉన్నచో, అందుకు పంచాయతీ సమితి, జిల్లా పరిషత్తుయొక్క మంజూరీని పొందవలెను.

(ii) పంచాయతీ సమితి, జిల్లా పరిషత్తు సందర్భంలో శిస్తు మాఫీ వెయ్యి రూపాయలకు మించక అయిదువందలకు మించినచో స్థానిక పరిపాలన ఇనస్పెక్టరు జనరలుగారి పూర్వామోదమును, వెయ్యి రూపాయలకు మించినచో ప్రభుత్వం వారి పూర్వామోదమును పొందవలెను,

(iii) శిస్తు మాఫీ సాధారణంగా ప్రభుత్వము వారికి, స్థానిక సంస్థలకు నష్టదాయకం కనుక, శిస్తు మాఫీ ప్రతిపాదనలు ప్రత్యేక శ్రద్ధతో పరిశీలింపబడవలయును.

3. కౌలులో లేదా కంట్రాక్టులో నిబంధింపబడిన దండనలను ఆ కౌలులో లేక కంట్రాక్టులో గల పరిషత్తుల ప్రకారం ఖచ్చితముగా అమలు పరచవలయును. పంచాయతీ సమితి. జిల్లా పరిషత్తుకు కౌలు లేదా కాంట్రాక్టు క్రింద రావలసియున్న మొత్తం యొక్క వాయిదాలు స్థాయీ సమితి లేదా పంచాయతీ

సమితి, జిల్లా పరిషత్తు అభిప్రాయములో చాలవరకు సక్రమముగానే చెల్లింపబడి, కౌలు లేదా కంట్రాక్టు క్రింద పంచాయతీ సమితి, జిల్లా పరిషత్తుకు రావలసిన మొత్తమంతయు కౌలు లేదా కంట్రాక్టు సంబంధించియుండు కాల పరిమితి అంతమగులోపుగా చెల్లింపబడిన సందర్భములలో తప్ప, కౌలు లేదా కంట్రాక్టు క్రింద పంచాయతీ సమితి, జిల్లా పరిషత్తుకు రావలసిన మొత్తముల ఆలస్యముగా చెల్లించినందుకు విధించు దండనలను మాఫీ చేయకూడదు.

## 48. ఎన్నికలు ఏర్పాటు చేయుటను గురించిన నిబంధనలు భాషాంతరీకరణకు సంబంధించిన నిబంధనలు

ప్రణాళిక, స్థానిక పరిపాలన (సమితి-IV) శాఖ.

జి. ఓ. మిస్. నెం. 47. తేదీ 12—1—1960.

1959 ఆంధ్ర ప్రదేశ్ పంచాయతీ సమితుల జిల్లా పరిషత్‌ల చట్టము (1959లో 35వ ఆంధ్ర ప్రదేశ్ చట్టము) యొక్క 69వ విభాగము (1)వ ఉపవిభాగము ద్వారా లభ్యమైన అధికారములను పురస్కరించుకొని, ఆంధ్ర ప్రదేశ్ గవర్నరుగారు ఇందుమూలముగా పంచాయతీ సమితుల జిల్లా పరిషత్‌ల ఎన్నికలకు సంబంధించిన ఈ క్రింది నియమములను చేయుచున్నారు. అవేవనగా:—

పంచాయతీ సమితుల, జిల్లా పరిషత్‌ల, వాటి స్థాయీ సమితుల ఎన్నికలకు వర్తించు ఎన్నికల నియమావళి అన్వయములో ఏదేని సమస్య ఉత్పన్నమైనచో అది ప్రభుత్వమువారికి నివేదింప బడవలెను, దానిపై ప్రభుత్వమువారి నిర్ణయము అంతిమమై యుండవలెను.

వివరణ.— ఈ విషయము యొక్క కార్యము నిమిత్తము ఎన్నిక నియమావళి అనగా, 24-9-59, 23-10-59 వ తేదీలుగల ఆంధ్ర ప్రదేశ్ గజిటు అసాధారణ సంచిక మొదటి భాగపు నియమావళి అనుబంధములో ప్రచురింపబడి, చట్టముయొక్క 4వ భాగపు (1)వ ఉప విభాగములోని (iii) వ ఖండము, 36వ విభాగపు (3)వ ఉపవిభాగములోని (viii)వ ఖండము, 7 వ విభాగపు (2), (5) ఉప విభాగములు, 37 వ విభాగపు (2), (3)వ ఉప విభాగములు, 14 వ విభాగపు (3)వ ఉప విభాగము, 43 వ ఉప విభాగపు (3) వ ఉప విభాగములోని (ఎ) ఖండము, 22 వ విభాగపు (6)వ ఉపవిభా

గము. 48 వ విభాగపు (5) వ ఉప విభాగము, 36 వ విభాగపు 3 వ ఉప విభాగములోని (ii)వ ఖండముల క్రింద చేయబడిన నియమావళి అని అర్థము.

(2) ప్రభుత్వమువారు తమకు నివేదింపబడిని ఏదేని అట్టి సమస్యపై నిర్ణయము జరుగులోగా లేక సదరు నియమావళికి విరుద్ధముగా ఏదేని ఎన్నిక జరుపబడుచున్నదని లేదా జరుపబడనున్నదని సమాచారము అందిన మీదట ప్రభుత్వమువారు జరుపు ఏదేని విచారణపై అంతిమ ఉత్తర్వులు జారీ చేయులోగా ప్రభుత్వమువారు ఫలితముల ప్రకటనకు ముందు ఏ దశలోనైనను ఎన్నిక ప్రొసీడింగులను నిలుపుదల చేయుచు ఉత్తరువు జేయవలెను. ఈ నియమము క్రింద ప్రభుత్వమువారి వుత్తరవులకు ఉల్లంఘించి జరుపబడిన లేక కొనసాగింపబడిన ఏదేని ఎన్నిక చెల్లరాదు, అది ఏ విధమైన అమలును కలిగియుండరాదు.

(3) ప్రభుత్వమువారిచే అన్యథా ఆదేశింపబడిననే తప్ప, ఈనియమము క్రింద నిలిపి వేయబడిన ఎన్నిక ప్రొసీడింగులు, నిలుపుదల ఉత్తరువులను రద్దయిన మీదట నిర్ణయింపబడు క్రొత్త తేదీలలో నిలిపివేయబడిన దశనుండి కొనసాగింప బడవలయును.

(4) సదరు నియమావళి క్రింద ఎన్నిక నిర్వహణకు ఏదేని ఆటంకము ఏర్పడినచో, ప్రభుత్వమువారు ఉత్తరువు ద్వారా ఏన్నికను సక్రమముగా నిర్వహించుటకు తాము అవసరమని భావించునట్టి ఏ చర్యనైనను ఈ నియమావళికి విరుద్ధము కాకుండా తీసికొనవచ్చును.

## 49. పంచాయతీ సమితుల, జిల్లా పరిషత్తుల ఎన్నికల వివాదముల తీర్పుకు సంబంధించిన నియమములు

### 1 వ భాగము

1. (1) ఇతర విధముగా నిబంధింపబడినట్లు తప్ప, చట్టము క్రింద జరుపబడిన పంచాయతీ సమితియొక్క సభ్యుని, అధ్యక్షుని లేదా ఉపాధ్యక్షుని లేక దాని ఏదేని స్థాయీసమితి సభ్యుని ఎన్నిక (ఇందులో ఇటుపై ఎన్నికైన అభ్యర్థి అని పేర్కొనబడు) ఎన్నికైనట్లు సక్రమముగా ప్రకటింపబడి అభ్యర్థికి ప్రతికూలముగా లేక ఇద్దరు లేక ఎక్కువమంది ఎన్నికైన అభ్యర్థులున్న యెడల వారందరికి లేక వారిలో ఏ ఒకరిపైన ప్రతికూలముగా ఎవరైన అభ్యర్థి

లేక ఎన్నికదారు ఈ నియమముల ననుసరించి ఎన్నిక అర్జీని 2 వ ఉప నియమములో నిర్వచింపబడిన ఎలెక్షను కమీషనరుకు దాఖలు చేసికొనుట ద్వారా తప్ప ఆక్షేపింపబడరాదు.

(2) ఈ క్రిందివారు ఎలెక్షను కమీషనరుగా వుండవలెను :—

(i) (ii) వ ఖండము క్రిందికి వచ్చు సందర్భములలో పంచాయతీ కార్యాలయమున్న ప్రదేశము ప్రాంతీయ అధికారమును కలిగియున్న జిల్లా మునసబు లేక ఒకరికంటె ఎక్కువమంది జిల్లా మునసబులు వున్నయెడల, ప్రధానమైన జిల్లా మునసబు ;

(ii) సామాన్యముగా పంచాయతీ సమితుల విషయములోగాని పంచాయతీ సమితుల యొక్క ఒక వర్గము విషయములోగాని ప్రభుత్వమువారు ఆదేశించినపుడు ఇందు నిమిత్తము పేరుతోగాని పదవిని బట్టిగాని ప్రభుత్వము నిర్ణయించునట్టి ప్రభుత్వ అధికారి లేక అధికారులు అయితే దరఖాస్తు పెట్టుకొనబడిన మీదట, ఎన్నిక అర్జీ.

(ఎ) (i) వ ఖండము క్రింద జిల్లా మునసబుకు దాఖలు చేసికొనబడిన యెడల సంబంధించిన జిల్లా జడ్జిచే ఆయన అధికార క్షేత్రములోని మరొక జిల్లా మునసబునకు.

(బి) (ii) వ ఖండము క్రింద ప్రభుత్వ అధికారికి దాఖలు చేసికొనబడిన యెడల, ప్రభుత్వమువారిచే మరొక ప్రభుత్వాధికారికి బదిలీ చేయబడవచ్చును.

ఒక ఎన్నిక అర్జీ ఆ విధముగా బదిలీ చేయబడినపుడు, అది ఏ అధికారికి బదిలీ చేయబడెనో ఆ అధికారి ఎలెక్షను కమీషనరుగా భావింపబడవలెను.

(3) ఈ నియమముల క్రింద అధికారమును వినియోగించుచున్న ఎలెక్షను కమీషనరు, సందర్భానుసారముగా, జడ్జి లేక ఇతర ప్రభుత్వ అధికారి హోదాలో కాక ఆ ఉద్యోగి హోదాలో అట్టి అధికారమునకు వినియోగించుచున్నట్లు భావింపబడవలెను.

(2) (1) ఎన్నిక అర్జీ ఎన్నిక ఫలితపు ప్రకటన తేదీనుండి పదునైదు దినములలోగా దాఖలు చేయబడవలెను.

వివరణ :—ఎలెక్షను కమీషనరుగా నుండునట్టి జిల్లా మునసబుయొక్క కోర్టు లేక ప్రభుత్వ అధికారి కార్యాలయము పై జెప్పబడిన పదునైదు దినములలో చివరి రోజు మూసియున్న యెడల, అట్టి కోర్టు లేక కార్యాలయము తెరవబడినట్టి తరువాత దినమున ఎలెక్షను కమీషనరుకు ఆ అర్జీ దాఖలు చేయబడవచ్చును.

(2) అర్జీదారు ఆధారమునుబట్టి ముఖ్యవిషయములు, అతడు ఆరోపించినట్టి ఏదైన అవినీతి చర్యయొక్క వివరములు సంగ్రహ రూపమున ఆ అర్జీలో తెలుపబడవలెను మరియు అవసరమైనపుడు, అర్జీ పేరాలుగా విభజింపబడి, వరుసగా అంకె వేయబడవలెను. ఆ అర్జీదారుచే సంతకము చేయబడి 1908. సివిలు ప్రొసీజరు కోడులో వాదనకై నిర్ణయింపబడిన పద్ధతిలో సరిచూడబడవలెను.

3. (1) అర్జీలో ఆరోపింపబడిన అక్రమములు ఎన్నికైన అభ్యర్థులలో ఒకరికన్న ఎక్కువమంది యొక్క ఎన్నిక చెల్లబడిని బహూళ మార్పునెడల అర్జీదారు ఎన్నికైన అట్టి అభ్యర్థులందరిని తన అర్జీకి ప్రతివాదులుగా చేర్చవలెను.

(2) అర్జీదారు సందర్భానుసారముగా, ఎన్నికైన అభ్యర్థియొక్క లేక ఎన్నికైన అభ్యర్థులందరి లేక వారిలో కొందరియొక్క ఎన్నికను ఆక్షేపించుటే కాక తాను కోరినచో తానే లేక మరో ఇతర అభ్యర్థి సక్రమముగా ఎన్నికైనట్లు ప్రకటించవలసినదని కోరవచ్చును. అట్టి సందర్భములో అర్జీదారు ఎన్నికైనా నామనిర్దేశము చేయబడి పోలింగుకు పూర్వము ఉపసంహరించుకొనని ఇతర అభ్యర్థులనందరినీ తన అర్జీకి ప్రతివాదులుగా చేర్చవలెను.

4. (1) అర్జీ దాఖలుచేయు సమయమున అర్జీదారు దాని ఖర్చులకుగాను పూచీగా ఏబది రూపాయల నగదును డిపాజిటు చేయవలెను.

వివరణ :—ఒకరికన్న ఎక్కువమంది ఎన్నికైన అభ్యర్థుల ఎన్నిక ఆక్షేపించబడిన పక్షమున, అట్టి ప్రతి ఎన్నికైన అభ్యర్థి విషయములోను ఒక ప్రత్యేక డిపాజిటు చేయబడవలెను.

(2) (1) ఏ ఉప నియమములోని నిబంధనలు పాటింపబడని యెడల, ఎలక్షను కమీషనరు అర్జీని త్రోసివేయవలెను,

(3) (1) ఉప నియమములోని నిబంధనలు పాటింపబడిన మీదట, ఎలక్షను కమీషనరు, అర్జీని విచారించుట కుపక్రమింపవలెను.

5. ఎలక్షను కమీషనరు సాధ్యమైనంత త్వరగా ప్రతి ప్రతివాదికిని, సంబంధించిన పంచాయతీ సమితియొక్క బ్లాకు అభివృద్ధి అధికారికిని, ఎన్నిక అధికారికినీ అర్జీ ప్రతిని పంపించవలెను. సందర్భానుసారముగా ఎలక్షను కమీషనరు కోర్టు లేక కార్యాలయము యొక్క నోటీసు బోర్డుపైనను, పంచాయతీ సమితి కార్యాలయములోని నోటీసు బోర్డుపైనను కూడ ప్రతులు అంటింపబడ వలెను. ఎలెక్షను కమీషనరు, ఏవైన ఇతర ఖర్చులు చెల్లింపుకుగాను, తాను కోరునట్టి మొత్తమునకు అట్టి పూచీకత్తులతో బాండు వ్రాసి ఈయ వలసినదిగా అర్జీదారును కోరవచ్చును. అట్టి ప్రచురణ తరువాత పదునాలుగు దినముల లోపల ఎప్పుడైనను అదే విధముగా ఏలెక్షను కమీషనరు కోరునట్టి పూచీ కత్తుల నిచ్చిన మీదట ఏ ఇతర అభ్యర్థియైనను ప్రతివాదిగా చేర్చబడుటకు హక్కు కలిగయుండవలెను.

వివరణ:— ఈ నియమముల కార్యముల నిమిత్తము "ఎన్నిక అధికారి" అనగా పంచాయతీ సమితి సభ్యుని, అధ్యక్షుని లేక ఉపాధ్యక్షుని లేక దానియొక్క ఏదైన స్థాయీ సమితి యొక్క సభ్యుని ఎన్నిక నిమిత్తము ఏర్పాటు చేయబడిన సమావేశమునకు అధ్యక్షత వహించు వ్యక్తి అని అర్థము.

6. (1) వీలైనంతవరకు 1908 సివిలు ప్రొసీజరు కోడు క్రింద దావాల విచారణకు వర్తింపగల విధానమునను సరించి, ఎలెక్షను కమీషనరు ప్రతి ఎన్నిక అర్జీని విచారించవలెను.

అయితే ఎలక్షను కమీషనరు తాను పరీక్షించిన ఎవరేని సాక్షిపద్ద సేకరించిన సాక్ష్యపు సారాంశమును మాత్రమే వ్రాసియుంచిన చాలును.

(2) ఎలెక్షను కమీషనరు ఈ క్రింది వ్యవహారముల విషయములో 1908, సివిలు ప్రొసీజరు కోడ్ క్రింద దావాలు విచారించునపుడు కోర్టునకు వున్నట్టి అధికారములను కలిగి యుండును :—

(ఎ) పరిశోధన, తనఖీ,

(బి) సాక్షులు హాజరగునట్లు చేయుట. వారి ఖర్చులక్తై డిపాడిటు కోరుట,

(సి) దస్తావేజుల దాఖలుకై ఒత్తిడి చేయుట,

(డి) ప్రమాణముపై సాక్షుల విచారణ,

(ఇ) అఫిడవిట్టుపై సాక్ష్యమును స్వీకరించుట, మరియు

(ఎఫ్) సాక్షుల విచారణకై తాకీదులను జారీ చేయుట; ఎవరేని వ్యక్తి యొక్క సాక్ష్యము ముఖ్యమైనదని తనకు తోచినపుడు ఆయన అట్టి వ్యక్తిని తనంతట తానే పిలిపించి, పరీక్షింపవచ్చును.

7. (1) ఏ ఎన్నిక అర్జీకాని ఎలెక్షను కమీషనరు అనుమతి లేకుండ ఉపసంహరించుకొన బడరాదు.

(2) ఒకరికన్న ఎక్కువమంది అర్జీదారులున్న యెడల, అర్జీదారు లందరి అంగీకారముతో తప్ప అర్జీని ఉపసంహరణకును దరఖాస్తు పెట్టుకొన బడరాదు.

(3) ఉపసంహరణకై దరఖాస్తు పెట్టుకొన బడినపుడు, దరఖాస్తు విచారణకై తేదీని నిర్ణయించుచు దాని నోటీసు అర్జీకి కక్షిదారులైన వారు అందరికి ఈయబడవలెను. మరియు అది 4వ నియమములో నిర్దేశింపబడిన పద్ధతిలో ప్రచురింపబడవలెను,

(4) ఏదేని ఉపసంహరణ దరఖాస్తు అనుమతింప వీలులేదని తాను భావించునట్టి ఏదేని లావాదేవీ లేక ప్రతిఫలము కారణముగా పెట్టుకొనబడిన దని ఎలక్షను కమీషనరు అభిప్రాయపడిన యెడల, అట్టి దరఖాస్తు ఉప సంహరణ మంజూరు చేయబడరాదు.

(5) దరఖాస్తు మంజూరు చేయబడినచో—

(ఎ) అంతవరకు జరిగిన ప్రతివాదియొక్క ఖర్చులను లేక ఎలక్షను కమీషనరు ఉచితమని తలంచునట్టి అందలి భాగమును చెల్లించ వలసినదిగా అర్జీదారుకు ఉత్తరువు జారీ చేయబడవలెను.

(బి) అట్టి ఉపసంహరణకు సంబంధించిన పంచాయతీ సమితి యొక్క బ్లాకు అభివృద్ధి అధికారికిని, ఎన్నిక అధికారికిని ఎలక్షను కమీషనరుచే తెలియ జేయబడవలెను,

8. విచారణ ఖర్చుల విషయమై ఎలక్షను కమీషనరు చేసిన ఏదైన ఉత్తరువు, అట్టి ఉత్తరువు ద్వారా ఏదైన పైకమును చెల్లించవలసినదిగా ఆదేశింపబడిన యెవరేని వ్యక్తియొక్క నివాస లేక వ్యాపార స్థలము ఏ జిల్లా మునసబు అధికార క్షేత్రపు స్థానిక హద్దులలో వున్నదో ఆ జిల్లా మునసబు కోర్టు సమక్షమున లేక అట్టి స్థలము హైదరాబాదు లేక సికిందరాబాదు నగర హద్దులలో వున్న పక్షమున, హైదరాబాదులో నున్న సిటీ స్మాల్ కాజెస్ కోర్టు సమక్షమున దాఖలు చేయబడవచ్చును మరియు అట్టి కోర్టు ఏదేని దావా సందర్భములో పైకము చెల్లింపు నిమిత్తము ఆ కోర్టు ఇచ్చిన డిక్రీ ఏ పద్ధతిలో మరియు ఏ విధానమున జరుపబడునో ఆ పద్ధతితోను అదే విధానమును అట్టి ఉత్తరువుకు అమలు జరుపవలెను లేక అమలు జరిపించవలెను.

9. ఏదేని ఎన్నిక అర్జీ, అర్జీదారు ఒకరే అయినచో ఆయన అర్జీదారు లనేకులున్నచో వారిలో చివరి వ్యక్తి మరణించిన మీదట రద్దు కావలెను. ఎలక్షను కమీషనరు అట్లు రద్దయిన విషయముకు సంబంధించిన పంచాయతీ సమితి యొక్క బ్లాకు అభివృద్ధి అధికారికిని, ఎన్నిక అధికారికిని తెలియజేయ వలెను.

10. ఒక ఎన్నిక అర్జీ విచారణ సమయమున ఎన్నికైన అభ్యర్థి కాక మరే ఇతర అభ్యర్థియైన ఆ స్థానము తనకు చెందునని వాదించిన యెడల, అట్టి అభ్యర్థి యెన్నికైవుండి ఆ యెన్నికను ఆక్షేపించుచు అర్జీ పెట్టుకొనబడి నచో ఆయన యెన్నిక చెల్లివుండెడిది కాదని నిరూపించు నిమిత్తము ఎన్నికైన అభ్యర్థి లేక అభ్యర్థులు లేక ప్రొసీడింగులలోని మరొక కక్షిదారు సాక్ష్యమీయ వచ్చును.

11. (ఎ) 1860, ఇండియన్ పీనల్ కోడ్‌లోని 9 వ అధ్యాయము లేక ఎన్నిక రహస్యమును భంగపరచుటకు సంబంధించిన ఏదైన శాసనము లేక నియమము క్రిందికి వచ్చు ఏదైన ఎన్నిక నేరమును యెన్నికైన అభ్యర్థి లేక అట్టి అభ్యర్థియొక్క లాలూచీతో ఏ ఇతర వ్యక్తియైన చేసిన లేక చేయుటను ప్రోత్సహించెనని. లేక

(బి) ఈ క్రింది అవినీతి చర్యలలో దేనిద్వారానైన యెన్నికైన అభ్యర్థి యొక్క యెన్నిక జరిగెనని ప్రోత్సహింపబడెనని లేక యెన్నిక ఫలితము యెక్కువగా మార్పు జరిగెనని, అవేవనగా—

(i) 1860, ఇండియను పీనలుకోడుయొక్క 9 (ఎ) అధ్యాయము లేక ఎన్నిక రహస్యమును భంగపరచుటకు సంబంధించిన ఏదైన ఎన్నిక నేరము అది అభ్యర్థి కానట్టి లేక అభ్యర్థి లాలూచీతో వ్యవహరించు వ్యక్తి కాబట్టి వేరొక వ్యక్తిచే చేయబడిన సందర్భములో ;

(ii) ఏ ఎన్నికదారైనను తన ఓటును వేయుటకుగాను ఏదైన స్థలము నుండి లేక ఆ స్థలమునకు తీసికొనిపోవు విషయమై ఏ వ్యక్తికైనను చేయు ఏదైన చెల్లింపు లేక చెల్లింపుకై వాగ్దాన మిచ్చుట ;

(iii) బాడుగపై ఇచ్చుటకై మామూలుగా ఉంచబడిన లేక బాడిగా ద్వారా ప్రయాణీకులను తీసుకొని పోవుటకున్న ఏదైన పడవ, వాహనము లేక జంతువును ఎన్నిక కార్యములకై అద్దెకు తీసికొనుటకు ఏర్పాటు చేయుట, అరువు పుచ్చుకొనుట లేక ఉపయోగించుట :

అయితే, ఓటు వేయునట్టి చోటికి లేక అచ్చటినుండి ఏ ఎన్నికవారైనను తనను తీసికొనిపోవుటకు ఏదైన పడవ, వాహనము లేక జంతువును అద్దెకు తీసికొనవచ్చును లేక తన స్వంత ఆస్తిగా నున్నట్టి ఏదైన పడవను వాహనమును లేక జంతువును వాడుకొనవచ్చును; లేక

(సి) నామనిర్దేశ పత్రము విషయములో ఏదైన క్రమరాహిత్యము వలన లేక నామ నిర్దేశ పత్రము లేక ఓటును తప్పుగా తీసికొనుటచేత లేక నిరాకరించుటచేత లేక చట్టము లేక దాని క్రింద చేయబడిన నియమములలోని నిబంధనలను పాటింపక పోవుటచేత ఎన్నిక ఫలితము ఎక్కువ మార్పు జరిగెనని ఎలక్షను కమీషనరు అభిప్రాయబడినయెడల, ఎన్నికైన అభ్యర్థి ఎన్నికచెల్లనేరదు.

అయితే, ఇందులో ఇటుపై వివరించిన రీతిగా విందు కాకుండా ఏ విధమైన లంచగొండి తనము క్రిందికి రానట్టి ఈ నియమపు (బి) ఖండము లోని నిర్దేశింపబడిన ఏదైన అవినీతి చర్యకు పాల్పడెనని ఎలక్షను కమీషనరు అభిప్రాయ పడిన యెడల మరియు ఈ క్రింది విషయములలో అనగా—

(ఎ) ఆ అభ్యర్థి అట్టి ఎన్నికలో ఎట్టి అవినీతి చర్యకు పాల్పడలేద నియు అవలంబింపబడిన ఏ వేని అవినీతి చర్యకు ఉత్తరువులకు విరుద్ధముగాను

అట్టి అభ్యర్థి యొక్క అనుమతి లేక లాలూచీ లేకుండగనే అవలంబింపబడిన వనియు ;

(బి) అట్టి ఎన్నికలో అవినీతి చర్యలు జరుగకుండా ఉండుటకై అట్టి అభ్యర్థి సబబైన అన్ని చర్యలు తీసికొని యున్నాడని :

(సి) అవలంబింపబడిన అవినీతి చర్యలు అల్పమైనవి, అప్రధానమైనవి మరియు పరిమిత స్వభావము కలవనియు :

(డి) మిగతా అన్ని విధములా ఆ ఎన్నికలో అట్టి అభ్యర్థి పక్షమున ఎట్టి అవినీతి చర్యలు జరగ లేదనియు ;

ఎలక్షను కమీషనరు విశ్వాసము కుదిరిన యెడల ఆయన అట్టి అభ్యర్థి యొక్క ఏన్నిక చెల్లునని నిర్ణయింపవచ్చును.

వివరణ:—ఈ నియమము యొక్క ప్రయోజనమునకై "విందు" అనగా లేక పరోక్షముగా ఎవరేని వ్యక్తిని ఓటు చేయించు లేక చేయకుండ చేయు ఉద్దేశముతో గాని ఓటు చేసి లేక ఓటు చేయుట మానుకొనినందుకు బహుమతిగా గాని ఏ వ్యక్తికైన ఏదైన అహారము, పానీయము, సత్కారము లేక భోజన సామగ్రిని ఇచ్చుటకు లేక సమకూర్చుటకుగాని ఏ వ్యక్తియైన అందుకగు ఖర్చు మొత్తమును లేక కొంత భాగమును చేయుట అని అర్థము.

12. (1) విచారణ ముగిసిన మీదట ఎలక్షను కమీషనరు ఎన్నికైన అభ్యర్థి లేక అభ్యర్థుల ఎన్నిక 11వ నియమము క్రింద చెల్లునో చెల్లదో ప్రకటింప వలెను.

(2) ఆయన ఎన్నికైన అభ్యర్థి లేక అభ్యర్థుల ఎన్నిక చెల్లదని ప్రకటించినచో—

(ఎ) ఈ నియమముల క్రింద ఆ స్థానము తనకు చెందునని వాదించినట్టి అర్జీ యొక్క ఏ ఇతర కక్షిదారైనను సక్రమముగా ఎన్నికైనట్లు ప్రకటించుచు, లేక

(బి) క్రొత్త ఎన్నిక జరగవలెనని ఆయన ఉత్తరువు చేయవలెను.

(3) (1) (2) ఎలెక్షను కమీషనరు యొక్క ఉత్తరువు అంతిమమై ఉండవలెను.

(4) (1) వ ఉప నియమము లేక (2)వ ఉప నియమము క్రింది ప్రతి ఉత్తరువు యొక్క నకలు సంబంధించిన పంచాయతీ సమితి యొక్క బ్లాకు అభివృద్ధి అధికారికిని, ఎన్నికధికారికిని పంపబడవలెను.

13. పై నియమములలోని 12 వ నియమములచే (1) వ ఉప నియమము క్రింద ఎన్నిక చెల్లదని ప్రకటింపబడి ఆ నియమము యొక్క (2) వ ఉప నియమము (బి) ఖండము క్రింద క్రొత్త ఎన్నిక జరుగవలెనని ఉత్తరువు చేయబడినపుడు సందర్భాను సారముగా ఎన్నికైన అభ్యర్థియొక్క స్థానములు ఎలక్షను కమీషనరు యొక్క ఉత్తరువు తేదీ నుంచి ఖాళీగా ఉన్నట్లు భావింపబడవలెను. సంబంధించిన అధికారి అట్టి క్రొత్త ఎన్నికను జరుపుటకై వలయు చర్యలను తక్షణమే తీసికొనవలెను.

## 2 వ భాగము

14. ఈ క్రింది మార్పులకు లోబడి 1వ భాగములోని నిబంధనలు జిల్లా పరిషత్‌కు సంబంధించిన ఎన్నిక వివాదముల, తీర్పుకు కూడ వర్తించగలవు, అవేమనగా:—

(i) "పంచాయతీ సమితి." "అధ్యక్షుడు" "ఉపాధ్యక్షుడు" మరియు "పంచాయతీ సమితి యొక్క బ్లాకు అభివృద్ధి 'అధికారి" అను పదములు ఎక్కడ వచ్చినను ; సందర్భము అన్యథా కోరిననే తప్ప, వాటికి బదులు వరుసగా "జిల్లా పరిషత్" లో '' చైర్మను " ''వైస్ చైర్మను" "జిల్లా పరిషత్ కార్యదర్శి" అను పదములు ఉంచబడవలెను.

(ii) 1వ నియమములోని (2) వ ఉప నియమము (1) వ ఖండమునకు బదులుగా ఈ క్రిందిది ఉంచబడవలెను, అదేమనగా:—

(i). (ii) వ ఖండము క్రిందికి వచ్చు సందర్భములలో జిల్లా యొక్క జిల్లా జడ్జి.

(iii) 2 (1), 8 నియమములో, ''జిల్లా మునసబు" అను పదమునకు బదులు ''జిల్లా జడ్జి" అను పదము ఉండవలెను; మరియు

(iv) 4 (1), నియమములలోని ''ఏబది రూపాయలు"అను మాటలకు బదులు ''నూరు రుపాయలు" అను మాటలు ఉంచబడవలెను.

# 50. పంచాయతీ సమితి కేంద్రమును నిర్ణయించుటకు నిబంధనలు

[జి. ఓ. యమ్. యస్. నెం. 924, ప్లానింగు స్థానిక పరిపాలన (సమితి-I), 28వ జూన్ 1960]

1. పంచాయతీ సమితి కేంద్ర స్థానము ఏ దై యుండవలయునో ఆ గ్రామమును నిర్ణయించుటకు ప్రభుత్వము అర్హతగలిగిన అధికారియై యున్నది.

2. పంచాయతీ సమితి కేంద్ర స్థానము సాధ్యమైనంతవరకు బ్లాకులో మధ్యస్థముగా యుండి, బ్లాకులోని జనమునకు తేలికగా పోవుటకు ఏర్పాటు చేయవలయును.

3. సాధారణముగా తాలూకా కేంద్ర స్థానము బ్లాకులో ఉన్నట్లయిన అది ఆ బ్లాకు యొక్క పంచాయితీ సమితి కేంద్రము స్థానము కూడ అయి యున్నది.

కాని ప్రభుత్వము తగిన, చాలినంత కారణమున్న యెడల, బ్లాకులోని తాలూకా కేంద్రము కాని స్థలములో పంచాయతీ సమితి కేంద్రస్థానము యొక్క ఉనికి నిర్ణయముకు ఉత్తరువు చేయును.

4. 2, 3 నిబంధనలలోని ఏర్పాట్లకు బద్ధమై, పంచాయతీ సమితి కేంద్ర స్థానము ఈ క్రింది వాటి నుద్దేశించి నిర్ణయించబడును.

(ఎ) ఆఫీసు భవనము, సిబ్బంది నివాస స్థలములు నిర్మాణము కొరకు ఐదు ఎకరములు వరకు సదుపాయమైన ప్రభుత్వపు భూమి దొరికి యుండుట లేక అదే వైశాల్యము కలిగిన సదుపాయము గల స్వంతభూమి ఉచిత దానము లేక దాని విలువ విరాళము ;

(బి) స్వయంకృషి నిరూపేణా అభివృద్ధి కార్యకలాపములకు గ్రామములోని జనుల ప్రవర్తన ;

(సి) అధమము మధ్యతరగతి పాఠశాల ప్రమాణము వరకు విద్యా సదుపాయములు దొరికి యుండుట ;

(డి) వైద్య సదుపాయములు దొరికి యుండుట ;

(ఇ) 1500 లకు తక్కువకాని గ్రామ జనాభా ;

(యఫ్) బ్లాకులో యితర గ్రామములకు సామాన్యమైన ప్రమాదకరమైన అంటు వ్యాధికి లోనవని సాధారణ గ్రామ ఆరోగ్య పరిస్థితులు.

(జి) బ్లాకులోని ఎక్కువ తరగతి జనముకు స్థలములోనికి పోవుటకు వీలు.

5. బ్లాకు కేంద్రస్థానమును మార్చదలచినచో, 6వ నిబంధనలో సూచించిన షరతులకు బద్ధమై, పంచాయతీ సమితి, సమావేశమువద్ద హాజరయిన పంచాయతీ సభ్యుల సంఖ్యలో 2, 3 వంతులు ఆమోదించిన తీర్మానముపై, కారణములు తెల్పుచు ఏగ్రామముకు కేంద్రస్థానమును మార్చవలయునో ప్రభుత్వమునకు సిఫార్సు చేయును.

6. 8వ నిబంధనలోని ఏర్పాట్లుకులోనై, పంచాయతీ సమితి కేంద్రస్థానము ఒకమారు నిర్ణయమయినపుడు, ఈ క్రింది కారణములవలన మార్చుటకు వీలులేదు.

(ఎ) ఆఫీసు భవనము లేక సిబ్బంది నివాస స్థలములు నిర్మింపబడినపుడు లేక నిర్మింపబడుచున్నపుడు; లేక

(బి) స్థలము మధ్యస్థలముగాను ప్రాముఖ్యమైనది గాను యున్నప్పుడు; లేక

(సి) ఆఫీసు భవనము లేక సిబ్బంది నివాస స్థలములు నిర్మాణముకు స్వంత భూమి దానము అంగీకరించినపుడు , లేక

(డి) సిబ్బంది కొరకు నివాసస్థలములు లేక ఆఫీసు భవనము నిర్మాణము కొరకు భూమి సేకరింపబడినప్పుడు లేక అట్టి సేకరణకు భూమి సేకరణ అధికారిచే అవార్డు జారీచేయబడి నప్పుడు లేక భూమి సేకరణ అధికారిచే గాని లేక బ్లాక్ డెవలప్‌మెంటు అధికారిచే గాని స్వాధీనము చేసికొనబడినప్పుడు ; లేక

(ఇ) బ్లాకు దాని మొదటి భాగము యొక్క రెండు సంవత్సరములు పూర్తి చేసినప్పుడు ; లేక

(యఫ్) అర్హతగల అధికారి చేసిన కాంట్రాక్టు లేక అగ్రిమెంటు మీద, ఆఫీసు భవనము లేక సిబ్బంది నివాస స్థలములు నిర్మాణమునకు పనులు ఇచ్చినప్పుడు ; లేక

(జి) భూమి విలువ మేరకు విరాళము ప్రజలచే యివ్వబడి, ఆరు మాలములకు పైగా డిపాజిట్టులో వుంచబడినప్పుడు ; లేక

(హెచ్) అనుకొనబడిన కొత్త గ్రామము మంచి స్థలముగాక ఉచిత ముగా భూమిని లేక దాని విలువను యిచ్చుటకు వీలు కలుగజేయనప్పుడు ; లేక

(జె) బ్లాకు కేంద్రము, ప్రాథమిక ఆరోగ్య కేంద్రము ఒకే గ్రామములో యున్నప్పుడు ; లేక

(కె) బ్లాకు కేంద్రము తాలూకా కేంద్ర మయినప్పుడు.

7. ఒక బ్లాకు తిరిగి హద్దులు నిర్ణయించబడినప్పుడు, ప్రభుత్వము తిరిగి హద్దులు నిర్ణయింపబడిన బ్లాకు లేక బ్లాకుల కేంద్రములో ఏ మార్పు లేక మార్పులను ప్రకటించుటకు ముందు, ఆ యా పంచాయతీ సమితి లేక పంచాయతీ సమితులు జిల్లా పరిషత్తుతో సంప్రతించి వారి అభిప్రాయములను ఆలోచనలోనికి తీసికొనును.

8. బ్లాకు యొక్క కేంద్రము మునిసిపాలిటీగా ఏర్పరచ బడినప్పుడు ప్రభుత్వము బ్లాకులో కొత్త స్థలము నిర్ణయింపబడువరకు కేంద్రము ఆ మునిసి పాలిటీతో వుంటునట్లు ఉత్తర్వు చేయవచ్చును ;

కాని మునిసిపాలిటీలో తరువాత నిర్ణయింపబడిన స్థలములో పంచాయతీ సమితి కార్యాలయమునకు లేక సిబ్బంది నివాస స్థలములకు శాశ్వతమైన భవనములు నిర్మింపబడినప్పుడు, ప్రభుత్వము అట్టి స్థలము పంచాయతీ సమితి శాశ్వత కేంద్రముగా వుండునట్లు ఉత్తర్వు చేయవచ్చును.

# 51. పంచాయతీ సమితులు జిల్లా పరిషత్తులు వాటి స్టాండింగ్ కమిటీల సమావేశములకు నోటీసు లిచ్చుటకు నిబంధనలు

[జి. ఓ. నెం. 640. ప్లానింగు, అభివృద్ధి శాఖ (సమితి IV) ఏప్రియల్ 29, 1960]

నోటీసు యితర పత్రము చట్టమువల్ల లేక నిబంధనవల్ల లేక ఉపవిధి లేక దాని క్రింద చేసిన ఉత్తరువువల్ల ఒక వ్యక్తికి యిచ్చుట లేక పంపించవలసిన యెడల, ఈ క్రింది విధముగా జరుగును.

(ఎ) అట్టి పత్రమును అట్టి వ్యక్తులకు యిచ్చుట లేక యిప్పించుట ; లేక

(బి) అట్టి వ్యక్తి కానరాకుండిన, అట్టి పత్రమును తెలిసిన అతడు ఆఖరున నివసించు స్థలము వద్దగాని లేక వ్యాపారము చేయు స్థలమువద్ద గాని వదలివేయుట లేక అతని కుటుంబములో పెద్ద వ్యక్తికిగాని లేక పనిమనిషికి గాని దానిని యిచ్చుట లేక యిప్పించుట ; లేక

(సి) పై తెలిపిన ఏ పద్ధతులు వీలు కాకుండిన అట్టి స్థలము లేక నివాస స్థలము లేక వర్తకముచేయు స్థలముయొక్క ప్రాముఖ్య భాగములో దానిని అతికించుట ; మరియు

(డి) అట్టి వ్యక్తి పంచాయతీ సమితి జిల్లా పరిషత్ కేంద్ర స్థానములో నివసించక పోయిన యెడల మరియు అతని వేరు స్థలమందలి చిరునామా బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, పంచాయతీ సమితి, జిల్లా పరిషత్ సెక్రెటరీకి తెలియక పోయిన యెడల, దానిని సాధారణ సమావేశము లేక ప్రత్యేక సమావేశము విషయములో సమావేశ తేదీకి కనీసము 10 దినములకు ముందుగా చట్టము క్రింద లేక దానిక్రింద జేయబడిన నిబంధనల క్రింద జరూరు సమావేశము ఏర్పరచిన విషయములో 6 రోజులు ముందు సర్టిఫికేట్ ఆఫ్ పోస్టింగ్ పొందిన తరువాత అతనికి పోస్టుద్వారా పంపించుట.

## 52. పంచాయతీ సమితులు, జిల్లాపరిషత్తులచే సెలవు దినములు మంజూరు చేయుటకు నిబంధన

(జి. ఓ. యమ్. యస్. నెం. 1655, ప్లానింగు స్థానిక పరిపాలన (స II), 27 వ డిసెంబరు 1960)

పంచాయతీ సమితులు పరిషత్‌ల ఆధీనములోయున్న ఆఫీసులు, సంస్థలు, ప్రభుత్వ ఆఫీసులకు సంస్థలకు కాలను వెంబడి ప్రభుత్వముచే మంజూరు కాబడు ప్రభుత్వపు శెలవు దినములు, ప్రత్యేక సెలవు దినములు మాత్రమే ఉపయోగించుకొనుటకు అనుమతి యివ్వబడును.

కాని పంచాయతీ సమితుల జిల్లా పరిషత్‌ల ఆధీనములోయున్న విద్యా సంస్థలకు సెలవు దినములు మంజూరు, ఆంధ్ర ప్రదేశ్ విద్యా నిబంధనలచే క్రమ పరచబడును.

కాని మరియు ప్రభుత్వము ముందు అనుమతితో తప్ప, ప్రభుత్వపు ఆఫీసులు, సంస్థలకు మంజూరు చేయబడినదితప్ప, యితర ఏ సెలవు దినము దాని అధీనములో యున్న ఆఫీసులకు సంస్థలకు ఏ పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ మంజూరు చేయకూడదు.

## 53. పంచాయతీ సమితులకు ప్రాథమిక ఆరోగ్య కేంద్రములకు శాశ్వత అడ్వాన్సు - పంచాయతీ సమితులకు అధికారములను ఒప్పగించుట

(జి. ఓ. యమ్. యస్. నెం. 1470, ప్లానింగు స్థానిక పరిపాలన (మి II), 9వ నవంబరు, 1960.)

11వ ఫిబ్రవరి 1960 తేదీగల ఆంధ్రప్రదేశ్ గజెటుయొక్క పార్టు Iలో 412వ పుటలో ప్రచురింపబడిన, 11వ జనవరి 1960 తేదీగల జి. ఓ. యమ్. యస్. నెం. 42 ప్లానింగు స్థానిక పరిపాలనలో చేసిన నిబంధనలకు వ్యతిరేకములేకుండా పంచాయతీ సమితి ప్రాథమిక ఆరోగ్య కేంద్రము ఏర్పరచిన బ్లాకుయొక్క బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరుకు, ప్రాథమిక ఆరోగ్య కేంద్రము ఆధీనములో యున్న వైద్యాధికారికి తగులుబాటు అయిన ఖర్చును భరించుటకు ఏబది రూపాయలు శాశ్వత ఎడ్వాన్సును మంజూరు చేయవచ్చును.

2. ఖర్చును భరించు వైద్యాధికారి, కావలసినప్పుడు పంచాయతీ సమితి నిధినుండి శాశ్వత ఎడ్వాన్సును భర్తీ చేయుటకు బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరుకు వోచర్లను దాఖలుచేయును, కంటింజెన్సీ చార్జీల రిజిష్టరులో, బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు వేరుగా ఖర్చు తఖసీళ్ళను ఉంచును.

## 54. పంచాయతీ సమితులచే ప్రాథమిక ఆరోగ్య కేంద్రముల స్థాపితము నిర్వహణ కొరకు నిబంధనలు

[జి. ఓ. యమ్. యస్. నెం. 114, ప్లానింగు స్థానిక పరిపాలన (సమితి-II), 23వ జనవరి 1961.]

1 బ్లాకులోని ప్రజల ఆరోగ్యమును కాపాడుటకు, ప్రజలు పాల్గొనుటతో, ప్రతి బ్లాకు, దానికి ఆరు పడకలుగల వార్డు చేర్చిన ఒక ప్రాథమిక ఆరోగ్య కేంద్రము యివ్వబడును.

2. 3వ నిబంధనయొక్క ఏర్పాట్లకు బద్ధమై, పంచాయతీ సమితి, జిల్లా వైద్యాధికారి, ఆరోగ్య అధికారి సంప్రతింపుతో, ప్రాథమిక ఆరోగ్య కేంద్రము ఉనికి నిర్ణయించుటకు స్థలము నిర్ణయించి ప్రభుత్వమునకు సిఫార్సు చేయును.

3. (1) నిర్ణయింపబడిన గ్రామములో కేంద్రమును తెరచుటకు, గ్రామ లేక గ్రామముల జనము, 10,000 రూపాయల ధనము లేక రెండు ఎకరముల

భూమి విరాళ మిచ్చెదరు. కాని దానమిచ్చుటకు సరియైన భూమి లేకపోయి. ప్రాథమిక ఆరోగ్య కేంద్రము ప్రభుత్వపు భూమి మీద నిర్మించుట కుద్దేశించు నప్పుడు, జిల్లా కలెక్టరు నిర్ణయించిన దాని ఖర్చు భూమి విరాళముకు బదులు ప్రజలచే చెల్లింపబడును.

(2) తెలంగాణా ప్రదేశములో, ధన విరాళము ఈ క్రింద తెలిపిన రీతిని వుండును :—

(ఎ) రూ. 6,000 అనగా 10,000 రూపాయలలో 60 శాతము ప్రజల విరాళము ధనముగా చెల్లింపబడును. మిగిలినది పరికరములు, పని రూపకముగా వుండును.

(బి) 2 ఎకరములు దాన మివ్వబడును.

(సి) (ఎ), (బి) క్లాజులలో నిర్దిష్టమైన షరతులు తృప్తిపడినప్పుడు, ప్రభుత్వము, ప్రజల విరాళము 40 శాతముండునటుల, ప్రాథమిక ఆరోగ్య కేంద్రముకు భవనము నిర్మాణపు పని తీసికొనుటకు పూచీదారుకు అనుమతి యివ్వవచ్చును. అనగా, చేసిన పనికి చెల్లింపులు యిచ్చుట. 4,000 రూపాయలు పూర్తిగా వసూలు కాబడును.

(డి) ఉపయోగింపబడు సామగ్రి, నిర్ణీతమైన వివరణము, నాణెము కలిగి యుండును. అది ఉపయోగింపబడుటకు ముందు అసిస్టెంటు ఇంజినీరు (జిల్లా పరిషత్) చే అనుమతింప బడవలెను.

(3) ఆంధ్ర లేక తెలంగాణా ప్రదేశములో రూపాయలు 10,000 లేక 6,000 ప్రజల విరాళము ధన రూపముగానే చెల్లించబడవలెను కాని వస్తురూపముగా లేక పని రూపముగా మొత్తముగా లేక భాగముగా యుండ కూడదు. కాని, ఏ విషయములోనైన, పూచీదారులు మంచి శ్రేష్ఠతగల పరికరములు, కావలసిన వివరములు యివ్వనిచో, నిర్మాణము పనివారికి ఒప్పచెప్పినప్పుడు సామగ్రిని వారు ఉపయోగించ వచ్చును. ఆ విధముగా ఉపయోగించిన పరికరములు, పంచాయతీ సమితి నిధి నుండి అట్టి సామగ్రికి చేసిన చెల్లింపుకు బిల్లు చేయబడును.

(4) (i) పూచీదారులు, ప్రాథమిక ఆరోగ్య కేంద్రము నిర్మాణము కొరకు ఉచితముగా రెండు ఎకరముల వీలైన భూమిని యివ్వలేక పోయిన

యెడల, ప్రాథమిక ఆరోగ్య కేంద్రభవనము ప్రభుత్వము భూమిపై కట్ట నుద్దేశించిన యెడల, జిల్లా కలెక్టరు నిర్ణయించిన ఆ భూమి విలువ పూజీదారులచే చెల్లించబడును.

(ii) పూజీదారులు సరియైన స్థలమును యివ్వ లేక పోయిన యెడల సరియైన ప్రభుత్వపు భూమి కూడ దొరకని పక్షమున, సరియైన స్వంత భూమి పూచీదారుని ఖర్చు మీద సేకరించబడును.

(5) స్థానిక కాధికారి మందుల దుకాణము ప్రాథమిక ఆరోగ్య కేంద్రము ఉనికి నిర్ణయము కొరకు ఏర్పాటు చేయబడిన స్థలము వద్ద యింతకు ముందుగ నేపని చేయుచున్నచో కేంద్రము తెరచుట, బ్లాకులో ఇంకొక స్థలముకు ప్రస్తుపు మందుల షాపును మార్చుటకును, మందుల షాపు ఆక్రమించుకొన్న భవనము, ఏదైన యున్న దానిని ప్రాథమిక ఆరోగ్య కేంద్రపు ఉనికి నిర్ణయించుటకు దొరకునట్లు చేయుటకు బద్ధమైయుండును.

(6) భవనము అద్దె భవనమయిన యెడల, ప్రాథమిక ఆరోగ్య కేంద్రము ఉనికి నిర్ణయము కొరకు క్రొత్త భవనము కట్టుటకైన ఖరీదులో 50 శాతము ప్రజలు విరాళమిచ్చెదరు. భవనము స్థానికాధికారికి చెంది యుండిన యెడల, ప్రజలు భవనము అభివృద్ధి చేయుట కయిన మొత్తపు ఖర్చును భరించి, 15,000 రూపాయలు లేక ది తక్కువ అయిన అవి కాని ఏ విషయములోను 10,000 రూపాయలకు తక్కువ కాకుండ చెల్లించెదరు.

(7) ప్రాథమిక ఆరోగ్య కేంద్రము ఉనికిని నిర్ణయించుటకు ఉద్దేశింపబడిన స్థలము, బ్లాకులో గరిష్ఠ సంఖ్య గ్రామములకు అనుకూలముగా ఉండవలెను. సిబ్బంది నివాస స్థలములకు సబబైన సదుపాయములు, అధమము మధ్య తరగతి పాఠశాల చదువు ఎవరికైనను విద్యా సదుపాయములు కలిగి యుండవలెను.

(8) శాశ్వత భవనములు నిర్మాణము అట్లు ఉండగా ప్రజలు ప్రాథమిక ఆరోగ్య కేంద్రము ఉనికి నిర్ణయించుటకు అద్దె లేని తాత్కాలిక నివాస స్థలము ఏర్పాటు చేయుదురు.

(9) ప్రాథమిక ఆరోగ్య కేంద్రము ఉనికి; బ్లాకులో ప్రస్తుతమున్న వైద్య సదుపాయముల విస్తరణగా రూపొందును, కావున దాని ఉనికి ఎన్నిక,

ప్రభుత్వపు మందుల షాపు యింతకు ముందే పని చేయుచున్న స్థలముల మీద యుండ కూడదు.

(10) (1), (2) సబ్ క్లాజుం లోని. ఏర్పాట్లకు బద్ధమై, బ్లాకు కేంద్రపు అర్హతలు ముందుగా విచారింపబడును

(11) పంచాయతీ సమితి, జిల్లా మెడికల్ ఆఫీసరు, జిల్లా ఆరోగ్య అధికారులకు ఏఅభిప్రాయము లేనప్పుడు, బ్లాకు కేంద్రము కాని స్థలము వద్ద ప్రాథమిక ఆరోగ్య కేంద్రము ఉనికి నిర్ణయ ముద్దేశింపబడినప్పుడు, ఆ విషయము మెడికల్ సర్వీసెస్ డైరెక్టరు పబ్లిక్ హెల్త్ డైరెక్టర్ ద్వారా, ఉత్తరువులకు ప్రభుత్వమునకు పంపుదురు. ప్రభుత్వ నిర్ణయము ఆఖరుది.

4 ప్రాథమిక ఆరోగ్య కేంద్రము ఉనికి నిర్ణయించుటకు ఎన్నుకొనబడిన గ్రామపు ప్రజలు, తెలియజేయబడిన తారీఖు నుండి రెండు నెలలలోగా నిర్ణయింపబడిన విరాళములను చెల్లించ వలయును. లేకపోయిన, వెనుక తెల్పబడిన షరతుల ననుసరించి పంచాయతీ సమితి వేరొక వీలైన స్థలము నిర్ణయించవచ్చును.

కాని అర్హతగల విషయములలో మాత్రము, కాలపరిమితిని యింకొక రెండు నెలలు పొడిగించుటకు పంచాయతీ సమితి అర్హత కలిగియున్నది.

5. బ్లాకు ప్రాథమిక ఆరోగ్య కేంద్రము నిర్ణయింపబడిన గ్రామము తరువాత మునిసిపాలిటీగా మార్చబడినప్పుడు, బ్లాకులో వేరొక ప్రాథమిక ఆరోగ్య కేంద్రము స్థాపింప బడునంతవరకు పంచాయతీ సమితి జూరిస్ డిక్షను నుండి తత్ఫలితముగా తీసివేయబడినప్పుడు, ప్రభుత్వము ఈ విషయములో నిర్దిష్టము జేయు షరతులకు బద్ధమై ఆ మునిసిపాలిటీలోని ప్రాథమిక ఆరోగ్యకేంద్రము బ్లాకు ప్రదేశమును పనిచేయుచునే ఉండునటుల ప్రభుత్వము ఉత్తరువు చేయుటకు అధికారము గలదు.

6 ప్రాథమిక విద్యాకేంద్రము ఒకసారి స్థాపింప బడినపుడు బాకులో వేరొక స్థలమునకు సాధారణముగా మార్చబడదు.

7. బ్లాకులో ఒక స్థలము నుండి యింకొక స్థలముకు ప్రాథమిక ఆరోగ్య కేంద్రము మార్చబడుట కుద్దేశింపబడినచో, బ్లాకు పంచాయతీ సమితి, సమావేశమువద్ద హాజరయిన పంచాయతీ సమితి సభ్యుల సంఖ్యలో 2/3 వంతు జారీ

చేయబడిన తీర్మానమువల్ల, ప్రాథమిక ఆరోగ్య కేంద్రము ఏ గ్రామమునకు మార్చవలయునో ప్రభుత్వమునకు సిఫార్సుచేసి, దాని కారణములు తెల్పును :

కాని కేంద్రము యింకొక స్థలముకు ఈ క్రింది కారణములవల్ల మార్చబడదు.

(ఎ) ప్రాథమిక ఆరోగ్య కేంద్రము భవనము సిబ్బంది నివాస స్థలములు నిర్మాణము పూర్తి అయినప్పుడు ; లేక

(బి) ప్రాథమిక ఆరోగ్య కేంద్రము భవనము. సిబ్బంది నివాస స్థలములు నిర్మాణములో యున్నప్పుడు, లేక

(సి) ప్రాథమిక ఆరోగ్య కేంద్రముకు, సిబ్బంది నివాస స్థలములకు భూమి సేకరింపబడినప్పుడు లేక అట్టి సేకరణకు అవార్డు 1894 వ భూమి సేకరణ చట్టము క్రింద మంజూరు కాబడి నప్పుడు లేక భూమి సేకరణ అధికారి చేతగాని లేక బ్లాక్ డెవలప్‌మెంటు ఆఫీసరు చేతగాని ఆధీనము చేసికొనబడినప్పుడు. లేక

(డి) ప్రజలనుండి విరాళము అంగీకరింపబడి డిపాజిట్టులో ఉన్నప్పుడు; లేక

(ఇ) ప్రాథమిక ఆరోగ్య కేంద్రము భవనము. సిబ్బంది నివాస స్థలములు కొరకు భూదానము అంగీకరింపబడి, ఆ యా పంచాయతీ సమితి పేరున రిజిష్టరీ అయినప్పుడు. లేక

(ఏఫ్) బ్లాకు కేంద్రము వద్దనే ప్రాథమిక ఆరోగ్య కేంద్రము ఉనికి నిర్ణయింపబడినప్పుడు.

8. ప్రాథమిక ఆరోగ్య కేంద్రముకు, సిబ్బంది నివాస స్థలములకు శాశ్వత భవనముల నిర్మాణము, ప్రభుత్వముచే అనుమతింపబడిన డిజైను (నమోనా) ప్రకారము పంచాయితీ సమితిచే నిర్వహింపబడును.

9. (1) ప్రాథమిక ఆరోగ్య కేంద్రము దానికి కావలసిన మందులను మదరాసు మెడికల్‌స్టోర్స్ డిపోనుండి లేక ప్రభుత్వము స్థాపించు యితర కేంద్ర సమాజముల నుండి తీసికొనును.

(20)

కాని పంచాయతీ సమితి దానికి జరూరుగా కావలసిన మందులను 500 రూపాయలు ఒక్కమారు మించకుండా స్థానికముగా ఆ మందులు జాబితాలో చేర్చబడినవి అయి, జిల్లా వైద్యాధికారిచే అనుమతింపబడిన మొత్తములలో ఉండిన షరతులకు బద్ధమై పొందవచ్చును.

(2) పంచాయతీ సమితి జరూరైన సమయములో టెండర్లు పిలుచుట పద్ధతిని వదలివేసి, ప్రాథమిక ఆరోగ్య కేంద్రము యొక్క వైద్యాధికారితో సంప్రతించి స్థానికముగా మందులు కొనుటకు అనుమతించవచ్చును.

10. ప్రాథమిక ఆరోగ్య కేంద్రములు, వైద్య, ప్రజారోగ్య శాఖల ఆఫీసర్లచే నెల కొకమారు లేక కాలము వెంబడి ప్రభుత్వముచే ఉత్తర్వు చేయబడినట్టి వ్యవధులలో తనిఖీ చేయబడును. ప్రాథమిక ఆరోగ్య కేంద్రము పై జూరిస్‌డిక్షను గల ప్రతి పంచాయతీ సమితి అట్టి అన్ని సదుపాయములు యిచ్చి ఆ తనిఖీ చేయు అధికారులకు కావలసిన రికార్డులను దాఖలు చేయింపజేసి, ప్రభుత్వముచే జారీ కాబడిన ఉత్తరువులను అమలు జరిపించును.

11. పంచాయతీ సమితి ఈ క్రింది విషయములలో ప్రభుత్వపు మంజూరును పొందును:—

(i) తాత్కాలిక పదవులను ఉన్నత స్థితిలో ఉంచుట లేక వాటి శాశ్వతపు నిలుపుదల; మరియు

(ii) అధిక సిబ్బందిని నియమించుట.

12. దానమిచ్చువాడు అతని లేక అతనిచే నియమింపబడు నతనిపేరు, ప్రాథమిక ఆరోగ్య కేంద్రముమీద లిఖించుటను కోరినయెడల అతడు యివ్వవలసిన విరాళములు, దానమిచ్చిన స్థలము ఖరీదు కలుపుకొని 10,000 రూపాయలకు తక్కువ కాకుండ యుండవలయును. కాని పంచాయతీ సమితి దానమిచ్చు నతని లేక అతనిచే నియమింపబడు నతనిపేరుతో ఆ భవనము పిలువబడుటకు యిష్టపడవలెను. ఈ విషయములో ఉద్దేశములు ప్రభుత్వము అనుమతికి దాఖలు చేయబడును.

13. ప్రాథమిక ఆరోగ్య కేంద్రముల స్థాపన, నిర్వహణకు సంబంధించిన ఏ విషయములలో నైనను కాలము వెంబడి ప్రభుత్వము లేక మెడికల్

సర్వీసస్ డైరక్టరు లేక ప్రజారోగ్య డైరక్టరు యిచ్చు యితర ఉత్తరువులను అమలులోనికి తీసికొనివచ్చుట లేక నిర్వర్తించుట చేయును.

## 55. పంచాయతీ సమితుల జిల్లా పరిషత్తుల చట్టముకిరింద వ్యక్తిగతమైన విషయములలో నిబంధనలను సడలించుటకు ప్రభుత్వ అధికారముల గురించిన నిబంధనలు

(జి. ఒ. యమ్. యస్. నెం. 1562, ప్లానింగు, స్థానిక పరిపాలన) (స-II), 3వ డిసెంబరు 1960) నెం. 379.

వారికి యుక్తము న్యాయము అని తోచిన రీతిని పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తుయొక్క ఆఫీసరు లేక ఉద్యోగి విషయమును చూచుటలో ప్రభుత్వపు అధికారమును, నియమితము లేక తగ్గింపు చేయుటకు 1959వ ఆంధ్ర ప్రదేశ్ పంచాయతీ సమితుల జిల్లా పరిషత్తుల చట్టముక్రింద ఏ నిబంధన చేయబడకూడదు.

కాని అట్టి ఏ నిబంధన, ఏ ఆఫీసరు లేక ఉద్యోగియొక్క విషయముకు అయిన అనువర్తించినచో, ఆ నిబంధన ఏర్పరచిన దానికి అతనికి తక్కువ అనుకూలముగా ఏ విధముగను, ఆ విషయము చూడబడకూడదు.

## 56. ప్రభుత్వ ఉద్యోగస్థులు కానివారి విషయములో సెలవు మంజూరు చేయుటకు, ప్రొబేషను డిక్లేరు జేయుటకు అర్హతగల అధికారులు

(జి. ఓ. యమ్, యస్. నెం. 105, ప్లానింగు స్థానిక పరిపాలన (స-II) 20వ జనవరి, 1961)

పంచాయతీ సమితుల జిల్లా పరిషత్‌ల క్రింద వానికి చెందిన సంస్థల క్రింద పనిచేయు గవర్నమెంటు ఉద్యోగస్థులు కాని ఉద్యోగస్థుల విషయములో సెలవు మంజూరు చేయుటకు, ప్రొబేషను డిక్లేరు చేయుటకు అర్హతగల అధి కారులు ఈ క్రింది షెడ్యూలులో చూపబడిన రీతిని వుండును.

తీసియిచ్చు అధికారి, పై తెలుపబడిన సిబ్బంది యొక్క జీతపు పెంపులను తీసియిచ్చుటకు అర్హతగల అధికారి అయి యుండును.

## 57. ఉపనిబంధనలను చేయుటకు సంబంధించిన నియమావళి

1. పంచాయతీ సమితి, జిల్లా పరిషత్తు చట్టమునకు లేక ప్రస్తుతము అమలులో నున్న ఏదేని ఇతర శాసనమునకు వ్యతిరేకముగా లేకుండ ఉప నిబంధనలను చేయవచ్చును.

2. పంచాయతీ సమితి, జిల్లా పరిషత్తు ఉప నిబంధనలు చేయుటకు లేక ఉప నిబంధనలలో మార్పులు చేయుటకు ముందు, ఒక నోటీసుతో పాటు ఉద్దేశింపబడిన ఉప నిబంధనల యొక్క లేక ఉప నిబంధనలలో మార్పులయొక్క ముసాయిదాను ప్రకటింపవలెను. అట్టి ముసాయిదా ఏ తేదీన లేక ఏ తేదీ తర్వాత పరిశీలనలోనికి తీసికొనబడునో ఆ తేదీ అట్టి నోటీసులో నిర్దిష్ట పరుపబడవలెను. ఉప నిబంధనలను లేక ఉప నిబంధనలకు మార్పులను చేయుటకు ముందు, అట్లు నిర్దిష్టపరుపబడిన తేదీకి పూర్వము అట్టి ముసాయిదా విషయమై దానిలో ఆసక్తిగల ఏవ్యక్తియైనను చేయు ఆక్షేపణలను లేక సూచనలను స్వీకరించి వాటిని పరిశీలనలోనికి తీసికొనవలెను. ఈ నియమము క్రింద నోటీసు 4వ నియమములో పొందు పరచబడిన విధముగా ప్రకటింపబడవలెను. ఆక్షేపణలను లేక సూచనలను స్వీకరించుటకు నిర్దిష్టపరుపబడు గడుపు ముప్పది దినముల కంటె తక్కువగా ఉండరాదు.

3. పంచాయతీ సమితి జిల్లాపరిషత్తుచే చేయబడిన ఎట్టి నిబంధన లేక ఒక ఉపనిబంధన యొక్క మార్పు లేక రద్దుగాని అది జిల్లా పరిషత్తుచే, ప్రభుత్వము వారిచే ఆమోదింపబడు వరకు అమలు కలిగి ఉండరాదు.

4. పంచాయతీ సమితి జిల్లా పరిషత్తుచే చేయబడిన ఏ ఉప నిబంధన లేక ఉప నిబంధనయొక్క మార్పు లేక రద్దుగాని అది క్రమముగా ఆమోదింప బడిన పిదప ఇంగ్లీషు, తెలుగు భాషలందు ఆంధ్ర ప్రాంతములో జిల్లా గజిట్ల లోను, తెలంగాణ [illegible]లో ఆంధ్రప్రదేశ్ గజిటులోను ప్రచురింపబడి పంచాయతీ సమితి, జిల్లా పరిషత్ యొక్క కార్యాలయములో వుంచబడవలెను. దానియొక్క నకలు సదరు కార్యాలయములో స్పష్టముగా కనిపించు స్థలము లోను పంచాయతీ సమితి జిల్లా పరిషత్తు ఆదేశించునట్టి ఇతర స్థలములలోను వుంచబడవలెను.

5. పంచాయతీ సమితి, జిల్లా పరిషత్తుచే చేయబడిన ప్రతి ఉప నిబంధన లేక ఉప నిబంధనయొక్క మార్పు లేక అది 4 వ నియమము క్రింద ప్రకటింపబడిన తేదీనుండి ఒక నెల గడచిన మీదట అమలులోనికి రావలెను.

## 58. ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సమితుల, జిల్లా పరిషత్తుల చట్టము (1959 చట్టము) క్రింద కంటింజెన్సీల నుండి చెల్లింపబడు పదవుల మంజూరు కొరకు స్థానిక పరిపాలనా ఇనస్పెక్టరు జనరల్‌కు అధికారముల ఒప్పగింపు

[జి. ఒ యమ్. యస్, నెం, 1417, ప్లానింగు స్థానిక పరిపాలన (సమితి-II) 25 వ అక్టోబరు 1960] నెం. 306.

ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సమితుల జిల్లా పరిషత్తుల చట్టము (1959వ ఆంధ్రప్రదేశ్ చట్టము 35, 71వ శెక్షను యొక్క (1)వ సబ్ శెక్షను ఇచ్చిన అధికారములను చలాయించి, కంటింజెన్సీల నుండి చెల్లింపబడు ఉద్యోగుల పదవుల సృష్టి అనుమతికి సంబంధించినంతవరకు, ఆ చట్టముయొక్క 51 వ శెక్షను (1)వ సబ్ శెక్షను క్రింద ప్రభుత్వమునకు యిచ్చిన అధికారములు ఆంధ్రప్రదేశ్ గవర్నరు ఇందుమూలముగా స్థానిక పరిపాలనా ఇనస్పెక్టరు జనరలునకు ఒప్పజెప్పడమయినది. ఇనస్పెక్టరు జనరలునకు ఒప్పజెప్పిన అధికారములను చలాయించుట, ప్రభుత్వము తనిఖీకి మార్పుకు బద్ధమై యుండును.

# 59. పంచాయతీ సమితుల జిల్లా పరిషత్తుల యొక్క ఆఫీసర్లు, ఉద్యోగులకు బయానా చెల్లింపును క్రమపరచు నిబంధనలు

[జి. ఓ. యమ్. యస్. నెం. 586, ప్లానింగు స్థానిక పరిపాలన (సమితి-I) 25 వ ఏప్రియల్ 1961]

1. ఈ క్రింది పనులకు తప్ప యితర పనులకు పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తుచే దాని ఆఫీసర్లకు లేక ఉద్యోగులకు ఏ బయానా మంజూరు చేయబడకూడదు.

(i) వాహనములు కొనుట,

(ii) సంచారము (టూరు) బదలాయింపు మీద ప్రయాణములు,

(iii) చిన్న ఆకస్మికపు ఖర్చుల నెదుర్కొనుటకు పర్మనెంటు ఎడ్వాన్సు లేక ఇంప్రెస్టు రూపేణా నిర్ణీతమైన మొత్తమును కలిగియుండుట,

(iv) ప్లేగు వ్యాపించిన స్థలములలో తాత్కాలిక గుడారములు వేయుట మరియు —

(v) పబ్లిక్ హెల్తు డైరెక్టరుచే తయారు చేయబడిన మలేరియా ప్రమాదమున్న స్థలముల జాబితాలో చేర్చబడిన ప్రదేశములలో ఆఫీసర్లు లేక ఉద్యోగులు నివసించిన లేక పనిచేసిన, దోమతెరలు కొనుట.

కాని ప్రత్యేకమైన విషయములలో రాష్ట్ర ప్రభుత్వము, పైన నిర్దిష్టము చేయబడిన పనులకు కాకుండ ఇతర పనులకు బయానాలు మంజూరు చేయుట అనుమతించ వచ్చును.

2. ఈ క్రింది షరతులకు బద్ధమై, ఒక పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్, దాని విచక్షణలో మోటారుకారు, మోటారు సైకిలు లేక యితర వాహనము కొనుటకు దాని ఏ శాశ్వతమైన ఆఫీసరు లేక ఉద్యోగికి బయానా మంజూరు చేయవచ్చును—

(i) పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తు, పంచాయతీ సమితి, జిల్లా పరిషత్, నౌకరీ క్షేమములో ఆఫీసరు లేక ఉద్యోగి మోటారుకారు,

మోటారు సైకిలు లేక ఇతర వాహనము అతని ఉద్యోగ సంబంధమైన విధులు నిర్వర్తించుటకు ఉపయోగించవలయునని అభిప్రాయపడిన విషయములోనే బయానా మంజూరు చేయవలెను.

(ii) మోటారుకారు, మోటారు సైకిలు కొనుటకు అట్టి బయానా మొత్తము ఆ యా ఆఫీసరు లేక ఉద్యోగి నాలుగు నెలల స్థిరమైన జీతము లేక బహుశా వుండదగు మోటారుకారు లేక మోటారు సైకిలు విలువ ఏది తక్కువ అయిన దానిని మరియు ఏ ఇతర వాహనము కొరకైనను 200 రూపాయలు లేక అట్టి వాహనము బహుశా వుండదగు విలువ, ఏది తక్కువఅయిన దానిని మించకూడదు ;

(iii) మోటారుకారు లేక మోటారు సైకిలు లేక యితర వాహనముకు చెల్లించిన సరియైన విలువ, తీసికొన్న బయానా కంటె తక్కువ అయిన యెడల తేడా సొమ్ము వెంటనే పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తుకు ముదరా ఇవ్వవలయును.

(iv) బంట్రోతులు, అటెండర్లు మొదలైన పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తు తక్కువ జీతము చెల్లింపబడు ఉద్యోగులకు ఈ నిబంధన క్రింద ఏ బయానా మంజూరు చేయబడకూడదు.

3. మోటారుకారు లేక మోటారు సైకిలు కొనుటకు బయానా చెల్లించు కాలములో, పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తు, ఈ క్రింద ఒకటవ షెడ్యూలులో నియమితమయిన ఫారములో ఒక ఎగ్రిమెంటు ఆ యా ఆఫీసరు లేక ఉద్యోగి నుండి పొందవలెను.

4. ఆఫీసరు లెక ఉద్యోగి -

(i) మోటారుకారు లెక మోటారు సైకిలు బయానా సెక్యూరిటీ కొరకు పంచాయతీ సమితి, జిల్లా పరిషత్‌కు యీ క్రింది రెండవ షెడ్యూలులో నిర్దిష్టమైన ఫారములో ఒక బాండు అతని ఖర్చుమీద వ్రాసి యివ్వవలయును ;

మరియు

(ii) మోటారుకారు లేక మోటారుసైకిలు క్రమముగా ఇన్‌షూర్ చేసివుంచి, బయానా పూర్తిగా చెల్లించునంతవరకు ఇన్సూరెన్సు ప్రీమియము చెల్లించుటకు బాధ్యత వహించవలయును.

5. పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ మోటారుకారు లేక మోటారు సైకిలు కాని యితర వాహనములు కొనుటకు బయానా మంజూరు చేయునప్పుడు, బయానా తిరిగి చెల్లించుటకు కావలసిన సెక్యూరిటీ తీసికొనును, అట్టి సెక్యూరిటీ, కొన్న వాహనములకు మినహాయింపు యుండును.

6. (1) 2వ నిబంధన క్రింద జేసిన ప్రతి అడ్వాన్సు, అడ్వాన్సు మోటారుకారు లేక మోటారుసైకిలు కొనుట కొరకైన యెడల ముప్పది ఆరు వాయిదాలు మించకుండ సమమైన నెలవాయిదాలలో, ఏ యితర విషయములో నైనను పన్నెండు మించకుండ చెల్లింపబడవలెను.

కాని బయానా మొత్తము వాయిదాల సంఖ్యచే భాగించగా వచ్చినది రూపాయలో భిన్నమయిన విషయములో ప్రతి వాయిదా మొత్తము ఆఖరిదితప్ప వెంటనే ఆ తరువాత పూర్తి రూపాయిగా మార్చబడి. అవసరమైన తగ్గింపు ఆఖరి వాయిదా మొత్తములో చేయబడును.

(2) బయానా వాయిదాల వసూలు ఆయా ఆఫీసరు లేక ఉద్యోగి నెల జీతపు బిల్లునుండి క్రమము తప్పక చేయబడి పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ కార్యాలయములో ఉంచబడు అడ్వాన్సుల రిజిష్టరు ద్వారా గమనింపబడుచుండును.

(3) కాలము వెంబడి వారి ఉద్యోగుల కొరకు ప్రభుత్వముచే నిర్ణయింపబడు రేటు చొప్పున బయానామీద సాధారణవడ్డీ వసూలు చేయబడి. ప్రతి నెల ఆఖరు తేదీన చెల్లింపగా మిగిలియుండు మొత్తముమీద గుణింపబడవలయును. ఆ విధముగా నిర్ణయింపబడిన వడ్డీ, అసలు సొమ్ము వసూలు చేయబడిన వాయిదా కంటె గమనించుటకు ఎక్కువగా ఉండకున్న ప్రతి ఒక్క లేక ఎక్కువ వాయిదాలలో వసూలు చేయబడును. మొత్తము అసలంతయు చెల్లింపబడిన నెల తరువాత నెల నుండి వడ్డీ వసూలు ప్రారంభ మగును.

(4) ఆఫీసరు చనిపోయిన లేక అతని నౌఖరీ అంత్యము చేయబడిన విషయములో. బయానా మిగిలిన దేమైన యున్న యెడల అది దానిమీద వడ్డీతో సహా వెంటనే వసూలు చేయబడును.

7. (1) సంచారముమీద ప్రయాణముల కొరకు ఒక బయానా ఆఫీసరు లేక ఉద్యోగికి యివ్వబడినప్పుడు, అట్టి అడ్వాన్సు మొత్తము, నిబంధనల

క్రింద యివ్వదగు ప్రమాణ భత్యమును మించకూడదు. అడ్వాన్సు చెల్లించిన ప్రయాణమునకు సంబంధించిన ప్రయాణ భత్యము బిల్లునుండి అడ్వాన్సు పూర్తిగా వసూలు చేయబడును.

(2) బదలాయింపు ఉత్తరువుల క్రింద వున్న ఒక ఆఫీసరు లేక ఉద్యోగికి. ఒక నెల స్థిర జీతము మించని ఒక మొత్తము వరకు బదలాయింపు కారణము వలన నిబంధనల క్రింద అతని కర్హతగల ప్రయాణ భత్యముతో కలుపుకొని అడ్వాన్సులు యివ్వబడవచ్చును. అట్టి అడ్వాన్సులు, ఆఫీసరు లేక ఉద్యోగి ఆఖరుజీతము సర్టిఫికేటుమీద రికార్డు చేయబడును. జీతము అడ్వాన్సు బదలాయింపు తరువాత ఒక నెల పూర్తి జీతము తీయబడిన నెలతో మొదలిడి, మూడు సమానమైన నెలసరి వాయిదాలలో ఆఫీసరు లేక ఉద్యోగి జీతము నుండి వసూలు చేయబడును. ప్రయాణ భత్యపు అడ్వాన్సు, ఆఫీసరు లేక ఉద్యోగి ప్రయాణ భత్యపు బిల్లు దాఖలు చేయబడిన మీదట పూర్తిగా వసూలు చేయబడును,

(3) ఇంకొక పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తు క్రింద నౌఖరీకి బదలాయింపు కాబడిన ఆఫీసరు లేక ఉద్యోగి విషయములో, అడ్వాన్సులవల్ల వసూళ్లు చివర చెప్పబడిన పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తుచే చేయబడి, ఆ విధముగా వసూలు చేయబడిన మొత్తము, మొదట అడ్వాన్సు మంజూరు చేసిన పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తుకు చేర్చబడును. వసూళ్లు వసూలు చేయవలసిన అడ్వాన్సు రిజిష్టరుద్వారా గమనింపబడును. చెల్లించిన సొమ్ముకు చెల్లించిన మనియారరు కమీషను వసూలుచేయు పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తుచే భరించబడును,

8. (1) దోమతెరలు కొనుటకు ఆఫీసరు లేక ఉద్యోగికి యివ్వబడిన బయానా కరువుభత్యముతో కలుపుకొని ఆ యా ఆఫీసరు లేక ఉద్యోగియొక్క ఒక నెల జీతము గరిష్టమువరకు అతని, అతని కుటుంబపు మెంబర్ల ఉపయోగముకొరకు దోమతెరలను కొనుటకు నికరముగా కావలసిన మొత్తము లేక రూ. 50, ఏది తక్కువయిన దానికి నియమితము చేయబడును. బయానా వడ్డీ లేకుండ యుండును.

(2) ఆఫీసరు ఉద్యోగులు అందరు, శాశ్వతమైనప్పటికి పనిచేయుచున్నప్పటికి లేక తాత్కాలికముగా పని చేయుచున్నప్పటికి, తిరిగి చెల్లించు కాలములో, బహుశా తొలగింపబడువారు తప్ప, అడ్వాన్సు తీసుకొనుట కర్హులు,

9. 1వ నిబంధవయొక్క (iv), (v) క్లాజులలో నిర్దిష్టమైన పనులకు ఇవ్వబడిన ప్రతి అడ్వాన్సు, పన్నెండు సమాన నెలసరి వాయిదాలు దాటకుండగా చెల్లింపబడవలెను. అడ్వాన్సు, వాయిదాల వసూలు, ఆ యా ఆఫీసరు లేక ఉద్యోగి నెలజీతపు బిల్లునుంచి క్రమము తప్పకుండ చేయబడి పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ కార్యాలయములో ఉంచబడు వసూలు చేయవలసిన అడ్వాన్సు రిజిష్టరు ద్వారా గమనింపబడును. ఆఫీసరు లేక ఉద్యోగి చనిపోయిన లేక అతని నౌఖరీ అంత్యము చేయబడిన విషయములో, మిగిలియుండు అడ్వాన్సు ఏమైన యున్నయెడల అది వెంటనే వసూలు చేయబడును.

10. పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తుచే ఉద్యోగింపబడిన ప్రభుత్వపు ఆఫీసర్లు, ఉద్యోగులు, ఈ నిబంధనలు ఉద్దేశించిన మేరకు, పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తు యొక్క ఆఫీసర్లు ఉద్యోగులుగా భావింప బడుదురు.

కాని మోటారుకారు లేక మోటారు సైకిలు కొనుటకు అట్టి ఆఫీసరు లేక ఉద్యోగికి యిచ్చిన అడ్వాన్సు విషయములో, అడ్వాన్సు ప్రభుత్వముచే మంజూరు కాబడి, రాష్ట్రపు నిధులనుండి తీసికొనబడును,

## ఒకటవ షెడ్యూలు

(3వ నిబంధన చూడుము)

అగ్రిమెంటు

పందొమ్మిది వందల                                        తేదీన

ఒకవైపు ... ... ... ... ... ... (ఇప్పటినుంచి బదులు తీసుకొనువాడు, యిది అతని ప్రతినిధులు, ఒప్పగింతదారులు కూడ అయి యున్నది) మరియు                    1959 వ ఆంధ్ర ప్రదేశ్ పంచాయతీ సమితుల జిల్లా పరిషత్తుల చట్టముక్రింద స్థాపితమైన చట్టపు సంస్థ అయిన పంచాయతీ సమితి, జిల్లా పరిషత్ యింకొకవైపు వీరి మధ్య,

బదులు తీసికొనువారు, పై జెప్పబడిన 1959వ ఆంధ్ర ప్రదేశ్ పంచాయతీ సమితుల జిల్లా పరిషత్‌ల చట్టముక్రింద చేసిన నిబంధనలు (యిప్పటి నుండి చెప్పబడిన నిబంధనలు అని సూచింపబడును. ఇది ప్రస్తుత మమలులో యున్నవాటి సవరణలు కూడ అయియున్నవి ) ఏర్పాట్లక్రింద మోటారుకారు,

మోటారు సైకిలు కొనుటకు       రూ॥ల అప్పుకొరకు పంచాయతీ సమితికి జిల్లా జరిషత్‌కు దరఖాస్తు చేసినందున, యిప్పటినుండి తెల్పబడిన షరతుల మీద అప్పుదారునకు చెప్పబడిన మొత్తము అప్పు యిచ్చుటకు పంచాయతీ సమితి జిల్లా పరిషత్ ఒప్పుకొనినందున ;

పంచాయతీ సమితి, జిల్లా పరిషత్ అప్పుదారునకు రూపాయలు యిచ్చిన కారణమున (తీసికొన్నట్లుగా అప్పుదారుడు యిందుమూలముగా ఒప్పుకొనుచున్నాడు.) దీని పార్టీలుభయుల మధ్య యిందుమూలముగా ఒప్పుకొనడమైనది. అప్పుదారుడు, చెప్పబడిన నిబంధనలలో ఏర్పాటు చేసినరీతిని అతని జీతము నుండి నెల తగ్గింపుల ద్వారా చెప్పబడిన నిబంధనల ప్రకారము అట్టి మొత్తము దానిమీద వడ్డీతో సహా లెఖ్ఖ కట్టి పంచాయతీ సమితికి, జిల్లా పరిషత్తుకు చెల్లించుటకు యిందుమూలముగా పంచాయతీ సమితి, జిల్లా పరిషత్‌తో ఒప్పుకొని, యిందుమూలముగా అట్టి తగ్గింపులను చేయుటకు పంచాయతీ సమితికి, జిల్లా పరిషత్‌కు అధికారము కలుగజేయడమైనది. మరియు (2) యీ యిచ్చుటలు తేదీనుండి ఒక నెలలోపుగా, అట్టి అప్పు పూర్తి మొత్తమును మోటారుకారు, మోటారుసైకిలు కొనుటలో వినియోగించుటకు లేక అట్టి మోటారుకారుకు, మోటారు సైకిలుకు చెల్లించిన సరియైన విలువ అట్టి అప్పుల మొత్తముకు తక్కువగా యున్నయెడల, తేడా వెంటనే పంచాయతీ సమితికి, జిల్లా పరిషత్‌కు చెల్లించుటకు, మరియు (3) అట్టి కొనుగోలు అయిన ... ... రోజులలో అప్పుదారుకు పైన రీతిగా యిచ్చిన మొత్తముకు, పై నిబంధనలో, ఏర్పరచిన ఫారములో దానిమీద వడ్డీకు సెక్యూరిటీగా పంచాయతీ సమితి, జిల్లా పరిషత్‌కు పైన తెల్పిన మోటారు కారు, మోటారు సైకిలు తాకట్టు పెట్టుచు ఒక పత్రము వ్రాసి యిచ్చుటకు యిందుమూలముగా ఒప్పుకొనడమైనది.

మరియు ఈ యిచ్చుటలు తేదీనుండి ఒక నెలలోపున పై తెల్పిన రీతిని మోటారుకారు, మోటారు సైకిలు కొనబడకపోయిన, తాకట్టు పెట్టబడకపోయిన లేక యింతకుముందు తెల్పబడిన నిర్ణీతమైన కాలములో పైన తెల్పిన మోటారు కారు, మోటారు సైకిలు తాకట్టు పెట్టబడకపోయిన లేక అప్పుదారుడు ఆ కాలములో ఋణగ్రస్తుడైన లేక పంచాయతీ సమితి, జిల్లా పరిషత్తు నౌకరీని వదలిన లేక చనిపోయిన, అప్పు మొత్తము దానికి చేరిన వడ్డీ వెంటనే చెల్లింపవలసినదిగా అగునని యిందుమూలముగా ఆఖరుదిగా ఒప్పుకొనడమై ప్రకటింప బడినది.

దీనికి సాక్ష్యముగా అప్పుదారుడు మరియు పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తు కొరకు లేక తరపున పనిచేయుచున్న పై తెల్పిన యిందులోని తారీఖు సంవత్సరమున ఈ క్రింది సాక్షుల సమక్షమున వారి సంతకములు చేయడమయినది.

సాక్షులు

| | |
|---|---|
| తెల్పబడినవానిచే సంతకము సమక్షములో | (1)... ... ... ... <br> (2)... ... ... ... |

(అప్పుదారుడు)

(1)... ... ... ... ... (పంచాయతీ సమితి,
(2)... ... ... ... ... జిల్లా పరిషత్తు తరపున)

## రెండవ షెడ్యూలు

(4 వ నిబంధన చూడుము)

మోటారు కారు, మోటారు సైకిలు అడ్వాన్సుకు తాకట్టుపత్రము ఫారము ఈ పత్రము

....................తేదీన ఒక వైపు (ఇప్పటి నుంచి అప్పుదారుడు అని పిలువబడును. ఇది అతని వారసులు, ప్రతినిధులు, ఒప్పగింతదారులు అయి యున్నది) 1959 వ ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సమితుల, జిల్లా పరిషత్తుల చట్టము క్రింద స్థాపితమయిన ఒక చట్టము సంస్థ అయిన పంచాయతీ సమితి, జిల్లా పరిషత్తు ఒక వైపు—వీరి మధ్య.

బదులు తీసికొనునతడు 1959 వ ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సమితుల జిల్లా పరిషత్తుల చట్టము (ఇప్పటి నుంచి చెప్పబడిన నిబంధనలను సూచించును ఇది ప్రస్తుత మనులులో యున్నదానికి కొత్తవి చేర్చుట కూడ అయియున్నది.) క్రింద తయారుచేసిన నిబంధనల షరతులమీద దీనికున్న షెడ్యూలులో చెప్ప బడిన మోటారు......కొనుటకు అడ్వాన్సు కొరకు దరఖాస్తు చేసినందున-

ఇప్పుడు అప్పుదారుకు పంచాయతీ సమితి, జిల్లా పరిషత్ వ్రాసిన తేదీ లేక ముందు...రూపాయలు యీనాములు చెల్లించిన కారణమున (దానికి రసీదు అప్పుదారుడు ఇందుమూలముగా అంగీకరించుచున్నాడు) అప్పుదారుడయిన

అతడు ఇందుమూలముగా తెల్పబడిన......రూపా..ల మొత్తము చెప్పబడిన నిబంధనల ప్రకారము గుణించిన దానిమీద వడ్డీ కొరకు సెక్యూరిటీ రూపేణా ఈ క్రింది షెడ్యూలులో ప్రత్యేకముగా వర్ణింపబడిన మోటారుకారు, మోటారు సైకిలు పంచాయతీ సమితి, జిల్లా పరిషత్‌కు ఒప్పజెప్పి, బదలాయింపు చేయడమయినదని ఈ పత్రము రూఢిపరచుచున్నది.

మరియు అప్పుదారుడు, చెల్లింపులలో మొదటి చెల్లింపు 19వ తారీఖున చెల్లించునట్లుగా ప్రతినెల మొదటి తేదీన ప్రతి.........రూపాయలు సమాన చెల్లింపులు.........చే యీనాములు ఇచ్చు తేదీన చెల్లింపబడకయుండు పైన తెలుపబడిన......రూపాయల మొత్తము లేక దానిలో మిగిలి యుండునది పంచాయతీ సమితికి, జిల్లా పరిషత్తుకు క్రమముగా అతడు చెల్లించుననియు మరియు ఇవ్వవలసిన మొత్తముమీద ఈ నిబంధనలు ఏర్పరచిన పద్ధతిమీద తెల్పబడిన నిబంధనల ప్రకారము గుణించి వడ్డీ చెల్లించుననియు ఒప్పుకొని ప్రకటించడమయినది.

మరియు అప్పుదారు తాకట్టు పెట్టలేదినియు తెల్పబడిన మోటారుకారు, మోటారు సైకిలు విషయములో పంచాయతీ సమితి, జిల్లా పరిషత్‌కు సొమ్ము చెల్లింపవలసియుండునంత కాలము తెల్పబడిన మోటారు కారు, మోటారు సైకిలును లేక దాని స్వాధీనమును అమ్మట, తాకట్టు పెట్టుట లేక వదలుట చేయనని ఒప్పుకొని ప్రకటించడమైనది

కాని అప్పుదారుడు న్యాయసమ్మతముగా కోరబడి నప్పటికి లేనప్పటికి దానిని చెల్లించుటకు ఇందులో ఇంతకు ముందు ఏర్పాటు చేయబడిన కాలము తరువాత పదిరోజులు కాలముకు ఏ వాయిదాలను చెల్లించుటలో ఎప్పుడైనను తప్పు చేసిన యెడల లేక అప్పుదారుడు చనిపోయిన లేక ఇతరముగా పంచాయతీ సమితి/జిల్లా పరిషత్తు నౌకరీనుండి ఆగిపోయిన లేక అప్పుదారుడు చెప్పబడిన మోటారు కారు/-మోటారు సైకిలు లేక దాని స్వాధీనము అమ్మట, తాకట్టు పెట్టుట లేక దానిని వదలుకొనుట చేసిన యెడల లేక ఋణగ్రస్తుడైన లేక అతనికి అప్పిచ్చిన వార్లతో ఎట్టి ఏర్పాటు చేసినయెడల లేక ఎవరైనను అప్పుదారునిమీద డిక్రీ జడ్జిమెంటు అమలు జరుపుటలో చర్యలు తీసుకొనిన యెడల ప్రస్తుతము చెల్లింపబడకుండ మిగిలియుండు మొత్తము అసలు మొత్తము, చెప్పబడిన నిబంధనల ప్రకారము గుణించిన దానిమీద వడ్డీతోసహా వెంటనే చెల్లింపదగినది అవునని ఇందుమూలముగా వప్పుకొని ప్రకటింపబడినది ;

మరియు పంచాయతీ సమితి, జిల్లా పరిషత్తు ఇందులో ఇంతకు ముందు తెల్పబడిన ఒకటి లేక అధికము ఏవి జరిగిన మీదట మోటారుకారు. మోటారు సైకిలు వశపరచుకొని, స్వాధీనపరచుకొనవచ్చును. దానిని తొలగించకుండా దాని స్వాధీనములో యుండవచ్చును లేదా తొలగించి, బహిరంగ వేలమువల్ల లేక స్వంత కాంట్రాక్టువల్ల చెప్పబడిన మోటారుకారు, మోటారు సైకిలు అమ్మ వచ్చును. మరియు అమ్మకపు వరుంబడుల నుండి పై చెప్పబడిన అసలు మొత్తము లేక చెల్లించకుండ ప్రస్తుతము వుండుసంతభాగము, తెల్పిన నిబంధనల ప్రకారము గుణించిన దానిమీద వడ్డీ అన్నిఖర్చులు, చార్జీలు ఖర్చులు క్రమముగా చేసిన క్లిలేక దీని క్రింది హక్కులు స్థాపించుట, కాపాడుకొనుట పొందుటలో తగలుబాటగు చెల్లింపులు వుండవచ్చును. మరియు అధిక సొమ్ము ఏమైన వున్న అది..........చెల్లించవలయును.

మరియు, చెప్పబడిన మోటారు కారు, మోటారు సైకిలు స్వాధీనము తీసుకొనుటకు లేక అమ్ముటకు పై తెల్పిన అధికారము, శత్రిము సొమ్ముకు అప్పుదారునిమీద దావా తెచ్చుటకు లేక మోటారు కారు, మోటారు సైకిలు అమ్మవలసిన విషయములో అమ్మగా వచ్చిన నిఖర వరుంబడులు ఇవ్వవలసిన మొత్తముకు తగ్గిన పంచాయతీ సమితి, జిల్లా పరిషత్తు హక్కును భంగము చేయనేరదు. మరియు అప్పుదారుడు తెల్పిన మోటారుకారు, మోటారుసైకిలును సబబైన అరుగుదలవల్ల పాడగుటకంటె ఎక్కువగా పాడగునట్లు చేయుట, నాశనము చేయబడుటకు, దెబ్బ తినుటకు ఒప్పుకొనకుండుటకు, ఎప్పుడైన అట్టి మోటారు దెబ్బతినిన, పాడయిపోయిన వెంటనే బాగుచేసి దానిని మంచి స్థితిలో వుంచుటకు, అట్టి మోటారు కారు, మోటారు సైకిలును అగ్ని లేక ప్రమాదమువల్ల నష్టమునుండి ఇన్సూరుచేసి వుంచుటకు, అప్పుదారుడు యిందు మూలముగా పంచాయతీ సమితి, జిల్లా పరిషత్తుతో ఒప్పుకొనడమయినది. పై చెప్పిన రీతిని మోటారుకారు, మోటారు సైకిలు స్వాధీనము. వశపరచుకొను నిమిత్తము లేక దానికి సంబంధించిన ఏ యితర పనికైనను, పంచాయతీ సమితి, జిల్లా పరిషత్తు, దాని స్థానికులు, ఉద్యోగులు, దాని ఉదోగములో వున్న ఇతరులు లేక దాని తరపున ఎల్లవేళలందు రాకపోకలకు పూర్తియైన అధికారం కలిగియుండుటకు మరియు...............వుంచు లేక వుంచబడుననుకొను స్థలములోనికి మరియు అప్పుదారునిచేత లేక ఆతని తరపున వ్యవహరించు లేక వ్యవహరించుననుకొను అడ్డబడకుండ అవమానపరచబడకుండ దాని ప్రతి భాగమును చూచుటకు అప్పుదారుడు ఇందుమూలముగా ఇంకను ఒప్పుకొనుచున్నాడు.

దీనికి సాక్ష్యముగా అప్పుదారుడు మరియు పంచాయతీ సమితి, జిల్లా పరిషత్ కొరకు, తరపున వ్యవహరించుచున్న వ్యక్తి దీనిమీద వారి చేవ్రాలు ఈ క్రింద సంవత్సరము తారీఖున ఈ క్రింది సాక్షుల సమక్షమున చేయడమైనది.

సాక్షులు :

(1)
(2) (పంచాయతీ సమితి/
(1) జిల్లా పరిషత్ తరపున
(2)

## 60. జిల్లా పరిషత్ కార్యదర్శి, ఉప కార్యదర్శుల జీతములకు సంబంధించిన నిబంధనలు

[జి. ఒ. యమ్. యస్. నెం. 1249, ప్లానింగు స్థానిక పరిపాలన (సమితి-IV) 14 వ డిసెంబరు 1950]

1. జిల్లా పరిషత్‌లకు కార్యదర్శి ఉపకార్యదర్శుల పదవులను నియోగించుట, బదిలీలు చేయుట ప్రభుత్వముచే చేయబడును.

2. జిల్లా పరిషత్ కార్యదర్శి పదవికి రూ॥ లు 300-50/2-700 స్కేలులో గుణించిన నెల జీతము మరియు 50 రూ॥లు (ఏబది రూపాయలు మాత్రము) ప్రత్యేక జీతము యివ్వబడును.

3. జిల్లా పరిషత్ ఉపకార్యదర్శి పదవికి అతడు స్థిరపడిన ఉద్యోగ శాఖలో అతనికి అర్హతగల నెల జీతము మరియు రూ॥లు 50 (ఏబదిరూపాయలు మాత్రమే) ప్రత్యేక జీతము యివ్వబడును.

## 61. పంచాయతీ సమితుల, జిల్లా పరిషత్‌ల క్రింద ప్రాథమిక పాఠశాలలలో నియమింపబడిన నేతపని వడకుట నేర్పువారికి అర్హతలను నియమించు నిబంధనలు

[జి. ఒ. యమ్. యస్. నెం. 339, ప్లానింగు స్థానిక పరిపాలన (స-II) 28 ఫిబ్రవరి 1961]

శాశ్వతమైన లేక మూడు నెలలకు పైగా ఉంచుటకు వీలగు కాళీలో పంచాయతీ సమితి జిల్లా పరిషత్ చే నిర్వహింపబడిన లేక యాజమాన్యము వహించ బడిన ఒక ప్రాథమిక పాఠశాలలో నేతపని లేక వడకుట నేర్పువారిగా ఏవ్యక్తి, అట్టి వ్యక్తి వడకుటలో లోవరు గ్రేడు ప్రభుత్వపు పారిభాషిక (టెక్నికల్) పరీక్షయందు లేక చేతి మగ్గముల నేతలో పారిభాషిక (టెక్నికల్) పరీక్షయందు ఉత్తీర్ణుడైన తప్ప లేక మదరాసు ప్రభుత్వపు టెక్స్టైల్ ఇన్స్టిట్యూట్, నేతపని చదువులో ఒక సర్టిఫికేటు పొందిన తప్ప నియమింపబడ కూడదు.

క్రాని అట్టి కాళీలో నియమింపబడుటకు అర్హతగల వ్యక్తి లేకపోయిన యెడల, ఆపదవికి తగు అర్హతలేని వ్యక్తి, వీలునుబట్టి పాఠశాలల డెప్యూటీ ఇన్స్పెక్టరు లేక పాఠశాలల సబ్ అసిస్టెంట్ ఇన్స్పెక్టరు సంప్రదింపుతో, అర్హతగల వ్యక్తి దొరకునంతవరకు నియమింపబడవచ్చును.

## 62. పంచాయతీ సమితుల, జిల్లా పరిషత్‌ల ఆఫీసర్ల ఉద్యోగులవిషయములో పెన్షనుకు సంబంధించిన విరామములు, పెన్షనుల విషయములో నిబంధనలు

[జి. ఒ. యమ్. యస్. నెం. 522 ప్లానింగు స్థానిక పరిపాలన (స. II) 20వ మార్చి 1961]

1932 ఏప్రియల్ మొదటి తేదీ లేక దర్మిలాను ఆంధ్ర ప్రదేశ్‌లో జిల్లాబోర్డు నౌఖరీలోనికి తీసికొనబడి పంచాయతీ సమితి, జిల్లా పరిషత్ నౌకరీలో చేర్చబడిన ఆఫీసరు లేక ఉద్యోగి లేక జిల్లా సెక్షను కమిటీచే నియమింపబడి రాష్ట్రమంతటను యున్న పంచాయతీ సమితి జిల్లా పరిషత్ నౌఖరీలోనికి తీసికొనబడిన ఏ ఆఫీసరు లేక ఉద్యోగి, అట్టి పంచాయతీ సమితి, జిల్లా పరిషత్ నిధులనుండి ఎట్టి పెన్షను చెల్లింపబడుటకు అర్హుడు కాడు. మరియు అట్టి నిధులనుండి అతని తరఫున ఎట్టి పెన్షనుకు సంబంధించిన విరామము చెల్లింపబడదు.

2. చెప్పబడిన తేదీన ఆంధ్ర ప్రదేశ్‌లో యిదివరకు జిల్లా బోర్డు యొక్క ఆపీసరు లేక ఉద్యోగి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము (ఇప్పటి నుండి ప్రభుత్వము అని తెలియజేయబడును) పూర్వపు అనుమతితో, పెన్షనుకు సంబంధించిన విరాళము చెల్లింపబడుతూయున్న దాని నౌఖరీలో పదవిని గలిగి యున్నపుడు, అట్టి విరాళము, ప్రభుత్వము యితర విధముగా ఉత్తర్వు చేసిన తప్ప, అట్టి తారీఖున అట్టి అనుమతితో సెక్షనుకు సంబంధించిన విరాళము చెల్లింపబడుతూయున్న అట్టి పదవిని లేక ఏ యితర పదవిని యింకను కలిగి యున్నంతకాలము, చెల్లింపబడుచునే యుండును.

3. తగ్గింపు కారణమున ఖర్తీ పెన్షను చెల్లింపుమీద నౌఖరీనుండి తొల గింపబడి తరువాత మరల ఉద్యోగింపబడిన ఆంధ్రప్రదేశములో యిది వరకు ఏ జిల్లాబోర్డు ఆపీసరు లేక ఉద్యోగి, జీతమునకు అదనముగా అతని పెన్షనును తీసికొనుటకు అనుమతింపబడడు.

4. కాని తిరిగి ఉద్యోగింపబడిన ఉద్యోగియొక్క జీతము అతడు తొలగింపబడు కాలములో తీసికొను దానికి సమానమైనపుడు, మొత్తము పెన్ష నంతయు నిలుపుదల చేయబడును ;

కాని యింకను, తిరిగి ఉద్యోగింపబడిన వ్యక్తి యొక్క మొత్తము పెన్షను, జీతము అతడు తొలగింపబడిన కాలములో అతడు తీసికొను జీతమును దాటిన విషయములో అధికముగా ఉన్నదానికి సమానమగు పెన్షను మాత్రము నిలుపుదలలో యుండును.

## 63. కలెక్టర్ల కార్యాలయములో ఉప భూస్వాముల రిజిష్టరుకు సంబంధించిన మదరాసు జిల్లాబోర్డు నిబంధనల అన్వయము ఉనువర్తింపు

(జి. ఒ యమ్. యస్. 890, ప్లానింగు స్థానిక పరిపాలన (స-II) 7వ జూన్ 1961) నెం. 181.

1959వ ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సమితులు, జిల్లా పరిషత్‌ల చట్టము (1959వ ఆంధ్రప్రదేశ్ చట్టము ) 61 సెక్షను యిచ్చిన అధికారము

లను చలాయించి, ఆంధ్రప్రదేశ్ గవర్నరు, ఈ క్రింది షెడ్యూలు IIలో చెప్ప బడిన మార్పులతో ఆంధ్రప్రదేశములో పంచాయతీ సమితులు, జిల్లా పరిషత్ లకు క్రింది Iవ షెడ్యూలులో నిర్దిష్టమయిన 1920 వ పాత మదరాసు జిల్లా బోర్డుల చట్టము క్రింద చేయబడిన నిబంధనలు అనువర్తించునని ఉత్తర్వు చేయడమయినది.

## షెడ్యూలు I

కలెక్టర్ల కార్యాలయములో ఉప భూస్వాముల నిబంధనల రిజిష్టరు

1. (ఎ) ఒకటి లేక ఎక్కువ రివెన్యూ గ్రామములు కలిగియున్న ఎస్టేటు ప్రొప్రయిటరుచే సృష్టింపబడి, సాగింపబడి, గుర్తింపబడిన అండరు టెన్యూరుమీద అట్టి ఎస్టేటు ఏభాగమునైనను కలిగియున్న లేక భూస్వామి యొక్క ఏజంటు లేక నౌఖరీగా కాకుండ అట్టి గ్రామము లేక గ్రామముల అద్దెలను వసూలు చేయుటకు అర్హతగల భూస్వామి కాని ఏవ్యక్తియైన, ఈ చట్టము నుద్దేశించి నంతవరకు అట్టి గ్రామము లేక గ్రామముల యొక్క ఉపభూస్వామిగా రిజిష్టరు అగుటకు కలెక్టరుకు దరఖాస్తు చేయవచ్చును.

2. కలెక్టరు 1వ నిబంధనయొక్క సబ్‌రూలు (a) లేక సబ్ రూలు (b) క్రింద దరఖాస్తు నోటీసును దరఖాస్తులో లాభమున్నదని అతనికి తోచు వ్యక్తులకు జారీచేయును. మరియు అతను ఒక ప్రకటనను, ఆ ప్రకటన ప్రచురణ మయిన తారీకు నుండి ఒక నెలలో రెజిస్ట్రేషన్‌కు అక్షేపణలు ఏమైన ఉన్న అవి తెల్పుమని దరఖాస్తులో లాభమున్న వ్యక్తులను కోరుచూ జిల్లా గజిట్‌లో ప్రచురించును. అట్లు ఆక్షేపణలు తెల్పిన వ్యక్తులకు వారు విచారింపబడుటకు సబబైన సదుపాయ మివ్వబడిన తరువాత, అతనికి యుక్త మని తోచిన విచారణ జరిపిన మీదట, చట్టము మేరకు అట్టి గ్రామము లేక గ్రామముల ఉపభూస్వామిగా అర్హుడైన వ్యక్తిని రిజిష్టరు చేయవచ్చును.

3. యజమానిచే సృష్టింపబడి, సాగింపబడి, గుర్తింపబడిన అండర్ టెన్యూరు స్వభావమును గురించిగాని లేక, అద్దెలను వసూలు చేయుటకు ఉపభూస్వామిగా రిజిష్టరు చేయబడుటకు కోరబడిన వ్యక్తి యొక్క హక్కును గురించిగాని గమనింపదగిన తగాయిదా యున్నదని కలెక్టరు తృప్తి పడినచో, అతడు రిజిస్ట్రేషన్‌ను నిరాకరించి, ఒకసివిల్ న్యాయస్థానములో వాని హక్కును స్థిరపరిపించు కొనమని ఉత్తర్వుచేయును.

4. 2వ నిబంధన క్రింద కలెక్టరుచే చేయబడిన ఎట్టి రిజిస్ట్రేషన్, ఆ యా వ్యక్తులకు నోటీసు యివ్వబడిన తరువాత, రిజిస్ట్రేషను ఎందుకు రద్దు లేక మార్పు చేయబడకూడదో కారణము తెల్పుటకు ఒక సబబైన సదుపాయము వానికి యివ్వబడిన తరువాత, ఎప్పుడైన రద్దు లేక మార్పు చేయబడవచ్చును,

5. (ఎ) ఈ నిబంధనల క్రింద అతనిచే జారీచేయబడు ఉత్తరువులకు వ్రాతపూర్వకమైన అతని కారణములను కలెక్టరు రికార్డు చేయును. అతని ఉత్తరువువల్ల నష్టపడునని అతనికితోచు వ్యక్తులందరకు రిజిష్టరు పోస్టుద్వారా వెంటనే ఉత్తరువు నకలు పంపించబడును.

(బి) ఉత్తరువు పంపించబడిన తారీఖునుండి అరవై దినముల లోపల రివెన్యూ బోర్డునకు అట్టి ప్రతి ఉత్తరువు మీద ఒక అపీలు ఉండును. రివెన్యూ బోర్డు ఉత్తరువు ఆఖరుది.

## II వ షెడ్యూలు

'కలెక్టరు' అను పదముకు, అది ఎచ్చట వచ్చిన అచ్చట 'జిల్లా కలెక్టరు' అను పదము ప్రత్యామ్నాయము చేయవలెను.

## 64. ప్రభుత్వపు ముద్రణాలయములో ఫారములు, రిజిష్టర్లు యొక్క కొనుగోలుకు సంబంధించిన నిబంధన

[జి. ఓ. యమ్. యస్. నెం. 309. ప్లానింగు, స్థానిక పరిపాలన (సII) 23 వ ఫిబ్రవరి 1960]

ఏ పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ ప్రభుత్వపు ముద్రణాలయములో అమ్ముటకు ఉంచబడు ఫారములు, రిజిష్టర్లు చెప్పబడిని ముదణ్రాలయము నుండి తప్ప యితర విధముగా కొనగూడదు,

## 65. పంచాయతీలు లేక టవును కమిటీలచే విధింపబడిన పన్నులమీద లేక భూమిపన్ను లేక స్థానిక పన్నుమీద పంచాయతీ సమితులచే సర్‌చార్జీ విధించుటకు పరిమితులు నిర్ణయించు నిబంధనలు

(జి. ఒ. యమ్. యస్. నెం. 882. ప్లానింగు స్థానిక పరిపాలన (స.ii) 6వ జూన్ 1961)

1. ప్రతి పంచాయతీ సమితి, ప్రభుత్వము పూర్వపు అనుమతితో, ప్రతి విషయములోను ఇరువది ఐదు శాతము గరిష్టమువరకు దాని జూరిస్ డిక్షనులో విధింపబడిన పంచాయతీ లేక టవును కమిటీచే విధింపబడిన ఇంటి పన్ను లేక భూమి పన్ను లేక స్థానిక పన్ను మీద సర్‌చార్జి రూపేణా ఒక శుంకమును విధించవచ్చును.

2. ఆ యా పంచాయతీ లేక టవున్ కమిటీచే ఇంటి పన్నుతో సహా, ఇంటి పన్ను మీద సర్‌చార్జీ వసూలు చేయబడి, వెంటనే పంచాయతీ సమితికి చెల్లించబడును.

3. భూమి పన్ను లేక స్థానిక పన్ను మీద సర్‌చార్జీ భూమి పన్ను లేక స్థానిక పన్నుతో సహా వసూలు చేయబడి, భూమి పన్ను లేక స్థానిక పన్నుతో సహా, పంచాయతీ సమితి నిధికి చేర్చబడును.

4. ఇంటి పన్ను మీద సర్ చార్జీ విషయములో, ఆ విధముగా విధింపబడి, వసూలు చేయబడిన సర్‌చార్జి యొక్క వరుంబడులలో పదియవ శాతము, ఆ యా పంచాయతీ లేక టవున్ కమిటీలకు వసూలు ఖర్చుల క్రింద చెల్లింపబడవలెను.

## 66. పంచాయతీ సమితుల, జిల్లా పరిషత్‌ల ఆఖరి తరగతి ఉద్యోగులకు శెలవు మరియు శెలవు భత్యములు మంజూరు చేయుటను క్రమపరచు నిబంధనలు

(జి. ఒ. యమ్. యస్. నెం. 802 ప్లానింగు స్థానిక పరిపాలన (సమితి-II) 18వ మే 1961)

1 (1) పంచాయతీ సమితి జిల్లా పరిషత్తులచే మంజూరు కాబడు పారితోషికములను క్రమపరచు నిబంధనలలో ఆఖరి తరగతి నౌఖరీగా తరగతింపబడిన పదవులను కలిగియున్న ఉద్యోగులు శలవు, భత్యములు.

(i) 4వ సెప్టెంబరు 1933 నకు పూర్వము ఆంధ్ర ప్రదేశములో, పూర్వపు జిల్లాబోర్డుల నౌఖరీలోనికి తీసికొనబడిన, వ్యక్తుల విషయములో ప్రాథమిక నిబంధనలలో నిర్ణయింపబడిన రీతిగా, మరియు

(ii) ఆ తారీఖున లేక తరువాత ఆంధ్రప్రదేశములో పూర్వపు జిల్లా బోర్డుల నౌఖరీలోనికి తీసికొనబడిన వ్యక్తుల విషయములో మరియు పంచాయతీ సమితి జిల్లా పరిషత్తు నౌఖరీలోనికి తీసికొనబడిన వ్యక్తుల విషయములో, 1933న ఆంధ్రప్రదేశ్ శెలవు నిబంధనలలో నిర్ణయింపబడిన రీతిగా ;

(iii) తెలంగాణా ప్రాంతములో పూర్వపు జిల్లాబోర్డుల నౌఖరీలోనికి తీసికొనబడి పంచాయతీ సమితి, లేక జిల్లా పరిషత్తుల లోనికి చేర్చబడిన వ్యక్తుల విషయములో హైదరాబాదు సివిలు నౌఖరీ నిబంధనలలో నిర్ణయించిన రీతిగా యివ్వబడవచ్చును.

(2) అట్టి ఉద్యోగులు, ఈ నిబంధనల అనెక్చరులోని నిబంధనల ప్రకారము, ఆకస్మిక శెలవు అదనముగా మంజూరు చేయబడవచ్చును.

2. అనిశ్చయమైన సిబ్బంది సాధారణమైన ఆకస్మిక శెలవునకు అర్హత గలిగి యుండదు. కాని ప్రత్యేక ఆకస్మిక శెలవు ఈ క్రింద తెల్పిన రీతిగా ప్లేగు యింజక్షనుకు రెండు దినములు, కలరా, సన్నిపాత జ్వరము ఇంజక్షనుకు ఒక దినము తాత్కాలికముగా అసమర్థులుగా చేయబడినప్పుడు మంజూరు చేయబడవచ్చును.

3. పంచాయతీ సమితి బ్లాకు డెవలెప్‌మెంటు ఆఫీసరు జిల్లా పరిషత్తు శెక్రటరీ, ఈ నిబంధనలక్రింద ప్రతి ఆఖరు తరగతి ఉద్యోగి విషయములో అతడు లేక ఆమె సంపాదించిన, అతడు లేక ఆమెకు మంజూరు చేయబడిన శెలవుకు ఒక శెలవు లెక్క ఉంచును.

## అనెక్చరు

# ఆకస్మికపు సెలవు నిబంధనలు

(1వ నిబంధన చూడుము)

1. ఒక క్యాలెండరు సంవత్సరములో మొత్తముమీద పన్నెండు దినములు గరిష్ఠము వరకు ఆఖరి తరగతి ఉద్యోగులు ఆకస్మికపు శెలవు మంజూరు చేయబడవచ్చును. ఆదివారములు లేక మంజూరైన శెలవు దినములతో ఆకస్మికపు శెలవు కలుపవచ్చును. కాని పనిలో లేకపోవు తత్ఫలితముగా వచ్చుకాలము పది దినములకు మించకూడదు. ఈ ఉద్యోగులు ఆకస్మిక శెలవునకు మామూలుగా తీసికొనుదానిగా అర్హతగలిగి యుండరు.

2. పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తు ఆధీనముక్రింద ప్రతి కార్యాలయములో ఆకస్మికపు శెలవు రిజిష్టరు ఒకటి ఉంచబడును.

3. ఆఖరి తరగతి ఉద్యోగుల తరగతికి చెందిన పనుల శాఖల సభ్యులు వారెప్పుడైనను జబ్బువల్ల పనికి హాజరగుటనుండి ఆపుచేయబడినప్పుడు ఆకస్మికపు శెలవు మంజూరుచేయబడవచ్చును. అట్టి శెలవు పూర్తి లేక తగ్గింపు జీతములమీద ఉండవచ్చును.

4. పైన మూడవ నిబంధనలో చెప్పబడిన రీతినితప్ప, ఒక ఉద్యోగి ఆకస్మికపు శెలవులో యున్నప్పుడు అతడు పనిలో ఉన్నప్పుడు మాదిరిగనే జీతమున కర్హత గలిగియుండును.

5. (1) ప్రత్యేకమైన ఆకస్మికపు శెలవు, సాధారణ ఆకస్మికపు శెలవులోకల పని ప్రత్యేక ఆకస్మికపు శెలవు ఆఖరి తరగతి ఉద్యోగికి ఈ క్రింది పరస్థితులలో మంజూరు చేయవచ్చును.

(i) పనిలో తిరిగి ప్రవేశించుటకు దారిలో ప్లేగు క్యాంపులో నిలుపుదల చేయబడినప్పుడు;

(ii) అతని యింటిలో అంటు జబ్బు ఉన్నకారణమువల్ల పనినుండి హాజరుకాకుండుటకు అతని ఆఫీసు అధికారిచే ఉత్తర్వు చేయబడినప్పుడు;

కాని అతని విధులు నిర్వర్తించుటకు ఏర్పాట్లు, పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తుకు అదనపు ఖర్చులు లేకుండగా చేయవచ్చును లేక అతని

జీతమునకు నష్టములేకుండా, హాజరుకానివాని స్థానే ఒకడు ప్రత్యామ్నాయముగా వినియోగింపబడిన విషయములో పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తు ప్రత్యేక మంజూరు పొందవలయును.

గమనిక—(i) ఉద్యోగి యేజబ్బుకైనా లోనైనప్పుడు, నిబంధల క్రింద అతనికి రాదగు క్రమబద్ధమైన సెలవు అతడు హాజరు కాని కాలమునకు తీసికొనవలయును.

(ii) ఈ క్రింది జబ్బులు, ప్రత్యేక అకస్మికపు శెలవు మంజూరు నిమిత్తము అంటురోగములుగా గణింపబడినవి.

1. మశూచికము
2. ఆటలమ్మ
3 ప్లేగు
4. కలరా
5. సన్నిపాత జ్వరము
6. అధికతరమయిన ఇన్‌ఫ్లూయెంజా ; న్యూమోనియా
7. డిఫ్తీరియా
8. సెరిబ్రో స్పైనల్ మినింజిటిస్
9. పొంగు

iii() ఈ "హెడ్" క్రింద శెలవు సాధారణముగా 21 దినములకు మించిన కాలము మంజూరు చేయకూడదు. కాని ప్రత్యేకమైన విషయములలో అది ముప్పది దినములవరకు మంజూరు చేయవచ్చును.

(iv) డిపార్టుమెంటు అధికారి కివ్వబడిన విచక్షణక్రింద, పని నుండి హాజరు కాకుండుట సబబుగా ఆకస్మికపు సెలవుగా పరిగణించుటకు వీలగు కాలము నతిక్రమించిన (i) మరియు (ii) క్లాజుల క్రిందవచ్చు విషయములో ఉద్యోగి, అతనికి రావలసిన క్రమమైన శెలవు అతడు హాజరుకాకుండి మొత్తము కాలముకు, తరువాత అసాధారణమైన శెలవు మంజూరు చేయబడవచ్చును.

(2) సాధారణమైన అకస్మికపు శెలవులో కలవని ప్రత్యేక ఆకస్మికపు శెలవు, ప్లేగు ఇంజెక్షనులకు రెండు దినములు, కలరా లేక సన్నిపాత జ్వరం

ఇంజెక్షనుకు ఒక దినము తాత్కాలికముగా అసమర్థత కలుగజేయబడిన అఖరి తరగతి ఉద్యోగికి మంజూరు చేయవచ్చును.

6. ఆకస్మికపు శెలవు సాధారణముగా యితర శెలవు, శెలవు దినములు లేక వేరు స్థలములో జేరుటకు కావలసిన వ్యవధితో కలపి తీసికొనకూడదు.

పంచాయతీ సమితియొక్క బ్లాకు డెవలెప్‌మెంటు ఆఫీసరు లేక జిల్లా పరిషత్తు కార్యదర్శి ప్రత్యేకమైన విషయములలో అట్టి కలయిక మంజూరు చేయవచ్చును కాని నిబంధనలనుండి తప్పించు ప్రయత్నముండ కూడదు. ఉదాహరణ:— అతని యింటిలో అంటురోగము వ్యాప్తివలన అతడు హాజరు కాకుండవలసిన పరిస్థితిగల, ప్రత్యేక ఆకస్మిక శెలవు మంజూరుచేయ వలసిన ఒక ఉద్యోగియే జబ్బుకులోనైన కావలసినటువంటి శెలవు మంజూరుచేయబడవలసి వచ్చినపుడు.

## 67. పంచాయతీ సమితుల, జిల్లా పరిషత్‌లచే వారి ఆఫీసర్లకు, ఉద్యోగులకు పారితోషికముల మంజూరును క్రమపరచుటకు నిబంధనలు

[జి. ఒ. యమ్. యస్. నెం. 799, ప్లానింగు స్థానిక పరిపాలన (స. II) 18వ మే 1961.]

1. ఈ నిబంధనలలో, అర్థము వేరుగా రావలసిన విషయములో తప్ప—

(i) "జీతము" అనగా నెలకు రావలసిన భత్యములులేని జీతము. అది స్వంతమున కిచ్చునది కూడ కలిగియున్నది ;

(ii) "ఉద్యోగి" అనగా పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ క్రింద పదవిని కలిగియున్న ఆఫీసరు లేక ఉద్యోగి; మరియు

(iii) "అఖరి తరగతి నౌఖరీ" మరియు "ఉత్తమ తరగతి నౌఖరీ" అనగా ఈ నిబంధనలకు అనెక్చరు Iలో అఖరి తరగతి ఉత్తమ తరగతిగా తరగతింపబడిన పదవులలో నౌకరీ అని అర్థము.

2. ఈ నిబంధనల క్రింద పారితోషికములు, శాశ్వతమైన, తాత్కాలిక మైన, భత్యములతో శెలవుమీద హాజరుకాని కాలపరిమితులతోసహా అతనికి హక్కు గల పదవి లేక అతడు ప్రస్తుతము పనిచేయుచున్న పదవి గల ఏ ఉద్యోగి విషయములో అనువతించబడును. పారితోషికము పూర్తి పనిచేసిన సంవత్సరములకు మాత్రమే యివ్వదగును. పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ అధ్యక్షుడు లేక చైర్మన్, మూడు నెలలు దాటని లోటును, అర్హత గల విషయములలో క్షమించవచ్చును. పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ యిదే మాదిరిగా పన్నెండు నెలలకు మించని లోటును క్షమించవచ్చును.

3. ప్రావిడెంటుఫండు లాభములకు అతడు అర్హత గల ఉద్యోగపు కాలమునకు, ఏ పారితోషికము ఏ ఉద్యోగికి యివ్వకూడదు.

4. అతడు చేర్చబడిన పెన్షను స్కీము క్రింద అతనికి యివ్వదగు ఏ పారితోషికము మినహాయించి, అతని ఉద్యోగ కాలము పెన్షనుకు అర్హతగల ఉద్యోగికి, ఈ నిబంధనల క్రింద ఏ పారితోషికము యివ్వబడదు.

5. ఈ క్రింది ఉద్యోగులకు పారితోషికము యివ్వబడును.

(ఎ) పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ నౌఖరీలనుండి తొలగింపబడిన వ్యక్తి; లేక

(బి) అతని దుష్ప్రవర్తనము లేక అసమర్థతవల్ల తీసివేయబడిన లేక ఉద్యోగమునకు రాజీనామా ఇవ్వవలసినదిగా కోరబడిన వ్యక్తి; లేక

(సి) అతనంతట అతను ఉద్యోగమునకు రాజీనామా యిచ్చినవ్యక్తి.

6. (1) పూర్వపు జిల్లాబోర్డుల క్రింద నౌకరీ కలుపుకొని పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ క్రింద మొత్తము నౌఖరీ ఐదు సంవత్సరములకు తక్కువయిన యెడల ఒక ఉద్యోగికి ఏ పారితోషికము యివ్వబడదు,

(2) ఒక వ్యక్తి ప్రావిడెంటు నిధి లాభములకు అతడు చేర్చబడుటకు ముందు నౌఖరీకి అట్టి నౌఖరీ ఐదు సంవత్సరములకు తక్కువయినను, ఒక ఉద్యోగికి పారితోషికము యివ్వదగును. కాని అతని మొత్తము ఉద్యోగపు కాలము 5 సంవత్సరములకు తక్కువ కాకూడదు. విచ్ఛిన్నమైన నౌఖరీ విషయములో కూడ ఒక ఉద్యోగికి పారితోషికము యివ్వదగును.

7. (1) ఉత్తమ నౌకరీలోని ఉద్యోగికి, పారితోషికము యీ క్రింది విషయములలో చెల్లించవచ్చును.

(ఎ) అతడు ఉద్యోగ కాలము అయిన తరువాత లేక ఉద్యోగమున కనర్హుడుగా పరిగణింపబడినప్పుడు, ఉద్యోగమునుండి విరమించినప్పుడు.

(బి) సిబ్బంది తగ్గింపువల్ల లేక దుర్ప్రవర్తనము లేక అసమర్థత కారణములు కాని యితర కారణములవల్ల నౌకరీ నుండి అతడు తొలగింపబడినప్పుడు.

(2) పారితోషికము ఆఖరి తరగతి నౌకరీలోని ఉద్యోగికి ఈ క్రింది విషయములలో చెల్లించవచ్చును.

(ఎ) శారీరక మానసిక దుర్బలత్వమువల్ల అతడు శాశ్వతముగా ఇక ఉద్యోగము చేయుటకు అనర్హుడుగా చేయబడినప్పుడు, లేక

(బి) అతడు చేయు ఉద్యోగము తీసివేయుటవల్ల లేక సిబ్బంది తగ్గింపువల్ల అతడు నౌఖరీనుండి తొలగింపబడి, వేరే తగిన ఉద్యోగము అతనికి లేనప్పుడు.

8. (1) 2 నుండి 7వరకు 12 నిబంధనలలోని ఏర్పాట్లకు బద్ధమై, ప్రావిడెంటు నిధి లాభముకు చేర్చబడని ఉత్తమ నౌఖరీలో వున్న ఉద్యోగులు, యీ క్రింది నియమితములకు బద్ధమై ప్రతి సంవత్సరపు నౌఖరీకు ఒక అర్ధనెల జీతము చొప్పున పారితోషికము ఇవ్వబడవచ్చును—

(i) నెలకు 300 రూపాయలకు మించిన జీతము మీద వున్న ఉద్యోగుల విషయములో నౌఖరి పదునెనిమిది సంవత్సరములకు క్రిందయున్న విషయములో ఆరు నెలల జీతము దాటకుండగను, పదునెనిమిది సంవత్సరములు లేక ఎక్కువ యున్న విషయములో పన్నెండు నెలల జీతము దాటకుండను పారితోషికము ఇవ్వబడవచ్చును.

(ii) నెలకు 300 రూపాయలు లేక తక్కువ జీతముమీద వున్న ఉద్యోగుల విషయములో నౌఖరీ పదునైదు సంవత్సరములకు క్రింద యున్న విషయములో ఆరు నెలల జీతము దాటకుండగను పదునైదు సంవత్సరములు లేక ఎక్కువ వున్న విషయములో పదిహేను నెలల జీతము దాటకుండగను పారితోషికము ఇవ్వబడవలెను.

(2) 7 వ నిబంధన క్రింద పారితోషికము చెల్లింపబడవలసిన కాలములో తీసికొనిన జీతముమీద యీ నిబంధన క్రింద పారితోషికము గుణింపబడవలెను.

9. (1) 2 నుండి 6, 12 నిబంధనల ఏర్పాట్లకు బద్ధమై, వారి నౌఖరీ కాలములో ప్రావిడెంటు నిధి లాభములకు మాత్రము చేర్చబడిన ఉత్తమ నౌఖరీలోయున్న ఉద్యోగులు, ఈ క్రింది నియమితములకు బద్ధమై ప్రావిడెంటు నిధినుండి వారికి హక్కుగల మొత్తములకు అదనముగా ప్రావిడెంటు నిధి లాభములకు చేర్చబడుటకు ముందు ప్రతి సంవత్సరపు నౌఖరీకు ఒక అర్ధ నెల జీతము చొప్పున పారితోషికము ఇవ్వబడవచ్చును.

(i) 300 రూపాయలకు పైనగల నెల జీతముమీద వున్న ఉద్యోగుల విషయములో, అట్లు చేర్చబడుటకు ముందు నౌఖరీ పదునెనిమిది సంవత్సరములకు క్రింద యున్నయెడల ఆరు నెలల జీతము మించకుండగను, పదునెనిమిది సంవత్సరములు లేక ఎక్కువయున్న విషయములో పన్నెండు నెలల జీతము మించకుండగను పారితోషికము ఇవ్వబడవలెను.

(ii) 300 రూపాయలమీద దానికన్న తక్కువ జీతము మీద యున్న ఉద్యోగుల విషయములో అట్లు చేర్చబడుటకు ముందు నౌఖరీ పదునైదు సంవత్సరములకు తక్కువగా యున్న ఆరు నెలల జీతము దాటకుండగను, అది పదిహేను సంవత్సరములు లేక ఎక్కువయున్న విషయములో పదిహేను నెలల జీతము దాటకుండగను పారితోషికము యివ్వబడవలెను.

(2) ప్రావిడెంటు నిధికి చేర్చుటకు వెంటనే ముందు తీసిన జీతము మీద (1) వ సబ్ రూలు క్రింద పారితోషికము గుణింపబడవలెను.

10. (1) 2 నుండి 5, 12 నిబంధనలలోని ఏర్పాటుకు బద్ధమై యీ క్రింది నియమితములకు బద్ధమై ప్రతి సంవత్సరము నౌఖరీకి ఒక నెల జీతము వంతున ఆఖరి తరగతి నౌఖరీలోయున్న ఉద్యోగులకు పారితోషికము చెల్లింపబడవచ్చును.

(i) పూర్వపు జిల్లా బోర్డుల క్రింద చేసిన నౌఖరీ కలుపుకొని, మొదటి ఐదు సంవత్సరముల నౌఖరీ విషయములో ఏ పారితోషికము చెల్లింపబడదు; మరియు,

(ii) పారితోషికము ఏ విషయములోను పన్నెండు నెలల జీతము మించకూడదు.

(2) (1) వ సబ్‌రూలు క్రింద పారితోషికము, 7వ నిబంధన క్రింద పారితోషికము చెల్లింపవలసిన కాలములో తీసిన జీతము మీద గుణింప బడవలెను.

11. ఈ నిబంధనల క్రింద పారితోషికము పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్‌చే మంజూరు చేయబడవలెను. 8, 9, 10 నిబంధన క్రింద ఏర్పరచిన రేట్లు గరిష్టముగా భావింపబడి చేసిన నౌకరీ పూర్తిగా తృప్తికరముగా యున్న తప్ప మంజూరు చేయబడవు. నౌఖరీ పూర్తిగా తృప్తికరముగా లేని విషయములో, పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ చెల్లింప వలసిన మొత్తములో దానికి యుక్తమని తోచినట్టి తగ్గింపును చేయవచ్చును.

12. ఆఖరి తరగతిలో వున్న ఉద్యోగికి యివ్వదగు పారితోషికము గుణించుటలో, అతడు 16 సంవత్సరములు పొందిన తరువాత అతడు చేసిన నౌఖరీ మాత్రము లెఖ్ఖలోనికి తీసికొన బడవలెను. ఉత్తమ నౌఖరీలో యున్న ఉద్యోగి విషయములో అతడు 20 సంవత్సరములు పొందిన తరువాత అతడు జేసిన నౌఖరీ మాత్రము లెఖ్ఖలోనికి తీసికొన బడవలెను.

13. (1) ఒక భాగపు నౌఖరీకి ఆఖరి తరగతిలోను ఒక భాగపు నౌఖరీ ఉత్తమ తరగతిలోను ఉన్న ఉద్యోగి—

(a) ఆఖరి తరగతి స్కేలు మీద పారితోషికముకు మొత్తము నౌఖరీ అంతయు ఆఖరి తరగతిగాను, లేక

(b) ఉత్తమ స్కేలు మీద పారితోషికముకు ఉత్తమ భాగమును, ఆఖరి తరగతి స్కేలు మీద పారితోషికముకు ఆఖరి తరగతిగాను, లెఖ్ఖలోనికి తీసికొనవచ్చును.

(2) ఒకటవ ఉప నిబంధన క్లాజు (a) క్రింద, 7వ నిబంధన క్రింద పారితోషికము చెల్లింప వలసిన కాలములో లేక ప్రావిడెంటు నిధికి చేర్చబడుటకు వెంటనే ముందు ఉద్యోగి తీసిన (ఉత్తమ తరగతిలో గాని ఆఖరి తరగతిలో గాని) జీతముమీద పారితోషికము గుణింప బడవలెను.

(3) (1)వ సబ్ రూల్ యొక్క క్లాజు (b) క్రింద, ప్రతి స్కేలు మీద పారితోషికము వరుసగా ఆఖరి తరగతి నుండి ఉత్తమ తరగతి నౌకరీకు

లేక ఉత్తమ తరగతి నుండి ఆఖరి తరగతి నౌఖరీకి బదలాయింపు కాలములో మరియు 7వ నిబంధన క్రింద పారితోషికము చెల్లింపవలసిన కాలములో లేక ప్రావిడెంటు నిధికి చేర్చబడుటకు వెంటనే పూర్వము ఉద్యోగి తీసికొనిన జీతము మీద గుణింపబడవలెను. ఒక ఉద్యోగి దుష్ప్రవర్తనము వలన ఉత్తమ తరగతి నౌకరీనుండి ఆఖరి తరగతి నౌఖరీకు తగ్గింపబడిన యెడల, ప్రభుత్వము ప్రత్యేక మంజూరుతో తప్ప, ఈ నిబంధన క్రింద అతనికి ఏ పారితోషికము చెల్లింపబడదు.

వివరణ:- ఆఖరి తరగతి పారితోషికము ఉత్తమ తరగతి పారితోషికముతో కలుపుకొని, మొత్తము నౌఖరీ అంతయు ఉత్తమ తరగతి నౌఖరీగా భావింపబడిన యివ్వదగు పారితోషికము మొత్తమును మించకూడదు.

14. ఒక ఉద్యోగి నౌకరీలో చనిపోయిన యెడల అతని కుటుంబము, పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ అది అవసరమైన పరిస్థితులలో ఉన్నదని తృప్తిపడిన యెడల, చనిపోయిన తేదీన 7వ నిబంధన క్రింద చెల్లింపవలసిన మాదిరిగా పారితోషికము చెల్లింప బడవచ్చును.

వివరణ:- ఈ నిబంధన కొరకు, కుటుంబము, ఉద్యోగి భార్య, అతని న్యాయసమ్మతమైన పుత్రులు అనగా అతనితో నివసించుచు పూర్తిగా అతని మీద ఆధారపడిన దత్తపుత్రులు, మరియు అతని మీద పూర్తిగా ఆధారపడి అతనితో నివసించు అతని తల్లిదండ్రులు, అప్పచెల్లెళ్లు, మైనరు అన్నదమ్ములు కూడ అయివున్నది. పైన నిర్వచించిన విధముగా ఉద్యోగికి కుటుంబము లేని యెడల మరియు అతడు ప్రోవిడెంటు నిధికి డబ్బు దాచిపెట్టుకొను వాడైన యెడల అతనికి చెల్లించ వలసిన పారితోషికము ఏదైన యున్నయెడల పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ ప్రావిడెంటు నిధి మొత్తమును గ్రహించు నామినీ అవసరమైన పరిస్థితిలో ఉన్నాడని తృప్తి పడిన యెడల అట్టి నామినీకి చెల్లింపబడవచ్చును.

15. ఒక ఉద్యోగి వివిధ పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్‌ల క్రింద నౌకరీ చేసినయెడల, వివిధ పంచాయతీ సమితులు లేక జిల్లా పరిషత్‌ల క్రింద నౌఖరీ, ఈ నిబంధనల క్రింద యివ్వదగు పారితోషికము గుణించుట కొరకు కలపబడి మొత్తముగా భావింపబడును. పారితోషికము చెల్లించుటకు బాధ్యత వివిధ పంచాయతీ సమితులు లేక జిల్లా పరిషత్‌ల మధ్య అతని లెఖ్ఖలోనికి తీసి కొనదగు మొత్తము నౌకరీ కాలములో ఉద్యోగి గ్రహించిన మొత్తము జీతము వారు చెల్లించిన నిష్పత్తిలో విభజింపబడును. అట్టి విభజనమీద, పారితోషికము

మొత్తములో మూడవవంతుపైన ఒక పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ చెల్లింప వలసినదని కనుగొనిన, ఆ పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ మొత్తము ఖర్చును భరింపవలయును. ఏ విభజన జరుగకూడదు.

వివరణ:- ఈ నిబంధన ఒక పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ నుండి యింకొక పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ క్రింద ఉద్యోగము తీసికొనుటకు రాజీనామా యిచ్చిన విషయములలో అనువర్తించదు.

16. (1) (a) ఈ నిబంధనల క్రింద పారితోషికమునకు అర్హతగల ఒక ఉద్యోగి అతని ఆఫీసు అధికారికి దాని చెల్లింపు కొరకు ఒక దరఖాస్తు దాఖలు చేయును.

(b) 7వ నిబంధనయొక్క (2) వ ఉప నిబంధన యొక్క క్లాజు(a) క్రింద పారితోషికము కొరకు ప్రతి దరఖాస్తు, ఇక నౌకరీకి దరఖాస్తు దారుడు అనర్హుడని వైద్యాధికారి యిచ్చిన సర్టిఫికేటుతో యుండవలెను.

(c) ఒక ఉద్యోగి అతని నౌఖరీ కాలములో లేక పారితోషికమునకు దరఖాస్తు దాఖలు చేయుటకు ముందు చనిపోయినచో, పారితోషికమునకు దరఖాస్తు 14వ నిబంధన క్రింద పారితోషికమునకు అర్హతగల వ్యక్తిచే చేయబడును లేక అట్టి వ్యక్తి మైనరు అయినప్పుడు లేక యితర విధముగా అనర్హుడు చేయబడినప్పుడు, అట్టి వ్యక్తి గార్డియన్‌చే చేయబడును.

(d) పారితోషికము చెల్లింపుకు ప్రతి దరఖాస్తు—

(i) ఉద్యోగి నౌఖరీ నుండి విడుదలయిన ;

(ii) తొలగింపబడిన ; లేక

(iii) చనిపోయిన తేదీనుండి ఆరు నెలలలోపున దాఖలు చేయబడవలెను.

(2) పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ అధ్యక్షుడు లేక చైర్మన్ దరఖాస్తు చేసిన పారితోషికము చెల్లించుటకు తలపెట్టిన, ఈ నిబంధనలకున్న అనెక్చరు II లోని ఫారములో పారితోషికముకు అతడు ఒక దరఖాస్తు తయారు చేయును.

## అనెక్చరు I

| ఉత్తమ తరగతి | ఆఖరి తరగతి |
|---|---|
| నౌఖరీలోని పదవులు | నౌఖరీలోని పదవులు |
| సీనియర్ అక్కౌంటెంట్లు | హాస్పిటళ్లు, మందుల షాపులు, ఫారములలో పనిచేయువారు |
| జూనియరు అక్కౌంటెంట్లు | దర్జీయివర్లు |
| పంచాయతీ సమితులు, జిల్లా పరిషత్తులక్రింద గుమస్తాలు | దఫేదార్లు |
| కంపౌండర్లు | హాస్పిటళ్ళలో దాయాలు |
| హెడ్ మాస్టర్లు | లేబరేటరీలో పనిచేయు బంట్రోతు లేక అటెండరు |
| హెల్తువిజిటర్లు | నర్సింగు ఆర్డర్లీలు |
| వీవింగు, కమర్షియల్ మాన్యుయల్ ట్రెయినింగు, వ్యాయామ పరిశ్రమ; సంగీతము, టర్నింగు, ఫౌండ్రీ, కంసాలి అంగడి, వడకుపని, నూలు రంగులువేయుట, మత సంబంధమైన పని, తోటపని, చెక్కపని, కలప పని, మొదలైన వాటిలో | బంట్రోతులు |
| ఇన్‌స్ట్రక్టర్లు | |
| లైబ్రేరియన్లు | |
| మేనేజర్లు | |
| మున్షీలు | |
| మెడికల్ ఆఫీసర్లు (అలోపతీ యల్. ఐ. యమ్, ఆయుర్వేదము, యునాని) | |
| మంత్రసానులు | |
| బడి పంతుళ్లు | |
| డ్రాయింగు, డ్రిల్లు మొదలైనవి. | |
| నర్సులు | |
| పండితులు | |

చికిత్సకులు (ఆయుర్వేదము, యునాని
మందుల షాపులు)
కార్యదర్శులు
సూపరిన్ టెన్ డెంటులు
శానిటరీ అసిస్టెంటు ఇన్ స్పెక్టర్లు
స్టోరు కీపర్లు
ఉపాధ్యాయులు
టైపిస్టులు
టీకాలు వేయువారు
స్త్రీ వైద్యాధికారి, మాతృ శిశు
సంరక్షణ.

## అనెక్సరు II

1. దరఖాస్తుదారుని పేరు
2. తండ్రిపేరు
3. సంతతి, తెగ, కులము
4. నివాస స్థలము, (గ్రామము, జిల్లా తెలుపుచూ)
5. ఉద్యోగపు శాఖపేరుతోసహా ప్రస్తుత లేక వెనుకటి ఉద్యోగము
6. ఉద్యోగపు ప్రారంభపు తేదీ
7. ఉద్యోగ అంత్యపు తేది
8. ఉత్తమ తరగతి, ఆఖరి తరగతి లెఖ్ఖలోనికి రాని నౌకరీ కాలము ఆటంకములతో సహా మరియు ఆటంకములు
9. పారితోషికమునకు దరఖాస్తు పెట్టిన తరగతి, దరఖాస్తు పెట్టుటకు కారణము
10. (సరాసరి) వేతనములు లేక జీతము
11. ఇవ్వదలచుకొన్న పెన్షను।
12. ఇవ్వదలచుకొన్న పారితోషికము
13. పెన్షను ప్రారంభించు తేదీ
14. చెల్లించు స్థలము

15 క్రీస్తు శకము లెఖ్ఖలో దరఖాస్తు దారుని పుట్టిన తేదీ *
16 ఎత్తు
17 గుర్తులు
18 తేదీ

అధ్యక్షుడు లేక చైర్మన్ సంతకము.

దరఖాస్తు పరిహారము పెన్షన్ లేక పారితోషికమునకు అయిన యెడల, హక్కు కలుగజేసిన నౌఖరీ శాఖ మార్పుయొక్క స్వభావము పూర్తిగా నిర్వచించవలయును.

స్పష్టముగా తెలియని విషయములో, మంచి సమాచారము లేక అంచనామీద నిర్వచించవలయును.

నౌఖరీ యొక్క చరిత్ర (ఆటంకము తెలియజేయుచూ)

| ఎస్టాబ్లిష్‌మెంటు | నియమించుట | జీతము రూ. నపై. | ప్రస్తుతము కొనుచున్నజీతము | తీసు భవుతేది | ప్రారంభతేది | పంపించు తేది | నౌకరీగా భావించు కాలం సం. నె. రో. |
|---|---|---|---|---|---|---|---|

| నౌఖరీగా భావించని కాలము సం. నె. రో | రిమార్కు | ఏ విధముగా సరిచూచినది | లోకల్ ఫండు 1 ఎక్కౌంట్ల ఎగ్జామినర్ రిమార్కు |
|---|---|---|---|

మొత్తము కాలము
ఉత్తమ తరగతి
అధమ తరగతి నౌఖరీ.

ఆఫీసు అధికారిచే రిమార్కు

1. దరఖాస్తుదారుని నడత యిది వరకు ప్రవర్తనను గురించి,
2. అపుదల చేయబడుట లేక తక్కువ స్థానమునకు త్రోయబడుటకు సంజాయిషీ.

3. దరఖాస్తుదారునిచే యింతకు ముందే గ్రహించిన పారితోషికము లేక పెన్షనును గురించి

4. ఏ యితర రిమార్కులు

5. కోరబడిన నౌఖరీ స్థాపితమైనదా, అది తీసికొనబడవచ్చునా లేదా అను దానిని గురించి ఆఫీసు అధికారియొక్క నిర్దిష్టమయిన ఉద్దేశము.

### సర్టిఫికేటు రిపోర్టు.

ఈ క్రింద రికార్డు చేయబడిన రిమార్కులకు బద్ధమై ఉత్తమ, అధమ తరగతులలో లెక్కలోనికి తీసికొన దగిన నౌఖరీలు సంవత్సరములు నెలలు రోజులకు క్రమముగా ఋజువు పడినదని,

### పారితోషికమునకు దరఖాస్తు

దరఖాస్తు తేదీ
దరఖాస్తుదారుని పేరు
ఆఖరు ఉద్యోగము
పారితోషికము తరగతి
పారితోషికము మొత్తము
ప్రారంభపు తేదీ
మంజూరు తేదీ



# అనుబంధము

## 1960 వ ఆంధ్రప్రదేశ్‌కు జిల్లాబోర్డు చట్టములను సరిపుచ్చి అనువర్తింపజేయు ఉత్తరువు. వీటిలో వాటిని తెలియజేయు పట్టిక

ఒకటవ షెడ్యూలు:- 1920 వ ఆంధ్రప్రదేశ్ (ఆంధ్ర) జిల్లాబోర్డుల చట్టము యొక్క విబంధనలను పంచాయతీ సమితులకు జిల్లా పరిషత్‌లకు అనువర్తింపజేయుట.

రెండవ షెడ్యూలు:- ఆంధ్రప్రదేశ్ (తెలంగాణా) జిల్లా బోర్డుల చట్టములోని నిబంధనలను పంచాయతీ సమితులకు జిల్లా పరిషత్‌లకు అనువర్తింప జేయుట.

మూడవ షెడ్యూలు:- 1910 వ ఆంధ్రప్రదేశ్ (ఆంధ్ర) జిల్లాబోర్డుల చట్టమునకు సరిచూచి మార్పులు.

నాలుగ షెడ్యూలు:- 1956 వ ఆంధ్రప్రదేశ్ (తెలంగాణా) జిల్లా బోర్డుల చట్టమునకు సరిచూచి మార్పులు.

# 1960 వ ఆంధ్రప్రదేశ్‌కు జిల్లాబోర్డుల చట్టములను సరిపుచ్చి అనువర్తింప జేయు ఉత్తరువు

(జి. ఓ. యం. యస్. నెం. 624, ప్లానింగు, స్థానికపు పరిపాలన సమితి II), 27వ ఏప్రియల్ 1960)

1959వ, ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సమితులు, జిల్లా పరిషత్‌లు చట్టము (1959వ ఆంధ్రప్రదేశ్ 35 చట్టము యొక్క 61వ సెక్షను ఇచ్చిన అధికారములను చలాయించి, ఆంధ్రప్రదేశ్ గవర్నరు యిందుమూలముగా ఉత్తరవు చేయుచున్నారు.

(i) ఒకటవ షెడ్యూల్సులోని (1)వ కాలములో, నిర్దిష్టమైన 1920వ మదరాసు జిల్లాబోర్డుల చట్టము (1920 (ఆంధ్రప్రదేశ్ (ఆంధ్ర) చట్టము xiv) యొక్క నిబంధనలు, రెండవ షెడ్యూలులోని (2)వ కాలములో నిర్దిష్టమైన 1956వ హైదరాబాదు జిల్లా బోర్డుల చట్టము (1956వ ఆంధ్ర ప్రదేశ్ (తెలంగాణా) చట్టము 1) యొక్క నిబంధనలు పంచాయితీ సమితి లేక జిల్లా పరిషత్‌లకు వాటిని గురించి (3)వ కాలములో తెలిపిన మాదిరిగా అనువర్తించును;

(ii) వరుసగా మూడు నాలుగు షెడ్యూల్సులో తెల్పిన 1920 వ మదరాసు జిల్లాబోర్డుల చట్టము (1920వ చట్టము xiv) యొక్క నిబంధనలు; 1956వ హైదరాబాదు జిల్లాబోర్డుల చట్టము (1956వ ఆంధ్రప్రదేశ్ (తెలంగాణా) చట్టము I) యొక్క నిబంధనలు, అవి నిర్మూలింపబడు వరకు లేక అర్హతగల చట్టముల నేర్పరచు అధికారులచేత లేక యితర అర్హతగలచట్టముల నేర్పరచు అధికారులచేత లేక యితర అర్హతగల అధికారిచేతగాని సవరణ చేయబడువరకు, ఆ షెడ్యూల్సులో నియమింపబడిన సరిచేయుటలు, మార్పులకు లోనై అమలులో నుండును లేక ఆవిధముగా వుత్తరువు వుండినచో అవి నిర్మూలింపబడును.

## ఒకటవ షెడ్యూలు

1920వ మదరాసు జిల్లాబోర్డుల చట్టములోని నిబంధనలను పంచాయతి సమితులు జిల్లా పరిషత్‌లకు అనువర్తించుట.

| సంబంధముగల సెక్షనుకు అన్వయము | నిబంధన క్లుప్త వివరము. | అనువర్తించు అధికారి |
|---|---|---|

| | | |
|---|---|---|
| 74 బి | భూమిపన్ను | జిలా పరిషత్ |
| 74 సి | ఆస్తి బదిలాయింపుమీద డ్యూటీ (పంచాయతీ కాని ప్రదేశములు) | పంచాయతీ సమితి |
| 76 | యాత్రికపన్ను | పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ |
| 112(1)(i) | ఉత్తర ప్రత్యుత్తరములు | పంచాయతీ సమితి మరియు జిల్లా పరిషత్ |
| 112(1)(ii) | చేట్లను నాటుట | పంచాయతీ సమితి |
| 112 1 (iii) | అసుపత్రి మొదలగువాటిని నిర్మించుట, నిర్వహించుట | పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ |
| 112(1)(iv) | ఆరోగ్య నిధులకు, క్షేమ సమాజములు మొదలగువాటికి విరాళములు యిచ్చుట | పంచాయతీ సమితి |
| 112(1)(v) | విద్యను వ్యాపింపజేయుట | పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ |
| 112(1)(vi) | జీతములు, సెలవు భత్యములు మొదలగు వాటిని చెల్లించుట | పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ |
| 1'2(1)(vii) | జిల్లాబోర్డు వారిచే న్యాయరీత్యా చేసిన ఏ అప్పులమీద యివ్వవలసిన ఏమొత్తములనైనను చెల్లించుట | డిటో |
| 112(1)(viii) | ఏ కోర్టు డిక్రీ క్రిందనైనను యివ్వవలసిన మొత్తములను చెల్లించుట | డిటో |
| 122 | బావులను మూసివేయుట, శుభ్రపరచుట | పంచాయతీ సమితి |

| | | |
|---|---|---|
| 123 | గుంటలు మొదలైనవాటిని నింపుట | పంచాయతీ సమితి |
| 124 | కొన్నిపనులకు బహిరంగ చెరవులు మొదలైనవాటిని విడిగా నుంచుట | డిటో |
| 125 | తెలియజేసిన పనులకు తప్ప యితర పనులకు ఆవిధముగా విడిగాయుంచిన స్థలములను వినియోగించుట నిషేధము | డిటో |
| 126 | చెలువులు, నూతులు మొదలైన వాటి నిర్వహణ | డిటో |
| 126 (a) | అందరికి వీలగు బహిరంగ నూతులకు మొదలైనవి | డిటో |
| 127 | స్వంత పాయిఖానాలు మొదలైన వాటిని శుభ్రపరచుట | డటొ |
| | యాత్రిక స్థలములు మొదలైన వాటిమీద ఆధిపత్యముగల వ్యక్తులనుండి విరాళము | పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తు |
| 129 | మురికి పైకి ప్రవహించకుండా వుంచుటకు నిషేధము | పంచాయతీ సమితి |
| 129 (ఎ) | స్వంత నీటిప్రవాహమును నిర్మించుట లేక తీసివేయుటకు కావలసిన అధికారము | డిటో |
| 131 | భవనములు వస్తువులను కడుగుటకు, దుర్వాయువులను పోగొట్టుటకు అనుమానమున్న స్థలములలోనికి ప్రవేశించుటకు అధికారము | డిటో |

| | | |
|---|---|---|
| 132 | కడుగుటకు, దుర్వాయువులను పోగొట్టుటకు స్థలములను ప్రకటించుటకు నిర్వహణాధికారి | పంచాయతీ సమితి |
| 133 | వ్యాపారముచేయు అంటురోగముతో బాధపడు వ్యక్తులను బహిష్కరించుట | డిటో |
| 134 | ప్రమాదమైన జబ్బులనుండి, అంటు రోగములచే బాధపడు వ్యక్తులు | డిటో |
| 135 | బహిరంగ వినోదస్థలముల మూసివేయుటకు ఉత్తరువునకు అధికారము | డిటో |
| 136 | పాఠశాలకు హాజరగుటకు వీలులేని ప్రమాదజబ్బు నుండి మైనరు బాధపడుట | డిటో |
| 137 | తప్పనిసరిగా టీకాలు వేయుట | డిటో |
| 138 | మసూచికమును గురించి సమాచారము యిచ్చుటకు బాధ్యత | డిటో |
| 139 | మసూచికము టీకాలు యిచ్చుట నిషేధము | డిటో |
| 140 | పాతిబెట్టు తగులబెట్టు (శ్మశాన వాటిక స్థలములను రిజిష్టరీచేయుట | డిటో |
| 141 | చనిపోయినవారిని పరిష్కరించు స్థలములకు లైసెన్సు యిచ్చుట | డిటో |
| 142 | పాతిపెట్టు, తగులబెట్టు స్థలములు, శ్మశానములు ఏర్పాటు | డిటో |
| 143 | రిజిష్టరీకాబడిన, లైసెన్సుకాబడిన, ఏర్పాటు కాబడిన స్థలములకు ఒక పుస్తకము నుంచుట | డిటో |

| | | |
|---|---|---|
| 144 | ఉత్తరువులేని స్థలములలో పాతి పెట్టుట లేక కాల్చుటను నిషేధము | పంచాయతీసమితి |
| 145 | పాతిపెట్టుట మొదలగువాటిని గురించి నోటీసు యిచ్చుట | డిటో |
| 146 | ఆరోగ్యమునకు ప్రమాదకరమగు పాతి పెట్టు, తగులబెట్టు, స్థలములు లేక సమాధులతో నిండియున్న స్థలము ఉపయోగ నిషేధము. | డిటో |
| 147 | ప్రమాదకరమైన కట్టడముల విషయములో జాగ్రత్తలు, | డిటో |
| 148 | ప్రమాద కరమైన చెట్ల విషయములో జాగ్రత్తలు. | డిటో |
| 149 | భూమిమీద భవనములకు కంచెవేయుట, చెట్లను కంచెలను సరిచేయుట. | డిటో |
| 150 | ప్రమాదకరమైన చెరువులు, బావులు, రంధ్రములు మొదలైనవాటి విషయములో జాగ్రత్తలు. | డిటో |
| 151 | రాజబాట దగ్గర రాళ్ళను త్రవ్వి ఎత్తుటకు పొందవలసిన లైసెన్సు | డిటో |
| 153 | భూములనుండి, భవనములనుండి హానికరమైన మొక్కలను లేక మురికిని తీసి వేయుట. | డిటో |
| 154 | విడిగా తిరుగు పందులను, కుక్కలను నాశనము చేయుటకు అధికారము. | డిటో |
| 155 | పడగొట్టబడిన ప్రమాదకరమైన కట్టడము మొదలైన వాటి పరికరములను ఉపయోగించుటకు లేక అమ్ముటకు లేక అమ్ముటకు అధ్యక్షుని అధికారము. | డిటో |

| | | |
|---|---|---|
| 156 | పరిహారము నియమితము. | పంచాయతీ సమితి |
| 157 | రాజవీధులలోను లేక వాటి మీద అడ్డుదలను నిషేధము | డిటో |
| 158 | తలుపులు, క్రిందనేలలు, కిటికీలు, బయటికి తెరచుకున్న కమ్మీలు మొదలైన వాటిని క్రమపరచుట, వాటిని నిషేధించుట. | డిటో |
| 159 | ఆక్రమణలను నిర్మూలించుట. | డిటో |
| 160 | కొన్ని "ప్రొజెక్షనులు", "ఎరక్షనులు" ఒప్పుకొనుటకు అధికారము. | డిటో |
| 161 | అనుమతి లేనిదే, మురికినీళ్ళ కాలువ మీద, జలదారి మొదలగు వాటిమీద భవనమును నిషేధించుట. | డిటో |
| 162 | హానికరమగు చెట్లు మొదలగు వాటిని తీసివేయుటను గురించిన నోటీసు. | డిటో |
| 163 | రాజవీధిలో గోతులు త్రవ్వుట, అడ్డు కలుగజేయుటను నిషేధము. | డిటో |
| 163 (a) | అనుమతి లేనిదే రాజవీధులలో చెట్లను నాటుట లేక పడగొట్టుటను నిషేధము. | డిటో |
| 164 | భూమిని అనధికారముగా ఆక్రమించుకొనినందుకు, అపరాధము, పరిహారమును వసూలు చేయుట. | డిటో |
| 165 | విస్తారమైన జనసమ్మర్దమువల్ల కలిగిన ఖర్చులను వసూలు చేయుటకు లోకల్ బోర్డు అధికారము. | డిటో |
| 166 | బహిరంగ సంతలు | డిటో |
| 167 | బహిరంగ సంత విషయములో అధికారము. | డిటో |

| | | |
|---|---|---|
| 169 | బహిరంగ సంతలమీద అధ్యక్షుని పంచాయతీసమితి ఆధీనము. | |
| 171 | స్వంత సంతకు లైసెన్సు | డిటో |
| 172 | 1884కు పూర్వము స్థాపింపబడిన స్వంత సంతలకు పన్ను విధించుటకు హక్కును కోరుటకు పద్ధతి. | డిటో |
| 173 | పన్ను విధించుటకు హక్కును స్థిరపరచుటకు దావా హక్కు. | డిటో |
| 174 | లైసెన్సు కొరకు రుసుము. | డిటో |
| 175 | లైసెన్సు లేని స్వంత సంతలలో అమ్మకము నిషేధము | డిటో |
| 176 | స్వంత సంతల విషయములో జిల్లా బోర్డులకు అధికారము | డిటో |
| 177 | 176వ సెక్షను క్రింద నోటీసు ప్రకారము నడచుకొనుటలో లోపమునకు లైసెన్సు నిరాకరణ లేక ఆపుదల. | డిటో |
| 178 | స్వంత సంతలలో ఉపద్రవము నిషేధము | డిటో |
| 179 | స్వంత సంతలను మూసివేయుటకు అధికారము. | డిటో |
| 180 | స్వంత సంతలు పెట్టుటకు ప్రయివేటు వ్యక్తుల హక్కులను సేకరించుట. | డిటో |
| 181 | 171వ సెక్షను క్రింద ఉత్తరువుల మీద అపీలు. | డిటో |
| 182 | సంతలనుండి, కుష్ఠరోగులు మొదలగు వారిని తరిమివేయు విధి: అల్లరిచేయు వారిని తరిమివేయుటకు అధికారము. | డిటో |
| 183 | రాజవీధులలో అమ్మకము నిషేధము. | డిటో |

| | | |
|---|---|---|
| 184 | బహిరంగ బండి నిలుపు స్థలముల ఏర్పాటు | పంచాయతీ సమితి. |
| 185 | బండి నిలుపు స్థలముగా బహిరంగ స్థలమును లేక రాజవీధి ప్రక్కలను ఉపయోగించుట మొదలగు వాటిని నిషేధము | డిటో |
| 186 | బండి నిలుపు స్థలము పన్ను, మొదలైన వాటిని వసూలు. | డిటో |
| 187 | స్వంత బండి నిలుపు స్థలముకు లైసెన్సు | డిటో |
| 189 | గొడ్లను కోయు ఇళ్ల ఏర్పాటు | డిటో |
| 190 | జిల్లా బోర్డులు బహిరంగముగా గొడ్లను కోయు ఇళ్ళలో తప్ప ఇతర స్థలములో పశువులను కోయుట నిషేధించవచ్చును. | డిటో |
| 191 | పండుగలకు, కార్యములకు జంతువులను చంపుట. | డిటో |
| 193 | లైసెన్సు లేనిదే ఉపయోగింపకూడని స్థలములకు హేతువులు. | డిటో |
| 194 | ఆవిరిగాని లేక ఇతర శక్తిని ఉపయోగించ వలసిన కార్ఖానా కర్మాగారము లేక ఇతర పని స్థలము నిర్మాణము, స్థాపన లేక ప్రదేశముకు చేయవలసిన దరఖాస్తు. | డిటో |
| 195 | ఆవిరి లేక యితర శక్తివల్ల కలిగిన ఉపద్రవమును తగ్గించుటకు ఉత్తరువును జారీ చేయుటకు జిల్లా బోర్డుకు అధికారము | డిటో |
| 196 | కార్ఖానా, కర్మాగారము లేక పనిస్థలము లోనికి ప్రవేశించుటకు జిల్లా బోర్డు ప్రసిడెంటుకు అధికారము. | డిటో |

| | | |
|---|---|---|
| 198 | 1888వ బహిరంగ విశ్రాంతిస్థలము చట్టమును స్థానికపు ప్రదేశమునకు వ్యాపింప జేయుట. | పంచాయతీ సమితి |

## రెండవ షెడ్యూలు

ఆంధ్రప్రదేశ్ (తెలంగాణా) జిల్లాబోర్డుల చట్టములోని నిబంధనలను పంచాయితీ సమితులు జిల్లా పరిషత్‌లకు అనువర్తించుట.

| సంబంధముగల సెక్షనుకు అన్వయము (1) | నిబంధన క్లుప్తవివరము (2) | అనువర్తించు అధికారి (3) |
|---|---|---|
| 68 (1) | బహిరంగ సంస్థల యాజమాన్యము | పంచాయతీ సమితి జిల్లా పరిషత్ |
| 69 | బోర్డుల ఆస్తి ప్రభుత్వమునకు బదలాయింపు | డిటో |
| 70 | బోర్డుల ఆస్తుల యితర బదిలాయింపులు | డిటో |
| 80 (1)(a) | ఉత్తర ప్రత్యుత్తరములు | పంచాయతీ సమితి |
| 80 (1)(b) | చెట్లను పాతుట | డిటో |
| 80 (1)(c) | సంతలు, ప్రయాణీకుల విశ్రాంతి స్థలములు బాటసారులు నిలుచుటకు యిళ్ళు యితర బహిరంగ సంస్థల స్థాపన యాజయాన్యం నిర్వహణ | పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ |
| 80 (1)(d) | బహిరంగ చెరువులు, నూతులు, నీటిపనులు మొదలగువాటి నిర్మాణము, మరమ్మతులు, | పంచాయతీ సమితి |
| 80 (1)(e) | పశువుల గుంటల నిర్మాణము, యాజమాన్యము, నిర్వహణ | డిటో |
| 80 (1)(f) | దాని ఆధీనమునకు ఒప్పజెప్పిన బహిరంగ ఏరుదాటించు స్థలముల యాజమాన్యము, | డిటో |

| | | | |
|---|---|---|---|
| 80 | (1)(g) | గ్రామస్థులను వ్యాపింప జేయుటకు భూమి సేకరణతో సహా గ్రామముల పంచాయతీ సమితి | పంచాయతీ సమితి |
| 80 | (1)(h) | టీకాలు వేయుటను ప్రోత్సహించుట | డిటో |
| 80 | (1)(i) | ఉత్సవములు, పండుగలకు ఆరోగ్య సంబంధమైన ఏర్పాటులు | డిటో |
| 80 | (1)(j) | ప్రాథమిక పాఠశాల భవనములు నిర్మించుట, నిర్వహించుట | డిటో |
| 80 | (1)(k) | భవనము లేక వశమందు ఉంచబడు ఆస్తి నిర్వహణ | డిటో |
| 80 | (1)(l) | ప్రభుత్వము ఉత్తరువువల్ల బోర్డును దాఖలు చేయమనుసాంవత్సరిక కాలక్రమపు రిపోర్టులు ముద్రణ, ప్రచురణ | జిల్లా పరిషత్ |
| 81 | (ఎ) | సహకార సంఘములకు ప్రోత్సాహము, అభివృద్ధి | పంచాయతీ సమితి |
| 81 | (బి) | పశువులు యితర జీవజంతువుల అభివృద్ధి | డిటో |
| 81 | (సి) | వ్యవసాయము, స్థానికపు కళలు పరిశ్రమలు, వర్తకము, గ్రామస్థుల ఆర్థిక క్షేమముకు తోడ్పడు యితర జాగ్రత్తలను వృద్ధిచేయుట | డిటో |
| 81 | (డి) | బహిరంగ పార్కులు, వుల్లాసము కలిగించు స్థలముల ఏర్పాటు | డిటో |
| 81 | (ఇ) | పుస్తకభాండాగారములు, రీడింగురూములు మొదలగు వాటిని నిర్మించుట | |
| 81 | (ఎఫ్) | యజమానులు లేని కుక్కలను నాశనము లేక కనుగొనుట లేక దాచిపెట్టుట | డిటో |
| 81 | (జి) | సంతలు,పశువులు,వ్యవసాయసంబంధమయిన పారిశ్రామికమైన ప్రదర్శనములు | |

| | | |
|---|---|---|
| | వస్తు ప్రదర్శనములు ఏర్పాటుచేసి యాజమాన్యము వహించుట. | పంచాయతీ సమితి. |
| 81 (హెచ్) | అనారోగ్యమైన ప్రదేశములను బాగు చేయుట. క్రొత్త గ్రామ స్థలములు మొదలైన వాటిని వేయుట. | డిటో |
| 81 (ఐ) | క్షామము లేక కొరత కాలములలో ఏర్పాట్ల సహాయ పనుల నిర్వహణ. | డిటో |
| 81 (జె) | మందుల షాపు, పశువుల మందుల షాపు నిర్మాణము, మరమ్మతు, నిర్వహణ, యాజమాన్యము. | డిటో |
| 81 (కె) | మాతృరక్షణ సేవలు, శిశు సంరక్షణ కేంద్రములు స్థాపించుట, వాటిని నిర్వహించుట. | డిటో |
| 81 (ఎల్) | మందులు కొనుట. | డిటో |
| 81 (ఎమ్) | ఏ తరగతికి చెందిన ఉద్యోగులకు ఇండ్లు ఏర్పాటు. | పంచాయతీ సమితి, లేక జిల్లా పరిషత్. |
| 81 (ఏన్) | బెంగాల్ హయాసింత్, ఇతర హానికరమైన మొక్కలను నిర్మూలన, ఆయకట్టులలో వెనుకబడు నీటిని ఆపివేయుట | పంచాయతీ సమితి |
| 81 (ఒ) | హరించి పోవుటను ఆపుటకు, వంటచెరకు స్థానిక సరఫరా వృద్ధి చేయుటకు లేక పచ్చి ఎరువు ఏర్పాటు చేయుటకు అడవుల శాఖ సహకారముతో లేక సలహాతోగాని ఏవైన అనుపయోగమైన లేక ఇతర భూములను అడవులుగా మార్చుట. | డిటో |
| 81 (పి) | పబ్లిక్ వర్క్సు డిపార్టుమెంటు సహకారము లేక సలహాపైని నీటి పారుదల కొరకు చిన్న చెరువుల నిర్మాణము, మరమ్మతు యాజమాన్యము | పంచాయతీ సమితి |

| | | |
|---|---|---|
| 81 | (క్య) ప్రజల ఆరోగ్యము, సుఖము, వీలును వృద్ధిచేయునను యింతవరకు స్పష్టముగా చెప్పబడని ఏ ఇతర విషయము. | పంచాయతీ సమితి. |
| 83 | అనారోగ్యకరమైన భవనములు-బోర్డు కోరునది నిర్వర్తింపక పోవుటకు అపరాధము విధింపు. | డిటో |
| 84 | నీటి వనరుల గురించిన అధికారములు | డిటో |
| 86 | కొన్ని పనులకు బహిరంగ ఊటలు మొదలగు వాటిని విడిగా వుంచుటకు కొన్ని వనరులనుండి నీటిని ఉపయోగించుట నిషేధించుటకు అధికారములు. | డిటో |
| 87 | ఇతర పనులకు కేటాయించిన స్థలముల నుపయోగించినందులకు అపరాధము. | డిటో |
| 88 | మురికి నీటినుంచి ఉపద్రవమును తగ్గించుట | డిటో |
| 89 | చనిపోయినవారిని పరిష్కరించుటకు స్థలములను మూసివేయుట | డిటో |
| 90 | పాతిపెట్టు తగులబెట్టు స్థలములను రిజిష్టర్ చేయుట | డిటో |
| 91 | చనిపోయినవారిని పరిష్కరించుట కుద్దేశింపబడిన స్థలములకు లైసెన్సు పొందుట. | డిటో |
| 92 | పాతిపెట్టు, తగులబెట్టు స్థలములు, శ్మశానములు ఏర్పాటు. | డిటో |
| 94 | అంటు రోగములకు తెరువబడిన వస్తువులను కడుగుటకు, రోగములనుండి శుభ్రము చేయుటకు స్థలములను ప్రకటించుటకు బోర్డు. | డిటో. |
| 95 | అంటుజాడ్యముల గురించి వర్తమానము | డిటో |
| 96 | వీధులు మొదలగు వాటిమీద అడ్డుదల | డిటో |

| | | |
|---|---|---|
| 97 | లైసెన్సు లేనిదే హోటళ్ళను, రెస్టారెంటులను, టీ కొట్లను మొదలైనవాటిని మరియు అసహ్యమైన ప్రమాదకరమైన వ్యాపారము నిషేధించుట. | డిటో |
| 98 | అమ్ముటకు జంతువులను చంపుటను క్రమపరచుటకు అధికారము | డిటో |
| 99 | పశువుల జబ్బును నివారించుటకు చర్య తీసికొనుటకు అధికారములు. | డిటో |
| 100 | రాబిస్‌ను ఆపుదల, పిచ్చి, వీధులవెంబడి | డిటో |
| | తిరుగు కుక్కలను పరిష్కరించుట | డిటో |
| 101 | ప్రమాదకరముగా రాళ్ళను ఎత్తుట, రాళ్ళను పగుల గొట్టుట, చెట్లను పడగొట్టుట లేక కలపకోయుట లేక భవనములుపడగొట్టుట | డిటో |
| 102 | భవనములు నిర్మించుట, కార్ఖానా, కార్మాగారము లేక పనిస్థలమును నిర్మించుట సిద్ధపరచుట లేక ప్రవేశపెట్టుటకు కావలసిన అనుమతి | డిటో |
| 103 | ప్రాంతీయ మరియు టవున్ ప్లానింగు | డిటో |
| 104 | స్థలము లేక వినియోగింపవలసిన దానికి మంజూరు | డిటో |
| 105 | స్థలమును మార్చుట లేక తీసివేయుట | డిటో |
| 106 | దెబ్బతిన్న వ్యక్తులకు పరిహారము యిచ్చుట. | డిటో |
| 107 | సెలవు చేయవలసిన దానిని యజమానులు నిర్వర్తించుట. | డిటో |
| 108 | తప్పిదములకు అపరాధములు | డిటో |
| 109 | ప్రవేశమున కధికారములు | డిటో |
| 110 | భూమిసేకరణ చట్టము అనువర్తించుట | పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ |

| | | |
|---|---|---|
| 111 | దోమల నివారణ కొరకు స్థల ప్రకటన | పంచాయతీ సమితి |
| 112 | నీరు చేరుటవల్ల దోమలు పెరుగుటను నిషేధము | డిటో |
| 113 | దోమలు పెరుగు స్థలములకు చికిత్స | డిటో |
| 114 | తప్పు జరిగిన విషయములలో ఆరోగ్యాధికారుల అధికారములు | డిటో |
| 115 | దోమల నివారించు పనులను కాపాడుట | డిటో |
| 116 | అటువంటి పనులలో జోక్యము కలుగజేసికొనుటకు నిషేధము | డిటో |
| 117 | స్థలములలో ప్రవేశించి తనిఖీ చేయుటకు ఆరోగ్య సిబ్బందికి అధికారము | డిటో |
| 118 | 113వ సెక్షను అతిక్రమించి నందుకు అపరాధము | డిటో |
| 119 | 115వ సెక్షను అతిక్రమించి నందుకు అపరాధము | డిటో |
| 120 | 116వ సెక్షను అతిక్రమించి నందులకు అపరాధము | డిటో |
| 121 | బహిరంగ సంతలు | పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ |
| 122 | బహిరంగ సంతను మూసివేయుట | డిటో |
| 123 | బహిరంగ సంతలకు లైసెన్సు యిచ్చుట | డిటో |
| 124 | అట్టి లైసెన్సుల కాలపరిమితి | డిటో |
| 125 | బోరు లైసెన్సు యిచ్చుట ఆలస్యము చేసినచో చేయవలసిన క్రమపద్ధతి | డిటో |

| | | |
|---|---|---|
| 126 | అపరాధములు | పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ |
| 135 | స్థానిక పన్ను | జిల్లా పరిషత్ |
| 138 | ఇళ్ళమీద, భవనములపై లేక భూములపై ప్రత్యేక పన్నులు | పంచాయతీ సమితి |
| 139 (a) | వృత్తి పన్ను | డిటో |
| 139 (b) | బహిరంగ సంతలో సరకు అమ్ముటకు తీసుకొని వచ్చు బండ్లమీద, బరువు మోయు జంతువుల మీద మార్కెటు పన్ను | పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ |
| 139 (c) | బహిరంగ సంతలో అమ్ముటకు తీసుకొని వచ్చు సరకును ప్రదర్శించు హక్కు మీద సంత పన్ను | డిటో |
| 139 (d) | బహిరంగ సంతలలో అమ్మ జంతువుల రిజిస్ట్రేషన్‌కు పన్ను | డిటో |
| 139 (e) | నీటి పన్ను | పంచాయతీ సమితి |
| 139 (f) | బహిరంగ వినోదముల మీద పన్ను | డిటో |
| 139 (g) | బండిమీద పన్ను | డిటో |
| 139 (h) | సుంకములు, సుంకపు పన్ను | డిటో |

---

# విషయ సూచిక

## పంచాయతీ సమితులకు జిల్లా పరిషత్తులకు అనువర్తించిన 1920 వ ఆంధ్రప్రదేశ్ (ఆంధ్ర) జిల్లా బోర్డుల చట్టము



సెక్షను నెం. | | పేజి


| సెక్షను నెం. | విషయము | పేజి |
|---|---|---|
| 1. | (వదలబడినది.) | 367 |
| 2. | చట్టముల రద్దు. | 367 |
| 3. | నిర్వచనములు | 367 |
| 3 (ఎ) | నుండి 39 వరకు (వదలబడినవి.) | 371 |
| 40. | పంచాయతీ సమితి, జిల్లా పరిషత్‌ల విద్యుచ్ఛక్తి ఉద్యమముల మీద ఆధీనము. | 371 |
| 41 | నుండి 59 (వదలబడినవి.) | 372 |
| 60. | రాజ వీధులను, వాటికి చేరియున్నటువంటి వాటిని పంచాయతీ సమితులకు స్వాధీనము చేయుట. | 372 |
| 60 (ఏ) | చట్ట ప్రయోగమునుండి తప్పింపబడిన రాజవీధుల విషయములో పంచాయతీ సమితి విధి. | 372 |
| 60(బి) | విశ్రాంతి గృహము. | 373 |
| 61. | పంచాయతీ లేక జిల్లా పరిషత్ ఈ చట్టము క్రింద ప్రోగుజేసిన మురికి నీళ్ళు బురద మొదలైనవి పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్‌కు చెందవలయును. | 374 |
| 62. | పంచాయతీ సమితినుండి పంచాయతీకి స్థిరాస్తి బదలాయింపు. | 375 |
| 63. | 1817 వ మదరాసు రెగ్యులేషను VII క్రింద ధర్మాదాయములు తిరిగి తీసికొనిన ధర్మ ఈనాములు పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్‌నకు బదలాయించుటకు అధికారము. | 375 |
| 64. | ఆస్థి ట్రస్టును అంగీకరించుటకు అధికార నియమితము. | 376 |

65. సంస్థలు, పనులు మొదలగు వాటిని పంచాయతీకి బదలాయింపు. 376

65 (ఎ) నుండి 66 సి (వదలబడినవి.)

66. పంచాయతీ సమితిలేక జిల్లా పరిషత్‌కు కావలసిన స్థిరాస్తి 1894వ భూమి సేకరణ చట్టముక్రింద సేకరించవచ్చును. 376

67. నుండి 74 ఎ (వదలబడినవి.)

74. (బి) భూమి పన్ను. 376

74. (సి) ఆస్తి బదలాయింపుల మీద డ్యూటీ 377

75. పన్నులు. 377

76. యాత్రిక పన్ను. 377

76. (ఎ) రాజ్యాంగ చట్టములోని కొన్ని నిబంధనలకు రక్షణ. 378

77. పన్నులను విధించుటను గురించి తీర్మానము ప్రకటన. 378

78. భూమిపన్ను. 378

79. భూములయొక్క సాంవత్సరిక అద్దె విలువ ఎట్లు నిర్ణయింపబడినది. 378

80. కొంతమంది భూస్వాములు లేక ఉప భూస్వాములు జిల్లా కలెక్టరుకు వారి భూముల పట్టీని దాఖలు చేయుట 380

81. జాబితాల ప్రకారము అవి సరియైనవైన యెడల, జిల్లా కలెక్టరు పన్ను విధించుట. 381

82. జాబితాలను దాఖలు చేయనందుకు అపరాధము. 381

83. సాంవత్సరిక అద్దె విలువను జిల్లా కలెక్టరు నిర్ణయించుట. 382

84. పార్టీలను హాజరు కమ్మనుటకు జిల్లా కలెక్టరు అధికారము. 382

85. జాబితాలను సవరణ చేయుటకు, సవరించిన జాబితాల ప్రకారము భూస్వాముల మీద లేక ఉప భూస్వాముల మీద పన్ను విధించుటకు జిల్లా కలెక్టరునకు అధికారము. 382

86. రెవిన్యూ బోర్డుకు అప్పీలు. 383

87. రైతువారీ భూముల పట్టాలలో భూమి పన్నును ఎక్కించుట. 383

88. భూస్వాములు, ఉప భూస్వాములు భూస్వామి పన్ను చెల్లించుట. 383
89. భూస్వాముల అధికారము. 384
90. ప్రభుత్వమునకు చెల్లించు శాశ్వతముగా స్థిరపరచిన రెవిన్యూమీద పన్ను తగ్గింపు 384
91. పన్ను బకాయీలు వసూలు 385
92. భూమి పన్ను విభజన 385
93. వృత్తి పన్ను 386
94. వృత్తి పన్ను చెల్లించుటకు ఫరము, అసోషియేషన్లు మరియు జాయింటు హిందూ కుటుంబముల సభ్యుల బాధ్యత 387
94 (ఎ) వృత్తిపన్ను చెల్లించుటకు ఉద్యోగులు లేక ఏజంట్ల బాధ్యత 387
95. (వదలబడినది)
96. పన్ను చెల్లించుటనుల్లఘించునప్పుడు నోటీసు అందజేయుట 388
96 (ఎ) స్టేటుమెంటులు, రిటర్నులు మొదలైనవి రహస్యముగా నుంచుట. 388
97. పన్ను చెల్లించుటకు బాధ్యులయిన వ్యక్తుల జాబితాలు దాఖలు చేయుటకు, యజమానికి లేక ఆక్రమణదారుకు నోటీసు 388
98. నుండి 109 (వదలబడినవి) 388
110. యాత్రిక పన్ను 389
110 (ఎ) ఆస్తి బదలాయింపులమీద డ్యూటీ విధించు పద్ధతి 391
110 (బి) బదలాయింపు సుంకము ప్రవేశపెట్టినప్పటినుండి అనువర్తించు నిబంధనలు 391
110 (సి) బదలాయింపు సుంకమును విధించుటకు, వసూలు చేయుటకు నిబంధనలు చేయుటకధికారము. 392
111. పన్నుల నుండి మినహాయించుటకు అధికారము 392
111 (ఎ) వసూలుకానగు పన్నులు మొదలైనవాటిని రాయితీ చేయుటకు అధికారము 392
112. పంచాయతీ సమితి నిధులు అనువర్తించవలసిన కార్యములు 392
113. మరియు 114 వదలబడినవి. 495
115. వివిధరకముల పంచాయతీ సమితి నిధులు లేక జిల్లా పరిషత్తు నిధులయొక్క రాబడి, ఖర్చులు. 395

116 నుండి 120 (వదలబడినవి)

121. ఇతర స్థానిక అధికారులవల్ల వ్యయమునకు విరాళములు 395

121 (ఎ). రాష్ట్రప్రభుత్వము యిచ్చిన అప్పులు, అడ్వాన్సులు వసూలు 395

121 (బి). పంచాయతీ ప్రదేశములకు 137, 138, 139 సెక్షనులు తప్ప అధ్యాయములోని నిబంధనలు పంచాయతీ ప్రదేశములకు అనువర్తించకుండుట. 396

122. నూతులు మొదలైనవాటిని మూసివేయుట లేక శుభ్రపరచుట 396

123. ప్రజారోగ్యమునకు ఉపద్రవము హాని కలిగించు గుంటలు మొదలైనవాటిని పూడ్చుట 397

124. కొన్ని పనులకు బహిరంగ చెరువులు మొదలైన వాటిని విడిగా వుంచుట 398

125. ప్రకటింపబడిన కార్యములకు తప్ప ఆవిధముగా విడిగా యుంచిన స్థలముల ఉపయోగము నిషేధము 398

126. పంచాయతీ సమితులచే నూతులు, చెరువులు మొదలైనవి నిర్వహణ 399

126 (ఎ). అందరి వ్యక్తులకు తెరవబడిన బహిరంగ నూతులు 399

127. స్వంత పాయిఖానాలు మొదలైన వాటిమీద ఆధీనముకల వ్యక్తుల నుండి విరాళములు. 400

129. మురికి బయటకు పోవుట ఒప్పుకొనుటను నిషేధింపు. 400

129 (ఎ). స్వంత మురికి కాలువల నిర్మాణము లేక తీసివేయుటను కోరుటకు అధికారము. 401

130. ప్రమాదకరమైన జబ్బుకు నిర్వచనము. 401

131. అనుమానమున్న స్థలములలోనికి చొచ్చుటకు అధికారము, భవనము వస్తువులను శుభ్రము చేయుట. 401

132. కడుగుటకు, శుద్ధిచేయుటకు స్థలముల నిర్వహణాధికారిచే ప్రకటన. 402

133. అంటురోగముతో బాధపడువ్యక్తి వృత్తి చేయుటను నిషేధించుట 402

134. ప్రమాదకరమైన జబ్బులనుండి బాధపడు వ్యక్తులు మరియు బహిరంగ వాహనములు 402
135. బహిరంగ వినోద స్థలములను మూయమని ఉత్తరువు యిచ్చుటకు అధికారము 404
136. ప్రమాదకరమైన జబ్బువల్ల స్వల్పముగా బాధపడుటవల్ల పాఠశాలకు వెళ్ళకుండుట. 404
137. తప్పనిసరిగా టీకాలు వేయుట. 404
138. మశూచికమును తెలియజేయు బాధ్యత. 404
139. మశూచికమునకు టీకాలు వేసుకొనుట నిషేధింపు. 405
140. పాతిపెట్టు, కాల్చు స్థలముల రిజిస్ట్రేషను. 405
141. చనిపోయినవారిని పరిష్కరించుటకు స్థలములకు లైసెన్సు యిచ్చుట. 405
142. పాతిపెట్టు, తగులబెట్టు స్థలము మరియు శ్మశానమునకు ఏర్పాటు. 406
143. రిజిష్టరు అయిన, లైసెన్సు పొందిన లేక ఏర్పాటుచేయబడిన స్థలమునకు ఒక పుస్తకము ఉంచుట. 406
144. నియమితముకాని స్థలములలో కాల్చుట లేక తగులబెట్టుటను నిషేధింపు. 406
145. పాతిపెట్టుట మొదలగు వాటిని గురించి పంచాయతీ సమితికి నోటీసు యిచ్చుట. 407
146. ఆరోగ్యమునకు ప్రమాదకరమైన లేక సమాధులకు నిండియుండిన పాతిపెట్టు, కాల్చు స్థలముల ఉపయోగమును నిషేధించుట. 407
147. ప్రమాదకరమైన కట్టడముల విషయములో జాగ్రత్తలు 408
148. ప్రమాదకరమైన చెట్ల విషయములో జాగ్రత్తలు 408
149. భవనములు లేక భూములకు కంచెవేయుట, చెట్లను, కంచెలను సరిచేయుట. 409
150. ప్రమాదకరమైన చెరువులు, నూతులు, కన్నములు మొదలగువాటి విషయములో జాగ్రత్తలు. 408
151. రాజవీధి మొదలగు వాటివద్ద రాళ్ళు త్రవ్వి ఎత్తుటకు లైసెన్సు పొందుట. 410
152. (వదలబడినది)
153. పంచాయతీకాని స్థలములలోనిభూముల, భవనముల నుండి మురికి లేక హానికరమైన మొక్కలను తీసివేయుట. 410

154. వీధులలో తిరుగు పందులను నాశనము చేయుటకధికారము. 411

155. పడగొట్టిన ప్రమాదకరమైన కట్టడము లేక యితరము యొక్క వస్తువులను ఉపయోగించుట లేక అమ్ముటకు నిర్వహణాధికారి అధికారము. 411

156. పరిహారమునకు హద్దు. 412

157. రాజవీధులకు లేక పైనవున్న అడ్డుదలలను నిషేధించుట. 412

157 (ఎ) రాజవీధులను అందరికి తెరుచుట. 412

158. తలుపులు, కిందినేల, బయటకు తెరుచుకొనియుండు కిటికీలు కమ్మెలు మొదలైనవాటి నిషేధింపు, వాటిని క్రమపరచుట 412

159. ఆక్రమణల తొలగింపు 413

160. కొన్ని పెరుగుదలలను కట్టడములను ఒప్పుకొనుటకు అధికారము 413

161. మురికినీటి కాలువ, జలదారి మొదలైన వాటిమీద అనుమతి లేనిదే భవనము నిర్మించుట నిషేధము 414

162. హానికరమగు మొక్కలు మొదలైన వాటి నిర్మూలనమును గురించి నోటీసు. 414

163. రాజవీధిలో కన్నములు తీయుట, అడ్డులు కలుగజేయుటను నిషేధించుట 415

163 (ఎ) అనుమతి లేనిదే రాజవీధులమీద చెట్లను నాటుట, లేక పడగొట్టుట నిషేధము. 415

164. భూమిని దురాక్రమణ చేసినందుకు అపరాధము పరిహారము వసూలు చేయుట 416

165. విస్తారమైన జనసమ్మర్దమువలన కలిగిన ఖర్చులు వసూలు చేయుటకు పంచాయతీ సమితి అధికారము 416

166. (వదలబడినది)

166 (ఎ) సంతలను బ్లాక్ లెవల్ సంతలు, పంచాయతీ సంతల క్రింద తరగతింపబడుట. 417

167. బహిరంగ సంతలు 417

168. బహిరంగ సంతల విషయములో అధికారములు 417

169. బహిరంగ సంతలమీద నిర్వహణాధికారము 418

170. (వదలబడినది) 419

171. స్వంత సంతకు లైసెన్సు 419

172. (వదలబడినది)

173. రుసుమును విధించుటకు అర్హతనియమమునకు దావాహక్కు 420

174. లైసెన్సు కొరకు రుసుము 420

175. లైసెన్సుకాని స్వంత సంతలలో అమ్మకపు నిషేధింపు 420

176. స్వంత సంతల విషయములో పంచాయతీ సమితి అధికారములు 420

177. 176వ సెక్షనుక్రింద నోటీసు అనువర్తించుటలో తప్పుచేసినందుకు, లైసెన్సు, ఆపుదల లేక నిరాకరణ 421

178. స్వంత సంతలలో ఉపద్రవముల నిషేధింపు 421

179. స్వంత సంతలను మూయుటకు అధికారము 422

180. స్వంత సంతలను పెట్టుటకు స్వంత వ్యక్తుల హక్కులసేకరణ 422

181. 171వ సెక్షనుక్రింద ఉత్తరువులమీద అప్పీలు 422

182. కుష్ఠురోగులు మొదలైనవారిని సంతలనుండి తరిమి వేయుటకు పని పాడుచేయువారిని తరిమివేయుటకు విధి 423

183. రాజవీధులలో అమ్మకపు నిషేధము 423

183 (ఎ) (వదలబడినది) 423

183 (బి) స్థలములు సంతయా కాదా అను విషయముపై తగాయిదాల తీర్పు 423

184. బహిరంగబండ్లు నిలుచు స్థలముల ఏర్పాటు 423

185. బహిరంగ స్థలము లేక రాజవీధిప్రక్క బండ్లు ఆగు స్థలము మొదలైన వాటిగా ఉపయోగించుట నిషేధింపు 424

186. బండ్లు ఆగు స్థలమునకు రుసుము మొదలైనవాటి వసూలు 424

187. బండ్లు ఆగు స్థలములకు (స్వంతది) లైసెన్సు 425

188 (వదలబడినది)

189. కసాయి యిల్లు ఏర్పాటు 426

190. బహిరంగ కసాయియిళ్ళు కాకుండ యితర సలములలో పశువులను మొదలైనవాటిని చంపుట నిషేధించుట. 426

191. పండుగ దినములలో కార్యములలో జంతువులను చంపుట 427

192. ప్రభుత్వ స్థలములు మినహాయింపు 427

193. లైసెన్సు లేకుండ స్థలములు ఉపయోగింపబడుటకు వీలుకాని కార్యములు 427

194. ఆవిరివల్ల లేక యితర శక్తిని ఉపయోగించవలసిన కార్ఖానా, యంత్రస్థలము నిర్మాణము, స్థాపన లేక ప్రవేశ పెట్టుట కొరకు దరఖాస్తు చేయుట 428

195. ఆవిరివల్ల లేక యితరశక్తివల్లకలుగు ఉపద్రవము, తగ్గించుటకు ఉత్తరువులుయిచ్చుటకు పంచాయతీ సమితి అధికారము 430

196. పంచాయతీ సమితికి ఉత్తరువులు మంజూరు చేయుటకు లేక విధానములు తెల్పుటకు రాష్ట్రప్రభుత్వపు అధికారము 430

197. ఫ్యాక్టరీ, వర్కు‌షాపు లేక పనిస్థలములో ప్రవేశించుటకు నిర్వహణాధికారి అధికారము 430

198. 1888వ పబ్లిక్ రిసార్టు స్థలముల చట్టము స్థానిక ప్రదేశము లకు పొడిగింపు 431

199. నిబంధనలు మరియు షెడ్యూళ్ళు 432

200. నిబంధనలను చేయుటకు పద్ధతి 434

201. షెడ్యూళ్ళను సవరణ చేయుట 434

201 (ఎ). 201వ సెక్షను క్రింద నిబంధనలు చేయుటకు విధానము 435

202. ఉపవిధులు చేయుటలో పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తు అధికారము 435

203. ఉపవిధులను ఉల్లంఘించినందులకు అపరాధము 438

203 (ఎ) (వదలబడినది)

204. ఉపవిధులుచేయు విధానము 438

205. రాష్ట్రప్రభుత్వముచే ఉపవిధులుసమ్మతింప బడుట 438

205. (ఏ) ఉపవిధులు చేయుటకు, ప్రకటించుటకు విధానము 439

206. 1920వ జిల్లా మునిసిపాలిటీల చట్టము లేక దాని క్రిందచేసిన నిబంధనలు గ్రామములకు వ్యాపింపజేయుట 439

207. షెడ్యూళ్ళలో నిర్దిష్టమయిన అపరాధములకు సంబంధించిన సాధారణ ఏర్పాట్లు 439

208. (వదలబడినది)

209. కంట్రాక్టు పనిలో ఆఫీసు లేక ఉద్యోగి లాభము సంపాదించి నందులకు అపరాధము 440

210. అధ్యక్షుని లేక అతని ప్రతినిధిని అక్రమముగా అడ్డుట 441

211. సమాచారము యివ్వనందుకు లేక తప్పుసమాచారము యిచ్చి నందుకు అపరాధము 441

212. లైసెన్సుల అనుమతి గురించి సాధారణ నిబంధనలు 441

213. అప్పీలునకు కాలపరిమితి నియమితము 442

214. లైసెన్సులు, నోటీసులు, అనుమతులుయొక్క నమూనా 445

215. చట్టముక్రింద ప్రకటనల ప్రచురణము 445

215. (ఏ) స్థలముల నిషేధములు లేక కేటాయింపు నోటీసు 446

216. పత్రములను అందింపజేయు పద్ధతి 446

217. పనులు తనిఖీచేయుటకు కొలతవేయుటకు లేక నిర్వర్తించుటకు ప్రవేశము అధికారము 447

218. తూకముల, కొలతల తనిఖీ, ముద్రవేయుట 448

219. లైసెన్సులు మొదలగువాటిని పొందలేక పోవుట లేక వాటి నుల్లంఘించుట వలన ఫలితములు . . 448

220. నోటీసు, ఉత్తరువు మొదలైన వాటిని నిర్వర్తించుటకు కాలము, అట్లు చేయకపోయిన దానిని అమలు చేయుటకు అధికారము 449

221. పన్నులుగా రావలసిన మొత్తములు వసూలు 449

222. రావలసినవాటిని వసూలు చేయుటకు కాల నిర్ణయము 450

223. వ్యాజ్యము వేయుటకు అధికారమివ్వబడని వ్యక్తులు 450

224. జరిమానాలు, ఖర్చులు మొదలైనవాటి వసూలు 450

225. పంచాయతీసమితి లేక జిల్లాపరిషత్తు మీద చర్య నోటీసు 451

225 (ఎ) (వదలబడినది)

226. నేరములను కలుపుట 452

227. ఆస్తి నష్టము, వృధా లేక అన్యధా ఉపయోగమునకు అధ్యక్షుడు సభ్యుల బాధ్యత 452

227 (ఎ) పంచాయతీసమితి లేక జిల్లాపరిషత్తు అధ్యక్షుడు లేక ఛైర్మన్ లేక సభ్యుని మీద వ్యాజ్యము జరుపుటకు మంజూరు 453

228. పన్నులు వేయుట మొదలైన వాటిని ఆక్షేపణ చేయకుండుట 453

229. పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తు ఉద్యోగులు లేక కంటాక్టర్లు 453

230. నోటీసు తీసివేయుట లేక తుడిచివేయుట నిషేధము 454

231. స్టేట్‌మెంట్లు లేక రిటర్నులను దాఖలు చేయవలసినదిగా కరణములు, హెడ్‌మన్‌లను కోరుటకు నిర్వహణాధికారి అధికారములు 454

232. పార్టీలను హాజరుకమ్మనుటకు నిర్వహణాధికారి అధికారములు 454

233. ప్రభుత్వముచే అధికారముల ఒప్పగింపు 454

234. స్థానిక అధికారుల మధ్య తగాయిదాల పరిష్కరింపు 455

235 మరియు 236 (వదలబడినవి)

237. చట్టముయొక్క వ్యాప్తి, ప్రారంభము 456

238. 239 మరియు 240 (వదలబడినవి) 456

240 (ఎ) జిల్లాబోర్డుల పనులను పంచాయతీలకు బదలాయింపు 456

241. ఇతర చట్టములు మొదలగువాటి నిర్మాణము గూర్చి అధ్యక్షునికి రిఫర్ చేయుట 456

1వ షెడ్యూలు : తీసివేయబడిన చట్టములు 457

2వ షెడ్యూలు (వదలబడినది)

3వ షెడ్యూలు (వదలబడినది)

4వ షెడ్యూలు పన్ను విధించు నిబంధనలు 458

5వ షెడ్యూలు 472

6వ షెడ్యూలు 478

7వ షెడ్యూలు 479

8వ షెడ్యూలు 481

9వ షెడ్యూలు 488

10వ షెడ్యూలు (వదలబడినది)

———

# మూడవ షెడ్యూలు

# పంచాయతీ సమితులకు, జిల్లా పరిషత్తులకు అనువర్తించిన 1920వ ఆంధ్రప్రదేశ్ (ఆంధ్ర) జిల్లాబోర్డుల చట్టము

(ఉపోద్ఘాతము వదలబడినది)

## భాగము I

### 1వ అధ్యాయము—ఉపక్రమము

1. (వదలబడినది)

2. చట్టముల రద్దు :

1వ షెడ్యూలులో చెప్పబడిన చట్టములు, వాటికి సంబంధించిన నాలుగవ 'కాలము'లో తెల్పినంతవరకు రద్దు చేయబడినవి.

3. నిర్వచనములు :

ఈ చట్టము విషయములోని, పూర్వోత్తర సందర్భములో గాని ఏదైన వ్యతిరేకముగా ఉన్న తప్ప—

(1) వదలబడినది.

(1 బి) 'నియమించు' అనగా తాత్కాలికముగా లేక అఫీషియేటింగు హోదాలోకూడ నియమించుట.

(2) నియమింపబడుట : 'నియమింప బడుట' అనగా తాత్కాలికముగా అఫీషియేటింగుగాకూడ నియమింపబడుట.

(3) బిల్డింగు : "బిల్డింగు" అనగా ఇల్లు, బయట యిల్లు, గుఱ్ఱపుశాల, పాయిఖానా, కొట్టము, గుడిసె, గోడ (ఎనిమిది అడుగులు ఎత్తును మించకుండగా వున్న ప్రహరీగోడ తప్ప), తాపీపని, ఇటుకలు, కలప, మట్టి, లోహము లేక ఏ యితర సామగ్రితోనైనా కట్టబడిన అటువంటి ఏ యితర కట్టడముకూడ అయియున్నది.

4 నుండి 5ఏ వదలబడినవి.

6. కంపెనీ :

"కంపెనీ" అనగా 1956వ కంపెనీల చట్టము 1956వ కేంద్రచట్టము 1 లో నిర్వచింపబడిన కంపెనీ మరియు ఏ ఫరము లేక ఐక్య పరచబడినను కాక పోయినను, దాని వ్యాపార ముఖ్య స్థలము, చెప్పబడిన రాష్ట్రములో ఉన్నను ఉండకపోయినను, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రములో వ్యాపారము చేయుచున్న అసోసియేషన్‌కూడ అయియున్నది.

7 నుండి 7బి వదలబడినవి.

(7సి) "నిర్వహణాధికారి" అనగా

(*i*) పంచాయతీ సమితి విషయములో, బ్లాక్ డెవలప్‌మెంటు ఆఫీసరు, మరియు

(7డి) నుండి 8ఎ వదలబడినవి.

(*ii*) జిల్లా పరిషత్తు విషయములో, జిల్లా పరిషత్తు కార్యదర్శి.

9. భూస్వామి :

భూస్వామి అనగా సనద్ది–మిల్కియత్ – ఇస్తిమ్‌దార్ క్రింద హోల్డింగు ఉన్న వ్యక్తులు, ఇతర జమీందారులు, పోలిగార్లు, షోత్రియమ్‌దార్లు, జాగీర్ దారులు, ఈనాందారు లందరును, 1911వ మదరాసు నియమిత ప్రొప్రయిటరుల చట్టము 5వ సెక్షనుక్రింద రిజిష్టరు కాబడిన వ్యక్తులందరు భూమి వ్యవసాయము చేసి, ప్రభుత్వమునకు సుంకము చెల్లించువారు, ఏ టెన్యూరు క్రిందనైనను, మలబారు జిల్లాలలో భూస్వాములందరు; రైతువారి సెటిల్‌మెంట్ క్రింద భూస్వాము లందరు లేక ప్రభుత్వమునకు నేరుగా భూమి సుంకము చెల్లించుటకు ఏ విధముగా నైన బద్ధులైనవారు, యాజమన్యపు హక్కులో రిజిష్టరీ అయిన భూస్వాము లందరునుకూడ అయిఉన్నారు;

10. పాయిఖానా :

'పాయిఖానా' అనగా ఏకాంతస్థలము,నీటిమరుగుగది,మూత్రవిసర్జనస్థలము.

10 (ఎ) వదలివేయబడినది.

10 (బి) స్థానికపు అధికారి : 'స్థానికపు అధికారి' అనగా కంటోన్ మెంట్ అధికారికూడ అయియున్నాడు.

(11) పంచాయతీ కాని స్థలము :

"పంచాయతీకాని స్థలము'' అనగా 1950వ ఆంధ్రప్రదేశ్ (ఆంధ్ర) గ్రామ పంచాయతీల చట్టముక్రింద ఏర్పరచిన పంచాయతీ జూరిస్‌డిక్షనులో లేని ఏ ప్రదేశమైనను అని అర్థము.

(12) వదలివేయబడినది.

(13) ఉపద్రవము :

"ఉపద్రవము'' అనగా ఏపని, లోపము, స్థలము, లేక చూపు, వాసన, వినుట మొదలగు శక్తులకు గాయము, ప్రమాదము చిరాకు లేక నేరము కలుగ జేయునదియు లేక కలుగజేయుననితోచు ఏదైనను లేకప్రాణాపాయమైనదని తోచు నదియులేక ఆరోగ్యమునకు ఆస్తికిప్రమాదకరమైనదనితోచునదేదైననుయైయున్నది.

(14) యజమానుడు :

"యజమానుడు" అనగా

(ఎ) అతని స్వంతమునకుగాని లేక ఏజంటు, ట్రష్టీ, గార్డియన్, మేనేజరు లేక రిసీవరుగా యితర వ్యక్తికిగాని లేక ఏ యితర మత సంబంధమైన లేక ధర్మ సంబంధమైన పనికొరకు, ఈ మాట ఏ సందర్భములో ఉపయోగింప పడునో ఆ ఆస్తికి సంబంధించిన ఆస్తియొక్క అద్దె, ఫలసాయములు ప్రస్తుతముతీసుకొనుచున్న లేక తీసుకొనుటకు అర్హతగలవ్యక్తి, మరియు

(బి) ఈ మాట ఏ సందర్భములో వుపయోగింపబడునో ఆ జంతువు, బండిని ప్రస్తుతము అధనము నందుంచుకొన్న వ్యక్తి.

(15) పల్లకీ :

పల్లకీ అనగా టాంజానులు, 'మంచిల్'లు, కఱ్ఱల సహాయమున మనుషులతో మోసుకొని పోబడు కూర్చిలు కాని ఒడిసెల లేక పిల్లలను, ముసలి వాళ్ళను, జబ్బు మనుష్యులను తీసికొని పోవుటకు ఉపయోగించుటకు మంచములు కావు.

(15ఎ.) పంచాయతీ : పంచాయతీ అనగా 1950వ ఆంధ్రప్రదేశ్ (ఆంధ్ర) గ్రామ పంచాయతీల చట్టము క్రింద నిర్మింపబడిన పంచాయతీ.

(15బి.) పంచాయతీ స్థలము : పంచాయతీ స్థలము అనగా 1950వ ఆంధ్ర ప్రదేశ్ (ఆంధ్ర) గ్రామ పంచాయతీల చట్టము క్రింద నిర్మింపబడిన పంచాయతీ జూరిస్‌డిక్షనులోని స్థలము అని అర్థము.

(16) 'నిర్ణయింపబడుట' :

నిర్ణయింపబడుట అనగా ఈ చట్టము క్రింద చేయబడిన నిబంధనలచేత రాష్ట్రప్రభుత్వముచే నిర్ణయింపబడుట.

(17) స్వంతవీధి :

స్వంతవీధి అనగా వీధి, రోడ్డు, చతురస్రము, కోర్టు, సందు, మార్గము లేక బహిరంగవీధికాని నడచు స్థలముకాని అతని స్వంత భూమిమీద ఒక యిల్లు ఆవరణ కలిగిన యజమాని, అట్టి యిల్లు ఆవరణకు మార్గము కలిగించుటకు, లేక వాటిని వీలుగా ఉపయోగించుకొనుటకు చేసిన నడక దారికాదు.

(18) రాజవీధి :

రాజవీధి అనగా ఏ వీధి, రోడ్డు, చతురస్రము, కోర్టు, సందు, మార్గము లేక రాజమార్గమయినప్పటికి కాకపోయినప్పటికి, జన బాహుళ్యమునకు నడచు హక్కు కలిగిన దారి నడక మరియు—

(ఎ) బహిరంగ వంతెనమీద రోడ్డుదారి లేక తడినేలపై ఎత్తుగా మట్టిపోసి చేసినబాట;

(బి) అటువంటి రోడ్డుకు, బహిరంగ వంతెనకు లేక మట్టిపోసి చేసినబాటకు చేర్చిన కాలిమార్గము; మరియు—

(సి) ఏ అట్టి రోడ్డునకు, బహిరంగ వంతెనకు లేక ఎత్తుగా మట్టిపోసి చేసిన బాటకు చేర్చిన మురుగునీటి కాలువలు, రాళ్ళుపరచి చదును చేయబడిన లేక చదును చేయబడని భూమి, ఆ దగ్గిర ఆస్తి స్వంతముగాని లేక ప్రభుత్వమునకు చెందు ఆస్తిగాని అయిన, ఆ ఆస్తి హద్దులవరకును, వీధిమార్గమున కిరువైపుల ఉన్న వరండా లేక యితర కట్టడము, అయియున్నది.

(19) నివాస స్థలము:-నివసించు :

ఒక వ్యక్తి ఒక ఇంటిలో ఏ భాగమునైన కొంతకాలము ఒక నిద్రపోవు గదిగాను వుపయోగించినచో అతడు ఒక 'నివాస స్థలము' గలవాడుగాను లేక ఏ యింటిలోనైనను 'నివసించు' వాడుగను పరిగణింపబడును.

అతడు ఆ యింటిలో లేని కారణము చేతను లేక వేరు స్థలములో అతడు నివసించు యితర నివాస్థలము ఉండుట చేతను, అతడు ఎప్పుడైనను అట్టి తన యింటికి తిరిగి వచ్చుటకు స్వేచ్ఛ గలిగియున్నప్పుడు అతడు తిరిగి రావలయునను ఉద్దేశము వదలి పెట్టినప్పుడు, అతడు అట్టి యింటిలో నివసించుట మాని వేసినవాడుగా పరిగణింపబడడు.

(19ఎ.) రెవెన్యూ జిల్లా :

రెవెన్యూ జిల్లా అనగా రెవెన్యూ పరిపాలన కొరకు జిల్లా కలెక్టరు అధీనములోయున్న ఏ స్థానికపు ప్రదేశమైనను అయి యున్నది. దాని నుండి ఈ క్రింది వాటిలో చేరిన అన్ని ప్రదేశములను మినహాయించ వలయును.

(ఎ) ఫోర్టు సెంట్ జార్జి దానిని అనుకొని ఏటవాలుగా నుండు బయలుతో సహా మదరాసు పట్టణము.

(బి) 1920వ మదరాసు జిల్లా మునిసిపాలిటీల చట్టము క్రింద నిర్మింపబడిన మునిసిపాలిటీలు.

(సి) 1924వ కంటోన్మెంటుల చట్టము క్రింద నిర్మింపబడిన కంటోన్మెంటులు, మరియు

(డి) 1874వ షెడ్యూల్డు జిల్లాల చట్టములో నిర్వచింపబడిన షెడ్యూల్డు జిల్లాలు.

(20) జీతము :

'జీతము' అనగా వేతనము, ఆక్టింగ్ వేతనము లేక కమీషన్ రూపముగా చెల్లించుట, మరియు మార్పులపల్ల పరిహార భత్యము కూడ అయి యున్నది.

కాని ఇంటి అద్దెకు, బండి అద్దెకు లేక ప్రయాణ ఖర్చులకు భత్యములు యిందులో చేరవు.

(20ఎ) ఎదలబడినది.

(21) ఉప భూస్వామి :

'ఉప భూస్వామి' అనగా ఈ క్రింది భూస్వాములు కాని వారని అర్థము.

(a) (i) యెస్టేటు ప్రొప్రయిటరుచేత సృష్టింపబడి, జరుగుతూ ఉండి, గుర్తింపబడిన అండర్ టెన్యూరుమీద ఒకటి లేక ఎక్కువ రెవెన్యూ గ్రామములు కలిగియున్న అట్టి ఏ ఎస్టేటు ఏ భాగము నైనను కలిగియున్న. వాడు లేక—

(ii) భూస్వామి ఏజంటుగాను లేక పనివాడుగాను కాక అట్టి గ్రామము లేక గ్రామముల యొక్క అద్దెలను వసూలు చేయుటకు హక్కుగల వాడు, మరియు

(b) నిర్ణీతమైన నిబంధనలక్రింద కలెక్టరు కార్యాలయములో ఉప భాగస్వామిగా రిజిష్టరీ కాబడిన వాడు;

వివరణము: ఈక్లాజులో 'యెస్టేటు' అనగా 1894వ సంవత్సరపు మదరాసు యాజమాన్యపు యెస్టేటుల గ్రామ నౌకరీ చట్టములో 'ఎస్టేటు' నిర్వచనము యొక్క (a). (b) లేక (c) క్లాజుల క్రిందవచ్చు ఏ యెస్టేటు అనియు, 'ప్రొప్రయిటరు' అనగా ఆ చట్టములో నిర్వచించిన ప్రొప్రయిటరు అనియు అర్థము.

(22) రైతు :

రైతు అనగా భూస్వామికి లేక మధ్య భూస్వామికి అద్దె చెల్లించినను చెల్లించక పోయినను, స్వయముగాగాని లేక ఏజెంటు ద్వారాగాని అట్టి భూస్వామి క్రిందగాని లేక మధ్య భూస్వామి క్రిందగాని యున్న భూమిని ఆక్రమించు వ్యక్తులందరు అని కూడ అర్థము.

(23) వదలబడినది.

(24) సంవత్సరము :

సంవత్సర మనగా ఆర్థిక సంవత్సరము.

25 నుండి 39 వదలబడినది.

(40). పంచాయతీ సమితుల జిల్లా పరిషత్తుల విద్యుచ్ఛక్తి ఉద్యమముల మీద అధినము :

విద్యుచ్ఛక్తి సృష్టి, పంపుట, సరఫరా, ఉపయోగము కొరకు పంచాయతీ

సమితి లేక జిల్లా పరిషత్తుచేత ఏ ఉద్యమము పరిపాలన ప్రస్తుతము అమలులో యున్న 1910వ ఇండియన్ విద్యుచ్ఛక్తి చట్టముకు వ్యతిరేకము కాకుండ నియమింపబడు అధీనము. ఆ చట్టము క్రిందచేసిన నిబంధనలకు పంచాయతీ సమితి, జిల్లా పరిషత్తులకు దానిక్రింద యిచ్చిన లైసెన్సుయొక్క షరతులకు బద్ధమై యుండును.

41 నుండి 59 వదలబడినవి.

## 5వ అధ్యాయము

## ఆస్తి విషయములోను, సిబంది విషయములోను పంచాయతీ సమితి జిల్లా పరిషత్తుల అధికారములు, ఆస్తి

(60) రాజవీధులను, వాటికి చేరియున్నటువంటి వాటని పంచాయతీ సమితులకు స్వాధీనము చేయుట :

గ్రామములోని వీధులుగా తరగతి చేయబడిన ఒక జిల్లాలోని అన్ని రాజవీధులును, జిల్లాలోని పంచాయతీ కాని ప్రదేశములలోని అన్ని రాజవీధులును, పంచాయతీ సమితికి స్వాధీనము చేయబడును.

(2) 1వ సబ్ సెక్షను క్రింద పంచాయతీ సమితిలో చేరు రాజ వీధియొక్క అన్ని చపటాలు, రాళ్ళు, యితర సామగ్రి, అట్టి వీధికి ఏర్పరచబడిన అన్ని పనులు, సామగ్రులు, ఇతరములు, పంచాయతీసమితి నిధినుండి లేక ఇతరముగాగాని, క్రిందగాని అన్ని మురికినీటి కాలువలు, తూములు, డ్రెయినేజికి సంబంధించిన పనులు, సొరంగములు, చిన్న వంతెనలు, వానికి చేరియున్న అన్ని పనులు, సామగ్రులు, వస్తువులు పంచాయితీ సమితికి స్వాధీనము చేయబడును.

(3) రాష్ట్ర ప్రభుత్వము ప్రకటనవల్ల ఈ చట్టము ప్రయోగమునుండి అటువంటి ఏ రాజవీధి, మురికినీటి కాలువ, తూము, డ్రెయినేజికి సంబంధించిన పని, సొరంగము లేక చిన్న వంతెనలను తీసివేయవచ్చును మరియు అట్టి ప్రకటనకు మార్పుగాని లేక రద్దుగాని కూడ చేయవచ్చును.

60(A) చట్టప్రయోగమునుండి తప్పింపబడిన రాజవీధుల విషయములో పంచాయతీ సమితి విధి:

60వ సెక్షనుయొక్క (3)వ సబ్ సెక్షనుక్రింద ఏ రాజవీధిగాని ఈ చట్టప్రయోగమునుండి తప్పింప బడినప్పుడు, ఇప్పటినుంచి హైవేస్ శాఖ అని

పిలువబడు రాష్ట్ర ప్రభుత్వపు హైవేస్ శాఖ అధీనము క్రింద యుంచబడినప్పుడు, రాష్ట్ర ప్రభుత్వము సాధారణ లేక ప్రత్యేక ఉత్తరువువల్ల ఈక్రింది వాటిని ఆజ్ఞాపించువిధమున పంచాయతీ సమితి నిధి ఖర్చుతో పంచాయతీ సమితి ఏర్పాటు చేయుటకు దాని విధియై యున్నది.

(a) అట్టి వీధికి దీపములు, నీరు, ఊడ్చి శుభ్రము చేయుట నీరు బయటికి పోవుటకు ఏర్పాటు.

(b) అట్టి వీధిలో, ప్రక్కన, క్రింద నీటి సరఫరా మెయిన్లు, తూములు, మురికి నీరుపోవు కాలువలకు ఏర్పాటు, నిర్వహణ మరమ్మతు.

(c) అట్టి వీధికి చేరియుండు కాలిబాటలకు ఏర్పాటు, నిర్వహణ మరమ్మతు కాని ఆ విధుల నిర్వర్తించుటలో అట్టి వీధియొక్క మట్టి లేక రాళ్ళతో చదునుచేసిన బాటను విడగొట్టి పగులగొట్టుట పంచాయతీ సమితికి అవసరమైనచో, రాష్ట్రప్రభుత్వము సాధారణ లేక ప్రత్యేక ఉత్తరువుద్వారా నిర్దిష్టముచేయు హైవేస్ శాఖ ఆఫీసరు యొక్క పూర్వపు అనుమతిని పంచాయతీ సమితి పొందవలయును.

ఇంకను జరూరు విషయములలో పంచాయతీ సమితి అట్టి అనుమతి అవసరము లేకుండగనే, అట్టి వీధియొక్క మట్టిని లేక రాళ్ళతో చదును చేయబడిన బాటను విడగొట్టి పగులగొట్ట వచ్చును; కాని సాధ్యమైనంతవరకు అటి మట్టిని లేక రాళ్ళతో చదును చేయబడిన బాటను, అది విడగొట్టుటకు, పగులగొట్టుటకు వెంటనే పూర్వము ఏస్థితిలో యున్నదో ఆస్థితిలోనికి తేవలయును మరియు ఆవిధముగా తీసికొన్న చర్యయొక్క రిపోర్టు, దానికి కారణములు వెంటనే యింతకుముందు చెప్పబడ్డ మినహాయింపు నిబంధనలో నిర్దిష్టమైన ఆఫీసరుకు పంపబడును.

60 (B) విశ్రాంతి గృహము, బాటసారుల విశ్రాంతి భవనము మొదలగునవి ప్రభుత్వమునకు తప్పనిసరిబదిలాయింపు, పంచాయతీ సమితి జిల్లా పరిషత్‌లకు స్వాధీనము:

(1) 60 A సెక్షనులో చెప్పబడిన ఏ రాజవీధి విషయములో నైనను, వీధులను అధీనములో నుంచుకొన్న రాష్ట్ర ప్రభుత్వపు చీఫ్ ఇంజనీరు, అతని ఉద్దేశములో, అవిధముగా చేయవలయునని అతనికి తోచిన యెడల, వ్రాత పూర్వకమైన ఉత్తరువురీత్యా యీవిధమున ప్రకటించును.

(a) పంచాయితీ సమితి లేక జిల్లా పరిషత్ స్వాధీనము కొబడ్డ ఆ వీధికి చుట్టుప్రక్కల స్థలములోనున్న ఏ విశ్రాంతి గృహము లేక బాటసారుల విశ్రాంతి భవనము, అట్టి వీధిని జాగ్రత్తగా చూచుటకు నిర్వహించుటకుఅవసరము.

(b) పంచాయతీ సమితి ర జిల్లా పరిషత్‌నకు స్వాధీనము కాబడిన ఏ పనిముట్లు, యంత్రములు పైచెప్పిన పనికి అవసరము.

అట్టి ఉత్తరవు పంచాయితీ లేక జిల్లా పరిషత్‌కు అందిన తేదీన లేక తేదీ నుంచి, విశ్రాంతి గృహము, బాటసారుల విశ్రాంతి భవనము లేక పనిముట్లు, యంత్రములు రాష్ట్ర ప్రభుత్వమునకు స్వాధీనము కాబడును.

(2) ఒకటవ సబ్‌సెక్షను ననుసరించి, పంచాయతీ సమితియొక్క లేక జిల్లా పరిషత్‌యొక్క ఏ ఆస్తియైనను రాష్ట్రప్రభుత్వమునకు స్వాధీనము కాబడినపుడు, పంచాయితీ సమితి గాని జిల్లా పరిషత్‌కుగాని పరిహారమివ్వబడును. అట్టి పరిహార మొత్తము ఈక్రింది విధముగను, ఇప్పటినుండి చెప్పబడు సూత్రముల ననుసరించి నిర్ణయింపబడును; అనగా;

(a) విశ్రాంతి గృహము, బాటసారుల విశ్రాంతిభవనము విషయములో పై చెప్పబడిన ఛీఫ్‌యింజనీరు, ఆ యా పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ అధ్యక్షునితోను, జిల్లాకలెక్టరుతో సంప్రదించి యివ్వవలసిన పరిహారమును నిర్ణయించును. అట్లు చేయుటలో 1894 వ భూమి సేకరణ చట్టము యొక్క 23 వ సెక్షను యొక్క సబ్‌సెక్షను (1) లోని నిబంధనలను, అవి ఈ విషయములో ఎంతవరకు అనువర్తించునో అంత వరకు అనుసరించును.

(b) పనిముట్లు యంత్రముల విషయములో, (7) వ సబ్‌సెక్షను క్రింద జారీకాబడిన ఉత్తరువు అందిన తేదీన వాటి బజారు విలువ, ఛీఫ్ ఇంజనీరుచే ఆ యా పంచాయితీ సమితి లేక జిల్లా పరిషత్ అధ్యక్షునితో సంప్రదించి నిర్ణయింపబడును.

(c) క్లాజు (a) లేక (b) క్రింద చెప్పబడిన ఛీఫ్ ఇంజనీరుచే నిర్ణయింప బడ్డ మొత్తమును పంచాయితీ సమితి లేక జిల్లా పరిషత్ అంగీకరించక పోయిన యెడల, బోర్డు ఆ విషయమును రాష్ట్రప్రభుత్వమునకు అభిప్రాయమునకు పంపును. దానిమీద ప్రభుత్వము తీర్పు ఆఖరుదినీ, బోర్డు ఆమోదించ వలసినదియు ఏ న్యాయస్థానములోను దాని నాక్షేపించుటకు వీలు లేనిదినను యుండును.

61. పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ ఈ చట్టము క్రింద ప్రోగు జేసిన మురికినీళ్ళుబురద మొదలైనవి పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్‌కు చెందవలయును :

చెత్త, మురికినీళ్ళ బురద, మురికి, యితర పదార్థము, అట్టి పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్‌నకు చెందును.

62. పంచాయతీ సమితినుండి పంచాయతీకి స్థిరాస్తి బదలాయింపు :

పంచాయతీ సమితి, నిర్ణయింపబడు హద్దులలోనై, ప్రకటనద్వారా, దాని స్వాధీనములో యుండు ఏ స్థిరాస్తి, అదే జిల్లాలో ఉండు పంచాయితీకి స్వాధీనము చేయబడుననియు, అట్టి ఆస్తి, ప్రకటనలో తెలియజేసిన తేదీనుండి ఆవిధముగా స్వాధీనము కాబడుననియు, తెలియజేయును,

63. 1817 ఆంధ్రప్రదేశ్ (ఆంధ్ర) రెగ్యులేషను VIIక్రింద ధర్మాదాయములు తిరిగి తీసికొనిన ధర్మ ఈనాములు పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్‌నకు బదలాయించుటకు అధికారము :

(1) (a) రాష్ట్ర ప్రభుత్వపు హద్దులకులోనై రివెన్యూబోర్డు ప్రకటన ద్వారా పంచాయతీ సమితి జిల్లా పరిషత్‌ల అనుమతితో 1817 వ మదరాసు ధర్మాదాయ ప్రభుత్వ వశముల రెగ్యులేషనులోని నిబంధనల క్రింద రివిన్యూబోర్డుకు చేర్చిన అధికారములు విధులుగల ఏధర్మాదాయము యొక్క యాజమాన్యముపై విచారణ పంచాయతీ సమితి జిల్లా పరిషత్‌లకు యిచ్చివేయును, దాని మీదట, ఆ విషయములో రివెన్యూబోర్డుకు చేర్చిన అన్ని అధికారములు విధులు పంచాయతీ సమితి, జిల్లా పరిషత్‌లకు, ఆ రెగ్యులేషనులో ప్రత్యేకము చెప్పబడిన రీతిగా చేర్పబడును. పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ అట్టి ధర్మాదాయముకు యాజమాన్యము వహించి పై విచారణ చేయును.

(b) క్లాజు (a) క్రింద పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్‌కు యిచ్చివేసిన ఏధర్మాదాయము యొక్క యాజమాన్యము పై విచారణ, రెవెన్యూబోర్డు, రాష్ట్రప్రభుత్వము ఆవిధముగా సెలవిచ్చిన ప్రకటనద్వారా తిరిగి తీసికొనవచ్చును; ఆవిధముగా తీసికొనిన తరువాత, ఆ ధర్మాదాయము విషయములో పంచాయితీ సమితి లేక జిల్లా పరిషత్‌కు చేర్చిన అన్ని అధికారములు, విధులు ఆపుదల జేయబడి నిర్ణయించబడును.

(2) రాష్ట్ర ప్రభుత్వము లేక వారిచే యీవిషయములో నియమింపబడిన ఏ యితర అధికారి, పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ అనుమతితో వారిచే లేక ఏ యితర అధికారి చేతగాని తిరిగి సంగ్రహింపబడిన ఒక ధర్మ ఈనామును అట్టి పంచాయితీ సమితికి లేక జిల్లా పరిషత్‌కు ఒప్పగించును. కాని ఆ ఈనాము నికరాదాయము, పంచాయితీ సమితి జిల్లా పరిషత్‌ల నిధులు ఏ కార్యమునకు వర్తించునో ఆ కార్యమునకు ప్రత్యేకముగా దానిని ఉపయోగించవచ్చును. ఆవిధముగా జేసిన ఒప్పగింతను రద్దు చేయవచ్చును.

64. ఆస్తి ట్రస్టును అంగీకరించుటకు అధికారగ నియమితము :

ఒక పంచాయితీ సమితి లేక జిల్లా పరిషత్, దాని విధులను అనువర్తించు ఏ కార్యము నైనను కేవలము అభివృద్ధి చేయుటకు' సంబంధించిన ట్రస్టులను అంగీకరించ వచ్చును.

65. సంస్థలు, పనులు మొదలగువాటిని పంచాయతీకి బదలాయింపు :

రాష్ట్ర ప్రభుత్వముచేయు నిబంధనలకులోనై, ఒక పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ లేక ఒక పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ నిర్వహణాధి కారి, పంచాయతీ అనుమతితో, పంచాయతీకి జూరిస్‌డిక్షనుగల ప్రదేశములోను లేక బయటను ఒక సంస్థ యాజమాన్యము లేక ఒక పనిని జరిగించుట లేక నిర్వహణ లేక ఒక అధికారమును చలాయించుట లేక ఒక విధిని నిర్వర్తించుటను, ఒప్పుకొన్న షరతులకు లోనై, పంచాయతీకి ఒప్పచెప్పును,

65a నుండి 65c వదలబడినవి.

66. పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్‌కు కావలసిన స్థిరాస్తి 1894వ భూమిసేకరణ చట్టము క్రింద సేకరించ వచ్చును:

ఈ చట్టము క్రింద అధికార మివ్వబడి పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ సేకరించు ఏ స్థిరాస్తి, 1894 వ భూమిసేకరణ చట్టములోని నిబంధనల క్రింద సేకరించ వచ్చును. ఆ ఆస్థికి ఆ చట్టము క్రిందయిచ్చు పరిహారము దానిని సేకరించుటలోన తగులు బాటు అయి, ఇతర ఖర్చులను చెల్లించిన తరువాత, ఆ ఆస్థి పంచాయతీ సమితి లేక జిల్లాపరిషత్‌కు స్వాధీనము కాబడును.

67 నుండి 72 వరకు వదలబడినవి.

## 6వ అధ్యాయము

## 3వ భాగము – ఆర్థికము

## పన్నులు

74(B.) భూమిపన్ను :

ప్రతి జిల్లాలో, భూమి సంవత్సరాదాయము మీద విధించు పన్ను భూమి పన్నుగాన, అది ఈ చట్టములో యిప్పటినుండి వచ్చు నిబంధనల ప్రకారము విధింపబడును.

74(C). ఆస్థిబదలాయింపుల మీద డ్యూటీ :

ఇప్పటినుండి ఈ చట్టములో తెలియజేసిన నిబంధనల ప్రకారము, ప్రతి జిల్లాలోను పంచాయతీ కాని ప్రదేశము లన్నిటిలోను కొన్ని ఆస్తుల బదలాయింపుల మీద, ఒక డ్యూటీ విధించబడును.

75. పన్నులు :

(1) ఒక పంచాయితీ సమితి ఒక తీర్మానము ప్రకారము జిల్లాలో పంచాయతీ కాని ప్రదేశములన్నిటిలోను లేక తీర్మానములో నిర్దిష్ట మయిన ఏ పంచాయతీ కాని ప్రదేశములోను వృత్తిపన్ను విధించ వలయునని నిర్ణయించును.

(2) వదలబడినది.

(3) ఈ చట్టము స్పష్టముగా ఏర్పాటు చేసిన తప్ప—

(a) బ్లాకు వివిధ భాగములలో వివిధ రేట్లు ప్రకారము వృత్తి పన్ను విధింప వచ్చును; మరియు

(b) ప్రస్తుతమున్న వృత్తి పన్నును రదుచేయుచు గాని లేక వృత్తి పన్ను విధించు రేటుతగ్గించుచుగాని జిల్లాబోర్డు ఏ తీర్మానముగాని వెంటనే రాష్ట్ర ప్రభుత్వముకు రిపోర్టు చేయబడును. (పంచాయితీ సమితి చెల్లింప వలసిన అప్పు ఏదైన యున్న యెడల) అట్టి రద్దు లేక తగ్గింపు రాష్ట్ర ప్రభుత్వము అనుమతి లేనిదే అమలులోనికి తీసికొని రాబడకూడదు.

(c) ఒక ప్రత్యేక సంవత్సరముకు సబ్ సెక్షను క్రింద తీర్మానము అమలు జరిగిన యెడల, ఆ సంవత్సరముకు సంబంధించినంతవరకు, అట్టి తీర్మానములో నిర్ణయించబడిన రేట్లు లేక తేదీని మార్చుటకు సంకల్పము, రాష్ట్ర ప్రభుత్వము అనుమతిలేక ఉత్తరువు లేకుండగా, పంచాయితీ సమితి వల్ల విచారణ లోనికి తీసికొనబడదు.

76. యాత్రిక పన్ను :

రాష్ట్ర ప్రభుత్వము లేక కేంద్ర ప్రభుత్వపు పూర్వపు అనుమతితో, ఒక పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ ఒక తీర్మానముచే, యాత్రికులు తిరుగు జిల్లాలోని స్థానిక ప్రదేశములో లేక దగ్గర 110వ సెక్షను క్రింద ప్రకటింపబడిన ఏ స్టేషను నుంచి యైనను రైలుమీద ప్రయాణము చేయు వ్యక్తుల మీద ఒక పన్ను విధించుటను నిర్ణయించును.

కాని అట్టి పన్ను యొక్క రాబళ్ళలో ఏ భాగమునైనను, అట్టి స్థానికపు ప్రదేశములో తిరుగు యాత్రికుల ఆరోగ్యము సుఖము కొరకు, అట్టి స్థలమును

బాగు చేయుటకు అభివృద్ధి చేయుటకు చేయు ఏర్పాట్లను మినహాయించి ఏ యితర పనులకును, వినియోగింపబడ కూడదు.

76 (a) రాజ్యాంగ చట్టములోని కొన్ని నిబంధనలకు రక్షణ;

చట్టము యొక్క యీ భాగము లోనిదేదియు పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్‌కు, హిందూ దేశపు రాజ్యాంగ చట్టము క్రింద రాష్ట్రములో రాష్ట్ర న్యాయశాస్త్ర అధికారులు విధించుటకు అధికారము లేని ఏ పన్నునైనను విధించుటకు, అధికార మివ్వదు.

కాని అప్పటికి అమలులో వున్న ఈ చట్టము క్రింద రాజ్యాంగ చట్టము ప్రారంభమునకు పూర్వము న్యాయ సమ్మతముగా విధింపబడిన అట్టి ఏ పన్ను అయినను, పార్లమెంటుచే న్యాయ ప్రకారము దానికి వ్యతిరేకముగా నిబంధన చేయబడిన తప్ప ఆ విధముగా నిబంధింప బడుచునే యుండును.

77. పన్నులను విధించుటను గురించి తీర్మానపు ప్రకటన :

(1) 75వ సెక్షను యొక్క [1] వ సబ్ సెక్షను క్రింద ఏ పన్నునైనను విధించుటను నిర్ణయించు పంచాయతీ సమితి ఏ తీర్మానము అయినను, అట్టి పన్ను విధింపబడు ప్రదేశము యొక్క స్థానిక హద్దులు, రేటు, తారీకు ప్రారంభము, ఏమైనయున్న యెడల కాల పరిమితిని నిర్దిష్టము చేయును.

(2) ఒక పంచాయతీ సమితి ఏ తీర్మానము చేతనైనను మొదటిసారి లేక కొత్తరేటున ఏ పన్నునైనను విధించుటను నిర్ణయించిన పంచాయతీ సమితి నిర్వహణాధికారి, (1) వ సబ్ సెక్షనులో చెప్పిన, ఆ తీర్మానములో వున్న వివరములు తెల్పుచూ నియమిత పద్ధతిలో ఒక ప్రకటన వెంటనే ప్రచురించును.

## భూమిపన్ను

78. భూమిపన్ను :

ఏ ఒడంబడిక మీద భూమిని కలిగియున్నప్పటికి ఆక్రమించిన భూములన్నిటి యొక్క సాంవత్సరిక అద్దెవిలువ మీద భూమిపన్ను విధించబడును. బ్లాక్‌లోని అట్టి భూములన్నిటి సాంవత్సరిక అద్దెవిలువలో ఒక రూపాయికి పన్నెండు నయాపైసలు పన్ను ఉండును.

79. భూములయొక్క సాంవత్సరిక అద్దెవిలువ ఎట్లునిర్ణయింపబడినది :

సాంవత్సరిక అద్దెవిలువ, 78వ సెక్షను కొరకు ఈ క్రింది విధముగా లెక్క పెట్టవలెను.

(i) రైతువారీ ఒడంబడిక మీద లేక గుత్తకు లేక లైసెన్సు మీద ప్రభుత్వమునుండి నేరుగాతీసికొన్న భూములవిషయములో మరియు ఏ ఒడంబడిక మీదనైనను మలబారు జిల్లాలో వున్న భూముల విషయములోను కూడ, పన్ను, గుత్తధనము, రాజభాగము లేక ప్రభుత్వమునకు భూములకు యివ్వ వలసిన యితరధనము వాటికి నీరు పంపినందుకు చెల్లించ వలసిన ఏ నీటి పన్నుతోసహా సాంవత్సరిక అద్దె విలువగా పరిగణింపబడును.

(ii) ఈనాము భూములు లేక పూర్తిగాను కొంత పన్ను లేకుండగా ఉన్న భూముల విషయములో, అవి ఈనాము కానప్పుడు అట్టి భూములు భరించు పూర్తిపన్ను వాటికి నీరు పంపినందుకు చెల్లించ వలసిన నీటి పన్నుతోసహా సాంవత్సరిక అద్దెవిలువగా పరిగణింపవలెను. రివెన్యూబోర్డు సాధారణ ఉత్తరువుల మీద జిల్లా కలెక్టరుచే అట్టి పూర్తిపన్ను, నీటి పన్ను నిర్ణయింపవచ్చును.

(iii) ఏ యితర ఒడంబడిక మీద కలిగియున్న భూముల విషయములో, భూస్వామికి, ఉప భూస్వామికి లేక అతని పాయకారి రైతులచే సృష్టింపబడి, సాగుతూ లేక గుర్తింపబడిన ఒక అండర్‌టెన్యూరు మీద భూమి కలిగియున్న ఏ యితర మధ్య తరగతి భూస్వామికి యివ్వవలసిన సాంవత్సరిక అద్దె, వాటికి నీరు పంపినందుకు చెల్లించవలసిన నీటి పన్నుతోసహా సాంవత్సరిక అద్దె విలువగా పరిగణింప బడును. అట్టి భూములను యజమానియే లేక అద్దె లేకుండ లేక వీలైన అద్దెకు అతని వద్ద తీసికొన్న ఏవ్యక్తిగాని ఆక్రమించి నపుడు, సాంవత్సరిక అద్దె విలువ, ఆ మాదిరి ఉపయోగములతో చుట్టుప్రక్క నుండు రైతు భూములకు ఆక్రమణ రైతుచేత సాధారణముగా చెల్లింప బడిన అద్దె రేటుల ప్రకారము, ఆ విధముగా ఆక్రమించిన భూములకు నీరు పంపినందుకు చెల్లించవలసిన నీటి పన్నుతో సహా గుణించవలయును.

(iv) వస్తురూపముగా విధించిన పన్ను చెల్లించు భూముల విషయములో, సాంవత్సరిక అద్దె విలువ, ఆ మాదిరి పోలిక, రకముగల, చేరువ నుండు భూములకు నిర్ణయించిన లేక చెల్లించిన అద్దె రేటుప్రకారము, మొదట చెప్పబడిన భూములకు నీటిని పంపించుటకు చెల్లింపవలసిన ఏ నీటిపన్నుతో నైననుసహా గుణింపవలయును లేక అట్టి గుణించు విధము రివిన్యూబోర్డు అభిప్రాయములో ఏప్రత్యేక విషయములోనైనను అసాధ్యము అని తోచినయెడల ఆ విషయములో రెవిన్యూబోర్డు ఒప్పుకొను ఏపద్ధతితోనైననుగుణించ వచ్చును.

కాని ప్రభుత్వమునకు అతడు నీటిపన్నురీత్యా అధికముగా చెల్లించుట మూలమున అతని అద్దె ఎక్కువచేయుటకు అధికారమిచ్చిన 1908వ మదరాసు ఎస్టేట్ల భూమి చట్టముయొక్క 30 (iii), 33 వ సెక్షనులలోని నిబంధనల క్రింద ఏ భూస్వామి లేక ఉప భూస్వామి ఒక డిక్రీ పొందినచో, సాంవత్సరిక అద్దె విలువ పైరీతిగా నిర్ధారణ కాబడిన మొత్తమునుండి నీటిపన్ను మొత్తము వరకు అట్టి అద్దెలోని హెచ్చు తీసివేసిన తరువాత మిగిలియుండునదిగా యుండును.

80. [1] 79వ సెక్షనుయొక్క క్లాజు (iii) లో సూచించిన భూముల యొక్క అద్దెవిలువ మూడు సంవత్సరముల కాలముకు జిల్లా కలెక్టరుచే నిశ్చయింపబడును. అది మూడు సంవత్సరముల కాలములో, మార్పుగాని పునఃపరిశీలనగాని చేయబడదు. కాని గుమాస్తాచేసిన లేక లెక్కల సంబంధించిన తప్పులను దిద్దవచ్చును.

కొంతమంది భూస్వాములు లేక ఉప భూస్వాములు జిల్లా కలెక్టరుకు వారి భూముల పట్టీని దాఖలు చేయుట ;

పై చెప్పబడిన భూములకు అద్దె విలువ నిర్ణయించుటకు, జిల్లా కలెక్టరు, ప్రకటన ద్వారాగాని ఏ యితరముగా గాని, (2) వ సబ్ సెక్షన్‌లో సూచించిన వివరములను నిర్దిష్టము చేయుచు, అతడే ఆక్రమించిన లేక పాయకారి రైతులచే ఆక్రమించబడిన అతని చెంతనున్న భూముల సరియైన పట్టీని ప్రతి ఫసలీ సంవత్సరమునకు 1894 వ సంవత్సరపు మదరాసు ప్రొప్రియిటరీ గ్రామ నౌకరీ చట్టములో 'ఎస్టేటు' నిర్వచనముయొక్క [a], [b] లేక [c] క్లాజులక్రింద వచ్చు ఒక ఎస్టేటు ప్రొప్రయిటరు అయిన ప్రతి భూస్వామిని, జిల్లాలో ప్రతి భూస్వామిని అతనికి దాఖలు యవలసినదిగా కోరును.

కాని 1353, 1354, 1355 ఫసలీ సంవత్సరములున్న మూడు సంవత్సరముల కాలముకు అట్టి భూముల అద్దె విలువ నిర్ణయించుటకు, జిల్లా కలెక్టరు అతనికి 1350, 1351, 1353 ఫసలీ సంవత్సరములలో అన్నిటికిని లేక దేనికైనను పైచెప్పినరీతిగా ఒక జాబితా దాఖలు చేయమని భూస్వామిని లేక ఉప భూస్వామిని కోరుటకు అధికారము కలదు.

[2] (a) సబ్ సెక్షను [1] క్రింద భూస్వామి దాఖలుచేయు జాబితా ఈ క్రింది వాటిని నిర్దిష్టము చేయును.

(*i*) అతని క్రింద ఉప భూస్వామి ఉంచుకున్న భూముల విషయములో, అట్టి ఉపభూస్వామి అతనికి చెల్లించు కట్టుబడి, జోడి, పౌరుపు లేక క్విట్ రెంటు.

(*ii*) భూస్వామి ఆక్రమించిన ఏ యితర భూముల విషయములోను, ప్రభుత్వమునకు నేరుగా అతని పాయకారి రైతులవల్ల చెల్లించవలసిన నీటిపన్ను ఏమైన వున్న దానిని మినహాయించగా దాని సాంవత్సరిక అద్దె విలువ.

(*b*) ఉప భూస్వామి [1]వ సబ్ సెక్షనుక్రింద దాఖలుచేయు జాబితా ప్రభుత్వమునకు నేరుగా అతని పాయకారి రైతువల్ల చెల్లించవలసిన నీటిపన్ను ఏమైన ఉన్న దానిని మినహాయించగా అతడు ఆక్రమించిన భూముల సాంవత్సరిక అద్దె విలువను నిర్దిష్టించును.

(*iii*) ఇద్దరు లేక ఎక్కువ వ్యక్తులు కలసి ఒక రెవిన్యూ గ్రామము లేక గ్రామములు కలగియున్నచో, భూస్వామి లేక ఉపభూస్వామి, (1), (2) సబ్ సెక్షనులకొరకు, సీనియరు జాయింటు హోల్డరుగా ఇతర జాయింటు హోల్డర్ల చేత గుర్తింపబడిన వ్యక్తిగాను లేక వివాద విషయములో జిల్లా కలెక్టరుచే ఆ విధముగా గుర్తింపబడినవాడుగాను ఉండును.

81. జాబితాల ప్రకారము, అవి సరియైనవైనయెడల, జిల్లా కలెక్టరు పన్ను విధించుట :

ఏ మూడు సంవత్సరముల కాలముకు ముందు ఆ మూడు ఫసలీ సంవత్సరములలో ప్రతి ఒక్కదానికి 80వ సెక్షనుక్రింద చేసిన ఆవశ్యకములను నిర్వర్తించుటలో ఒక భూస్వామి లేక ఉప భూస్వామి దాఖలు చేసిన జాబితాలలో జిల్లా కలెక్టరు తృప్తిపడిన యెడల, పై జెప్పిన జాబితాలలో తెలియజేసిన రీతిగా అతని భూముల సరాసరి సాంవత్సరిక అద్దె విలువననుసరించి మూడు సంవత్సరముల కాలముకు అతడు భూస్వామికి లేక ఉప భూస్వామికి పన్ను విధించును.

82. అట్టి జాబితాలను దాఖలు చేయనందుకు అపరాధము :

ఒక భూస్వామి లేక ఉప భూస్వామి 80 వ సెక్షనుక్రింద చేయు ఉత్తరువును ఆ ఉత్తరువు అతనిచేత గ్రహింపబడిన తారీఖునుండి ఆరు నెలలలోగా, నిర్వర్తించుటను అశ్రద్ధ చేసినయెడల, 83 వ సెక్షనులో నియమింపబడిన రీతిని

జాబితా దాఖలు చేయువరకు లేక జిల్లా కలెక్టరుచేత అతని భూముల సాంవత్సరిక అద్దె విలువ నిర్ణయింపబడువరకు, ఆరునెలలు గడచిన తరువాత ప్రతిదినపు ఆలస్యమునకు ఏబది రూపాయలు దాటకుండునటుల అతడు ఒక అపరాధము నకు బాధ్యుడగును; కాని విధింపబడు అపరాధము ఏవిషయములోను మూడు వేల రూపాయలు మించకూడదు. అట్టి అపరాధపు మొత్తము జిల్లా కలెక్టరుచేత నిర్ణయింపబడి, భూమి పన్ను బకాయిగా వసూలు చేయబడును.

83. సాంవత్సరిక అద్దె విలువను జిల్లా కలెక్టరు నిర్ణయించవచ్చును :

82 వ సెక్షనులో సూచించిన ఆరు నెలల గడువు దాటినప్పటినుండి ఒక నెలలోగా మూడు సంవత్సరముల కాలముకు ముందు మూడు ఫసలీ సంవత్స రములలో ఏ ఒకటి లేక ఎక్కువ సంవత్సరములకు అటువంటి ఏ జాబితా భూస్వామి లేక ఉప భూస్వామి దాఖలు జేయనిచో, జిల్లా కలెక్టరు తాను స్వయ ముగా మూడు సంవత్సరముల కాలముకు అట్టి భూస్వామి లేక ఉప భూస్వామి భూములయొక్క సాంవత్సరిక అద్దె విలువను నిర్ణయించును.

84. పార్టీలను హాజరు కమ్మనుటకు జిల్లా కలెక్టరు అధికారము :

80 వ సెక్షను క్రింద చేసిన ఉత్తరువు నిర్వర్తించుటలో దాఖలు చేసిన ఏ జాబితా సరిగా యున్నదో లేదో కనుగొనుటకు 1869వ మద్రాసు రివెన్యూ సమన్ సెస్ చట్టముచే నియమింపబడిన పద్ధతిలోను, లేక 1902వ మదరాసు కరణముల రెగ్యులేషన్‌లో ఏది వ్యతిరేకముగానున్నను 83వ సెక్షనులో నియ మింపబడిన సాంవత్సరిక అద్దె విలువ నిర్ణయించుటకు మూడు సంవత్సరముల కాలమునకు ముందు మూడు ఫసలీ సంవత్సరములలో దేనికైనను అటువంటి జాబితా దాఖలు చేయబడినప్పుడును, జిల్లా కలెక్టరు చర్యలు తీసికొనవచ్చును. అతడు అతని ఆఫీసర్లలో ఎవరినైనను కావలసిన విచారణలు జరుపుటకు నియ మింపవచ్చును.

85. జాబితాలను సవరణ చేయుటకు, సవరించిన జాబితాల ప్రకా రము భూస్వాముల మీద లేక ఉప భూస్వాములమీద పన్ను విధించుటకు జిల్లా కలెక్టరునకు అధికారము :

(1) మూడు సంవత్సరములకు ముందు మూడు ఫసలీ సంవత్సరములలో ఏ ఒక లేక ఎక్కువ సంవత్సరములకు భూస్వామి లేక ఉప భూస్వామిచేత దాఖలు కాబడు ఏ జాబితా లేక జాబితాలలో కావలసిన విచారణ తరువాత జిల్లా కలెక్టరు అసంతృప్తి పడినచో అతడు అట్టి జాబితా లేక జాబితాలను సవరణచేసి ఆ విధముగా సవరణ కాబడ్డ జాబితా లేక జాబితాలు యొక్క ఒక నకలును భూస్వామికి లేక ఉప భూస్వామికి సరఫరా చేయును.

(2) (1) వ సబ్ సెక్షనుక్రింద సవరణ కాబడిన రీతిగా, మూడు సంవత్సరముల కాలముకు ముందు మూడు ఫసలీ సంవత్సరములకు దాఖలు కాబడ్డ జాబితాలలో తెలియజేసిన విధముగా అతని భూములయొక్క సరాసరి సాంవత్సరిక అద్దె విలువ ప్రకారము, మూడు సంవత్సరములకు జిల్లా కలెక్టరు భూస్వామి మీద లేక ఉప భూస్వామిమీద పన్ను విధించి, మూడు సంవత్సరముల కాలముకు నిర్ణయింపబడిన అతని భూముల సాంవత్సరిక అద్దె విలువ తెలియజేయుచూ ఒక స్టేటుమెంటును భూస్వామికి లేక ఉప భూస్వామికి యిచ్చును.

86. రెవెన్యూ బోర్డుకు అప్పీలు :

(1) 85వ సెక్షనుయొక్క (2) వ సబ్ సెక్షను క్రింద జిల్లా కలెక్టరుచే ఏ పన్ను విధించుట మీద రెవెన్యూబోర్డుకు ఒక అపీలు దాఖలు చేయవచ్చును.

(2) 85వ సెక్షను సబ్ సెక్షను (2) లో సూచించిన స్టేటుమెంటు భూస్వామికి లేక ఉప భూస్వామికి దాఖలు చేసిన తేదీనుండి ఆరు నెలలలో అట్టి అప్పీలు దాఖలు చేయవలెను.

(3) అట్టి అప్పీలు మీద రెవెన్యూబోర్డు చేయు ఉత్తరువు ఆఖరుది.

87. రైతువారీ భూముల పట్టాలలో భూమిపన్నును ఎక్కించవలెను :

రైతువారీ ఒడంబడిక మీద కలిగియున్న భూముల విషయములో, భూస్వామి చెల్లించవలసిన భూమిపన్ను మొత్తము అతని పట్టాలో ఎక్కించ బడును.

88. భూస్వాములు, ఉప భూస్వాములు భూస్వామి పన్ను చెల్లించుట :

జిల్లాకలెక్టరు, రెవెన్యూబోర్డు సాధారణ ఉత్తవుల క్రింద ప్రకటన ద్వారా తెలియజేయు తేదీ లేక అట్టి తేదీలకు ముందును, అట్టి దఫాలుగాను, ఉప భూస్వామి లేక భూస్వామి మరియు పాయికారీ రైతుచేత చెల్లింపదగు అట్టి పన్ను మొత్తము ఏమైనవున్న అది మినహాయించి అతడు కలిగిన భూమి విషయములో చెల్లింపవలసిన భూమిపన్ను, ప్రతిభూస్వామి మరియు ఉప భూస్వామి జిల్లా కలెక్టరుకు లేక, దానిని గ్రహించుటకు అతనిచే అధికారము పొందిన ఏ యితర అఫీసరుకు చెల్లింపవలయును. మరియు అట్టి భూములు ప్రభుత్వమునకు నేరుగా నీటి పన్నును చెల్లించు పాయి కారి రైతువలన ఆక్రమింప బడినచో, అట్టిరైతు అట్టి నీటిపన్ను మొత్తముమీద చెల్లింపవలసిన భూమిపన్ను, నీటి పన్నుతోసహా జిల్లా కలెక్టరుకు చెల్లించును.

కాని, భూస్వామిచేత లేక ఉప భూస్వామిచేత సృష్టింపబడి, సాగుతూ వుండి, లేక గుర్తించబడిన అండర్ టెన్యూరుమీద ఒక మధ్యతరగతి భూస్వా

మిగా ఆక్రమణ హక్కుతో గాని లేకుండగా గాని ఒక వ్యక్తి భూములను కలిగి యున్న విషయము లన్నిటిలోను, భూస్వామికి లేక ఉప భూస్వామికి అట్టి మధ్య తరగతి భూస్వామిచే చెల్లింపబడవలసిన ఏ కట్టుబడి, జోడి, పొరుప్పు లేక క్విట్ రెంటు మొత్తముమీద విధింపవలసిన పన్నులో ఒక అర్ధను తీసివేయగా అట్టి మధ్యతరగతి భూస్వామి కలిగియున్న భూములవిషయములో భూస్వామి లేక ఉప భూస్వామి చెల్లించు పన్నునంతయు, భూస్వామి లేక ఉప భూస్వామి అట్టి మధ్యతరగతి భూసామినుండి వసూలు చేయుటకు న్యాయ సమ్మతముగా యున్నది.

ఇంకను రైతులచే ఆక్రమింపబడిన భూముల విషయములో, ఆ విధముగా ఆక్రమణ చేయబడ్డ భూములకు భూస్వామి, ఉప భూస్వామి లేక మధ్యతరగతి భూస్వామిచేత చెల్లింపబడవలసిన మొత్తములో ఒక సగ భాగమును అతని రైతునుండి వసూలు చేయుటకు భూస్వామి, ఉప భూస్వామి లేక ఏ యితర మధ్యతరగతి భూస్వామి, ఎవరు వీలైనవారు, న్యాయసమ్మత హక్కును కలిగియున్నారు.

89. భూస్వాముల అధికారములు :

88వ సెక్షను మినహాయింపు నిబంధన క్రింద అతనికి వచ్చు మొత్తమును వసూలుచేయుటలో, ప్రతి భూస్వామి ఉప భూస్వామి లేక ఏ యితర మధ్యతరగతి భూస్వామి, ఎవరికి వీలైనవారు అద్దె వసూలు చేయుటలో వుండు ఏ చట్టము క్రిందను లేక రెగ్యులేషను క్రిందను ఎట్టి అధికారములు చలాయించునో అట్టి అధికారములను మాత్రమే చలాయించుటకు అర్హుల కలిగియున్నాడు. అట్టి అధికారముల దుర్వినియోగమునకు అందులో నియమింపబడిన అన్ని అపరాధములకు అతడు బద్ధుడు కావలసి యుండును.

వివరణ : దానిలో సూచించిన మధ్యతరగతి భూస్వామి నుండి, 88వ సెక్షనుకు ఒకటవ మినహాయింపు నిబంధన క్రింద, అతనికి రావలసిన మొత్తము వసూలు చేయుటలో, ఒక భూస్వామి లేక ఉప భూస్వామి, ఒకపట్టా ముచ్చిలక మార్పుచేయబడిన మధ్యతరగతి భూస్వామి ఒకరైతు అయినట్లుగా అధికారమును చలాయించుటకు, ఈ సెక్షనులో నిర్దిష్టమైన అపరాధములకు బద్ధుడై యుండును. 1908వ ఆంధ్రప్రదేశ్ [ఆంధ్ర] ఎస్టేట్ల భూమిచట్టములోని నిబంధనలు, వీలైనంతవరకు దానికి అనువర్తించును.

90. ప్రభుత్వమునకు చెల్లించు శాశ్వతముగా స్థిరపరచిన రవెన్యూ మీద భూమిపన్ను తగ్గింపు :

79వ సెక్షను యొక్క (iii) వ క్లాజు అనువర్తింపు ప్రతి భూస్వామి

అట్టి భూస్వామికి ప్రభుత్వమునకు అతనిచే చెల్లింపబడు శాశ్వతముగా స్థిరపరచిన రెవెన్యూయొక్క మొత్తమునకు సమానమగు అతని భూమి యొక్క సాంవత్సరిక అద్దె విలువమీద అతడు చెల్లింప వలసిన పన్నులో ఒక సగము యొక్క తగ్గింపును కోరుటకు హక్కుకలిగి యున్నాడు.

కాని 88 వ సెక్షనుకు 2 వ మినహాయింపు నిబంధన క్రింద అట్టి భూస్వామి అతని రైతుల నుండి వసూలు చేయగలిగిన మొత్తము, అట్టి తగ్గింపు మీద గుణించ వలయును.

91. పన్ను బకాయీలు వసూలు :

88 వ సెక్షను క్రింద జిల్లా కలెక్టరుచే నిర్ణయింపబడు తేదీన ఒక భూస్వామి లేక ఉప భూస్వామి, అతని భూములకు అతడు చెల్లించ వలసిన పన్ను పూర్తిగాగాని కొంతగాని చెల్లించుట తప్పిన యెడల లేక ఒక రైతు, అతడు ఆక్రమించిన భూములకు ప్రభుత్వమునకు అతడు నేరుగా చెల్లించ వలసిన నీటిపన్నుమీద అతడు చెల్లించవలసిన పన్ను పూర్తిగా లేక కొంత చెల్లించుట తప్పిన యెడల, అట్టిపన్ను లేక చెల్లించకుండా మిగిలియుండు దాని అట్టిభాగము 1864 వ ఆంధ్ర ప్రదేశ్ (ఆంధ్ర) రెవెన్యూ వసూలు చట్టముక్రింద అది ఒక రెవెన్యూ బకాయీగా వసూలుచేయబడును. చెప్పిన చట్టముయొక్క 42 వ సెక్షను కలిగియున్న నిబంధనలు, పన్ను బకాయీలుగా అమ్మకమునకు తీసికొని రాబడ్డ భూములన్నిటికి అనువర్తించును.

92. భూమి పన్ను విభజన :

భూమి పన్ను రాబడి జిల్లా పరిషత్ నిధిని చేర్చబడును.

కాని పంచాయతీ ప్రదేశములో వసూలు కాబడిన పన్ను ఈ క్రింది విధముగా విభజింపబడును.

(a) పన్నులో నాలుగవ వంతు జిల్లా పరిషత్ నిధికి చేర్చబడును ;

(b) ప్రదేశము మీద, జూరిస్ డిక్షనుగల పంచాయతీ సమితి యొక్క పంచాయతీ సమితి నిధికి, పన్నులో నాలుగవ భాగము చేర్చబడును; మరియు

(c) మిగిలిన పన్నులో అర్ధభాగము పంచాయతీనిధికి చేర్చబడును.

# వృత్తి పన్ను

93. వృత్తి పన్ను:

(1) పంచాయతీ సమితి, పంచాయతీ కాని ప్రదేశము మీద వృత్తిపన్ను విధించవలయునని ఒక తీర్మానముద్వారా నిర్ణయించిన యెడల.

77వ సెక్షను యొక్క సబ్ సెక్షను (2) క్రింద ప్రచురింపబడిన ప్రకటనలో నిర్దిష్టమైన తరువాత ఏ కంపెనీగాని, ఒక అర్ధ సంవత్సరములో మొత్తం అరవై రోజులకు తక్కువ కాకుండగా అట్టి పంచాయతీ కాని ప్రదేశములో ఒక వ్యాపారము నడపిన : మరియు

ఏ అర్ధ సంవత్సరములోను చెప్పబడిన తేదీ తరువాత ఏ వ్యక్తి యైనను,

(a) వృత్తి, కళ, పని కలిగినను లేక ఒక వ్యాపారము నడిపినను లేక బహిరంగ లేక స్వంత ఉద్యోగము కలిగియున్నను ;

(i) మొత్తముమీద అరవైరోజులకు తక్కువ కాకుండ అట్టి పంచాయతీ కాని ప్రదేశములో ; లేక

(ii) అట్టి పంచాయతీ కాని ప్రదేశము కాకుండ కాని మొత్తము మీద అరవై రోజులకు తక్కువ కాకుండ దానిలో అతడు నివసించునపుడు; లేక

(b) మొత్తము మీద అరవైరోజులకు తక్కువకాకుండ అట్టి స్థానిక ప్రదేశములో నివసించినను పెన్షన్ పొందుచున్నను లేక పెట్టుబడులమీద అదాయము పొందుచున్నను-

షెడ్యూలు IV లోని నిబంధనల ప్రకారము విధించిన ఒక అర్ధ సంవత్సరపు పన్నును చెల్లించును.

(2) ఒకటవ సబ్ సెక్షనులో నిర్దిష్టమయిన అన్ని స్థలములనుండి అతని మొత్తము ఆదాయమునకు ఉచితముగా నుండు తరగతి క్రింద ఒక వ్యక్తి పన్ను విధించుటకు బాధ్యుడుగా పరిగణింపబడును.

(3) ఒక కంపెనీ లేక ఒక వ్యక్తి, అదిగాని అతడుగాని ఈ చట్టము లేక కంపెనీల చట్టము క్రింద విధించు వృత్తిపన్ను విషయములో చెల్లింపదగు మొత్తము లేక 1919వ ఆంధ్ర ప్రదేశ్ (ఆంధ్ర) సిటీ మునిసిపల్ చట్టము లేక 1920 వ అంధ్రప్రదేశ్ (అంధ్ర) జిల్లా మునిసిపాలిటీల చట్టముక్రింద విధించిన వృత్తిపన్ను, లేక 1924 వ కంటోన్మెంట్లు చట్టముక్రింద విధించిన వృత్తిపన్ను

యొక్క స్వభావము గల ఏయితర పన్ను అదే అర్ధసంవత్సరమునకు ఆంధ్ర రాష్ట్రములో పంచాయతీ సమితికి లేక మునిసిపల్ కౌన్సిలుకు కంటోన్‌మెంటు అధికారికి చెల్లించెను అని రుజువు పరచినచో, అట్టి కంపెనీ లేక వ్యక్తి, వ్యాపారము చేయు స్థలముమార్పు, వృత్తి, కళ లేక పని చలాయింపు, ఉద్యోగము లేక నివాసము కారణము వల్లనే, అట్టి మొత్తముకు ఈ చట్టము క్రింద లేక పై చెప్పబడిన ఏ చట్టముల క్రింద నైనను అర్ధ సంవత్సరమునకు వృత్తికి లేక కంపెనీల పన్నుకు ఇంకొక రీతిగా అది లేక అతడు బాధ్యతగా నుండు మొత్తమునకు వ్యత్యాసముకంటె హెచ్చుగా ఏ యితర పంచాయితీ సమితి, మునిసిపల్ కౌన్సిలు లేక కంటోన్‌మెంటు అధికారికి చెల్లించుటకు బాధ్యత కలిగి యుండరు.

(4) ఈ సెక్షనులోని దేదియు, ఒక స్థానికపు హద్దులలో నివసించి, అతని వృత్తి, కళ, పనిచలాయించు, లేక ఏ యితర స్థానిక అధికారి లేక అధికారుల హద్దులలో వ్యాపారము నడుపు లేక ఏఉద్యోగమునైనను చేయు వ్యక్తిని, స్థానిక అధికారులలో ఏ ఒకరిచేతనైనను విధించబడు పన్ను మొత్తములలో పెద్దదాని కంటె ఎక్కువ వృత్తిపన్ను చెల్లించుటకు బాధ్యత కలుగజేసినదిగా భావింప బడదు. అట్టి విషయములో రాష్ట్ర ప్రభుత్వము పన్నును స్థానిక అధికారుల మధ్య దానికి తోచిన యుక్తిరీతిని విభజించును. రాష్ట్ర ప్రభుత్వము నిర్ణయము ఆఖరిది.

కాని ఆ యా స్థానికపు అధికారులలో ఒకటి, కంటోన్‌మెంటు అధికారి లేక మేజరు పోర్టుయొక్క పోర్టు అధికారి అయినచో రాష్ట్ర ప్రభుత్వము తీర్పు, కేంద్ర ప్రభుత్వము యొక్క ఏకీభవమునకు బద్ధమై యుండును.

94. వృత్తిపన్ను చెల్లించుటకు ఫరము, అసోసియేషన్లు మరియు జాయింటు హిందూ కుటుంబముల సభ్యుల బాధ్యత :

ఫరము, అసోసియేషను లేక జాయింటు హిందూ కుటుంబము మీద విధింపనగు వృత్తి పన్ను, ఫరము అసోసియేషను లేక కుటుంబము యొక్క ఏ వయసు వచ్చిన వక్తి మీద విధింప నగును.

94 (A). వృత్తి పన్ను చెల్లించుటకు ఉద్యోగుల లేక ఏజంట్ల బాధ్యత:

(1) పంచాయతీ కాని ఏ స్థలములో నైనను వ్యాపారమునడపు నిమిత్తము ఒక కంపెనీ లేక వ్యక్తి ఒక ఉద్యోగినిగాని ఏజంటును గాని దానిని లేక అతనిని తెలియ జేయుటకు నియమించినచో, అట్టి కంపెనీ లేక వ్యక్తి, పంచాయతీ కాని ప్రదేశములో వ్యాపారము నడపిన వాడుగా పరిగణింపబడును. అట్టి ఉద్యోగి లేక ఏజంటు అట్టి కంపెనీ లేక వ్యక్తితరపున బద్ధునిచేయు కాంట్రాక్టులు

చేయుటకు అధికార మున్నను లేక పోయినను అట్టి కంపెనీ లేక వ్యక్తియొక్క వ్యాపారము విషయములో చెల్లింప వలసిన వృత్తిపన్నుకు, అట్టి ఉద్యోగి లేక ఏజంటు బాధ్యుడై యుండును.

(2) ఒక కంపెనీ లేక ఒక వ్యక్తి ఇంకొక కంపెనీ లేక వ్యక్తికి ఏజంటుగా ఉన్న విషయములో, మొదటి కంపెనీ లేక వ్యక్తి, అసలు యజమాని యొక్క రాబడి ఎంతఉన్న అంతరాబడి మీద వృత్తి పన్నుకు ప్రత్యేకముగా బాధ్యుడు కాడు.

95. వదల బడినది.

96. పన్ను చెల్లించుట నుల్లంఘించినప్పుడు నోటీసు అందజేయుట :

ఏ కంపెనీనుంచిగాని వ్యక్తినుంచిగాని రావలసిన వృత్తిపన్ను చెల్లింపబడక పోయినచో, పంచాయతీ నిర్వహణాధికారి, ఒక నోటీసును, అట్టి నోటీసు ఇచ్చిన పదిహేను దినములకులోగా దానిని చెల్లించ వలసినదిగా, అట్టి కంపెనీ లేక వ్యక్తిమీద జారీచేయుటకు ఏర్పాటు చేయును.

96 (A). స్టేట్‌మెంటులు, రిటర్నులు, మొదలైనవి రహస్యముగా నుంచుట

ఏ కంపెనీ వ్యక్తిగాని వృత్తిపన్ను విధించు సందర్భములో చేసిన స్టేట్‌మెంటులు, దాఖలు చేయు రిటర్నులు లేక ఎకౌంట్లు లేక దస్తావేజులు రహస్యముగా ఉంచవలసిన వాటిగా ఎంచబడును. వాటి నకళ్ళు జనబాహుళ్యమునకు యివ్వబడవు.

97. పన్ను చెల్లించుటకు బాధ్యులయిన వ్యక్తుల జాబితాను దాఖలు చేయుటకు, యజమానికి లేక ఆక్రమణదారుకు నోటీసు :

పంచాయతీ నిర్వహణాధికారి నోటీసుద్వారా, ఏ భవనము లేక భూమి యొక్క యజమాని లేక ఆక్రమణదారు, హోటలు, భోజన లేక బసచేయు ఇల్లు, క్లబ్బు, లేక నివాసమున కేర్పరచ బడిన గదులు యొక్క ప్రతి కార్యదర్శి లేక యజమానిని, విర్ణీత కాలములో అట్టిభవనము, భూమి, హోటలు,భోజన లేక బసచేయు ఇల్లు, క్లబ్ లేక నివాసమునకేర్పరచిన గదులు ఆక్రమించిన వ్యక్తుల పేర్లను, అట్టి వ్యక్తియొక్క వృత్తి, కళ లేక పని, అతడు చెల్లించిన అద్దె ఏమైన యున్న యెడల దానిని, అట్టి ఆక్రమణ కాలము కలిగియున్న వ్రాతపూర్వకమైన ఒక జాబితాను దాఖలు చేయవలసినదిగా కోరును.

98 to 109 వదలబడినవి.

## యాత్రిక పన్ను

10. యాత్రికపన్ను విధింపు:

(1) ఒక స్థానికపు ప్రదేశము యాత్రికులు వచ్చు స్థలముగా ఉన్నపుడును, తీర్థ యాత్రలకు అవకాశములు కొన్ని సంవత్సరముల కొకమారు లేక ఒకే సంవత్సరములో ఒకేమారు లేక రెండు మారులు కలిగినచో, రైలుద్వారా అట్టి స్థలమును లేక దాని చుట్టుప్రక్కల స్థలమును వదలు వ్యక్తులమీద, అట్టి ప్రతి అవకాశమునకు ఒక నిర్దిష్టకాలమునకు మాత్రమే ఒక పన్ను విధించబడును; తీర్థ యాత్రలకు అవకాశములు ఎక్కువగా నున్న యెడల లేక యాత్రిక స్థలము ఎప్పుడును యాత్రికులు వచ్చు స్థలముగా యున్నయెడల సంవత్సరమంతయు పన్ను విధింప వచ్చును.

(2) పన్ను విధించు అవకాశము, కాలము పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ చే ఆ యా రైలుశాఖల సంప్రదింపులతో, రాష్ట్ర ప్రభుత్వపు పూర్వపు అనుమతితో నిర్ణయింపబడును.

(3) పంచాయతీ లేక జిల్లా పరిషత్ ఒక తీర్మానముద్వారా పన్ను విధించ వలయునని నిర్ణయించినచో, అట్టి పన్ను, అట్టి తీర్మానము ననుసరించి 77 వ సెక్షనుయొక్క (2) వ సబ్ సెక్షను క్రింద ప్రచురించబడిన ప్రకటనలో నిర్దిష్టమయిన తేదీనుంచి ఆ కాలములో స్థానికపు ప్రదేశములో లేక దగ్గరనున్న మరియు అట్టి ప్రకటనలో చెప్పబడిన రైల్వే స్టేషన్లలో ఏ ఒక్కటినుండి అక్కడ నుండి నిర్దిష్టమైన దూరమును మించిన ఏ యితర రైల్వేస్టేషనుకు రైలుమీద ప్రయాణముచేయు ప్రయాణీకులందరి టిక్కట్లమీద ఒక సర్ చార్జిగా వసూలు చేయబడును.

(4) ప్రతి తరగతి టికెట్లకు విధింపవలసిన పన్నుయొక్క రేట్లు పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ చే నిర్ణయింప బడును.

పన్నులు ఈ క్రింది పట్టికలోని రేట్లకు మించవు:

| (1) | నియమితమైన కాలములకు (2) రూ. | న.పై | పన్ను సంవత్సర మంతటను (3) రూ. | న.పై |
|---|---|---|---|---|
| ఒకటవ తరగతి టిక్కట్లకు | 0 | 50 | 0 | 25 |
| రెండవ తరగతి టిక్కట్లకు | 0 | 25 | 0 | 12 |
| మధ్య తరగతి టిక్కట్లకు | 0 | 19 | 0 | 8 |
| మూడవ తరగతి టిక్కట్లకు | 0 | 12 | 0 | 6 |

కాని ఒక కాలములో యిచ్చు టిక్కెట్లు ఏమైనవున్న వాటిమీద విధింప బడు రేట్లు పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్‌చే ఆ యా రైల్వే శాఖల సంప్రదింపులతో నిర్ణయింపబడును. కాని ఒక నెల కాలము లేక దానికి తక్కువ కాలమునకు అవి పై పట్టికయొక్క (2) వ 'కాలము'లో యివ్వబడ్డ రేట్లకు ఆరు రెట్లను మించకూడదు.

74. (A) యాత్రికపన్నుమీద వచ్చు వరుంబడి పంచాయతీ సమితి నిధి మరియు జిల్లా పరిషత్ నిధికి చేర్చవలయును.

కాని ఒక పన్ను పంచాయతీ ప్రదేశములో విధించినయెడల, తీర్థయాత్రకు అవకాశము, బ్లాక్ లెవెల్ ఉత్సవముగా తరగతి చేయబడిన ఉత్సవము కానప్పుడు రాబడి పంచాయతీనిధికి చేర్చబడును,

(5) రాష్ట్ర ప్రభుత్వము చట్ట విరుద్ధము కాని నిబంధనలను —

(i) పన్ను వసూలు,

(ii) దానిని ఆ యా పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ లేక పంచాయతీకి చెల్లించుట,

(iii) దానిని వసూలు చేయుటకు రైల్వే శాఖలు లోనైన ఏమైన ఖర్చుల మినహాయింపు, మరియు

(*iv*) తగాయిదాల తీర్పు—

(a) పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తు లేక పంచాయతీలు మరియు పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ లేక పంచాయతీ సమితులు మరియు యితర స్థానికపు అధికారుల మధ్య; మరియు

(b) పన్ను విధింపు వసూలు లేక విభజనకు సంబంధించిన విషయములలో పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తు లేక పంచాయతీలు మరియు రైల్వే పరిపాలనల మధ్య క్రమపరచుటకు చేయును.

కాని కేంద్ర ప్రభుత్వము ఏకీభవించుటతో ఆ నిబంధనలు చేసిన తప్ప, రాజ్యాంగ చట్టము 366 వ ఆర్టికల్ యొక్క (20) వ క్లాజులో వర్ణింపబడిన ఏరైల్వే పరిపాలనకు సంబంధించినట్లుగా లేక కంటోన్‌మెంటు అధికారి ఒక పక్షముగా యున్న ఏ వివాదముకు సంబంధించినట్లుగా తగాయిదాల తీర్పుకు సంబంధించిన నిబంధనలు అమలు జరుగవు.

## ఆస్తి బదలాయింపుల మీద డ్యూటీ

110 (ఏ) ఆస్తి బదలాయింపులమీద డ్యూటీ విధించు పద్ధతి :

ఆస్తి బదిలాయింపులమీద సుంకము ఈ క్రింది విధముగా విధింపబడును—

(ఎ) 1899 వ కేంద్ర చట్టము II ఒక జిల్లాలో పంచాయతీ కాని స్థలములో ఉన్న స్థిరాస్తికి సంబంధించిన, ఈ క్రింద నిర్దిష్టమైన వర్ణనగల ప్రతి పత్రముమీద ఆంధ్రప్రదేశ్ రాష్ట్రముయొక్క రాష్ట్రపు ఆంధ్ర ప్రాంతములో ప్రస్తుతమమలులోయున్న 1899 వ ఇండియన్ స్టాంపుచట్టము విధించిన సుంకము మీద సర్‌చార్జీ ఫారములో, మరియు

(బి) అట్టి పత్రముస ఎదురుగా ఈ క్రింద నిర్దిష్టమయిన మొత్తము మీద నూటికి అయిదుపాళ్ళు దాటకుండగా రాష్ట్ర ప్రభుత్వముచే నిర్ణయింప బడిన రేటున :—

| పత్రము వర్ణన | సుంకము విధించవలసిన మొత్తము |
|---|---|
| (*i*) స్థిరాస్తి అమ్మకము | పత్రములోఉదహరింపబడిన అమ్మకమునకు ప్రతిఫలము మొత్తము లేక విలువ. |
| (*ii*) స్థిరాస్తి వినిమయము | పత్రములో ఉదహరింపబడిన ఎక్కువ విలువగల ఆస్తియొక్క విలువ. |
| (*iii*) స్థిరాస్తి దానము | పత్రములో ఉదహరింపబడిన ఆస్తియొక్క విలువ. |
| (*iv*) స్థిరాస్తి స్వాధీన తనఖా | పత్రములో ఉదహరించిన, తనఖా వల్ల భద్రపడిన మొత్తము. |
| (*v*) స్థిరాస్తి శాశ్వతకౌలు | పత్రములో ఉదహరించిన ప్రకారము మొదటి యాబది సంవత్సరముల కౌలు చెల్లించవలసిన లేక యివ్వవలసిన అద్దెలు విలువ లేక పూరా మొత్తములో ఆరవ వంతుకు సమానమగు ఒక మొత్తము. |

110.(బి) బదలాయింపు సుంకము ప్రవేశపెట్టినప్పటి నుండి అనువర్తించు నిబంధనలు బదలాయింపు సుంకము ప్రవేశ పెట్టిన మీదట—

(ఎ) ఒక జిల్లాలో పంచాయితీకాని ప్రదేశములో మరియు అట్టి ప్రదేశమునకు బయటవున్న ఆస్తి విషయములో ప్రత్యేకముగా యివ్వవలసిన వివర

ములు నిర్దిష్టముగా దానికి కావలయు ననునట్లుగా, ఇండియన్ స్టాంపు చట్టము యొక్క 27 వ సెక్షనును చదవవలయును;

(బి) ఆ యా పంచాయతీ సమితి మరియు ప్రభుత్వమును అది సూచించు నట్లుగా, అదే చట్టపు 64 వ సెక్షనును చదవవలయును.

110. (సి) బదలాయింపు సుంకమును విధించుటకు, వసూలు చేయుటకు నిబంధనలను చేయుట కధికారము :

ఈ చట్టమునకు విరుద్ధము కాకుండ రాష్ట్రప్రభుత్వము, సుంకము వసూలు, ఆ యా పంచాయతీ సమితిలకు దానిని చెల్లించుట, దానిని వసూలు చేయుటలో ప్రభుత్వములోనైన ఖర్చుల మినహాయింపులను క్రమపరచుటకు నిబంధనలను చేయవచ్చును.

## మినహాయింపు విడిచి పెట్టుట

111. పన్నుల నుండి మినహాయించుటకు అధికారము :

ఒక పన్ను చెల్లించుట నుండి పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్, వ్యక్తినిగాని లేక వ్యక్తుల తరగతినిగాని పూర్తిగాగాని కొంతగాగాని మినహాయించవచ్చును. కాని అతడు పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ యొక్క సభ్యుడు అను కేవలము ఆ కారణమువల్ల, ఈ సెక్షనులోని దేదియు ఆ వ్యక్తికి మినహాయింపు యిచ్చుటకు అధికారము యిచ్చునట్లుగా భావించ కూడదు.

111. (ఏ) వసూలుకానగు పన్నులు మొదలైన వాటిని రాయితీ చేయుటకు అధికారము :

నియమింపబడు నిబంధనలకు, అధికారమునకు లోనై ఒక పంచాయతీ సమితి లేక జిల్లాపరిషత్ ఏ పన్ను, రుసుము, దానికి రావలసిన యితర మొత్తము, కాంట్రాక్టు క్రిందగాని లేక యితరముగాగాని లేక ఆ విషయములో చెల్లింపదగు ఏ మొత్తము, దాని అభిప్రాయములో, అట్టి పన్ను, రుసుము మొత్తము వసూలు చేయుటకు వీలులేనిదయిన యెడల రాయితీ చేయును.

## 7 వ అధ్యాయము.

## ఆర్థికమునకు సంబంధించిన సాధారణ నిబంధనలు

112. పంచాయతీ సమితి నిధులు అనువర్తించవలసిన కార్యములు :

(1) నివసించువారి క్షేమము, ఆరోగ్యము, సదుపాయము లేక విద్య-వీటికి కావలసిన లేక దోహదపడు ప్రతిదిని, లేక ఆ యా స్థానిక ప్రదేశ

మునకు సదుపాయములు మరియు పరిపాలనకు ఆవశ్యకమైనది ప్రతిదిని ఈ చట్టము క్రింద తీసికొనిన ధనములకు సాధారణముగా అనువర్తించు కార్యములయి యున్నవి. ప్రత్యేకముగా అవి ఈ క్రిందివయి యున్నవి.

(ఎ) పంచాయతీ సమితి విషయములో—

(i) జిల్లాల మధ్య ముఖ్యమయిన నదిని దాటించు స్థలములు తప్ప, రోడ్డు వంతెనలు మరియు యితర రాకపోకల స్థలముల నిర్మాణము, మరమ్మతు' నిర్వహణ.

(ii) రాజవీథుల ప్రక్కలలోను యితర బహిరంగ స్థలములలోను చెట్లను నాటుట, పంచాయతీ సమితిచేత నాటబడిన లేక దానికి చెందిన చెట్లను జాగ్రత్త పరచుట.

(iii) ఆసుపత్రులు, ఔషధశాలలు, సత్రములు సంతలు (క్లాజు (బి) లో, చెప్పబడినవి కాక), అంగడులు, స్తంభముయొక్క చదరమైన అడుగు భాగములు, దుకాణములు, కసాయి యిళ్ళు, బండ్లు నిలుచు స్థలములు, జలదారులు, మురికినీటి కాలువలు, పాయిఖానాలు, నీటిపనులు, చెరువులు, నూతులయొక్క నిర్మాణము, నిర్వహణ, అట్టి భవనములు లేక పనులు నిర్మింపబడిన ఉద్దేశములకు సంబంధించిన అన్ని ఖర్చులను చెల్లించుట, కలరా ఇంజక్షనులు యిచ్చు వారికి తర్ఫీదు, ఉద్యోగమునకు నియమించుట, పట్టణముల గ్రామముల ఆరోగ్యమునకై అవలంభించు పద్ధతులు, జనాభా క్రిక్కిరిసి యుండుటను తగ్గించుట, ఇండ్ల స్థలముల ఏర్పాటు, వీధులను, జలదారులను, మురికినీటి కాలువలను, పాయిఖానాలను, చెరువులను, నూతులను శుభ్రపరచుట మరియు యీ మాదిరి యితరపనులు;

(iv) ఆరోగ్యము, క్షేమ సమాజము లేక బీదల బాధ నివృత్తి కొరకు ఏర్పడిన సంస్థ నిధులయొక్క విరాళముల చెల్లింపు లేక జబ్బును, అంగ వైకల్యమును బాగుచేయుట లేక జబ్బుగల బలహీనమైన వ్యక్తులను తీసికొనుట,

(v) ప్రాథమిక విద్యను వ్యాపింప జేయుట, దీనికొరకు ప్రాథమిక పాఠశాలలకు, (ప్రాథమికోన్నత పాఠశాలలకు మరియు చిన్నతరగతి స్థానిక పాఠశాలలకు, బడియిండ్ల యొక్క నిర్మాణము, మరమ్మతు, అట్టి పాఠశాలల స్థాపన, నిర్వహణ, అట్టి పాఠశాలల తనిఖీ, గ్రంథాలయములు, చదువు గదులయొక్క స్థాపన, నిర్వహణ;

(*vi*) పంచాయతీ సమితి న్యాయప్రకారము చేసిన అప్పులమీద చెల్లించవలసిన మొత్తములయొక్క చెల్లింపు,

(*vii*) కోర్టుయొక్క డిక్రీ క్రింద చెలించవలసిన మొత్తములను పంచాయతీ సమితి మంజూరు చేసిన ముదరాల చెల్లింపు,

(*vii*) జనముయొక్క క్షేమము, ఆరోగ్యము, సుఖము, లేక వీలును కలుగజేయు స్థానిక జనబాహుళ్యమున కుపయోగమగు యితర పనులు, (వ్యవసాయము, పరిశ్రమలు లేక వ్యాపార సంస్థలతో సహా)

(a) జిల్లా పరిషత్తు విషయములో—

(*i*) జిల్లాలమధ్య ముఖ్యమగు నదిని దాటించు స్థలముల నిర్వహణ,

(*ii*) ఆయుర్వేద ఔషధ శాలలు, బీదల యిళ్ళు, ఒక బ్లాకును మించి విస్తరించిన ఆస్తులు, ధర్మాదాయములుగల అనాథ శిశురక్షణ శాలలు, సత్రములు. జిల్లాలో ప్రాముఖ్యముగల సంతల నిర్మాణము, నిర్వహణ, అట్టి భవనములు, పనులు నిర్మింపబడిన ఉద్దేశములతో సంబంధమున్న ఖర్చులన్నిటి చెల్లింపు.

(*ii*) సెకండరీ విద్యవ్యాప్తి. ఈ ఉద్దేశముతో ఉన్నత పాఠశాలలకు, మధ్య తరగతి పాఠశాలలకు, పెద్దతరగతి స్థానిక పాఠశాలలకు బడియిండ్లు నిర్మాణము, మరమ్మతు, అట్టి పాఠశాలలను స్థాపన నిర్వహణ, అట్టి పాఠశాలల తనిఖీ,

(*iv*) జిల్లా పరిషత్‌లో పనిచేయు ఉద్యోగులకు జీతములు, సెలవలు భత్యములు, పెన్షనులు, గ్రాడ్యుటీలు, కనికరపు భత్యములు చెల్లించుట,

(*v*) జిల్లాపరిషత్ న్యాయప్రకారము చేసిన అప్పులమీద చెల్లించ వలసిన మొత్తములయొక్క చెల్లింపు,

(*vi*) న్యాయస్థానము యొక్క డిక్రీ క్రింద చెల్లింపవలసిన మొత్తములను జిల్లాపరిషత్ మంజూరు చేసిన ముదరాలను చెల్లింపు:

"కాని రాష్ట్రప్రభుత్వము సాధారణ లేక ప్రత్యేక మంజూరుతో తప్ప, ఈ సబ్ సెక్షనులోని దేదియు పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ దాని ధనములను కేవలము పంచాయతీ జూరిస్ డిక్షనులోని ఏపనికిగాని పంచాయతీ స్థలములో ఖర్చుపెట్టుటకు వీలును కలుగజేసిన దానిగా పరిగణింపబడ కూడదు.

(2) పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ నిధులు. షెడ్యూలు 6 లోని నిబంధనలు, ఇంకను నియమితమగు నిబంధనకులోనై జిల్లాలో (1) వ సబ్ సెక్షనులో చెప్పబడిన కార్యములకు అనువర్తించును. వ్యయముకు ఈ చట్టము

అధికార మిచ్చినను లేక రాష్ట్ర ప్రభుత్వముచే ప్రత్యేకముగా మంజూరు కాబడి నప్పుడును, దాని జూరిస్‌డిక్షనుకు అవతల, అట్టిపనికి, పైని చెప్పిన రీతిగా బద్ధమై, అనువర్తించును.

113 మరియు 114 వదలబడినవి.

115. వివిధరకముల పంచాయతీ సమితి నిధులు లేక జిల్లాపరిషత్ నిధుల యొక్క రాబడి, ఖర్చులు :

పంచాయతీ సమితి నిధులు లేక జిల్లా పరిషత్ నిధులకు ఖర్చు వ్రాయ వలసన వ్యయములు, జమకట్టవలసిన రాబడులను గురించి ఆ నిధుల వినియోగ మును గురించి (Vవ) షెడ్యూలులో కూర్చిన నిబంధనలు యీ అనుబంధము యొక్క భాగముగా చదువవలయును.

116 నుండి 120 వదలబడినవి.

121. ఇతర స్థానిక అధికారులవల్ల వ్యయిమునకు పిరాళములు :

(1) ఈ చట్టము అనువర్తించు రాష్ట్రప్రభుత్వము లేక ఏ యితర పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ లే ఆంధ్రరాష్ట్రములో ఏ యితర స్థానికపు అధికారి, (Vవ) షెడ్యూలుచే లేక క్రింద నియమింపబడిన ఏ పనికిగాని లోనైన వ్యయము, బ్లాకులో లేక జిల్లాలో లేక వాటి ఏభాగములోని నివాసులకైనను లాభదాయకముగా యున్న యెడల, పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ రాష్ట్ర ప్రభుత్వపు అనుమతిలో, అట్టి వ్యయమునకు విరాళ మివ్వవచ్చును.

(2) రాష్ట్రప్రభుత్వము, ఆ వుత్తరువు అందిన ఒక నెల లోపుగా పంచాయతీ సమితికి జిల్లా పరిషత్‌కు (1)వ సబ్ శెక్షనులో తెలుపబడిన ఏ విరా ళము ఎందుకు యివ్వకూడదో కారణము తెలుపుమని ఉత్తర్వు చేయవచ్చును.

(3) పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ చెప్పబడిన కాలములో రాష్ట్రప్రభుత్వమునకు తృప్తిగా కారణము తెలుపలేక పోయిన యెడల, రాష్ట్రప్రభుత్వమువారు చెప్పు విరాళమును యివ్వమని ఉత్తర్వు చేయును. అది ఆవిధముగా చెల్లింపబడును.

121. (ఎ) రాష్ట్రప్రభుత్వము యిచ్చిన అప్పులు, అడ్వాన్సులువసూలు :

1914వ స్థానిక అధికారుల చట్టములో ఏదియున్నను, పంచాయతీ సమితి నిధి లేక జిల్లా పరిషత్ నిధి ఎవరి ఆధీనములో నుండునో అట్టి వానిని అట్టి నిధి మీద యున్న ఏ యితర రుణమునకు ముందుగా దానిని చెల్లించుటకు ఉత్తరువులు యిచ్చిన, రాష్ట్రప్రభుత్వము ముందు అనుమతితో జిల్లా కలెక్టరుచే చేయబడిన ఉత్తరువులవల్ల కాని లేక దావావల్లగాని, ఈ చటముక్రింద చెప్పబడిన

పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ నిధులకు అనువర్తించు ఏ కార్యమునకు పంచాయతీ లేక జిల్లా పరిషత్‌కు యివ్వబడిన ఏ అప్పుగాని లేక అడ్వాన్సుగాని రాష్ట్ర ప్రభుత్వము వసూలు చేయుటకు హక్కుగలదు.

## 4 వ భాగము

## 6–వ అధ్యాయము

## ప్రజారోగ్యము, ప్రజాక్షేమము, సదుపాయము

121 (బి) పంచాయతీ ప్రదేశములకు 137, 138 సెక్షనులు తప్ప, అధ్యాయములోని నిబంధనలు పంచాయతీ ప్రదేశములకు అనువర్తించకుండుట:

137, 138, 139 సెక్షనులు మినహాయించి ఈ అధ్యాయములోని నిబంధనలు, రాష్ట్రప్రభుత్వపు సాధారణ లేక ప్రత్యేక ఉత్తరువువల్ల వేరొక రీతిగా ఉత్తర్వు చేసిన తప్ప, ఏ పంచాయితీ ప్రదేశమునకు అనువర్తించవు.

## స్వంత, బహిరంగ చెరువులు లేక నూతులు

122. నూతులు మొదలైనవాటిని మూసివేయుట లేక శుభ్రపరచుట :

పంచాయతీ సమితి నిర్వహణాధికారి, ఏ స్వంత వాగు, కాలువ, చెరువు, నూయి లేక త్రాగుట కుపయోగించు యితర నీటి స్థలముల యజమాని లేక వాటిమీద అధికారముగల వ్యక్తిని, వాటిని శుభ్రపరచి, మంచి మరమ్మతులో వుంచవలచినదిగాను, వాటికి పిట్టగోడలు ఏర్పాటు చేయవలసినదిగాను, అతడు యుక్తమని తలచిన రీతిని పైనుండి వచ్చిపడు మురికినీటివల్ల పాడుకాకుండ అట్టి ఏ నూతిని కాపాడవలసినదిగాను, లేక అట్టి నిర్వహణాధికారి తృప్తి పడినవరకు పై చెప్పబడిన నీరు త్రాగుటకు ఉపయోగమని రుజువు పడిన యెడల, అట్టి నీటిని ఆవిధముగా అతడు ఉపయోగించకుండునటులను లేక యితరులకు ఆవిధముగా ఉపయోగించకుండు నటులనుకోరును; అట్టి నోటీసు యిచ్చిన తరువాత, అట్టి నూతి, చెరువు లేక రిజర్వాయరు నీరు త్రాగుటకు ఏ వ్యక్తివలనైన ఉపయోగింపబడిన యెడల, నిర్వహణాధికారి, వాటి యజమానిని లేక వాటిమీద అధికారముగల వ్యక్తిని, అట్టినూయి, చెరువు లేక రిజర్వాయరును తాత్కాలికముగా లేక శాశ్వతముగా మూసివేయమని లేక ఆ నీరు ఉపయోగపడకుండు నటుల అతడు జెప్పిన రీతిని అట్టి నూయి, చెరువు లేక రిజర్వాయరుకు చుట్టూ ఏర్పాటు లేక కంచె వేయవలసినదిగాను కోరును.

కాని జనబాహుళ్యము లేక జనబాహుళ్యములో ఒక భాగము హక్కుగా త్రాగుట కుపయోగించు నీరు కలిగియున్న స్వంత వాగులు, కాలువలు, చెరువులు, నూతులు లేక ఈ శెక్షనులో చెప్పబడిన యితర స్థలముల విషయములో అట్టి నూయి, చెరువు లేక రిజర్వాయరును మూసివేయుట లేక కంచె వేయుటలో తగులుబాటయిన ఖర్చులు పంచాయతీ సమితి నిధినుండి పంచాయతీ సమితిచే చెల్లింపబడును.

128. ప్రజారోగ్యమునకు ఉపద్రవము హాని కలిగించు గుంటలు మొదలైన వాటిని పూడ్చుట:

(i) పంచాయతీ సమితి నిర్వహణాధికారి ఉద్దేశములో,

(a) ఏ చెరువు, నూయి, గుంట, జలాశయము, కందకము, బురదనేల, చిత్తడినేల, రాళ్ళగని రంధ్రము, మురికినీటి కాలువ, మురికినీటి గుంట, గొయ్యి, నీటి ప్రవాహము లేక ఏ నీటి కూడిక; లేక

(b) ఏ భూమి నీరుచేరి, చుట్టుప్రక్కల వారి ఆరోగ్యమునకు ప్రమాదము లేక ప్రమాదకరమగునని లేక హానికరమగునని రుజువు పడునపుడు, లేక దోమలు పెరుగు స్థలముగా మారుటవల్ల దుర్భరముగా వున్నట్లయిన లేక యితరముగా వున్నట్లయిన, అతడు నోటీసుద్వారా యజమానిని లేక వాటిమీద అధనముగల యితర వ్యక్తిని కంచెవేయమని, బాగుచేయమని పూడ్చమని, కప్పమని, శుభ్రము చేయమని, నోటీసులో చెప్పినరీతి, చెప్పిన పరికరములతోను ఖాళీచెయ్యమని లేక నోటీసులో చెప్పిన రీతిగా దానితో అట్టి ఉత్తరువును తీసికొనమని కోరును.

(2) అట్టి నోటీసు అందజేసిన ఏ వ్యక్తి, దానిని నిర్వర్తించుటకు యిచ్చిన కాలములో నిర్వహణాధికారికి అట్టి కోరికకు వ్రాతపూర్వకమైన ఆక్షేపణలు యిచ్చినచో, నిర్వహణాధికారి పంచాయతీ సమితికి అట్టి ఆక్షేపణల మీద రిపోర్టు చేయును, పంచాయతీ సమితి అనుమతి లేనిదే; అట్టి కోరికను నిర్వర్తించనందుకు, అతడు ఏ వ్యాజ్యము నడపించడు. పంచాయతీ సమితి తీర్పు అట్లుండగా నిర్వహణాధికారి అతని ఉద్దేశము జరూరు ప్రాముఖ్యముగల పనులను, జనమునకు వెంటనే కలుగు అపాయము లేక ప్రజారోగ్యమునకు హానిని ఆపుటకు, నిర్వర్తించును. పంచాయతీ సమితి ప్రతి విషయములోను, నిర్వర్తించిన పనికయిన ఖర్చు యజమాని లేక పంచాయతీ సమితి చెల్లించ వలయునా లేక దానిని పంచుకొన వలయునా, అయినట్లయిన ఏ భాగములో పంచుకొన వలయునో నిర్ణయించును.

124. కొన్ని పనులకు బహిరంగ చెరువులు మొదలైన వాటిని విడిగా నుంచుట :

(1) (a) ప్రజారోగ్యము కొరకు జంతువులను, గుడ్డలను లేక యితర వస్తువులను కడుగుట లేక బహిరంగ ఊట చెరువు లేక నుయ్యి లేక ఏ బహిరంగ నీటి స్థలము లేక దాని భాగములోగాని చేపలు పట్టుటను పంచాయతీ సమితి క్రమపరచుట లేక నిషేధించుట చేయును. అది, త్రాగుటకు లేక స్నానము చేయుటకు లేక జంతువులను, గుడ్డలను కడుగుట కొరకు లేక ఏ యితర నిర్దిష్టమయిన పనికొరకు అట్టి ఏ స్థలమునైనను విడిగానుంచును.

(b) క్లాజు (a) యిచ్చిన అధికారములు, స్వంత ఊట, చెరువు, నుయ్యి లేక నీటి ప్రవాహము విషయములో, పంచాయతీ సమితిచే అట్టి స్థలముయొక్క యజమాని అనుమతితో చలాయించబడును.

(c) ప్రజారోగ్యము కొరకై, జంతువులను, బట్టలను, యితర వస్తువులను జనబాహుళ్యము త్రాగుటకు నీటిని తీసుకొనుటకు హక్కుగల ఏ స్వంత ఊట, చెరువు, నుయ్యి లేక నీటి ప్రవాహములో కడుగుటను క్రమపరచుట లేక నిషేధించుట చేయును.

(2) పంచాయతీ సమితి అధ్యక్షుడు, జనబాహుళ్యమునకు వీలుగ నుయ్యి చెరువు లేక యితర నీటి సరఫరా స్థలములోని నీరు, ప్రమాదము కలుగజేయును లేక ప్రమాదకరమైన జబ్బును వ్యాపింపజేయునని పంచాయతీ సమితిలో లేక ప్రభుత్వోద్యోగములో ఉన్న మెడికల్ ఆఫీసరు యిచ్చిన సర్టిఫికేటు అందిన తర్వాత, ఒక బహిరంగ నోటీసు ద్వారా అట్టి నీటిని నిషేధించును. అట్టి నిషేధము ఎన్ని దినములుండునో తెలియజేయుచు నీటి సరఫరా స్థలముకు దగ్గరగా ప్రకటన ఉంచిగాని లేక టాంటాం వల్లగాని, అట్టి నోటీసు అందజేయబడును. వేరే యింకొక సర్టిఫికేటు యివ్వకుండగనే నిర్వాహాధికారి నోటీసును పొడిగించ వచ్చును లేక మార్పు చేయవచ్చును.

125. ప్రకటింపబడిన కార్యములకు తప్ప ఆ విధముగా విడిగా యుంచిన స్థలముల ఉపయోగము నిషేధము :

(a) ఏ వ్యక్తియు పంచాయతీ సమితివల్ల లేక స్వంత ఆస్తి అయిన ఎడల, దాని యజమానిచేత త్రాగుటకు, వంటకు విడిగా నుంచ బడిన ఏ స్థలములో నీటిలో స్నానము చేయకూడదు, మాలిన్యముచేయ కూడదు; లేక

(b) త్రాగుటకు పై విధముగా యుంచబడిన ఏ స్థలముయొక్క నది గర్భములో హాని కరమైన లేక అనారోగ్యకరమైన పదార్థమును ఉంచుట, లేక

(c) త్రాగుటకు లేక స్నానముచేయుటకు పై చెప్పినరీతిగా విడిగా ఉంచిన ఏ స్థలములో బట్టలను ఉతుకుట; లేక

(d) త్రాగుటకు లేక స్నానము చేయుటకు లేక బట్టలు ఉతుకుటకు పై చెప్పిన రీతిగా విడిగా ఉంచబడిన ఏ స్థలములో ఏ జంతువును లేక ఏ వంట పాత్రను లేక ఊట, చర్మములు, లేక యితర చెడు లేక హానికరమైన పదార్థము కడుగుటకు లేక ఏ హానికరమైన లేక అనారోగ్యమైన పదార్థము ఉంచుట; లేక

(e) త్రాగుటకు, లేక స్నానము చేయుటకు, బట్టలు ఉతుకుటకు పై చెప్పిన రీతిగా విడిగా ఉంచబడిన ఏ స్థలములోనికి మురికి నీళ్ళ నలు చదరపు గుంట, మురికి నీళ్ళ కాలువ, తూము, ఇంజను లేక బాయిలరు లేక అతనికి చెందు ఏ యితర హానికరమైన పదార్థమునుండి నీటిని వదలుట లేక అతనికి చెంది యుండు లేక అతనిచే ఆక్రమింపబడిన ఏ భవనము లేక భూమినుండి వాటిని ప్రవహింప జేయుట.

126. పంచాయతీ సమితులచే నూతులు, చెరువులు మొదలైనవి నిర్వహణ :

ప్రతి పంచాయతీ సమితి;

(i) స్వత ఆస్తికాని నూతులు, చెరువులు, రిజర్వాయర్లు అన్నిటిని శుభ్రమైన స్థితిలో ఉంచి, ఆ విధముగా అవసరమని తోచిన యెడల వాటిని నింపి వేయుట లేక ఖాళీచేయుట; మరియు

(ii) స్వంత ఆస్తికాని, రాష్ట్ర ప్రభుత్నపు ఏ ఉత్తరువుచే ప్రత్యేకముగా వదలబడని నీటి పారుదల పనులు అయిన లేక వాటికి సంబంధించిన నీటి మార్గములుకాని అన్ని నీటి మార్గములమీద అధికారము కలిగియుండి, ప్రజల ఉపయోగమునకై వాటిని నిర్వహణ, మరమ్మతు, బాగుచేయుటకు అవసరమైన అన్ని పనులను చేయవచ్చును; కాని వాటిమీద ఎటువంటి పన్నులు విధించుటకు హక్కు కలిగియుండదు.

126 (A) అందరి వ్యక్తులకు తెరవబడిన బహిరంగ నూతులు మొదలైనవి :

పంచాయతీ సమితిచే నిర్వహింపబడినపుడు 126వ సెక్షనులో సూచించిన అన్ని నూతులు, చెరువులు, రిజర్వాయర్లు నీటి మార్గములు ఏ జాతికి, మత

ముకు చెందిన వ్యక్తులచేతను ఉపయోగింపబడుటకు, అనుభవింపబడుటకు అవి తెరవబడి యుండును.

## ఊడ్చుట

**127. స్వంత పాయిఖానాలు మొదలైనవాటిని శుభ్రము చేయుట :**

ఒక పంచాయతీ సమితియొక్క నిర్వహణాధికారి, ఒక స్థలముయొక్క యజమాని లేక ఆక్రమణదారుతో అట్టి స్థలమునుండి లేక దానికిచెందిన అట్టి స్థలము నుండి, నిర్వహణాధికారికి వీలైనవని తీసివేయుటకు, తోచుకాలములు, కాల పరిమాణములు, యితర విషయముల షరతులమీద, పంచాయతీ సమితి తయారు చేయు నౌకరీ విలువ కలసివచ్చునట్లుగా లెక్కచూచిన అట్టి రేటుపైన సుంకము చెల్లించిన మీదట, చెత్త లేక మురికి, లేక ఏ రకమైన చెత్త లేక మురికితీసి వేయుటకు ఒడంబడిక చేయును.

**128. తీర్థ యాత్రా స్థలములు మొదలైన వాటిమీద అధికారముకల వ్యక్తులనుండి విరాళములు :**

ఒక మసీదు, గుడి, మఠము లేక మత సంబంధమయిన ప్రార్థనచేయు లేక ఉపదేశముపొందు ఏ యితర స్థలము లేక సంతలు ఉత్సవములు లేక అటు వంటి యితర కార్యములు జరుపుటకుపయోగించు ఏ స్థలము, బ్లాకు హద్దులలోను లేక దాని చుట్టుప్రక్కల స్థలములో ఉండి, సంవత్సరమంతను లేక ప్రత్యేక సందర్భములలో చాలమంది వ్యక్తులను ఆకర్షించినచో, ప్రజారోగ్యమునకు, క్షేమ ముకు లేక వీలుకు కావలసిన, శాశ్వతపు లేక తాత్కాలికపు, ఏ ప్రత్యేకపు ఏర్పాట్లు పంచాయతీ సమితిచే చేయబడును. పంచాయతీ సమితి, ట్రస్టీ లేక అట్టి స్థలముపై అధికారముగల యితర వ్యక్తిని రాష్ట్ర ప్రభుత్వము నిర్ణయించు దాని నిధులకు తిరిగివచ్చు లేక తిరిగిరాని విరాళము యివ్వవలసినదిగా కోరును.

**129. మురికి బయటకు పోవుట ఒప్పుకొనుటను నిషేధింపు :**

ఏ యజమాని లేక ఒక స్థలముయొక్క ఆక్రమణదారు, నలుచదరపు గుంట, మురికినీటి కాలువ, పాయిఖానా లేక గుఱ్ఱపుశాలలోని నీరు లేక ఏ యితర మైన మురికిని అట్టి స్థలములో నుండి బయటికి, మురికినీటి కాలవలోని లేక మురికి గుంటలోనికి తప్ప, పంచాయతీ సమితిలో చేర్చిన రాజవీధి ఏ భాగము లోనికి లేక అట్టి రాజవీధి భాగముగా ఏర్పడిన మురికి నీటి కాలవ పక్క స్థలములోని గోడలలోనికి అట్టి యొక్క నీటిమురికి యింకుటవల్ల ఉపద్రవము కలుగునట్లుగా అట్టి స్థలములో నుండి ప్రవహించుటకు వప్పుకొనన కూడదు.

## నీరు నిలువ కుండునట్లుగా స్వంత ఏర్పాట్లు

129 (A) స్వంత మురికి కాలువల నిర్మాణము లేక తీసివేయుటను కోరుటకు అధికారము:

ఒక పంచాయతీ సమితి నోటీసుద్వారా ఒక భవనము యొక్క యజమాని లేక ఆక్రమణదారును దానికి స్వంత మురికినీటి కాలవలు నిర్మింపమనుట లేక దాని స్వంత మురికి కాలువలు మార్పుచేయమని లేక తీసివేయుట కోరవచ్చును.

## ప్రమాదకరమైన జబ్బులు

130. ప్రమాదకరమైన జబ్బుకు నిర్వచనము:

ప్రమాదకరమైన జబ్బు అనగా (vi) షెడ్యూలులో నిర్దిష్టమైన ఒక జబ్బు అని అర్థము.

131. అనుమానమున్న స్థలములలోనికి చొచ్చుటకు అధికారము. భవనము వస్తువులను శుభ్రము చేయుట:

(1) పంచాయతీ సమితియొక్క నిర్వహణాధికారి, పగలు లేక రాత్రి ఏ కాలములోనైనను నోటీసు లేకుండగా లేక అతనికి సబబుగానుండునని తోచు నోటీసు యిచ్చిన తరువాత, ప్రమాదమైన జబ్బు ప్రబలముగానున్న లేక అట్లు ఉండుటకు అనుమానముగా ఉన్న స్థలమును తనిఖీచేసి, ఆ ప్రదేశము దాటి ఆ జబ్బు విస్తరించుకుండునటుల అతనికి యుక్తమని తోచిన జాగ్రత్తలు తీసికొనవచ్చును.

(2) ఒక స్థలము లేక దాని భాగము లేక జబ్బు అంటుకొన్నదనుకొను దానిలోని ఏవస్తువును శుభ్రము లేక, అంటుకొన్న జబ్బు నిర్మూలనము చేయుట, ప్రమాదకరమైన జబ్బు యొక్క వ్యాప్తిని ఆపును లేక అణచును అని నిర్వహణాధికారి తలచినచో అతడు అట్టి నోటీసు ద్వారా ఆక్రమణదారును, అట్టి నోటీసులో నిర్దిష్టమయిన పద్ధతిని, కాలములో, దానిని శుభ్రము చేయమని లేక రోగ నిర్మూలనము చేయమని కోరును.

(3) వెంటనే చర్య తీసికొనుట అవసరమని లేక ఆక్రమణదారు, పేదరికము చేత లేక యితరముగా గాని అతని ఉత్తరువు సార్థకముగా నెరవేర్చ లేకపోవు చున్నాడని, నిర్వహణాధికారి అనుకొనినచో, నిర్వహణాధికారి స్వయముగనే నోటీసు లేకుండగా అట్టి స్థలము లేక వస్తువును శుభ్రము లేక శుద్ధి చేయించును. మరియు ఈ పని నిర్వర్తించుటలో అటువంటి వస్తువును ఆ స్థలము నుండి తొలగింప జేయును. పేదతనమువల్ల అట్టి ఉత్తరువును అతడు సార్థకముగా నిర్వర్తించలేకపోవుట లేదని నిర్వణాధికారి ఉద్దేశపడిన విషయములలో, నిర్వహ

ణాధికారికి తగులుబాటు అయిన ఖర్చులు అట్టి ఆక్రమణదారునుండి వసూలు చేయబడును.

(4) (1) నుండి (3) వరకు యున్న సబ్ సెక్షనులచే నిర్వహణాధికారికి యివ్వబడ్డ అధికారములు, జిలా ఆరోగ్య అధికారి లేక అతనిచే నియమింప బడిన ఏ యితర అధికారిచేత చలాయించబడును.

132. కడుగుటకు, శుద్ధిచేయుటకు స్థలములు నిర్వాహణాధికారిచే ప్రకటన:

(1) ప్రమాదకరమైన జబ్బునుంచి అంటుదలకు తెరచి యుండు, తీసికొని పోవు బరడ్లు, బట్టలు, పరుపులు లేక యితర సామగ్రి ఏ స్థలములకు చేర్చవల యునో. లేక ఎచ్చట అవి కడుగ బడవలయునో, శుద్ధి చేయబడవలయునో లేక యితరముగా పరిష్కరింప బడవలయునో అట్టి స్థలమును పంచాయతీ సమితి నిర్వహణాధికారి ప్రకటన చేయవచ్చును.

(2) నిర్వహణాధికారి, అంటురోగము కలిగియుండునని తోచు పరుపులు, బట్టలు లేక యితర వస్తువులు తగులబడునట్లుగా ఉత్తర్వు చేసి . అడిగినప్పుడు తగులబడిన వస్తువులకు పరిహారమివ్వవచ్చును.

133. అంటు రోగముతో బాధపడు వ్యక్తి వృత్తి చేయుటలు నిషేధించుట:

ఏ వ్యక్తి అతడు ప్రమాదకరమైన జబ్బునుండి బాధ పడుచుండునట్లు అతనికి తెలిసినను లేక అతడు అట్లు అనుకొనుటకు కారణమున్నను, అతడు జబ్బును విస్తరించు ప్రమాదము లేకుండగా ఆ విధముగా చేసిన తప్ప, ఏ వృత్తిలో చేరకూడదు. ఏ పత్రకము వ్యాపారము చేయకూడదు.

134. ప్రమాదకరమైన జబ్బులనుండి బాధపడు వ్యక్తులు మరియు బహిరంగ వాహనములు:

ప్రమాదమైన జబ్బుతో బాధపడు ఏ వ్యక్తి, అట్టి జబ్బు వ్యాపించకుండ ఉండుటకు తగిన జాగ్రత్తలు తీసికొనిననే తప్ప ఒక బహిరంగ వాహనములో తీసికొని పోబడుట లేక అతనంతట అతడు ప్రయాణము చేయుటకు ఒప్పుకొన కూడదు.

(2) ఆవిధముగా బాధపడుచున్నట్లు అట్టి వాహనము యజమాని లేక డ్రయివరు లేక దానిమీద ఆధీనముగల వ్యక్తికి ముందుగా తెలియజేయకుండ, ప్రమాదకరమైన జబ్బుతో బాధపడు ఏవ్యక్తి ఒక బహిరంగ వాహనము ఎక్కకూడదు.

(3) [1]వ సబ్ సెక్షనుకు వ్యతిరేకముగాపైన చెప్పిన రీతిని బాధపడు ఏవ్యక్తిని, బహిరంగ వాహనముయొక్క ఏ యజమాని, డ్రయివరు లేక దాని ఆధీనముగల ఏవ్యక్తి అతనికి ఆవిధముగా తెలిసినప్పుడు అట్టి వాహనములో తీసికొని పోకూడదు లేక అట్లు తీసికొని పోబడుటకు అధికార మివ్వకూడదు.

(4) బహిరంగ వాహనమునకు సంబందించిన ప్రస్తుతము అమలులో యున్న ఏ చట్టములో నేది వ్యతిరేకముగా యున్నప్పటికి, ఏ యజమాని లేక డ్రయివరు లేక బహిరంగ వాహనము ఆధీనములోయున్న ఏ వ్యక్తి పై చెప్పిన విధముగా బాధపడుచున్న ఏ వ్యక్తిని, అట్టి వ్యక్తి, అట్టి వాహనమును శుద్ధిచేయుటలో తగులుబాటు కాగల ఖర్చులు, నష్టము భర్తీచేయుటకు సరిపడు మొత్తమును చెల్లించినను లేక యిచ్చినను తప్ప, తీసికొని పోవుటకు బద్ధుడు కాడు.

(5) సబ్ సెక్షను [1] లేక సబ్ సెక్షను [2] ను అతిక్రమించు వ్యక్తిని నేరస్థాపనము ఒక న్యాయస్థాపము, ఈ చట్టములో ఏర్పాటు చేసిన నేరమునకు అపరాధమునకు అదనముగా, వాహనమును శుద్ధిచేయుటకు యజమానికి లేక డ్రయివరుకు తగులుబాటగు ఖర్చులు లేక నష్టము భర్తీచేయుటకు న్యాయస్థానము సరిపడునని అనుకొను అట్టి మొత్తమును అదనపు జరిమానాగా విధించును. ఆవిధముగా విధించిన ఏ అదనపు జరిమానా న్యాయస్థానముచే వాహనముయొక్క యజమాని లేక డ్రయివరుకు యిప్పింప బడును.

కాని అట్టి అదనపు జరిమానా అపీలుకు బద్ధమైయున్న విషయములో విధింపబడినచో, ఆపీలు దాఖలు చేయుటకు నియమితమైన కాలము దాటకుండగనే, లేక అపీలు దాఖలు చేసిన యెడల, అపీలు తీర్మానము కాకుండగనే, ఆమొత్తము యజమానికి లేక డ్రియివరుకు చెల్లింపబడదు.

(6) అదే విషయముకుచెందు తరువాత వేయబడిన ఏ సివిల్ దావాలో పరిహారము యిచ్చునపుడు, ఈ సెక్షనుక్రింద వాది తీసికొను ఏ మొత్తమునైనను, న్యాయస్థానము లెక్కలోనికి తీసికొనును.

135. బహిరంగ వినోద స్థలములను మూయమని ఉత్తరువు యిచ్చుటకు అధికారము :

బ్లాకులో ప్రమాదకరమైన రోగము ప్రబలమయిన విషయములో, పంచాయతీ సమితి నిర్వహణాధికారి నోటీసుద్వారా అతడు నిర్ణయించు కాలముకు బహిరంగ వినోద స్థలముకు ఉపయోగించు పాక లేక డేరా ఏ భవనమును, వాటి యజమానిని లేక ఆక్రమణ దారును మూసి వేయునట్లుగా కోరును.

136. ప్రమాదకరమైన జబ్బువల్ల స్వల్పముగా బాధపడుటవల్ల పాఠశాలకు వెళ్ళకుండుట :

ప్రమాదకరమైన రోగమునుండి బాధపడు లేక పడుతూన్న లేక దాని నుండి అంటు రోగమునకు తెరువబడియున్న మైనరు సంరక్షణ లేక అధీనము కలిగియున్న లేక తండ్రిగాయున్న ఏవ్యక్తి, పంచాయతీ సమితి నిర్వహణాధికారి నుండి లేక ఈ విషయములో అతనిచే క్రమముగా నియమింపబడిన ఏ వ్యక్తి నుండి ఆ మైనరు పాఠశాలకు లేక కళాశాలకు పంపబడకూడదు అను నోటీసు అందిన తరువాత, ఇతరులకు అట్టిరోగము వ్యాపింపజేయు ప్రమాదము లేకుండ అట్టి మైనరు వెళ్ళవచ్చునని అతని అభిప్రాయము అని ఒక సర్టిఫికెట్ నిర్వహణాధికారి నుండి లేక యితర వ్యక్తి నుండి లేక ఒక రిజిష్టర్డు మెడికల్ ప్రాక్టీషనరు నుండి పొందనిదే, అట్టి మైనరును పాఠశాలకు లేక కళాశాలకు పోవుటకు అనుజ్ఞ యివ్వకూడదు.

## మశూచికము

137. తప్పనిసరిగా టీకాలువేయించు కొనుట:

ఈ చట్టము అనువర్తించు స్థానిక ప్రదేశములో నియమితమైన మేరకు, అట్టి వ్యక్తుల విషయములో టీకాలు వేయుట తప్పనిసరిగా యుండును.

(2) నియమితమైన అధీనమునకు లోబడి, పంచాయతీ సమితి, దాని నిర్వహణాధికారి టీకాలు వేయుటఆచరించుటలో బాధ్యత వహించవలయును.

138. మశూచికమును తెలియజేయుటకు బాధ్యత :

ఒక నివసించు ఇంటియొక్క నివాసి మశూచికముచే బాధపడుచున్నపుడు, ఆ నివాసికి చెందు కుటుంబ యజమాని, అతడు చెప్పిన, ఆక్రమణదారు లేక అట్టి స్థలము అధీనములో ఉన్నవ్యక్తి బహుకొద్ది వీలగు ఆలస్యముతో ఆ విషయమును పంచాయతీ సమితి నిర్వహణాధికారికి లేక అయా గ్రామ పెద్దకు తెలియ జేయవలయును.

139. మశూచికమునకు టీకాలు వేసుకొనుట నిషేధింపు:

(1) మశూచికమునకు టీకాలు యిందు మూలముగా నిషేధింపబడినది.

(2) టీకాలు వేయించుకొనుట జరిగిన ఏ వ్యక్తి, టీకాలు వేయించుకొన్న తేదీనుండి నలభై రోజులు దాటకమునుపు, అట్టి వ్యక్తి తాకుడువలగాని దగ్గరకు వచ్చుటవల్లగాని అతడు ఏ మాత్రము మశూచికమును కలుగజేయడు అని అట్టి సర్టిఫికేటులు యిచ్చుటకు పంచాయతీ సమితిచే అనుజ్ఞ యివ్వబడ్డ తరగతి చెందిన మెడికల్ ప్రాక్టీషనరు నుండి ఒక సర్టిఫికేటు లేనిదే, అతడు యింతకు ముందు నివసించు గ్రామము లేక పట్టణమును వదలకూడదు.

## చనిపోయినవారిని పరిష్కరించుట

140. పాతిపెట్టు, కాల్చు స్థలముల రిజిస్ట్రేషన్:

(1) చనిపోయిన వారిని పాతిపెట్టుటకు, కాల్చుటకు లేక యితరముగా పరిష్కరించుటకు ఒక స్థలముగా ఈ చట్టము అమలులోనికి వచ్చు తేదీన ఉపయోగపడిన ఏ స్థలము యొక్క, ప్రతి యజమాని లేక ఆధీనముగల వ్యక్తి, అట్టి స్థలము యింతకు ముందే రిజిష్టరుకాని పక్షమున, పంచాయతీ సమితికి అట్టి స్థలము రిజిష్టరు చేయవలసినదిగా దరఖాస్తు చేయును.

(2) అట్టి స్థలమునకు యజమాని లేక ఆధీనముగల వ్యక్తి లేదని పంచాయతీ సమితికి కనపడినయెడల, పంచాయతీ సమితి, అట్టి స్థలమును, ఆధీనము చేసికొని, అట్టి స్థలమును రిజిష్టరు చేయుట లేక మూసివేయుట చేయును.

141. చనిపోయినవారిని పరిష్కరించుటకు స్థలములకు లైసెన్సు యిచ్చుట:

(1) దరఖాస్తుమీద పంచాయతీ సమితి నుండి ఒక లైసెన్సు పొందనిదే, చనిపోయినవారిని పరిష్కరించుటకు ఏ క్రొత్త స్థలము, స్వంతము లేక బహిరంగము, తెరుచుట, తయారు చేయుట, నిర్మింపబడుట లేక ఉపయోగింపబడుట జరుగ కూడదు.

(2) లైసెన్సు కొరకు అట్టి దరఖాస్తు, స్థలము, సరిహద్దు, దాని పరిమాణము, దానియందు శ్రద్ధయున్న యజమాని లేక వ్యక్తిలేక సంఘముయొక్క పేరు, యాజమాన్యపు పద్ధతి, పంచాయతీ సమితికి కావలసిన అట్టి యితర వివరములు తెలియజేయు రిజిష్టరు కావలసిన స్థలముయొక్క ప్లాను వెంబడి యుండవలెను.

(3) ఎవరికి దరఖాస్తు పెట్టబడినదో ఆ పంచాయతీ సమితి,...

(a) లైసెన్సును యివ్వవచ్చును లేక నిరాకరించవచ్చును; లేక

(b) ఆ స్థలమునకు ఆక్షేపణలు తొలగింపబడువరకు లేక దానికి కావలసిన ఏ వివరములైనను యివ్వబడువరకు, లైసెన్సును యిచ్చుట నిలిపి యుంచును.

(4) (3)వ సబ్ సెక్షనుక్రింద పంచాయతీ సమితిచే యివ్వబడిన ఏ ఉత్తరువు నైనను, రాష్ట్ర ప్రభుత్వము రద్దు పరచుట లేక మార్పు చేయును.

142. పాతిపెట్టు, తగులబెట్టు స్థలము మరియు శ్మశానమునకు ఏర్పాటు:

పంచాయితీ సమితి నిధి ఖర్చుతో, పాతిపెట్టు లేక తగులబెట్టు స్థలములను లేక శ్మశానముగా ఉపయోగించవలసిన స్థలములను పంచాయతీ సమితి ఏర్పాటు చేయవచ్చును; సరియైన ఏర్పాటు లేకపోయినచో అట్లు చేయవలసియుండును. వాటిని ఉపయోగించినందుకు అద్దెను, పన్నును విధించును.

143. రిజిష్టరు అయిన, లైసెన్సు పొందిన లేక ఏర్పాటు చేయబడిన స్థలములకు ఒక పుస్తకము నుంచుట:

(1) 140 నుండి 142 సెక్షన్లక్రింద రిజిష్టరు అయిన, లైసెన్సు పొందిన లేక ఏర్పాటు చేయబడిన స్థలములకు ఒక పుస్తకము ప్రతి పంచాయతీ కార్యాలయములో ఉంచబడును. దానిలో రిజిష్టరు అయిన, లైసెన్సు పొందిన లేక ఈ చట్టము ప్రారంభమునకు ముందు ఏర్పాటు చేయబడిన అన్ని స్థలముల రికార్డు చేయబడును.

(2) అట్టి స్థలము పై చెప్పిన రీతిగా రిజిష్టరు అయినదని, లైసెన్సు పొందినదని లేక ఏర్పాటు చేయబడినదని నోటీసు, పై చెప్పిన పాతిపెట్టు స్థలము లేక కాల్చు స్థలము లేక యితర స్థలము ప్రవేశము వద్ద లేక దగ్గర ఒక ప్రాముఖ్య స్థలమునకు ఆంగ్లమున మరియు అధమము ఒక స్వభాషలోనైనను అతికించబడును.

144. నియమితముకాని స్థలములలో కాల్చుట లేక తగుల బెట్టుటను నిషేధింపు:

పై చెప్పిన రీతిగా రిజిష్టరయిన, లైసెన్సు పొందిన లేక ఏర్పాటు చేయబడిన స్థలముకాని నివాసస్థలము లేక త్రాగు నీటి సరఫరా స్థలమునకు 100 గజముల ఏ స్థలములో ఏ శవమును ఏ వ్యక్తి పాతిపెట్టుట, కాల్చుట లేక యితరముగా

పరిష్కారము చేయుట లేక పాతిపెట్టించుట, కాల్చుట లేక యితరముగా పరిష్కరింపబడునటుల చేయుట కూడదు.

కాని ఆ యా పంచాయతీ సమితియొక్క నిర్వహణాధికారి వ్రాత పూర్వకమైన అనుమతి లేకుండగా, ఈ సెక్షనులోని నిబంధనల నుల్లంఘించి నందులకు, ఏ వ్యాజ్యము వేయకూడదు.

145. పాతిపెట్టుట మొదలైన వాటిని గురించి పంచాయతీ సమితికి నోటీసు యిచ్చుట:

చనిపోయినవారిని పరిష్కరించుటకున్న స్థలము మీద ఆధీనముగల వ్యక్తి, ఆ యా పంచాయతీ సమితిచే నియమింపబడిన వ్యక్తికి. అట్టి స్థలము వద్ద ప్రతి శవము పాతిపెట్టుట, కాల్చుట లేక యితరముగా పరిష్కరించుట యొక్క సమాచారము యిచ్చును.

146. ఆరోగ్యమునకు ప్రమాదకరమైన లేక సమాధులలో నిండి యుండిన పాతిపెట్టు, కాల్చు స్థలముల ఉపయోగమును నిషేధించుట:

(1) (a) చనిపోయిన వారిని పరిష్కరించుటకు ఏ రిజిష్టరయిన లేక లైసెన్సు పొందిన స్థలము, దాని చుట్టు ప్రక్కల నివసించు జనముల ఆరోగ్యమునకు ప్రమాదకరమగు స్థితిలో లేక పరిస్థితిలో యున్నదని లేక వుండబోవు పరిస్థితి ఏర్పడిన దని, లేక

(b) ఏ పాతిపెట్టు స్థలము సమాధులతో క్రిక్కిరిసి యున్నదని, మరియు పై చెప్పబడిన బహిరంగముగా పాతిపెట్టు, లేక దహనము చేయు లేక యితర స్థలము విషయములో, చనిపోయిన వారిని పరిష్కరించుటకు క్రమముగా అధికారమివ్వబడిన యితర వీలైన స్థలమున్నదని లేక అట్టి స్థలమును మామూలుగా ఉపయోగించు వ్యక్తులకు ఏర్పాటు చేయబడినదని, పంచాయతీ సమితి తృప్తి పడినచో, అది ఒక నోటీసులో చెప్పబడు రెండు నెలలకు తక్కువకాకుండా వున్న కాలము గడచిన తరువాత, అట్టి స్థలము వద్ద ఏశవమును పాతిపెట్టుట, కాల్చుట లేక యితరముగా పరిష్కరించుట న్యాయ సమ్మతము కాదని తెలియజేయవచ్చును.

(2) (1) వ సబ్ సెక్షను క్రింద యిచ్చిన ప్రతి నోటీసు జిల్లా గెజిటు లోను అ యా స్థానికపు ప్రదేశములో టాంటాం వల్లను ప్రచురించబడును.

(3) ఏ వ్యక్తి, ఈ సెక్షను క్రింద ఏ నోటీసు అతిక్రమించి, అట్టి నోటీసులో తెలియ జేసిన కాలము అయిన తరువాత, అట్టి స్థలము వద్ద ఏ శవ

మును పాతుట తగుల బెట్టుట లేక యితరముగా పరిష్కరించుట లేక పాతి పెట్టించుట, కాల్పించుట లేక యితరముగా పరిష్కారము చేయించుట లేక అట్టి వాటికి అనుమతి యిచ్చుట చేయకూడదు.

(4) (1) వ సబ్ సెక్షను క్రింద పంచాయతీ సమితిచే జారీచేయబడిన ఏ నోటీసును, రాష్ట్ర ప్రభుత్వము రద్దు లేక మార్పు చేయవచ్చును.

## 9 వ అధ్యాయము

## ప్రమాదకరమైన కట్టడములు, చెట్లు, స్థలము

147. పమాదకరమైనకట్టడముల విషయములో జాగత్తలు:

జిల్లా పరిషత్తులో చేరిన రాజవీధికి ప్రక్కన ఏ కట్టడము పాడైన స్థితిలోను, బాటసారులకు ప్రమాదకరముగను యున్నదని దాని నిర్వహణాధికారికి తోచినచో, నిర్వహణాధికారి నోటీసు ద్వారా యజమానిని లేక ఆక్రమణదారుని దానివల్ల వచ్చు ప్రమాదము అపుటకు అట్టి కట్టడమునకు కంచెవేయుటకు దానిని క్రిందికి తీసివేయుటకు, భద్రపరచుట లేక మరమ్మతు చేయవలసినదిగా కోరును.

(2) వెంటనే చర్యతీసికొనవలసిన అవుసరమయిన యెడల, నిర్వహణాధికారి, అట్టి నోటీసు యివ్వకముందు లేక అట్టి నోటీసు కాలముదాటకమునుపే స్వయముగా అట్టి కట్టడముకు కంచె వేయుట, దానిని క్రిందికి తీసివేయుట, భద్రపరచుట లేక మరమ్మతు చేయుట లేక ఆ వీధి భాగమునకు కంచెవేయుట లేక ప్రమాదము నాపుటకు అతనికి యుక్తమని తోచినట్టి తాత్కాలికపు జాగ్రత్తలు తీసికొనుటయును, అట్లు చేయుటకయి ఖర్చు యిప్పటినుండి చెప్పిన రీతిని యజమాని నుంచి లేక ఆక్రమణదారునుండి వసూలు చేయబడును.

148. ప్రమాదకరమైన చెట్ల విషయములో జాగ్రత్తలు:

(1) పంచాయతీ సమితిలో చేరిన రాజవీధి నానుకొనియున్న భూమిమీద నిలబడి యున్న చెటుయొక్క ఏ కొమ్మ లేక ఏ చెట్టు పడిపోవునని, దానివల్ల అట్టి వీధిని వుపయోగించు ఏ వ్యక్తికి, దాని మీదనున్న ఏ కట్టడమునకు ప్రమాదము సంభవించునని దాని నిర్వహణాధికారికి తోచిన యెడల, నిర్వహణాధికారి నోటీసుద్వారా, దానివల్ల వచ్చు ప్రమాదము నాపుటకు అట్టి చెట్టును భద్రపరచమని, కొమ్మలు తెగ గొట్టుమని లేక దానిని నరకి వేయమని అట్టి చెట్టుయొక్క యజమానిని కోరును.

(2) వెంటనే చర్యతీసికొనవలసి వచ్చినచో, నిర్వహణాధికారి, అట్టి నోటీసు యివ్వక మునుపు లేక అట్టి నోటీసులోని గడువు దాటకమునుపు స్వయముగా అట్టి చెట్టును భద్రపరచుట, కొమ్మలు తెగగొట్టుట లేక నరికివేయుటను లేక రాజవీధి ఒక భాగమును కంచె వేయుట లేక ప్రమాదము నాపుటకు అతని యుక్తమని తోచినట్టి యితర తాత్కాలికపు జాగ్రత్తలను తీసికొనుట చేయును. అట్లు చేయుటకు అయిన ఖర్చు ఇప్పటినుండి తెల్పిన పద్ధతిని చెట్టుయొక్క యజమానినుండి వసూలు చేయబడును.

149. భవనములు లేక భూములకు కంచెవేయుట, చెట్లను, కంచెలను సరిచేయుట :

ఒక రాజవీధికి చేరియున్న, పంచాయతీ సమితి యొక్క నిర్వహణాధికారి, నోటీసుద్వారా, అట్టి వీధికి దగ్గరగానున్న భవనము లేక భూమియొక్క యజమాని లేక ఆక్రమణదారును ఈ క్రింది పనులు చేయుటను కోరును.

(a) నిర్వహణాధికారికి తృప్తిగా యుండునటుల దానికి కంచె వేయుట, లేక

(b) అమకొనియున్న వీధిబాట ఎత్తునుండి నిర్వహణాధికారి నిర్ణయించునట్టి ఎత్తున అవి దాటకుండగా అట్టి వీధిమీద అంచుగాయున్న కంచెలను దిద్దుట, లేక సరిచూచుట; లేక

(c) అట్టి వీధిమీదకు వ్రేలాడుతున్న, దానికి అడ్డు కలుగజేయుచున్న లేక నడుచు జనము యొక్క చూపును అడ్డు లేక దానికి నష్టము కలుగజేయు ఏ కంచెలు లేక చెట్లను నరుకుట లేక దిద్దుట; లేక

(d) ప్రమాదము కలుగజేయుటకు నడచు జనముయొక్క చూపును, దానిఎత్తు, పరిస్థితివల్ల అడ్డుకలుగజేయు మాదిరిగా చుట్టుగోడ లేక కంచెను దించుట.

150. ప్రమాదకరమైన చెరువులు, నూతులు, కన్నములు మొదలగు వాటివిషయములో జాగ్రత్తలు :

(1) పంచాయతీ కాని ప్రదేశములోని ఏ చెరువు, గుంట, నుయ్యి, కన్నము, వాను, డామ్, గట్టు లేక యితర స్థలము, తగిన మరమ్మత్తు, చుట్టు ఉన్నదానిమీద జాగ్రత్త లేని కారణమున, అనారోగ్యమునకు, క్షేమమునకు ప్రమాదకరము అని అతనికి తోచిన ఎడల, పంచాయతీ సమితి నిర్వహణాధికారి, పంచాయతీ సమితి అనుమతితో నోటీసు ద్వారా యజమానిని, దానివల్ల వచ్చు

ప్రమాదము నాపుటకు, పూర్చమని, తీసివేయమని, మరమ్మతు చేయమని, కాపాడమని లేక దానికి ఆవరణ ఏర్పరచమని కోరును.

(2) వెంటనే చర్యతీసికొనుట అవసరమైనయెడల అతడు, అట్టి నోటీసు యివ్వకమునుపు లేక నోటీసులోని గడువు దాటకమునుపు, ప్రమాదము నాపుట కొరకు స్వంతముగానే అతనికి యుక్తమని తోచిన అట్టి తాత్కాలిక జాగ్రత్తలను తీసికొనును. ఆ విధముగా జేసినందుకు ఖర్చు యిప్పటినుండి ఏర్పాటు చేయ బడిన రీతిగా యజమానినుండి వసూలు చేయబడును.

151. రాజవీధి మొదలగు వాటివద్ద రాళ్ళుత్రవ్వి ఎత్తుటకు లైసెన్సు పొందుట :

1. (a) అట్లు చేయుటకు పంచాయతీ సమితినుండి లైసెన్సు పొందనిదే ఏ వ్యక్తికి, పంచాయతీ సమితికి చెందిన ఏ రాజవీధి లేక దానికి చేరిన యితర స్థిరాస్థినుండి ఇరవై గజముల లోపుగా ఏ స్థలములో రాళ్ళగని పనిచేయించుట, లేక దానినుండి రాయి, మట్టి లేక యితర వస్తువులు తీసివేయుట చేయ కూడదు.

(b) పంచాయతీ సమితి లైసెన్సును యివ్వవచ్చు లేక నిరాకరించ వచ్చును.

(c) వదలబడినది.

(2) పంచాయతీ సమితి ఉద్దేశములో, దానిచుట్టు ప్రక్కలయుండు స్థల ములో నివసించు లేక దాని చెంతకు పోవుచుండు ప్రజలకు ప్రమాదకరమై లేక ఉపద్రవము కలిగించు లేక కలిగించునను స్థలములో క్వారీ పనిచేయుట లేక దానినుండి ఏ రాయిని, మట్టిని లేక యితర వస్తువును తీసివేయుట, అట్టి క్వారీ లేక స్థలముయొక్క యజమాని లేక దాని ఆధీనముగల వ్యక్తిని, ఆ విధముగా పని చేయుటను ఆపివేయమని లేక అట్టి స్థలమునుండి రాయి, మట్టి యితర వస్తువును తీసివేయుట ఆపివేయమని, లేక దానివల్లవచ్చు లేక వచ్చుననుకొను ప్రమాదము నాపుటకు లేక ఉపద్రవమును తగ్గించుటకు అది కావలయుననుకొను అట్టి క్వారీ లేక స్థలమును గురించి అట్టి ఉత్తరువును తీసికొనమని, పంచాయతీ సమితి కోరును.

152. వదలబడినది.

153. పంచాయతీ కాని స్థలములోని ధూమములు, భవనములనుండి మురికి లేక హానికరమైన మొక్కలను తీసివేయుట :

(1) పంచాయతీ సమితి యొక్క నిర్వహణాధికారి నోటీసుద్వారా, చుట్టు ప్రక్కల స్థలముకు హానికరము లేక ప్రజలకు ప్రమాదకరము లేక అనారోగ్యకరము

లేక యితర విధముగా ఉపద్రవమునకు హేతువు నగు, దట్టమైన లేక హానికర మగు మొక్కలు, చెట్లు లేక లోపల పెరుగుదల, మురికి లేక అసహ్యకరమైన, విస్తారమైన పెరుగుదలగా యున్నదని అతనికితోచు పంచాయతీ కాని స్థలము లేక ఏ భవనము యొక్క యజమాని లేక ఆక్రమణదారును, శుభ్రపరచి, కడగి లేక యితర విధముగా అట్టి భవనము లేక భూమిని సరియైన స్థితిలోవుంచుట లేక అట్టి మొక్కలను, చెట్లను లేక లోపల పెరుగుదల తీసివేయుట లేక నోటీసులో నిర్దిష్టమయిన పద్ధతిని, కాలపరిమితిలోను అట్టి ఉపద్రవమును తొలగించుటకు నిర్వహణాధికారి కావలయుననుకొను యితర చర్య తీసికొనుట కోరును.

(2) పంచాయతీ సమితి నిర్వహణాధికారికి ఆరోగ్య రక్షణ సంబంధమైన పనులకు అవుసరమని తోచినయెడల. అతడు నోటీసుద్వారా పంచాయతీ కాని ప్రదేశములోని ఏ భవనము లేక భూమి యజమాని లేక ఆక్రమణదారును నోటీసులో నిర్దిష్టమయిన కాలములోను పద్ధతిలోను దానిని శుభ్రపరచుట లేక సున్నము కొట్టుట కోరును.

154. వీధులలో తిరుగు పందులను నాశనముచేయుట కధికారము :

(1) పంచాయతీ సమితి ఒక నిర్దిష్టమైన హద్దులలో తిరుగు లైసెన్సు లేని పందులు లేక కుక్కలను నాశనము చేయవలసినదిగా ఒక బహిరంగ నోటీసును యివ్వవచ్చును లేక ఆ విధముగా జిల్లా మేజిస్ట్రేటుచే కోరబడినప్పుడు యివ్వవలసి యున్నది.

అట్టి నోటీసు యిచ్చిన తరువాత, ఏవ్యక్తి అట్టి లైసెన్సులో నిర్దిష్టమైన షరతుల ప్రకారముకాకుండా లేక పంచాయతీ సమితి నిర్వహణాధికారి నుండి ఒక లైసెన్సును పొందనిదే అట్టి హద్దుల లోపల అట్టి పందిని లేక కుక్కను ఉంచకూడదు.

(2) అట్టి నోటీసు యివ్వబడిన తరువాత, ఏ వ్యక్తికి, నోటీసు షరతులకు భిన్నముగాకాకుండా ఏ విధముగను అట్టి హద్దులలో తిరుగునట్లు కనపడు లైసెన్సు లేని ఏ పందిని లేక కుక్కను నాశనము చేయవచ్చును.

155. పడగొట్టిన ప్రమాదకరమైన కట్టడము లేక యితరముయొక్క వస్తువులను ఉపయోగించుట లేక అమ్ముటకు నిర్వహణాధికారి అధికారము :

(1) ఈ అధ్యాయములో అతని అధికారములచేత, పంచాయతీ సమితి నిర్వహణాధి కారి ఏ కట్టడము లేక దాని భాగము పడగొట్టినను లేక ఏ చెట్టును

లేక కంచెను లేక పొదను లేక దాని భాగమును నరకినను, నిర్వహణాధికారి పడగొట్టిన నరకిన లేక తీసివేయబడిన సామగ్రిని లేక వస్తువులను అమ్మ వచ్చును. అమ్మి దాని వల్ల వచ్చిన దానిని, తగులుబాటు అయినఖర్చులకు లేక వాటిని ఉపయోగింపవచ్చును.

(2) న్యాయ సమ్మతమైన విచారణ జరిగిన తరువాత, ఈ అధ్యాయము లోని ఏ సెక్షనుక్రింద నోటీసు యివ్వదగు యజమాని లేక ఆక్రమణదారు లేడు అని నిర్వహణాధికారికి తోచినయెడల, అతకి ఆవశ్యకము అని తోచు అట్టి సెక్షనులో చెప్పబడిన ఆస్తితో అట్టి ఉత్తరువును అతనంతట అతనే తీసికొని, స్థిరాస్థి లేక దాని భాగమేదైనను కాని అట్టి ఆస్థిని అమ్ముటకు తగులు బాటు అయిన ఖర్చును వసూలు చేయవచ్చును.

156. పరిహారమునకు హద్దు :

ప్రత్యేకముగా ఏర్పాటు చేసిన తప్ప, ఏ వ్యక్తికి, ఈ అధ్యాయము క్రింద వాతికి అధికారమున తగులు బాటు అయిన నష్టమునకు పరిహారము కోరుటకు అర్హతయుండదు.

## 10 వ అధ్యాయము – రా జ వీ ధు లు

157. రాజవీధులలో లేక పైనున్న అడ్డుదలలను నిషేదించుట :

ఇప్పటినుండి చేయు ఏర్పాటుతో తప్ప, ఏవ్యక్తి పంచాయతీ సమితిలో చేరిన ఏ రాజవీధిలో లేక పైన, ఏ గోడను కట్టుట లేక కంచవేయుట లేక యితర అడ్డురల లేక పెరుగుదలను కలుగ చేయుట కూడదు.

157. (A) రాజవీధులను అందరికీ తెరచుట :

పంచాయతీ సమితిలో చేరిన లేక దానిచేత నిర్వహింపబడు అన్ని వీధులు ఏ జాతి ఏ మతమునకు చెందిన వ్యక్తులకైనను తెరువబడి యుండును.

158. తలుపులు, క్రిందినేల, బయటికి తెరుచికొనియుండు కిటికీలు కమ్మెలు మొదలైన వాటి నిషేదించుట

(1) అట్టి పంచాయతీ సమితి నిర్వహణాధికారి నుండి లైసెన్సు పొంద నిదే, పంచాయితీ సమితిలో చేరిన ఏ రాజవీధి పైనను బయటికి వచ్చునట్లుగా ఏ తలుపు, ద్వారము కమ్మె లేక నేల స్థలము, కిటికీ వ్రేలాడదీయుట లేక ఉంచ బడుట కూడదు.

(2) నిర్వహణాధికారి నోటీసు ద్వారా, అట్టి తలుపు, ద్వారము, కమ్మీ లేక కిటికీ యొక్క యజమానిని, దాని ఏ భాగము తెరువబడినప్పుడు రాజవీధి పైకివచ్చి నట్లుగా వున్నదో దానిని మార్పుచేయమని కోరును.

159. ఆక్రమణలను తొలగింపు :

(1) పంచాయతీ సమితి నిర్వహణాధికారి నోటీసు ద్వారా, పంచాయతీ సమితిలో చేరినట్టి స్థలము ముందుగా లేక అడ్డుగాయున్న ఏ పెరుగుదల, ఆక్రమణ లేక అడ్డుదల (తలుపు, ద్వారము, కమ్మె లేక క్రింద నేల, కిటికీ కాని) ను తొలగింపమని లేక మార్పు చేయమని అట్టి స్థలము యజమానిని లేక అక్రమణదారుని కోరును.

(2) స్థలముయొక్క యజమాని లేక ఆక్రమణదారు, అట్టి పెరుగుదల, ఆక్రమణ లేక అడ్డుదల కాల నిర్ణయమునకు సంబంధించిన న్యాయశాస్త్రరీత్యా ఒక వ్యక్తికి దానికి చిరకాల భుక్తమైన హక్కును యిచ్చుటకు సరిపడు కాలము నుంచి యున్నదని లేక ఆ విషయములో క్రమముగా అధికారమివ్వబడిన ఏ స్థానిక అధికారి లైసెన్సు లెక అనుమతితో అది పెట్టబడినది లేక చయబడినది అనియు, మరియు అనుమతి లేక లైసెన్సు చెల్లుబాటగు కాలము ఏదైన యున్నయెడల, అది దాటలేదని, రుజువు పరచినచో, పంచాయితీ సమితి దానిని తొలగించుట వలన లేక మార్పు చేయుటవలన ఏ వ్యక్తియైనను నష్టపడిన యెడల అట్టి ప్రతి మనిషికి సబబగు పరిహారమును యిచ్చును.

160. కొన్ని పెరుగుదలలను కట్టడములను ఒప్పుకొనుటకు అధికారము :

(1) పంచాయతీ సమితి నిర్వహణాధికారి, పంచాయతీ సమితి అనుమతితో, ఏ స్థలముయొక్క యజమాని లేక ఆక్రమణదారుకు, అతనికి యుక్తమనితోచిన షరతులకును, నిబంధనలకు బద్ధమై, వరండాలు, బాల్కనీలు, సన్ షేడ్‌లు, వెదర్ ఫ్రేమ్‌లు ఆటువంటి వాటినివేయుటకు పంచాయతీ సమితిలో చేరిన రాజవీధిపైకి పొడిగించుటకు లేక స్థలములోనికి పోవుటకు అవసరమైన ఏ మెట్టు లేక డ్రెయిన్ కపరింగు నిర్మించుటకు లైసెన్సును యిచ్చును.

(2) పంచాయతీ సమిని నిర్వహణాధికారి, అతనికి యుక్తమని తోచు షరతులు నిబంధనలకు బద్ధమై, అట్టి బోర్డులో చేరిన రాజవీధిలో యున్న లేక అట్టి పంచాయతీ సమితి ఆధీనములో యితర బహిరంగ స్థలములో తాత్కాలిక పందిర్లు లేక యితర కట్టడములు వేయుటకు లైసెన్సు యిచ్చును.

(3) పంచాయతీ సమితి నిర్వహణాధికారి, పంచాయతీ సమితి అనుమతితో, పంచాయతీ సమితి నిర్ణయించు షరతులు, నిబంధనలు, కాల పరి

మితికి ఆక్రమించుటకు అట్టి పంచాయతీ సమితితో చేరిన వీథిప్రక్కలను గుత్త కిచ్చుటకు అధికారము కలిగియుండును.

(4) కాని, పెరుగుదల, నిర్మాణము లేక ఆక్రమణ, ఆరోగ్యమునకు భంగముగా ఉండునని అనుకొనునపుడు లేక జనులవీలునకు అడ్డుదలగాయున్న పుడు లేక యితరముగా ఆ విధముగా వీధి ఉపయోగమునకు ముఖ్యముగా అడ్డు దల కలిగించునపుడు, (1) వ సబ్ సెక్షనుక్రింద గుత్త యివ్వబడకూడదు.

(5) రాష్ట్రప్రభుత్వము ప్రకటనద్వారా [1], [3] సబ్ సెక్షన్ల క్రింప అధికారములను పంచాయితీ సమితి చలాయించుటను మితముచేసి వారికి యుక్తమని తోచిన వారి అధీనములో నుంచును.

(6) ఈ సెక్షనుక్రింద యివ్వబడిన లైసెన్సులకు కాల పరిమితి దాటగనే నిర్వహణాధికారి, నోటీసులేకుండ [1]వ లేక [2]వ సబ్ సెక్షను క్రింద పెట్టిన ఏ పెరుగుదలను లేక, నిర్మాణమును తొలగించుటను కలుగజేయును. అట్లు చేయుటవలన అయిన ఖర్చు లైసెన్సు యివ్వబడిన వ్యక్తినుండి, యిప్పటి నుండి ఏర్పాటు చేయబడు పద్ధతిని వసూలు కాబడును.

161. మురికినీటికాలువ జలదారి మొదలైన వాటిమీది అనుమతి లేనిదే భవనము నిర్మించుట నిషేదము:

(1) పంచాయతీ సమితి నిర్వహణాధికారి లేక అట్టి నిర్వహణాధికారిచే అనుమతింపబడిన యింకొక వ్యక్తి యొక్క వ్రాత పూర్వకమైన అనుమతి పొంద న్నిదే, పంచాయతీ కాని ప్రదేశములో ఏ భవనము, మురికినీటికాలువ లేక జలదారికి పైన లేక మురికినీటి కాలువ లేక జలదారిలో ఏ భాగము పైనను లేక వీధు లూడ్చిన దాని చేతను లేక యితర చెత్తచే పూర్తిగా లేక కొంత మూసివేయబడి, ఎత్తుచేయబడి లేక సరి చేయబడిన స్థలముమీద కట్టబడకూడదు.

(2) చెప్పబడిన నిర్వహణాధికారి లేక వ్యక్తి నోటీసు ద్వారా, అట్టి అనుమతి లేకుండగా లేక అట్టి అనుమతి షరతులకు భిన్నముగాను, సరిపడని పద్ధతిలో ఆ భవనమును కట్టిన వ్యక్తిని దానిని పడగొట్టమని కోరును.

162. హానికరమగు మొక్కలు మొదలైన వాటిని నిర్మూలనమును గురించి నోటీసు :

పంచాయతీ సమితి నిర్వహణాధికారి, నోటీసు ద్వారా రాజ వీధికి ప్రక్కగాయున్న లేక పంచాయతీ సమితిలో చేరిన యితర భూమి లేక

నీరుకు ప్రక్కగాయున్న ఏ భూమియొక్క యజమాని లేక ఆక్రమణదారులు, అట్టి ఆస్థి ఆక్రమణదారును, అట్టి ఆస్థిని ఆక్రమించిన మరియు అట్టి భూమి నుండి అట్టి ఆస్థి వరకు విస్తరించినంతవరకు బ్రహ్మజెముడు. 'వాలెల్' 'లంటానా' లేక యితర హానికరమైన మొక్కలను తీసివేయుటను కోరును.

163. రాజవీధిలో కన్నములు తీయుట, అడ్డులు కలుగ జేయుటను నిషేధించుట :

(1) ఏ వ్యక్తి అతడు యింతకు ముందు పంచాయతీ సమితి నిర్వహణాధికారి నుండి అనుమతిపొందిననే తప్ప మరియు నిర్వహణాధికారి విధించునట్టి నిబంధనలను నిర్వర్తించిన తప్ప, జిల్లాపరిషత్తులో చేరిన ఏ రాజవీథిలో రంధ్రముపెట్టుటగాని, అద్దుదల కలుగ జేయుటగాని చేయకూడదు.

(2) అట్టి అనుమతి యివ్వబడినప్పుడు, అట్టి వ్యక్తి, అతని స్వంత ఖర్చుమీద, ఆ రంధ్రము పూడ్వ బడువరకు లేక అట్టి అడ్డు తీసివేయబడువరకు అట్టి రంధ్రము చుట్టూ కావలసినంతవరకు కంచె వేయించుట లేక అడ్డుదల మూసి వేయించుట చేయవలెను. రాత్రిపూట అట్టి రంధ్రము లేక అడ్డుదల దగ్గర కావలసినంత కాంతి కలుగజేయవలెను.

(3) ఏ వ్యక్తి యైనను ఈ సెక్షనులోని నిబంధసలను అతిక్రమించిన యెడల, నిర్వహణాధికారి ఆ రంధ్రమును పూడ్చివేయును; ఆ అడ్డును తీసివేయును; లేక ఆ రంధ్రము లేక అడ్డు దగ్గర కాంతి కలుగజేయును. ఆ విధముగా జేయుట కయిన ఖర్చు అట్టి వ్యక్తి నుండి వసూలు చేయవచ్చును.

163(A) అనుమతి లేనిదే రాజవీధులమీద చెట్లను నాటుట లేక పడగొట్టుట నిషేధము :

(1) పంచాయతీ సమితి నిర్వహణాధికారిముందు అనుమతితోను, నిర్వహణాధికారి నియమించు షరతులమీద తప్ప, ఏ వ్యక్తి, పంచాయతీ సమితికి చేరిన లేక చెందిన ఏ రాజవీధి లేక యితర ఆస్థి మీద, ఏచెట్టును నాటకూడదు.

(2) పంచాయతీ సమితి నిర్వహణాధికారి పూర్వ అనుమతితోను, నిర్వాహణాధికారి నియమించు షరతులమీద తప్ప ఏ వ్యక్తి, పంచాయతీ సమితిలో చేరిన లేక చెందిన మరియు అట్టి రాజవీధి లేక ఆస్తిమీద పెరుగుచుండిన ఏ చెట్టును, పడగొట్టుట. తీసివేయుట, నాశనముచేయుట, కొమ్మలు

నరకుట లేక బెరడుకొట్టుట లేక ఆకులు త్రెంపుట లేక యితరముగా నష్టము కలుగజేయుట కూడదు.

164. భూమిన్ని దురాక్రమణ చేసినందుకు అపరాధము, పరిహారము వసూలు చేయుట :

(1) ఏ వ్యక్తి, పంచాయతీ సమితి పూర్వ అనుమతి లేకుండగా, పంచాయతీలో చేరిన లేక చెందిన బహిరంగ కార్యము కొరకు విడిగా ఉంచబడిన ఏ భూమి నైనను ఆక్రమించినచో, అతడు అపరాధముగా పంచాయతీ సమితిచే కోరబడినట్టి మొత్తమును ఆ ఆక్రమించిన స్థలమునకు చెల్లించుటకు అతడు బద్ధుడై యున్నాడు; అట్టి మొత్తము యిప్పటినుండి తెల్పు పద్ధతిని వసూలు చేయబడును.

(2) నిర్వహణాధికారి నోటీసుద్వారా (1)వ సబ్ సెక్షను క్రింద విధించిన లేక విధింపబడు అపరాధము చెల్లించవలసిన ఏవ్యక్తిని, అట్టి భూమిని ఖాళీచేయమని, ఏ భవనమునైనను యితర కట్టడమును తీసివేయమని లేక దానిమీదఉంచిన దేని నైనను తీసివేయమని కోరవచ్చును.

(3) [1]వ సబ్ సెక్షను క్రింద అతడు చెల్లింపవలసిన అపరాధమునకు బాధ్యతగల భూమి నాక్రమించిన ఏ వ్యక్తిచేత నైనను పంచాయితీ సమితి యొక్క ఆస్తికి ఎట్టి నష్టము కలుగజేయబడిన యెడల, అతని మీద విధించు వసూలు చేయు ఏ అపరాధముతోను నిమిత్తము లేకుండ, అదనముగా అట్టి నష్టమునకు పంచాయతీ సమితికి పరిహారము చెల్లించుటకు అతడు బాధ్యుడై యున్నాడు. అట్టి పరిహార మొత్తము, తగాదావచ్చిన విషయములో యిప్పటి నుండి తెలియజేయు పద్ధతిని, నిర్ణయింపబడి, వసూలు చేయబడును.

165. విస్తారమైన జనసమర్ధమువల్ల కలిగిన ఖర్చులు వసూలు చేయుటకు పంచాయతీ సమితి అధికారము:

ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు పదవికి తక్కువ కాకుండాయున్న ప్రభుత్వపు పబ్లిక్ వర్క్సుశాఖ అధికారి సర్టిఫికేటుచే, ఆ యా నిర్వహణాధికారికి, చుట్టు ప్రక్కల వీధులను బాగుచేయుట కయిన సరాసరి ఖర్చులు చూచిన వీధి వెంబడి విపరీతమైన బరువు లేక దారిమీద విస్తారమైన జనసమర్ధముచేత చెడిపోవుటవల్ల విపరీతమైన ఖర్చులు పంచాయతీ సమితికి ఆ రాజవీధిని బాగుచేయుటకు తగులుబాటు అయిన పని తోచిన, పంచాయతీ సమితి జూరిస్డిక్షనుగల సివిల్ కోర్టులో పై చెప్పిన రీతిగా అట్టి బరువు లేక జనసమర్ధమునుంచి కలిగిన నష్టముచేత పంచాయతీ సమితి ఖర్చుపెట్టి యుండునని అట్టి న్యాయ స్థానమునకు తృప్తికర

ముగా ఋజువయిన ఖర్చుల మొత్తము, ఎవరి వుత్తర్వుచే అట్టి బరువు లేక జనసమ్మర్దము జరిగినచో వాని నుండి వసూలు చేయవచ్చును.

కాని ఈ సెక్షనుక్రింద ఎవరినుండి ఖర్చులు వసూలు కాబడవలయునో లేక కాబడవచ్చునో అట్టి వ్యక్తి పంచాయతీ సమితితో అట్టి బరువు లేక జనసమ్మర్దము విషయములో మిశ్రమమువల్ల దానికి ఒక మొత్తమును చెల్లించుటకు ఒక ఒడంబడికను చేయవచ్చును, దానిమీద ఆ విధముగా చెల్లించుచున్న వ్యక్తి ఈ సెక్షను క్రింద ఏ చర్యలకు బాధ్యుడు కాడు.

166 వదలబడినది.

## 11 వ అధ్యాయము

## సంతలు, కసాయి యిళ్లు మొదలయినవి

### బహిరంగ సంతలు

166 (A) సంతలను బ్లాక్ లెవెల్ సంతలు, పంచాయతీ సంతల క్రింద తరగతింప బడుట :

పంచాయతీ ప్రదేశములోయున్న బహిరంగ స్వంత సంతలను వరుసగా బ్లాక్ లెవెల్ సంతలు, పంచాయతీ సంతల క్రింద విభజించుట రాష్ట్ర ప్రభుత్వమునకు అధికారము గలదు. అట్టి సంతపైన అధికారము కలిగియుండుటను, దాని నుండి వచ్చు ఆదాయమును పంచాయతీ సమితి, పంచాయతీల మధ్య విభజించుటను లేక దాని విషయములోని పరిహారమును పంచాయతీ సమితి లేక పంచాయతీకి చెల్లించుటను ఏర్పాడు చేయును.

167. బహిరంగ సంతలు :

పంచాయతీ సమితి నిధినుండి సంపాదింపబడిన, నిర్మింపబడిన, మరమ్మతు చేసిన లేక నిర్వహింపబడిన సంతలు అన్నియు బహిరంగసంతలుగా భావింపబడును. అట్టి సంతలు ఏ జాతి, మతమునకు చెందినవారయినను వారికి తెరువబడి యుండును.

168. బహిరంగ సంతల విషయములో అధికారములు :

(1) పంచాయతీ కాని ప్రదేశములో బహిరంగ సంతలుగా ఉపయోగపడుటకు పంచాయతీ సమితి స్థలములను ఏర్పాటు చేయును. రాష్ట్ర ప్రభుత్వము ఈ విషయములో ప్రత్యేకముగా అధికారము పొందినపుడు పంచాయతీ ప్రదేశముతో ఏర్పాటుచేయును.

(2) నియమితమైన అధికారమునకు బద్ధమై, పంచాయతీ సమితి దాని బహిరంగ సంతలలో దేనిలోనైనను, ఈ క్రింద చెప్పబడిన రుసుములలో ఏ ఒకటి లేక ఎక్కువను, దానికి యుక్తమని తోచిన రేటులపైన విధించ వచ్చును లేక అట్టి రుసుములను అట్టి షరతులపైన, దానికి సబబు అని తోచు నిబంధనలకు కట్టుబాటుచేసి గుత్తకివ్వబడును.

(a) అట్టి సంతల ఉపయోగము కొరకు లేక వాటిలో అమ్మకమునకు సరకును పైన పెట్టు హక్కు కొరకు రుసుము;

(b) అట్టి సంతలలో కొట్లు, దుకాణములు, పశువుల దొడ్లు లేక బండ్లు మొదలైనవి నిలచు స్థలములకు రుసుము;

(c) అట్టి సంతలో వాహనముల, జంతువుల సముదాయములు తీసికొని వచ్చుట లేక అమ్ముటకు వస్తువులను తీసికొని వచ్చు వ్యక్తుల మీద రుసుము;

(d) అట్టి సంతలలో అమ్ముటకు తీసికొని వచ్చిన లేక అమ్మిన జంతువులమీద రుసుము;

(e) అట్టి సంతలలోని బ్రోకర్ల మీద, కమీషన్ ఏజంట్లమీద, వారి వృత్తి నవలంబించు తూకమువేయు వారిమీద, కొలతలు కొలుచు వారిమీద లైసెన్సు రుసుము.

(3) పంచాయతీ సమితి బహిరంగ సంతలు, వాటిలో ఏ భాగమునైనను మూసివేయ వచ్చును.

169. బహిరంగ సంతలమీద నిర్వహణాధికారి అధీనము:

(1) ఏ వ్యక్తి పంచాయతీ సమితి నిర్వహణాధికారి అనుమతి లేకుండగా లేక అద్దెలు, రుసుములు యితరులు వసూలు చేయుటకు యివ్వబడిన, అట్టివారి అనుమతి లేకుండా పంచాయతీ సమితి బహిరంగ సంతలో ఏ జంతువును లేక వస్తువును అమ్ముట లేక అమ్ముటకు బయట పెట్టుట కూడదు.

(2) నిర్వహణాధికారి, పంచాయతీ సమితి బహిరంగ సంతనుండి, అట్టి సంతలలో అట్టి కాలమున అమలులో ఉన్న ఏ ఉపవిధులనైనా అతిక్రమించి సందులకు శిక్షింపబడిన వ్యక్తి లేక అతని ఉద్యోగిని వెడల గొట్టవచ్చును. అట్టి సంతలో అతడు స్వయముగా గాని, అతని ఉద్యోగులుగాని లేక ఏజంట్లుగాని ఏ వర్తకము ఏ వ్యాపారము యింకను చేయుచుండుటనుండి లేక అందులోని ఎట్టి కొట్టు దుకాణము లేక యితర స్థలము ఆక్రమణనుండి అట్టి వ్యక్తిని ఆపవచ్చును.

మరియు అట్టి కొట్టు, దుకాణము లేక స్థలములో అట్టి వ్యక్తి కలిగియుండు ఏ గుర్తు లేక ఒడంబడికను నిర్ణయించవచ్చును.

## స్వంత సంతలు

170 వదలబడినది.

171 స్వంత సంతకు లైసెన్సు:

ఆ విధముగా చేయుటకు అతడు పంచాయతీ సమితి నుండి ఒక లైసెన్సును పొందనిదే, ఏ వ్యక్తి పంచాయతీ కాని స్థలములో క్రొత్త స్వంత సంత తెరుచుట గాని లేక ఒక స్వంత సంతను తెరచి ఆవిధముగా ఉంచుటగాని చేయకూడదు.

(2) అట్టి లైసెన్సుకు దరఖాస్తు, అట్టి స్థలము సంతగా తెరవబడుటకు ముందు లేక లైసెన్సు కోరిన సంవత్సరము ప్రారంభమునకు ముందు ఆరు వారములకు తక్కువకాకుండ లైసెన్సు కోరబడిన స్థలముయొక్క యజమానిచేత పెట్టబడును.

(3) పంచాయతీ సమితి, న్యాయ ప్రకారము యింతకు ముందే స్థాపింపబడిన స్వంత సంతల విషయములో తప్పకుండగను, క్రొత్త స్వంత సంతల విషయములో, దాని విచక్షణ ప్రకారము దరఖాస్తు పెట్టబడిన లైసెన్సు యివ్వవచ్చును. కాని అది, పంచాయతీ సమితి యుక్తమయిన రీతిని అట్టి సంతలో విచారణ, తనఖీ సంబంధించిన నిబంధనలకు, ఆరోగ్య రక్షణ, డ్రయినేజి, నీటిసరఫరా, బాటలు, మార్గముల వెడల్పు, ఉపయోగింపవలసిన బరువులు, కొలతలు, మరియు విధించబడు అద్దెలు రుసుములకు సంబంధించిన షరతులకు బద్ధమై యుండును. లేక పంచాయతీ సమితి అట్టి లైసెన్సు ఏ క్రొత్త స్వంత సంత కైనను యిచ్చుటను నిరాకరించవచ్చును. పంచాయతీ సమితి, ఎప్పుడైనను దాని షరతుల నుల్లంఘించినందులకు, ఈ సెక్షను క్రింద యివ్వ బడ్డ ఏ లైసెన్సు నైనను నిలుపుదలచేయుట లేక రద్దుచేయుట చేయవచ్చును. ఒక నిర్దిష్టమయిన తారీకు నుండి అమలులోనికి వచ్చుటకు లైసెన్సు షరతులను, పంచాయతీ సమితి మార్పు కూడ చేయవచ్చును.

(4) ఈ సెక్షను క్రింద ఒక లైసెన్సు యివ్వబడిన యెడల లేక నిరాకరింపబడుట నిలుపుదల చేయబడుట, రద్దు చేయబడుట, మార్పు చేయబడుట జరిగిన యెడల, పంచాయతీ సమితి, అట్టి యివ్వబడ్డ, నిలుప

దలచేయబడ్డ, రద్దుకాబడ్డ లేక మార్పుచేయబడ్డ నోటీసును, ప్రాంతీయభాషలలో, లైసెన్సు కోరబడ్డ లేక పొందబడ్డ స్థలముయొక్క ప్రదేశము వద్ద లేక దగ్గర ఒక ప్రాముఖ్య భాగములో అతికింపబడుటకు ఏర్పాటు చేయును.

(5) ఈ సెక్షను క్రింద మంజూరు కాబడ్డ ప్రతి లైసెన్సు సంవత్సర మాఖరున అంత్యమగును.

172 వదలబడనది.

173. రుసుమును విధించుటకు అర్హాత నిర్ణయమునకు దావాహక్కు :

సర్టిఫికేటు మంజూరుచేయుటకు నిరాకరించు పంచాయతీ సమితియొక్క ఉత్తరువువల్ల నష్టపడిన ఏ వ్యక్తియైన, అట్టి వుత్తరువు తేదీనుండి ఆరు నెలలలో అతడు కోరుహక్కు నిర్ణయించుటకు ఒక దావాను వేయవచ్చును. అట్టి ఉత్తర్వు అట్టి దావా పర్యవసానమునకు కట్టుబడి ఆఖరుదిగా వుండును.

174. లైసెన్సుకొరకు రుసుము :

171 వ సెక్షను క్రింద మంజూరు చేసిన లైసెన్సు ఏ రుసుములు విధించుటను ఒప్పుకొనినచో, అది ఖర్చులేకుండగనే మంజూరు చేయబడును; కాని అట్టి అనుమతి యివ్వబడినప్పుడు, జరిగిన సంవత్సరములో సంతనుండి వచ్చిన యజమాని మొత్తము ఆదాయములో నూటికి పదిహేను పాళ్ళు దాటకుండగా రుసుము అట్టి లైసెన్సుకు పంచాయతీ సమితిచే విధింపబడును.

175. లైసెన్సు కాని స్వంత సంతలలో అమ్మకమును నిషేధింపు ...

లైసెన్సు కాని స్వంత సంతలో ఏ జంతువు లేక వస్తువును అమ్ముట లేక అమ్ముటకు బయట పెట్టుట ఏ వ్యక్తికి న్యాయంకాదు.

176. స్వంత సంతల విషయాలలో పంచాయితీ సమితి అధికారములు :

పంచాయతీ సమితి, నోటీసుద్వారా, పంచాయతీ కాని ప్రదేశములోని స్వంత సంతయొక్క లేక పంచాయతీ స్థలములోని బ్లాక్ లెవెల్ సంతగా తరగతింపబడిన యజమానిని, ఆక్రమణదారుని లేక వ్యవసాయదారుని ఏ స్వంత సంతయొక్క—

(a) అట్టి సంతకు దారులు, ప్రదేశములు, బాటలు, ద్వారములు, జల దారులు మరియు మురికి గుంటలు కట్టుటను, పంచాయతీ సమితికి యుక్తమని తోచు వర్ణన, స్థలము సంఖ్యగల పాయిఖానాలను ఏర్పాటు చేయుట ;

(b) కప్పు వేయుట, దాని నంతను లేక కొంతను రాళ్ళుపరచి కప్పుటను లేక పంచాయతీ సమితి ఉద్దేశములో సందులు లేకుండగను వెంటనే కడుగుటకు వీలగునట్టి సామగ్రితో నేల ఏభాగమును రాళ్ళు పరచి కప్పుటను;

(c) క్రమముగా గాలి వచ్చునట్లుచేయుట, దానికి నీటి సరఫరా ఏర్పాటు చేయుట;

(d) దుకాణముల మధ్య కావలసినంత మేర వెడల్పులో మార్గములు ఏర్పాటుచేయుట, పంచాయతీ సమితి ఉత్తరువు యిచ్చునట్టి మార్పులను దుకాణములలోను, మార్గములలోను, కొట్లలోను, తలుపులలోను లేక సంతయితర భాగములలోను చేయుట ;

(e) దానిని శుభ్రమైన, సరియైన స్థితిలోను ఉంచుట, దానినుండి వచ్చునట్టి మురికి చెత్తనంతను తీసివేసి, పంచాయతీ సమితి ఉత్తరువు యిచ్చునట్టి స్థలము లోను పద్ధతిలోను వాటిని పరిష్కరించుట ; మరియు

(f) పంచాయతీ సమితి కావలయుననుకొనునట్టి యితర ఆరోగ్య రక్షణకు సంబంధించిన ఏర్పాటులను చేయుట కోరును.

177. 176 వ సెక్షను క్రింద నోటీసును అనువర్తించుటలో తప్పుచేసి నందుకు, లైసెన్సు ఆపుదల లేక నిరాకరణ

(1) పంచాయతీ సమితి ఒక వ్యక్తికి నోటీసును యిచ్చిన తరువాత, అట్టి నోటీసు తెలియజేసిన కాలపరిమితిలోను నిర్ణయించిన పద్ధతిలోను, 176 వ సెక్షనులో నిర్దిష్టమయిన ఏ పనులను చేయుటను, తప్పిన యెడల, పంచాయతీ సమితి, అట్టి పనులు పూర్తియగువరకు అట్టి వ్యక్తియొక్క లైసెన్సును ఆపుదల చేయ వచ్చును లేక అతనికి లైసెన్సును మంజూరు చేయుట నిరాకరించును.

(2) అట్టి ఆపుదల కాలములో లేక లైసెన్సు పునఃసృష్టి చేయబడు వరకు, ఏ వ్యక్తికి ఏ స్వంత సంత తెరచి యుంచుట న్యాయముకాదు.

178. స్వంత సంతలలో ఉపద్రవముల నిషేధింపు :

పంచాయతీ కాని ప్రదేశములో ఏ స్వంత సంత అధీనములోయున్న లేక బ్లాక్ లెవల్ సంతగా తరగతింపబడిన పంచాయతీ ప్రదేశములోని ఏ స్వంత సంతయొక్క లేక ఏ కొట్టు, దుకాణము, పాక లేక దానిలోని యితర స్థలము యొక్క ఏ యజమాని, ఆక్రమణదారు, ఏజెంటు లేక మేనేజరు, అట్టి

ఉపద్రవము అగునట్లుగా వాటిని ఉంచకూడదు లేక అట్టి ఉపద్రవమును కలుగ జేయకుండుటలో అతడు తప్పిన యెడల, వాటిని వెంటనే పంచాయతీ సమితిచే నిర్దిష్టమయిన స్థలమునకు మార్పింపజేయవలయును.

179. స్వంత సంతలను మూయుటకు అధికారము:

పంచాయతీ సమితి లేక ఆ విషయములో అతనిచే క్రమముగా అధికార మియ్యబడిన ఏ ఆఫీసరు ఏ సంత నైనను మూసివేయవచ్చును,

(a) సంత పంచాయతీ కాని ప్రదేశములోనిదై యుండి లేక పంచాయతీ ప్రదేశములోనిది యైన యెడల, అది బ్లాక్ లెవెల్ సంతగా తరగతింపబడి, ఏ లైసెన్సుకొరకు దరఖాస్తు పెట్టబడిన దాని విషయములో; లేక

(b) పంచాయతీ సమితివల్ల దాని లైసెన్సు నిరాకరింపబడిన, ఆపివేయ బడిన దాని విషయములో; లేక

(c) ఈ చట్టముయొక్క నిబంధనలకు వ్యతిరేకముగా ఉంచబడు లేక తెరువబడియుండు దాని విషయములో.

180. స్వంత సంతలను పెట్టుటకు స్వంత వ్యక్తుల హక్కుల సేకరణ:

(1) ఒక పంచాయతీ సమితి, పంచాయతీకాని ప్రదేశములోని ఏ స్థలము లోను స్వంత సంతను పెట్టుటకు లేక పంచాయతీ ప్రదేశములోని ఏ స్థలములో బ్లాక్ లెవెల్ సంతగా తరగతింపబడిన స్వంత సంతను పెట్టుటకు, వాటిలో రుసుము విధించుటకు ఏ వ్యక్తియొక్క హక్కులను సేకరించవచ్చును. 1894వ భూమి సేకరణ చట్టముక్రింద సేకరణ జరుగును. అట్టి చట్టము పనుల కొరకు, అట్టి హక్కులు భూమిగా పరిగణింపబడును.

(2) అట్టి ఆస్తి విషయములో చెప్పిన చట్టము క్రింద పంచాయతీ సమితిచే యివ్వబడు పరిహారము, మరియు దానిని సేకరించుటలో తగులుబాటు అయిన ఏయితర ఖర్చులు చెల్లించిన మీదట, స్వంత సంత పెట్టుటకు దానిలో రుసుము విధించుటకు అట్టి వ్యక్తియొక్క హక్కులు పంచాయతీ సమితిలో చేరును.

181. 171వ సెక్షనుక్రింద ఉత్తరువుల మీద అప్పీలు:

171 వ సెక్షనుయొక్క (3) వ సబ్ సెక్షను క్రింద పంచాయతీ సమితి యొక్క ఉత్తరువువల్ల ఏ వ్యక్తియైనను నష్టపడినచో, అతడు అట్టి ఉత్తరువు మీద రాష్ట్ర ప్రభుత్వమునకు అప్పీలుచేయును. అట్టి అప్పీలు పరిష్కారము తేల కుండగా రాష్ట్రప్రభుత్వము వారికి యుక్తమవి తోచినరీతిని, అప్పీలు చేసిన ఉత్తరువు అమలు ఆపుదల చేయవచ్చును.

182 కుష్టురోగులు మొదలైనవారిని సంతలనుండి తరిమివేయుటకు పని పాడుచేయువారిని తరిమి వేయుటకు విధి:

పంచాయతీ కాని ప్రదేశములో ఈ సంత, బ్లాక్ లెవెల్ సంతగా తరగతింప బడిన పంచాయతీ ప్రదేశములో సంత ఆధీనములో వుంచుకొన్న వ్యక్తి, కుష్టు రోగముతో, ఏ హానికరమైన అంటురోగములతో బాధపడు ఏ వ్యక్తిని దాని లోనికి ప్రవేశమును ఆపుట, దానినుండి తరిమి వేయును. మరియు అతడు, అందులో అల్లరిచేయువానిని దానినుండి తరిమివేయవచ్చును.

183. రాజవీధులలో అమ్మకము నిషేధింపు:

పంచాయతీ సమితి నిర్వాహణాధికారి, పంచాయతీ సమితి మంజూరుతో, బహిరంగ నోటీసుద్వారా; ఏ రాజవీధి, స్థలము, దాని భాగములో, మీద ఏ జంతువులు, వస్తువుల అమ్మకము, అమ్మకమునకు బయట నిషేధింపు, లైసెన్సు యిచ్చుట లేక క్రమపరచుట చేయును.

183 (ఎ) వదలబడినది.

184. (బి) స్థలములు, సంతయా కాదా అనువిషయముపై తగాయిదాల తీర్పు:

ఆహార పదార్థములు, దుస్తులు, జీవజంతువులు, కోళ్ళు యితర జంతువుల పరికరములు, నూలు, కొబ్బరి, యితర పారిశ్రామిక పంటల పరికరములు, ఏ యితర ముడి, తయారు కాబడ్డ వస్తుపరికరములను అమ్ముటకు, కొనుటకు ప్రజలు గుమిగూడు ఏ స్థలము సంతయా కాదా అను ఒక సమస్య ఏర్పడినచో, ఆ యా పంచాయతీ సమితి రాష్ట్ర ప్రభుత్వమునకు ఆ విషయమును పరిష్కారమునకు పంపును. రాష్ట్ర ప్రభుత్వపు ఆ సమస్య తీర్పు ఆఖరుది.

## బండ్లు నిలుచు స్థలములు

184. బండ్లు నిలుచుటకు బహిరంగ స్థలముల ఏర్పాటు:

(1) పంచాయతీ కాని స్థలములలో పంచాయతీ సమితి బహిరంగ భూమి మీద ఆగు స్థలములు, మరియు బళ్లు నిలుచు స్థలములు నిర్మించుట, ఏర్పాటు చేయుట మరియు నిర్వహించుట చేయవచ్చును. వాటిని ఉపయోగించి నందులకు రుసుము విధింపవచ్చును.

పంచాయతీ సమితి—

(a) దానికి యుక్తమని తోచునట్టి, యాజమాన్యముక్రింద ఏ అట్టి రుసుము వసూళ్లను ఉంచవచ్చును; లేక

(b) ఒక్కమారుగా మూడు సంవత్సరములు దాటకుండు కాలమునకు, దానికి యుక్తమని తోచు షరతులు, నిబంధనలమీద ఏ అట్టి రుసుము వసూలు యితరులకు అప్పచెప్పవచ్చును.

(2) అట్టి స్థలము ఉపయోగముకొరకు పంచాయతీ సమితిచే నిర్ణయింపబడ్డ ఏ రుసుముయొక్క స్టేట్‌మెంటును ప్రాంతీయభాషలో దాని ప్రాముఖ్య భాగములో ఉంచబడును.

వివరణ : ఈ చట్టముయొక్క పనులకొరకు, 1939 వ మోటారు వాహనముల చట్టము అర్థముక్రింద మోటారు వాహనములతో సహా తీసుకొనుపోవు బండ్లు, జంతువులు నిలుచు స్థలముకూడ బండ్లుఆగు స్థలము అర్థములో చేరియున్నది.

185. బహిరంగ స్థలము లేక రాజవీధిప్రక్కల బండ్లు ఆగు స్థలము మొదలైనవాటిగా ఉపయోగించుట నిషేధింపు :

ఒక బహిరంగ భూమిమీద ఆగు స్థలము, నిలకడ స్థలము లేక బండ్లు ఆగు స్థలమును పంచాయతీ సమితి ఏర్పాటు చేసినప్పుడు, నిర్వహణాధికారి, పంచాయతీ సమితి అనుమతితో ఏ బహిరంగ స్థలము లేక పంచాయతీ సమితిలో చేరిన స్థలము లేక వీధి అయిన ఏ రాజవీధి ప్రక్కలకు, దానినుండి నిర్ణయింపబడిన దూరములో ఏ వ్యక్తిచేత అదే పనికి ఉపయోగించుట నిషేధింపవచ్చును.

186. బండ్లు ఆగు స్థలమునకు రుసుము మొదలైనవాటి వసూలు :

(1) వాహనము లేక జంతువు విషయములో 184 వ సెక్షనుయొక్క (1) వ సబ్ సెక్షనుక్రింద విధింపబడు రుసుము కోరినప్పుడు చెల్లింపక పోయినచో, దానిని వసూలు చేయుటకు క్రమముగా అధికారమివ్వబడిన వ్యక్తి, అట్టి వాహనము లేక జంతువు లేక ఆ వాహనములోని ఏ భాగమునైనను పట్టుకొని దానిని అతని ఆధీనముతో యుంచవచ్చును.

(2) అట్టి రుసుము, అట్లు పట్టుకొనుటవలన, ఉంచబడుటవల్ల తగులు బాటు అయిన ఖర్చులతో సహా పన్నెండు గంటల కాలములో చెల్లింపబడక యుండినచో, పై చెప్పినరీతిగా అధికారమివ్వబడిన వ్యక్తి, 1839 వ అద్దె రెవిన్యూ అమ్మకముల చట్టముక్రింద జప్తు చేయబడిన ఆస్తిని, అమ్ముటను అధికార మివ్వబడిన దగ్గరనున్న పబ్లిక్ ఆఫీసరుకు, పై చెప్పిన రీతిని పట్టుబడ్డ వాహనము, జంతువు లేక యితర ఆస్తిని వెంటనే పంపును.

(3) అట్టి ఆఫీసరు వెంటనే ఒక నోటీసును, పట్టుబడ్డ వ్యక్తి అస్తి యజమానికి లేక యజమాని తెలియకపోయినచో లేక చుట్టుప్రక్కల నివసించక పోయినచో, అది పట్టుబడ్డ కాలమునకు అట్టి ఆస్తిని ఆధీనములో యుంచుకొనిన వ్యక్తికి యిచ్చును. అతడు కానరాక పోయినయెడల, అందిన తారీకునుండి ఆది వారము మినహాయించి రెండుదినములు గడచిన తరువాత టాం టాం వల్ల ప్రచురించును లేక అట్టి నోటీసు ఆ విధముగా ప్రచురించిన తరువాత అతడు ఆ ఆస్తిని నోటీసులో నిర్దిష్టమయిన స్థలమువద్ద వేలము ద్వారా అమ్మును.

(4) అమ్మకమునకు ముందు ఏ కాలములోను నోటీసు యివ్వబడిన వ్యక్తి లేక పట్టుబడిన ఆస్తి యజమాని, రుసుమువల్ల రాబడు మొత్తము, దానిని చెల్లింపకపోవుటవల్ల, ఆస్తి పట్టుకొనుటవల్ల ఉంచబడుటవల్ల తగులబాటు అయిన అన్ని ఖర్చులు అట్టి ఆఫీసరునకు యిచ్చినచో, పట్టుబడిన ఆస్తి వెంటనే విడుదల కాబడును.

(5) అట్టి అఫీసరుకు ఏదియు యివ్వనప్పుడు, అతడు ఆ ఆస్తిని లేక దాని చాలినంత భాగమును వేలముద్వారా అమ్మి, ఆస్తి పట్టుకొనుటకు అమ్ముటకు తగులుబాటు అయిన రుసుము, ఖర్చులవల్ల రావలసిన మొత్తము చెల్లించుటకు, అమ్మగా వచ్చినదానిని ఉపయోగించి, పట్టుకొను కాలములో ఆస్తి ఎవరి ఆధీనములో యున్నదో అట్టివానికి అమ్మకము అయిన తరువాత దాని రాబడి పై చెప్పిన రీతిగా వుపయోగించిన తరువార మిగిలియుండు ఆస్తి లేక ధనమును యిచ్చివేయును.

187. బహిరంగ బండి ఆగు స్థలములకు లైసెన్సు:

పంచాయతీ కాని ప్రదేశములో ఏ వ్యక్తి అతడు పంచాయతీనుండి ఆ విధముగా చేయుటకు ఒక లైసెన్సు పొందనిదే క్రొత్త స్వంత బండ్లు అగు స్థలమును తెరచుటగాని లేక స్వంత బండ్లు ఆగు స్థలమును తెరచి ఉంచుటను సాగించుటగాని చేయగూడదు.

(2) అట్టి లైసెన్సుకు దరఖాస్తు, అట్టి స్థలము బండ్లు ఆగు స్థలముగా తెరువబడుటకు ముందు లేక లైసెన్సు కోరబడిన సంవత్సరము ప్రారంభించుటకు ముందు ఆరువారములకు తక్కువ కాకుండా, లైసెన్సు కోరబడిన స్థలముయొక్క యజమానిచేత చేయబడును.

(3) పంచాయతీ సమితి ఇంతకుముందే న్యాయసమ్మతముగా స్థాపిత మైన స్వంతబండ్లు ఆగు స్థలముల విషయములో తప్పనిసరిగను, కొత్త బండ్లు ఆగు స్థలముల విషయములో దాని విచక్షణతోను దరఖాస్తు పెట్టిన లైసెన్సును

మంజూరు చేయును. అది పంచాయతీ సమితికి యుక్తమనితోచు విచారణ తనిఖీ నియమములు, రక్షణ షరతులకు కట్టుబడి యుండును; లేక పంచాయతీ సమితి క్రొత్త స్వంత బండ్లు అగు స్థలమునకు అట్టి లైసెన్సు మంజూరు చేయుటను నిరాకరించవచ్చును. ఏ పంచాయతీ సమితి, దాని షరతుల నుల్లఘించి నందులకు ఈ సెక్షను క్రింద మంజూరు కాబడిన లైసెన్సును ఎప్పుడయినను ఆపుదల లేక రద్దుకావించ వచ్చును. పంచాయతీ సమితి నిర్దిష్టమైన తారీఖు నుండి అమలులోనికి వచ్చుటకు లైసెన్సు షరతులను మార్పుకూడ చేయవచ్చును.

(4) ఈ సెక్షను క్రింద లైసెన్సు మంజూరు కాబడినపుడు, నిరాకరింపబడినపుడు, ఆపుదలచేయబడినప్పుడు, రద్దు పరచబడినపుడు లేక మార్చుచేయబడినపుడు పంచాయతీ సమితి అట్టి మంజూరు, నిరాకిరణ, ఆపుదల, రద్దు లేక నోటీసును ఆ ప్రదేశపు ముఖ్యమైన మాతృభాషలో లైసెన్సు కోరబడిన, పొందబడిన స్థలమునకు ప్రదేశమువద్ద, దగ్గర ప్రాముఖ్యమైన స్థలములో అతికింపబడుటకు ఏర్పాటు చేయును.

(5) ఈ సెక్షను క్రింద మంజూరు అయిన ప్రతి లైసెన్సుమీద, సంవత్సరమునకు రెండు నూర్ల రూపాయలు దాటకుండా, పంచాయతీ సమితి రుసుము విధించవచ్చును.

(6) సెక్షను క్రింద మంజూరయిన ప్రతి లైసెన్సు సంవత్సరము ఆఖరున అంత్యమగును.

188. వదలబడినది.

## కసాయి యిళ్ళు

189. కసాయి యిళ్ళు ఏర్పాటు :

(1) పంచాయతీ కాని స్థలములలో ప్రతి పంచాయతీ, సరిపోవు సంఖ్య గల స్థలములను బహిరంగ కసాయి యిళ్ళుగా ఉపయోగపడుటకు ఏర్పాటు చేయును.

(2) బహిరంగ కసాయి యిళ్ళ ఉపయోగము కొరకు, పంచాయతీ సమితి అద్దె రుసుమును విధించవచ్చును.

190. పంచాయతీ సమితి, బహిరంగ కసాయి యిళ్ళు కాకుండా యితర స్థలములలో పశువులను మొదలైన. వాటిని చంపుట నిషేధించ వచ్చును.

(a) నిర్వహణాధికారి వ్రాతపూర్వకమైన అనుమతి లేకుండ లేక అట్టి అనుమతిని అనుసరించకుండగా ఏ వ్యక్తి, ఏ పశువులు, గుఱ్ఱములు, గొఱ్ఱెలు, మేకలు; పందులను పంచాయతీ సమితి ఏర్పాటు చేసిన బహిరంగ కసాయియిల్లు వద్ద కాకుండ యితర పంచాయతీ కాని ప్రదేశములో నిర్దిష్టమయిన ఏ స్థలములలో చంపుట, చంపుటకు అనుమతి యిచ్చుట లేక ముక్కలు క్రింద కోయుట లేక చర్మము వలుచుట లేక ముక్కలు క్రింద కోయుటకు చర్మము వలుచుటను అనుమతి యిచ్చుట చేయకూడదు. కాని అమ్మకమునకు కాకుండ, స్వంత ఉపయోగమునకు లేక మత సంబంధమయిన క్రియలు చేయుట అలవాడు అయిన స్థలములో అట్టి క్రియలు చేయుటలో జంతువులను చంపుట ఈ సెక్షనులోని దేదియు నిషేధించినట్లు ఎంచబడకూడదు.

ఇంకను, అట్టి ప్రకటన ఏదియు ఈ క్రింది ప్రకటన లేదీనుండి అరవై దినములవరకు అమలులోన్కికి రాదు:

(b) నిర్వహణాధికారినుండి పొందిన లైసెన్సును అనుసరించకుండగా లేక అట్టి లైసెన్సు లేకుండగా ఏ వ్యక్తి, ప్రజలకు అమ్మటకు, ఏ పశువులు, గుఱ్ఱములు, గొఱ్ఱెలు, మేకలు లేక పందులను పంచాయతీ సమితి కాని నిర్దిష్టమయిన ప్రదేశములో చంపుట లేక చంపుటకు అనుజ్ఞయిచ్చుట చేయకూడదు.

191. పండుగ దినములలో, కార్యములలో జంతువులను చంపుట:

పంచాయతీ సమితి నిర్వహణాధికారి, పండుగ కార్యముల సమయములలో లేక ప్రత్యేక కార్యముగా అతనికి యుక్తమనితోచు పంచాయతీ కాని ప్రదేశముల లోని స్థలములలో ఏ జంతువు చంపబడుటకు అనుమతించును.

192. ప్రభుత్వ స్థలములు మినహాయింప బడినవి:

189, 199 సెక్షనులలో చెప్పబడిన నిబంధనలు, సెక్షన్లలో ఉదహరించిన పనులకు ప్రభుత్వముచే ఉపయోగించబడు స్థలములకు అనువర్తించవు.

## పరిశ్రమలు, కార్ఖానాలు

193. లైసెన్సులేకుండా అట్టి స్థలములు ఉపయోగింపబడుటకు వీలు కాని కార్యములు;

(1) పంచాయతీ సమితి నిర్వహణాధికారి జారీచేసిన లైసెన్సు లేకుండ, అట్టి లైసెన్సులో నిర్దిష్టమయిన షరతుల ననుసరించకుండగా పంచాయతీ కాని స్థలములో ఉన్న లేక ప్రకటనలో నిర్దిష్టమయిన పంచాయతీ కాని ప్రదేశములో ఉన్న ఏ స్థలము, VIIవ షెడ్యూలులో నిర్దిష్టమయిన ఏ ఒకటి లేక ఎక్కువ పనులకు ఉపయోగింపబడకూడదు అని పంచాయతీ సమితి ప్రకటించును.

కాని అట్టి ప్రకటన ఏదియు ప్రకటన తేదీనుండి 60 దినములవరకు అమలులోనికి రాదు.

(3) అట్టి ప్రతి స్థలము యొక్క యాజమాని లేక ఆక్రమణదారు, అట్టి ప్రకటన ప్రచురింపబడిన 30 దినములలో, అట్టి పనికి ఆ స్థలము ఉపయోగము కొరకు లైసెన్సు పొందుటకొరకు పంచాయతీ సమితి నిర్వహణాధికారికి దరఖాస్తు పెట్టును.

నిర్వహణాధికారి, ఉత్తరువు వల్ల అతనికి యుక్తమని తోచు షరతుల నిబంధనల క్రింద లైసెన్సును మంజూరు చేయవచ్చును లేక దానిని మంజూరు చేయుటకు నిరాకరించ వచ్చును.

(4) ప్రతి లైసెన్సు సంవత్సరాంతమున ఆఖరగును. కాని ప్రత్యేక కారణములకు నిర్వహణాధికారి అది ముందు తేదీకి ఆఖరు కావలయునని అనుకొనిన యెడల అది అందులో నిర్దిష్టమయిన అట్టి ముందు తేదీకి ఆఖరగును.

(5) అట్టి లైసెన్సులు పునః సృష్టికొరకు దరఖాస్తులు, ప్రతి సంవత్సరము ఆఖరుకు ముందు 30 దినములకు తక్కువ కాకుండా పెట్టబడును. కొత్తగా తెరువబడు స్థలముల లైసెన్సుల కొరకు దరఖాస్తులు, అవి తెరువబడుటకు ముందు 30 దినములకు తక్కువకాకుండ పెట్టబడును.

194. ఆవిరి లేక యితర శక్తిని ఉపయోగించవలసిన కార్ఖానా, యంత్ర స్థలము లేక పనిచేయు స్థలము నిర్మాణము, స్థాపన లేక ప్రవేశపెట్టుటకొరకు దరఖాస్తు చేయుట:

(1) (a) పంచాయతీ కాని ఏ ప్రదేశములో, ఆవిరిశక్తి నీటిశక్తి లేక యితర యంత్ర శక్తి లేక విద్యుత్ శక్తి ఉపయోగింప వలెననుకొను ఏ కార్ఖానా, యంత్ర స్థలము లేక పనిచేయు స్థలము నిర్మించుట లేక స్థాపించుట తలపెట్టిన—

(b) పంచాయతీ కాని ప్రదేశములోని ఏ స్థలములో పై చెప్పిన రీతిగా ఆవిరి, నీరు లేక యితర శక్తివల్ల నడుపబడు యంత్ర సామగ్రి లేక తయారు చేయు యంత్రములను స్థాపన చేయుటకు తలపెట్టిన. ఏ వ్యక్తి, అట్టి నిర్మాణము. స్థాపన లేక ప్రవేశ పెట్టుట ప్రారంభించుటకు ముందు పంచాయతీ సమితికి వ్రాత పూర్వకముగా చేయదలచుకొనిన పనిని ప్రారంభించుటకు అనుమతి కొరకు దరఖాస్తు చేయును.

(2) దరఖాస్తు ఈ క్రిందివాటి వెంబడి యుండును.

(i) రాష్ట్రీ ప్రభుత్వము ఈ విషయములో చేసిన నిబంధనలవల్ల నియమితమైన పద్ధతిలో తయారు చేయబడిన కార్ఖానా, యంత్ర స్థలము, పని స్థలము లేక ఆవరణయొక్క ప్లాను, మరియు

(ii) ఇందు విషయము చేయబడిన ఉప విధులవల్ల పంచాయతీ కోరు శక్తి, యంత్ర సామగ్రి యంత్రములు (ప్లాంటు) లేక ఆవరణలు గురించిన వివరములు.

(3) పంచాయతీ సమితి దరఖాస్తు పొందిన తరువాత ఎంత వీలైన అంత తొందరగా.

(a) దరఖాస్తు పెట్టిన అనుమతి. కేవలముగా లేక అది విధించుటకు యుక్తమని తలచుకొన్నట్టి నిబంధనలకు బద్ధమై మంజూరు చేయవచ్చును, లేక

(b) చుట్టుప్రక్కల జన సాంద్రతవల్ల అట్టి నిర్మాణము, స్థాపన లేక ప్రవేశ పెట్టుట ఆక్షేపింపదగినదని లేక అది ఉపద్రవము కలుగజేయునట్టిదనియు అభిప్రాయపడినచో అనుమతిని నిరాకరించును.

(4) సబ్ సెక్షను (3) క్రింద అనుమతి మంజూరు చేయుటకుముందు, పంచాయతీ సమితి

(a) పంచాయతీ కాని ప్రదేశముపై జూరిస్ డిక్షనుగల 1911వ ఇండియన్ ఫ్యాక్టరీల చట్టముక్రింద నియమితమైన ఫ్యాక్టరీల ఇన్ స్పెక్టరు యొక్క అనుమతిని పొందును లేక అట్టి ఇనస్పెక్టరుకన్న ఎక్కువమంది యున్న యెడల, ఈ క్రింది వాటికి చెందిన ఫ్యాక్టరీ, వర్కుషాపు, పని స్థలము లేక ఆవరణలుయొక్క ప్లానును గురించి రాష్ట్రీ ప్రభుత్వము ఈ విషయములో సాధారణ లేక ప్రత్యేక ఉత్తరువువల్ల నియమితమైన ఇనస్పెక్టరు యొక్క అనుమతి పొందును.

(i) గాలి, వెలుతురు కావలసినంత ఏర్పాటు,

(ii) గదుల పెలుపులయొక్క ఎత్తు, కొలతలు సరిపోవుట,

(iii) అగ్ని ప్రమాద విషయములలో ఉపయోగించవలసిన బయటికి పోవు మార్గములు తగియుండుట, మరియు

(iv) రాష్ట్ర ప్రభుత్వముచే చేయబడిన నిబంధనలచే నియమితమైనట్టి యితర విషయములు, మరియు

(b) సంప్రదింపులు మరియు దరఖాస్తులో నిర్దిష్టమయిన కార్యము కొరకు ఫ్యాక్టరీ, వర్కుషాపు, పని స్థలము లేక ఆవరణయొక్క స్థలము తగియుండుటను గురించి పంచాయతీ సమితి అట్టి ఆఫీసరును నియమించినపుడు, జిల్లా ఆరోగ్య అధికారి యొక్క మరియు యితర విషయములలో జిల్లా వైద్య అధికారి ఉద్దేశముతో ఏకీభవించును.

195. ఆవిరివల్ల లేక యితర శక్తివల్ల కలుగు ఉపద్రవము తగ్గించుటకు ఉత్తరువులు యిచ్చుటకు పంచాయతీ సమితి అధికారము:

(1) ఆవిరిశక్తి, నీటిశక్తి, యితర యంత్రశక్తి లేక విద్యుచ్ఛక్తి ఉపయోగింపబడు ఏ పంచాయతీ కాని ప్రదేశములో ఏ ఫ్యాక్టరీ, వర్కుషాపు పని స్థలములో ఒకరకపు వంటచెరకు ఉపయోగించుటవల్ల లేక పుట్టబడిన ఒక రకపు శబ్దము లేక కంపనమువల్ల ఉపద్రవము కలిగినచో, పంచాయతీ సమితి దానికి యుక్తమని తోచిన ఆ కార్యము కొరకు నిర్దిష్టము కాబడు సబబైన కాలములో ఉపద్రవము తగ్గించుటకు ఉత్తరువులు యివ్వవచ్చును.

(2) అట్టి ఉత్తరువులు అనువర్తించుటలో బుద్ధిపూర్వకమైన లోపమున్న ఎడల లేక అట్టి తగ్గింపు అసంభవమైన యెడల, పంచాయతీ సమితి —

(a) ఉపయోగించిన ఆ రకపు వంటచెరుకును నిషేధించవచ్చును, లేక

(b) ప్రొద్దుట 9-30 గంటలనుండి సాయంత్రము 5-30 గంటల మధ్య ఫ్యాక్టరీ, వర్కుషాపు లేక పనిచేయు స్థలము పని చేయుటను నిషేధించుట మూలముగా శబ్దము లేక కంపనము నియమితము చేయవచ్చును.

196. పంచాయతీ సమితికి ఉత్తరువులు మంజూరు చేయుటకు లేక విధానములు తెల్పుటకు రాష్ట్ర ప్రభుత్వపు అధికారము:

రాష్ట్ర ప్రభుత్వము, సాధారణముగా లేక ఏ ప్రత్యేక విషయములో, 194 సెక్షను క్రింద లేక 195వ సెక్షను క్రింద తీసికొనిన లేక తీసికొనుట వదలబడిన ఏ చర్య విషయములో వారికి యుక్తమని తోచినట్టి ఉత్తరువు యిచ్చుటగాని లేక విధానములు తెల్పుటగాని చేయును.

197. ఫ్యాక్టరీ, వర్కుషాపు లేక పని స్థలములో ప్రవేశించుటకు నిర్వహణాధికారి అధికారము:

(1) పంచాయతీ సమితి నిర్వహణాధికారి లేక ఈ విషయములో అతనిచే

అధికార మివ్వబడిన ఏ వ్యక్తి, పంచాయతీకాని స్థలములో యున్న ఏ ఫ్యాక్టరీ, వర్కుషాపు లేక పని స్థలములో ప్రవేశించ వచ్చును.

(a) సూర్యోదయ సూర్యాస్తమయ సమయముల మధ్య ఏ కాలములో నైనను ;

(b) ఏ పరిశ్రమయైన జరుగుచుండునపుడు ఏ కాలములో నైనను ; మరియు

(c) 194వ సెక్షను లేక 195 సెక్షనుకు వ్యతిరేకముగా అపరాధము జరుగుతున్నదని అతడు నమ్ముటకు కారణము కనపడినప్పుడు, రాత్రి లేక పగలు ఏకాలములోనైనను.

(2) ఈ సెక్షను క్రింద చలాయించబడిన అధికారములవల్ల లేక ఈ సెక్షను క్రింద దారికలుగ జేయుటకు కావలసిన ఎట్టిశక్తి ఉపయోగించుట వలన తప్పని సరిగా కలిగిన నష్టము లేక ఆ సదుపాయమునకు ఏ వ్యక్తి మీద ఎట్టి హక్కు కలుగనేరదు.

## బహిరంగముగా జనులు వాడుకగా పోవు స్థలముల (పబ్లిక్ రిసార్టు) చట్టము అనువర్తింపు

198. 1888వ పబ్లిక్ రిసార్టు స్థలముల చట్టము స్థానిక ప్రదేశములకు పొడిగింపు :

1888వ పబ్లిక్ రిసార్టు స్థలముల చట్టము లోని నిబంధనలు వ్యతిరేకముగా యున్నప్పటికి, ఆ చట్టమును రాష్ట్రప్రభుత్వము పంచాయతీ కాని ప్రదేశమునకు పొడిగించిన,

(a) లైసెన్సు కొరకు దరఖాస్తు యివ్వబడిన, చట్టము క్రింద లైసెన్సు మంజూరు లేక నిరాకరణ చేయగల అధికారి, పంచాయతీ సమితి నిర్వహణాధికారి అయి యుండును ; మరియు

(b) ఆ చట్టము క్రింద లైసెన్సు మంజూరుచేయు, నిరాకరించు, రద్దు చేయు లేక అపుదలచేయు ఉత్తరువు మీద అప్పీలు పంచాయతీ సమితికి పెట్టబడును.

(c) వదలబడినది.

# 5 వ భాగము

## 7 వ అధ్యాయము

## సహాయకరమైన చట్టములు, అపరాధములు

199. నిబంధనలు మరియు షెడ్యూళ్ళు నిబంధనలుచేయుటకు రాష్ట్ర ప్రభుత్వపు అధికారము :

రాష్ట్ర ప్రభుత్వము, వాటికి విరుద్ధముకాని ఈ చట్టములోని అన్నికార్యములను లేక కొన్ని కార్యములను నిర్వర్తించుటకు నిబంధనలను చేయవచ్చును. నమూనా వుండవలయునని వారనుకొనిన చర్యకు వారు నమూనాలు నిర్ణయించును.

(2) ప్రత్యేకముగా మరియు వెనుక చెప్పిన అధికారముయొక్క సాధారణత్వమునకు భంగము కాకుండ, వారు నిబంధనలను ఈ క్రింది వాటి విషయములలో చేయుటకు అధికారము కలిగియున్నారు.

(a) స్పష్టముగా కావలసిన లేక ఈ చట్టమువల్ల నియమింపబడుటకు వీలయిన విషయము లన్నిటిలోను,

(b) మరియు (c) వదలబడినవి.

(d) అట్టి పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తు సేకరించగలిగిన ఆస్తికి సంబంధించిన లేక పంచాయతీ సమితిలో లేక జిల్లా పరిషత్తులో చేరిన లేక వాటికి చెందిన ఆస్తి, అమ్మకము, తనఖా, కౌలు, వినిమయము లేక యితరముగా బదిలాయింపబడుటకు సంబంధించిన షరతుల విషయములోను ;

(e) ప్రావిడెండు సంస్థలు పనిచేయుటలోను ;

(f) వైద్యసహాయము కొరకు పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తు నిధినుండి చెల్లింపబడు సహాయరూపేణా గ్రాంటులకు సంబంధించిన షరతుల విషయములలోను లేక సహకార యిళ్ళ సంఘములకు గ్రాంటులు, అప్పులు యిచ్చుటకు సంబంధించిన షరతుల విషయములోను ;

(g) పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తు పాఠశాలలు తెరచుట, నిర్వహించుట, యాజమాన్యము వహించుట మరియు తనిఖీ విషయములోను ;

(h) పంచాయతీ సమితులు లేక జిల్లా పరిషత్తులు మరియు రాష్ట్ర ప్రభుత్వము లేక వారి ఆఫీసర్లు మధ్య జరుగు ఉత్తర ప్రత్యుత్తరములు జరుపు మధ్యతరగతి ఆఫీసులు ఏమైన యున్నయెడల వాటి విషయములోను ;

(h) పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తు ఖర్చుమీద పూర్తిగా లేక కొంత నిర్మింపబడు పనులకు ప్లానులు, ఎస్టిమేటులు తయారుచేయు విషయము లోను, మరియు ఎస్టిమేట్లకు వృత్తిరీత్యా లేక పరిపాలనా మంజూరు యిచ్చుటకు పంచాయతీ సమితులు, జిల్లా పరిషత్తులు లేక రాష్ట్ర ప్రభుత్వపు ఆఫీసర్ల అధికారము విషయములోను;

(i) పంచాయతీ సమితులు లేక జిల్లా పరిషత్తులు ఉంచవలసిన లెక్కల విషయములోను, అట్టి లెక్కల తనఖీ, ప్రచురణలోను, పన్నులు యిచ్చు వారు ఆడిటర్లముందు హాజరగుటకు పుస్తకములు ఓచర్లు తనిఖీ చేయుటకు అందులో వ్రాయబడిన లేక వదలబడిన అయిటముల మినహాయింపు తీసికొనుటకు షరతుల విషయములోను;

(J) రాబడి ఆదాయము రిటర్నులు ఎష్టిమేట్ల విషయములోను, రిటర్నులు స్టేట్‌మెంట్లు విషయములోను, పంచాయతీ సమితులు లేక జిల్లా పరిషత్‌లు దాఖలు చేయు రిపోర్టుల విషయములోను;

(k) ఈ చట్టము ఉద్దేశములను నిర్వర్తించుటలో రాష్ట్ర ప్రభుత్వపు ఆఫీసర్లు పంచాయతీ సమితులకు లేక జిల్లా పరిషత్‌లకు సలహా యిచ్చి, సహాయముచేయు పద్ధతి విషయములోను;

(l) పంచాయతీ సమితి లేక జిల్లా పరిషద్ సభ్యులచే అధ్యక్షుని ప్రశ్నలడుగుట విషయములోను;

(m) వదలబడినది.

(n) పంచాయతీ సమితులు లేక జిల్లా పరిషత్‌లచేత లేక తరుపున చేయబడు కాంట్రాక్టుల షరతులు , పద్ధతి విషయములోను;

(o) అయిటములను ఒప్పుకొనక పోవుట, సర్‌ఛార్జి చేయుటకు మరియు ఒప్పుకొనని లేక సర్‌ఛార్జి చేసిన మొత్తములను వసూలు చేయుటకు ఆడిటర్ల అధికారముల విషయములోను,

(p) పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ యొక్క మంజూరు అయిన బడ్జెట్‌లో వ్రాసిన ఎల్లాట్ మెంటులను ఒక 'హెడ్' నుండి మరియొక దానికి బదలాయింపు విషయములోను;

(q) విచారణ జరుపుటకు, సాక్షులను పిలిపించుటకు, విచారణచేయుటకు, దస్తావేజులు, ఆడిట్ విచారణ పై విచారణకు సంబంధించిన అన్ని

విషయములను దాఖలు చేయమని నిర్బంధించుటకు అధికార మివ్వబడిన ఆఫీసర్లు, ఆడిటర్లు, తనిఖీచేయు పైవిచారణచేయు ఆఫీసర్ల అధికారముల విషయములోను.

(r) ఈ చట్టము క్రింద లేక ఏయితర చట్టము క్రింద విధింపబడు లేకపొందు వృత్తిపన్ను, యితర పన్నులు లేక ఆదాయము రాబడి, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రములోని ఆంధ్రప్రాంతములోని స్థానికపు అధికారుల మధ్య పంచుటను సరి చేయు విషయములోను; మరియు—

(s) ఈ చట్టము క్రింద అపరాధములు విచారించవలసిన మేజిస్ట్రేటుల తరగతి విషయములోను.

(3) ఏనిబంధననైన చేయునపుడు, రాష్ట్రప్రభుత్వము, వందరూపాయల వరకు పోవు అపరాధముతో, ఆ నిబంధన ఉల్లంఘింపు శిక్షింపబడునని, ఏర్పాటు చేయవచ్చును.

200. నిబంధనలను చేయు పద్ధతి ;

199వ సెక్షను క్రింద నిబంధనలను చేయు అధికారము ఈ క్రింది షరతు లకు బద్ధమై యుండును.

(a) నిబంధనలను డ్రాఫ్టు, ఉద్యోగ సంబంధమైన గెజిటులో ప్రచు రింప బడును.

(b) అట్టి ప్రచురణ అయిన ఆరు వారముల వరకు లేక రాష్ట్ర ప్రభుత్వము ఏర్పరచునట్టి తరువాత తేదీవరకు, అట్టి డ్రాఫ్టును ఏమియు చేయుటకు వీలులేదు.

(c) 199వ సెక్షను క్రింద చేసిన అన్ని నిబంధనలు ఉద్యోగ సంబంధ మైన గెజిటులో ప్రచురింపబడును.

అట్టి ప్రచురణ అయిన తరువాత అవి ఈ చట్టములో శాసింపబడునట్లు అమలులోనికి వచ్చును.

201. షెడ్యూళ్ళను సవరణ చేయుట, క్రొత్తవి చేర్చుట మరియు రద్దు చేయుటకు రాష్ట్రప్రభుత్వపు అధికారము, దానికి విధానము;

(1) 1,8 మరియు 9 షెడ్యూళ్ళు తప్ప, ఈ చట్టముకు ఏ షెడ్యూళ్ళను మార్పుచేయుచు, కొత్తవి చేర్చుచు లేక రద్దుచేయుచూ రాష్ట్రప్రభుత్వము నిబంధన లను చేయవచ్చును.

(2) పైచెప్పిన షెడ్యూళ్ళలో దేనికిని ఈ చట్టములోచేయు అన్ని సూచనలు, (1) వ సబ్ సెక్షను యిచ్చిన అధికారములను ఛలాయించుటలో ప్రస్తుతము సవరణ కాబడినట్టి షెడ్యూళ్ళకు సూచింపబడినట్లుగా భావింపబడవలెను.

(3) వదలబడనది.

201.A. 201వ సెక్షను క్రింద నిబంధనలు చేయు విధానము :

201 వ సెక్షను క్రింద చేయుటకు ఏర్పాటు చేయబడ్డ నిబంధనల యొక్క డ్రాఫ్టు, రాష్ట్ర శాసనాధికారుల రెండు 'హౌసు'ల వద్ద ఉంచబడును. రెండు హౌసులు డ్రాఫ్టును, మార్పులులేక క్రొత్తవి చేర్పుకు లేకుండ, లేక రెండు 'హౌసు'లు అనుమతించిన మార్పులు లేక క్రొత్తవి చేర్పుటకు, అనుమతించకుండ నిబంధన చేయబడవు ; కాని అట్టి అనుమతి యివ్వబడినప్పుడు, అది అనుమతింపబడిన నమోనాలో నిబంధనలు చేయబడవచ్చును. ఆ విధముగ చేయబడినట్టి నిబంధనలు ప్రకటింపబడిన తరువాత సంపూర్ణమైన అధికారములు కలిగియుండి అమలులోనికి వచ్చును.

## ఉ ప వి ధు లు

202. ఉపవిధులు చేయుటలో పంచాయతీ సమితి లేక జిల్లాపరిషత్ అధికారము :

పంచాయతీ సమితి లేక జిల్లాపరిషత్, ఈ చట్టమునకు లేక ఏ యితర న్యాయశాస్త్రమునకు భిన్నముకాని ఉపవిధులును ఈ క్రింది వాటికి చేయవచ్చును;

(1) ప్రత్యేకించి కావలసిన లేక ఉపవిధిక్రింద ఏర్పరుపబడుటకు ఈ చట్టము సమ్మతించు అన్ని విషయములు ఏర్పాటు చేయుటకు ;

(1) a వారికి నిర్ణీతమైన విధులను పంచాయతీ సమితి, జిల్లా పరిషత్ ఆఫీసరులు, ఉద్యోగు లందరు క్రమముగా నిర్వర్తించుటకు ఏర్పాటు చేయుటకు;

(2) ఈ చట్టము క్రింద పన్నులు, రుసుములు వసూలు చేయుకాలము, పద్ధతి క్రమపరుచుట ఏర్పాటు చేయుటకు;

(3) (ఎ) నీటి సరఫరా కొరకు బహిరంగ చెరువులు, నూతులు, కాలువలు వనుల యితర స్థలముల ఉపయోగము కొరకు;

(3) బహిరంగముగా స్నానము చేయుట, ఓడుగుట మొదలైనవాటిని క్రమపరచుట ఏర్పాటు చేయుటకు;

(4) పాయిఖానాలు, భూమి మీద మరుగు గదులు, బూడిద గుంటలు మరియు మురికి గుంటలు శుభ్రము చేయుట ఏర్పాటు చేయుటకు;

(5) పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్‌చేత వేయబడిన లేక వాటికి చెందు చుట్టూ చెట్లుగల విశాలమైన వీథులను చెట్లను సంరక్షించుటకు రాజవీథుల ప్రక్కన మొలుచు లేక దాని నానుకొనిన యితరములను సంరక్షించుటకు ఏర్పాటు చేయుటను;

(6) పార్కులు, తోటలు మరియు యితర బహిరంగ స్థలములు లేక పంచాయతీ సమితి లేక జిల్లా పరిషల్‌లో చేరిన స్థలములు, వాటిలోని రాకపోకలను క్రమపరచు, వాటిని ఒక రకమైన రాకపోకలకు విడిగా ఉంచుట లేక రాకపోకలకు వాటిని లేక వాటిలోని భాగములను మూసివేయుట కాకుండా, ఉపయోగమును క్రమపరచుట ఏర్పాటు చేయుటకు;

(7) విశ్రాంతి కొరకు లేక ఆహారము లేక పానీయము కొరకు జనులు వచ్చు హోటళ్ళు, నివసించు యిళ్ళు, భోజనయిళ్ళు, సత్రములు, విశ్రాంతియిళ్ళు, వలస పోవు వారి కొట్లు (ఎమిగ్రేషన్ డిపోలు), రెస్టారెంటులు, తినుబండార స్థలములు, కేఫ్‌లు, రిఫ్రెష్‌మెంటుగదులు, కాఫీశాలలు మరియు యితర ఆవరణలు క్రమపరుచుట ఏర్పాటు చేయుటకు;

(8) vii వ షెడ్యూలులో నిర్దిష్టమయిన ఏ ఉద్దేశములకు వుపయోగింపబడు స్థలములమీద దానిలో చేయు ఏ వ్యాపారము లేక తయారుచేయుట మీద ఆరోగ్యరక్షణ ఆధీనము, పై విచారణ ఏర్పాటు చేయుటకు ;

(9) (a) కసాయియిళ్ళు, చనిపోయిన జంతువుల చర్మము ఒలుచుట, ముక్కలక్రింద కోయుటకు ఉపయోగపడు స్థలములమీద ఆధీనముపై విచారణ;

(b) చంపు స్థలములమీద ఆధీనము పై విచారణ :

(c) పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తుచే ఏర్పాటు కాబడ లేక లైసెన్సు యివ్వబడ్డ ఏ కసాయి యింటివద్ద వ్యాపారము చేయు కసాయి వాళ్ళమీద ఆధీనము, పై విచారణ ఏర్పాటు చేయుటకు :

10. (a) బహిరంగ మరియు స్వంత సంతలు. కొట్లు, దానిలోని యితర స్థలముల తనిఖీ ఏర్పాటు చేయుటకు ;

(b) వాటి ఉపయోగమును, వాటి ఆరోగ్య సంరక్షణ పరిస్థితి అధీనమును క్రమపరచుచు ఏర్పాటు చేయుటకు ;

(c) కొలతవల్ల గాని, తూకమువల్ల గాని, లెక్కరూపముగా గాని లేక ముక్కలుగా గాని వస్తువుల అమ్మకము పద్ధతి నియమించుట ఏర్పాటు చేయుటకు ;

(d) నికరమైన బరువులు, త్రాసులు, కొలతలు నియమించి ఏర్పాటు చేయుట, ఇతరముల ఉపయోగమును ఆపుట ఏర్పాటు చేయుటకు ;

(e) సంతలలో వారి వృత్తి నవలంబించు బ్రోకర్లు, కమీషన్ ఏజంట్లు, తూకము వేయువారు, కొలత కొలుచువారలకు లైసెన్సులు యిచ్చుట, అధీనము కలిగియుండుట ఏర్పాటు చేయుటకు ;

(f) అనారోగ్యమైన మాంసము, చేపలు లేక ఆహారవస్తువులు అమ్మకము లేక అమ్మకమునకు తెరచియుంచుట నిలుపుదల, జనుల ఉపయోగము కొరకు ఉంచబడు లేక అమ్మబడుటకు ఉద్దేశింపబడిన వస్తువులు ఉంచబడిన కొట్లమీద మంచి తనిఖీ సేకరించుట, ఆరోగ్య రక్షణకు సంబంధించిన విషయములు క్రమపరచుట ఏర్పాటు చేయుటకు ;

(11) శవములు పరిష్కరించుటకు పాతిపెట్టు, తగులబెట్టు స్థలములు. యితర స్థలములు క్రమపరచుట ఏర్పాటు చేయటకు ;

(12) మనుష్యులు లేక జంతువుల ప్రమాదకరమైన జబ్బుల ఆపుదల ఏర్పాటు చేయుటకు ;

(13) నిర్బంధముగా టీకాలు వేయుట అమలు జరుపుటకు ఏర్పాటు చేయుటకు ;

(14) అగ్ని ప్రమాదములు ఆపుదల ఏర్పాటు చేయుటకు ;

(15) బహిరంగ వీధులు లేక పార్కులలో ప్రకటనలు నిషేధము క్రమపరచుట ఏర్పాటు చేయుటకు ;

(16) సాధారణముగా ఈ చట్టము అనువర్తించు ఏ ప్రదేశము యొక్క భద్రత, క్షేమము, పరిస్థితి, మంచి పరిపాలన, బాగుండుట, పొందుట మరియు ఈ చట్టములోని అన్ని కార్యములను నిర్వర్తించుట ఏర్పాటు చేయుటకు ;

కాని రాష్ట్రప్రభుత్వము అనుమతి లేనిదే, ఈ సెక్షనులోని దేదియు, పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్‌కు 1950 వ మదరాసు గ్రామపంచాయతీల చట్టముక్రింద పంచాయతీ చేయగల చట్టముల విషయములో ఏ పంచాయతీ స్థలమునకు ఉపవిధులు చేయుటకు అధికారమిచ్చినట్లుగా భావింపబడకూడదు.

203. ఉపవిధులు నుల్లంఘించినందులకు అపరాధము :

ఉపవిధి చేయుటలో, పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్, దాని నుల్లంఘించినందులకు ఈ క్రింది శిక్ష విధింపబడునని ఏర్పాటు చేయవచ్చును.

(a) ఏబది రూపాయలవరకు దాటు జరిమానా, మరియు ఉల్లంఘన సాగుతూ యున్నయెడల, మొదటి ఉల్లంఘనకు శిక్షింపబడిన తరువాత ఉల్లంఘన జరుగుతూఉన్న కాలములో ప్రతి దినమునకు పదిహేను రూపాయల చొప్పున పోవు జరిమానా, లేక

(b) అట్టి ఉల్లంఘన ఆపుచేయమని పంచాయతీసమితి లేక జిల్లా పరిషత్ యొక్క అధ్యక్షుడు లేక ఛైర్‌మన్ నుంచి నోటీసు అందిన తరువాత సాగుతూయున్న ఉల్లంఘన కాలములో ప్రతిదినమునకు పదిరూపాయల వరకు పోవు జరిమానా.

203-A వదలబడినది.

204. ఉపవిధులుచేయు విధానము :

ఉపవిధులను చేయుటకు లేక మార్పు చేయుటకు ముందు, పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్, చేయదలచుకొన్న ఉపవిధులు మరియు మార్పులు యొక్క డ్రాప్టు, అట్టి డ్రాప్టు ఏతారీకున లేక ఏతారీకు తరువాత విచారించుటకు తీసికొనబడునో అట్టి తారీకును నిర్దిష్టముచేయు నోటీసుతో సహా ప్రకటించును. మరియు ఉపవిధులు మార్పులు చేయుచు, ఆవిధముగ నిర్దిష్టమయిన తారీకుకు ముందు దానిలో యిష్టముఉన్న వ్యక్తిచేత అట్టి డ్రాప్టు విషయములో చేయబడు ఆక్షేపణ లేక సలహాను తీసికొని విచారించును.

205. రాష్ట్రప్రభుత్వముచే ఉపవిధులు సమ్మతింపబడుట :

ఏ ఉపవిధి, పంచాయతీసమితి లేక జిల్లాపరిషత్‌చే చేయబడు ఉపవిధి యొక్క రద్దు లేక మార్పు, అది రాష్ట్రప్రభుత్వముచే అనుమతింపబడి, నిశ్చయింపబడు వరకు అమలులోనికి రాదు.

205-A ఉపవిధులు చేయుటకు, ప్రకటించుటకు, విధానము :

(1) అది క్రమముగా నిశ్చితమైన తరువాత, పంచాయతీసమితి లేక జిల్లా పరిషత్ చేసిన ఏ ఉపవిధి, లేక ఉపవిధియొక్క రద్దు లేక మార్పు ఆంగ్లమున జిల్లా గెజిట్‌లో ప్రచురింపబడును.

(2) పంచాయతీసమితి లేక జిల్లా పరిషత్ చేసిన ఏ ఉపవిధి లేక ఉపవిధియొక్క రద్దు లేక మార్పు, (1) వ సబ్‌సెక్షను క్రింద ఆవిధముగ అది ప్రచురింపబడిన తరువాత మూడు నెలలకు అమలులోనికి వచ్చును.

206. 1920వ జిల్లా మునిసిపాలిటీల చట్టము లేక దాని క్రిందచేసిన నిబంధనలు గ్రామములకు వ్యాపింపజేయుట :

జిల్లా పరిషత్ కోరికమీద ఉద్యోగ సంబంధమైన గెజెట్‌లో ప్రకటన ద్వారా, రాష్ట్రప్రభుత్వము, 1920 వ ఆంధ్రప్రదేశ్ (ఆంధ్ర) జిల్లా మునిసిపాలిటీల చట్టము ఏ నిబంధనలు లేక వాటిక్రింద ఏర్పరుచు ఏ నిబంధనలు, బ్లాకులో నిర్దిష్టమయిన పంచాయతీకాని ప్రదేశమునకు వ్యాపింపజేసి, వారికి యుక్తమని తోచినట్టి నిర్బంధములు, మార్పులకు అట్టి వ్యాపించుట బద్ధమై యుండునని ప్రకటించ వచ్చును.

## 13 వ అధ్యాయము

## అపరాధములు

207. షెడ్యూళ్లలో నిర్దిష్టమయిన అపరాధములకు సంబంధించిన సాధారణ ఏర్పాట్లు :

(1) ఎవరైతే—(a) VIIIవ షెడ్యూలు మొదటి "కాలము"లో నిర్దిష్టమయిన సెక్షన్ల ఏర్పాటు అతిక్రమించిన, లేక

(b) నిర్దిష్టమయిన సెక్షన్లక్రింద చేసిన నిబంధన లేక ఉత్తరువు అతిక్రమించిన, లేక

(c) తెలియజేసిన సెక్షన్లయొక్క ఏ ఏర్పాట్లక్రింద లేక వాటి ననుసరించి న్యాయ సమ్మతముగా అతని కిచ్చిన ఏ ఉత్తరువును లేక న్యాయ సమ్మతముగా అతనిని చేయమనిన ఏ కోరిక నిర్వర్తించలేకపోయిన యెడల అతని నేరము ఋజువైనపుడు, చెప్పబడిన షెడ్యూలుయొక్క నాలుగవ "కాలము"లో ఆవిషయములో ఉదహరించిన మొత్తమువరకు సరిపోవు జరిమానాతో శిక్ష విధింపబడును.

(?) ఎవరైనను, అతడు నేరస్థుడని రుజువు పడినప్పుడు—

(a) షెడ్యూలు IX యొక్క మొదటి "కాలము"లో నిర్దిష్టమైన సెక్షన్ల యొక్క ఏర్పాటు అతిక్రమించిన, లేక

(b) నిర్దిష్టమయిన సెక్షన్ల క్రింద చేయబడిన నిబంధన లేక ఉత్తరువు అతిక్రమించిన; లేక

(c) ఆ సెక్షన్ల దేనిక్రింద లేక దాని ననుసరించి న్యాయ సమ్మతముగా అతనికిచ్చిన ఉత్తరువు లేక న్యాయ సమ్మతముగా అతనిని చేయమనిన ఏ కోరిక నిర్వర్తించలేకపోయి, అట్టి ఏర్పాట్లను అతిక్రమించుట సాగించిన లేక అట్టి ఉత్తరువు లేక కోరికను నిర్వర్తించుటలో అశ్రద్ధ చూపిన యెడల, అతడు నేరస్థుడని రుజువు పడినయెడల, అతడు ఆవిధముగా నేరము చేయుట సాగించిన కాలములో వెనుక అతడు నేరస్థుడుగా రుజువుపడిన తేదీ తరువాత ప్రతిదినమునకు, చెప్పబడిన షెడ్యూలు యొక్క నాలుగవ "కాలము"లో ఆ విషయములో ఉదహరించిన మొత్తమువరకు సరిపోవు జరిమానాతో శిక్షింపబడును.

వివరణ: VIII మరియు IX షెడ్యూళ్ళ మూడవ కాలములోని "విషయము" అని హెడ్డింగుగల పదును, మొదటి రెండు "కాలము"లలో చెప్పబడిన సెక్షన్లు, సబ్ సెక్షన్లు లేక క్లాజులలో ఉదహరించిన నేరముల యొక్క నిర్వచనములుగా లేక అట్టి సెక్షన్లు సబ్ సెక్షన్లు లేక క్లాజులు యొక్క సంగ్రహములుగా కూడ ఉద్దేశింపబడి యుండలేదు. కాని అవి కేవలము సూచనలుగా చేర్చబడియున్నవి.

208. వదుల్లబడినది.

209. కాంట్రాక్టు పనిలో ఆఫీసరు లేక ఉద్యోగి లాభము సంపాదించి నందులకు అపరాధము:

పంచాయతీ సమితియొక్క లేక జిల్లా పరిషత్ యొక్క ఏ ఆఫీసరు లేక ఉద్యోగి, తెలిసియుండి, నేరుగా లేక యింకొక విధముగా స్వయముగా లేక భాగస్థుడు లేక ఉద్యోగముకు నియమించువాడు లేక ఉద్యోగిచేత, పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ యొక్క లేక తరపున లేక చేత లేక తో—ఏ కాంట్రాక్టు లేక ఉద్యోగములో ఏస్వంత భాగము లేక లాభము సంపాదించినచో, అతడు ఇండియన్ పీనల్ కోడ్ 168వ సెక్షనుక్రింద అపరాధము చేసిన వాడుగాపరిగణింపబడును.

కాని ఏ వ్యక్తి, అతడు ఒక కంపెనీలో భాగస్థుడుగా లేక సభ్యుడుగా ఉన్న కారణమున, అతడు ఆ కంపెనీ డైరెక్టరుగా యుండినతప్ప, అట్టి కంపెనీ పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్‌ల మధ్య జరిగిన ఏ కంట్రాక్టులో అతడు లాభమున్న వాడుగా పరిగణింపబడడు.

ఇంకను, అతనికి భాగము లేక లాభమున్న లేక అతడు కలిగియుండు భూమి లేక భవనము, పాఠశాలకొరకు ఉపయోగించుటలో పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తుతో, రాష్ట్ర ప్రభుత్వము అనుమతి మీద కాంట్రాక్టులోనికి ప్రవేశించిన పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ నియమించిన ఉపాధ్యాయునకు ఈ సెక్షనులోని దేదియు అనువర్తించదు.

## 210. అధ్యక్షుని లేక అతని ప్రతినిధి అక్రమముగా అడ్డుట :

పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ నిర్వహణాధికారిని లేక భూమి లేక భవనముమీద లేక లో ప్రవేశించుటకు న్యాయసమ్మతముగా అధికారముల నిర్వహణాధికారి అప్పగించు ఏ యితర వ్యక్తిని దానిలోనికి లేక దానిమీదకు ప్రవేశించుటకు అతని న్యాయసమ్మతమైన అధికారము చలాయించుటనుండి అడగించు ఏ వ్యక్తి. ఇండియన్ పీనల్‌కోడ్ యొక్క 341వ సెక్షను క్రింద నేరము చేసిన వాడుగా పరిగణింపబడును.

## 211. సమాచారము యివ్వనందుకు లేక తప్పు సమాచారము యిచ్చినందుకు అపరాధము :

ఈ చట్టము నిబంధన క్రింద లేక ఈ చట్టము క్రింద జారీచేయబడిన ఏ నోటీసు లేక యితర చట్టములచే వ్యక్తి సమాచారము యివ్వవలసి యుండునపుడు,

(a) దానిని యివ్వకపోయిన యెడల, లేక

(b) తెలిసియుండి తప్పు సమాచారము యిచ్చినప్పుడు,

అట్టి వ్యక్తి 100 రూపాయలు దాటకుండా జరిమానా చెల్లించుటకు బద్ధుడై యున్నాడు.

# 6 వ భాగము

## 15 వ అధ్యాయము

## పద్ధతి మరియు నానావిధములైన అనుమతులు

## లైసెన్సులు

212. లైసెన్సుల, అనుమతుల గురించి సాధారణ నిబంధనలు:

(1) ఈ చట్టముక్రింద మంజూరు చేయబడిన ఏ లైసెన్సు, అనుమతి లేక ఈ చట్టము క్రింద చేయబడిన ఏ నిబంధన లేక ఉపవిధి, అది మంజూరు కాబడుటకు విధించిన నిబంధనలు నియమితములు, మరియు షరతులకు, ఏ మైన యున్నయెడల, కాల పరిమితిని నిర్దిష్టముచేసి, ఆ యా పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ యొక్క నిర్వహణాధికారిచేత లేక అతనిచే క్రమముగా ఆ విషయములో అధికార మివ్వబడిన ఒక వ్యక్తిచేత సంతకము చేయబడును.

(2) ఈ చట్టములో స్పష్టముగా ఏర్పాటు చేయబడిన లేక ఈ చట్టము క్రింద నియమింపబడిన తప్ప, అట్టి ప్రతి లైసెన్సు లేక అనుమతికి, పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ చే నియమింపబడునట్టి యూనిట్లమీద లేక రేట్లమీద రుసుము విధింపబడును.

(3) పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్, దానికి యుక్తమని తోచిన షరతులమీద ఒక్కమారు మూడు సంవత్సరములు దాటని ఏ కాల పరిమితికి అట్టి రుసుము వసూలుచేయుట యితరుల కిచ్చివేయవచ్చును.

(4) లైసెన్సు లేక అనుమతి నిరాకరించుచు నిలుపుదల చేయుచు రద్దు చేయుచూ లేక మార్పుచేయుచూ ఉత్తరువు మంజూరు చేయుటకు ఈ చట్టము క్రింద లేక దానిక్రింద చేసిన ఏ నిబంధన లేక ఉపవిధిక్రింద అర్హతగల అధికారి యొక్క ప్రతి ఉత్తరువు వ్రాతపూర్వకముగా యుండి, అది ఏ కారణములమీద పురోగమించునో వివరించును.

(5) స్వంత సంతల విషయములో XI ఎ అధ్యాయములో ప్రత్యేక నిబంధనలకు కట్టుబడి, ఈ చట్టము క్రింద లేక దాని క్రిందచేసిన ఏ నిబంధన లేక ఉపవిధిక్రింద మంజూరు చేసిన ఏ లైసెన్సు లేక అనుమతి, ఆ యా పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ నిర్వహణాధికారిచే, పుచ్చుకొనిన వారిచే దానియొక్క ఏ నిబంధనలు, నియమితములు లేక షరతులు తప్పించుకొనుటకు ప్రయత్నము చేయబడిన లేక అతిక్రమించబడిన యెడల, లేక అట్టి లైసెన్సు లేక అనుమతి చెందు ఏ విషయములో ఈ చట్టముయొక్క, లేక ఏ నిబంధన, ఉపవిధి లేక దాని

క్రింద చేయు ఏ శాసనము యొక్క ఏర్పాట్లను ఉల్లంఘించి నందులకు పుచ్చుకొనువాడు నేరస్థుడని నిర్ణయింప బడినయెడల, లేక పుచ్చుకొనువాడు తప్పుగా తెలియజేయుట లేక మోసమువల్ల దానిని పొందిన యెడల, ఎప్పుడైనను అపుదల లేక రద్దు చేయబడవచ్చును; లైసెన్సు అపుదల లేక రద్దుచేయు ఈ సబ్ సెక్షను క్రింద నిర్వహణాధికారి ఏ ఉత్తరువుమీద ఆ యా పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్‌కు ఒక అపీలు చేయవచ్చును.

(6) ఈ చట్టమువల్ల లేక క్రింద ఒక లైసెన్సు లేక అనుమతి కావలసిన స్థలములను తనిఖీ చేయుట నిర్వహణాధికారి యొక్క విధియై యున్నది. అతడు ఆ స్థలములోనికి, అది జనమునకు తెరువబడి యుండునపుడు లేక ఆ కాలములో దానిలో ఏ పరిశ్రమ జరుగుతూయున్నపుడు సూర్యోదయమునకు సూర్యాస్తమానమునకు మధ్య మరియు సూర్యాస్తమానము సూర్యోదయమునకు మధ్య ప్రవేశించవచ్చును. ఈ చట్టముచే లేక క్రింద, కావలసిన లైసెన్సు లేక అనుమతి లేకుండా, లేక యితరముగా దాని ననుసరించకుండగా, ఏ ప్రదేశములోనైనను ఏదియైనను జరుగుతూయున్నదని అతనికి నమ్ముటకు కారణమున్నయెడల, అతడు రాత్రి పగలు ఏ కాలములోనైనను నోటీసు లేకుండా. ఏ న్యాయశాస్త్రముయొక్క ఏర్పాటు, నిబంధనలు, ఉపవిధులు లేక శాసనములు లైసెన్సు లేక అనుమతి యొక్క ఏ షరతు లేక ఏ న్యాయ సమ్మతమైన ఉత్తరువు లేక నిషేధము ఉల్లంఘింపబడుచున్నదా లేదా అని అతడు తృప్తిపడుటకొరకు అట్టి స్థలములోనికి ప్రవేశించవచ్చును; నిర్వహణాధికారి లేక అతడు న్యాయబద్ధమై అప్పజెప్పిన అధికారములుగల ఏ వ్యక్తి ఈ సబ్ సెక్షను క్రింద అధికారములను చలాయించుట వల్ల, లేక ఈ సబ్ సెక్షను క్రింద ప్రవేశమును కలుగజేయుటకు కావలసిన ఏశక్తి వల్ల తప్పకుండగా కలిగిన ఏ నష్టము లేక సదుపాయముకు ఏ వ్యక్తిపైన ఏ హక్కు కలుగనేరదు.

(7) ఏ లైసెన్సు లేక అనుమతి అపుదల చేయబడినపుడు లేక రద్దు చేయబడినపుడు. లేక అది మంజూరు చేయబడిన కాలము లేక పునఃసృష్టికొరకు దరఖాస్తు పెట్టవలసిన కాలము దాటిన తరువాత, ఏది తరువాత అగునో అది గడచిన తరువాత ఈ చట్టములో అన్ని ఉద్దేశములు లేక ఈ చట్టముక్రింద చేయబడిన ఏ నిబంధన లేక ఉపవిధికొరకు పుచ్చుకొనినవాడు, లైసెన్సు లేక త్రోసివేయు, ఉత్తరువు రద్దుచేయబడనిదే లేక, (ii)వ సబ్ శెక్షనుకు బద్ధమై. లైసెన్సు లేక అనుమతి పునఃసృష్టి చేయబడువరకు, లైసెన్సు లేక అనుమతి లేనివాడుగా పరిగణింపబడును.

(8) ప్రతి లైసెన్సు లేక అనుమతి పొందినవాడు, అన్ని సబబు అయిన కాలములందు అట్టి లైసెన్సు లేక అనుమతి అమలులో యున్నపుడు నిర్వహణాధికారి కోరికపైన దానిని దాఖలు చేయును.

(9) ఈ చట్టము ఏర్పాట్లవల్ల లేక ఈ చట్టము క్రిందచేయు ఏ నిబంధన లేక ఉపవిధి నిర్ణయించిన లైసెన్సు లేక అనుమతి పొందలేక పోవుటలో ఒక నేరమునకు ఒక వ్యక్తి నేరస్థుడని నిర్ణయింపబడిన యెడల, మేజిస్ట్రేటు, విధింపబడు జరిమానాకు అదనముగా, లైసెన్సు లేక అనుమతికి చెల్లింపదగు రుసుము మొత్తము శీఘ్రము వసూలుచేసి పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్‌నకుయిచ్చివేయును. అతని విచక్షణలో, అతడు నిర్ణయించు వ్యాజ్యపు ఖర్చుల మొత్తము ఏమైన యున్నయెడల అదికూడ అతడు శీఘ్రముగా వసూలుచేసి పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్‌కి యిచ్చివేయ వచ్చును.

(10) సబ్‌శెక్షను (9) క్రింద రుసుము యొక్క అట్టి వసూలు, పై చెప్పిన రీతిని లైసెన్సు లేక అనుమతికి, శిక్షింపదగు వ్యక్తిని అర్హునిగా చేయదు.

(11) లైసెన్సు, అనుమతికి, పంచాయతీ సమితి, జిల్లా పరిషత్‌చే, తరపున రుసుము ముందు చెల్లించుటను అంగీకరించుట, అట్టి ముందు చెల్లించు వ్యక్తికి లైసెన్సు, అనుమతికి అర్హత యివ్వదు. కాని, లైసెన్సు, అనుమతికి నిరాకరింపబడిన విషయములో రుసుము ముదరాకు మాత్రము అర్హత కలుగజేయును; కాని లైసెన్సు, అనుమతి పునఃసృష్టికొరకు దరఖాస్తుదారుడు, అతను పంపించునంతవరకు, లైసెన్సు, అనుమతి పునఃసృష్టి చేయబడినట్లుగా ప్రవర్తించుటకు హక్కు కలిగియున్నాడు. మరియు ఈ చట్టములో ఏదైనను ప్రత్యేకముగా ఏర్పాటు చేయబడిన తప్ప, లైసెన్సు, అనుమతి కొరకు దరఖాస్తుమీద ఉత్తరువులు, నిర్వహణాధికారి దరఖాస్తు తీసికొనిన తరువాత ముప్పది దినములలో దరఖాస్తుదారునకు పంపించకపోయిన యెడల, అట్టి దరఖాస్తు, అ సంవత్సరమునకు, దరఖాస్తులో ఉదహరించిన యింకను తక్కువ కాలపరిమితికి యివ్వబడినట్లుగా భావింపబడి, న్యాయ శాస్త్రమునకు, నిబంధనలకు, ఉపవిధులకు, శాసనములకు, సాధారణముగా విధించు అన్నిషరతులకు బద్ధమై యుండును.

213. అపీలునకు కాలపరిమితి నియమితము :

ఇతర విధముగా ప్రత్యేకముగా ఏర్పాటు లేక నిర్ణయము చేసిన తప్ప,

ఈ చట్టముక్రింద ప్రతి అపీలు 1908 ఇండియన్ లిమిటేషను చట్టము, 5 వ సెక్షనులోని నిబంధనలకు బద్ధమై ఈ క్రింది కాలముకు దాఖలు చేయబడును.

(a) అపీలు, లైసెన్సు లేక అనుమతి మంజూరుచేయు ఉత్తరువుమీద అయినచో, పంచాయతీ సమితి, జిల్లా పరిషత్‌యొక్క నోటీసు బోర్డుమీద ఆ ఉత్తరువు ప్రకటించిన తారీకు తరువాత ముప్పది దినములలో, మరియు

(b) ఇతర విషయములలో, అపీలు చేసిన ఉత్తరువు లేక వ్యవహారము అందిన తారీఖు తరువాత ముప్పది దినములలో.

214. లైసెన్సులు, నోటీసులు, అనుమతులుయొక్క నమూనా:

(1) ఈ చట్టము నిబంధనల క్రింద యివ్వబడు, జారీచేయబడు, మంజూరు చేయబడు అన్ని లైసెన్సులు, నోటీసులు, అనుమతులు వ్రాత పూర్వకముగా యుండవలయును.

(2) నిర్వహణాధికారి యొక్క అధ్యక్షుడు, చైర్మన్, పంచాయతీ సమితి, జిల్లా పరిషత్ ఏ అధికారియొక్క సంతకము ఉండవలసినదిగా ఈ చట్టము, దానిక్రింద చేసిన ఏ నిబంధన, ఉపవిధి, శాసనము నిర్ణయించు ప్రతి లైసెన్సు, అనుమతి, నోటీసు, బిల్లు, సమనులు, యితరపత్రములు, నిర్వహణాధికారి యొక్క అధ్యక్షుడు, చైర్మన్, అట్టి ఆఫీసరు సంతకము 'ఫాస్‌మిల్' దానిమీద ముద్రించియున్న యెడల, సరిగా సంతకము చేయబడినట్లుగా భావింపబడును.

(3) పంచాయతీ సమితి నిధినుండి, జిల్లా పరిషత్ నిధినుండి తీయబడిన "చెక్" లేక పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తుచే చేయబడిన ఏ పత్రము లేక కాంట్రాక్టుకు (2) వ సబ్‌సెక్షనులోని దేదియు అనువర్తించునట్లుగా భావింపకూడదు.

215. చట్టము క్రింద ప్రకటనల ప్రచురణము ;

ఇతర విధముగా ఏర్పాటు చేయబడిన తప్ప, రాష్ట్ర ప్రభుత్వముచే జారీ కాబడినవి తప్ప ప్రతి ప్రకటన, ఆంగ్లమున మరియు జిల్లా ప్రాంతీయభాషలోను అట్టి ప్రకటన అనువర్తించు జిల్లా ఉద్యోగ సంబంధమైన గజిట్‌లో ప్రచురింపబడును.

కాని, రాష్ట్ర ప్రభుత్వమునకు, అట్టి ప్రకటన,

(i) ఆంగ్లమున లేక జిల్లాయొక్క ఒక మాతృభాషలో ఆ గజిట్ ప్రచురింప బడును ; లేక

(ii) అట్టి గజిట్‌లో ప్రచురింపబడుటకు మారుగా, వారివల్ల నిర్దిష్టమైన ఏ యితర పద్ధతిలోను ప్రచురింపబడును. అవి ఉత్తరువు చేయుటకు అధికారము కలదు.

215. (A) స్థలముల నిషేధము లేక కేటాయింపు నోటీసు :

ఎప్పుడైనను, పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ ఏ స్థలమును ఏ కార్యము కొరకై కేటాయించినను లేక ఏ స్థలమును ఏ కార్యము చేయుటను నిషేధించినచో, నిర్వహణాధికారి వెంటనే, అట్టి స్థలము కేటాయింపులకు కారణము లేక అట్టి స్థలములో అట్టి కార్యము నిషేధమునకు కారణము నిర్దిష్టము చేయుచు ప్రాంతీయ భాషలో ఒక నోటీసును ఉంచుటకు ఏర్పాటు చేయును.

216. పత్రములను అందింపజేయు పద్ధతి :

(1) నోటీసు లేక యితర పత్రము, ఈ చట్టమువల్ల లేక దాని క్రింద చేయు నిబంధన, ఉపవిధి, శాసనము లేక ఉత్తరువుచే ఏ వ్యక్తికి అందింపజేయు లేక పంపవలసియున్నచో, దానిని అందింపజేయుట లేక పంపుటలో ఈ క్రింది విధముగా అమలుజరుప వచ్చును.

(ఎ) అట్టి వ్యక్తికి అట్టి పత్రము యిచ్చుట లేక అందజేయుట ; లేక

(బి) అట్టి వ్యక్తి అగుపడని ఎడల, అట్టి పత్రమును, అతడు ఆఖరున నివసించిన, తెలిసిన స్థలము, వ్యాపార స్థలమువద్ద వదలివేయుట, లేక అతని కుటుంబములోని వయస్సు వచ్చిన ఒకపెద్ద మనిషికి లేక పనిచేయు వానికి దానిని యిచ్చుట లేక అందజేయుట ; లేక

(సి) అట్టి వ్యక్తి స్థానిక ప్రదేశములో నివసించక పోయిన యెడల, అతని చిరునామా వేరు స్థలమందు నిర్వహణాధికారికి తెలిసియున్న యెడల, దానిని రిజిష్టరు పోస్టులో అతనికి దానిని పంపించుట ; లేక

(డి) పైన చెప్పిన విధానములలో ఏదియు వీలుకాకున్న యెడల, అట్టి నివాస స్థలము లేక వ్యాపారము చేయు స్థలముయొక్క ఒక ప్రాముఖ్య భాగములో దానిని అతికించుట.

(2) ఆ వ్యక్తి ఏ భవనము లేక భూమి యజమాని లేక ఆక్రమణ దారు అయిన ఎడల, పత్రములో యజమాని లేక ఆక్రమణ దారు యొక్క పేరు ఇవ్వ వలసిన అవసరము లేదు. మరియు ఉమ్మడి యజమానుల, ఆక్రమణదారుల విషయములో, దానిని అట్టి యజమానులు లేక ఆక్రమణదారులలో ఏ ఒకరికి అంద జేసినను లేక పంపినను సరిపోవును.

(3) ఈ చట్టము క్రింద అందజేసిన లేక పంపినబిల్లు, నోటీసు, ఫారము లేక యితర పత్రములో, పన్ను లేక యితర మొత్తము చెల్లించ వలసి లేక ఏ పని నిర్వర్తించ వలసిన లేక దేనినైనను ఏర్పాటు చేయవలసిన కాలము నిర్ణయింప బడినప్పుడు అట్టి కాలము, దానికి వ్యతిరేకముగా ఏ స్పష్టమైన నిబంధన ఈ చట్టములో లేనప్పుడు అట్టిది అందజేయుట, లేక పంపుట తారీఖునుండి లెక్క పెట్ట వలయును.

## ప్రవేశము, తనిఖీ అధికారములు

217. పనులు తనిఖీ చేయుటకు, కొలత వేయుటకు లేక నిర్వర్తించు టకు ప్రవేశము, అధికారను:

పంచాయతీ సమితి లేక జిల్లాపరిషత్ యొక్క నిర్వహణాధికారి లేక అత నిచే ఈ విషయములలో అధికార మివ్వబడిన ఏవ్యక్తి విచారణ, తనిఖీ, పరీక్ష, శోధన, అంచనా వేయుటకు, కొలుచుటకు, లేక విలువ కట్టుటకు లేక ఈ చట్టము లేక దానిక్రింద చేయబడిన ఏచర్య, ఉపవిధి, శాసనము యొక్క నిబంధనలచే అధికారము యివ్వబడిన లేక యీచట్టము ఉద్దేశ్యములలో వేటికొరకు లేకచెప్పబడిన నిబంధనలో వేటి ననుసరించి యైనను, చేయుట లేక నిర్వర్తించుట అవసరమైన ఏ ఇతర పనిని నిర్వర్తించుటకు, అతని అనుచరులతో లేక పనివారితో లేక వారు లేకుండగను ఏ భవనము లేక భూమిలోనికి లేక మీదకు ప్రవేశించ వచ్చును.

కాని—

(a) స్పష్టముగా యితరముగా ఈ చట్టములో ఏర్పాటు చేసిన తప్ప, అట్టి ప్రదేశము సూర్యాస్తమయము, సూర్యోదయమునకు మధ్య ఉండును.

(b) స్పష్టముగా యితరముగా ఈ చట్టములో ఏర్పాటు చేసిన తప్ప, ఏ నివసించుకాలము మరియు, నివసించు స్థలముగా ఉపయోగింపబడు రాజభవనము లో ఏ భాగమును, దాని ఆక్రమణదారు అనుమతి లేకుండగా, అట్టి ఆక్రమణదారుకు కనీసము ఆరుగంటల ముందుగా నోటీసు, అట్టి ప్రవేశము చేయుటకు ఉద్దేశ్యము తెలుపుచు, పొందిన తప్ప, ఆవిధముగా ప్రవేశింప బడకూడదు.

(c) ఆడవారికి యివ్వబడిన భాగములో నివసించు వారిని వారు ఏకాంతముగా ఉండుటకు వీలగు అవరణలో కొంతభాగమునకు కదలుటకు వీలుకలుగ చేయుటకు, ప్రతివిషయములోను, నోటీసు లేకుండా యితర విధముగా ప్రవేశించుటకు వీలగు ఏ ఆవరణల విషయములోను కావలసిన నోటీసు యివ్వబడును.

(d) అవరణ ఆక్రమదారుల యొక్క సాంఘిక మతాచారములకు, అట్టి ప్రవేశము యొక్క ఉద్దేశ్యముతో పరిస్థితులు సానుకూల పడునంత వరకు తగిన గౌరవము యివ్వబడును.

218. తూకములు కొలతలు తనిఖీ ముద్రవేయుట :

పంచాయతీ సమితి – జిల్లాపరిషత్ నిర్వహణాధికారి – ఈ విషయములో అతని వద్దనుండి అధికారము పొందిన ఏవ్యక్తి, ఇండియన్ పీనల్‌కోడ్ 13 వ అధ్యాయము క్రింద బరువులు, కొలతలకు సంబంధించిన నేరములను ఆపుటకు, శిక్షించుటకు, బ్లాకులో, జిల్లాలో, సంతలో – కొట్లలో వుపయోగించు బరువులను తూకములను పరీక్షించి పరిశీలన చేయవచ్చును.

లైసెన్సు విధించు నిబంధనలు, వుత్తరువులు మొదలగు వాటిని అమలు జరిపించుటకు అధికారము.

219. లైసెన్సులు మొదలగు వాటిని పొందలేక పోవుట లేక వాటి నుల్లంఘించుట వలన ఫలితములు:

ఈ చట్టము క్రింద లేక దాని క్రింద జేయబడిన ఏ నిబంధనలు , ఉపవిధి లేక శాసనము క్రింద పంచాయతీ సమితి లేక జిల్లాపరిషరిషత్ – దాని నిర్వహణ శాఖాధికారి యొక్క లైసెన్సు లేక అనుమతి ఏపని చేయుట కైనను అవుసరమైన యెడల, మరియు అట్టి లైసెన్సు లేక అనుమతియొక్క షరతులకు భిన్నముగా నున్నపద్ధతిలో, అట్టి లైసెన్సు లేక అనుమతి లేకుండగా ఏపని ఐనను చేయబడిన యెడల, అప్పుడు–

(a) అధ్యక్షుడు – చైర్మన్ నోటీసు ద్వారా, అట్టి పనిని ఆవిధముగా చేయు వ్యక్తిని, నోటీసులో నిర్దిష్టముచేయబడు కాలములో, దానివల్ల ప్రతికూలము చేయబడ్డ, చర – స్థిర, బహిరంగ – స్వంత ఆస్తి మొత్తమును లేక ఏ భాగమును మార్పు చేయుట, తొలగించుట, సాధ్యమైనంత వరకు దాని యథాస్థితికి తీసుకొని వచ్చుటకు కోరవచ్చును; మరియు

(d) అట్టి పనిని ఆ విధముగా చేయుటకు ఏ అపరాధము ఈ చట్టములో ప్రత్యేకముగా ఏర్పాటు చేయబడునప్పుడు, ఆ విధముగా చేయు వ్యక్తి, మేజిస్ట్రేటుచే నేరస్థుడని నిర్ణయింపబడినప్పుడు, ప్రతి అటువంటి నేరమునకు ఏబది రూపాయలు మించకుండా అపరాధమునకు బాధ్యుడగును.

220. నోటీసు, ఉత్తరువు మొదలైన వాటిని నిర్వర్తించుటకు కాలము, అట్లు చేయకపోయిన దానిని అమలు చేయుటకు అధికారము :

(1) ఈ చట్టము క్రింద ఏ నోటీసు, కోరిక లేక ఉత్తరువు లేక దానిక్రింద చేయబడిన ఏ నిబంధన, ఉపవిధి లేక శాసనమువల్ల ఒక వ్యక్తి, ఒక పనిని నిర్వహించుటకు లేక చర్యలు తీసుకొనుటకు లేక ఏవియైనను చేయుటకు కోరబడినచో, పని నిర్వహించుటకు లేక చర్యలు తీసుకొనుటకు లేక పనిచేయుటకు సబబైన కాలము అట్టి నోటీసు, కోరిక లేక ఉత్తరువులో చెప్పబడియుండును.

(2) అట్టి నోటీసు, కోరిక, ఉత్తరువు ఆ విధముగా చెప్పబడిన కాలములో నిర్వర్తించలేకపోయిన యెడల ఆ యా పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ నిర్వహణాధికారి, పై చెప్పబడిన నోటీసు, కోరిక లేక ఉత్తరువు తగిన రీతిగా అమలు జరుపుటకు అతని ఉద్దేశములో కావలయు ననుకొనునట్టి పని నిర్వర్తించవచ్చును; మరియు

(3) అట్టి నోటీసు నిర్వర్తించుట తప్పినందుకు ఈ చట్టములో అపరాధము స్పష్టముగా ఏర్పాటు చేయబడనప్పుడు, అట్టి వ్యక్తి, మేజిస్ట్రేటు అతడు నేరస్తుడని నిరూపించినప్పుడు, అట్టి ప్రతి నేరమునకు ఏబది రూపాయలు మించకుండా అపరాధమునకు బాధ్యుడగును.

221. పన్నులుగా రావలసిన మొత్తములు వసూలు:

ఈ చట్టము క్రింద లేక దాని క్రింద జేయబడిన ఏ యితర న్యాయశాస్త్రము, నిబంధనలు లేక ఉపవిధుల క్రింద పంచాయతీ సమితికి లేక జిల్లా పరిషత్‌కు ఏ వ్యక్తి నుండి రావలసిన అన్ని ఖర్చులు, నష్టములు, పరిహారములు, అపరాధములు, వెలలు, పాఠశాల రుసుము కాని రుసుములు, వ్యయములు, అద్దెలు (పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్‌చే యితరులకు వదలివేయబడ్డ భూములు, భవనముల మీద అద్దెలు కానివి) విరాళములు, యితర మొత్తములు, వాటిని వసూలు చేయుటకు ఈ చట్టములో ప్రత్యేక ఏర్పాటు లేని యెడల 4వ షెడ్యూలులోని

నిబంధనలలో ఏర్పాటు చేయబడిన రీతిని బిల్లు ద్వారా కోరబడి, దానిలో ఏర్పాటు చేయబడిన పద్ధతిని వసూలు చేయబడవచ్చును.

222. రావలసిన వాటిని వసూలు చేయుటకు కాలనిర్ణయము :

జప్తు చేయబడియుండు తారీకు నుంచి, దావా మొదట వేయు తారీకునుండి, వ్యాజ్యము మొదట ప్రారంభమైన తారీకు నుండి మూడు సంవత్సరముల కాలము దాటిన తరువాత ఈ చట్టము క్రింద పంచాయతీ సమితికి లేక జిల్లా పరిషత్‌కు రావలసిన మొత్తము విషయములలో, జప్తు చేయబడకూడదు. ఏ దావా వేయబడ కూడదు, ఏ వ్యాజ్యమూ ప్రారంభించ కూడదు.

223. వ్యాజ్యము వేయుటకు అధికార మివ్వబడిన వ్యక్తులు :

ఇతర విధముగా స్పష్టముగా ఈ చట్టములో ఏర్పాటు చేయబడిన తప్ప, నేరము చేసిన మూడునెలల లోపున, పోలీసులవల లేక పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ నిర్వహణాధికారివల్ల లేక పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్‌చే ఈ విషయములో స్పష్టముగా అధికార మివ్వబడిన వ్యక్తిచేత లేక దానిని నిర్వహణాధికారి చేత ఫిర్యాదు యివ్వబడిన తప్ప, ఈ చట్టము ఏర్పాట్ల క్రింద లేక దాని క్రింద చేయబడిన నిబంధన లేక ఉపవిధికి వ్యతిరేకముగా ఏ నేరమునకు, ఏ వ్యక్తి విచారింప బడకూడదు. కాని వచ్చిన సమాచారము మీద లేక వారికి స్వంతముగా తెలిసియుండి లేక అనుమానముండి నేరములను గుర్తించుటకు కొంతమంది మేజస్ట్రేటుల యొక్క అధికారము విషయములో 1898 వ క్రిమినల్ ప్రొసీజరు కోడ్‌లోని ఏర్పాట్లను యిందులోని దేదియు బాధించదు.

కాని, లైసెన్సు తీసికొనక పోవుట లేక ఈ చట్టము క్రింద అనుమతి తీసికొనకుండుట, ఈ చట్ట నిబంధనల కొరకు, లైసెన్సు లేక అనుమతి కావలసిన ఏదైన యున్న యెడల, కాలము అత్యంతమగువరకు జరుగుతూవున్న నేరముగా భావింపబడును. మరియు ఏ కాలము నిర్దిష్టము కానప్పుడు, నేరము ప్రారంభ మయినప్పటి నుంచి పన్నెండు నెలల కాలములో ఎప్పుడైనను ఫిర్యాదు చేయ బడవచ్చును.

224. జరిమానాలు, ఖర్చులు మొదలైనవాటి వసూలు :

ఈ చట్టము క్రింద లేక దానిక్రింద చేయబడిన నిబంధన లేక ఉపవిధి క్రింద మేజిస్ట్రేటు వేయబడిన లేక విధింపబడిన జరిమానా, ఖర్చులు, పన్ను లేక యితర

మొత్తము, అది జరిమానా మాదిరిగా 1898 వ క్రిమినల్ ప్రొసీజరు కోడ్ క్రింద అట్టి మేజస్ట్రేటుచే వసూలు చేయబడవచ్చును. జరిమానా విషయములో తప్ప అది వసూలు చేయబడిన తర్వాత ఆ యా పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్‌కు ఈ చట్టము ఉద్దేశములకు వినియోగించుటకు చెల్లించబడును.

225. పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ మీద చర్య నోటీసు :

ఏ పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ లేక అధ్యక్షుడు లేక చైర్మన్, నిర్వహణాధికారి లేక ఏ సభ్యుడు, అధికారి లేక దాని ఉద్యోగి లేక పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్, అధ్యక్షుడు లేక చైర్మన్, నిర్వహణాధికారి, సభ్యుడు, అధికారి లేక ఉద్యోగియొక్క ఉత్తరువు మీద పనిచేయు ఏవ్యక్తిమీద, ఈ చట్టము లేక దానిక్రింద చేయబడిన ఏ నిబంధన, ఉపవిధి, శాసనము లేక ఉత్తరువు అమలు జరుపుటలో లేక అమలు జరుపు ఉద్దేశములో చేసిన లేక చేసినదనబడు ఏ క్రియ విషయములో రెండు నెలలు గడచినంతవరకు లేక ఈ చట్టము లేక ఏ అట్టి నిబంధన, ఉపవిధి, శాసనము లేని ఉత్తరువు అమలు జరుపుటలో చెప్పబడిన అశ్రద్ధ లేక తప్పు విషయములో, దావాకారణము, కోరిన పరిహారము స్వభావము, కోరిన పరిహార మొత్తము, రాదలచుకొన్నవారి పేరు, నివాస స్థలము తెలియజేయు వ్రాతపూర్వకమైన తరువాత వచ్చు నోటీసు, పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ కార్యాలయము వద్ద వదలి పెట్టబడి నంతవరకు మరియు అట్టి చర్య ఏ అట్టి అధ్యక్షుడు లేక జిల్లా పరిషత్, నిర్వహణాధికారి, సభ్యుడు, అధికారి, ఉద్యోగి, లేక వ్యక్తిమీద తీసికొనదలచిన యెడల, అట్టి నోటీసు అతనికి యివ్వబడిన లేక అతని నివాస స్థలమువద్ద వదలబడినంతవరకు, ఏ దావా లేక యితర న్యాయరీత్యా చర్యతీసికొని రాబడకూడదు. మరియు అట్టి నోటీసు రుజువు పడునంతవరకు న్యాయస్థానము ప్రతివాదికొరకు వెదకును.

(2) అట్టి ప్రతిచర్య, అది స్థిరాస్థి వసూలు చేయుటకు లేక దానికి హక్కు నిర్ధారణ కొరకు తీసికొనబడు చర్య అయిన తప్ప, వ్యాజ్య కారణము ప్రారంభమయిన తేదీ దాటిన తరువాత ఆరు నెలలలో లేక జరుగుతూవున్న హాని లేక నష్టము విషయములో, అది జరుగుతున్న కాలములో లేక అది ఆగిన తరువాత ఆరునెలలలో ప్రారంభింపబడవలెను.

(3) (1)వ సబ్‌సెక్షను క్రింద నోటీసు యివ్వబడ్డ ఏ పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ లేక వ్యక్తి, చర్యతీసుకొనుట ప్రారంభింపబడుటకు ముందు వాదికి పరిహారము యిచ్చిన యెడల, ఆ విధముగా యిచ్చిన మొత్తము కంటె యెక్కువ వాది అట్టి ఏ చర్యలో వసూలు చేయకపోయిన యెడల, అతడు

అతనికి తగులుబాటు అయిన ఏ ఖర్చులు, అట్లు యివ్వబడిన తరువాత, వసూలు చేయకూడదు. వాది, అట్లు యివ్వబడిన తరువాత ప్రతివాదికి తగులుబాటు అయిన అన్ని ఖర్చులుకూడ చెల్లించవలయును.

(4) పంచాయతీ సమితి - జిల్లా పరిషత్ అధ్యక్షుడు - చైర్మన్. నిర్వహణాధికారి - ఏ సభ్యుడు. అధికారి - పంచాయతీ సమితి - జిల్లా పరిషత్ - అట్టి అధ్యక్షుడు నిర్వహణాధికారి, సభ్యుడు, అధికారి - ఉద్యోగి ఉత్తరవు క్రిందపనిచేయు వ్యక్తిమీద, ఈ చట్టము, దాని క్రిందజేసిన ఏ నిబంధన, ఉపవిధి, శాసనము, ఉత్తరువు అమలు జరుపుటలో, అమలు జరుపు నుద్దేశములో జరిగిన ఏ క్రియ విషయములో, ఈ చట్టము, అట్టినిబంధన, ఉపవిధి, శాసనము, ఉత్తరువు అమలు జరుపుటలో అతనివల్ల చెప్పబడు అశ్రద్ధ, తప్పు విషయములో, అట్టి క్రియ జరిగినప్పుడు, అట్టి అశ్రద్ధ, తప్పు, మంచి ఉద్దేశములో చేసిన యెడల. ఏ దావా, యితర న్యాయరీత్యా చర్య తీసికొని రాబడకూడదు; కాని న్యాయసానములో చెల్లదగినంతవరకు ఏ అట్టి చర్య, పంచాయతీ సమితి, జిల్లా పరిషత్‌మీద 227 వ సెక్షను క్రింద వేసిన దావాల విషయములో తప్ప, తీసికొని రాబడకూడదు.

225. (A) వదలబడినది.

226. నేరములను కలుపుట :

పంచాయతీ సమితి - జిల్లా పరిషత్ యొక్క నిర్వహణాధికారి, రాష్ట్ర ప్రభుత్వముచే చేయబడు నిబంధనలచే కలపవచ్చునని ప్రకటింపబడు ఈ చట్టము క్రింద ఏ నేరమును కలుపవచ్చును.

227. ఆస్తి నష్టము, వృధా లేక అన్యధా ఉపయోగమునకు అధ్యక్షుడు, సభ్యుల బాధ్యత :

అధ్యక్షుడు - చైర్మన్ ప్రతిసభ్యుడు, పంచాయతీ సమితి జిల్లా పరిషత్ నిర్వహణాధికారి పంచాయతీ సమితి, జిల్లా పరిషత్ కలిగి యున్న, చేరి యున్న ధనము, యితర ఆస్తియొక్క నష్టము, వృధా, అన్యధా ఉపయోగమునకు, అట్టి నష్టము, వృధా, అన్యధా ఉపయోగము అతని అశ్రద్ధ లేక చెడునడత యొక్క సరియైన ఫలితమైనయెడల, బాధ్యుడగును. రాష్ట్ర ప్రభుత్వము ముందు అనుమతితో పంచాయతీ సమితి, జిల్లా పరిషత్‌చే, రాష్ట్రప్రభుత్వముచే అర్హత జూరిస్‌డిక్షనుగల ఏ కోర్టులో ఒక దావా, పరిహారమునకు, అతనిమీద వేయబడవచ్చును.

(2) వ్యాజ్యకారణము ప్రారంభమయిన తారీకు తరువాత మూడు సంవత్సరములలో అట్టి ప్రతి దావా ప్రారంభమగును.

227.—(a) పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ అధ్యక్షుడు లేక చైర్మన్ లేక సభ్యుని మీద వ్యాజ్యము జరుపుటకు మంజూరు :

అధ్యక్షుడు - చైర్మన్, ఏ సభ్యుడు, పంచాయతీ సమితి - జిల్లా పరిషత్ నిర్వహణాధికారి, అతని ఉద్యోగ సంబంధమైన విధిని నిర్వర్తించుటలో నిమగ్నుడై నప్పుడు, చెప్పదగునప్పుడు అతడు చేసినది, చెప్పదగు, ఏ నేరము ఆరోపింపబడినప్పుడు, రాష్ట్రప్రభుత్వము పూర్వపు అనుమతితో తప్ప, ఏ న్యాయ స్థానము అట్టి నేరమును గుర్తించదు.

228. పన్నులు వేయుట మొదలైన వాటిని ఆక్షేపణ చేయకుండుట :

(1) ఈ చట్టములోని నిబంధనలు, సారాంశములోను అమలులోను నిర్వర్తింప బడిన యెడల, ఈ చట్టము యొక్క అధికారము క్రింద ఏ పన్ను విధించుట , చేసిన డిమాండు, విధించిన చార్జీ, వ్రాత సంబంధమైన తప్పువల్ల- (ఎ) ఏ వ్యక్తిపేరు, నివాస స్థలము, వ్యాపారస్థలము , ఆ వ్యక్తి చేయు ఉద్యోగములో (బి) ఏ ఆస్తి , వస్తువుయొక్క వర్ణనలో, (సి) పన్ను విధించబడిన, కోరిన, చార్జీచేయబడిన మొత్తము విషయములో తప్పువల్ల ఆక్షేపింప , బాధింపబడకూడదు. ఈ చట్టము క్రింది ఏ చర్యలు, నమూనాలో తప్పు కారణముచేతనే, ఏ న్యాయస్థానమువల్ల త్రోసివేయబడదు లేక రద్దుచేయ బడదు.

(2) ఈ చట్టములోని నిబంధనలు సారాంశములోను అమలులోను నిర్వర్తింపబడినయెడల, ఈ చట్టము క్రింద అధికారమువల్ల వసూలు కాబడిన ఏ డబ్బు మొత్తము తీసికొనుటకు , చెప్పబడిన అధికారము క్రింద చేయబడిన ఏ పన్ను విధించుట, , డబ్బు వసూలువల్ల నష్టపరిహారము వసూలు చేయుటకు, ఏ దావా ఏ న్యాయస్థానములోను తేబడకూడదు.

(3) ఈ చట్టములోని ఏర్పాటు, నిబంధనలు, ఉపవిధులు, సారాంశము లోను, అమలులోను, నిర్వర్తింపబడిన యెడల, బిల్లు, నోటీసు, ఫారము, సమన్లు డిమాండు నోటీసు, జప్తు వారంటు, పట్టీ , దానికి సంబంధించిన యితర చర్యలో ఏ తప్పు, లోపము, లేక నమూనా కొరకు, ఈ చట్టము క్రింద ఏ జప్తు , అమ్మకము చట్టవిరుద్ధముగా భావింపబడదు. అది చేయు వ్యక్తి అక్రమముగా ప్రవేశించువాడుగా భావింపబడడు. కాని ఏ అక్రమమువల్ల నష్టపడు ప్రతివ్యక్తి అతనివల్ల పొందబడిన ప్రత్యేక నష్టపరిహారమునకు తృప్తిని పొందవచ్చును.

229. పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ ఉద్యోగులు లేక కంట్రాక్టర్లు:

పంచాయతీ సమితి, జిల్లా పరిషత్ దాని అధ్యక్షుడు - చైర్మన్

లేక నిర్వహణాధికారి, దాని సభ్యునకు, లేక పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ చే నియమింపబడిన ఏవ్యక్తి, లేక పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ తరపున ఒక కాంట్రాక్టులోనికి ప్రవేశించిన ఏవ్యక్తిని, ఈ చట్టము లేక దాని క్రింద చేయబడిన ఏ ఉపవిధి, నిబంధన, శాసనము లేక ఉత్తరువు వల్ల లేక దాని ఫలితముగా వారికి అధికారమివ్వబడిన వారిని ఏదిని లేక దీనిని చేయుటలో, ఏవ్యక్తి అడ్డు కలుగచేయుట లేక ఉపద్రవము కలుగజేయుట కూడదు.

230. నోటీసు తీసివేయుట లేక తుడిచివేయుట నిషేధము:

ఆ విషయములో అధికారము పొందనిదే ఏవ్యక్తి, పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ లేక దాని నిర్వహణాధికారిచే లేక ఉత్తరువులవల్ల ప్రదర్శింపబడిన ఏ నోటీసు లేక నిలబెటిన ఏ చిహ్నము లేక గుర్తును తొలగింపజేయుట, నాశనము చేయుట, తుడిచి వేయుట లేక యితర విధముగా నాశనము చేయుట గూడదు.

231. స్టేట్ మెంట్లు లేక రిటర్నులను దాఖలు చేయవలసినదిగా కరణములు, హెడ్ మన్‌లను కోరుటకు నిర్వహణాధికారి అధికారములు:

(1) పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ నిర్వహణాధికారి, కలెక్టరు అనుమతితో మరియు వ్రాత పూర్వకమైన ఉత్తరువు వల్ల పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్‌యొక్క ప్రదేశములోయున్న ఏ రివెన్యూ గ్రామముయొక్క కరణము లేక హెడ్‌మన్ యిద్దరిని, సబబైనకాలములో ఈ చటము ఉద్దేశముల కొరకు కావలసిన అట్టి రివెన్యూ గ్రామము విషయములో ఏ స్టేట్ మెంటు, ఎకౌంటు లేక రిటర్ను దాఖలుచేయవలసినదిగా కోరును.

(2) (1)వ సబ్ శెక్షను క్రింద జారీచేయబడిన ఏ ఉత్తరువును సబబైన కారణము లేకుండా ఏ గ్రామాధికారి మన్నించకుండా ఉండకూడదు.

232. పార్టీలను హాజరు కమ్మనుటకు నిర్వహణాధికారి అధికారము:

పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ నిర్వహణాధికారి, పన్ను విధించుటకు సంబంధించిన లేక ఈ చట్టము నిబంధనల క్రింద ఏ లైసెన్సును, లేక అనుమతిని మంజూరు చేయుటకు సంబంధించిన ఏ సమస్య విషయములో అతని ముందు హాజరు కమ్మనుటకు సాక్ష్యము యిచ్చుటకు లేక పత్రములు దాఖలు చేయుటకు ఏవ్యక్తిని హాజరు కమ్మనవచ్చును.

రాష్ట్రప్రభుత్వము అప్పచెప్పు పంచాయతీచేయు అధికారములు

233. ప్రభుత్వముచే అధికారముల ఒప్పగింపు:

రాష్ట్రప్రభుత్వము, ప్రకటనద్వారా, నిబంధనలనుచేయు అధికారము లేక షెడ్యూళ్లను మార్పు చేయు లేక రద్దుచేయు అధికారము, 128వ శెక్షను క్రింద

చెల్లింపవలసిన విరాళము నిశ్చయించు అధికారము, 227వ సెక్షను క్రింద వ్యాఖ్యము మంజూరు చేయు అధికారము తప్ప, ఈ చట్టము క్రింద వారిలో చేరిన ఏ ఒకటి లేక ఎక్కువ అధికారములను ఏ స్థానిక ప్రదేశములో చలాయించుటకు ఏవ్యక్తికి అధికారము యివ్వవచ్చును. అదేవిధముగా అట్టి అధికారమును తిరిగి పుచ్చుకొన వచ్చును.

234. స్థానిక అధికారుల మధ్య తగాయిదాల పరిష్కారింపు ;

ఈ చట్టము లేక ఏ యితర చట్టము నిబంధనల క్రింద బయలు దేరు ఏవిషయములలో పంచాయతీ సమితి జిల్లా పరిషత్‌ల మధ్య మరియు ఒకటి లేక ఒకటి కంటె ఎక్కువ యితర స్థానిక అధికారుల మధ్య ఒక తగాదా వచ్చునప్పుడు, రాష్ట్రప్రభుత్వము, దానిని ఆయా స్థానికాధికారులు వారిమధ్య సఖ్యతగా పరిష్కరించుకొనలేక పోవుచున్నారని అభిప్రాయపడిన, రాష్ట్ర ప్రభుత్వము ఆ తగాదాను గుర్తించి,

(a) వారంతట వారే తీర్మానించవచ్చును, లేక

(b) దానిని విచారణకు, రిపోర్టుకొరకు ఆర్బిట్రేటరునకు లేక ఆర్బిట్రేటర్ల బోర్డునకు లేక ఆ పనికి 30వ సెక్షనుక్రింద ఏర్పాటు చేయబడిన జాయింటు కమిటీకి రిఫరు చేయవచ్చును.

(2) (1)వ సబ్ సెక్షనుయొక్క క్లాజు (బి)లో సూచించిన రిపోర్టు రాష్ట్ర ప్రభుత్వమునకు దాఖలా చేయబడును. వారు తగాయిదా వారికియుక్తమని తోచిన రీతిని పరిష్కారము చేయుదురు.

(3) (1)వ సబ్ సెక్షనుయొక్క క్లాజు (ఎ) క్రింద క (2)వ సబ్ సెక్షనుక్రింద ఈ సబ్ సెక్షను అమలులోనికి వచ్చుటకు ముందు లేక తరువాత యివ్వబడిన ఏ తీర్పు, ఆ యా స్థానిక అధికారుల కోరికపైన, రాష్ట్రప్రభుత్వముచే వారికి యుక్తమని తోచినరీతిని కాలము వెంబడిని మార్పు చేయబడవచ్చును. ఈ సబ్ సెక్షను క్రింద దానిలో చేసిన మార్పులు ఏమైన యున్నయెడల, వానిలో ఏఅట్టి తీర్పు, ఆ యా స్థానిక అధికారుల కోరికపైన రాష్ట్రప్రభుత్వముచే ఎప్పుడైనను రద్దు కాబడవచ్చును.

ఏ అట్టి తీర్పు లేక దానిలోని మార్పు, లేక దాని రద్దు, ఆ యా స్థానిక అధికారులలో ప్రతి ఒక్కరిపైన కట్టుబడి యుండును. అది ఏ న్యాయస్థానములోను ఆక్షేపణ చేయబడుటకు వీలులేదు.

(4) ఈ సెక్షను క్రింద రాష్ట్రప్రభుత్వము అధికారములు, కంటోన్మెంటు అధికారి పార్టీ అయిన తగాయిదాకు సంబంధించినంతవరకు కేంద్ర ప్రభుత్వము ఏకీభవముతో మాత్రము చలాయించబడును.

235. మరియు 236 వదలబడినవి.

237. చట్టము యొక్క వ్యాప్తి, ప్రారంభము :

(1) ఈ చట్టము ఆంధ్రప్రదేశము అంతభాగమునకును, 1920వ మదరాసు జిల్లా మునిసిపాలిటీల చట్టము అనువర్తించు మునిసిపాలిటీలకు వ్యాపించును.

(2) ఇది, రాష్ట్ర ప్రభుత్వము ప్రకటనద్వారా నిర్ణయించు తేదీ లేక తేదీలు అమలులోనికి వచ్చును. వివిధ తారీకులు, ఈ చట్టము వివిధ నిబంధనలకు, రాష్ట్రము వివిధ భాగములకు, వివిధ తారీకులు నిర్ణయింప బడవచ్చును.

కాని, రాష్ట్రప్రభుత్వము, ప్రకటనద్వారా ఈ చట్టములోని ఏ సెక్షను లేక అట్టి సెక్షను భాగము లేక ఈ చట్టము ఏర్పాట్లక్రింద తయారుచేసిన ఏ నిబంధన, వాటికి యుక్తమని తోచిన నియమితములు లేక మార్పులతో 1874వ షెడ్యూలు జిల్లాల చట్టములో చెప్పబడిన ఏ షెడ్యూలు జిల్లాకు అనువర్తింపజేసి అవలంబింప జేయవచ్చును.

238, 239, 240 వదలబడినవి.

240. (A) జిల్లా బోర్డుల పనులను పంచాయతీలకు బదిలాయింపు:

ఈ చట్టములో లేక 1850వ మదరాసు గ్రామ పంచాయతీల చట్టములో ఏది యున్నప్పటికి, రాష్ట్రప్రభుత్వము, ప్రకటనద్వారా, అందులో విరిష్టము చేయబడు నియమితములు షరతులకు మరియు అట్టి అధీనము, పునర్విమర్శకు బద్దమై, 1920వ ఈ చట్టముచే లేక క్రింద పంచాయతీల సమితి లేక జిల్లా పరిషత్‌లో చేరిన ఏపని పంచాయతీ లేక పంచాయతీల తరగతికి బదిలీకాబడి నిర్వర్తింప బడును అని ఉత్తర్వు చేయవచ్చును.

241. ఇతర చట్టములు మొదలగు వాటిలోని అధ్యక్షుని రిఫరెన్సుల నిర్మాణము:

(1) ఆంధ్రప్రదేశ్ రాష్ట్రముయొక్క ఆంధ్ర ప్రాంతములో అమలులో యున్న ఏ చట్టములోని లేక అట్టి చట్టము క్రింద జేసిన అట్టి రాష్ట్రములో అమలులోయున్న ఏ ప్రకటన, ఉత్తరువు, స్కీము, నిబంధన, ఫారము లేక ఉపవిధిలోని జిల్లాబోర్డు అధ్యక్షుని రిఫరెన్సు, అట్టి అధ్యక్షుని

లేక చైర్మన్ యొక్క నిర్వహణ పనులకు చెందియుండిన యెడల, పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ నిర్వహణాధికారికి చెందిన రిఫరెన్సుగా భావింపబడ వలయును.

(2) అట్టి రిఫరెన్సు అట్టి అధ్యక్షుని నిర్వహణ పనులకు చెందినదా కాదా అను సమస్య ఏర్పడినచో, రాష్ట్ర ప్రభుత్వము తీర్పు ఆఖరుది.

## 1వ షెడ్యూలు

## తీసివేయబడిన చట్టములు

## 2వ సెక్షను చూడుము

| సంవత్సరము | నెంబరు | సంగ్రహనామము | ఎంతవరకు తీసివేయ బడినది |
|---|---|---|---|
| 1884 | V | మదరాసు స్థానిక బోర్డుల చట్టము, 1884 | |
| 1890 | III | మదరాసు స్థానిక బోర్డుల మరియు అద్దె వసూలు (సవరణ) చట్టము, 1890 | ఇంతకుముందే తీసి వేయనంతవరకు |
| 1900 | VI | మదరాసు స్థానిక బోర్డుల (సవరణ) చట్టము, 1900 | పూర్తిగా |
| 1901 | XI | రద్దు మరియు సవరణ చట్టము, 1901 (ఇండియా) | 1884వ మదరాసు స్థానిక బోర్డుల చట్టముకు సంబంధించిన రెండవ షెడ్యూలు మటుకు. |
| 1918 | III | మదరాసు జిల్లా మునిసిపాలిటీలు మరియు స్థానిక బోర్డులు (సవరణ) చట్టము, 1918 | ఇంతకు ముందే తీసి వేయనంతవరకు |

| | | | |
|---|---|---|---|
| 1914 | VIII | మద్రాసు డీసెంట్రలై జేషన్ చట్టము, 1914 | 1884 వ మద్రాసు స్థానిక బోర్డుల చట్టముకు సంబంధించిన షెడ్యూలు వరకు. |

## II మరియు III షెడ్యూల్లు (వదలబడినవి)

## షెడ్యూలు IV

## పన్ను విధించు నిబంధనలు
## (92, 93 సెక్షనులను చూడుము)

### 1వ భాగము - భూమి పన్ను

1. జిల్లా కలెక్టరు, భూమి పన్ను విధించుటకు వసూలు చేయుటకు జవాబుదారీగా యుండును.

2. వదలబడినది.

3. జిల్లా కలెక్టరు, 92వ సెక్షను నిబంధనల ననుసరించి, ఈ చట్టము అతనికి యిచ్చిన అధికారముక్రింద వసూలు కాబడ్డ భూమి పన్ను నుండి నికర రాబడిని, పంచాయతీ సమితి నిధికి, జిల్లా పరిషత్ నిధికి పంచాయతీ నిధికి చేర్చుటకు ఏర్పాటు చేయును.

4. జిల్లా కలెక్టరు, సాంవత్సరికముగా, రాష్ట్రప్రభుత్వము సాధారణ లేక ప్రత్యేక ఉత్తరువువల్ల ఏర్పాటుచేయు కాలములలో, జిల్లా పరిషత్ లేక పంచాయతీ సమితి లేక ఆయా పంచాయతీలకు ఈ చట్టము క్రింద ఆతనిచే వసూలు కాబడు భూమిపన్ను వసూలుయొక్క మొత్తము రాదగు ఖర్చులుయొక్క ఎస్టిమేటును దాఖలు చేయును.

### IIవ భాగము - వృత్తి పన్ను

5. (1) జిల్లా పరిషత్ లేక పంచాయతీ సమితి నిర్వహణాధికారి వృత్తి పన్ను చెల్లించవలసిన కంపెనీలు, వ్యక్తులు తెలియజేయు పన్ను విధించు పుస్తకములు తయారుచేసి ఉంచును.

(2) పన్ను విధించు పుస్తకములు మరియు ఏ పన్ను విధించుటకు చెందియున్న తనిఖీలు వివరములు విడి రికార్డులలో ఉంచినయెడల, అట్టి వివరములుగల దాని భాగము, జిల్లా పరిషత్‌కు లేక పంచాయతీ సమితికి లేక అతనిచే అధికార మివ్వబడిన ఏజంటునకు పన్ను చెల్లించు ఏ వ్యక్తిచేత ఖర్చులేకుండ తనిఖీ చేయుటకు సబబైన అన్ని వేళలయందు తెరచియుంచబడును. మరియు అట్టి వ్యక్తి లేక ఏజంటు అట్టి పుస్తకములనుండియు రికార్డులనుండియు, ఖర్చు లేకుండగా ఎక్స్ట్రాక్టులు తీయుటకు అధికారము కలిగియున్నాడు.

(3) జిల్లా పరిషత్ లేక పంచాయతీ సమితి ఎకౌంటు పుస్తకములు, పంచాయతీ సమితి లేక జిలా పరిషత్ నిర్ణయించు ప్రతి నెలలో ఒక రోజు లేక రోజులలో, జిల్లా పరిషత్ లేక పంచాయతీ సమితి లేక అతనిచే అధికార మివ్వబడిన ఏజంటునకు పన్ను చెల్లించు ఏవ్యక్తిచేత, ఖర్చులేకుండా తనిఖీ చేయబడుటకు తెరచి ఉంచబడును.

(4) (a) ఎప్పుడైన జిల్లా పరిషత్ లేక పంచాయతీ సమితికి ఏ కంపెనీ లేక వ్యక్తి తక్కువగా పన్ను విధింపబడునట్లు లేక పన్ను చెల్లించు పుస్తకములనుండి అజాగ్రత్తవల్ల లేక అక్రమముగా వదలబడినాడని లేక అట్టి పుస్తకములలో వ్రాత సంబంధమైన లేక లెక్కల సంబంధమైన తప్పు ఉన్నట్లు తోచినచో, దానికి న్యాయము అవసరమని తోచిన రీతిగా ఆ పుస్తకములను సవరణ చేయుటకు, అది నిర్వహణాధికారికి ఉత్తరువు యివ్వవచ్చును.

కాని, ఏర్పాటు చేయదలచుకొనిన రీతిగా పన్నువిధించు పుస్తకములు ఎందుకు సవరణ కాబడకూడదో చెప్పుటకు ఆ యా కంపెనీ లేక వ్యక్తి సబబైన అవకాశము యివ్వబడిననేతప్ప, ఉత్తరువు పన్ను విధించుటలో హెచ్చును, సూచించినప్పుడు ఏ అట్టి ఉత్తరువు యివ్వబడకూడదు.

(b) సవరణ న్యాయమైనది అని చెప్పు పరిస్థితులు ఉన్న దానికి ముందు వెంటనే ప్రస్తుతము జరుగుచున్న సగము సంవత్సరములో లేక రెండవ సగము సంవత్సరములలో ముందు తేదీన, అట్టి సవరణ అమలులోనికి వచ్చినట్లుగా భావింపబడవలెను.

(5) నిర్వహణాధికారి, ఈ చట్టములో యితర విధముగా ఏర్పాటు చేయబడిన తప్ప, ప్రతి కంపెనీ లేక వ్యక్తి చెల్లించవలసిన పన్నును నిర్ణయించును.

కాని నిర్వహణాధికారి చెల్లించవలసిన పన్నుల విషయములో పన్ను విధించుట జిల్లా పరిషత్ లేక పంచాయతీ సమితిచే చేయబడును.

7. (1) నిర్వహణాధికారి, పన్ను చెల్లించు ప్రతివ్యక్తికి, అతనిచే లేక ఆ విషయములో అతనిచే క్రమముగా అధికారమివ్వబడిన యింకొక వ్యక్తిచేగాని సంతకము చేయబడిన దాని రసీదును యిచ్చును.

(2) అట్టి రసీదులు ఈ క్రింది వాటిని నిర్దిష్టము చేయును—

(a) దాని మంజూరు తారీఖు,

(b) మంజూరు చేయబడిన వ్యక్తి పేరు,

(c) చెల్లింపు జరిగిన పన్ను,

(d) చెల్లింపు జరిగిన కాలపరిమితి, మరియు

(e) చెల్లించిన మొత్తము.

8. వదలబడినది.

## వృత్తిపన్ను విధించుట

9. వృత్తిపన్ను విధించుటకొరకు కంపెనీలు వ్యక్తులు విభజింపబడు తరగతులు, ప్రతి తరగతిమీద విధింపబడు గరిష్ఠ అర్ధ సంవత్సరపు పన్ను ఈ క్రింది విధముగా యుండును—

| తరగతి | అర్ధసంవత్సరపు రాబడి | గరిష్ఠ అర్ధ సంవత్సరపు పన్ను |
|---|---|---|
| I | 15,000 రూపాయలకు ఎక్కువ | రూ. 125 |
| II | 12,000 రూపాయలకు మించి 15,000 మించకుండా | రూ. 100 |
| III | 9,000 రూపాయలకు మించి 12,000 రూపాయలకు మించకుండా | |
| IV | 6,000 రూపాయలకు మించి 9,000 రూపాయలకు మించకుండా | రూ. 50 |
| V | 4,800 రూ. మించి 6,000 డిటో | రూ. 25 |
| VI | 3,000 రూ. 4,800 రూ. డిటో | రూ. 12 |
| VII | 1,800 రూ. డిటో 3,000 రూ. డిటో | రూ. 6 |

| | | | | |
|---|---|---|---|---|
| VIII | 1200 రూ మించి | 1800 రూ | మించకుండా | రూ 4 |
| IX | 600 రూ డిటో | 1200 రూ | డిటో | రూ 2 |
| X | 300 రూ డిటో | 600 రూ | డిటో | రూ 1 |

(2) (1) ఎ సబ్ రూలులో నిర్దిష్టమైన గరిష్టమునకు కట్టుబడి. ప్రతి తరగతిమీద విధింపదగు పన్ను, పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ నిర్ణ యించును.

కాని ఏ తరగతి పైన పన్నుకు ఆ తరగతి కనిష్ట ఆదాయమునకు నిష్పత్తి, ఏ విషయములోను చిన్న తరగతిమీద పన్నుకు అట్టి చిన్న తరగతి కనిష్ఠ ఆదాయమునకు నిష్పత్తి కంటె తక్కువగా యుండకూడదు.

(3) పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్, (1) వ సబ్ రూలులో తరగతులయొక్క ఏ ఒకటి లేక ఎక్కువను వృత్తిపన్ను బాధ్యతనుండి మినహా యించ వచ్చును. కాని ఏ చిన్నతరగతి పన్ను చెల్లింపవలసి యుండునపుడు, ఏ తరగతి బాధ్యత నుండి మినహా యింప బడకూడదు.

10. ఏ కంపెనీ లేక వ్యక్తి అట్టి కంపెనీ లేక పంచాయతీ కాని ప్రదేశ ములలో కార్యాలయము లేక ఉద్యోగము చేయు స్థలము కలిగి యున్న అట్టి పంచాయతీ కాని ప్రదేశములో వ్యాపారము చేసినట్లుగను లేక వృత్తి, కళ, పని చలాయించి నట్లుగను లేక ఉద్యోగమును పొంది నట్లుగాభావింపబడ కూడదు.

11. (1) ఒకే పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ యొక్క కేవలము పంచాయతీ కాని ప్రదేశములో ఏ అర్ధ సంవత్సరములో డబ్బు అప్పు ఇచ్చు ఏ వ్యాపారము కాక ఏ వ్యాపారము ఏ కంపెనీ లేక వ్యక్తి చేసినచో. ఆ వ్యాపారము చేయుట వల్ల వచ్చిన అట్టి కంపెనీ లేక వ్యక్తి ఆదాయము, అర్ధ సంవత్సరములో ఈ చట్టము క్రింద వృత్తిపన్ను విధించుటకు, ఈ క్రింది విధముగా పరిగణింపబడును.

(ఎ) 1922 ఇండియన్ ఆదాయపుపన్ను చట్టము క్రింద ఏ కంపెనీ లేక వ్యక్తి మీద ఆదాయపు పన్ను విధింపబడిన యెడల మరియు ఆదాయపు పన్ను విధించుట కొరకు, 1922 వ ఇండియన్ ఆదాయపు పన్ను చట్టము యొక్క 10 వ సెక్షను క్రింద, ఆ వ్యాపారము లాభములు, ఆదాయములు ఎంచిన మొత్తము యొక్క అర్ధ సంవత్సరము కలిగి యున్న సంవత్సరమునకు

(బి) అట్టి ఆదాయములు, లాభముల మొత్తము కనుగొనుటకు వీలులేక పోయినయెడల లేక అట్టి కంపెనీ లేక వ్యక్తి ఆదాయపు పన్ను విధింపబడనప్పుడు, అర సంవత్సరములో పంచాయతీ సమితి జిల్లా పరిషత్ యొక్క పంచాయతీ కాని ప్రదేశములో చేసిన అట్టి వ్యాపారముయొక్క ఉత్పత్తిని, రాష్ట్ర శాసనశాఖ యొక్క రెండు హౌసుల అనుమతికి కట్టుబడి, రాష్ట్ర ప్రభుత్వము నిర్ణయించునట్టి శాతము లేక శాతములు లేక యిదికూడ కనుగొన వీలులేనప్పుడు, ఇంతకు ముందు సంవత్సరము యొక్క సరియైన అర్ధ సంవత్సరములో.

(2) ఒక కంపెనీ లేక వ్యక్తి డబ్బు అప్పుయిచ్చు వ్యాపారముగాక ఏ వ్యాపారమును పంచాయతీ సమితి జిల్లా పరిషత్ యొక్క పంచాయతీ కాని ప్రదేశములో కొంత, అట్టి ప్రదేశమునకు ఆవల కొంత చేసినచో, జిల్లా పరిషత్ లేక పంచాయతీ సమితియొక్క పంచాయతీ కాని ప్రదేశములో అట్టి వ్యాపారం చేసినప్పటినుండి అట్టి కంపెనీ లేక వ్యక్తియొక్క ఆదాయము, ఈ చట్టముక్రింద వృత్తిపన్ను విధించుటకు, అర్ధసంవత్సరములో లేక ఇంతకుముందు సంవత్సరమునకు సరియైన అర్ధసంవత్సరములో అట్టి ప్రదేశములో జరిగినట్టి వ్యాపారము యొక్క ఉత్పత్తియొక్క (1) వ సబ్ రూలు యొక్క క్లాజు (బి)లో సూచించిన శాతముగా భావింపబడును.

(3) (1)వ సబ్ రూలుయొక్క క్లాజు (బి), (2)వ సబ్ రూలు కొరకు పంచాయతీకాని ఏ ప్రదేశములోని వ్యాపారముయొక్క ఉత్పత్తి అనగా అట్టి పంచాయతీకాని ప్రదేశములో చేసిన డబ్బు అప్పు యిచ్చు వ్యాపారము తప్ప ఏ యితర వ్యాపారముయొక్క లేక ఉత్పత్తి చేసిన, తయారుచేసిన, కొనిన లేక అమ్మిన వస్తువులయొక్క మొత్తము ధనము విలువ అని అర్థము.

వివరణ: ఈ సబ్ రూలు క్రింద వ్యాపారము ఉత్పత్తిని నిర్ణయించుటకు.

(a) కంపెనీ లేక వ్యక్తి కొనుటవల్ల ఏ వస్తువుల వప్పగింత, మరియు అదే కంపెనీ లేక వ్యక్తి దానిని కొనుటవల్ల వప్పగింత రెండును ఆంధ్రరాష్ట్రములోనే జరిగినయెడల, ఆఖరు జరిగిన క్రియ లెక్కలోనికి తీసికొనబడును;

(b) కంపెనీ లేక వ్యక్తి కొనుటవల్ల ఏ వస్తువులు అప్పగింత, రాష్ట్రమునకు బయట ఏ స్థలములో జరిగినయెడల, అదే కంపెనీ లేక వ్యక్తి దానిని కొనుటవల్ల వప్పగింత చెప్పబడిన రాష్ట్రములో ఏ స్థలములో జరిగినయెడల, ఆఖరు జరిగిన క్రియ లెక్కలోనికి తీసికొనబడును; మరియు

(c) కంపెనీ లేక వ్యక్తి కొనుటవల్ల ఏ వస్తువుల వప్పగింత అట్టి రాష్ట్రములో ఏస్థలములో జరిగినయెడల, అదే కంపెనీ లేక వ్యక్తి దానిని కొనుట వల్ల వప్పగింత, అట్టి రాష్ట్రము బయట ఏ స్థలములో జరిగినయెడల మొదట జరిగిన క్రియ లెక్కలోనికి తీసికొనబడును.

(1) (A) (1) జిల్లా పరిషత్ లేక పంచాయతీ సమితి నిర్వహణాధికారి ఉద్దేశములో ఏ అర్థ సంవత్సరమునకు ఏ కంపెనీ లేక వ్యక్తివల్ల వృత్తిపన్ను రావలసియున్నయెడల, ప్రస్తావనలో ఉన్న అర్థ సంవత్సరమునకు వృత్తిపన్ను ఆ కంపెనీ లేక వ్యక్తి ప్రకారము, వారు విధింపబడదగు ఆధారముగల ఆదాయ మును తెలియజేయుచు నియమితమైన ఫారములో ఒక రిటర్ను, నోటీసులో నిర్దిష్టము చేయబడు ముప్పది దినములకు తక్కువ కాకుండినట్టి కాలపరిమితిలో అట్టి కంపెనీ లేక వ్యక్తి దాఖలు చేయవలసినదిగా కోరుచూ ఆ అర్థ సంవత్స రములో లేక తరువాత వచ్చు అర్థ సంవత్సరములో అట్టి కంపెనీ లేక వ్యక్తిమీద, అతడు ఒక నోటీసును జారీచేయును. దానిమీదట, ముందు సంవత్సరమునకు సరియైన అర్ధ సంవత్సరముకు లేక వృత్తి పన్ను కోరిన అర్థ సంవత్సరములో, అది లేక అతనివల్ల పొందబడిన ఆదాయమును తెలియజేయుచు ఒక రిటర్నును దాఖలు చేయుటకు చేసిన రిటర్నుకు దోహదముగా కంపెనీ లేక వ్యక్తి ఆధారపడ వలసిన సాక్ష్యమును దాఖలు చేయుటకు అట్టి కంపెనీ లేక వ్యక్తికి అవసరమై యున్నది.

(2) (1)వ సబ్ రూలు క్రింద కావలసిన రీతిగా ఒక రిటర్ను చేయబడిన యెడల మరియు నిర్వహణాధికారి అది సరియైనది, పూర్తి అయినదని తృప్తి పడినచో, అతడు అట్టి రిటర్ను ఆధారముమీద అట్టి కంపెనీ లేక వ్యక్తిమీద వృత్తిపన్ను విధించును.

వివరణ: (1) వ సబ్ రూలు యొక్క కాజు (బి) క్రింద దాని విషయము లలో లేక 11వ నిబంధనయొక్క (2) వ సబ్ రూలు క్రింద దాని విషయములలో, ప్రస్తావన అర్థ సంవత్సరము కలిగియున్న సంవత్సరమునకు, 1922 వ ఇండియన్ ఆదాయపు పన్ను చట్టము యొక్క 29 వ శెక్షను క్రింద దానిమీద లేక అతనిమీద జారీచేసిన ఆదాయపు పన్ను యొక్క డిమాండునోటీసు కంపెనీ లేక వ్యక్తి దాఖలు చేసినచో, నిర్వహణాధికారి, అట్టి డిమాండు నోటీసులో చెప్పబడిన ఆధాయములో ఒక సగము, ఈ చట్టము క్రింద వృత్తిపన్ను విధింపదగు ఆధారముల నుంచి పొందిన ఆదాయముగాను, వృత్తిపన్ను విధించుటకు అట్టి ఆధారములమీద ఆదాయముగాను తీసికొనుటకు బద్ధుడై యున్నాడు.

(3) (1) వ సబ్ రూలు క్రింద కావలసిన రీతిగా రిటర్ను చేయబడ నిచో లేక నిర్వహణాధికారి ఆవిధముగా చేసిన రిటర్ను తప్పు లేక అసంపూర్తి అయినదని తృప్తిపడినచో, నిర్వహణాధికారి, అతనిచే ఎస్టిమేటున చేయబడిన అట్టి కంపెనీ లేక వ్యక్తి యొక్క అర్ధ సంవత్సరపు ఆదాయమునకు తగిన స్కేలులో కంపెనీ లేక వక్తికి యిచ్చి వేయును.

(4) (3) వ సబ్ రూలు క్రింద కంపెనీ లేక వ్యక్తిని తరగతించు నపుడు, నిర్వహణాధికారి చేసిన వ్యాపారము యొక్క స్వభావము, గౌరవవిలువ నివాసము మరియు వ్యాపారము, ఆవరణలు, పరిమాణము, అద్దె, వుపయోగించిన పరికరముల మొత్తము లేక సంఖ్య, ప్రభుత్వమునకు చెల్లించు ఆదాయపు పన్నును సూచించుచు, సాధారణ విచారణలమీద ఆ విధముగా చేయవచ్చును.

(5) ఏ కంపెనీ లేక వ్యక్తియొక్క లెక్కలను తెప్పించుటకు, నిర్వహణాధికారికి హక్కులేదు.

12 నుంచి 26 వరకు వదలబడినవి.

## అపీళ్ళు.

27. 11 (A) నిబంధన క్రింద నిర్వహణాధికారి చర్యల విషయములో జిల్లా పరిషత్ లేక పంచాయతీ సమితికి ఒక అపీలు ఉండును.

28. జిల్లా పరిషత్ లేక పంచాయతీ సమితికి అపీలు, ఈ క్రిందివి తప్పితే వినబడదు.

(i) ఫిర్యాదు చేయబడిన పన్ను కోరబడిన తరువాత ముప్పది దినముల లోపల జిల్లా పరిషత్ లేక పంచాయతీ సమితి కార్యాలయము అది చేరిన తప్ప, మరియు—

(ii) (i) వ క్లాజులో నిర్దిష్టమైన కాలములో జిల్లా పరిషత్ లేక పంచాయతీ సమితియొక్క కార్యాలయమువద్ద అపీలు ఏ విషయములో దాఖలు చేయ బడినచో ఆ పన్నును బీదరికమువల్ల నిర్వహణాధికారి యింకొక విధముగా ఉత్తర్వు చేసిన తప్ప చెల్లించిన లేక ధరావతు చేసిన తప్ప:

29. జిల్లా పరిషత్ లేక పంచాయతీ సమితి, అదంతట అది లేక యితర విధముగా, పన్నును తగ్గించుట లేక వదలివేయుట నిర్వహణాధికారిచే యివ్వబడు ఏ వుత్తరువును రద్దు లేక మార్పు చేయవచ్చును.

30. అప్పీలుమీద, జిల్లా పరిషత్ లేక పంచాయతీ సమితిచేత మంజూరు చేయబడిన ఏ ఉత్తరువుల ననుసరించి, పన్ను విధించు పుస్తకములు దిద్దబడును. పన్ను మొత్తము జిల్లా పరిషత్ లేక పంచాయతీ సమితిచే తగ్గింపబడుట లేక వదలబడిన విషయములో, నిర్వహణాధికారి ఆ విధముగా ముదరా యిచ్చును.

31. ఇంతకుముందు ఏర్పాటు చేయబడిన రీతిని అపీలు వేయకపోయిన యెడల పన్ను విధించుట లేక కోరుట, మరియు అట్టి అపీలు వేయబడినప్పుడు దానిమీద జిల్లా పరిషత్ లేక పంచాయతీ సమితి తీర్పు ఆఖరుది.

కాని పన్ను విధించు పుస్తకముల ననుసరించి అట్టి పన్ను విధించుట లేక కోరుట లేనప్పుడు, దానిని అనుసరించే కొత్తపన్ను విధించుట లేక పన్నుకోరుట, ఈ నిబంధనలోనిదేదియు నిషేధించినట్లుగా భావింపబడకూడదు.

32. (1) 96 వ సెక్షనుక్రింద నోటీసు నిర్వహణాధికారిచే లేక ఆ విషయములో అతనిచేత అధికారమివ్వబడిన ఇంకొక వ్యక్తిచేత సంతకము చేయబడి, ఈ క్రిందివాటిని కలిగియుండును.

(a) కాలము, పన్ను విధింపబడిన వృత్తియొక్క వర్ణనయొక్క స్టేట్మెంటు ; మరియు

(b) చెల్లించకపోవుటవల్ల కలిగిన బాధ్యతయొక్క నోటీసు.

(2) ఏ అర్ధ సంవత్సరమునకు పన్ను, ఆ అర్ధ సంవత్సరములో లేక తరువాత వచ్చు అర్ధసంవత్సరములో అట్టి వ్యక్తిమీద నోటీసు జారీ చేయబడనిదే, 33 వ నిబంధనలో తెలియజేసిన రీతిని ఏవ్యక్తినుండి వసూలు చేయబడకూడదు.

కాని 5 వ నిబంధనయొక్క (4) వ ఉపనిబంధనక్రింద పన్ను విధించు పుస్తకములు సవరణ చేయబడినపుడు, సవరణచేయబడిన అర్ధ సంవత్సరములో లేక తరువాత వచ్చు అర్ధ సంవత్సరములో, ఒక నోటీసు జారీ చేయబడవచ్చును.

(3) ఈ నిబంధనలోని లేక 33 వ నిబంధనలోని దేదియు, జిల్లా పరిషత్ లేక పంచాయతీ సమితి ఈ చట్టముక్రింద దానికి రావలసిన పన్ను కొరకు ఏ సివిలు కోర్టులో దావా వేయుటకు అడ్డురాదు.

33 (*i*) పన్నువల్ల రావలసిన మొత్తము నోటీసు అందిన పదిహేను రోజులలో చెల్లించకపోయినచో మరియు పన్ను చెల్లించవలసిన వ్యక్తి, అది ఎందుకు చెల్లింపనక్కరలేదో నిర్వహణాధికారి, తృప్తికి కారణము చూపించక పోయినయెడల, నిర్వహణాధికారి, అతని వారంటుక్రింద జప్తుచేతను, పన్ను చెల్లించనివాని చరాస్థి అమ్మకముచేతను, పన్నువల్ల రాదగుమొత్తము, వారంటు, రుసుము, జప్తురుసుము, ఆ విధముగ జప్తు కాబడ్డ ఆస్తి ఉంచివేయుట లేక అమ్మకము సందర్భములో బహుశా తగులుబాటు కాగల ఖర్చులకు సమమగు అధికమైన మొత్తముతో సహా వసూలు చేయవచ్చును.

కాని ఎల్లప్పుడు, 1908వ సివిల్ ప్రొసీజరు కోడ్ యొక్క 60వ శెక్షను మినహాయింపు నిబంధనలో చెప్పబడిన చరాస్తి జప్తు కాబడుటకు వీలులేదు.

(2) ఏ కారణము వల్లనైనను, పన్ను చెల్లించనివానిఆస్తి యొక్క జప్తు లేక కావలసినజప్తు చేయవీలులేనిదైనయెడల, నిర్వహణాధికారి పన్ను చెల్లించని వానిమీద మేజిస్ట్రేటు ముందు నేరము మోపవచ్చును.

(3) వదలబడినది.

(4) (1)వ సబ్‌రూలు క్రింద వారంటు. ఈ నిబంధనలకు అనుబంధము Aలో చూపిన ఫారములోను లేక అట్టివిధమైన ఇంకొకఫారములోను ఉండును; అట్టి ప్రతి వారంటుకు, రెండు అణాల రుసుము విధించ బడును.

(5) నిర్వహణాధికారి వ్రాతపూర్వకమైన ప్రత్యేక ఉత్తరువు క్రింద జప్తు వారంటు అమలు జరుపుటకు నియమింపబడిన ఉద్యోగి, పట్టుకొనవలసిన ఆస్తి అట్టిభవనములో యున్నదని నమ్ముటకు అతనికి సబబైన ఆధారము ఉన్నయెడల లేక అతని అధికారము, ఉద్దేశము ప్రకటించిన తరువాత ప్రవేశమును క్రమముగా కోరిన తరువాత, యితర విధముగ ప్రవేశమును పొందలేకపోయిన యెడల, సూర్యోదయము సూర్యాస్తమయముమధ్య జప్తుచేయుటకు భవనము బయటి లేక లోపలతలుపు లేక కిటికీ పగలగొట్టవచ్చును.

కాని అట్టి అధికారి, స్త్రీలకు వినియోగింపబడిన ఏగది, తలుపు, అతని ఉద్దేశమును తెలుపుచూ మూడుగంటల నోటీసు యివ్వనిదే, అట్టిస్త్రీలకు అచటి నుండి పోవుటకు అవకాశ మివ్వనిదే, లోనికి ప్రవేశించుటకాని లేక పగల గొట్టుటగావి చేయకూడదు.

34. (1) వారంటు అమలుజరుపుటకు నియోగింపబడిన ఉద్యోగి, జప్తు చేయుటకు ముందురావలసినపన్ను, వారంటు రుసుము చెల్లింపును కోరును. పన్ను రుసుము చెల్లింపబడినప్పుడు, జప్తుచేయబడదు. కాని పన్ను లేక రుసుము చెల్లింప బడనిచో ఉద్యోగి ;

(*A*) అతడు అనుకొను కావలసిన రీతిగా పన్ను చెల్లించనివాని అట్టి చరాస్తి పట్టుకొనవచ్చును ;

(*B*) పట్టుకొనిన ఆస్తియొక్క పట్టీని తయారుచేయును ; మరియు—

(*C*) పట్టుకొనిన ఆస్తిని స్వాధీనమందుంచుకొనిన వ్యక్తికి, పట్టుకొను నప్పుడు, ఈ నిబంధనలకు B అనుబంథములోని ఫారములో లేక అదేమాదిరి యింకొకఫారములో పట్టీయొక్క నకలు, అమ్మకమునోటీసు యిచ్చును ;

కాని చెల్లించవలసిన మొత్తములు చెల్లించుటకు, పట్టుబడిన ఆస్తి విడి పించుటకు ఒకవారము రోజుల కాలము యివ్వబడును.

(2) జప్తు అధికముగా యుండకూడదు. అనగా జప్తుచేయబడిన ఆస్తి సాధ్యమైనంత దగ్గరగా పన్ను చెల్లించనివాడు చెల్లించవలసినపన్నుకు, వారంటు, జప్తు, ఉంచివేయుట మరియు అమ్మకములో తగులుబాటగు అన్నిఖర్చులతో సహా, సమముగా యుండవలెను.

35. (1) పన్నువల్ల అపరాధిచే చెల్లింపబడవలసిన మొత్తము, వారంటు రుసుము, జప్తురుసుము, ఆస్తిని ఉంచుకొనుటలో తగులుబాటు అయినఖర్చులు 34వ నిబంధన క్రింద యివ్వబడిన నోటీసులో తెలియజేసిన వారము రోజులలో చెల్లింపబడక పోయినచో, జప్తువారంటు నిర్వహణాధికారిచే ఆపుదల చేయబడ నప్పుడు, నిర్వహణాధికారి ఉత్తరువుల క్రింద పట్టుబడిన ఆస్తిలేక దానిలో కావల సినంత భాగము బహిరంగ వేలములో అమ్మబడును. అతడు అమ్మకమువల్ల వచ్చినదానిని పన్ను చెల్లింపవలసిన మొత్తము, వారంటు రుసుము, జప్తురుసుము, ఆస్తి ఆపుదల, అమ్మకమునకు అగు ఖర్చులు చెల్లించుటకు వినియోగించి, పట్టు బడిన కాలములో ఆస్తి అధీనములో యున్నదో వారికి పై చెప్పబడిన రీతిగా అమ్మకము తరువాత దాని వరుంబడులను వినియోగించిన తరువాత మిగిలిన ఆస్తి లేక మొత్తమును యిచ్చివేయును. అమ్మకము వరుంబడులు పన్నువల్ల చెల్లింప వలసిన మొత్తము వారంటు రుసుము, జప్తురుసుము, ఆస్తి ఆపుదల, అమ్మకము నకు అగుఖర్చులు చెల్లించుటకు సరిపోని పక్షమున, నిర్వహణాధికారి చెల్లించ కుండ మిగిలియున్న మొత్తము విషయములో 33 వ నిబంధన క్రింద తిరిగి ఆరంభింపవచ్చును.

(2) పట్టుబడిన ఆస్తి తొందరగా స్వాభావికముగా పాడైపోవునది అయిన, నిర్వహణాధికారి, రావలసిన సొమ్ము ముందుగా చెల్లింపబడినతప్ప, చెప్పబడిన ఏడురోజుల కాలము దాటకమునుపే ఎప్పుడైనను దానిని అమ్మివేయ వచ్చును.

(3) చెప్పబడిన ఏడురోజుల కాలములో చేయబడిన ఏ ఆస్తి జప్తుకు అక్షేపణలు నిర్వహణాధికారి విచారించి, దాని పరిశోధన అగువరకు అమ్మకమును త్రోసిపెట్టవచ్చును. నిర్వహణాధికారి జప్తు చేయబడిన ఆస్తి జప్తు కాబడకూడదని నిర్ణయించినచో, అతడు దానిని తిరిగి యిచ్చివేయును, లేక అది అంతకుముందే అమ్మబడి యుండునెడల, అమ్మకము వరుంబడులు దానికి హక్కు ఉన్నదను నట్లుగా కనపడు వ్యక్తికి యివ్వబడును. అతడు 33వ నిబంధన క్రింద తిరిగి ప్రారంభించును; మొదటి జప్తు అమ్మకము విషయములో తగులుబాటగు అన్ని రుసుములు, ఖర్చులు, అపరాధినుండి, అతడు ఆతనికి తెలిసినంతవరకు అది జప్తుచేయబడినది కానప్పుడు ఆస్తి జప్తును స్వయంకృతముగా చేయించినాడని నిర్వహణాధికారికి కనపడినచో, వసూలు చేయబడును.

36. (1) పంచాయతీ సమితి నిర్ణయించు ఈ నిబంధనలకు C అనుబంధములో తెలియజేసినవాటిని మించకుండనట్టి రేటులపైన, జప్తు రుసుములు చెల్లించబడవలెను.

(2) అట్టి రుసుములు, ఈ చట్టము క్రింద జప్తుచేయబడిన ఆస్తి ఆపుదలకు సంబంధించిన ఖర్చులనుకూడ కలిగియున్నట్లుగా భావింపకూడదు.

37. 33వ నిబంధనయొక్క (1)వ సబ్‌రూలు క్రింద తప్పుచేసిన వ్యక్తియొక్క ఆస్తి జిల్లా పరిషత్ లేక పంచాయతీ సమితియొక్క ప్రదేశములో అది ఎక్కడ కనుగొనబడినను, జప్తు చేయబడవచ్చును.

38. వదలిబడినది.

39. (1) 36వ నిబంధనయొక్క (2)వ సబ్‌రూలుక్రింద వాజ్యము నడిపింపబడిన ప్రతివ్యక్తి; అతడు పట్టుదలగా అతడు చెల్లింపవలసిన మొత్తముచు చెల్లింపకుండినట్లు లేక జప్తు లేక సరిపడు జప్తును అతడు పట్టుదలగా అడ్డినట్లు మేజిస్ట్రేటు తృప్తికి రుజువున, అతడు ఈ క్రిందివాటికి చెల్లించవలసిన మొత్తమునకు రెట్టింపు దాటకుండ అపరాధము చెల్లించవలసిన బాధ్యతగల్లవాడై యున్నాడు.

(ఎ) పన్ను మరియు వారంటు రుసుము ఏమైనా వున్న, మరియు,

(బి) జప్తు జరిగిన యెడల, జప్తు రుసుము. జప్తు జరిగిన ఆస్తియొక్క ఏమైనా ఉన్న, ఆపుదల అమ్మకమునకు అగు ఖర్చులు.

(2) (1)వ సబ్ సెక్షను క్రింద ఏ వ్యక్తి నేరముచేసినవాడుగా నిర్ణయింప బడినపుడు, మేజిస్ట్రేటు, విధింపబడు పన్నుకు అధికముగా (1)వ సబ్ రూలు యొక్క (ఎ), (బి) క్లాజులలో నిర్దిష్టమయిన "హెడ్"ల క్రింద రావలసిన వేవైన యున్నయెడల అట్టి మొత్తములు జిల్లా పరిషత్ లేక పంచాయతీ సమితికి, శీఘ్రముగా వసూలుచేసి యిచ్చివేయును. అతడు, అతని విచక్షణలో, వాజ్యపు ఖర్చులక్రింద జిల్లా పరిషత్ లేక పంచాయతీ సమితి నిర్ణయించునట్టి మొత్తము ఏ మైన యున్నయెడల దానినికూడ శీఘ్రముగా వసూలుచేసి అతనికి చెల్లించ వచ్చును.

39. (ఏ) నిర్వహణాధికారి లేక ఆఫీసరు లేక జిల్లా పరిషత్ లేక పంచా యతీ సమితి ఉద్యోగి, యింతకుముందు చెప్పబడిన నిబంధనల క్రింద ఉంచబడిన జప్తు చేయబడిన ఆస్తి అమ్మకములో నేరుగా లేక యితర విధముగా కొనగూడదు.

40. ఈ చట్టము క్రింద విధింపదగు రుసుము వసూలు యితరుల కిచ్చి వేసిన యెడల కౌలుపత్రము, కౌలుపుచ్చుకొనిన వానిచే అట్టి పత్రములో నిర్దిష్ట మైన షరతుల వేటిని ఉల్లంఘించినపుడు, కౌలుకిచ్చినవాడు—అనగా, ఆ యా నిర్వహణాధికారి, జిల్లా పరిషత్ లేక పంచాయతీ సమితి, కౌలుకు పుచ్చుకొనినవాని బాధ్యతమీద కౌలు స్థలము తిరిగి ప్రవేశించుట, తిరిగి అద్దెకు యిచ్చుట లేక తిరిగి అమ్ముట చేయును; అట్టి తిరిగి ప్రవేశించుటమీద, మొదట కౌలుయొక్క కాలము నిర్ణయింపబడును.

## అనుబంధము

## జప్తు వారంటు

(33 (4) నిబంధనను చూడుము)

వారంటు నెం.

(వారంటు అమలు జరుపుటకు నియోగింపబడిన ఉద్యోగి పేరు)

కు.

రాష్ట్రమునకు ఉన్న లేక

రావలసిన పన్నులు.

19 తో ఆఖరకు పై చెప్పబడిన పన్ను లేక పన్నులకు రావలసిన రూ. న.పై మొత్తము అట్టి సొమ్ము అట్టి నుండి క్రమముగా కోరబడినప్పటికి మరియు అట్లు కోరబడినప్పటికి నుండి పదిహేను రోజులు దాటినప్పటికి చెల్లించ నందున లేక దానికి తగిన కారణము చెప్పనందున, అట్టి మొత్తము రూ. న.పై వారంటు రుసుము పన్నెండు నయాపైసలతో సహా కోరవలసినదిగా నీవు ఆజ్ఞాపింప బడినావు. అట్టి సొమ్ము చెల్లించక పోయినచో, నువ్వు అట్టి వ్యక్తికి చెందిన, అట్టి మొత్తము రూ. న.పైలు వారంటు రుసుము, జప్తు రుసుము రూ. న.పై సహా మొత్తము రూ. న.పై సహా ఉంచుటకు అట్టి జప్తు ఆస్తి నమ్ముటకు అయిన ఖర్చులను చెల్లించుటకు సరిపడుటకు యింకను మొత్తమునకు సమాన విలువ కలిగిన వస్తువులు, గృహోపకరణములు జప్తు చేయవలెను ; మరియు అటు మీదట అట్టి జప్తు అయిన ఏడు రోజులలో, చెప్పబడినపన్ను లేక పన్నులనుండి రావలసిన మొత్తము, రుసుము అట్టి జప్తు ఆస్తిని ఉంచుటకు అగు ఖర్చులు చెల్లించుటకు సరిపడు యింకను కావలసిన మొత్తముతో సహ చెల్లింపబడక పోయినచో, నాచేత యిప్పటి నుండి యివ్వబడు ఉత్తరువుల క్రింద అట్టి వస్తువులు, గృహోపకరణములు అమ్మి, జప్తు ఆస్తి అమ్మకవు వరుంబడులు పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ కార్యాలయములో చెల్లించ వలయును. దాని నుండి అట్టి పన్ను లేక పన్నులు రుసుములు వల్ల రావలసిన అనగా రూ. న.పై, అట్టి జప్తు ఆస్తి ఉంచుటకు అమ్ముటకు అగు ఖర్చులు మినహాయింపబడి, నిధికి చేర్చబడును. అధికము ఏదైన యున్న యెడల, జప్తు చేయబడిన వస్తువులు, గృహోప కరణముల యజమానికి తిరిగియిచ్చి వేయబడ వలయును. జప్తు లేక సరిపడు జప్తు, అట్టి యొక్క వస్తువులు గృహోపకరణముల నుండి చేయుటకు వీలు లేక పోయిన యెడల, నీవు ఆ విధముగా ఈ వారంటుతో రూఢి పరచవలెను.

స్థలము నిర్వహణాధికారి లేక

తారీకు 19 యితర ఉద్యోగి సంతకము

## అనుబంధము బి.

## పట్టీ నోటీసు ఫారము

( 34 (1) (c) నిబంధన చూడుము )

( పట్టుబడిన వస్తువులు, గృహోపకరణముల వివరములు తెల్పుట )

14 తో అంత్యమగు మార్టిన్‌లో తెలిపిన పన్ను లేక పన్నులకు రావలసిన రూ. న.పై మొత్తముకు పై పట్టీలో నిర్దిష్ట మయిన వస్తువులు, గృహోపకరణములు ఈ దినము నేను పట్టుకొన్నాననియు. నీవు పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ కార్యాలయములో రావలసిన

మొత్తము వారంటు రుసుము, జప్తు రుసుము వస్తువులు గృహోపకరణములు ఉంచుటకు అగు ఖర్చుతోసహా ఈ నోటీసు తారీకునుండి వారము రోజులలో చెల్లించక పోయినచో, వస్తువులు గృహోపకరణములు పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ కార్యాలయము వద, లేక నిర్వహణాధికారి నిర్ణయించు ఏ యితర స్థలమువద్ద తారీకున అమ్మబడుననియు ; ఆ వస్తువులు, గృహోపకరణములు తొందరగ స్వాభావికముగా చెడిపోవునవి అయిన, అవి ముందు రోజుననే అమ్మబడ వచ్చుననియు నోటీసు యివ్వద మయినది.

స్థలము
తారీకు 19

జప్తు వారంటు అమలు
పరచు ఉద్యోగి సంతకము

## అనుబంధము సీ.

## జప్తులమీద చెల్లింపవలసిన గరిష్ట రుసుముల పట్టీ

( 36 (1)వ నిబంధన చూడుము )

| జప్తుకు చేయబడిన మొత్తము | | రుసుములు రూ. న.పై. |
|---|---|---|
| 1 | రూపాయి క్రింద | 0—25 |
| 1 | రూపాయి దానికిపైన కొని 5 రూపాయల క్రింద | 0—50 |
| 5 | రూపాయలు దానికి పైనకాని 10 రూపాయల క్రింద .... | 1—00 |
| 10 | ,, ,, 15 ,, .... | 1—60 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 15 | రూపాయలు దానికి పైనకాని | 20 | రూపాయలు క్రింద | .... | 2.90 |
| 20 | ,, ,, | 25 | ,, | .... | 2.50 |
| 25 | ,, ,, | 30 | ,, | .... | 3.00 |
| 30 | ,, ,, | 35 | ,, | .... | 3.50 |
| 35 | ,, ,, | 40 | ,, | .... | 4.00 |
| 40 | ,, ,, | 45 | ,, | .... | 4.50 |
| 45 | ,, ,, | 50 | ,, | .... | 5.00 |
| 50 | ,, ,, | 60 | ,, | .... | 6.00 |
| 60 | ,, ,, | 80 | ,, | .... | 7.50 |
| 80 | ,, ,, | 100 | ,, | ... | 9.00 |
| 100 | రూపాయలు దానికిపైన | .... | | .... | 10.00 |

పై రుసుము జప్తు కాబడిన ఆస్తి ఆధీనములో బంట్రోతులు యున్నయెడల తప్ప, అన్ని ఖర్చులు కలిగియుండును. అటువంటి వాటి విషయములో ప్రతి బంట్రోతునకు దినము మూడు అణాలు చెల్లించవలయును.

## Vవ షెడ్యూలు

## ఆర్థిక నిబంధనలు

(112, 115 మరియు 121 సెక్షను చూడుము)

### వ్యయము

1. (a) (i) అది చేసిన అప్పులమీద రావలసిన మొత్తములు;

(ii) మరియు (iii) వదలబడినవి.

చెల్లించుట ఏర్పాటుచేయుట ప్రతి పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తు యొక్క విధియై యున్నది.

A. (వదలబడినది).

B. (1) ఒక పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తు—

(a) దాని ఆధీనములోయున్న అన్ని తరగతుల వీధుల నిర్మాణము, మార్పు, బాగుచేయుట, నిర్వహణకు, రాష్ట్రప్రభుత్వము అవసరము వీలుగల దనుకొన్న మేరకు అట్టి రోడ్లమీద అన్ని వంతెనలు, చిన్న వంతెలలు, రోడ్ డాములు, ఎత్తుగా మన్నుపోసిన ఖాటలు ఏర్పాటు చేయవలసి యున్నది: మరియు

(b) రాష్ట్రప్రభుత్వము స్పష్టమైన అనుమతి లేనిదే యితర పనులకు అట్టి ఏర్పాటును మార్చకూడదు.

(2) ఈ క్రింది విషయములలో బ్లాకు లేక జిల్లాయొక్క ఆవశ్యకములు నిర్వర్తించుటకు దానికి యుక్తమని తోచినట్టి ఏర్పాటుచేయుటకు, ఒక పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తు దాని యొక్క జూరిస్ డిక్షనులో అధికారము కలిగి యున్నది.

(a) వదలబడినది.

(b) బ్లాకు లేక జిల్లాలో అన్ని రాజవీధులమీద బాటసారుల విశ్రాంతి భవనములు, విశ్రాంతి యిళ్ళ నిర్మాణము, నిర్వహణము;

(c) పంచాయతీ కాని ప్రదేశములలో సత్రములు, పంచాయతీ ప్రదేశము లలో బ్లాకు లేక జిల్లా సత్రములుగా తరగతింపబడిన సత్రముల యొక్క స్థాపన నిర్వహణ.

(cc) ప్రాథమిక బడులను తెరచుటకు నిర్వహించుటకు రాష్ట్రప్రభుత్వ ముచే నిర్ణయింపబడిన స్కేలుమీద పంచాయతీకి పంచాయతీ సమితిచే విరాళము చెల్లింపబడునపుడు ఏ పంచాయతీ ప్రదేశములో తప్ప ప్రాథమిక పాఠశాలలను తెరుచుట నిర్వహించుట;

(d) విద్యార్థులకు సెకండరీ మరియు సెక్షనల్ పాఠశాలలు, వృత్తి సంబంధమైన పారిశ్రామిక పాఠశాలలు, హాస్టళ్ళు తెరచుట, నిర్వహించుట ;

(dd) పంచాయతీ కాని ప్రదేశములలో లైబ్రరీలు, రీడింగు గదులు, పంచాయతీ ప్రదేశములలో జిల్లా లేక బ్లాకు లైబ్రరీలు మరియు జిల్లా లేక బ్లాకు రీడింగ్ గదులుగా తరగతింపబడిన లైబ్రరీలు, రీడింగు గదులు తెరచుట, నిర్వహించుట ;

(e) వదలబడినది.

(f) జిల్లా మొత్తము అవసరములకు సరఫరాచేయు అన్ని కేంద్ర జన బాహుళ్య ఆరోగ్య శాఖలు, మెడికల్ ఆఫీసర్ల యొక్క రిజర్వు సిబ్బందులు, నర్సులు, మంత్రసానులు, టీకాలు యిచ్చువారితోసహా :

(g) నర్సులు, మంత్రసానులు, దాయాలు, టీకాలు వేయువారికి తర్ఫీదు ;

(h) ఆసుపత్రుల స్థాపన నిర్వహణ ; పంచాయతీ కాని ప్రదేశములలో మందుల షాపుల, పంచాయతీ ప్రదేశములలో పంచాయతీ మందుల షాపు

బడగ తరగతింపబడినవి కాని మందులషాపుల స్థాపన నిర్వహణ ; పంచాయతీ కాని ప్రదేశములలో ప్రతి తరగతికి చెందిన వైద్య సహాయము, పంచాయతీ ప్రదేశములో పంచాయతీవల్ల ఇవ్వబడని ప్రతి ఒక్క తరగతి వైద్య సహాయము ;

(hh) టీకాలు వేయుట ;

(i) పంచాయతీ ప్రదేశములలో తప్ప అంటు రోగములకు సంబంధించిన ఆపుదల కుదిర్చెడి సాధనములు; 1950వ మదరాసు గ్రామ పంచాయతీ చట్టము క్రింద పంచాయతీచే నిర్వర్తింపబడియుండు, అన్ని సాధనములు ;

(j) జిల్లా లేక బ్లాకులో పశువుల ఆసుపత్రులు మందుల షాపుల స్థాపన, నిర్వహణ.

(l) పంచాయతీ ప్రదేశములలో బ్లాకు లెవెల్ సంతలుగా తరగతింపబడిన బహిరంగ సంతల. పంచాయతీ కాని ప్రదేశములలో అన్ని బహిరంగ సంతల తెరుచుట, నిర్వహణ ;

(m) పంచాయతీ ప్రదేశములలో జిల్లా సంతలు, ఉత్సవములుగా తరగతింపబడిన సంతలు, ఉత్సవములు, పంచాయతీ కాని ప్రదేశములలో అన్ని సంతలు, ఉత్సవముల అధీనము ; మరియు

(n) జలదారుల నిర్మాణము, పంచాయతీకాని ప్రదేశములోని బయటికి పోవు నీళ్ళు, మురికినీళ్ళ పరిష్కారము.

(o) పంచాయతీ కాని ప్రదేశములో, వీథులను శుభ్రపరుచుట, మురికి గుట్టలు అడవుల పెరుగుదల, బ్రహ్మజెముడు నిర్మూలము, అనుపయోగమైన నూతులను, అనారోగ్యకరమైన, చెరువులు, గుంటలు, కందకములు, గొయ్యిలు లేక కాళీస్థలములను పూడ్చుట ; ఆరోగ్యస్థితిని యితర విధముగ బాగుచేయుటలు;

(p) బహిరంగ పాయిఖానాలు ఏర్పాటు, పంచాయితీ కాని ప్రదేశములలో; బహిరంగమైనను, స్వంతమైనను, పాయిఖానాలను శుభ్రపరచుటకు ఏర్పాటు ;

(q) పంచాయతీ కాని ప్రదేశములలో పాతిపెట్టు తగులబెట్టు స్థలములు తెరచుట, నిర్వహించుట ;

(r) పంచాయతీ కాని ప్రదేశములలో బావులు త్రవ్వుట, వాటిని బాగు చేయుట, కోనేరులు లేక చెరువులు త్రవ్వుట, బాగుచేయుట, నిర్వహణ లేక త్రాగుటకు, కడుగుటకు, స్నానముచేయుటకు నీటిసరఫరా, స్నానముచేయు గట్టుల నిర్మాణము ;

(s) పంచాయతీ కాని ప్రదేశములలో బహిరంగ కసాయి యిళ్ళు తెరచుట నిర్వహించుట.

(t) పంచాయతీకాని ప్రదేశములలో రేడియో సెట్లను, ఆటస్థలములు. పార్కులు, ఆటల క్లబ్బులు, వ్యాయామ కృషి కేంద్రముల స్థాపన, నిర్వహణ.

(3) రాష్ట్రప్రభుత్వము చేయునట్టి నిబంధనలకు కట్టుబడి పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ దాని జూరిస్‌డిక్షనులో, ఈ క్రింది విషయములలో జిల్లా యొక్క అవశ్యకములను నిర్వర్తించుటకు దానికి యుక్తమని తోచినట్టి ఏర్పాటు చేయుటకు కూడ అధికారము కలిగియున్నది.

(a) అన్ని జిల్లా వీథులమీద విశాలమైన వీథులను వేసి జాగ్రత్తగా ఉంచుట ;

(b) వదలబడినది.
(c) దాని ఆఫీసర్లకు, పనివాళ్ళకు పారితోషికములు :

(d) జిల్లాలో నివసించువారి క్షేమము, ఆరోగ్యము, సుఖము, సదుపాయము కలుగజేయు జనబాహుళ్యమున కుపయోగకరమగు అన్ని యితర సాధనములు ; మరియు

(e) (1) మరియు (2) సబ్‌రూల్సులో ఈ సబ్‌రూలు (a) (c) (d) క్లాజులలో తెలియజేసిన వాటిమాదిరిగ నుండు కార్యముల సహాయము కొరకు యితర పంచాయతీ సమితులు లేక జిల్లా పరిషత్‌లు, మునిసిపల్ కౌన్సిలులు. స్వంత వ్యక్తులు లేక సంఘములు.

1 c వదలబడినది.

4. ఈ నిబంధనలలో ఏది యున్నప్పటికి, ఒక పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ జిల్లాలో ఏ పంచాయతీ యొక్క నిధులకు విరాళ మివ్వవచ్చును. మరియు రాష్ట్రప్రభుత్వము అనుమతితో—

(1) దాని జూరిస్‌డిక్షనులోని స్థానిక ప్రదేశములో ఏబహిరంగ ప్రదర్శనము, కార్యము లేక వినోదము యొక్క ఖర్చులకు విరాళ మివ్వవచ్చును.

(2) దాని జూరిస్‌డిక్షనులోని ధర్మదాయపు నిధికిలేక స్థానిక ప్రదేశరక్షణ నిధికి లేక హిందూదేశపు రక్షణ నిధికి లేక బీదవారి బాధానివృత్తికి లేక జబ్బు లేక అంగవైకల్యమును కుదుర్చుటకు లేక జబ్బు మనుష్యులను బలహీనమైన వ్యక్తులను తీసికొనుటకు లేక జబ్బు కారణములను కనుగొనుటకు సంస్థయొక్క నిధులకు విరాళమివ్వవచ్చును ; మరియు

(3) ఏ యితర అసాధారణమైన ఖర్చులను చేయవచ్చును.

## రాబడులు

5. పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ నిధికి చేర్చవలసిన ఈ చట్టము క్రింద రాబడులు ఈ క్రింది విధముగానుండును.

(1) 92 సెక్షనులోవి నిబంధనలకు బద్ధమై, జిల్లాలో విధింపబడు భూమి పన్ను.

(2) 93 సెక్షనుక్రింద బ్లాకులోని పంచాయతీ కాని ప్రదేశములలో విధింపబడు వృత్తిపన్ను.

(2A) తీర్థయాత్రకు అవకాశము ఒక జిల్లా ఉత్సవముగా తరగతింపబడినపుడు బ్లాకు లేక జిల్లాలో/(i) ఏ పంచాయతీ ప్రదేశము విషయములో మరియు (ii) బ్లాకు లేక జిల్లాలో పంచాయతీ కాని ఏ ప్రదేశము విషయములో విధింపబడు యాత్రిక పన్ను.

(3) ఈ చట్టము క్రింద పంచాయతీ సమితిచే జారీచేయబడిన లైసెన్సులు, ఇవ్వబడిన అనుమతులమీద రుసుములు.

(3A) ప్రభుత్వముచే నిర్ణయింపబడిన స్కేలుమీదపంచాయతీకి పంయచాతీ సమితిచే చెల్లింపబడిన విరాళము ఏ మైన యున్నయెడల దానిని మినహాయిం

చిన తరువాత బ్లాకు లెవెల్ సంతలుగా తరగతింపబడిన పంచాయతీ ప్రదేశములో: (i) బహిరంగ సంతలలో, మరియు (ii) పంచాయతీ కాని ప్రదేశములలోని బహిరంగ సంతలలో విధింపబడిన రుసుము.

(3B) ప్రభుత్వముచే నిర్ణయింపబడిన స్కేలుమీద, బ్లాక్ లెవెల్ సంతలుగా తరగతింపబడని పంచాయతీ ప్రదేశములలో ఉన్న సంతల విషయములో పంచాయతీలవల్ల పంచాయతీ సమితికి చెల్లింపబడిన విరాళము.

(3C) పంచాయతీ కాని ప్రదేశములో బహిరంగ దిగెడు స్థలములు-నిలుచు స్థలములు, బండి ఆగు స్థలములు, కసాయియిళ్ళ ఉపయోగముకొరకు రుసుము: పంచాయతీకాని ప్రదేశములలో, గ్రామ స్థలములు, వీధులు, పాతిపెట్టు తగుల బెట్టు స్థలములు మరియు ఆ మాదిరి యితర బహిరంగ స్థలములు లేక వాటి భాగములను తాత్కాలికముగా ఆక్రమించుటకు రుసుము.

(4) బ్లాకు లేక జిల్లాలలో బాటసారుల విశ్రాంతి భవనములు, విశ్రాంతి యిళ్ళ ఉపయోగము కొరకు రుసుము.

(5) బ్లాకు లేక జిల్లా సత్రములుగా తరగతింపబడిన పంచాయతీ ప్రదేశములలోని సత్రములు మరియు పంచాయతీ కాని ప్రదేశములలోని అన్ని సత్రముల ఉపయోగము కొరకు రుసుము.

(6) పంచాయతీ సమితులచే నిర్వహింపబడిన పాఠశాలల రాబడులు అట్టి పాఠశాలలకు సహాయ రూపేణా గ్రాంటులతో సహా,

(7) పంచాయతీ కాని ప్రదేశములలో ఆసుపత్రులు, మందులషాపులు బ్లాకు లేక జిల్లా మందుల షాపులుగా తరగతింపబడిన పంచాయతీ ప్రదేశములలోని మందుల షాపుల రాబడులు.

(8) పంచాయితీ సమితిచే లేక జిల్లా పరిషత్‌చే నిర్వహింపబడిన పశువుల ఆసుపత్రులు, మందుల షాపుల రాబడులు.

(9) పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ యాజమాన్యము క్రింద ధర్మాదాయముల ట్రస్టులనుండి రాబడి.

(10) ప్రభుత్వము, యితర పంచాయతీ సమితులు లేక జిల్లా పరిషత్ మునిసిపాలిటీలు, పంచాయితీ సమితి నిధినుండి లేక జిల్లాపరిషత్ నిధి

నుండి నిర్వహింపబడిన లేక ధనసహాయము చేయబడిన లేక పంచాయతీ సమితి లేక జిల్లాపరిషత్‌చే యాజమాన్యము చేయబడిన ఏ సంస్థలు లేక నౌకరీలకు సహాయముచేయు యితర స్థానిక అధికారులు, స్వంత వ్యక్తుల నుండి విరాళములు.

(11) వదలబడినది.

(12) పంచాయతీ కాని ప్రదేశములలోని అన్ని రాజ వీధులకు, అన్ని బ్లాకు లేక జిల్లా వీధులకు సంబంధించిన వీధుల రాబడి, చెత్త, వీధులకు సంబంధించిన యంత్రములు, యంత్ర పరికరములు, పాతస్టోర్సు, సామగ్రి, చెట్లు, అమ్మకము రాబడి.

(13) జిల్లాబోర్డు పడవల మరియు చేపలుపట్టు స్థలములనుండి రాబడి.

(14) వదలబడినది.

(15) అప్పులమీద, సెక్యూరిటీల మీద వడ్డీ.

(16) రాబడి బకాయీలమీద వడ్డీ.

(17) పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్‌కు సంబంధించిన భవనములు, భూములు, ఇతర ఆస్తినుండి రాబడి మరియు వాటి అమ్మకము రాబడులు.

(18) కోరబడని ధరావత్తులు, యితర నష్టములు.

(19) పంచాయతీ సమితి నిధి లేక జిల్లాపరిషత్ నిధినుండి నిర్వహింపబడిన లేక ధనసహాయము చేయబడిన లేక పంచాయతీసమితి లేక జిల్లా పరిషత్‌చే యాజమాన్యము చేయబడిన ఏ సంస్థలు లేక నౌకరీలు నుండి వచ్చిన, వాటి సహాయము నుండి పొందిన లేక వాటిమీద వ్యయమునకు పైన తెల్పబడిన మొత్తములు కాక అన్ని మొత్తములు.

6 నుండి 9 వదలబడినవి.

## 6వ షెడ్యూలు

### ప్రమాదకరమైన జబ్బుల లిస్టు

(130వ సెక్షను చూడుము)

ప్రమాదకరమైన ఇన్‌ఫ్లూయంజల్ న్యూమోనియా,

| | |
|---|---|
| ఆంత్రాక్సు | గుఱ్ఱపువాతము (గ్లాండర్సు) |
| ఆటలమ్మ | కుష్ఠు |
| కలరా | |
| డిఫ్తీరియా | ప్లేగు |
| ప్లేగుసంబంధమైన జ్వరము | తిరగబెట్టు జ్వరము |

## 7వ షెడ్యూలు

### లైసెన్సులేక ఉపయోగింప కూడని అవరణలకు ఉద్దేశములు

(ఎ) ధాన్యము లేక కర్పూరము ఉడుక బెట్టుట;

(ఎఎ) మురికి బట్టలు ఉతుకుట లేక వాటిని శుభ్రము చేయుట మురికి బట్టలను ఉంచుట లేక ఉతికిన బట్టలు ఉంచుట;

(బి) కొవ్వు లేక గంధకము కరిగించుట;

(సి) చెడిన మాంసము, రక్తము, ఎముకలు, జంతు చర్మములు, చేపలు లేక తోళ్ళుదాచుట లేక యితర విధముగా వాటినుపయోగించుట;

(డి) చర్మములను తోళ్ళను సాపుచేయుట;

(ఇ) ఊలు లేక వెంట్రుకలను కడుగుట లేక ఎండబెట్టుట;

(ఎఫ్) చేపనూనె చేయుట;

(జి) సబ్బు చేయుట;

(హెచ్) సగ్గుబియ్యము తయారుచేయుట లేక వడగట్టుట, కృత్రిమపు ఎరువు తయారుజేయుట, పంచదార తయారుచేయుట లేక శుభ్రపరచు, బెల్లము పటికిబెల్లము లేక పంచదార ద్రావకము, కల్లు తీయువారిచేత లేక చెట్ల అనుభవములో యున్న వారిచేత వారి స్వంత. ఆవరణలో జరుగుతూ ఉన్న కుటీర పరిశ్రమగా కాకుండ తయారు చేయుట.

(ఐ) మందుగుండు సామాను లేక ప్రేలుడు వస్తువును తయారు చేయుట.

(జె) ఇటికలు, పెంకులు, కుండలు, సున్నము కాల్చుట;

(కె) బహిరంగముగా లేక గుర్తింపబడిన ఆధీనముక్రింద విద్యార్థుల హాస్టలు కాకుండ ఒక హోటలు, రెస్టారెంటు, తినుస్థలము, కాఫీ యిల్లు, భోజన యిల్లు లేక నివాసపుటిల్లు వుంచుట,

(కెకె) జనుల వినియోగము కొరకు పిండి లేక పిండితో చేసిన వస్తువులు లేక తీపి వస్తువులు తయారు చేయుట,

(యల్) మంచుగడ్డ లేక సోడా నీళ్ళు తయారుచేయుట.

(యల్ యల్) బీరు వండుట, వడకట్టుట మూలముగా త్రాగుట కుపయోగించని లేక ఉపయోగించు అల్కహాలు కలిగిన సారా లేక యితర మద్యము తయారు చేయుట;

(యమ్) కలప, వంటచెరకు, గుడిసెవేయు పరికరములు, ఎండుగడ్డి, పచ్చిగడ్డి, గడ్డిపోచ, నార, రాక్షసిబొగ్గు లేక బొగ్గు అమ్ముట లేక దాచివుంచుట;

(యమ్ యమ్) ధాన్యము వేరుశనగ, చింతపండు, మిర్చి, బెల్లము, పప్పులు, పిండి, తవుడు, నూనె, పిండులు లేక ఎలకలను ఆకర్షించగల వ్యవసాయ సంబంధమయిన ఉత్పత్తిని గుత్తగా లేక విడిగా అమ్ముట, లేక గుత్త లేక విడి వ్యాపారమునకు, లేక స్వంత లేక యింటి ఉపయోగమునకు కాని పనులకు దాచిపెట్టుట.

(యన్) ప్రేలుడు మందు పదార్థములను దాచిఉంచుట.

కాని, 1934వ పెట్రోలియం చట్టము ఏర్పాటు లేక దానిక్రింద జారీ చేయబడిన నిబంధనలు లేక ప్రకటనలచే ఈ చట్టముయొక్క అమలు నియమితము చేయబడిన వాటిని మించిన పెట్రోలియం తద్వారా వచ్చినవాటి మొత్తములు దాచి ఉంచుటకు, ఏ లైసెన్సు అవుసరము లేదు.

(యన్ యన్) నూలు గుత్తగా లేక విడిగా అమ్ముట లేక గుత్త లేక విడి వ్యాపారమునకు లేక దారముగా మార్చుటకు నూలును దాచియుంచుట;

(ఒ) ప్రమాదకరమైన లేక అనారోగ్యకరమైన వాసనలు వచ్చు దేనినైనను తయారు చేయుట:

(పి) కాలమువెంబడి రాష్ట్రప్రభుత్వముచే ప్రకటనద్వారా మినహాయింపబడునట్టి యంత్ర సామగ్రిగాక ఏ వంటచెరకు లేక యంత్రసామగ్రిని ఏ పారిశ్రామిక పనికైనను ఉపయోగించుట; మరియు

(q) ప్రజల ప్రాణము లేక ఆరోగ్యము లేక ఆస్తికి హానికరమైన లేక ప్రమాదకరముగా ఉండునటువంటి దానిని పారిశ్రామిక పని కార్యములో సాధారణముగా చేయుట;

కాని ధాన్యము ఉడకబెట్టుటకు లేక మురికిబట్టలు లేక ఉతికిన బట్టలు ఉంచుటకు లేక మురికిబట్టలు శుభ్రము చేయుటకు లేక కలప, వంటచెరకు, పూరెసామాను, ఎండుగడ్డి, పచ్చిగడ్డి, గడ్డిపరక, నార, రాక్షసిబొగ్గు లేక బొగ్గు, అట్టి ఉడకబెట్టుట, ఉంచుట, శుభ్రపరచుట లేక దాచివుంచుట స్వంతఉపయోగమునకు అయినప్పుడు లేక మనుష్యులు నివసించు ఇళ్ళమధ్య ఉన్నస్థలములో అయినప్పుడు, దాచివుంచుటకు, ఎట్టి లైసెన్సు అవసరము లేదు.

## 8వ షెడ్యూలు

## సాధారణ అపరాధములు

(207వ సెక్షను చూడుము)

| సెక్షను | సబ్ సెక్షను లేక క్లాజు | విషయము | విధింపబడు అపరాధములు |
|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) |
| 97 | | వృత్తి, కళ మొదలైనవాటిని చేయువ్యక్తుల పట్టీ దాఖలు చేయుటకు ఉత్తరువు యజమాని లేక ఆక్రమణదారు మొదలైనవారు మన్నించక పోవుట. | ఒకవంద రూపాయలు |
| 122 | | వాగు మొదలైన వాటిని శుభ్రపరచుట, నూతిని, చెరువును లేక రిజర్వాయరును మూసివేయుట లేక వాటిని చుట్టుట లేక కంచె వేయుటకు ఉత్తరువును మన్నించక పోవుట. | ఏబది రూపాయలు |
| 123 | (1) | చెరువు, నూయి మొదలైన వాటిని కంచె వేయుట, బాగు చేయుట, కప్పి వేయుట మొదలగు వాటిని చేయుటకు ఉత్తరువును మన్నించక పోవుట. | |

| (1) | (2) | (3) | (4) |
|---|---|---|---|
| 124 | (2) | జనము తెచ్చుకొనుటకు పీలగు నీటిని ఉప యోగించుట నిషేధించు నోటీసు నుల్లఘించుట | ఏబది రూపాయలు |
| 124 | (ఎ) | త్రాగుట కుపయోగించుట, కేటాయించిన స్థల ములలో స్నానము మొదలైన వాటిని చేయుట. | డిటో |
| 125 | (బి) | త్రాగుటకు కేటాయించిన స్థలములలో ప్రమా దమైనట్టి పదార్థములను ఉంచుట. | డిటో |
| 125 | (సి) | త్రాగుటకు లేక స్నానము చేయుటకు కేటా యించిన స్థలములలో గుడ్డల నుతుకుట. | డిటో |
| 125 | (డి) | ఇతర పనులకు కేటాయించిన స్థలములలో జంతువులు మొదలైనవాటిని శుభ్రముచేయుట | డిటో |
| 125 | (ఇ) | త్రాగుటకు, స్నానము చేయుటకు లేక బట్టలు ఉతుకుటకు కేటాయించిన స్థలములలోనికి మురికిగుంట, మురికి నీళ్ళ కాలువలోని నీరును వదలుట. | డిటో |
| 126 | ఎ. | 126ఎ సెక్షనులో సూచించిన నుయ్యి, చెరువు రిజర్వాయరు లేక నీటిమార్గము ఉపయో గము, అనుభవములో యున్నవ్యక్తిని అట కాయించుట | ఒకవంద రూపాయలు |
| 129 | | రాజవీధి మొదలైన వాటిలోనికి మురికి ప్రవ హింప జేయుట. | ఇరవై రూపాయలు |
| 129 | ఎ. | స్రవిమార్గమును నిర్మించుట, మార్పుచేయుట లేక తొలగించలేక పోవుట. | ఏబది రూపాయలు |
| 131 | (2) | అవరణలు లేక వస్తువులు శుభ్రపరచుటకు లేక అంటురోగములు పోగొట్టుటకు ఉత్త రువు మన్నించక పోవుట. | డిటో |

| (1) | (2) | (3) | (4) |
|---|---|---|---|
| 131 | (1) | వాహనములు, బట్టలు మొదలగు వాటిని ప్రకటింప బడిన స్థలముకు తొలగింపక పోవుట. | ఏబది రూపాయలు |
| 133 | | అంటురోగముతో బాధపడు వ్యక్తి వృత్తి చేయుట. | డిటో |
| 134 | (1) | జబ్బు వ్యాప్తి నరికట్టుటకు తగిన జాగ్రత్తలు తీసికొనకుండ అంటురోగముతో బాధపడు వ్యక్తి బహిరంగవాహనములో ప్రయాణము చేయుట. | డిటో |
| 134 | (2) | అంటురోగముతో బాధపడుచున్న విషయము తెలియనివ్వకుండ బహిరంగ వాహనములోనికి అంటురోగముతో బాధపడు వ్యక్తి ప్రవేశము | డిటో |
| 134 | (3) | అంటురోగముతో బాధపడు వ్యక్తిని బహిరంగ వాహనములో తీసికొనిపోవుట. | డిటో |
| 135 | | బహిరంగ వినోద స్థలమును మూసివేయకుండుట. | రెండువందల రూపాయలు |
| 136 | | అంటురోగముతో బాధపడు పిల్లలను పాఠశాలలకు పంపుట. | ఏబది రూపాయలు |
| 138 | | మశూచికము ఉన్న సమాచారము యివ్వకుండుట, | డిటో |
| 139 | (2) | సర్టిఫికేటు లేకుండ మశూచికముకు ఇంజక్షను యిచ్చిన నలభై రోజులలోపుగా స్థానిక స్థలమును వదలుట. | ఒక వంద రూపాయలు |
| 140 | | చనిపోయినవారిని పరిష్కరించుటకు ఏ స్థలమును రిజిష్టరు చేయకుండుట. | డిటో |

| (1) | (2) | (3) | (4) |
|---|---|---|---|
| 141 | (1) | లైసెన్సు లేకుండ చనిపోయినవారిని పరిష్కరించుటకు ఏ స్థలమును తెరచుట మొదలైన వాటిని చేయుట లేక ఉపయోగించుట. | ఒకవంద రూపాయలు |
| 144 | | నివాస స్థలమునకు లేక త్రాగు నీటి సరఫరా స్థలమునకు 100 గజముల లోపుగా శవము తగులబెట్టుట, కాల్చుట మొదలైన వాటిని చేయుట. | డిటో |
| 145 | | పాతిపెట్టు లేక తగులబెట్టు స్థలములో పాతిపెట్టుటలు లేక తగులబెట్టుటలు యొక్క సమాచారము యివ్వకుండుట. | ఇరవై రూపాయలు |
| 146 | (3) | నిషేధింపబడిన స్థలములో ఒక శవమును పాతి పెట్టుట, కాల్చుట లేక యితర విధముగా పరిష్కరించుట. | ఒక వంద రూపాయలు |
| 147 | (1) | ప్రమాద కరమైన కట్టడము చుట్టూ కంచె వేయుట, పడగొట్టుట, భద్రపరచుట లేక బాగు చేయుటకు ఉత్తరువును మన్నించకుండుట. | ఐదువందల రూపాయలు |
| 148 | (1) | ప్రమాద కరమైన చెట్లను భద్రపరచుట, కొమ్మలు నరకుట లేక నరకుటకు ఉత్తరువు మన్నన చేయకుండుట. | ఏబది రూపాయలు |
| 146 | | భవనము లేక భూమిని కంచెవేయుట లేక కంచెలు, చెట్లను సరిచేయుట, కొమ్మలు నరకుట లేక నరకుట లేక అవరణ గోడను దించుటకు ఉత్తరువు మన్నన చేయకుండుట. | డిటో |
| 150 | (1) | జనుల ఆరోగ్యము లేక క్షేమమునకు ప్రమాద కరమైన చెరువు లేక యితర స్థలములు నింపుట మొదలైనవాటిని చేయుటకు ఉత్తరువును మన్నన చేయకుండుట. | డిటో |

| (1) | (2) | (3) | (4) |
|---|---|---|---|
| 151 | (1) | లైసెన్సు లేకుండ రాజవీధి మొదలగువాటి దగ్గర రాళ్ళు త్రవ్వి తీసికొనిపోవుట. | ఏబది రూపాయలు |
| 151 | (2) | ప్రమాదకరముగా రాళ్ళు త్రవ్వి తీసికొని పోవుట ఆపకుండుట. | ఒక వంద రూపాయలు |
| 153 | (1) | మురికిస్థితిలోను లేక ప్రమాదకరమైనమొక్కలతో నిండిన భవనము లేక భూమిమీదమొక్కలను తీసివేయుట లేక భవనము లేక భూమిని శుభ్రము చేయుట మొదలైనవి చేయుటకు ఉత్తరువు మన్నన చేయకుండుట. | ఏబది రూపాయలు |
| 153 | (2) | భవనమును సున్నము కొట్టుటకు ఉత్తరువును మన్నించకుండుట. | డిటో |
| 154 | (1) | లైసెన్సు లేకుండ లేక లైసెన్సుకు వ్యతిరేకముగ కుక్కను, పందిని వుంచుట, | పది రూపాయలు |
| 157 | | రాజవీధిలో లేక పైన అక్రమముగా గోడ నిర్మించుట లేక కంచె వేయుట మొదలైనవి చేయుట. | ఒక వంద రూపాయలు |
| 157 | ఎ. | వీధుల నుపయోగించుటలో ఒక వ్యక్తిని అడ్డుట. | డిటో |
| 158 | | లైసెన్సు లేకుండగా లేక నోటీసుకు వ్యతిరేకముగ తలుపులు, క్రింది నేల కిటికీలు మొదలైన వాటిని బయటికి తెరచునట్లుగా ఉంచుట. | ఇరవై రూపాయలు |
| 159 | (1) | ఆక్రమణ తీసివేయుట లేక మార్పు చేయకుండుట. | రెండువందల రూపాయలు |
| 161 | [1] | చెత్తచే ఎత్తుమొదలైనవి చేయబడిన భూమిమీద లేక జలదారిపైన అక్రమముగా భవనము నిర్మించుట. | డిటో |

| (1) | (2) | (3) | (4) |
|---|---|---|---|
| 161 | (2) | అనుమతి లేకుండా లేక అనుమతి షరతులకు వ్యతిరేకముగా నిర్మింపబడిన భవనము పడ గొట్టుటకు ఉత్తరువు మన్నించ కుండుట. | రెండు వందల రూపాయలు |
| 162 | | రాజవీధి మొదలగువాటి నానుకొనియున్న భూమి నుండి, బ్రహ్మజెముడు, వాటిల్ లంతానా మొదలైన వాటిని తీసివేయుటకు ఉత్తరువును మన్నించకుండుట. | ఏబది రూపాయలు |
| 163 | (1) | రాజవీధిలో అక్రమముగా రంధ్రముచేయుట లేక అడ్డు కలుగజేయుట. | డిటో |
| 163 | (2) | రంధ్రము లేక అడ్డుచుట్టూ కంచె లేక గోడ మొదలైనవి వేయకుండుట. | డిటో |
| 163ఎ | (1) | పంచాయతీ సమితిలో చేరిన ఏరాజవీధి లేక యితరఆస్తిమీద అనుమతి లేకుండ చెట్లు నాటుట. | రెండువందల రూపాయలు |
| 163ఎ | (2) | పంచాయతీ సమితిలోచేరిన రాజవీధి లేక యితర ఆస్తిమీద పెరుగునట్లు, అనుమతి లేకుండ పడగొట్టుట మెదలైనవి చేయుట. | డిటో. |
| 164 | (2) | పంచాయతీ సమితిలో చేరిన భూమిమీద భవనము మొదలైన వాటిని నిర్మూలించ కుండుట. | రెండువందల రూపాయలు |
| 167 | | బహిరంగ సంతల నుపయోగించు వ్యక్తిని అడ్డుట. | ఒకవంద రూపాయలు |
| 169 | (1) | అనుమతి లేకుండ జంతువు లేక వస్తువును బహిరంగ సంతలో అమ్ముటకు పైన యుంచుట లేక అమ్ముట. | ఇరవై రూపాయలు |
| 171 | | లైసెన్సు లేకుంజిగ లేక లైసెన్సుకు వ్యతిరేకముగ స్వంతసంతను తెరచియుండుటను; | |

| (1) | (2) | (3) | (4) |
|---|---|---|---|
| | | సాగించుట లేక క్రొత్త స్వంత సంతను తెరచుట. | ఐదువందల రూపాయలు |
| 172 | | సర్టిఫికేటు లేకుండ స్వంతసంతలో రుసుము విధించుట. | ఒకవంద రూపాయలు |
| 175 | | లైసెన్సు కాని స్వంత సంతలో జంతువు లేక వస్తువు అమ్మకమునకు తెరచియుంచుట లేక అమ్మట. | ఇరవై రూపాయలు |
| 176 | | స్వంత సంతకు లేక కప్పుకు మొదలైన వాటికి దారులు మొదలైనవాటికి నిర్మించు టకు ఉత్తరువు మన్నింపకుండుట. | ఒకవంద రూపాయలు |
| 177 | (2) | పనులు నిర్వర్తించ నందుకు లైసెన్సు అపు దల చేయబడిన తరువాత లేక నిరాకరింప బడిన తరువాత స్వంతసంత తెరచియుండుట | ఏబది రూపాయలు |
| 178 | | స్వంత సంతలో ఉపద్రవములు. | ఇరవై రూపాయలు |
| 188 | | లైసెన్సు లేకుండా లేక నిబంధనలకు వ్యతి రేకముగ లేక నిషేధము తరువాత రాజ వీధులు మొదలైన వాటిలో వస్తువులను అమ్మకము మొదలైన వాటిని చేయుట. | పది రూపాయలు |
| 185 | | నిషేధింపబడిన దూరములో ఏ బహిరంగ స్థలము లేక వీధి ప్రక్క, భూమిమీద ఆగు స్థలము లేక నిలచుస్థనము మొదలైన వాటిగ ఉపయోగించుట. | ఏబది రూపాయలు |
| 187 | | లైసెన్సు లేకుండ లేక లైసెన్సుకు వ్యతి రేకముగ క్రొత్త స్వంతబండి ఆగుస్థలమును తెరచియుంచుట లేక స్వంత బండి ఆగు స్థలమును తెరచియుంచుటను సాగించుట. | రెండువందల రూపాయలు |
| 190 | (a) | బహిరంగ కసాయి యింటికి అవతల పశు వులు మొదలైన వాటిని చంపుట లేక | |

| (1) | (2 | (3) | (4) |
|---|---|---|---|
| | | ముక్కలుగా చేయుట లేక చర్మమొలచుట మొదలైనవాటిని చేయుట. | రెండువందల రూపాయలు |
| 190 | (b) | లైసెన్సు లేకుండగా పశువులు మొదలైన వాటిని చంపుట, మొదలైన వాటిని చేయుట | ప్రతిజంతువుకు ఇరవై రూ॥లు |
| 193 | | లైసెన్సు లేకుండ హానికరమైన లేక ప్రమాదకరమైన వ్యాపారము చేయుటకు ఒక స్థలమును ఉపయోగించుట. | ఒకవంద రూపాయలు |
| 194 | | ఫ్యాక్టరీ, వర్కుషాపు మొదలైన వాటిని అక్రమముగా లేవదీయుట. | ఒకవెయ్యి రూపాయలు |
| 195 | | ఉపద్రవములు మొదలైనవాటిని తగ్గించుట విషయములో ఉత్తరువు నుల్లంఘనము. | డిటో |
| 212 | (8) | కోరిన మీదట లైసెన్సును యివ్వకుండుట. | ఐదురూపాయలు |
| 229 | | పంచాయతీ సమితి లేక జిల్లాపరిషత్ మొదలైన వాటిని అడ్డుట లేక బాధ కలిగించుట. | ఏబది రూపాయలు |
| 230 | | పంచాయతీ సమితి లేక జిల్లాపరిషత్ ఉత్తరువుల చేత క్రింది ప్రదర్శింపబడిన నోటీసు తొలగించుట. | డిటో |
| 231 | | స్టేటుమెంటు మొదలైనవాటిని దాఖలు చేయుటకు ఉత్తరువును మన్నన చేయకుండుట. | డిటో |
| 232 | | సమన్సులను మన్నన చేయకుండుట. | డిటో |

## 9వ షెడ్యూలు

### జరుగుతూ ఉండు ఉల్లంఘనమునకు అపరాధములు

(207వ శెక్షను చూడుము)

| శెక్షను సబ్ శెక్షను లేక క్లాజు | విషయము | విధింపబడు ప్రతి దినపు అపరాధము |
|---|---|---|

| (1) | (2) | (3) | (4) |
|---|---|---|---|
| 122 | | ఏవాగు మొదలైన వాటిని శుభ్రపరచుటకు, నూయి, చెరువు లేక రిజర్వాయరు మూయుటకు లేక దానికి కంచె లేక గోడ వేయుటకు ఉత్తరువు మన్నన చేయకుండుటకు. | ఏది రూపాయలు |
| 123 | (1) | చెరువు, నూయి, మొదలైన వాటిని కంచె వేయుట, బాగు చేయుట, మూసి వేయుట మొదలైన వాటిని చేయుటకు ఉత్తరువు మన్నన చేయకుండుట. | డిటో |
| 124 | (2) | జనముకు వీలగు నీరు ఉపయోగము నిషేధించు నోటీసు నుల్లంఘించుట. | డిటో |
| 125 | | త్రాగుటకు, స్నానము చేయుటకు లేక బట్టలు శుభ్రము చేయుటకు కేటాయించిన స్థలము లోనికి మురికిగుంట, మురికికాలవ మొదలైన వాటినుండి నీరును వదలుట. | డిటో |
| 129 | | రాజవీధులు మొదలైన వాటిలోనికి మురికి ప్రవహింపజేయుట. | డిటో |
| 129 ఎ | | జలదారులు నిర్మించుట, మార్చుట లేక తీసివేయుట చేయకుండుట. | డిటో |
| 131 | (2) | ఆవరణలు లేక వస్తువులు శుభ్రముచేయుట లేక పరిశుద్ధము చేయుటకు ఉత్తరువు మన్నన చేయకుండుట. | డిటో |
| 133 | | అంటు రోగముతో బాధపడు వ్యక్తి వృత్తిని చేయుచుండుట. | డిటో |
| 135 | | బహిరంగ వినోదస్థలము మూయకుండుట. | ఒకవంద రూపాయలు |
| 141 | (1) | లైసెన్సు లేకుండ, చనిపోయిన వారిని పరిష్కరించుటకు స్థలమును ఉపయోగించుట. | ప్రతిఅవకాశమునకు ఇరవై రూపాయలు |

| (1) | (2) | (3) | (4) |
|---|---|---|---|
| 147 | (1) | ప్రమాదకరమైన కట్టడము చుట్టూ కంచె వేయుట, పడగొట్టుట, భద్రపరచుట లేక బాగుచేయుటకు ఉత్తరువు మన్నన చేయకుండుట. | ఏబది రూపాయలు |
| 148 | (1) | ప్రమాద కరమైన చెట్లను భద్రపరచుట కొమ్మలు నరకుట లేక నరకుటకు ఉత్తరువు నుల్లంఘనము. | పది రూపాయలు |
| 149 | | భవనము లేక భూమికి కంచె వేయుట, లేక చెట్లు కంచెలను కత్తిరించుట, సరిచేయుట లేక నరుకుట లేక అవరణగోడను దించుటకు ఉత్తరువు మన్నించ కుండుట. | డిటో |
| 150 | | ప్రజల ఆరోగ్యము లేక క్షేమమునకు ప్రమాద కరమైన చెరువు లేక యితర స్థలము పూడ్చి వేయుట మొదలగు వాటిని చేయుటకు ఉత్తరువు నుల్లంఘన. | డిటో |
| 151 | (1) | లైసెన్సు లేకుండ రాజవీధి దగ్గర త్రవ్వి తీసికొని పోవుట. | డిటో |
| 151 | (2) | ప్రమాదకరమైన రాళ్లత్రవ్వి తీసికొని పోవుటను ఆపకుండుట. | డిటో |
| 153 | (1) | మురికి స్థితిలోను లేక ప్రమాదకరమైన మొక్కలతో నిండిన భవనములు లేక భూమిమీద మొక్కలను తీసివేయుట లేక భవనము లేక భూమిని శుభ్రము చేయుట మొదలైనవి చేయుటకు ఉత్తరువు మన్నిక చేయకుండుట. | డిటో |
| 153 | (2) | భవనమునకు సున్నము కొట్టుటకు ఉత్తరువు మన్నన చేయకుండుట. | డిటో |
| 164 | (1) | లైసెన్సు లేకుండ లేక లైసెన్సుకు వ్యతిరేకముగా కుక్కను పందిని ఉంచుట. | రెండు రూపాయలు |

| (1) | (2) | (3) | (4) |
|---|---|---|---|
| 157 | | అక్రమముగా గోడకట్టుట లేక రాజవీధిలో లేక పైన కంచె మొదలైనవాటిని వేయుట. | ఇరవై రూపాయలు |
| 158 | | లైసెన్సు లేకుండ లేక నోటీసుకు వ్యతిరేకముగా తలుపులు, క్రింది నేలకిటికీలు మొదలైన వాటిని బయటికి తెరచునట్లుగ ఉంచుట. | పది రూపాయలు |
| 159 | (1) | ఆక్రమణ తీసివేయకుండుట లేక మార్పుచేయకుండుట. | డిటో |
| 161 | (1) | చెత్తచే ఎత్తు మొదలైనవి చేయబడిన భూమి మీద లేక జలదారిపైన అక్రమముగా భవనము నిర్మించుట. | ఏబది రూపాయలు |
| 161 | (2) | అనుమతి లేకుండ లేక అనుమతి-షరతులకు వ్యతిరేకముగ నిర్మింపబడిన భవనము పడగొట్టుటకు ఉత్తరువు మన్నించకుండుట. | డిటో |
| 162 | | రాజవీధి మొదలగువాని నానుకొని యున్న భూమినుండి బ్రహ్మజెముడు, వాటిర్, లంతానా మొదలైన వాటిని తీసివేయుటకు ఉత్తరువు మన్నన చేయకుండుట. | పది రూపాయలు |
| 163 | (1) | రాజవీధిలో అక్రమముగా రంధ్రము జేయుట లేక అడ్డు కలుగజేయుట. | డిటో |
| 164 | (2) | పంచాయతీ సమితిలో చేరిన భూమిమీద భవనము మొదలైనవాటిని నిర్మూలించకుండుట. | ఏబది రూపాయలు |
| 169 | (1) | అనుమతి లేకుండ జంతువు లేక వస్తువును బహిరంగసంతలో అమ్ముటకు పైనయుంచుట లేక అమ్ముట. | పది రూపాయలు |
| 171 | | లైసెన్సు లేకుండ లేక లైసెన్సుకు వ్యతిరేకముగా స్వంతసంతను తెరచియుండుట. | ఒకవంద రూపాయలు |
| 172 | (1) | సర్టిఫికేటు లేకుండ స్వంతసంతలో రుసుము విధించుట. | ఏబది రూపాయలు |

| (1) | (2) | (3) | (4) |
|---|---|---|---|
| 175 | | లైసెన్సులేని స్వంతసంతలో జంతువు లేక వస్తువు అమ్మకమునకు తెరచియుండుట లేక అమ్మట. | పది రూపాయలు |
| 176 | | స్వంతసంతకు లేక కప్పుకు మొదలైన వాటికి దారులు మొదలైన వాటిని నిర్మించుటకు ఉత్తరువు మన్నింపకుండుట. | డిటో |
| 177 | (2) | పనులు నిర్వర్తించనందుకు లైసెన్సు ఆపుదల చేయబడిన తరువాత లేక నిరాకరింపబడిన తరువాత స్వంతసంత తెరచియుండుట. | ఇరవై రూపాయలు |
| 178 | | స్వంతసంతలలో ఉపద్రవములు. | పది రూపాయలు |
| 187 | (1) | లైసెన్సు లేకుండగా లేక లైసెన్సుకు వ్యతిరేకముగా స్వంత బండి ఆగు స్థలమును తెరచియుండుట. | ఇరవై రూపాయలు |
| 193 | | లైసెన్సు లేకుండ హానికరమైన లేక ప్రమాదకరమైన వ్యాపారము చేయుటకు ఒక స్థలమును ఉపయోగించుట. | డిటో |
| 194 | | ఫ్యాక్టరీ, వర్కుషాపు మొదలైన వాటిని అక్రమముగా లేవదీయుట. | ఒక వంద రూపాయలు |
| 195 | | ఉపద్రవములు మొదలైన వాటిని తగ్గించుట విషయములో ఉత్తరువు నుల్లంఘనము. | ఏబది రూపాయలు |

X వ షెడ్యూలు (వదలబడినది)

493

# విషయ సూచిక

## పంచాయతీ సమితులకు జిల్లాపరిషత్తులకు అనువర్తింపజేసిన, ఆంధ్రప్రదేశ్ (తెలంగాణా) జిల్లాబోర్డుల చట్టము


| సెక్షను నెం. | | పేజీ నెం. |
|---|---|---|
| 1. | సంక్షిప్తనామము, వ్యాప్తి, మరియు ఆరంభము | 501 |
| 2. | నిర్వచనములు | 501 |
| 3. | నుండి 65 వదలబడినవి | 506 |
| 66. | పంచాయతీ సమితి జిల్లా పరిషత్తు వశమందుంచబడిన ఆస్తి: | 506 |
| 67. | సమితుల పరిషత్తులకై భూమి సంగ్రహణ | 507 |
| 68. | ప్రజాసామాన్య సంస్థల యజమాన్యము | 507 |
| 69. | ప్రభుత్వమునకు సమితి–పరిషత్తు ఆస్తిమార్పు | 507 |
| 70. | సమితి పరిషత్తు ఆస్తియొక్క యితరమగు మార్పులు | 508 |
| 71. | వేలములు | 508 |
| 72. | స్థానికాధికారి వర్గముల ఋణముల చట్టము 135 ఫ. యొక్క రక్షణ | 508 |
| 73. | ఒప్పందము జేసికొను విధము | 508 |
| 74. | ఒడంబడికలలో అనుచితాభి నివేశము | 509 |
| 75. | కంట్రాక్టులలో అనుచితాభి నివేశమునకై శిక్ష | 510 |
| 76. | సద్విశ్వాసముతో నొనర్పబడిన పనికి సంబంధించిన దావా నిరోధకము | 510 |
| 77. | సూచన లేకుండా దావానిరోధకము | 510 |
| 78. | ద్రవ్యము లేక ఆస్తియొక్క నష్టమునకై దుర్వ్యయము లేక దుర్వినియోగమునకై బాధ్యత | 510 |

79. దావాలలో రాజీచేయుటకు పంచాయతీ సమితి-జిల్లాపరిషత్ కధికారము 511

80. పంచాయతీసమితి జిల్లాపరిషత్తుల విధులు 511

81. పంచాయతీ సమితి జిల్లాపరిషత్‌యొక్క వివేకాధికారములు 513

82. కట్టడములను ప్రవేశించి పరీక్షించు మొదలైన అధికారములు 515

83. పారిశుధ్యములలోని కట్టడములు 515

84. నీటివనరుల విషయమున అధికారములు 516

85. జారీచేయబడిన ఆదేశముల ననుసరింపనిచో ప్రతిక్రియ 517

86. సార్వజనికమగు చెలమ మొ. వానిని కొన్నిపనులకు ప్రత్యేకించుటకు, కొన్నివనరుల నుండి నీరువాడుటను నిషేధించుటకు అధికారము 518

87. ఇతర పనులకు ప్రత్యేకింపబడిన చోట్లను వాడుకొనినందులకు శిక్ష 518

88. కంపు నీటినుండి న్యూసెన్సు తగ్గించుట 519

89. మృతుల అంత్యక్రియలకగు స్థలములను మూసివేయుట 519

90. శవములను పాతిపెట్టు మరియు దహనముచేయు భూముల రిజిష్టరు కావించుట 520

91. మరణించినవారి అంత్యక్రియ లొనర్పబడుటకు స్థలములకు లైసెన్సులను పొందుట 520

92. పాతిపెట్టు మరియు దహనముచేయు భూములను మరియు స్మశానములను ఏర్పరచుట 521

93. అధ్యక్షుడు మొదలగువారు అంటువ్యాధిగల కట్టడములు మొదలగు వాని కట్టడములు మొదలగువానిలోనికి పరీక్షార్థము ప్రవేశించుటకు అధికారమును కలిగియుండుట 521

94. అంటుక్రిములుగల వస్తువులను క్రిమిరహితము లొనర్చుటకు ఉతుకుటకు స్థలములు ప్రకటించుట 522

95. అంటువ్యాధి గూర్చి ఛోగట్టా 523

96. సార్వజనికములగు రోడ్లపైనను భూమపైనను భవనములపైనను అవరోధములు మరియు అతిక్రమణములు 523

97. లైసెన్సులేని హోటళ్ళను; రెస్టారెంట్లను; టీ దుకాణము మొ॥ వానిని పీడాకరమగు ఒక అపాయకరములకు వ్యాపారము లను నిషేధించుట 524

98. విక్రయార్థము జంతువధను క్రమబద్ధమొనర్చు అధికారము 525

99. పశువ్యాధిని ఆపు చర్యలు గైకొనుటకు అధికారము 525

100. కుక్కవెర్రిని ఆపుట మరియు వెర్రి మరియు తప్పిపోయిన కుక్కల సంహారము 525

101. అపాయకరమగు రీతిని రాళ్ళను త్రవ్వుట, తుపాకీ మందు ప్రేల్చి ముక్కలు చేయుట 526

102. కట్టడములను నిర్మించుటకు అనుమతి అవసరము 526

103. ప్రాంతీయ మరియు నగరపథకము మరియు స్థానిక అభిన్యాసములు (లేఔట్స్) 527

104. పధకము లేక అభిన్యాసము మంజూరి ప్రకటన 527

105. పధకము లేక అభిన్యాసమును మార్చుట లేక కొట్టివేయుట 528

106. పధకము లేక అభిన్యాసము యొక్కమార్పు లేక కొట్టివేత వలన బాధింపబడిన వ్యక్తులకు నష్టపరిహార పరిమితి 528

107. ఆమోదము (మంజూరీ) తర్వాత పధకములు లేక అభిన్యాసమును అనుసరించుటకు యజమానుల బాధ్యత 528

| | | |
|---|---|---|
| 108. | ఏదైన ప్రాంతీయ లేక పట్టణ పథకము లేక అభిన్యాసము యొక్క ఏర్పాట్లను నుల్లంఘనకై శిక్ష | 529 |
| 109. | ప్రవేశము మొదలగు అధికారములు | 529 |
| 110. | భూ సంపాదన శాసనము, సం. 1894 పథకమున లేక అభిన్యాసమునకు అవసరమగు స్థిరాస్తికి వర్తించుట | 529 |
| 111. | దోమలను అణచుటకై ప్రదేశమును ప్రకటించుట | 530 |
| 112. | నీటి సముదాయమున దోమలసంతానాభివృద్ధి నిషేధము | 530 |
| 113. | దోమల సంతానాభివృద్ధి స్థలముల నిర్వాహము | 531 |
| 114. | కర్తవ్యము మీరిన సందర్భమున ఆరోగ్యాధికారి అధికారము | 531 |
| 115. | దోమ వ్యతిరేక నిర్మాణము, రక్షణ: | 531 |
| 116. | అట్టి నిర్మాణములలో అడ్డుపడుట నిషేధము | 532 |
| 117. | ఆరోగ్యపు సిబ్బందికి ఆవరణతోడి గృహమున ప్రవేశించుటకు, పరిశీలించుటకు అధికారము | 532 |
| 118. | సెక్షను 113 యొక్క ఉల్లంఘమునకు శిక్ష | 532 |
| 119. | సెక్షను 115 ఉల్లంఘనమునకు శిక్ష | 533 |
| 120. | సెక్షను 116 యొక్క ఉల్లంఘనమునకు శిక్ష | 533 |
| 121. | సార్వజనిక విపణులు (పబ్లిక్‌మార్కెట్టు) | 533 |
| 122. | సార్వజనిక విపణులను (పబ్లిక్ మార్కెట్లును) మూసివేయుట | 533 |
| 123. | స్వంత మార్కెట్లకు లైసెన్సును యిచ్చుట | 533 |
| 124. | అట్టి లైసెన్సుల వ్యవధి | 534 |
| 125. | సమితి లైసన్సును ఇచ్చుటకు ఆలసించునప్పుడు కార్యవిధానము | 534 |
| 126. | శిక్షలు | 534 |
| 127. | పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్తుల నిధి ఏర్పాటు చేయుట | 535 |
| 128. | వదలబడినది. | 536 |
| 129. | విధివినియోగము | 536 |
| 130. | నుండి 134 వదలబడినవి. | 538 |
| 135. | స్థానిక పన్ను | 538 |

136. స్థానిక పన్ను యొక్క వసూలు మరియు జప్తు 538
137. స్థానిక పన్ను కొంతకాలమువరకు నిలుపుట మరియు దానిని మాఫీచేయుట 539
138. ఆస్తిపై ప్రత్యేకపన్ను 539
139. ఇతర పన్నులు 540
140. పన్నుల విధించు విధానము 542
141. పన్నులను రద్దుచేయు లేక మార్పు విధానము 543
142. పన్నులను తాత్కాలికముగ ఆపు లేక వానినుండి మినహాయించు విధానము 544
143. కొన్ని స్థలములను మరియు కట్టడములను ఉపయోగించు కొనుటకు మరియు లైసెన్సులకు రుసుము వసూలు చేయుటకు అధికారము 544
144. భోగట్టాను అడుగుటకు అధికారము 545
145. నమూనాలోని లోపమువలన పన్ను నిర్ణయము అప్రమాణముగ నుండదు 545
146. ఇతర చర్యలకు ఆటంకము 545
147. పన్నుల మొత్తమునకై బిల్లునిచ్చుట 545
148. ఏసందర్భములో వారంటు జారీచేయవచ్చును 546
149. ఎవరిచే వారంటు సంతకము చేయబడవలెను 547
150. వారంటు ఎవరికి వ్రాసి పంపవలెను 547
151. ప్రత్యేకాజ్ఞక్రింద, ప్రవేశాధికారము 547
152. వారంటు యెట్లు అమలుపరచబడవలసినదియు 548
153. జప్తు చేయబడిన సరకు అమ్మకము 549
154. జిల్లాకు వెలుపలి జప్తు మరియు అమ్మకము 550
155. వసూలు చేయదగు రుసుములు మరియు ఖర్చులు 550
156. మున్సిఫు-మేజిస్ట్రేటునకు ఉపర్యుభియోగములు 550
157. పన్నుకై భూములు, కట్టడములు మొదలగువాని బాధ్యత 551

158. దారిపన్ను (టోలు)ను చెల్లింపనిచే పశువులను, సరకును లేక వాహనములను వశపరచుకొను అధికారము 551

159. టోలులను ఏర్పరుచుట 552

160. అన్ని చెల్లింపులకు రశీదుబు యివ్వబడవలయును 553

161. పన్నుల బకాయీల మరియు నితర బాకీల వసూలు 553

162. వసూలు చర్యలకు కాలదోషము 553

163. ముజరాలు (Refunds) 554

164. నుండి 177 (వదలబడినవి) 554

178. ప్రభుత్వముచే లేక ఇతర అధికారులచే జారీ చేయబడిన ఉత్తరువులను అమలులోనికి తెచ్చుటకు ప్రభుత్వాధికారము 554

179. పంచాయతీ సమితుల, జిల్లాపరిషత్తుల మరియు స్థానిక సంస్థల మధ్య వివాదము 554

180. వదలబడినది 554

181. ప్రభుత్వముచే అప్పగించబడు అధికారములు 554

182. రెవిన్యూ అధికారుల కంట్రోలు; 555

183. వ్యక్తుల పేరిట నోటీసులు మొదలైనవి జారీచేయుట 555

184. భవనముల యొక్కయు భూమియొక్కయు యజమానులకు లేక అనుభవదారులకు నోటీసులు జారీచేయుట 557

185. పబ్లికు మరియు సాధారణ నోటీసుల ప్రచురణ 558

186. నోటీసుయొక్క లోప భూయిష్టమగు సమూనా, సహేతుకమగు సమయము నిర్ణయము మరియు దాని ప్రకారము నడువనందున పర్యవసానము 558

187. ఏ యితర సెక్షను ననుసరించియు శాశ్వతములుగాని యాజ్ఞలను, నోటీసును ఉల్లంఘించి నందులకు శిక్ష 558

188. యజమాని లేక అనుభవదారు తీయునప్పుడు పంచాయితీ సమితి- జిల్లాపరిషత్తు నిర్మాణమును నిర్వహించ వచ్చును. మరియు ఖర్చులను వసూలు చేసుకొనవచ్చును 559

189. ఖర్చులు లేక విలువలు ఎట్లు నిర్ణయింప వలసినదియు, వసూలు చేయబడ వలసినదియు 560
190. అపీలు నిషేధము 561
191. కొన్ని ఆజ్ఞలపై కలెక్టరునకు అపీలు 561
192. అపీలునకు కాల దోషము 562
193. ఉపస్థాయి యోగము యొక్క నమూనా మరియు చర్యల మరియు అమలు నిలుపుదల 562
194. అపీలులో కలెక్టరుయొక్క నిర్ణయము. 563
195. పునఃపరిశీలనకు అధికారములు. 564
196. నేరముల చట్ట బద్ధ విచారణ 564
197. సమితి-పరిషత్తు వ్యాజ్యము నడిపింప వచ్చును. 565
198. నేరముల రాజీ పరచుటకు అధికారము 563
199. నియమములకు చెందిన సాధారణ విధులు 566
200. నియమము లొనర్ప బడవలసిన వ్యవహారములు. 566
201. ఉప నిబంధనలు 570
202. ఉపనిబంధన మొనర్ప బడు వ్యవహారములు. 571
203. పంచాయతీ అధికారములను మరియు క్రియలను పంచాయతీ సమితి జిల్లాపరిషత్‌నకు సమితి-పరిషత్ అధికారములను మరియు క్రియలను పంచాయతీలకు మార్చుటకు ప్రభుత్వ అధికారము. 572
204. రికార్డు సాక్ష్య పద్ధతి 573
205. పత్రములు కనపరుచుటకు సంబంధించి సమితి—పరిషత్ ఉద్యోగులు హాజరగుటకు పిలుచుటకై నిర్బంధములు 573
206. సాక్ష్యమును పిలుపించుటకు సమితి లేక పరిషత్తుకు అధికారము 573
207. అపరాధములకు సంబంధించి పోలీసు అధికారములు మరియు విధులు మరియు అధికారులకు సహాయము 574
208. తన అధికారములను ఇతరులకు ఇచ్చుటకు అధికారము 574
209. పశువుల బంజరు చట్టముయొక్క ప్రభావము. 574
210. రద్దు మరియు రక్షణము. 575
షెడ్యూలు 576

# నాలుగవ షెడ్యూలు

## పంచాయతీ సమితులకు జిల్లాపరిషత్తులకు అనువర్తించిన 1955వ ఆంధ్రప్రదేశ్ (తెలంగాణా) జిల్లా బోర్డుల చట్టము:-

## అధ్యాయము 1 ఉపక్రమణిక

### సంక్షిప్తనామము, వ్యాప్తి, మరియు ఆరంభము.

1. (1) ఈ చట్టము ఆంధ్రప్రదేశ్ (తెలంగాణా) జిల్లాబోర్డుల శాసనము, సంవత్సరము 1955 అని వ్యవహరింపబడును.

(2) హైదరాబాదు పురపాలక సంఘముల శాసనము, 1950 క్రింద నేర్పరుపబడిన సంఘముల లేక హైదరాబాదు పుర మరియు నగర పాలికా సమితుల చట్టము, 1951 క్రింద నేర్పరుపబడిన ఏదైన క్యాంటోన్మెంటు లేక నగరపాలికా సమితి లేక పురపాలికా సమితి యొక్క అధికార క్షేత్రములో చట్టసమ్మతముగా చేర్చుకొనబడిన ప్రదేశములు తప్ప, అది హైదరాబాదు రాష్ట్రి మంతటికిని వర్తించును.

(3) ప్రభుత్వ గజెటులో ప్రభుత్వముచే నిర్దిష్టపరుపబడిన తేదీనుండి ఇది అమలులోనికి రాగలదు.

### నిర్వచనములు

2. (1) ఈ శాసనములో నేదైన విషయము లేక సందర్భమునకు విరుద్ధముగా నున్ననే తప్ప,—

(1) వదల బడినవి.

(2) 'భవనము'లో ఒక గృహము బహిర్గృహము, దుకాణము, గుఱ్ఱములకొట్టు (Stable), భాండాగారము, కర్మాగారము (వర్క్‌షాప్), మేలుకట్టు (క్యానోపీ) కొట్టు, గుడిసె లేక ఇతర ఆవరణములు మనుష్య నివాసార్థముగాని మఱొక విధముగాని ఉపయోగింపబడునట్టివి చేరును, మరియును ప్రహరిగోడలు మరియు కంచెలు కలుపుకొని గోడలు, వరండాలు, అరుగులు, సందులు మెట్లు మరియు ఇటువంటివికూడ చేరును.

(3) వదల బడినది.

4. 'జిల్లా' అనగా భూమ్యాదాయ శాసనము, సం. 1317 ఫ. ననుసరించి అప్పుడప్పుడు ఒక జిల్లాగా ఏర్పాటు చేయబడిన రాజస్వపు జిల్లా.

5. 'నిర్మించుట లేక పునర్నిర్మించుట'లో

(ఎ) ఏదైన భవనముయొక్క ప్రధానమైన మార్పు లేక విస్తరణము:

(బి) ఆదిలో మానవ నివాసార్థము కట్టబడిన ఏదైన భవనమును మానవ నివాసయోగ్యమైన స్థలముగా నిర్మాణమందలి మార్పుద్వారా మార్చుట:

(సి) ఒకటి లేక ఎక్కుడు మానవ నివాస స్థలములను అట్టి ఇంకను ఎక్కువ స్థలములలోనికి మార్చుట;

(డి) రెండు లేక ఎక్కుడు మానవ నివాసస్థలములను అట్టి తక్కువ స్థలములోనికి మార్చుట;

(యి) దాని కాలువల లేక పారిశుద్ధ్యపు ఏర్పాట్లలో మార్పును దెచ్చునట్టి లేదా దాని భద్రతను ప్రధానముగా ప్రభావితము చేయునట్టి ఏదేని భవనముయొక్క మార్పు;

(యఫ్) ఏదేని భవనములో ఏవేని గదులు, భవనము, బహిర్గృహములు లేక ఇతర నిర్మాణమును పెంచుట;

(జి) ఆదిలో అట్టి అవసరమునకై నిర్మింపబడని లేక ఉద్దేశింపబడని ఏదేని స్థలమును లేక భవనమును నిర్మాణమందలి మార్పుద్వారా (మతవిషయక) ప్రార్థనాస్థలముగా లేక పవిత్ర భవనముగా మార్చుట;

(హెచ్) గోడల లేక భవనముల మధ్యగల బహిరంగ స్థలముపై కప్పువేయుట లేక కప్పుట అట్టి స్థలముపై కప్పువేయుట లేక కప్పుటవలన ఏర్పడిన స్వరూపమునకు సంబంధించి ;

(ఐ) ఏదేని భవనమును కొట్టు దుకాణము, భాండాగారము, లేక గోదాముగా ఆదిలో అట్టి ఉపయోగమునకై నిర్మింపబడని దానిని మార్చుట లేక ఇందుకు తారుమారుగా చేయుట;

**(జె) ఆ గోడ యజమానికి సంక్రమింపనట్టి వీధికి లేక భూమికి ప్రక్కనున్న గోడలయందు అట్టి వీధి లేక భూమివైపు తెరుచుకొనునట్టి ద్వారమును నిర్మించుట:**

6. 'కర్మాగారము' అనగా కర్మాగార శాసనము, 1948 లో నిర్వహింపబడినట్టి కర్మాగారమే కాకుండ, ఆవిరి, నీరు, నూనె, గ్యాస్, విద్యుత్తు లేక మానవులద్వారా లేక జంతువులద్వారా ఉత్పత్తి చేయబడకుండి యంత్రసహాయమున అందజేయబడెడి యేదేని యితర విధమైన శక్తి భేదము యొక్క సహాయముతోడ పారిశ్రామిక, వస్తూత్పత్తి లేక వ్యాపార కార్యము నిర్వహింపబడెడి ఆవరణము దానితోబాటుగా దానియొక్క సమీప స్థలములు.

7. 'ఆర్థిక సంవత్సరము' అనగా 1వ ఏప్రిల్‌న లేక ప్రభుత్వ ప్రకటన ద్వారా నియమించు తేదీతో మొదలగు సంవత్సరము.

8. రిటైరయి ఫించను పుచ్చుకొను ఉద్యోగి "ప్రభుత్వోద్యోగి" కాదు.

9. 'ఆరోగ్యాధికారి' అనగా పంచాయతీ సమితి జిల్లాపరిషత్తుచే లేక దాని పక్షమున నియమింపబడినట్టి ఆరోగ్యాధికారి, ఎవరైన ఉన్నచో, మరియు అట్టి ఏ అధికారియు లేనిచో ఆ జిల్లాయొక్క ఆరోగ్యాధికారి.

10. 'అంటువ్యాధి' అనగా మెదడు - వెన్నెముక జ్వరము (Cerebro-Spinal Fever), చిన్నమ్మవారు (Chicken Pox), కలరా, గొంతు నరముల రోగము, సన్నిపాతజ్వరము, అంటువిషయపు పటిసెము (ఇన్ఫ్లూయంజా), కుష్ఠరోగము, తట్టుతల్లి, ప్లేగు, కుక్కవెఱ్ఱి, రక్తవర్ణజ్వరము (Scarlet Fever), స్ఫోటకము, క్షయ, విషజ్వరము (టైఫస్), యాజ్, లేక ప్రభుత్వము ఈ నిమిత్తమై రాష్ట్రమంతటికిని సాధారణముగను లేక ఆ ప్రకటనలో నిర్దిష్టపఱుప బడగలట్టి దాని భాగము లేక భాగములలో ప్రకటించెడి యితర వ్యాధులు.

11. 'నివాసి' అను పదములో ఒక బోర్డుయొక్క అధికార క్షేత్రములోని ఏదైన ప్రదేశమునందు సాధారణముగా వసించుచున్న లేక వ్యాపారమున సాగించుచున్న లేక స్థిరాస్తిని అనుభవించుచున్న ఎవరైన వ్యక్తి చేరును.

12. మార్కెటు అను పదములో కనీసము నాలుగు అంగడులు, దుకాణములు లేక పాకలు నిర్మింపబడి లేక కనీసము పది పశువులు అమ్మకమునకై తేబడి సాధారణముగా లేక నియమితకాలములలో అమ్మకమునకై సరుకులు లేక పశువులు బహిరంగముగా ప్రదర్శింపబడు స్థలము చేరును.

13. వదలబడినది.

(14) 'కబ్జాదారు' (Occupier) అనగా ఏదేని భూమి లేక భవనమును లేదా దాని భాగమును వాస్తవముగా తన యధీనమందు గలిగి యుండు వ్యక్తి, మరియు వాస్తవాధాన్యముగల యజమానియు, మరియు కిరాయ దారుడు లేక అనుమతి దారుడు (లైసెన్సుదారుడు) అట్టి కిరాయ దారుడు లేక అనుమతి దారుడు అద్దె చెల్లించుటకు బద్ధుడైనను కాకున్నను, ఇందులో చేరుదురు.

(15) "చెడ్డ పదార్థము"లో మలపదార్థము మరియు పాయఖానాల లోని తూపురాణులలోని మురికి కాలవలలోని యితర పదార్థములు; ఉత్పత్తి పరిశ్రమ, లేక వ్యాపారముయొక్క ఏదేని కార్యపరిణామముగా బయట పారవైచ బడినట్టి పేడ మరియు విసర్జిత పదార్థము లేక నిరుపయోగమైన చెడ్డ పదార్థము; క్రుళ్ళిన లేక క్రుళ్ళజేయు పదార్థములు; మురికి, ఊడ్పుకసవు, ఉమ్మి దానితోబాటు నమిలిన తమలము మరియు పొగాకు, వంటింటి లేక గుఱ్ఱముల దొడ్డినుండి పారవైచబడిన పదార్థము, పగిలినగాజు లేక కుండలు, చెత్త కుప్ప మరియు రద్దు కాగితము చేరును.

16) ''హానికర వ్యాపారము'' అనగా ఉపద్రవ కరములైన లేక న్యూసెన్సు కాగల పదార్థముల నిర్వహము జరుగునట్టి వ్యాపారము, వ్యవహారము లేక పరిశ్రమ.

(17) 'యజమాని' తన సొంత బాధ్యతపైగాని ఏజంటుగాగాని గ్రాహకుడుగాగాని ధర్మకర్త (ట్రస్టీ) గాని ఏదైన భూమి లేక భవనము లేక దాని భాగముయొక్క అద్దెను ఆ సమయమున తీసికొనుచున్నట్టి వ్యక్తి లేదా ఆ భూమి, లేక భవనము లేక దాని భాగము ఒక కిరాయదారునికద్దె కియ్యబడి యుండినచో అద్దెను పొందియుండెడి వ్యక్తి చేరును.

(18) ''పంచాయతీ'' అనగా 1956 వ సం॥పు హైదరాబాదు గ్రామ పంచాయతీ చట్టము ప్రకారము ననుసరించి స్థాపింపబడిన ఒక పంచాయతీ.

(19) ''విధింపబడినది'' అనగా యీ శాసనము ననుసరించి ఒనర్పబడిన నియమములచే విధింపబడినది.

(20) వదలబడినది.

21. "స్వంత మార్కెట్టు"(Private market) అనగా హైదరాబాదు వ్యావసాయిక మార్కెట్టు శాసనము, 1939 ఫసలి క్రింద స్థాపింపబడిన ఒక మార్కెట్టు లేక పబ్లిక్ మార్కెటుకంటె యితరసుగు ఒక మార్కెట్టు.

22. "పబ్లిక్ మార్కెట్టు" అనగా ఒక సమితి–పరిషత్తుకు చెంది లేక సమితి పరిషత్తుచే సంపాదింపబడిన, నిర్మింపబడిన, సంరక్షింపబడిన లేక నిర్వహింపబడిన ఏదైన మార్కెట్టు.

23. "ప్రజోపద్రవకరము" (పబ్లిక్ న్యూసెన్సు). లో చూపు వాసన లేక వినుటకు చెందిన ఇంద్రియములకు హాని, అపాయము, పీడ లేక చెఱుపుకు కారణమైన లేక బహుళః కలిగించునదియగు లేక విశ్రాంతి లేక నిద్రాభంగము లేక ఆ ప్రాంతములో సాధారణముగా సమీపమున నివశించు లేక ఆస్తి ననుభవించు జనుల లేక ఏదైన సార్వజనిక స్వత్వమును ఉపయోగించుకొను అవకాశము గల వ్యక్తుల లేక ప్రజా ఆరోగ్యము లేక ప్రాణమునకు లేక ఆస్తికి అపాయకరముగా హానికరముగ ఉండునట్టి లేక ఏదైన పని లేక లోపము లేక విషయము చేరును లేక ఏదైన ప్రజాసామాన్యపు హక్కును ఉపయోగించుకొను తరుణమును కలిగియుండు వ్యక్తుల చేరుదురు.

25. "వీధి" (Street) అనగా ఏదేని రోడ్డు, నడకదారి, నాలు బాటల చోటు, ప్రాంగణము, సందు లేక ఇఱుకు త్రోవ. సర్వజనులును పోదగినట్టిది అది రాజమార్గమైనను కాకున్నను.

మరియు ఇందులో ప్రతి ఖాళీ స్థలము, అది స్వంతాస్తియైనప్పటికిని మరియు దాని ప్రక్కల ఇండ్లు, దుకాణములు లేక ఇతర భవనములుండి ఎవరేని వ్యక్తిచే ఏదేని బహిరంగ స్థలమునకు లేక రాజమార్గమునకు పోవుటకు, వచ్చుటకును ఆధారము ఉపయోగింపబడినచో ఆ వ్యక్తులు అట్టి భవనముల కబ్జాదారులైనను కాకున్నను–అది పూర్తిగాగాని కొంతవరకుగాని ఏదేని ద్వారము, స్తంభము, గొలుసు లేక మరేదేని హద్దుచే నిరోధింపబడినప్పటికిని, చేరును. కాని ఏదేని అట్టిభవనముయొక్క కబ్జాదారు పై విధముగా దానిని ఉపయోగించుటకు ఇతర వ్యక్తుల నేసమయమందైనను అడ్డుటకు హక్కుగలిగియుండునట్టి అట్టి స్థలముయొక్క ఏ భాగమైనను ఇందులో చేరదు. మరియు ఇరుప్రక్కలనున్న కాలువలును–ప్రక్కలందు కాలినడక దారులున్నట్టిగాని లేనట్టిగాని సొంతాస్తియైనను లేక వీధిగాగాక మరొక యేదేని యుపసరమునకై ప్రభుత్వముచే లేక జిల్లాబోర్డుచే సురక్షిత మొనర్పబడినట్టి యాస్తియైనను అట్టి సమీప యాస్తి

యొక్క సరిహద్దులదాక రోడ్డుబాటకిరువైపులను వ్యాపించియున్న వరండా లేక మరొక కట్టడముకూడ చేరును.

25. 'పన్ను'లో ఏదేని సుంకము, రేటు, సెస్సు, శుల్కము లేక ఈ శాసనము ననుసరించి విధింపదగిన ఇతరమైన విధింపు చేరును.

26. 'వాహనము' అనగా ఒక బహిరంగ వీధిలో ఉపయోగింపబడునట్టి లేక ఉపయోగింపబడుటకు వీధిలో యోగ్యమైన ఒక బైస్కిల్, ట్రైసిక్కిల్, మోటారుబండి మరియు చక్రములుగల ప్రతి సవారి.

27. వదలబడినది.

28. ఈ శాసనములో ఉపయోగింపబడి కాని నిర్వచింపబడని పదములు భూమ్యాదాయ శాసనము, 1917 ఫసలి మరియు ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సమితులు, జిల్లా పరిషత్తుల చట్టము 1859 లో వానికి నిర్ణయింపబడిన అర్థములు కలవై యుండును.

3 నుండి 65 వదలబడినవి.

## అధ్యాయము 5

## ఆస్తి, ఒప్పందములు మరియు బాధ్యతలు

66. పంచాయతీ సమితి జిల్లా పరిషత్తు వశమందుంచబడిన ఆస్తి:

ప్రభుత్వము ఆ యా సమయానుసారముగ, ఏదయిన బాట (రోడ్డు), వంతెన, కాలువ భవనము లేక యితర స్థిర లేక చరాస్తి ప్రభుత్వముయందు ఆయత్తమైనట్టిది మరియు ఒక బ్లాకు లేక పంచాయతీ సమితి-జిల్లా పరిషత్తు జిల్లాలోపుగా నెలకొని యుండునట్టిది. అట్టి పంచాయతీ సమితి జిల్లాపరిషత్తు యొక్క అంగీకారముతో మరియు ప్రభుత్వము చేయు మరియు విధింపవచ్చునట్టి రీతిగా అట్టి మినహాయింపులు మరియు కట్టుబాటులకు లోబడి, ఈ శాసనావసరములకై సమితి పరిషత్తుయొక్క నియంత్రిణ మరియు నిర్వహణ Control & administration) క్రింద నుంచవచ్చును. మరియు అందుపై అట్టి బాట, వంతెన, కాలువ, భవనము లేక ఇతర ఆస్తి, ఆ విధముగా చేయబడిన మరియు విధింపబడిన అన్ని మినహాయింపులు మరియు కట్టుబాటులకు మరియు బాధ్యతలకు లోబడి ఆ సమితి పరిషత్తుయొక్క నియంత్రిణ మరియు నిర్వహణక్రింద నుండగలవు.

(2) ప్రభుత్వము, ఆ యా సమయానుసారముగా ఉప-పరిచ్ఛేదము (1) క్రింద ఆ బోర్డు యొక్క కంట్రోలు క్రింద నుంచబడిన

ఏదైన ఆస్తిని అధికారిక రాజపత్రమున ప్రకటనద్వారా తిరుగతీసికొన వచ్చును. అట్టి షరతులపై ప్రభుత్వము ఆ పంచాయతీ సమితి జిల్లాపరిషత్తు యొక్క అంగీకారముతో నిర్ణయింపవచ్చును.

67. సమితులు పరిషత్తులకై భూమి సంగ్రహణ :

ఈశాసనావసరములకై, ఒక పంచాయతీ సమితి జిల్లా పరిషత్తుయొక్క అధికార క్షేత్రమునకు లోబడి ఆ ప్రదేశము లోనుగానున్నను లేక లేకున్నను ఏదైన భూమి కోరబడి నప్పుడు ప్రభుత్వము ఆ బోర్డుయొక్క విన్నపముపై భూమి సంగ్రహణ శాసనము, 1894 లోని కట్టుబాటుల క్రింద దానిని సంగ్రహించుటకు పూనుకొన వచ్చును. మరియు ఆ శాసనము క్రింద నిర్ణయింపబడిన నష్టపరిహారము యొక్క సంగ్రహణముతో సంబంధించిన ప్రభుత్వముచే నొనర్పబడిన ఏదైన ఇతర ఖర్చులు పంచాయతీ సమితి జిల్లా పరిషత్తుచే చెల్లింపుపై, ఆ భూమి పంచాయతీ సమితి జిల్లా పరిషత్తుయం దాయత్తము కాగలదు.అట్టి సంగ్రహణపై సదరు శాసనముయొక్క అర్థమునకులోనై నొక ప్రజా సామాన్యావసరమునకై సంగ్రహణగా నున్నటుల భావింపబడగలదు.

68. ప్రజాసామాన్య సంస్థల యాజమాన్యము ;

(1) పంచాయతీ సమితి జిల్లా పరిషత్తు నిధినుండి భరింపబడు ప్రతి ప్రజానీక సంస్థయొక్క యాజమాన్యము. నియంత్రణ మరియు నిర్వహణ ఆ సమితి పరిషత్తుయం దాయత్తమై యుండగలవు.

(2) ఏదైన ప్రజానీకసంస్థ ఆ సమితి పరిషత్తుయొక్క ఆదేశము, యాజమాన్యము మరియు కంట్రోలు క్రింద నుంచబడియున్నప్పుడు అందుకు చెందియున్న ఆస్తి, దానము మరియు నిధులు, ఎప్పుడాసంస్థ ఆ విధముగా నుంచబడియెనో, ఆ సమయమున న్యాయానుసారముగా వర్తింపదగు అట్టి ఆస్తి, దానముల మరియు నిధులకు చెందిన యవసరములకై ధర్మకర్తృత్వమున అ బోర్డుచే వహింపబడ గలవు.

అయితే అట్టి ఏదయిన సంస్థపట్ల ఆ సమితి పరిషత్తు యొక్క స్వతంత్రాధికార సీమ నిర్దేశింపబడవచ్చును.

69. ప్రభుత్వమునకు సమితి పరిషత్తు ఆస్తి మార్పు :

సమితి పరిషత్ ప్రభుత్వముమంజూరీతో, సెక్షను66,67లేక 68 క్రిందసమితి పరిషత్తుయందు ఆయత్తమైయున్న ఏదైన ఆస్తికిలోబడియుండినట్టి ఏదైనధర్మకర్తృ

త్వము ప్రజానీకపు హక్కును బాధించురీతిగా నుండకుండునటు మార్పు చేయ వచ్చును,

70. సమితి పరిషత్తు ఆస్తియొక్క యితరముగు మార్పులు :

ప్రభుత్వము సాధారణ లేక ప్రత్యేకపు టుత్తరువుద్వారా ఆదేశించునట్టి రీతిగానట్టి మినహాయింపులకు లోబడి, యే పంచాయతీ సమితి-జిల్లాపరిషత్తు దాని సభ్యుల మొత్తము సంఖ్యలో మూడింట రెండువంతులకు తక్కువకాని అధిక సంఖ్యకు సమావేశమున తీర్మానింపబడిన నొక తీర్మానము ననుసరించి మరియు ఈ శాసనము క్రింద నొనర్పబడిన నియమముల ననుసరించి, యేదైన స్థిరాస్థిని మార్చకూడదు. మరియు ప్రభుత్వముయొక్క మంజూరీతోతప్ప ప్రభుత్వముచే దాని యందాయత్తమైయున్న నేదైన ఆస్థిని ఏసమితి-పరిషత్‌యును మార్చకూడదు;

అయితే ఈ సెక్షనులోని దేదియు మూడేండ్లకు మించని గడువు దాక యేదైన స్థిరాస్తి కౌళ్ళకు వర్తింప నేరదు,

71. వేలములు :

పంచాయతీసమితి-జిల్లాపరిషత్ వేలములు వేయుటకు, మరియు అట్టి వేలములకు సంబంధించిన ఒప్పందములలో ప్రవేశించుటకును అధికారమును కలిగియుండును,

అయితే అట్టి ఒప్పందము యొక్క గడువు ఒక సంవత్సరము నకు మించు పక్షమున, స్థానిక పరిపాలనశాఖా కార్యదర్శి యొక్క మంజూరీ మరియు అయ్యది మూడేండ్లకు మించుచో ప్రభుత్వము యొక్క మంజూరీ పొంద బడవలెను.

72. స్థానికాధికారి వర్గముల ఋణముల చట్టము 1352 ఫ. యొక్క రక్షణ :

ఈ శాసనములోనున్న దేదియు స్థానికాధికార వర్గముల ఋణముల శాసనమును (1352 F) బాధింప నేరదు.

73. ఒప్పందము జేసికొను విధము :

(1) అధ్యక్షుడు, సమితి పక్షమున, యేదైన గుత్తా లేక ఒడంబడిక, (Contract or agreement) ఒక వేయిరూపాయలకు మించకుండునట్టి మొత్తము గలది. (ప్రస్తుత సమయమున నమలులోనున్న శాసనము ననుసరించి అట్టి విధముగా) చేసికొనవచ్చును; అట్టి గుత్తా లేక ఒడంబడిక అతని పక్షమున నుండు నెడల సతనిని కట్టుపడ చేయును.

(2) ప్రతి గుత్తా లేక ఒడంబడిక, ఒక వేయి రూపాయలకు గుత్తా లేక యొడంబడికయొక్క మొత్తము లేక విలువ మించు పక్షమున లిఖిత పూర్వకముగా ఆ పంచాయతీ సమితి జిల్లా పరిషత్ పక్షమున ఆ అధ్యక్షుడు చైర్మెను మరియు యిద్దరు సభ్యులచే ముందుగా సమితియొక్క అంగీకారముతో సంతకమొనర్పబడినదయి, మరియు పంచాయతీ సమితి_జిల్లా పరిషత్ యొక్క సాధారణ ముద్ర వేయబడినదై యుండవలెను.

(3) ఈ శాసనముక్రింద నాదేశింపబడిన రీతిగా వ్రాయబడని గుత్తా లేక ఒడంబడిక యేదియు పంచాయతీ సమితీ_జిల్లాపరిషత్‌కు భారముగానుండ నేరదు.

74. ఒడంబడికలలో[6] అనుచితాభి నివేశము: (Improper interest in contracts)

(1) ఈ శాసనముక్రింద నియోగింపబడిన నేదైన సభ్యుడు లేక అధికారి, లేక బంట్రోతు ఎవరును సమితి పరిషత్‌చే చేసుకొనబడిన నేదైన గుత్తలోగాని లేక పరోక్షముగా గాని, యెవ్విధముగా నైనను చొరవగలిగి (Interest) యుండ రాదు.

(2) ఏ అట్టి అధికారి లేక బంట్రోతుయైనను అతనిపదవి వ్యాజము క్రింద లేక ఉద్యోగము క్రింద ఆ విధముగా చొర ' చేసుకొనబడి యుండిన యెడల లేక ఏదయిన రుసుమును, లేక యినాము (బహుమానము) ఏదయినను తన అసలు జీతము మరియు బత్తాలకన్న వేరయిన దానిని ముందుగా ప్రభుత్వాను మతి లేకుండగా నంగీకరించిన యెడల, సమితి పరిషత్ లేక ఎవరి నియామకము ప్రభుత్వముయొక్క లేక ఏదేని ప్రభుత్వోద్యోగి యొక్క అనుమతికి లోబడియుండునో, అట్టి అధికారుల విషయములో ఆ ప్రభుత్వము, అతడి శాస నముక్రింద నేదైన పదవిని లేక యుద్యోగమును వహింప లేక సాగింప సమర్థుడు కానేరడని ప్రకటింపవలెను.

(3) ఈ సెక్షనుక్రింద ఏదియు, సెక్షను 75 క్రింద నొక నేర విషయకాభియోజనకు (Criminal prosecution) అవరోధముగా నుండనేరదు.

సవరణ: ఏదైన సంఘటిత పరుపబడిన లేక పంజీకృతమైన వాణిజ్య కూటములో లేక యొక్క భాగస్థుడు లేక సభ్యుడు అనుమాత్రమున నే, అట్టి వాణిజ్యకూటము మరియు ఆ బోర్డుకు మధ్య చేసికొనబడిన నేదైన గుత్తలో, చొరవ యున్నట్లుగా భావింపబడనేరదు. కాని అట్టి గుత్తకు సంబంధించిన బోర్డు కలాపములలో నేద్దానిలోను అతడు పాల్గొనరాదు.

75. కంట్రాక్టులలో అనుచితాఖి నివేశమునకై శిక్ష :

ఒక పంచాయతీ సమితి జిల్లా పరిషత్ యొక్క సభ్యుడు, అధికారి లేక ఉద్యోగి, అట్టి సమితి పరిషత్తుతో చేసికొనబడిన నేదైన కంట్రాక్టులో ప్రత్యక్షముగా కాని లేక పరోక్షముగాకాని చొరవ (interest) కలిగియుండిన యెడల, అతడు ఇండియా పీనల్‌కోడ్‌లోని సెక్షన్ 168 క్రింద నొక నేరము నొనర్చియున్నటుల భావింప బడగలడు.

76. సద్విశ్వాసముతో నొనర్పబడిన పనికి సంబంధించిన దావానిరోధకము :

ఏ దావాయును, యీశాసనము, దానిక్రింద నొనర్పబడిన నిబంధనల క్రింద నైన న్యాయసమ్మతముగా సద్విశ్వాసముతో, తగిన మెలకువ మరియు శ్రద్ధతో చేయబడిన నెద్దాని పైనైన, అట్టి ఏదైన సమితి పరిషత్తు సభ్యుడు, అధికారి లేక ఉద్యోగి, యొక్క అదేశముల క్రింద పనిచేయుచున్న వ్యక్తిలేక యేదైన సమితి లేక అందుకు చెందిన నేదైన సభ్యుడు, అధికారి లేక ఉద్యోగికి విరుద్ధముగా నడుపబడరాదు.

77. సూచన లేకుండగ దావా నిరోధము :

ఈ శాసనము క్రింద చేయబడిన లేక చేయబడినటుల ముఖ్యార్థము నిచ్చు నెద్దాని కొరకైనను, యేదైన అట్టి సమితి-పరిషత్ సభ్యుడు, అధికారి, లేక ఉద్యోగియొక్క ఆదేశము క్రింద పనిచేయుచున్న వ్యక్తికి లేక యేదైన సమితి పరిషత్ లేక యేదైన సభుడు అధికారి లేక ఉద్యోగికి విరుద్ధముగా, ఏ దావాయును వాది యుద్దేశించుచున్న చర్యగల కారణము, పేరు మరియు నివాసస్థానమును, మరియు అతడు సాధికారముగా గోరునట్టి సహాయమునుగూర్చి వివరించుచు, లిఖిత పూర్వకమగు నొక సూచనపత్రి (నోటీసు) మొసగిన తరువాత రెండు నెలలు ముగియునంతవరకు ప్రారంభింపబడ నేరదు. అట్టినోటీసు ఒక సమితి పరిషత్ సందర్భమున దాని కార్యాలయములో నిచ్చివేయ లేక విడచిపెట్టబడవలెను. మరియు యేదైన అట్టి సభ్యుడు, అ ధికారి లేక ఉద్యోగి సందర్భమున పైజెప్ప బడినరీతిగా నకలనికి నందజేయబడవలెను లేక అతని కచేరి లేక సాధారణ నివాసస్థానమున వదలివేయబడవలెను మరియు అట్టి ఫిర్యాదు ఆ విధముగా నోటీసు నందజేయబడిన లేక విడిచివేయబడినదని కలిగి యుండవలెను.

78. ద్రవ్యము లేక ఆస్తియొక్క నష్టమునకై దుర్వ్యయము లేక దుర్వినియోగమునకై బాధ్యత :

పంచాయతీ సమితి-జిల్లా పరిషత్ యొక్క ఎవరయిన సభ్యుడు, అధికారి లేక ఉద్యోగి అట్టి సమితి-పరిషత్‌కు చెందిన లేక దాని కంట్రోలు క్రిందనున్న

ద్రవ్యమును లేక యితర ఆస్తిని ఈ శాసనముచే లేక ననుసరించి అధికృతము గావింపబడని ఏదయిన ఉద్దేశమునకై ఏదయిన చెల్లింపును ఏర్పరచిన, ఏర్పరుప బడుటకు ఆదేశించిన లేక వినియోగమొనర్చిన దానికి సంబంధించిన ఏదేని స్థిరీకరణ మతము (వోటు) (ఎ అఫర్మేటివ్ వోటు) ను లేక కార్యవాహిని సమ్మతించినను, దానితో ఏకీభవించినను లేక అందులో పాల్గొన్నను అతడు తాను సద్భావముతోడను తగిన శ్రద్ధ మరియు, జాగరూకతతోడను పనిచేసెనని ఋజువు పరచిననే దప్ప, దానివల్ల కలిగిన నష్టమునకై లేక తగులబడికై అట్టి సమితి పరిషత్తుకు వ్యక్తిగతముగా బాధ్యుడయి యుండగలడు.

(2) సమితి పరిషత్తుయొక్క ప్రతి సభ్యుడు, లేక అధికారి, ఉద్యోగి దానికి చెందిన లేక దాని ఆధీనముననున్న యేదైన ద్రవ్యముయొక్క నష్టమునకై లేక ఇతర ఆస్తినష్టము లేక నాశనమునకై అట్టి ఉపేక్ష లేక దుష్ప్రివర్తన యొక్క ప్రత్యక్ష ఫలితమట్టి నష్టము లేక నాశనమయినచో, సమితి—పరిషత్‌కు బాధ్యుడగును.

(3) సెక్షను 77లో ఏదయిన విషయమున్నప్పటికిని, ఈ సెక్షనునుసరించి ప్రభుత్వము పూర్వానుమోదముతో సమితి పరిషత్తుచే దావా వేయబడవచ్చును.

79. దావాలలో రాజీచేయుటకు పంచాయతీ సమితి జిల్లా పరిషత్ కధికారము:

ఈ శాసనము ననుసరించి చేయబడిన నియమములకు లోబడి పంచాయతీ సమితి జిల్లా పరిషత్ దానిచే లేక దానికి వ్యతిరేకముగా వేయబడిన దావాలలో ఈ శాసనమున కనుగుణముగా దానిచే చేయబడిన ఏదైన స్వంత ప్రతిపాదన క్లెయిమ్ లేక అభియాచన (డిమాండ్) లో చాలినదిగా భావింపబడగలట్టి ద్రవ్యపు మొత్తమునకై లేక యితర నష్టపరిహారమునకై రాజీ చేసుకొనవచ్చును.

## అధ్యాయము 6

## పంచాయితీ సమితుల జిల్లా పరిషత్‌ల విధులు మరియు అధికారములు

80. (1) పంచాయతీ సమితి జిల్లా పరిషత్తుల విధులు:

ప్రభుత్వము అప్పుడప్పుడు విధించు అట్టినియమములకులోబడి ఈశాసనముచే లేక

ఏదేని ఇతర చట్టము లేక ఆ సమయమునందమలులోనున్న శాసన శక్తిగల ఆజ్ఞచే, దానిపై విధింపబడు యితర విధులతో బాటు, దాని వశమందున్న విధుల మేరకు, చట్టము ప్రకారముగా ప్రభుత్వముయొక్క లేక ఏదేని యితర స్థానికాధికారియొక్క యధికారమందు చేర్చబడక దాని యధికారమునకు లోబడి యున్న ప్రదేశము హద్దులలోపల, క్రింద పేర్కొనిన విషయములకై సహేతుకమైన ఏర్పాట్ల నొనర్చు లేక పూనుకొనుటను అంగీకరించుట విధియై యుండగలదు. అనగా—

(ఎ) ఏదేని ఇతర స్థానిక సంస్థయొక్క లేక ప్రభుత్వముయొక్క కంట్రోలు క్రింద లేనట్టి పబ్లిక్ రోడ్లయొక్కయు ఇతర రాకపోకల మార్గముల యొక్కయు నిర్మాణము, మరమ్మతు మరియు సంరక్షణము;

(బి) రోడ్ల ప్రక్కన లేక వాని సమీపమున మరియు దాని కంట్రోలులో నున్న యితర బహిరంగ ప్రదేశములందు చెట్లను నాటుట మరియు కాపాడుట;

(సి) హైదరాబాదు వ్యావసాయక మార్కెట్టుల శాసనము సం. 1339 ఫ. చే క్రమబద్ధ మొనర్చబడిన మార్కెట్ల కన్న వేరగు ఇతర మార్కెట్టుల ప్రయాణీకుల బంగ్లాల (ట్రావెలర్స్ బంగళా), బాటసారుల ఇండ్ల (ముసాఫిర్ ఖానాలు) చావడీల, విశ్రాంతి గృహముల ఇతర ప్రజాసంస్థల స్థాపనము నిర్వహణము, సంరక్షణము, మరియు అట్టి సంస్థలతో సంబంధముగల సమస్త భవనముల నిర్మాణము మరియు మరమ్మతు;

(డి) ప్రజా . చెరువులు బావుల మరియు వాటినుండి మరియు ఇతర ఉత్పత్తి స్థానముల నుండి నీటి సరఫరాకై యితరములైన జలాదాయ యంత్రముల నిర్మాణము మరియు మరమ్మతు మరియు త్రాగుటకును వండుటకును ఇతర గృహావసరములకు నుపయోగించబడెడి నీరు మురికి గాకుండ కాపాడుటకయి కట్టడముల నిర్మాణము మరియు సంరక్షణము;

(యి) బంజరుదొడ్ల నిర్మాణము, నిర్వాహకము మరియు సంరక్షణము ;

(యఫ్) దాని బాధ్యతకై ఒప్పగింపబడు అట్టి ప్రజా పదవుల స్థాన నిర్వాహకము ;

(జి) గ్రామ విశేషముల విస్తరించుటకు భూసంపాదనతో బాటు గ్రామాభివృద్ధి ;

(హెచ్) టీకాలు వేయుటను ఎక్కువ చేయుట ;

(ఐ) ఉరుసు, జాతర లేక యితర సంత, పండుగ లేక ప్రజాసమూహమున పారిశుద్ధ్య కంట్రోలుతోబాటు ప్రజారోగ్యము మరియు పారిశుద్ధ్యమున కావశ్యకములగు ఇతరచర్యలు మరియు అంటురోగములు అకస్మాత్తుగా కలుగకుండుట, వ్యాప్తి లేక మరల వచ్చుట నివారించుట కవసరమగు అట్టి చర్యలు;

(జె) బాలుర మరియు బాలికల కొరకు ప్రాథమిక పాఠశాలల భవన నిర్మాణము, నిర్వహణము మరియు పాఠశాలోపకరణముల యొక్కయు ఆట మైదానముల యొక్కయు ఏర్పాటు ;

(కె) పంచాయతీ సమితి జిల్లా పరిషత్ వశమునం దుంచబడిన యేదేని భవనము లేక యితరాస్తియొక్క సంరక్షణము, మరియు

(యల్) సాధారణమైన లేక ప్రత్యేకమైన ఉత్తరువుద్వారా ప్రభుత్వము జిల్లా పరిషత్‌ను దాఖలు చేయుటకు కోరు దాని పరిపాలనము మొత్తముపై లేక ఏదైన శాఖపై అట్టి వార్షిక నివేదికలను ముద్రించుట మరియు ప్రకటించుట.

(2) సబ్-సెక్షను (1) లో నిర్దిష్టపరుపబడిన విధులలో నేదైన నిర్వహింపబడలేదను కారణమున నేదైన పంచాయతీ సమితి-జిల్లా పరిషత్ లేక దానియొక్క ఎవరేని అధికారి లేక సభ్యునకు వ్యతిరేకముగా నష్టము లేక కంటాృక్టు ప్రకారము నెరవేర్చుటకై దావా సమర్థనీయము కావు.

31. పంచాయతీ సమితి-జిల్లా పరిషత్ యొక్క వివేకాధికారి అధికారములు :

ప్రభుత్వము అప్పుడప్పుడు విధించు అట్టి నియమములకు లోబడి ఈ శాసనముయొక్క షరతులను అనుసరించి దానిపై విధింపబడిన విధులతోబాటు, దాని యధికారక్షేత్రపు హద్దులలోపల ఈక్రింద పేర్కొన్న విషయములను పూనుకొనుట మరియు ఏర్పాట్ల నొనర్చుట పంచాయతీ సమితి-జిల్లా పరిషత్ వివేకమున కధికమై యుండగలదు, అనగా—

(ఎ) సహకార సంఘముల ప్రోత్సహము మరియు నభివృద్ధి;

(బి) పశువుల యొక్కయు నితర జీవజంతువుల యొక్కయు అభివృద్ధి ;

(సి) వ్యవసాయము, స్థానిక కళల, పరిశ్రమల వాణిజ్యాభివృద్ధి మరియు గ్రామీణులకు ఆర్థిక శ్రేయస్సును గురించి ఇతర చర్యల అభివృద్ధి ;

(డి) సార్వజనిక ఉద్యానవనముల ,యొక్కయు ఉల్లాసకరమగు ఆట మైదానముల ఏర్పాటు ;

(యి) గ్రంథాలయముల పఠనాలయముల యొక్కయు నిర్మాణము మరియు ప్రాథమిక పాఠశాలా భవన నిర్మాణము మరియు సంరక్షణము కన్న వేరగు విద్యావిషయక ఉద్దేశముల ప్రోత్సహించుట ;

(యఫ్) యజమానిలేని కుక్కల సంహారము లేక నిర్బంధము మరియు రక్షణ ;

(జి) సంతలు మరియు పశువుల, కోళ్ళ మొదలగువాని మరియు వ్యావసాయిక పరిశ్రమల, ఆటల మరియు ప్రదర్శనముల జరుపుట మరియు నిర్వహణము ;

(హెచ్) అనారోగ్యకరమగు వీధుల పునరుద్ధారణము, క్రొత్త గ్రామ నివేశముల అభివ్యాసమొనర్చుట, మార్గదర్శక గ్రామముల నిర్మించుట, మరియు పై యవసరముకై ప్రయివేటు వ్యక్తులకు లేక సంఘములకు అప్పు యిచ్చుట;

(ఐ) క్షామము లేక కరువు కాలములందు సహాయ కార్యముల వ్యవస్థ మరియు నిర్వహణము ;

(జె) వైద్యశాలయొక్క మరియు పశు చికిత్సాలయిముల యొక్క నిర్మాణము, మరమ్మతు, సంరక్షణము మరియు నిర్వహణము ;

(కె) ప్రసూతి సేవల సంస్థల యొక్కయు శిశుశ్రేయోకేంద్రముల యొక్కయు స్థాపనము మరియు సంరక్షణము ;

(యల్) ఔషధముల కొనుట ;

(యం) పంచాయతీ సమితి - జిల్లా పరిషత్‌లచే నియమితమగు నౌకరుయొక్క ఏదేని వర్గమునకై ఇండ్లు ఏర్పాటు ;

(యన్) బెంగాలు, హిమాసింధుల యొక్కయు అనారోగ్యకరములగు యితరములైన మొక్కల మూలనాశనము మరియు ఆనకట్టల నీళ్ల యింకి యుండుటను నివారించుట ;

ఒ) ఏవేని బంజరు లేక యితర భూములను అటవికశాఖ సహకారముతో లేక సలహాపైవన నిర్మాణ మొనర్చుట, ప్రవాహమువల్ల కోయుటను నివారించుట, వంటచెఱకుయొక్క స్థానికమగు సరఫరాను ఎక్కువజేయుట, పచ్చి ఎరువు తయారుచేయుట.

(పి) పబ్లిక్‌వర్క్సు డిపార్టుమెంటు సహకారముతోగాని సలహాపైగాని నీటిపారుదల నిమిత్తమై చిన్న చెఱవుల నిర్మాణము, మరమ్మతు సంరక్షణము నిర్వహణము, మరియు

(క్యూ) ఇందులో నింతకుముందు నిర్దిష్టముగా పేర్కొనబడకుండి, ప్రజారోగ్యము, సౌఖ్యము లేక సౌకర్యమును పెంపొందించునట్టి ఏదేని యితర విషయము.

## అ ధ్యా య ము 7

## పారిశుధ్యము మరియు ఇతర అధికారములు

82. కట్టడములను ప్రవేశించి పరీక్షించు మొదలైన అధికారములు;

పంచాయతీ సమితి అధ్యక్షుడు, కార్య నిర్వాహక అధికారి, లేక నిందులకు గాను పంచాయతీ సమితిచే అధికార మివ్వబడిన యే వ్యక్తియైన సూర్యోదయ, సూర్యాస్తమయముల నడుమ నెప్పుడైన, ఇటుపిమ్మట విధింపబడురీతిని నోటీసును ఇచ్చినమీదట అన్ని కట్టడములలోనికి మరియు స్థలములలోనికి ప్రవేశింపవచ్చును. మరియు పరీక్షింపవచ్చును, మరియు అదిఅంతయు లేక సందేభాగమునైన శుభ్రపరుపవలయునని, బాగుచేయవలయునని లేక పారిశుధ్య కారణములపై ఇంకే విధముగానైన సరియగు స్థితిలో నుంచవలయునని లిఖిత పూర్వకమగు నోటీసుద్వారా ఆదేశింపవచ్చును.

83. పారిశుధ్యములలోని కట్టడములు:

వాసయోగమగు లేక ఇతర రకమగు ఏదైన కట్టడము లేక స్థలము యొక్క యజమాని, లేక యధివాసి, దానిని అపరిశుభ్రముగా లేక అనారోగ్య స్థితిలో నుంచుచో, లేక పంచాయతీ సమితి అభిప్రాయమున పొరుగువారికి సంకట హేతువుగ నుంచుచో లేక మిక్కిలి పెరిగిన రక్కసి పొదలతో లేక

దట్టమగు మరియు చెడువాసన గల మొక్కలతో నుంచినచో, అందులకుగాను, పంచాయతీ సమితి అధికార మివ్వబడిన ఏ వ్యక్తి కడనుండియైన, దానిని శుభ్ర పరుప వలయునని, తీసివేయవలయునని లేక దానిని మరియొక విధముగా తగు స్థితిలో నుంచవలయునని లిఖిత పూర్వకమగు నోటీసుద్వారా కోరబడినచో అది అందిన పిదప సహేతుకమగు వ్యవధిలోపల కోరబడినట్లొనర్పనిచో, అతడు ఒక మేజస్ట్రేటు సమక్షమున నేర నిర్ధారణ మైనమీదట ఇరువది రూపాయలకు మించని జరిమానాను చెల్లించుటకు బాధ్యుడగును. మరియు ఆ నేర మవిరళమగుచో, నేర నిర్ణారణ మైనపిదప పై నేరమట్లే అవిరళముగా నొనర్పబడు ప్రతి దినమునకు ఐదు రూపాయలకు మించని జరిమానాను చెల్లింప బాధ్యుడగును.

84. నీటి వసరుల విషయమున అధికారములు :

పంచాయతీ సమితి యొక్క అధ్యక్షుడు, కార్యనిర్వాహక అధికారి, లేక నిందులకుగాను పంచాయతీ సమితిచే అధికార మివ్వబడిన యే వ్యక్తియైన, ఎప్పుడైన లిఖితపూర్వకమగు నోటీసుద్వారా ఏదైన బావి. ప్రవాహము, కాల్వ చెరువు లేక యితర సరఫరా వనరుల యజమానిని లేక దానిని తన నియంత్ర ణమ్మున(Control) గల యే వ్యక్తినైన అది స్వంతమైనను గాకపోయినను యీ క్రింది విధముగా నొనర్పవచ్చును.

(ఎ) ఆ నీరు త్రాగుట కుపయోగింపబడుచున్నచో,

(i) ప్రవాహముగాక, తదితర నీటి సరఫరా వనరును, మంచి మరమ్మతుపై నుంచవలయునని మరియు నిర్వహింపవలయునని, లేక

(ii) నోటీసులో నిర్దిష్టపరుపబడిన సహేతుకమగు వ్యవధిలో, అట్టి ఏ నీటి వనరునైన అడుసు, చెత్త మరియు మొక్కలను తీసివేసి, శుభ్ర పరుప వలయునని, లేక

(iii) పంచాయతీ సమితి నిర్దేశించు రీతిని అట్టి యే నీటి సరఫరా వనరునైన భూమి పైభాగపు మురికినీటి కాల్వలచే అపరిశుభ్రము కాకుండ కాపాడవలయునని, లేక

(iv) సహజ ప్రవాహము గాకపోవుటచే, ఏ నీటి సరఫరా వనరునైన పంచాయతీ సమితి అభిప్రాయమున త్రాగుటకు తగదని యుండుచో, దానిని తాను త్రాగుట కుపయోగింపరాదని, మరియు యితరులను ఉపయోగింపనీయ రాదని, లేక

(v) సబ్‌క్లాజు (iv) క్రిందయట్టి ఏదైన నోటీసును ఇవ్వబడినప్పటి కిని, అట్టి వాడుక యట్లే జరుగుచున్నచో, మరియు పంచాయతీ సమితి అభి ప్రాయమున దానిని మరియొక విధముగా ఆపుటకు వీలులేనిచో, తాత్కాలిక ముగా లేక శాశ్వతముగ మూసివేయవలయునని లేక అట్టి వాడుకను ఆపివేయు టకు చాలునని పంచాయతీ సమితి తలంచురీతిని పూడ్చివేయవలయునని చుట్టును మూసివేయవలయునని లేక దడి కట్టవలయునని, లేక

(vi) అట్టి ఏ నీటి వనరునుండియైన లేక స్థలము లేక ఆవరణ; జలా శయము లేక దాని నానుకొనియుండు లేక ప్రక్కనుండు "రిజర్వాయరు" నుండి యైన, పొరుగువారి ఆరోగ్యమునకు భంగకరమగునని లేక అసహ్య కర మగునని పంచాయతీ సమితి ఎంచు నిల్వ నీటిని తోడివేయవలయునని లేక మరియొక విధముగా తీసివేయవలయునని.

(బి) అట్టి నోటీసు అందిన ఇరువది నాలుగు గంటల లోపల, సహజ ముగ ప్రవహించు నొక నీటి ప్రవాహముగా నట్టి, ఇతర నీటి సరఫరా నిచ్చు వనరును, దానిని త్రాగుట కుపయోగించినను, ఉపయోగించకపోయినను తగు మరమ్మతు రక్షణ లేక చుట్టును దడి లేకపోవుటచే ప్రజలకు లేక దానిని ఉప యోగింపవలసివచ్చిన లేక నటు పోవు లేక దానిని చేరు నెవ్వరైన వ్యక్తి యొక్క ఆరోగ్యమునకు లేక రక్షణ కది అపాయకరమని పంచాయతీ సమితి అభిప్రాయ పడుచో, పంచాయతీ సమితి ఆదేశించు రీతిని లేక వారు ఆమో దించు రీతిని దానికి మరమ్మతు, రక్షణ వేక చుట్టు దడి ఏర్పాటు నొనర్ప వలయును.

85. జారీచేయబడిన ఆదేశముల ననుసరింపనిచో ప్రతిక్రియ :

పైన చెప్పబడిన రీతిని నియంత్రణము గల యజమాని లేక వ్యక్తి అట్టి ఏ ప్రార్థనను సెక్షను 84 యొక్క షరతులచే, లేక క్రింద సలుపవలసిన వ్యవధి లోపల నొనర్చుటకు తప్పిన లేక యుపేక్షించినచో మరియు, అధ్యక్షుని యభిప్రాయమున ఏ వ్యక్తి యైన యారోగ్యము లేక భద్రతను రక్షించుటకు తగిన చర్య అవసరమగుచో, అట్టి నోటీసు ప్రకారము కోరబడిన పనిని నెర వేర్చుటకు పంచాయతీ సమితి గడంగవలయును. దానికై పెట్టబడిన ఖర్చు లన్నియును అట్టి నీటివనరు యొక్క యజమానిచే లేక దానిపై నియంత్రణము గల వ్యక్తిచే చెల్లింపబడవలయును. మరియు నవి అధ్యాయము 10 క్రింద వసూలు చేయబడదగు నేదైన పన్నుకిర్రింద కోరబడిన మొత్తము విధముననే వసూలు చేయబడవలయును :

అయితే ప్రజాసామాన్యముచే లేక వారిలో నొకభాగముచే ఒకహక్కుగా వాడుకొనబడు నీరుగా ఏదైన బావి లేక స్వంత ప్రవాహము లేక నేదైన స్వంత కాల్వ, చెఱువు లేక నీటి సరఫరా జరుగు నింకేదైన వనరు విషయమున, నియంత్రణముగల అట్టి యజమాని లేక వ్యక్తిచే పెట్టబడిన ఖర్చులు, పంచాయతీ సమితి ఆదేశించు నెడల, అట్టి పంచాయతీ సమితి వద్దగల పంచాయతీ సమితి నిధి నుండి చెల్లింపబడ వచ్చును.

86. సార్వజనికమగు చెలమ 'మొ. వానిని కొన్ని పనులకు ప్రత్యేకించుటకు, కొన్ని వనరులనుండి నీరు వాడుకను నిషేధించుటకు అధికారము :

(1) పంచాయతీ సమితి సెక్షను ప్రకారము అందులకు సంబంధించిన చెలమ,చెరువు,బావి లేక యితర చోటువద్ద పెట్టబడు పబ్లికు నోటీసుద్వారా సార్వజనికమగు చెలమను, చెరువును, బావిని మరియు యితర చోటును మరియు పబ్లికు నీటి వనరును లేక దాని యే భాగము నైన త్రాగుటకు లేక బట్టలు ఉతుకుకొనుటకు లేక పశువులను కడుగుకొనుటకు లేక ఆ ప్రదేశ నివాసుల ఆరోగ్యమును, శుభ్రతను, సౌఖ్యమును లేక వీలును పెంపొందించునని తలంపబడు నింకేయితర కార్యముల కొరకైన ప్రత్యేకింప వచ్చును. మరియు యజమాని అంగీకారముతో, ఏదైన స్వంతచెలమను, చెరువును బావిని లేక యితర స్థలమును గూడ, పూర్వోక్త కార్యములలో దేనికైన ప్రత్యేకింప వచ్చును.

(2) కలరా మొదలగు అంటుజాడ్యములు గల కాలములో, పంచాయతీ సమితి లేక ప్రభుత్వము యొక్క వైద్యాధికారి కడనుండి, అట్టి చర్య వాంఛనీయమని తెలుపు నొక ధృవపత్రమును పొందిన పిదప, తక్షణ మొక నోటీసుద్వారా ప్రజాసామాన్యమునకు అందుబాటులో నుండు ఏదైన నీటి వనరునుండి నీటి వాడుకను పంచాయతీ సమితి నిషేధింపవచ్చును, అట్టినోటీసు, ఆ నీటి సరఫరా జరుగు వనరువద్ద నోటీసు ప్రతి నొకదానిని పెట్టుటచే, మరియు ఆంధ్రప్రదేశములో చాటింపుద్వారా అట్టి నిషేధ మెన్నిదినముల వరకుండునో తెలుపుచు జారీ చేయబడవలయును. ఆ నోటీసును అప్పుడప్పుడు పంచాయతీ సమితి పొడగింపవచ్చును లేక మార్చవచ్చును.

87. ఇతర పనులకు ప్రత్యేకింపబడిన చోట్లను వాడుకొని నందులకు శిక్ష.

(ఎ) ఎవ్వరైన పంచాయతీ సమితిచే, త్రాగుటకు ప్రత్యేకింప బడిన ఏదైన స్థలములోని నీటితో స్నానముచేయుచో, లేక మురికి చేసినచో, లేక స్వంత ఆస్తి సందర్భమును దాని యజమానిచే నట్లు చేయబడినచో; లేక,

(బి) పై విధముగా త్రాగుటకు లేక స్నానము చేయుటకు ప్రత్యేకింప బడిన యేదైన స్థలములో బట్టలు ఉతికినచో; లేక

(సి) పై విధముగా త్రాగుటకు, స్నానము చేయుటకు ప్రత్యేకింప బడిన ఏదైన స్థలములో ఏదైన పశువును కడిగినచో, అంట్లు తోమినచో, ఉన్ని తోళ్ళు యితర అశుభ్రమగు, అసహ్యమగు నేదైన వస్తువును కడిగినచో, లేక అసహ్యమగు లేక హానికరమగు నేదైన వస్తువును వుంచినచో, లేక

(డి) ఒక "సింక్" (మురికిగల కాటుక) "సూయర్", తూము ఇంజను, బాయిలర్‌నుండి వచ్చునీటిని, తనకు చెందిన, తనచే ఆక్రమింపజడిన నేదైన కట్టడము, భూమి నుండి ప్రవహించు నీటిని, ఏదైన యితర అసహ్యకరమగు వస్తువును అచటి నుండి పై విధముగా త్రాగుటకు, స్నానము లేక బట్టలు ఉతుకుకొనుటకు ప్రత్యేకించబడిన ఏదైన స్థలములోనికి రానిచ్చినచో, అతడు, ఒక మేజిస్ట్రేటు సమక్షమున నేరనిర్ధారణమైన పిదప ఆ నేర మవిరళముగా నొనర్పబడు ప్రతి దినమునకు పదిరూపాయలకు మించని మరికొంత జరిమానాను చెల్లింపబడవలసి యుండును.

88. కంపునీటి నుండి న్యూసెన్సు తగ్గించుట :

ఏదైన చిన్న చెరువు, గుంట, చెరువు, బావి, రంధ్రము: ఏదైన పనికి రాని విల్వనీరు ఏదైన కాల్వ, (నీటి) యాశ్రయము, యితర అసహ్యమగు లేక హానికరమగు వస్తువు, అది ఏదైన స్వంత ఆవరణలో నున్నప్పటికిని, వేరు విధముగా నున్నప్పటికిని, ఆంధ్రప్రదేశ నివాసుల ఆరోగ్యమునకు భంగకరము కావచ్చునని, లేక ఇరుగు పొరుగువారికి అసహ్యకరమగునని పంచాయతీ సమితి తోచుచో పంచాయతీ ఒక లిఖిత పూర్వకమగు నోటీసుద్వారా, దానిని శుభ్రపరుప వలెనని, పూడ్చివేయవలయునని, తోడివేయవలయునని, దానిని తీసివేయవలయునని, తన అభిప్రాయమున న్యూసెన్సు తగ్గించుటకు అవసరమగు చర్యల నొనర్పవలయునని దాని యజమానిని కోరవచ్చును.

89. మృతుల అంత్యక్రియలకగు స్థలములను మూసివేయుట :

(1) తన యధికారక్షేత్రములో, మరణించినవారి అంత్యక్రియకు ఉపయోగింపబడు నేదైన స్థలము ఆరోగ్యమునకు భంగకరమగు నట్లున్నదని, భంగకరము కావచ్చునని, పంచాయతీ సమితి అభిప్రాయపడుచో, తన యభిప్రా

అందులకు కారణములలో ప్రభుత్వమునకు విన్నవింపవచ్చును. అటుపిమ్మట ప్రభుత్వము తనకు అవసరమని తోచిన మరికొంత విచారణను జరిపించిన పిదప ప్రకటనద్వారా, ఆ ప్రకటనలో నందులకుగాను, నిర్దిష్టపరుపబడు తేదీ నుండి ఆ స్థల మట్లు ఉపయోగింపబడరాదని నిర్దేశింపవచ్చును.

(2) పై ప్రకటనయొక్క యొక ప్రతి ఆ జిల్లా స్థానికభాషలో దాని అనువాదముతోగూడ, పంచాయతీ సమితి కార్యాలయములోను దానికి సంబంధించిన స్థలముపై లేక సమీపమున యెక్కువ స్ఫుటముగా గనుపించు నొకచోట లేక ఎక్కువ చోట్లలో అంటింపవలయును. మరియు దాని నోటీసు ఆ ప్రదేశములో చాటింపుద్వారా కూడ నివ్వబడవలయును.

(3) అట్టి ఏదైన స్థలములో అది మూసివేయబడుటకు పై ప్రకటనలో నిర్దిష్టపరుపబడిన తేదీకి పిమ్మట ఏదైన శవమును, పాతిపెట్టు లేక మరియొక విధిముగా అంత్యక్రియలు సలుపు నే వ్యక్తియైన, అప్పటికి అమలులో వున్న యేదైన శాసనముయొక్క షరతుక్రింద లేక పూర్వమునుండి యున్న వాడుకను బట్టి మృతుల పాతిపెట్టుటకు ప్రత్యేకింపబడని ఏదైన అనాక్రమిత ప్రభుత్వ భూమిలో నేదైన శవమును పాతిపెట్టినచో, అతడు ఒక మేజిస్ట్రేటు సమక్షమున నేర నిర్ధారణమైన మీదట, ఒక వంద రూపాయలకు మించని జరిమానాను చెల్లించుటకు బాధ్యుడగును.

90. శవములను పాతిపెట్టు మరియు దహనము చేయు భూముల రిజిష్టరు కావించుట :

(1) ఈ శాసనము అమలులోనికి వచ్చిన తేదీనాటికి మృతులను పాతిపెట్టు స్థలముగ, దహనమొనర్చు చోటుగ, మరియొక విధముగ అంత్యక్రియ నొనర్చు చోటుగ నుపయోగింపబడు నేదైన స్థలమును కంట్రోలులో గల ప్రతి యజమానియు లేక వ్యక్తియు, ఆ స్థలము అంతకుమున్నే రిజిష్టరు చేయబడి యుండనిచో, ఆ స్థలమును రిజిష్టరు చేయుటకు పంచాయతీ సమితికి అర్జీ పెట్టుకొనవలయును.

(2) అట్టి స్థలముపై కంట్రోలు, యే యజమానియు లేక వ్యక్తియును లేదని పంచాయతీ సమితికి కనబడినచో పంచాయతీ సమితి అట్టి కంట్రోలును వహించి అట్టి స్థలమును రిజిష్టరు చేయవలయును లేక దానిని మూసివేయవచ్చును.

91. మరణించినవారి అంత్యక్రియ లొనర్పబడు స్థలములకు లైసెన్సులను పొందుట :

(1) మరణించినవారి అంత్య క్రియల కొరకు ఏ క్రొత్త స్థలమైనను

స్వంతమైనను, పబ్లిక్ దినైనను, పంచాయతీ సమితి కడనుండియొక లైసెన్సును పొందిననే తప్ప. ప్రారంభింపబడరాదు. ఏర్పరుపబడరాదు, నిర్మింపబడరాదు లేక ఉపయోగింపబడరాదు.

(2) లైసెన్సుకొరకు పెట్టబడు అర్జీతో, ఆ ప్రాంతములను. సరిహద్దును మరియు దాని పరిమితిని జూపు ఆ స్థలముయొక్క పటమును జత పరచబడగలదు. అందు స్వప్రయోజనముగల యజమాని, వ్యక్తి, వర్గము యొక్క పేరు, నిర్వచింపబడు పద్ధతి మరియు పంచాయతీ సమితి కోరునట్టి ఇతర వివరములను ఇవ్వవలయును,

(3) పంచాయతీ సమితి తనకు ఉచితమని లోచిన విచారణను సలిపిన పిదప లైసెన్సును అనుగ్రహింపవచ్చును లేక నిరాకరింపవచ్చును.

(4) సబ్ సెక్షను (3) క్రింద పంచాయతీ సమితిచే నివ్వబడిన ఆజ్ఞను ప్రభుత్వము రద్దు పరచవచ్చును, మార్పొనర్చవచ్చును లేక పునఃపరిశీలన మొనర్పవచ్చును.

92. పాతిపెట్టు మరియు దహనముచేయు భూములను మరియు శ్మశానములను ఏర్పరచుట.

పంచాయతీ సమితి నిధినుండి ఖర్చువెట్టి మరియు దహనముచేయు భూములుగా లేక శ్మశానములుగా నుపయోగించుటకు స్థలములను తగిన ఏర్పాటేదియు లేనిచో, ఏర్పరుపవచ్చును మరియుతనకు అవసరమని తోచుచో దానిని ఉపయోగించుకొనినందులకు రుసుములను వసూలు చేయవచ్చును.

93. అధ్యక్షుడు మొదలగువారు అంటువ్యాధిగల కట్టడములు మొదలగువాని లోనికి పరీక్షార్థము ప్రవేశించుటకు అధికారమును కలిగియుండుట.

(1) పంచాయతీ సమితియొక్క అధ్యక్షుడు, కార్యనిర్వాహక అధికారి లేక అందులకుగాను పంచాయతీ సమితిచే అధికారమివ్వబడున ఏ వ్యక్తియైన ఏ సమయమందైన, సహేతుకమగు నోటీసు ఇచ్చిన పిదప అందు ఏదైన అపాయకరమగు అంటుజాడ్యము కలదని తాను నమ్మదగు కారణములున్నచో ఏదైన కట్టడము లేక ఆవరణ తోడి గృహమును పరీక్షించుటకు ప్రవేశింపవచ్చును.

(2) సూర్యోదయము మరియు సూర్యాస్తమయముల నడుమ తప్ప అట్టి యే పరీక్షయు నొనర్పబడరాదు.

(3) ఆ గృహమును లేక ఆవరణతోడి గృహమును లేక నందలి యొక భాగమును సంక్రమింపజేయు గుణమును ఇంకను కలిగియుండ గలవు ఏవైన వస్తువులను శుభ్రపరచుట లేక క్రిమిరహిత మొనర్చుట ఏ అపాయకర మగు అంటుజాడ్యపు వ్యాప్తినైన ఆపివేయగలదని లేక తగ్గింప బడగలదని, పంచాయతీ సమితి అభిప్రాయపడుచో, పంచాయతీ సమితియొక్క నోటీసుద్వారా అట్టి నోటీసులో నిర్దిష్టపరుపబడు వ్యవధిలోపల దానిని శుభ్రపరుపవలయునని, లేక క్రిమిరహిత మొనర్పవలయునని ఆ యజమానిని లేక కాపురస్తుని గోర వచ్చును.

అయితే పంచాయతీ సమితి తక్షణచర్య అవసరమని తలంచినచో లేక ఆ యజమాని లేక కాపురస్తుడు దారిద్ర్యమువలన లేక మరియొక కారణము వలన దానికోర్కెను సరిగా అనుసరించజాలకపోయిన, పంచాయతీ సమితి తనంత తానే, అట్టి కట్టడమును లేక ఆవరణతోడి గృహమును లేక వస్తువులను శుభ్రపరిపింపవచ్చును, లేక క్రిమిరహిత మొనర్పజేయవచ్చును. మరియు నిందు లకుగాను అట్టి వస్తువులను అట్టి కట్టడములనుండి తీసివేయించ వచ్చును. మరియు ఈ సబ్‌సెక్షనుక్రింద పెట్టబడిన ఖర్చులు, ఆ యజమాని లేక కాపు రస్తుడు దారిద్ర్యమువలన తన కోర్కెప్రకారము సరిగా యొనర్పజాలకపోయిన తప్ప, పై యజమాని లేక కాపురస్తునినుండి వసూలుచేయబడవలయును.

94. అంటుక్రిములుగల వస్తువులను క్రిమిరహితము లొనర్చుటకు, ఉతుకుటకు స్థలములు ప్రకటించుట :

(1) పంచాయతీ సమితి అప్పుడప్పుడు, ఏదైన అపాయకరమగు అంటుజాడ్యము క్రిములు సంక్రమింపబడిన దుస్తులు, పరుపులు లేక ఏవైన యితర వస్తువులను ఉతుకుకొనదగు లేక క్రిమిరహిత మొనర్పజేయదగు స్థల ములను ప్రకటించును.

(2) అట్టి అంటుజాడ్య క్రిములను యింకను కలిగియుండ వచ్చునను దుస్తులను, పరుపులను, లేక యితర వస్తువులను నాశనమొనర్ప వలయునని పంచాయతీ సమితి నిర్దేశించవచ్చును.

(3) సబ్‌సెక్షను (1) క్రింద నట్టి పనికిగాను ప్రత్యేకించబడిన స్థల ములో దప్ప ఇంకేయితర స్థలమందైన నట్టి దుస్తులను, లేక పరుపులను ఉతుకువారు ఎవ్వరైన, యొక మేజిస్ట్రేటు సమక్షమున నేర నిర్ధారణమై పిదప, 50 రూపాయలకు మించని యొక జరిమానాను చెల్లింప బాధ్యుడగు.

95. అంటువ్యాధిని గూర్చి భోగట్టా :

(1) పబ్లిక్ చికిత్సాలయము గానట్టి యేదైన యితర ఇంటిలో నేదైన అంటువ్యాధి కలదని, తన వృత్తిని అనుసరించుచున్నప్పుడు ఎరిగిన ప్రతి వైద్యవృత్తి అవలంబితుడు, ఏదైన కర్మాగారము, పబ్లిక్ భవనముయొక్క ప్రతి కార్యనిర్వాహకుడును, ధర్మశాల, హోటలు, వసతిగృహము నిర్వహించు ప్రతి వ్యక్తియు, ప్రతి కుటుంబపు పెద్దయు మరియు ఒక యింటి ప్రతి యజమాని, కాపురస్థుడు, తన నిర్వహణలో, కంట్రోలులో, అనుభవములలోని ఏదైన ఆవరణతోడి గృహమున యే వ్యక్తియైన, ఒక అంటువ్యాధితో బాధపడుచున్నాడని, చనిపోయెనని తనకు తెలిసిన లేక తాను నమ్ముటకు కారణమున్నచో, ఆ విషయ మంతకుముందే తెలియజేయబడి యుండనిచో, సమాచారము, మిక్కిలి స్వల్పముగా చేయక సాధ్యమగు ఆలస్యముతో అధ్యక్షునకు కార్యనిర్వహణాధికారికి, తహశీలుదారునకు, గ్రామ పోలీసు పటేలునకు, అతి సమీపస్థమగు పోలీసు స్టేషనుకు తన యధికారములో గల అధికారికి, దానిని గూర్చి భోగట్టా నొసగవలయును.

(2) సబ్ సెక్షను (1) యొక్క నుల్లంఘనము ఏబది రూపాయలవరకు పోవు జరిమానాతో శిక్షార్హ మగును.

వివరణ: ఈ సెక్షనులో "వైద్యవృత్త్యవలంబి" అనుటలో నొక "హకీము" లేక "వైద్యుడు"ను చేరును.

96 సార్వజనికములగు రోడ్లపైనను భూమిపైనను భవనముపైనను అవరోధములు మరియు అతిక్రమణములు :

(1) ఏదేని ఒక పబ్లిక్ రోడ్డు, భూమి, భవనము యొక్క ఏ భాగము అది పంచాయతీ సమితికి సంక్రమించిన, దాని యాస్తియైన తరువాత, ఏదేని గోడ, ఏదైన కంచె, ఇనుప పట్టా, స్తంభము, కొట్టు, వరండా, అరుగు, స్తంభపుటడుగు, మెట్టు, ఏదేని ముందటికి వచ్చు కట్టడము, వస్తువు, లేదా ఏదేని యితర అతిక్రమణము అవరోధమును నిర్మించినచో, నిలిపినచో అట్టి రోడ్డు, భూమి లేక భవనము యొక్క ఏదేని కప్పులేని కాలువ మురికినీళ్ళ కాలువ లేక మదుములోపల, పైన మీద ఏదేని పెట్టెను, మూటను, కట్టను, వర్తకపు సరకును ఉంచినచో, పెట్టించిన లేక పెట్టించినచో అతడు ఇరువది యైదు రూపాయలవరకగు జుల్మానాతో శిక్షింపబడగలడు.

(2) అట్టి ఏదేని అవరోధములను, అతిక్రమణమును తొలగించుటకు పంచాయతీ సమితి కధికారముండగలదు మరియు అట్టితొలగింపునకైన ఖర్చులు సదరు అవరోధమును, అతిక్రమణమును కలిగించిన వ్యక్తిచే చెల్లింపబడ గలవు మరియు అధ్యాయము 20 ననుసరించి రాబట్టుకోబడదగిన ఏదేని పన్ను కారణముగా అభ్యర్థింపబడే మొత్తము వలెనే రాబట్టుకోబడగలవు:

అయితే అట్టి యేదేని అవరోధమును, అతిక్రమణమును తొలగించుటకు పూనుకొనుటకుముందు, అట్టి అవరోధమును, అతిక్రమణమును కలుగ జేసిన వ్యక్తిని లిఖితపూర్వక సూచన పత్రముద్వారా ఆ నోటీసు యందు నిర్దిష్టపరుపబడిన, సయుక్తికమైన సమయములోగా దానిని తొలగించుమని లేదా అది ఎందుకు తొలగింపబడకూడదో కారణము తెలుపుమని పంచాయతీ సమితి ఆదేశింపగలదు.

(3) ఈ సెక్షనులో కలదేదియును పండుగల, ఉత్సవముల సందర్భములందు, దానికి సంక్రమించియున్నట్టి లేక దాని యాస్తియై యున్నట్టి ఏదేని పబ్లిక్ రోడ్డుయొక్క తాత్కాలిక కబ్జాను లేక దానిపై కట్టడములకు లేదా ప్రజలకు, ఎవరేని వ్యక్తికి అసౌకర్యము కల్గించనట్టి విధానమున పదునైదు రోజుల కెక్కువ కాకుండా, అట్టిరోడ్డు యొక్క ఏదేని విభాగముపై, వంట చెరకుయొక్క రాసిచేయుటను అనుమతించుట పంచాయతీ సమితి నిరోధింపదు.

97. లైసెన్సులేని హోటళ్లు, రెస్టారెంట్లు, టీ దుకాణములు మొదలగు వానినీ పీడాకరమగు, అపాయకరములగు వ్యాపారములను నిషేధించుట :

(1) విధింపబడు అట్టి పరిషత్తులకు లోబడి, ఒక పంచాయతీ సమితి యొక్క అధికారక్షేత్రములోని యేస్థలమైన పంచాయతీ సమితి నుండి పొందిన యొక్క లైసెన్సు క్రింద మరియు ఆ లైసెన్సులో విధింపబడు షరతులకు మరియు నిర్ణయింపబడు రుసుములకును, ఏవైన ఉన్నచో, లోబడి తప్ప ఒక హోటలుగా, రెష్టారెంటుగా, టీ దుకాణముగా లేక అదేవిధముగా లేక అదే విధమగు ఇంకేయవసరమునకు, పెంకులను, ఇటుకలను సున్నమును, తయారు చేయుటకు లేక పీడాకారమగు, అపాయకరమగునదిగా, నొక ప్రకటనద్వారా ప్రభుత్వము తెలియజేయు ఏదైన యితర వ్యాపారము, లేక వర్తకము కొరకు ఉపయోగింపబడరాదు.

(2) లైసెన్సు పొందినవాడు షరతులలో దేనినైన యనుసరింప తప్పిన అతని లైసెన్సును కొంత కాలము నిలుప, లేక రద్దుపరుప వచ్చును

98. విక్రయార్థము జంతువధను క్రమబద్ధమొనర్చు అధికారము :

పంచాయతీ సమితి యీ క్రిందివాని కొరకు, నిర్దిష్టమగు స్థలములను లేక యావరణతోడి గృహములను నిర్ణయింపవచ్చును—

(ఎ) వధోద్దేశములకై అమ్మబడుచున్న జంతువులను లేక నేదైన నిర్దిష్ట వర్ణనగల జంతువులను ఉంచుటకు;

(బి) అట్టిజంతువుల వధ కొరకు: మరియు

(సి) అట్టి జంతువుల మాంసమును విక్రయించుటకు; మరియు అట్టి స్థలముల లేక అవరణల తోడి గృహములను ఉపయోగించుకొనుటకు లైసెన్సులను అనుగ్రహించవచ్చును.

99. పశువ్యాధిని ఆపు చర్యలు గైకొనుటకు అధికారము :

దాని అధికారక్షేత్రములోగల ఏదైన స్థలములో, గుఱ్ఱముల, పశువుల, గొఱ్ఱెల లేక మేకలలో నేదైన అంటువ్యాధి వ్యాపించినదని, అట్టి ఏదైన వ్యాధి సంక్రమించుట సంభవమని బోర్డు అభిప్రాయపడుచో, ఆ వ్యాధిని, దాని వ్యాప్తిని, సంక్రమించుటను, ఆపుటకు, ఎదుర్కొనుటకు, తగ్గించుటకు లేక అణిచి వేయుటకు అది అవసరమని తలంచు ప్రకారము అట్టి అన్ని చర్యలను పంచాయతీ సమితి గైకొనుట న్యాయసమ్మతమగును.

100. కుక్కవెఱ్ఱిని ఆపుట మఱియు తప్పిపోయిన కుక్కల సంహారము :

(ఎ) ఏవ్యక్తిపైన—

(i) 'కుక్కవెఱ్ఱి' తో బాధపడుచున్న లేక కుక్కవెఱ్ఱితో బాధపడుచున్నదని సహేతముగా అనుమానింపబడిన; ముందు చెప్పబడిన ప్రకారము బాధపడుచున్న లేక అనుమానింపబడిన, యేదైన కుక్క లేక యితర జంతువుచే కఱవబడిన ఏదైన కుక్కను లేక జంతువును చంపివేయుటకు లేక పంచాయతీ సమితి ఆదేశించునంతకాలము కావలిలో పెట్టుటకు లేక కావలిలో పెట్టించుటకు అధికృతు నొనర్పవచ్చును;

(ii) మెడ పట్టీలు లేక స్వంత ఆస్తిగా ప్రత్యేక పరచు నితరగుర్తులు లేకుండ వీధులలో, బహిరంగ స్థలములో తిరుగుచుండు కుక్కలను కావలిలో పెట్టించుటకు మరియు కావలిలో పెట్టినందు కొరకు రుసుమును వసూలు చేయుటకు, మరియు నొకవారములో దానికై స్వత్వ ప్రతిపాదన మొనర్పబడక యుండినచో మరియు రుసుము చెల్లింపబడక పోయి

నచో, అట్టి ఏదైన కుక్కను చంపివేయుటకు లేక నింకొకరీతిగా సంహరించుటకు అధికృతు నొనర్పవచ్చును.

(బి) (1) మెడపట్టీలు లేక స్వంత ఆస్తిగా ప్రత్యేకపరచు నితరగుర్తులు లేకుండా వీధులలో లేక యట్టి కుక్కల యజమానుల యిండ్ల ఆవరణల బయట తప్పిపోయి తిరుగుచు కనబడిన యేవైన కుక్కలు, ఆ ప్రకారముగా చంపబడు లేక చంపించబడు నొక వ్యవధిని అప్పుడప్పుడు బహిరంగ ప్రకటన ద్వారా నిర్ణయింపవచ్చును.

(2) ఈ సెక్షను క్రింద చంపివేయబడిన లేక నింకొక రీతిని సంహరింపబడిన ఏదైన కుక్క విషయమున నెట్టి నష్టము చెల్లింపబడదు.

101. అపాయకరమగు రీతిని రాళ్ళను త్రవ్వుట, తుపాకి మందు ప్రేల్చి ముక్కలుచేయుట, చెట్లను పడగొట్టుట, కలపను కోయుట, లేక కట్టడమును నిర్మించుట

ప్రక్కనుబోవు, చుట్టుప్రక్క నివసించు, పనిజేయుచుండు, వ్యక్తులకు అపాయము కలుగునట్లు అపాయము కలుగజేయగల రీతిని రాళ్ళను త్రవ్వు తుపాకి మందుతో రాళ్ళను ముక్కలుజేయు, చెట్లను పడగొట్టు, కలపనుగోయు లేక కట్టడపు పనులను సలుపు, నేవ్యక్తియైన యేబది రూపాయల వరకు బోవు జరిమానాతో శిక్షింపబడును.

102. కట్టడములను నిర్మించుటకు అనుమతి అవసరము :

(1) విధింపబడనున్న యట్టి షరతులకు లోబడి, ఈ విషయమును ఆలోచించిన పిదప పంచాయతీ సమితితో ప్రభుత్వముచే అధికార మివ్వబడిన అధికారి లేక పంచాయతీ సమితి లిఖితపూర్వకమగు అనుమతి లేకుండ, యే వ్యక్తియు నేదైన కట్టడమును నిర్మింపరాదు లేక పునర్నిర్మింపరాదు.

(2) ఆ నివేశన స్థలము, పారిశుద్ధ్య లేక గ్రామ ప్రణాళికా కారణము లనుబట్టి తగదను కారణముపై దప్ప, అట్టి యనుమతి నిరాకరింపబడరాదు.

(3) అనుమతికొరకు పెట్టబడిన అర్జీ, అందిన రెండు నెలలలోగా, దాని నిరాకరణ తెలియబడక పోయినచో, అట్టి యనుమతి యనుగ్రహింపబడి యుండినట్లు ఊహించబడగలదు.

(4) అట్టి యేదైన యనుమతి లేకుండా, లేక సబ్‌సెక్షను (1) క్రింద నిర్ణయింపబడిన షరతులకు, లేక పంచాయతీ సమితిచే ఈ విషయమున అధికార మొసగబడిన యధికారిచే విధింపబడిన యేవైన షరతులకు, విరుద్ధ

ముగా ఏదైన విధానమున, నెపుడైన ఏదైన కట్టడము నిర్మింపబడిన, మారు సలుపబడిన, దానికి అదనముగా చేర్చబడిన. పునర్నిర్మించబడిన ఆ పంచాయతీ సమితి లేక దానికి అధికార మొసగబడిన యధికారి—

(ఎ) అట్టి కట్టడము, మార్పు, దానికి అదనముగా చేర్చబడినది, ఆపి వేయబడవలయునని ఆదేశింపవచ్చును: లేక

(బి) లిఖిత పూర్వకమగు సూచన ద్వారా; అట్టి కట్టడము, మార్పు, దానికి అదనముగా చేర్చబడినది అవసరమగు రీతిని మార్పుచేయ బడవలయు నని లేక పడగొట్టవలయునని కోరవచ్చును.

## ప్రాంతీయ మరియు నగర పథకములు

103. ప్రాంతీయ మరియు నగర పథకము మరియు స్థానిక అభిన్యాస ములు (లేఔట్సు) :

ఒక పంచాయతీ సమితి అధికారక్షేత్రములోని యేదైన ప్రదేశమును, నిర్ణీత విధిని ప్రభుత్వముచే మంజూరు చేయబడిన యొక ప్రాంతీయ గ్రామ పథకము లేక ఒక స్థానిక అభిన్యాసము (లేఔట్) ననుసరించి తప్ప, అం దేకట్టడముయును నిర్మింపబడరాదని, పునర్నిర్మింపబడరాదని యొక ప్రదేశ ముగా ప్రభుత్వము ప్రకటింపవచ్చును.

104. (1) పథకము లేక అభిన్యాసము మంజూరి ప్రకటన :

సెక్షను 201 యొక్క సబ్‌సెక్షను (2) లోని క్లాజు 15 క్రింద నొనర్చబడిన నియమముల క్రింద నేదైన ప్రాంతీయ లేక గ్రామపథకము లేక స్థానిక అభిన్యాసము మంజూరైన తోడనే పైన జెప్పబడిన మంజూరి, గజిటులో నొక ప్రకటనద్వారా ప్రచురింపబడవలయును, మరియు అట్టి ప్రకటన యే స్థల మున మరియు నే సమయమున ఆ పథకము లేక అభిన్యాసము ప్రజలచే పరిశీ లింపబడుటకు వీలుగా నుండునో తెలియజేయగలదు.

(2) సబ్-సెక్షను (1) క్రింద ప్రచురింపబడిన యొక ప్రకటన ఆ పథకము లేక అభిన్యాసము సక్రమముగా తయారు చేయబడే అవసరములకు మంజూరు చేయబడెననుటకు నిష్కర్షగా సాక్ష్యము కాగలదు. ఆ పథకము లేక అభిన్యాసము అట్టి ప్రకటన తేదీనుండి అమలులోనికి వచ్చును. మరియు అటు పిమ్మట సాధ్యమైనంత త్వరలో ఆ పథకము లేక అభిన్యాసము యొక్క ఆచర ణము ప్రారంభింపబడవలయును.

అయితే ఆ పథకము లేక అభిన్యాసము యొక్క లేక దాని ఏదైన భాగముయొక్క అచరణ ప్రభుత్వము నిర్ణయించునంతకాలము ఆపివేయబడ వలయునని ప్రభుత్వము ఆదేశింపవచ్చును.

105. పథకము లేక అభిన్యాసమును మార్చుట లేక కొట్టివేయుట :

సెక్షను 20 యొక్క సబ్ సెక్షను (2) లోని క్లాజు (25) క్రింద నొనర్పబడిన నియమములక్రింద మంజూరు చేయబడిన యొక ప్రాంతీయ పథకము లేక అభిన్యాసమువలెనే తయారు చేయబడిన మంజూరు చేయబడిన తరువాత పథకము లేక అభిన్యాసముచే, ఏ సమయమందైన మార్పు చేయబడ వచ్చును.

106. పథకము లేక అభిన్యాసముయొక్క మార్పు లేక కొట్టివేత వలన బాధింపబడిన వ్యక్తులకు నష్టపరిహార పరిమితి :

ఒక ప్రాంతీయ లేక నగర పథకము లేక స్థానిక అభిన్యాసము అచర ణలోనికి వచ్చిన తేదీకి పిదప ఏ సమయమందైన, అట్టి పథకము లేక అభి న్యాసము మార్పు చేయబడినచో లేక కొట్టివేయబడినచో, అట్టి పథకమును లేక అభిన్యాసమును అనుసరించు అవసరమునకై ఖర్చుపెట్టిన ఏ వ్యక్తియైన అత నికా ఖర్చు ఏ విధముగానైన లాభదాయకముగ ఉండుటకు విరమించినంత ఆ పథకమును లేక అభిన్యాసమును అమలుపరచు పంచాయతీ సమితి నుండి నష్ట పరిహారము పొందుటకు హక్కు కలిగి యుండగలడు.

107. ఆమోదము (మంజూరీ) తర్వాత పథకములు లేక అభిన్యాస మును అనుసరించుటకు యజమానుల బాధ్యత:

ప్రాంతీయ లేక గ్రామపథకము లేక స్థానిక అభిన్యాసమును ఆమోదిం చుచు (మంజూరీ చేయుచు) సెక్షను 104 ననుసరించిన ప్రకటన తేదీనుండి ఆ పథకముచే ప్రణాళికచే బాధింపబడి భవనములను నిర్మించుటకు లేక పునర్ని ర్మించుటకు ఏదేని విధముగా మార్చుటకు లేక వానికి చేర్చుటకు ప్రతిపాదించు ఆ ప్రాంతమందలి భూముల మరియు భవనముల, యజమానులందరు అట్టి పథకము లేక అభిన్యాసముయొక్క గాని అవసరముయొక్క ప్రతి వివరములను అనుసరించగలరు. పథకమున లేక అభిన్యాసమున స్పష్టముగా నివేదింపబడిన లేక నిర్మించుటకు తగని ఏదైన ఉద్దేశమునకై పథకము లేక అభిన్యాసమున ప్రత్యేకింపబడిన ఏదైన ప్రదేశమున భవనము నిర్మింపబడరాదు లేక పునర్ని ర్మింపబడరాదు.

108. ఏదైన ప్రాంతీయ లేక పట్టణ పథకము లేక అభిన్యాసము యొక్క ఏర్పాట్ల నుల్లంఘనమునకై శిక్ష :

(1) ప్రాంతీయ లేక గ్రామ పథకము లేక స్థానిక అభిన్యాసమును ఆమోదించుచు (మంజూరీచేయుచు) సెక్షను 104 ననుసరించి ప్రకటన యనంతరము అట్టి అభిన్యాసముయొక్క నిర్వహణమునకు బాధ్యుడగు అధికారి, ఎవరైన వ్యక్తి అట్టి పథకము లేక అభిన్యాసముయొక్క ఏదైన ఏర్పాట్లను భంగమొనర్చినాడని లేక బుద్ధిపూర్వకముగా అనుమతించినాడని లేదా ఏవేని అట్టి ఏర్పాట్ల పరికారము చేయుటకు ఉపేక్షించినాడని లేక తప్పినాడని అతడు విశ్వసించుటకు హేతువు యుండిన యడల, ఆ ఉల్లంఘనమును నిలువపలసినది లేక నిలుపించ వలసినదని లేక అట్టి ఏర్పాటు ప్రకారము చేయపలసిందని అట్టి వ్యక్తికి నోటీసు జారీ చేయించగలడు.

(2) సబ్‌సెక్షను (1) ననుసరించి అట్టి వ్యక్తిపేర నోటీసు జారీ చేయబడిన తేదీనుండి ఒక నెల గడచిన తరువాత ఉల్లంఘనము లేక తప్పుట అనవరతముగా జరుగుచున్న దోష నిర్ధారణపై అట్టివ్యక్తి—

(i) ఏబది రూపాయలవరకు జరిమానాతో మరియు

(ii) అట్టిదోష నిర్ధారణ పిదప ఉల్లంఘనము, ఉపేక్ష లేక తప్పుట అనవరతము జరుగుచున్నచో, ప్రతి దినమునకును ఐదురూపాయలవరకు బోవు మరికొంత జరిమానాతో శిక్షార్హుడు కాగలడు.

109. ప్రవేశము మొదలగు అధికారములు :

ఏదైన ప్రాంతీయ లేక గ్రామ పథకము లేక స్థానిక అభిన్యాసము సిద్ధముచేయు లేక నిర్వహించు యవసరమునకై పంచాయతీ సమితి లేక ఈ విషయమున పంచాయతీ సమితిచే నధీకృతుడైన ఎవరైనవ్యక్తి ఈ శాసనము యొక్క షరతులకు లోబడి, ఏదేనియాస్తి యనుభవదారునకు లేక అనుభవదారు లేనియడల యజమానికి ఇరువది నాలుగుగంటల నోటీసు ఇచ్చిన తరువాత, పై అజమాయిషీ చేయుటకు మరియు ఏదైన ఆస్తిపై గుర్తులు పెట్టుటకు మరియు అట్టి అవసరములకు అన్నిపనులుచేయుటకు హక్కుకలిగియుండగలడు.

10. భూసంపాదన శాసనము, సం. 1894 పథకమున లేక అభిన్యాసమునకు అవసరమగు స్థిరాస్తికి వర్తించుట :

ప్రాంతీయ లేక గ్రామ పథకము లేక స్థానిక అభిన్యాసముల యొక్క వుద్దేశములకై అవసరమగు స్థిరాస్తి, భూసంపాదన శాసనము. సం. 1894 యొక్క అర్థము ప్రకారము ప్రజావసరములకై అవశ్యకమైన భూమిగా భావింపబడగలదు.

## దోమల అణచుట (Mosquito Control)

111. దోమలను అణచుటకై ఒక ప్రదేశమును ప్రకటించుట:

హెల్త్ ఆఫీసరు శిఫారసుపై పంచాయతీ సమితి ఒక స్థానిక ప్రదేశమును దోమల అణచుటకై ప్రకటింపవచ్చును.

112. నీటి సముదాయమున దోమల సంతానాభివృద్ధి నిషేధము:

సెక్షను 111 ననుసరించి ప్రకటన చేయబడినచో అట్టి ప్రకటన తరువాత ఏ వ్యక్తియును--

(ఎ) అట్టి ప్రదేశమందు దోమల సంతానాభివృద్ధి యగు లేక బహుశః సంతానాభివృద్ధి యగునట్టి, నిలచియుండు లేక ప్రవహించు నట్టి ఏదేని నీటి సముదాయమును కలిగియుండరాదు లేక ఉంచరాదు లేక నిర్వహించరాదు;

(బి) అట్టి ప్రదేశమందు ఏదేని నీటిని దోమల సంతానాభివృద్ధి యగునట్టి లేక బహుశః సంతానాభివృద్ధి యగునట్టి సముదాయముగా ఏర్పడునట్లు చేయరాదు, ఏర్పడి యుండనివ్వ గూడదు లేక అదేవిధముగా ఇంకను ఏర్పడనివ్వగూడదు, అట్టి రాశి, అట్టి సంతానాభివృద్ధిని సార్థకముగా నిరోధించుటకు అట్టి సముదాయము ఆ విధముగా ఉపయోగింపబడిన తప్ప —

వివరణ 1 :— పశువుల కొరకై ఉపయోగింపబడి, తరచుగా ఉపయోగమునందున్నట్టి నిడుపాటి తొట్లు, వ్యతిరేకముగా, ఋజువుచేయబడునంత వరకు, దోమల సంతానాభివృద్ధి యగునట్టి లేక బహుశః సంతానాభివృద్ధి కాగల నీటి సముదాయముగా భావింపబడవు.

వివరణ 2 :— ఏదేని నిలచియున్న లేక ప్రవహించుచున్న నీటి యందు కీటక స్థితిలో నున్న దోమ సహజపుటునికి అట్టి నీటియందు దోమలు పోషింపబడు ననుటకు నిదర్శనముగా నుండగలదు.

113. దోమల సంతానాభివృద్ధి స్థలముల నిర్వాహాము :

(1) దోమలు వృద్ధియగు లేక బహుశః వృద్ధి కాదగిన నిలచియున్న లేక ప్రవహించుచున్న నీటియొక్క ఏదేని సముదాయము (రాశి) కల ఏదైన స్థలముయొక్క యజమానిని లేక అనుభవదారుని పంచాయతీ సమితి-లిఖిత పూర్వకమైన నోటీసుద్వారా ఆ నోటీసునందు నిర్దిష్టపరుపబడు కాలములోగా పంచాయతీ సమితి- ఆరోగ్యాధికారి (హెల్త్ ఆఫీసరు) శిఫారసుపై ఆ పరిస్థితులలో తగినవని తలంచు అట్టి చర్యలు అదే స్థలము సంబంధించి తీసుకొనుటకు లేక అదే స్థలమును అట్టి భౌతిక రసాయనిక లేక జంతు శాస్త్రీయ విధానము ద్వారా నిర్వహించుటకు కోరవచ్చును.

(2) సబ్ సెక్షను (1) ననుసరించి, నోటీసు కాపురస్తునిపేర జారీ చేయబడినచో అతడు దానికి విరుద్ధముగా, స్పష్టమగు లేక తదున్ముక్తమగు ఒడంబడిక లేనప్పుడు యజమానినుండి నోటీసులో నిర్దిష్టపరుపబడినట్టి నిర్వహణ పద్ధతి నవలంబించుటవల్ల లేక చర్యలు గైకొనినందువల్ల, అతనిపై బడి వసూలు చేయదగు వ్యయములను వసూలు చేసుకొనుటకు హక్కు కలిగి యుండగలడు. మరియు అప్పుడు లేక అటుతరువాత యజమానికి యివ్వవలసిన అద్దెనుండి అట్టి వ్యయముల యొక్క మొత్తము మినహాయించ వచ్చును.

114. కర్తవ్యము మీరిన సందర్భమున ఆరోగ్యాధికారి (హెల్త్ ఆఫీసరు) అధికారము:

సెక్షను 113 ననుసరించి నోటీసు జారీ చేయబడిన వ్యక్తి నోటీసు నందు నిర్దిష్ట పరుపబడినట్టి చర్యల గైకొనుటకు లేక నిర్వహణ విధానమును అవలంబించుటకు అందులో నిర్దిష్ట పరుపబడిన కాలములోగా, తప్పినచో లేక నిరాకరించినచో పంచాయతి సమితి స్వయముగా అట్టి చర్యలను తీసుకొనవచ్చును. మరియు ఆ ఆస్తియొక్క యజమానినుండి లేక అనుభవదారు నుండి సందర్భానుసారముగా అట్లు చేయుటకైన వ్యయమును అధ్యాయము 10 క్రింద వసూలు చేయబడదగు నేదైన పన్నుక్రింద కోరబడిన మొత్తము విధముగనే వసూలు చేయబడును.

115. దోమ వ్యతిరేక నిర్మాణములు, రక్షణ :

ఏదేని భూమి లేక భవనమునందు దోమల సంతానము అభివృద్ధి నిరోధించు నుద్దేశముతో ప్రభుత్వము లేక పంచాయతీ సమితి లేక ప్రభుత్వము యొక్క కోరికపై యజమాని లేక అనుభవదారు అట్టి భూమి లేక భవనము నందేవేని కట్టడములను నిర్మించి యున్నచో, అట్టి భూమి లేక భవనము యొక్క ఆ సమయపు యజమాని, మరియు నతనితో బాటు ఆ సమయపు అను

భవదారు కట్టడముల వాని శక్తికి హాని యొనర్చు లేక బహుశః హాని యొనర్పదగు అట్టి నిర్మాణముల చెరపునకు కారణమగు లేక బహుశః చెరపబడుటకు మూలమగు అట్టి ఏదైన విధానమున అది ఉపయోగించబడుటను నిరోధింపవలెను.

116. అట్టి నిర్మాణములలో అడ్డు పడుట నిషేధము :

(1) ఏదైన భూమి లేక భవనములలో, క్రింద లేక పైన పంచాయతీ సమితి ఆజ్ఞలచే లేక అనుసరించు ఉద్దేశ్యముతో నిర్వహించు ఉద్దేశముతో నిర్వహింపబడిన ఏదైన నిర్మాణమున లేక ఉంచబడిన ఏదైన సాధన సామాగ్రిని లేక వస్తువును ఏ వ్యక్తియు పంచాయతీ సమితి అంగీకారము వినా కలుగజేసికొనదు, నష్టపరచదు, పాడు చేయదు లేక నిష్ప్రయోజన మొనర్చదు.

(2) ఎవరైన వ్యక్తిచే సబ్-సెక్షను (1) యొక్క పరిషత్‌ల ఉల్లంఘింపబడినచో, పంచాయతీ సమితి సందర్భానుసారముగా నిర్మాణమును పునర్నిర్వహింపవచ్చును లేక సాధన సామాగ్రిని లేక వస్తువును యథాస్థానమున ఉంచవచ్చును, అట్లు చేయుటకైన వ్యయము అధ్యాయము 10 క్రింద వసూలు చేయబడదగు నేదైన పన్ను క్రింద కోరబడిన మొత్తము విధముగనే అట్టివ్యక్తి నుండి వసూలు చేయబడగలదు.

117. ఆరోగ్యపు సిబ్బందికి ఆవరణతోడి గృహమున ప్రవేశించుటకు, పరిశీలించుటకు అధికారము :

సెక్షను 111 నుండి 116 లో (రెంటిని కలుపుకొని) గల షరతులను అమలు జరిపించు నవసరములకై కార్య నిర్వాహణాధికారి, ఆరోగ్యాధికారి లేక ఆరోగ్య పరిశీలకుని (హెల్త్ ఇన్‌స్పెక్టర్) హోదాకు తక్కువగాని పంచాయతీ యొక్క యే ఇతరాధికారి, సహేతుకమగు అన్ని సమయములందును, అతనికి యుక్తమని తోచునట్టి లిఖిత పూర్వక నోటీసు నిచ్చిన తరువాత, ఏదేని భూమి లేక భవనమున ప్రవేశింపవచ్చును. మరియు పరిశీలింపవచ్చును. మరియు అట్టి భూమియొక్క లేక భవనముయొక్క అనుభవదారు లేక యజమాని సందర్భానుసారముగా అట్టి ప్రవేశమునకు ఆవశ్యకమగు నట్టి సౌకర్యములను కలిగించగలదు మరియు పైన చెప్పబడిన అవసరమునకై అతనినుండి కోరబడిన అట్టి భోగట్టానంత నొసగగలదు.

118. సెక్షను 113 యొక్క ఉల్లంఘమునకు శిక్ష :

సెక్షను 113 ననుసరించి, దోమల సంతానాభివృద్ధి విరుద్ధముగా దాని క్రింద చర్య తీసికొనుటకు అతనిని కోరు ఏ సూచనా పత్రము జారీచేయబడి యుండిన వ్యక్తి ఎవరైన,

అట్టి నోటీసు ప్రకారము నడచుటకు తప్పిన ఏబది రూపాయలవరకు బోవు జరిమానాతోను మరియు ఆ ఉల్లంఘనమున అనవరతముగా నున్నచో మొదటి దాని తరువాత, ఉల్లంఘనము ఆదేవిధముగా జరిగియుండిన ఋజువుయైన కాల మందలి ప్రతి దినమునకును ఐదు రూపాయలవరకు బోవు మరికొంత జరిమానాతోడను శిక్షింపబడగలడు.

119. సెక్షను 115 ఉల్లంఘనమునకు శిక్ష :

ఎవరైన భూమి, లేక భవనమును సెక్షను 115 నకు విరుద్ధముగా ఉపయోగించిన లేక ఉపయోగమును నిరోధించుటకు తప్పిన ఒక వంద రూపాయలవరకు బోవు జరిమానాతో శిక్షింపబడగలడు.

120. పరిచ్ఛేదము 116 యొక్క ఉల్లంఘనమునకు శిక్ష :

ఎవరైన సెక్షను 110 యొక్క షరతులకు విరుద్ధముగా దోమల సంతానాభివృద్ధి నిరోధించుటకు పంచాయతీ సమితి ఆజ్ఞలచే లేక అనుసరించి చేయబడిన ఏదైన విషయము కలుగజేసికొనిన, నష్టపరచిన, నాశనము చేసిన లేక యోజన మొనర్చిన రెండువందల రూపాయలవరకు బోవు జరిమానాతో శిక్షింపబడగలడు.

## పబ్లిక్ మార్కెట్లు (Public Market)

121. సార్వజనిక విఫణులు (పబ్లిక్ మార్కెట్లు) :

ఈ శాసనముయొక్క షరతులకు మరియు సెకను 29 యొక్క సబ్ సెకను (2) లోని క్లాజు (16) క్రింద నొనర్చబడిన నియమములకు లోబడి ఒక పంచాయతీ సమితి, పబ్లిక్ మార్కెట్ల స్థాపించవచ్చును; నియంత్రణ మొనర్చవచ్చును మరియు క్రమబద్ధ మొనర్పవచ్చును.

122. సార్వజనిక విఫణులను (పబ్లిక్ మార్కెట్లను) మూసి వేయుట :

ఒక పంచాయతీ సమితి ఒక బహిరంగ ప్రకటన ద్వారా యే పబ్లిక్ మార్కెట్టునైన లేక నందలి ఏ భాగమునైన మూసివేయవచ్చును.

## ప్రవేటు మార్కెట్లు

123. (1) స్వంత మార్కెట్లకు లైసెన్సును ఇచ్చుట :

పంచాయతీచే ననుగ్రహింపబడిన నొక లైసెన్సు క్రింద తప్ప అధికార స్థానములేని వ్యక్తి యువ్వరును ఒక స్వంత మార్కెట్టును స్థాపింపరాదు.

(2) పంచాయతీ సమితి అట్టి మార్కెట్లలో, పారిశుధ్యము, మురికి కాల్వలు, నీటి సరఫరా, బాటల మరియు తోవల వెడల్పు, ఉపయోగించవలసిన తూకము రాళ్ళు, పాత్రలు మరియు వసూలు చేయవలసిన అద్దెల విషయమున సెక్షను 201 యొక్క సబ్-సెక్షను (2) లోని క్లాజు (17) క్రింద విధింపబడు షరతులకు లోబడి యొక లైసెన్సును అనుగ్రహింపవచ్చును.

(3) అట్టి లైసెన్సును అనుగ్రహించినపుడు, నిర్ణయింపబడు మొత్తమునకు మించని యొక రుసుమును వసూలు చేయవచ్చును.

124. అట్టి లైసెన్సుల వ్యవధి :

సెక్షను 123 క్రింద యొక లైసెన్సు అది మరియొక విధముగ ఆదేశించిన తప్ప అది యనుగ్రహింపబడిన ఆర్థిక సంవత్సరమువరకు అమలులో నుండును, కాని దాని షరతులలో దేనినైన యుల్లంఘించినందులకు యిపుడైన యది కొంతకాలము వరకు అమలులో లేకుండ నొనర్పబడవచ్చును. లేక రద్దొనర్ప బడవచ్చును.

125. సమితి లైసెన్సును ఇచ్చుటకు ఆలసించి నప్పుడు కార్య విధానము :

లైసెన్సు కొరకు పెట్టబడిన యొక అర్జీ అందిన తేదీ నుండి మూడు నెలలకు మించు యొక యవధివరకు, సెక్షను 123 క్రింద నొక లైసెన్సును అర్జీ పెట్టుకొనవచ్చును. ప్రభుత్వము మొదట యట్టి యాదేశముయొక్క తేదీ నుండి యొక నెలలోగా అర్జీనిగూర్చి నిర్ణయ మొసగబడ వలయునని ఆదేశింపవచ్చును. పంచాయతీ సమితి యా యవధిలోపల నిర్ణయింపనిచో, ప్రభుత్వము ఆ అర్జీని నిరాకరింపవచ్చును లేక నొక లైసెన్సును అనుగ్రహింపవచ్చును. లేక నొక లైసెన్సును అనుగ్రహింపవలయునని బోర్డుకు ఆదేశింపవచ్చును.

126. శిక్షలు :

(ఎ) సెక్షను 123 క్రింద నొక లైసెన్సు అనుగ్రహింపబడిన యొక స్వంత మార్కెటును స్థాపించు లేక నిర్వహించు నేవ్యక్తియైన ;

(బి) సెక్షను 124 క్రింద లైసెన్సు కొంతకాలము నిలుపబడిన లేక రద్దు చేయబడిన యొక స్వంత మార్కెటును తెరచు లేక తెరచియుంచు నేవ్యక్తియైన,

వందరూపాయల వరకుబోవు జరిమానాతో శిక్షింపబడును. ఆ యుల్లంఘనము అవిరళముగ నున్నచో ఆ యుల్లంఘన మట్లే సలుపబడినదని రుజువు

చేయబడిన మొదటి యుల్లంఘనమునకు తరువాత ప్రతిదినము పదిరూపాయల వరకుబోవు మరికొంత జరిమానాతోను శిక్షింపబడును.

## 8 అధ్యాయము

## జిల్లా నిధి మరియు వినియోగము

127. పంచాయతీ సమితి-జిల్లా పరిషత్‌ల నిధి ఏర్పాటు చేయుట:

ప్రతి పంచాయతీ సమితి జిల్లా పరిషత్‌కు నిధి ఏర్పాటు చేయబడగలదు, మరియు దానికి,

(ఎ) ఈ శాసనారంభమున జమ చేయబడిన జిల్లా నిధుల విలువలు ;

(బి) ఈ శాసనము క్రింద వసూలు చేయబడుటకు అధికారము ఒసగబడిన రుసుములు మరియు పన్నులు, రాజస్వములు, సుంకములు మరియు లాభములు జమకట్ట బడగలవు ;

(సి) పంచాయతీ సమితి-జిల్లా పెరిషత్‌చే కొనబడి నిర్మాణముచేయ బడిన లేక నిర్వహింపబడుచున్న లేక యితర రీత్యా పంచాయతీ సమితి-జిల్లా పరిషత్ స్వాధీనములోనున్న ఆస్తులనుండి కలుగుచున్న అన్ని అద్దెలు మరియు లాభములు జమకట్ట బడగలవు ;

(డి) పంచాయతీ సమితి-జిల్లా పరిషత్‌చే దానికి లేక దాని తరపున గావి యివ్వబడిన లేక దానిచే విధింపబడిన అన్ని జరిమానాలు మరియు ఈ శాసనము క్రింద లేక ఈ నియమములక్రింద మరియు ఉపశాసనము క్రింద ఒక న్యాయాధికారిచే విధింపబడిన యట్టి జరిమానాలు ;

(యి) దాని ఉత్తరువుల ననుసరించి అమ్మబడు పూర్తి ఆస్తి పంచాయతీ సమితి-జిల్లా పరిషత్ వశమందుంచబడినవి, విక్రయ లాభములుంచ బడగలవు ;

(ఎస్) హైదరాబాదు పడవలరేవుల గుత్తాలచట్టము 1314 ఫ. క్రింద పంచాయతీ సమితి-జిల్లా పరిషత్ అధికారములోనున్న అన్ని సార్వజనిక పడవల గుత్తాల లాభములు, మరియు అట్టి పడవరేవుల గుత్తాల సందర్భమున

సంభవించు దావాలో ఈ శాసనము క్రింద వసూలు చేయబడిన అన్ని జప్తులు మరియు జరిమానాలు,

(జి) ప్రభుత్వము, స్థానికాధికార వర్గములు మరియు ఖాన్గి వ్యక్తులచే నొసగబడిన చందాలు.

(హెచ్) ఆంధ్ర ప్రదేశ్ (తెలంగాణా) బంజరుదారీ శాసనము, 1337 యొక్క షరతుల క్రింద పొందబడిన జరిమానాలు, మరియు లావారసీ విక్ర యాదాయములు,

(ఐ) అనభ్యర్థిత (Unclaimed) ధరావతులు మరియు యితర జప్తీలు, మరియు,

(జె) ఈ శాసనము క్రిందగాని లేక ఆ సమయమున అమలులో నున్న ఏ యితర చట్టము క్రిందగాని పంచాయతీ సమితి-జిల్లా పరిషత్‌చే గాని లేక పంచాయతీ సమితి, జిల్లా పరిషత్ పక్షమునగాని పొందబడిన అన్ని యితర మొత్తములు,

128. వదలబడినది.

129. నిధి వినియోగము:

(1) పంచాయతీ సమితి-జిల్లా పరిషత్ ప్రతి సంవత్సరము పంచాయతీ సమితి-జిల్లా పరిషత్ నిధినుండి వేరుగా (మొత్తములనుంచి) మరియు దానిని ఈ రీతిగా ఉపయోగించగలదు.

మొదట- దానిచే చట్ట సమ్మతముగా కరారుచేసికొనిన ఋణముపై బాకీ పడిన మొత్తముల చెల్లింపు నిమిత్తము అవసరమగు నట్టి మొత్తమును ప్రత్యే కించగలడు, మరియు ప్రతి సంవత్సరము వినియోగింపగలదు.

రెండవది- వదలబడినది.

మూడవది- వదలబడినది.

నాల్గవది- పంచాయతీ సమితి-జిల్లా పరిషత్ యొక్క కార్యాలయముల కొరకు కట్టడముల నిర్మాణమునకగు ఖర్చు.

ఐదవది- వదలబడినది.

(2) సబ్-సెక్షను (1)లో నిర్దిష్టపరుపబడిన చార్జీలకు మరియు నొసర్చ బడునట్టి నియమములకు లోబడి పంచాయతీ సమితి-జిల్లా పరిషత్ నిధి యీ క్రింది అవసరములకును వర్తించును, అవి ఏవన :-

(ఎ) సెక్షను 80 మరియు 81లలో నిర్దిష్ట పరుపబడిన విషయములకు గాను అవసరమగు మరియు ఈ శాసనముచే గాని లేక దానిక్రిందగాని లేక

అప్పటికి అమలులోనున్న యే యితర చట్టము క్రిందగాని పంచాయతీ సమితి, జిల్లా పరిషత్‌కు అధికారము నివ్వబడిన లేక విద్యుక్తధర్మముగా బోర్డుపై విధింపబడిన అన్ని యితర కార్యములకు మరియు అట్టి విషయములను అభివృద్ధి నొనర్చుటకు అవసరమగు అప్పులతో సహా నగు ఖర్చులను మరియు చార్జీలను.

(బి) ఉద్యోగులకు అప్పుల నొసంగుట, అయితే ప్రభుత్వము వద్ద వేతనముగాను ఏ అధికారికిని అట్టి చెల్లింపు చేయరాదు.

(సి), (డి) తొలగింపబడెను.

(ఇ) పురపాలక మరియు నగర సమితులకు, హైదరాబాదు వ్యావసాయిక మరియు మార్కెట్టుల శాసనము (1339 ఫసలీ) క్రింద నిర్మితమైన మార్కెట్ల సంఘములకు, పంచాయతీలకు ప్రజా గ్రంథాలయములకు మరియు ప్రజా సౌకర్యార్థము స్థాపింపబడిన తదితర ధర్మ మరియు ప్రజా సంస్థలకు నొసగబడు దానములు మరియు అప్పులు,

(ఎఫ్) ఏదైన పబ్లికుమార్కెట్టుయొక్క లేక పంచాయతీ సమితి జిల్లా పరిషత్తుల కంట్రోలునకు లోబడు ప్రదేశములో లేక అట్టి ప్రదేశములోని ఏదైన నగరములో హైదరాబాదు వ్యావసాయిక మార్కెట్టు శాసనము (1339ఫసలీ) క్రింద ఏర్పరుపబడిన ఏదైన మార్కెట్టు యొక్క సేకరణ అభిన్యాసము మరియు నిర్మాణము కొరకు దానము మరియు అప్పులు,

(జి) పంచాయతీ సమితి, జిల్లా పరిషత్ యొక్క అధికార క్షేత్రములోని ప్రదేశమునకు లభించు ఏదైనా పనికి లేక సంస్థకు అట్లు గైకొనబడిన పని లేక నిర్వహింపబడుచున్న పంచాయతీ సమితి, జిల్లా పరిషత్ యొక్క అధికార క్షేత్రములో లేకపోయినను యివ్వబడు చందాలు :

(హెచ్) పంచాయతీ సమితి జిల్లా పరిషత్ యొక్క అధికారము క్రింద ప్రదేశములో లేక వెలుపల నున్న మానవ లేక జంతు బాధా నివారణ కొరకు వసూలు చేయబడు దేదైన ప్రజానిధి చందాలు ;

(ఐ) ఏదైనా ప్రజాహ్వానము, ఉత్సవము లేక ఆతిధ్యము :

అయితే ఒక సమావేశములో నొక తీర్మానము ఆమోదింపబడి యది ఆ పంచాయతీ సమితి, జిల్లా పరిషత్ యొక్క సభ్యుల మొత్తము సంఖ్యలో సగము మందిచే బలపరుపబడి, మున్ముందు ప్రభుత్వ మంజూరీ యుండిననే తప్ప ఈ శీర్షిక క్రింద ఎట్టి ఖర్చుయును పెట్టబడరాదు ;

(జె) పంచాయతీ సమితికి జిల్లా పరిషత్తునకు, దాని సభ్యులకు అధికారులకు లేక ఉద్యోగులకు ఈ శాసనముక్రింద నివ్వబడిన యేదైన అధికారమును అమలుపరచుటచే ఏ వ్యక్తికైన ఏదైన నష్టము కలిగిన నష్టపరిహారము.

130 నుండి 134 వదలబడినవి.

## అధ్యాయము - 9
## పన్నుల విధింపు

135 స్థానిక పన్ను:

సెక్షనుయొక్క సబ్ సెక్షను (2)లో నేమియున్నప్పటికిని, ప్రభుత్వమునకు చెల్లింపవలసిన భూ రాజస్వము (రెవిన్యూ) కై ప్రతి రూపాయలపైన రెండు అణాల స్థానిక పన్నును సబ్ సెక్షను (2) యొక్క షరతులకు లోబడి ఇకముందు వివరింపబడు షరతులపై ప్రభుత్వము విధింపవలయును.

అయితే ఇజారా గ్రామములలో స్థానికపన్ను కోరు మొత్తములపై యిజారా సమయములలో విధింపబడును, ఆ వ్యవధి గడచిన పిదప జమాబందీ దిమాండుపై స్థానికపన్ను విధింపబడవలయును.

ఇంకను ఏ యినాము భూమిపైనైనను పూర్తిపన్ను నిర్ణయముపై స్థానికపన్ను విధింపబడవలయును.

(2) ఈక్రింది భూ ఆదాయములపైన స్థానికపన్ను విధింపబడగూడదు.

(ఎ) పశువులు మేయ బంజరులపై వచ్చు అమ్మకపు సొమ్ము:

(బి) అనుభవ మాత్రాధికారముగల చెట్లపై వచ్చు అమ్మకపు మొత్తము:

(సి) శిక్షలు, జరిమానాలు లేక 1317 ఫ, యొక్క భూరాజస్వ శాసనము (Land Revenue Act) ననుసరించి శిక్షగా లేక తప్పిన సందర్భమున వడ్డీగా విధింపబడన ఏదైన ఛార్జీ;

అయితే అనధీకృత వ్యవసాయమునకై (Unauthorized Cultivation) విధింపబడినట్టి జరిమానాలు మరియు శిక్షా ధన నిర్ణయము సందర్భమున, స్థానిక పన్ను సామాన్యపన్ను నిర్ణయమై విధింపబడగలదు.

136. స్థానిక పన్ను యొక్క వసూలు మరియు జమ:

(1) సబ్ సెక్షను (2) యొక్క షరతులకు లోబడి భూములపై సెక్షను 135 క్రింద విధింపదగు స్థానికపన్ను ఆ భూములుగల ప్రదేశమును పాలించు బోర్డునకు ప్రభుత్వము నిర్ణయించునట్టి ప్రమాణములో పటేళ్ళు మరియు పట్వా

రీల వేతనములకై మినహాయింపు చేసిన పిదప, ప్రభుత్వముచే చెల్లింపబడ వలయును.

(2) హైదరాబాదు పురపాలక సంఘ శాసనము, 1950 యొక్క సెక్షను 3 క్రింద నొక పురపాలక సంఘముగా, లేక హైదరాబాదు పురపాలక మరియు నగర సమితుల శాసనము, 1951 యొక్క సెక్షను 4 క్రింద నొక పట్టణపు పాలక సంఘముగ ప్రకటింపబడిన ఏదైన ప్రదేశముల హద్దులలో నున్న భూములపై సెక్షను 135 క్రింద విధింపదగు స్థానిక సెస్సు, అందులకు సంబంధించిన మహా పురపాలక సంఘము లేక పురపాలక లేక నగర సమితికి సబ్ సెక్షను (1)లో పేర్కొనబడిన వేతనమును మినహాయించిన పిమ్మట ప్రభుత్వముచే చెల్లింప బడవలయును.

(3) ఒక పంచాయతీ సమితి జిల్లా పరిషత్తు మరియు నింకేదైన యితర స్థానిక అధికారమునకును నడుమ ఈ సెక్షనుకు సంబంధించిన ఏదైన విషయమునుగూర్చి యుత్పన్నమగు నేదైన వివాదములు ప్రభుత్వముచే పరిష్కరింప బడును.

కాని పంచాయతీ ప్రదేశములో ఉన్న భూములమీద 135 సెక్షనుక్రింద విధింపదగు స్థానికపన్నునుండి వచ్చు నికర వరుంబడులలో నాలుగవ వంతుకు సమానమగు మొత్తము, ఆ ప్రదేశముమీద జూరిస్‌డిక్షనుగల పంచాయతీ సమితికి ప్రభుత్వముచే చెల్లింపబడవలెను.

137. స్థానికపన్ను కొంత కాలమువరకు నిలుపుట మరియు దానిని మాఫీచేయుట:

ఏకారణముచేనైన, భూమిశిస్తు, లేక అందలి ఏ భాగమైన మాఫీ జేయబడిన లేక తాత్కాలికముగ నిలిపివేయబడినప్పుడు, స్థానికపన్ను సాధారణముగ అదే ప్రమాణములో మాఫీ చేయబడవలయును లేక తాత్కాలికముగ ఆపివేయబడవలయును. కాని, ఆపన్ను చెల్లింపబడవలసిన బోర్డు లేక స్థానికఅధికారము యొక్క అర్జీపై, ప్రభుత్వము, ఆ స్థానిక సెస్సుకు ఆ మాఫీ లేక తాత్కాలికముగ ఆపుట వర్తింపదని ఆదేశింపవచ్చును.

138. ఆస్తిపై ప్రత్యేకపన్ను :

ముందుగా ప్రభుత్వ మంజూరీలో మరియు విందులకుగాను విధింపబడు నట్టి నియమములకు లోబడి, పంచాయతీ సమితియొక్క అధికారమునకు లోబడి మొత్తము ప్రదేశములోని లేక నందలి యొక భాగములోని గృహములపై, కట్టడములపై, మరియు భూములపై అట్టి

ప్రదేశముల నివాసులకు సౌకర్యములు సమకూర్చుటకుగాను ఒక ప్రత్యేకపన్ను నొక పంచాయతీ సమితి విధింపవచ్చును:

అయితే స్థానిక పన్ను వసూలు చేయబడుచున్న ఏదైన భూమి విషయమున నట్టి పన్ను విధింపబడరాదు.

139. ఇతర పన్నులు ;

(1) ఈ అధ్యాయముయొక్క షరతులకు లోబడి మరియు ముస్ముందు ప్రభుత్వము మంజూరుతో తన యధికారములో నున్న ప్రదేశ మంతటితో, లేక అందలి యేదైన భాగములో ఈ శాసనములకుగాను, ఈ క్రింది యితర పన్నులలో దేనినైన విధింపవచ్చును.

(ఎ) భారత రాజ్యాంగముయొక్క ఆర్టికల్ 276 యొక్క షరతులకు లోబడి పంచాయతీ సమితి అధికార క్షేత్రమునకు లోబడిన ప్రదేశపు వార్డులలో ఏదైన వృత్తిని, వ్యాపారమును లేక ఉద్యోగము లేక కొలువును జేయు వ్యక్తులపై ఒక పన్ను ;

(బి) పబ్లికు మార్కెటులోనికి అమ్మకము కొరకు సరకు కొనివచ్చు బండ్లపై, బరువులు మోయు జంతువులపై మార్కెటు రహదారి పన్నులు,

(సి) పబ్లికు మార్కెటులో సరకు అమ్మకము కొరకు పెట్టుకొను హక్కుకొరకు, చెల్లింపబడు మార్కెటు రుసుములు ;

(డి) పబ్లికు మార్కెటులో అమ్మబడు పశువులను రిజిష్టరు చేయించుటకు :

అయితే క్లాజులు (బి); (సి) మరియు (డి) లో పేర్కొన బడిన పన్నులు మరియు రుసుములును, తన అధికారములోనున్న పబ్లిక్ మార్కెటుల విషయముపై పన్నులను రుసుములను వసూలు చేసికొనుటకు, ప్రభుత్వము గెజిటులో నొక ప్రకటనద్వారా ప్రత్యేకపు హక్కుల నొక పంచాయతీ సమితి కిచ్చిననే తప్ప, ఆ పంచాయతీ సమితిచే విధింపబడరాదు.

(ఇ) ప్రజోపయోగార్థము పబ్లిక్ నీటి నలాను (water taps)మరియు విడుపాటి నీటిగొట్టములు పెట్టబడినప్పుడు నొక సాధారణ నీటిపన్ను:

(యఫ్) పబ్లిక్ ప్రదర్శనములు మరియు వినోదములపై పన్ను:

(జి) పన్ను:

(i) పంచాయతీ సమితి అధికార క్షేత్రములో, యాత్రికులు పోవు నొక స్థలమునకు లేక స్థలమునుండి రైలుమార్గమున లేక మోటారు యానపు యేర్పాటుద్వారా ప్రయాణించు వ్యక్తులపై.

(ii) పంచాయతీ సమితి అధికారపు హద్దులలోగల యొక దైవపీఠము, ఉరుసు, జాతర దర్శించు యాత్రికులపై.

ఈ క్రింది విధముగా నాదేశింపబడినది—

(i) అట్టి యాత్రికపన్ను ఒక ఖండితరేటు చొప్పున 12 సంవత్సరములు మించిన ప్రతి వ్యక్తిపైనను విధింప దగును.

(ii) ప్రభుత్వముచే మరియొక రీతిగా ఆదేశింపబడిననే తప్ప, అట్టి పన్ను మొత్తము నేభాగమైనను, అట్టి స్థానిక ప్రవేశమునకు వచ్చుచుండు యాత్రికుల ఆరోగ్యము మరియు సౌఖ్యము కొరకు ఏర్పాటు చేయుట లేక ఆ ప్రదేశమును అభివృద్ధి పరచుట లేక విస్తరించు అవసరములకు కాకుండ మరియొక విధముగ ఖర్చు పెట్టబడరాదు.

వివరణ:— క్లాజు (జి) యొక్క సబ్ క్లాజు (i) యొక్క అవసరము కొరకు ప్రతి సంవత్సరపు జాతర కొరకు భద్రాచలము చేరుటకు యాత్రికులు దాటు గోదావరి గట్లపైని స్థలములు యాత్రికులు పోవు స్థలములుగ భావింపబడవలయును.

(హెచ్) అట్టి బండ్లు పంచాయతీ సమితి యొక్క హద్దులలో నుంచబడినప్పుడు ఆ బండ్లపై నొక పన్ను :

(1) ఏదైన వంతెనవద్ద లేక పంచాయతీ సమితి నిధినుండి ఖర్చుతో వేయబడిన రోడ్డువద్ద, పంచాయతీ సమితిచే స్థాపింపబడిన "టోలు గేటు" (టోల్ బార్స్) వద్ద నీ క్రిందివానిపై నొక రహదారి పన్ను :

(i) ప్రతి వాహనము:

(ii) అట్టి వంతెన లేక రోడ్డుపై నడుచుచు సరకును లేక బరువును తోలుటకు ఉపయోగింపబడు ప్రతి జంతువు.

అయితే ఒక తేదీన అట్టి ఏ బండి లేక జంతువుపైనైన ఆ పన్ను ఒక సారికంటె ఎక్కువ విధింపబడరాదు.

(2) సబ్ సెక్షను (1) యొక్క క్లాజులు (బి) మరియు (సి) క్రింద విధింపబడదగు పన్నులు మరియు రుసుములు సంతలలో గూడ విధింపనగును.

140. పన్నుల విధించు విధానము :

పంచాయతీ సమితి-జిల్లా పరిషత్తు అందులకుగాను సమావేశపరుపబడిన యొక ప్రత్యేక సమావేశములో నట్టి పన్ను విధింపును ప్రతిపాదించుచు నొక తీర్మానమును ఆమోదించిననే దప్ప సెక్షను 138 లేక 139 క్రింద నెట్టి పన్నుయును విధింపబడరాదు.

అయితే సెక్షను 138 క్రింద విధింపదగు ప్రత్యేక పన్ను విషయమునను సెక్షను 139 యొక్క సబ్ - సెక్షను (1) లోని క్లాజు (జి) క్రింద విధింపదగు యాత్రికపన్ను విషయమును అట్టి ఏ తీర్మానముపైన, బోర్డు సభ్యుల మొత్తము సంఖ్యలో మూడింట రెండవంతుల అధిక సంఖ్యాకులచే నంగీకరింపబడిననే దప్ప చెల్లనేరదు.

(2) అట్టి తీర్మానము ఆమోదింపబడినపుడు, పన్ను విధింపబడనున్న వ్యక్తులవర్గమును లేక ఆస్తి వివరమును విధింపబడు పన్ను మొత్తము లేక రేటు, మరియు అనుసరింపబడనున్న నిర్ణయపు పద్ధతిని నిర్వచించు నొక నోటీసును నియత విధిని, పంచాయతీ సమితి-జిల్లా పరిషత్తు ప్రకటించగలదు.

(3) విధింపనెంచిన పన్నును ఆక్షేపించు నా జిల్లా నివాసి యెవరైన ఆ నోటీసు ప్రకటింపబడిన అఱువది దినములలోగా, తన యాక్షేపణను లిఖిత పూర్వకముగా పంచాయతీ సమితి-జిల్లా పరిషత్తునకు దాఖలు చేయవలయును.

(4) పంచాయతీ సమితి-జిల్లా పరిషత్తు ఒక ప్రత్యేక సమావేశములో వచ్చిన ప్రతిపాదనలను మరియు వానిపై వచ్చిన యన్ని యాక్షేపణలను ఆలోచించి, వాని సారాంశమునకు భంగము లేకుండ యా ప్రతిపాదనలను మార్పొనర్చ వచ్చును, మరియు అటుపిమ్మట, తమకు చేరిన ఆక్షేపణలు, వానిపై తమ నిర్ణయములను మరియు వానికగు కారణములతో గూడ వానిని ప్రభుత్వమునకు పంపించవలయును, పంచాయతీ సమితి-జిల్లా పరిషత్తు వాని సారాంశమునకు భంగము వాటిల్లునట్లు మార్పు చేయదలంచినచో, అది వానిని మరల సబ్-సెక్షను (2)లో విధింపబడిన రీతిని ప్రకటింపవలయును.

(5) ప్రభుత్వము, అట్టి ప్రతిపాదనలు చేరిన పిదప, వానిని మంజూరు చేయవచ్చును లేక వానిని మంజూరు చేయుటకు నిరాకరింపవచ్చును. లేక తనకు

ఉచితమని తోచిన మార్పులకు లోబడి వానిని మంజూరు చేయవచ్చును లేక ఇంకను ఆలోచించుటకు వానిని పంచాయతీ సమితి జిల్లా పరిషత్తునకు వాపసు చేయవచ్చును.

(6) ఒక మార్పొక ప్రత్యేక సమావేశములో పంచాతీ సమితి - జిల్లా పరిషత్తుచే అంగీకరింపబడిననేదప్ప, మరియు అంగీకరింపబడునంత దనుక, సారాంశమునకు భంగము కలుగజేయు నెట్టి మార్పుయును, సబ్ - సెక్షను (5) క్రింద నొనర్పబడరాదు.

(7) సబ్ సెక్షను (5) క్రింద పన్ను విధింపునకే పైన ప్రతిపాదనలు మంజూరైనచో ప్రభుత్వము, ప్రకటనద్వారా, మంజూరైనట్లు మరియు నట్టి ప్రకటనలో నిర్దిష్టపరుపబడినట్టి తేదీనుండి యా పన్ను విధింపును నిర్దేశింప వచ్చును. మరియు అటుపిమ్మట, అట్లు నిర్దిష్టపరుపబడిన తేదీనుండి యాపన్ను ఆచరణలోనికి వచ్చును.

(8) ఈ సెక్షనుక్రింద నొక పన్ను విధింపబడినట్లు చేయబడినయొక ప్రకటన ఆ పన్ను ఈ శాసనాదేశములననుసరించి విధింపబడినదనుటకు నిష్కర్షకమగు సాక్షము కాగలదు.

141. పన్నులను రద్దుచేయు లేక మార్పువిధానము :

(1) ఒక పంచాయతీ సమితి ఒక ప్రత్యేక సమావేశములో, సెక్షను 138 లేక సెక్షను 139 క్రింద నంతకు మున్నే విధింపబడిన ఏదైన పన్నును రద్దుచేయుటను లేక దాని రేటు మార్పును ప్రతిపాదించు నొక తీర్మానమును ఆమోదింపవచ్చును;

(2) అట్టి ఏ ప్రతిపాదనయైన, క్రొత్తపన్నును విధించుటకు సెక్షను 140 లో విధింపబడిన విధానము ననుసరించి నిర్వహింపబడవలయును మరియు అట్టి రద్దు లేక మార్పు ఈ శాసనాదేశముల ననుసరించి నిర్వహింపబడవలయును మరియు అట్టి రద్దు లేక మార్పు ఈ శాసనాదేశముల ననుసరించి యొనర్పబడినది దనుటకు ఈ శాసనము క్రింద పన్ను రద్దు లేక మార్పు ప్రకటన నిష్కర్షక మగు నిదర్శనము కాగలదు.

(3) సెక్షను 140లో, లేక ఈ సెక్షనులోనేమి యున్నప్పటికిని, ఒక పన్నును రద్దు చేయుటకు లేక దాని మొత్తము లేక రేటును తగ్గించుటను, లేక అట్టి తగ్గింపు మొత్తమును మార్చుటకు లేక రద్దును మారుగా నొక తగ్గింపును విధించుటకు పెట్టబడిన ప్రతిపాదనను అప్రతిపాదనను ఇంకను విచారించుటకు

తిరిగి పంచాయతీ సమితినకు పంపుట ద్వారా లేక అట్లు పంపించకయే నిరాకరించుటకు ప్రభుత్వమునకు అధికారము కలదు.

142. పన్నులను తాత్కాలికముగ ఆపు లేక వానినుండి మినహాయించు విధానము :

ఒక పంచాయతీ సమితిముందు ప్రభుత్వపు మంజూరీతో మరియు నొక ప్రత్యేక సమావేశములో సభ్యులు మొత్తము సంఖ్యలో 2/3 వంతు సంఖ్యాకులచే నామోదింపబడిన యొక తీర్మానముచే, సెక్షను 138 లేక 139 క్రింద విధింపబడిన ఏదైన పన్నును తన యధికారములోగల ప్రదేశములో యే భాగములోనైన నిర్దిష్ట పరుపబడిన యేదైన వ్యవధివరకు, అమలులో లేకుండ ఆపివేయవచ్చును లేక పూర్తిగా లేక కొంతవరకు అట్టి ఏదైన పన్ను చెల్లింపు నుండి ఏ వ్యక్తినైన లేక వ్యక్తుల వర్గమునైన, లేక ఏదైన ఆస్తిని లేక ఆస్తి రకమును వినాయింప వచ్చును.

143. (1) కొన్ని స్థలములను మరియు కట్టడములను ఉపయోగించుకొనుటకు మరియు లైసెన్సులకు రుసుమును వసూలు చేయుటకు అధికారము :

(1) ఈ శాసనము క్రింద నేదైన లైసెన్సు, ఒక పంచాయతీ సమితిని అనుగ్రహింపబడుచో ఆ పంచాయతీ సమితిచే సాధారణముగా లేక ప్రత్యేకముగా నిందులకుగాను అధికారమివ్వబడిన పంచాయతీ సమితి లేక ఏ వ్యక్తియైన అట్టి లైసెన్సు కొరకు ఒక రుసుమును వసూలు చేయవచ్చును.

(2) పంచాయతీ సమితి లేక నిందులకుగాను దానిచే సాధారణముగా లేక ప్రత్యేకముగా అధికార మివ్వబడిన యొక వ్యక్తి ఈ శాసనము క్రింద సంఘ నియమము (బై-లా) లచే నిర్ణయింప బడునట్టి రుసుమును పంచాయతీ సమితికి జెందిన లేక దాని నియంత్రణలోనున్న యేదైన కట్టడము లేక స్థలమును ఉపయోగించుకొని నందులకు వసూలు చేయవచ్చును.

## పన్నుల నిర్ణయము

144 భోగట్టాను అడుగుటకు అధికారము :

ఒక పంచాయతీసమితి లేక నిందులకుగాను దానిచే అధికార మివ్వబడిన యే అధికారియైన, నోటీసుద్వారా, తన యధికారములో నున్న ప్రదేశములోని యే నివాసి నైన, సహేతుకమగు వ్యవధిలో ఈ క్రిందవానిని తెలిసి కొనుటకు అవసరమగునట్టి సమాచారము నిచ్చుటకు పిలువ వచ్చును,

(ఏ) ఈ శాసనము క్రింద విధింపబడిన ఏదైన పన్నును అట్టి నివాసి చెల్లింప బాధ్యుడగునేమో, మరియు

(బి) అతనిపై విధింపబడదగు పన్ను మొత్తము.

145. సమూనాలోని లోపము వలన పన్ను నిర్ణయము అప్రమాణముగా నుండదు :

ఈ శాసనము యొక్క అధికారము క్రింద నొనర్పబడిన ఏదైన సెస్సు, పన్ను, టోలు, లేక రుసుము యొక్క పన్ను నిర్ణయ మెద్దియైన చార్జీ లేక డిమాండైన యేదైన వ్రాతతప్పు, లేక నమూనాయొక్క యితర లోపము కారణముగా అప్రమాణముగా నుండదు, మరియు పన్నును, టోలును లేక రుసుమును నిర్ణయించుట కేదైన యొక అర్జై వర్ణింపబడినప్పుడు సాధారణముగా తెలియునట్టి విధమును వర్ణించిన జాలును, మరియు యజమానిని లేక యధివాసిని పేర్కొన నక్కరలేదు.

146. ఇతర చర్యలకు అటంకము :

ఏదైన విలువ నిర్ణయమునకు, లేక వసూలునకు యెట్టి ఆక్షేపణయును ఉండరాదు; లేక పన్ను నిర్ణయ మొనర్పబడు లేక పన్ను విధి ఆపబడుట ఎవరైన వ్యక్తియొక్క బాధ్యత ఈ శాసనములో నాదేశింపబడిన రీతిగా గాక మరియొక విధముగా లేక యింకే యితర అధికారిచేతనైన యాక్షేపింపబడరాదు.

## అధ్యాయము 10

## పన్నుల వసూలు

147. పన్నుల మొత్తమునకై బిల్లునిచ్చుట :

(1) ఏదైన మొత్తము. ఏది (ఎ) ఈ శాసనము యొక్క ఏదేని షరతుచే లేక దాని ననుసరించి, ఈ అధ్యాయముద్వారా విధింపబడిన విధానమున వసూలు చేయబడదగినదిగా ప్రకటించబడినదో, లేక (బి) సుంకము (టోల్) కారణముగా డిమాండుపై చెల్లించబడదగి యుండకుండి, ఆ జిల్లాలో విధింపబడిన ఏదేని పన్ను కారణముగా మొత్తముగానైనను కిస్తుగానైనను అభ్యర్థింపదగియున్నదో, అది బాకీపడియుండగల సమయమున.

పంచాయతీ సమితి సాధ్యమైనంతవరకు ఏ మాత్రము ఆలస్యములేకుండ దాని చెల్లింపునకు బద్ధుడైన వ్యక్తికి బాకీగా అభ్యర్థింపబడిన మొత్తమునకై ఒకబిల్లు నిప్పింపగలదు.

(2) అట్టి ప్రతి బిల్లు యొక్క వివరణములు.

(ఎ) దేనికై ఆ మొత్తము డిమాండు చేయబడినదో అట్టి వ్యవధిని; మరియు (బి) దేనికి సంబంధించి ఆ మొత్తము అభ్యర్థింపబడినదో అట్టి యాస్తిని, వృత్తిని లేక వస్తువును నిర్దిష్ట పరుపగలదు; మరియు

(i) చెల్లింపక తప్పిన పక్షమున కలిగెడి బాధ్యత యొక్కయు మరియు

(ii) అట్టి అభ్యర్థనకు వ్యతిరేకముగా సెక్షను 156లో విధింపబడిన ప్రకారము ఏదేని లోగా అప్పీలు తెచ్చుకోనగునో అట్టి కాలముయొక్కయు; సూచనకూడ ఇయ్యగలదు.

(3) ముప్పది దినములలోగా బిల్లు చెల్లింపబడనిచో, డిమాంటు నోటీసు జారీ చేయుట-దేనికోసమై పైన చెప్పిన ప్రకారము ఏదేని బిల్లు ఇయ్యబడినదో అట్టి మొత్తము, అది ఇయ్యబడి నప్పటినుండి ముప్పది రోజులలోగా పంచాయతీ సమితి కార్యాలయములోగాని అందు నిమిత్తమై అట్టి చెల్లింపులను పొందుటకై పంచాయతీ సమితి అధికారమీయబడిన వ్యక్తిగాని చెల్లింపబడనిచో సదరు మొత్తముయొక్క చెల్లింపునకు బాధ్యుడైన వ్యక్తికి అనుసూచి "ఎ" యొక్క నమూనాలో ఒక డిమాండు నోటీసును గాని అటువంటి ఫలితమిచ్చునట్టి దానినిగాని, పంచాయతీ సమితి. అందజేయింప వచ్చును.

148. ఏ సందర్భములో వారంటు జారీ చేయవచ్చును:

సదరు మొత్తముయొక్క చెల్లింపునకు బాధ్యుడైన వ్యక్తి అట్టి డిమాండు నోటీసు జారీ చేయబడినప్పటి నుండి ముప్పది రోజులలోగా,

(ఎ) నోటీసులో డిమాండు చేయబడిన మొత్తమును చెల్లింపకున్ననైనను, లేక,

(బి) దాని నాతడెందుకు చెల్లింపగూడదో, పంచాయతీ సమితి యొక్కగాని ఇందు నిమిత్తమై పంచాయతీ సమితి నియమించునగునట్టి అధికారి యొక్కగాని, సంతృప్తి, మేరకు, కారణము, చూపకున్ననైనను, లేక

(సి) ఆ డిమాండునకు వ్యతిరేకముగా సెక్షను 156 యొక్క షరతుల కనుగుణముగా అపీలు తేకున్ననైనను, షెడ్యూలు "బి" యొక్క నమూనాలో పంచాయతీ సమితిచే జారీ చేయింపబడినట్టియు, తప్పినట్టి వాని యొక్క చరాస్తిని జప్తుచేసి విక్రయించునట్టియు, వారంటునుగాని అటువంటి ఫలితమిచ్చునట్టి దానినిగాని అనుసరించి, వసూలు చేయుట కొరకైన సకల పరివ్యయములతోగూడి అట్టి మొత్తము విధింపబడవచ్చును.

149. ఎవరిచే ఆజ్ఞాపత్రము (వారంటు) సంతకము చేయబడవలెను:

సెక్షను 148 ననుసరించి జారీచేయబడిన ప్రతి వారంటు దానిని జారీ చేయించిన పంచాయతీ సమితియొక్క అధ్యక్షునిచే గాని ఈ అవసరమునకై పంచాయతీ సమితిచే నియమింపబడిన అధికారిచేగాని ప్రభుత్వ ఆమోదముతో ప్రభుత్వాధికారిచేగాని సంతకము చేయబడగలదు.

150. వారంటు ఎవరికి వ్రాసి పంపవలెను :

ఆ ఆస్తి ఆ జిల్లాలో నున్నప్పుడు, వారంటు ఆ పంచాయతీ సమితి యొక్క అధికారికిగాని ప్రభుత్వ ఆమోదముతో ప్రభుత్వాధికారికిగాని వ్రాసి పంపగలదు.

అయితే అట్టి అధ్యక్షుడు అట్టివారంటును క్రింది అధికారికిగాని ప్రభుత్వము ఆమోదతో ప్రభుత్వాధికారికిగాని వ్రాయవచ్చును. ఆ ఆస్తి హైదరాబాదు నగరమందున్నచో, ఆజ్ఞాపత్రము (వారంటు) హైదరాబాదు స్మాల్‌కాజ్ కోర్టునకు వ్రాసి పంపబడగలదు; అయితే సదరు న్యాయాలయము, అట్టి వారంటును క్రింది అధికారికి వ్రాయవచ్చును.

151. ప్రత్యేకాజ్ఞ క్రింద, ప్రవేశాధికారము :

అంగీకార సూచకమగు నుల్లేఖనముద్వారా లేక మరియొక విధముగా వారంటు పంపబడిన యేయధికారియైన, ఆ యాజ్ఞాపత్రములో నింటులకు గాను తనకు అధికారమిచ్చు నొకప్రత్యేకాజ్ఞ యున్నచో కాని మరియొకవిధముగా కాకుండ, ఆక కట్టడములో నా యాజ్ఞా పత్రము క్రింద వశపరచుకొనదగు ఆస్తి కలదని నమ్ముటకు దగుకారణము లాతనికున్నచో మరియు తన యధికారము లను మరియు పనిని దెలిపి సక్రమముగా ప్రవేశమును కోరిన పిదప నింకొక రీతిగా నాతడు ప్రవేశింపలేనిచో, ఆ యాజ్ఞా పత్రములో నిర్దేశింపబడిన జప్తును సలుపుటకు సూర్యోదయాస్తమయముల నడుమ నెపుడైన యట్టి కట్టడము యొక్క యేదైన బయటి లేక లోపలి తలు

పును లేక కిటికీని పగులగొట్టి తెరవవచ్చును; కాని, అట్టి అధికారి తన యుద్దేశ్యమును గూర్చి తగు సూచన నిచ్చి యందలి స్త్రీలు వెడలి పోవుట కవకాశ మిచ్చుదనుక, స్త్రీల కొరకుంచబడిన యేదైన గదిని ప్రవేశింపరాదు లేక దాని తలుపును పగులగొట్టి తెరవరాదను షరతు గలదు.

152. వారంటు యెట్లు అమలు పరచబడవలసినదియు :

అట్టి అధికారి ఆ వారంటులో ఆజ్ఞోల్లంఘన మొనర్చినవాడుగా పేర్కొనబడిన వ్యక్తియొక్క యేదైన చరాస్తిని, అది ఎచట కనబడినను, యీక్రింది షరతులకు, ప్రత్యేకతలకు, మరియు మినహాయింపులకును లోబడి జప్తు చేయవచ్చును.

(ఏ) ఈ క్రింది ఆస్తి జప్తు చేయబడరాదు:—

(i) ఆజ్ఞోల్లంఘనుని, ఆతని భార్య మరియు సంతానముయొక్క అవసరమగు దుస్తులు, వంటపాత్రలు, పరుపులు మరియు మతాచారము ననుసరించి యేస్త్రీయైన విడచి యుండదగునట్టి వ్యక్తిగతా భరణములు; (ii) పనివాండ్ర పరికరములు, మరియు (iii) నేరస్థుడొక వ్యవసాయదారుడగుచో, ఆతని వ్యవసాయ సాధనములు, విత్తులు మరియు నాతని జీవనోపాధిని సంపాదించుకొనుట కవసరమగునట్టి పశువులను;

(బి) జప్తు విపరీతముగా నుండరాదు-అనగా, జప్తు చేయబడిన ఆస్తియొక్క విలువ వారంటు క్రింద వసూలు చేయబడవలసిన మొత్తమునకు సాధ్యమగునంత సమానముగా నుండవలయును. మరియు సెక్షను 149 చే లేక క్రింద. నొక వారంటును సంతకమొనర్చుట కధీకృతుడైన యొక వ్యక్తి, యట్లు జప్తు చేయబడరాదని యభిప్రాయపడు నేవైనవస్తువులు వెంటనే వాపసు చేయబడవలయును; మరియు

(సి) ఆ అధికారి, ఆస్తిని వశపరచుకొనిన మీదట వెంటనే దానికొక జాబితాను తయారు చేయవలయును. మరియు దానిని గొనిపోవుటకు ముందు వశపరచుకొను సమయమున దానిని యధీనముగల వ్యక్తికి, నోటీసులో నిర్దిష్ట పరుపబడురీతిగా పై యాస్తి విక్రయింపబడునని షెడ్యూలు సి, సమూనా (ఫారము)లో, లిఖితపూర్వకమగు నొక సూచనా పత్రము నొసగవలయును;

అయితే ఆ యాస్తి జప్తు చేయబడిన పిదప నది విక్రయింపబడుటకు ముందు నేరస్తుడు బాకీయున్న మొత్తము, ఆ నోటీసు, మరియు ఆస్తి జప్తునకు సంబంధించిన యన్ని ఖర్చులతో గూడ చెల్లింపబడినచో, ఆ యధికారి యా జప్తును యెత్తివేయవలయును.

153. జప్తు చేయబడిన సరకు అమ్మకము :

(1) వశపరచుకొనబడిన ఆస్తి శీఘ్ర మరియు సహజ శిథిల స్థితిలో నుండుచో లేక దానిని జాగ్రత్త పరచుటకగు ఖర్చు విధింపదగు మొత్తముతో గూడ దాని విలువను మించినట్లుండుచో అధ్యక్షుడు, లేక ఆ వారంటున సంతక మొనర్చిన అధికారి, వశపరచు కొనబడినపుడా యాస్తిని తన యధీనములోగల వ్యక్తికి అది తక్షణము విక్రయింపబడునని సూచన నొసగి ఆ వారంటులో పేర్కొనబడిన మొత్తము వెంటనే చెల్లింపబడక పోయినచో, తదనుసరణముగా దానిని అమ్మి వేయవలయును.

(2) అమ్మకపుసొమ్మును దేనికి వర్తింప జేయవలసినదియు (1) సబ్ సెక్షను క్రింద వెంటనే విక్రయింపనిచో, వశపరచుకొనబడిన ఆస్తిలేక అందు చాలునంత భాగము, వారంటును సంతకమొనర్చిన అధికారి దానిని అంకిత మొనర్చిననే దక్క, లేక నేరస్తుడు బాకీయున్న మొత్తము, నోటీసు, వారంటు, జప్తు మరియు ఆ యాస్తిని జాగ్రత్త జేసినందులకు సంబంధించియున్న ఖర్చులతోగూడ చెల్లింపబడిననే దక్క వారంటును అమలుపరచు అధికారిచే జారీ చేయ బడిన నోటీసులో నిర్దిష్టపరుపబడిన వ్యవధి గడచిన పిదప, పంచాయతీ సమితి ఉత్తరువులపై బహిరంగ వేలములో విక్రయింపబడవలయును. మరియు నా అమ్మకపు సొమ్ము లేక నందలి అవసరమగు నంత భాగము బాకీ మొత్తమును దానికి సంబంధించినట్టి పైఖర్చులన్నిటిని తీర్చుటకు వర్తింపచేయబడ వలయును.

(3) మిగులు ఉన్నచో ఎట్లు వ్యవహరింప వలసినదియు; మిగులు, యేదైన యున్నచో; వెంటనే పంచాయతీసమితి నిధికి జమ కట్టబడి, అప్పుడే, యెవరి యధీనమునుండి యా యాస్తి గైకొనబడినదో యా వ్యక్తికట్టి జమను గూర్చి సూచన నొసగవలయును కాని, ఆ సూచన తేదీనుండి యొక సంవత్స రములోపల, పంచాయతీ సమితికి లిఖిత పూర్వకమగు అర్జీద్వారా నది కోర బడినచో, అట్టి వ్యక్తికది వాపసు చేయబడవలయును. అట్టి సూచన తేదీనుండి యొక సంవత్సరములోపల కోరబడని యేదైన మొత్తము పంచాయతీ సమితి యొక్క యాస్తి కాగలదు.

154. బ్లాకు వెలుపల జప్తు మరియు అమ్మకము :

వారంటు బ్లాకు వెలుపలకు పంపబడవలసి యున్నచో, దానిని జారీచేయు ఆధికారి, దానిపై నుల్లేఖనము ద్వారా ఆ వారంటును గ్రహించవలసిన అధ్యక్షుని లేక న్యాయాలయమును, జప్తు చేయబడిన ఆస్తిని విక్రయింప నిర్దేశింపవచ్చును. మరియు అట్టి సందర్భములో అట్టి అధ్యక్షుడు లేక న్యాయాలయము ఆ యాస్తిని అమ్మటయు ఆ అమ్మకమునకు సంబంధించిన యన్నింటిని జేయుటయును న్యాయశాస్త్ర సమ్మతమే యగును. మరియు పై యాదేశములు తదనుసరణముగా మార్పు జేయబడును. అట్టి అధ్యక్షుడు లేక న్యాయాలయము ఆ వారంటుక్రింద వసూలు చేయబడిన మొత్తమును తగిలిన వసూలు ఖర్చుల నన్నింటిని మినహాయించి, ఆ వారంటు జారీచేసిన యధికారికి పంపవలయును.

155. వసూలు చేయదగు రుసుములు మరియు ఖర్చులు :

(ఎ) సెక్షను 147 యొక్క సబ్‌సెక్షను (3) క్రింద జారీ చేయబడిన ప్రతి నోటీసుకు రుసుములు; (బి) సెక్షను 152 క్రింద నొనర్పబడిన ప్రతి జప్తునకు రుసుములు మరియు పై సెక్షను క్రింద వశపరచుకొనబడిన యేవైన పశువులను పోషించుటకగు ఖర్చులును; (సి) ఇందులకుగాను యొనర్పబడిన నియమములో ఆ యా పనులకు నిర్ణయింపబడిన రేట్ల ప్రకారము వసూలు చేయబడి, సెక్షను 148 క్రింద విధింపదగు వసూలు ఖర్చులతో చేర్చబడ వలయును.

156. మున్సబు-మేజిస్ట్రేటునకు ఉపర్యభియోగనులు :

(1) సెక్షను 147 యొక్క సబ్‌సెక్షన్ (3) క్రింద జారీచేయబడిన డిమాండు నోటీసుపై కోరబడిన మొత్తమునకు సంబంధించిన ఆస్తి, లేక నివాసము, లేక వస్తువును తన యధికారములోగల మున్సబు మేజిస్ట్రేటునకాక అపీలు కొనర్చుకొనవచ్చును. కాని అట్టి యే అప్పీలును యీ క్రిందివిధముగా నుండిననే దక్క, శ్రవణ మొనర్పబడి తీర్పుయొపర్పబడరాదు.

(ఎ) ఫిర్యాదు చేయబడిన డిమాండు నోటీసును అందజేయబడిన పిదప తరువాత పదునైదు దినములలో ఆ అపీలు చేయబడిననే దక్క; (బి) సెక్షను 147 యొక్క సెక్షను (1) క్రింద నొక లెక్క చీటీ (బిల్లు) యిచ్చిన పిదప తరువాత పదునైదు దినములలోగా, పంచాయతీ సమితి.

యొక్క ప్రతిపాదన వివాదాస్పదమైన కారణములను దెల్పుచు లిఖిత పూర్వకముగా నొక యర్జీ దాఖలు చేయబడిననే దక్క: మరియ (బి) అపీలుదారు కడనుండి కోరబడిన మొత్తము అతనిచే పంచాయతీ సమితి కార్యాలయములలో నిల్వ యుంచబడిననే దక్క.

(2) మున్సబు:— మేజిస్ట్రేటు యొక్క తీర్పుపై రెండవ అపీలు అవకాశములేదు, కాని యాతని తీర్పు హైకోర్టుయొక్క పునః పరిశీలనమునకు లోబడియుండును.

157. పన్ను కై భూములు, కట్టడములు, మొదలగు వాని బాధ్యత:

భూములపై లేక కట్టడములపై లేక రెండింటిపైని విధింపబడిన యేదైన బాకీయున్న అన్ని మొత్తములను, ఉన్నచో: దానిపై బాకీయున్న భూమిశిస్తు మొదటి చెల్లింపునకులోబడిన, అట్టిపన్ను దేని విషయమున విధింపబడవలయునో ఆ కట్టడము లేక భూమిపై, మరియు ఉన్నచో, నట్టి కట్టడము లేక భూమి లోపల లేక పైన గనబడు మరియు నట్టిపన్నును చెల్లింప బాధ్యుడగు వ్యక్తికి జెందిన చరాస్తిపై యన్ని అప్పులకంటె ముందుగ వసూలు చేసుకొననివ్వదగు బాధ్యత గలదు.

అయితే, అట్టి ఏదైన పన్ను బాకీ, అది ఒక సంవత్సరముకంటె ఎక్కువ కాలమునుండి రావలసియున్నచో లేక నొక యధివాసి యందు నివసింపని యవధికి రావలసియున్నచో, యజమానిగాకుండా యధివాసి కడనుండి వసూలు చేయబడరాదు.

158. దారి పన్ను (టోలు)ను చెల్లింపనిచో పశువులను, సరుకును లేక వాహనములను వశపరచుకొను అధికారము:

ఒక పంచాయతీ సమితిచే విధింప బడదగు నేదైన దారిపన్ను (టోలు) ను చెల్లింపని సందర్భములో అట్టి "టోలు"ను వసూలు చేయుటకును నియమింపబడిన వ్యక్తి ఆ "టోలు"ను విధింపదగు నేదైన వాహనమును లేక పశువును లేక ఆబాకీకి సరిపోవు విలువగల, దానిపైనున్న సరుకులో నేభాగము నైన వశపరచుకొని, నిలిపివేయవచ్చును. అతడటుపైని వశపరచుకొనబడిన యాస్తిని తన యధీనములో గల వ్యక్తికి, ఆ యాస్తి జాబితాను, మరియు సూచనాపత్రములో నిర్దిష్టపరుపబడు రీతిని పై యాస్తి విక్రయింపబడునని తెలుపుచు షెడ్యూలు "సి" నమూనాలో లిఖిత పూర్వకముగా నొక నోటీసును యివ్వవలయును,

(2) వశపరచుకొనబడిన ఆస్తిని తోడనే అమ్మే అధికారము: వశపరచుకొనబడిన యేదైన వస్తువు శీఘ్ర మరియు సహజ శిధిలమును జెందునదగుచో లేక దానిని యుంచుటకగు ఖర్చు విధింపబడదగు "టోలు" మొత్తములోగూడ దాని విలువను మించుచో: అట్టి వస్తువును వశపరచుకొనువ్యక్తి అది తోడనే విక్రయింప బడునని దానిని తన యధీనమందుగల వ్యక్తితో జెప్పి కోరబడిన "టోలు" మొత్తము తక్షణము చెల్లింపబడనిచో, నట్లే దానిని విక్రయంపవచ్చును లేక విక్రయింప బడజేయవచ్చును.

(3) చెల్లింప జేసిన పిదప ఆస్తివిడుదల: అమ్మకము పూర్తియగుటకు ముందెప్పుడైన, తన యాస్తి అట్లు వశపరచుకొనబడిన వ్యక్తి, తగిలిన యన్ని ఖర్చుల, మరియు "టోలు" మొత్తమును దాఖలు చేయుచో వశపరచుకొనబడిన యాస్తి వెంటనే విడుదల చేయబడవలయును.

(4) విక్రయము: అట్లెద్దియును దాఖలు చేయబడినచో ఆ యాస్తి విక్రయింపబడవచ్చును. మరియు అట్టి అమ్మకపు మొత్తము, అట్టిటోలును మరియు వశపరచుకొనుటకు ఉంచుటకు మరియు అమ్మకమునకైన ఖర్చులను తీర్చుటకు వినియోగపరుప బడవలయును.

(5) మిగులు నెట్లు వినియోగింప వలసినదియు: మిగులు ఉన్నచో, అమ్మకము మొత్తములో మిగిలినది పంచాయతీ సమితి నిధికి జమకట్టబడవలయును, మరియు ఆ అమ్మకమునకు పిదప, తరువాత మూడు సంవత్సరములలో దాని నివ్వవలయునని పంచాయతీ సమితికి లిఖితపూర్వకమగు నొక యర్జీ పెట్టబడినమీదట; వశపరచుకొనబడినపుడా యాస్తిని తన యధీనములోగల వ్యక్తికది చెల్లింపబడవచ్చును, మరియు; అట్టి యే యర్జీయును పెట్టబడకపోయినచో అది పంచాయతీ సమితియొక్క ఆస్తి కాగలదు.

159. టోలులను ఏర్పరచుట:

(1) పంచాయతీ సమితి; ఈ శాసనము క్రింద విధింపదగు నేదైన "టోలు" విధింపును బహిరంగ వేలము లేక వేరు ఒడంబడిక ద్వారా గుత్తకీయవచ్చును.

అయితే, గుత్తదారు, ఆ గుత్త షరతులను క్రమముగా నిర్వర్తించుటకు హామీ నియ్యవలయును.

(2) గుత్తదారునిచే నియమింపబడిన వ్యక్తి వశపరచుకొను అధికారమును గలిగియుండుట: ఎదైన "టోలు" యీ సెక్షను క్రింద గుత్తకివ్వబడినచో, అట్టి "టోలు"ను వసూలు చేయుటకు గుత్తదారుచే నియమింప బడిన

యే వ్యక్తియైన గుత్తషరతులకు లోబడి, సెక్షను 159 యొక్క సబ్ సెక్షనులు (1) మరియు (2) లో దెలుపబడిన యధికారములను గలిగి యుండును.

అయితే. వశపరచుకొనబడిన వస్తువెద్దియును, పంచాయతీ సమితి యొక్క యాజ్ఞంపై దక్క విక్రయింపబడరాదు.

(3) ఈ సెక్షను క్రింద గుత్తకివ్వబడిన యేదైన "టోలు" విషయమున గుత్తదారుకడనుంచి పంచాయతీ సమితికి రావలసిన యేదైన మొత్తము, భూమి శిస్తు బకాయి యైనట్లు వసూలు చేయబడవలయును.

160. అన్ని చెల్లింపులకును రశీదులు యివ్వబడవలయును :

ఈ శాసనము క్రింద యేదైన పన్నుక్రింద చెల్లింపబడిన యన్ని మొత్తములకును, ఆ మొత్తమును మరియు నది యే పన్నుక్రింద చెల్లింపబడి నదియు దెలుపు నొక రశీదు, ఆ మొత్తమును గైకొను వ్యక్తిచే నివ్వబడ వలయును.

161. పన్నుల బకాయీల మరియు నితరబాకీల వసూలు :

ఈ శాసనముచే నామోదింపబడిన యింకే ఇతర విధమగు వసూలు పద్ధతి యున్నప్పటికిని ఏదైన పన్నుయొక్క ఏదైన బకాయీ, లేక పంచాయతీ సమితి కీ శాసనము క్రింద, రావలసిన ఇంకే యితరసొమ్మైన మరియు ఈ శాసనము క్రింద లేక దాని క్రింద నొనర్పబడిన, నియమముల క్రింద లేక సంఘ నియమముల క్రింద విధింపబడిన జరిమానా యీ శాసనము క్రింద నొనర్పబడిన నియమములచే నిర్ణయింపబడు సమనుల ఖర్చుకై చెల్లింపవలసిన ఏదైన మొత్తముతోను, మరియు నూటికి సంవత్సరమునకు ఆరుంబాను రేటు చొప్పున వడ్డీతో గూడ, పంచాయతీ సమితి అర్జీపై అదియొక భూమిశిస్తు బకాయిగాకూడ వసూలు చేయబడవలయును.

అయితే, సమర్ధుడగు రెవిన్యూ అధికారి, పుస్తకము నెక్కించదగు కారణముల వలన ఏదైన సందర్భమున వడ్డీని వసూలు చేయుట అయుక్తమని అభిప్రాయపడిన ఏ వడ్డీయును ఆ విధముగా వసూలు చేయబడరాదు.

162. వసూలు చర్యలకు కాల దోషము.

ఒక పంచాయతీ సమితికి ఈ శాసనముయొక్క సెక్షను 138 మరియు 139 క్రింద బాకీయున్న ఏదైన మొత్తములను వసూలు చేయుటకు అట్టి మొత్తములు బాకీ పడిన తేదీనుంచి ఆరు సంవత్సరములు గడచిన పిదప నెట్టి జప్తుయును సలుపబడ రాదు, ఆరు సంవత్సరముల వ్యవధి కడచిన పిదప మూడు సంవత్సరములలోగా అట్టి మొత్తములను రాబట్టుటకు పంచాయతీ సమితి ఒక దావాసు దాఖలు చేయవచ్చును.

163. ముదరాలు (**Refunds**):-

ఈ శాసనముయొక్క, మరియు దానిక్రింద నొనర్చబడిన నియమముల యొక్క, షరతుల ననుసరించి కాక మరి యొక విధముగానే వ్యక్తి చేనైన ఏదైన పన్ను ముదరా కోరబడరాదు.

164 నుండి 177 వదలబడినవి

## అధ్యాయము - 11

## బోర్డు అధికారులు, ఉద్యోగులు

178. ప్రభుత్వముచే లేక ఇతర అధికారులచే జారీచేయబడిన ఉత్తరవులను అమలులోనికి తెచ్చుటకు ప్రభుత్వాధికారము:

ఈ శాసనము లేక ప్రస్తుతము అమలులోనున్న నే యితర చట్టముతో సంబంధముగల అన్ని వ్యవహారములలో పంచాయతీ సమితి జిల్లా పరిషత్తు ప్రభుత్వముచే లేక పంచాయతీ సమితి జిల్లా పరిషత్తులకంటె యితరమగు నే అధికార వర్గముచే నొసగబడిన ఆజ్ఞను నెరవేర్చుటలో, ఈ శాసము లేక దాని క్రింద నొనర్చబడిన నియమముచే లేక ప్రస్తుతము అమలులోనున్న నే యితర చట్టముచే నొసగబడిన అధికారముల చలాయించుటలో తప్పు చేసినచో ఒక పంచాయతీ సమితి జిల్లా పరిషత్‌కు నష్టముగా నుండునట్టి ఉత్తరువును అమలు పరచుట కవసరమైన సకలాధికారములు ప్రభుత్వము కలిగియుండును.

179. పంచాయితీ సమితుల, జిలా పరిషత్‌ల మరియు స్థానిక సంస్థల మధ్య వివాదము :

(1) ఒక పంచాయతీ సమితి జిల్లా పరిషత్‌కు లేక ఏ యితర పంచాయతీ సమితుల జిల్లా పరిషత్‌ల లేక స్థానిక సంస్థల మధ్య అవి సమిష్టిగా ఆర్థిక సంబంధముగల వ్యవహారమున కలుగు యే వివాదము సందర్భములోనైన, ప్రభుత్వమునకు దేని తీర్పు అంతిమముగా నుండ గలదో, పరిష్కారమునకై అట్టి వివాదము పంపబడగలదు.

(2) ఏదైన ఉత్తరువు లేక ఈ శాసనముక్రింద చేయబడిన నియమములద్వారా పంచాయతీ సమితి జిల్లా పరిషత్ మరియు యితర స్థానికసంస్థల మధ్య, అవి సమిష్టిగా ఆర్థిక సంబంధముగల సదరు వ్యవహారములలో సంబంధముల ప్రభుత్వము క్రమబద్ధ మొనర్పవచ్చును.

180, వదల బడినది,

181, ప్రభుత్వముచే అప్పగించబడు అధికారములు:

ప్రభుత్వము ప్రకటనద్వారా రూల్సుచేయు అధికారము దప్ప, ఈ

శాసనము క్రింద అన్ని లేక వానిలో కొన్ని అధికారములు అవి అర్హమని తలంచు ఏ అధికార వర్గమునకైన అప్పగించ వచ్చును.

182. రివెన్యూ అధికారుల కంట్రోలు :

దానియందు మరొక విధముగా విధించబడిన దప్ప. ఈ శాసనము లేక దానిక్రింద నొనర్చబడిన నియమములతో సంబంధముగల సకల వ్యవహారములలో ప్రభుత్వము, కలెక్టరు మరియు డిప్యూటీ కలెక్టరులపై మరియు కలెక్టరులు వారి క్రింది అధికారులపై సాధారణము మరియు చలాయించు ప్రకారము కంట్రోలు కలిగి యుండును.

## అధ్యాయము 13

## నోటీసులు, అపీళ్ళు మరియు అపరాధములకు సంబంధించిన కార్యవాహి

183. వ్యక్తుల పేరిట నోటీసులు మొదలైనవి జారీచేయుట :

ఈ శాసనము ననుసరించి, ఎవరైన వ్యక్తిపై లేక ఆ పేరుతో వ్రాయబడిన ఎవరైన వ్యక్తి ప్రతి నోటీసు, బిల్లు జారీచేయుటపైన, ఈ శాసనమునందు ప్రత్యేకముగా గాక మరొకవిధముగా విధింపబడిన అన్ని సందర్భములలో పంచాయతీ సమితి జిల్లా పరిషత్ లేక అధికారిచే లేక ఉద్యోగిచే లేక ఈ విషయమున పంచాయతీ సమితి జిల్లా పరిషత్‌చే అధికృతుడైన ఏ ఇతర వ్యక్తిచే లేక ఒప్పుకొనబడు షరతులపై, క్రింద పేర్కొన్న ప్రకారం ప్రభుత్వము యొక్క ఎవరైన అధికారి లేక ఉద్యోగిచే అమలు జరిపింపబడ గలదు.

(ఎ) జారీని అంగీకరించుటకు అధీకృతుడగు ప్రతినిధి అతనికుండిన తప్ప. ఆచరణయోగ్యమైన ఏదైన సందర్భమున, ఆవ్యక్తికి ఎవరిపేర వ్రాయబడిన నోటీసు లేక బిల్లు వ్యక్తిగతముగా అందజేయుట లేక అర్పించుటద్వారా జారీచేయబడ గలదు

(బి) అట్టి వ్యక్తి దొరకని మరియు అతని పక్షమున జారీని అంగీకరించుటకు ఏ ఏజంటు అధికారమియ్యబడని అతనితో నివసించుచున్న అతని కుటుంబములోని ఎవడైన మేజరు పురుషునిపై జారీ చేయబడవచ్చును.

వివరణ : పైక్లాజు ప్రకారము నౌకరు కుటుంబపు సభ్యుడుకాడు.

(సి) జారీచేయు అధికారి వ్యక్తిగతముగా అట్టి వ్యక్తికి లేక అతని పక్షమున ఏజంటుకు లేక యితర వ్యక్తికి నోటీసును లేక బిల్లును అందజేసిన లేక అర్పించిన సందర్భమున అతడు అది అందజేయబడిన లేక అర్పింపబడిన, జారీ రసీదుకు సంబంధించి యొక్క సంతకమును కోరగలడు.

(డి) అట్టి వ్యక్తి లేక అతని ఏజంటు లేక పైన చెప్పబడినట్టి యితర వ్యక్తి రసీదుపై సంతకము పెట్టుటకు నిరాకరించిన సందర్భమున లేదా జారీ చేయు అధికారి, తగిన మరియు సహేతుక శ్రద్ధనుపయోగించిన పిదప అట్టి వ్యక్తిని కనుగొనజాలక పోయినచో మరియు అతని పక్షమున జారీని స్వీకరించు అధికారముగల ఎట్టి ఏజంటు లేకుండిన, జారీ చేయబడజాలు ఎవరైన యితర వ్యక్తి లేకుండిన చేయు అధికారి, ఎవనివల్ల ఆ ఇల్లు గుర్తింపబడినదో మరియు ఎవని యెదుట ఆ ప్రతి అంటింపబడినదో అట్టివ్యక్తి (ఎవరైన వున్నచో) అతని పేరును చిరునామాయును దెలుపుచు దానిపై స్పష్ట మొనర్ప బడిన లేక దానికి అనుబంధింపబడినట్టి నివేదికతోబాటు తిరిగి పంపగలడు.

(యి) జారీచేయు నధికారి, క్లాజు (సి) ననుసరించి జారీచేయబడిన సందర్భములన్నిటి యందును, అది ఎప్పుడు జారీచేయబడినది ఆ నోటీసు లేక బిల్లు అతడు సాధారణముగా నివసించు లేక వ్యాపారముజేయు లేక ఆదాయము (లాభము) నిమిత్తమై వ్యక్తిగతముగా పనిచేయుచున్న ఇంటి బయటిద్వారము పై లేక సుస్పష్టముగా కనుపడు ఆ యింటి వేరే భాగముపై అంటించగలడు మరియు తర్వాత దాని అసలు ప్రతిని నోటీసు లేక బిల్లును జారీచేయు నధికారికి దానిపై తాను అట్లు ప్రతిని అంటించినదియు, తానట్లు చేసిన పరిస్థితులను, విధానము, మరియు జారీచేయబడిన వ్యక్తిని గుర్తించు మరియు అందజేయుటను లేక అర్పించుటను చూచువ్యక్తి ఎవరైన ఉన్నచో పేరు మరియు చిరునామాయును దెలుపునట్టి ఒక రిటర్న్‌ను అసలు నోటీసు లేక బిల్లుకి అనుబంధించగలడు మరియు వెనుక వ్రాయగలడు.

(యఫ్) నోటీసు లేక బిల్లు జారీచేయు అధికారి అది ఎవరిపేర వ్రాయబడినదో ఆ వ్యక్తికి తాఖీదును తప్పించుకొను నుద్దేశముతో దూరముగా ఉంటూ వున్నాడని, ఏదేని యితర కారణముచే సాధారణమైన పద్ధతిలో, నోటీసు లేక బిల్లు జారీచేయబడ జాలదనిగాని విశ్వసించుటకు హేతువున్నదని సంతృప్తి పడిన యెడల, అట్టి అధికారి దానియొక్క ఒక ప్రతి కార్యాలయములో స్పష్టముగా కనుపడు నొకానొక స్థలమున, ఆ వ్యక్తి చివరకు నివసించుచుండెనని

గాని వ్యాపారమును చేయుచుండెనని లేక ఆదాయము నిమిత్తమై వ్యక్తిగత ముగా పనిచేయుచుండెనని తెలిసినట్టిప (ఏదేని) ఉన్నచో యిల్లుయొక్క ఒకానొక సుస్పష్టమైన భాగమునందు అంటించుటద్వారా లేక తాను వుచితమని భావించు మరేదేని పద్ధతిలో అది జారీచేయబడుటకై ఆజ్ఞాపింపగలడు. అట్టి అధికారి ఆజ్ఞవలన ప్రత్యామ్నాయముగా వుంచు జారీ అట్టి వ్యక్తికి వ్యక్తిగత ముగా జారీచేయబడినదో యనునంత సార్థకమై యుండగలదు. అట్టి అధికారి బదులుంచబడిన సందర్భములో ఆ అధికారి ఆ సందర్భమున ఆవసరమగు ప్రకారము ఆ వ్యక్తి హాజరగుటకు సమయమును నిర్ణయింపగలడు.

(జి) నోటీసు లేక బిల్లు వ్రాయబడిన పేరుగల వ్యక్తి జిల్లా వెలుపల నివసించు సందర్భమున మరియు జారీని స్వీకరించుట కధీకృతుడగు ఏజెంటు జిల్లాయందు లేకుండిన, ఆ నోటీసు లేక బిల్లు అతడు నివసించునట్టి చివరి స్థలముపేర వ్రాయవలయును, మరియు నోటీసు లేక బిల్లు పంపించబడుచోటు మరియు అట్టి ప్రదేశము మధ్య తపాలా రవాణా ఉన్నచో పోస్టుద్వారా అతనికి పంపించబడగలదు.

184. భవనముల యొక్కయు భూమి యొక్కయు యజమానులకు లేక అనుభవదారులకు నోటీసులు జారీచేయుట :

ఈ శాసనము క్రింద యేదేని నోటీసు యేదేని భవనము లేక భూమి యొక్క యజమానికి లేక అనుభవదారునకు యా శాసనముచే లేక అనుసరించి జారీచేయబడుటకు కోరబడిన లేక అనుమతింపబడిన సందర్భమున ఈ శాసనములో ప్రత్యేకముగా మరొక విధముగాకుండా విధింపబడిన సందర్భములలో—

(ఎ) ఆ నోటీసును యజమానికి లేక అనుభవదారుకు లేదా ఒకరి కంటెవెక్కువ యజమానులు లేక అనుభవదారులున్నచో వారిలో నే యొక్కరికైనను ఇచ్చుట ద్వారా లేక అర్పించుట ద్వారా;

(బి) అట్టి ఏ యజమాని లేక అనుభవదారు లభించనిచో, ఎవడేని పైన చెప్పబడిన అట్టి యజమానియొక్క లేక అనుభవదారు యొక్కగాని కుటుంబములోని మేజరునకు ఇచ్చుటకు ద్వారా లేక అర్పించుట ద్వారా;

(సి) పైన చెప్పబడిన సాధనములలో నేదియు లభ్యము కానప్పుడు ఆ నోటీసును అద్దె విషయమునకు సంబంధించినట్టి భవనము భూమిలో స్పష్టముగా కనబడు ఒకానొక భాగముపై అంటింప జేయుటద్వారా జారీ అమలు జరుపబడగలదు.

185. పబ్లికు మరియు సాధారణ నోటీసుల ప్రచురణ:

ఈ శాసనము, పబ్లిక్‌గా గాని లేక సాధారణ నోటీసుగా గాని లేక అందులో నిర్దిష్టపరుపబడినట్టి వ్యక్తులకు సూచన పత్రము ఒసగబడుటను స్పష్టముగా కోరని షరతులద్వారా, ఇచ్చుటకు లేక జారీచేయుటకు శాసనము కోరు లేక పంచాయతీ సమితి జిల్లాపరిషత్‌ను అధికృత మొనర్చు ప్రతినోటీసు ఆ విధియందు డప్పు చప్పుడు ద్వారా చాటింపుచే అది ప్రకటింపబడినచో మరియు దానియొక్క ఒక ప్రతి పంచాయతీ సమితి జిల్లా పరిషత్ కార్యాలయ మున ప్రకటన ఫలకముపై లేక సమితి పరిషత్ నిర్ణయించు యితర బహిరంగ భవనముల లేక స్థలములందు అంటించబడినచో లేక సమితి పరిషత్తు యొక్క అధికార మండలి ప్రాంతములో ప్రచారములో నున్నట్టి యేదేని వార్తా పత్రిక యందు ప్రచురింపబడి యున్నచో, తగు రీతిగా యియ్యబడినదవి లేక జారీ చేయబడినదని భావింప బడగలదు.

186. నోటీసు యొక్క లోపభూయిష్టమగు సమూనా, సహేతుక మగు సమయము నిర్ణయము మరియు దాని ప్రకారము నడువ నందున పర్యవ స్థానము :

(1) నమూనాలోని యేదేని లోపము కారణమువలన మాత్రమే ఏదేని నోటీసు లేక బిల్లు నిరర్థకముకాదు

(2) ఈ శాసనముచే కాల నిర్ణయము కావింపబడనట్టి ఏదైన పనిని చేయవలసినదని ఏదైన నోటీసు అపేక్షించినప్పుడు ఆ నోటీసు అదే పనికి సహేతుకమైన కాలమును నిర్ణయింపగలదు.

(3) నోటీసులోని షరతుల ప్రకారము జరుపబడని పక్షమున, పంచాయతీ సమితి జిల్లా పరిషత్ అందువలన చేయబడవలసినది అపేక్షింప బడినట్టి పనిని చేయుటకై అవశ్యకమగునట్టి చర్య లేక విధానముల నవలం బింప వచ్చును. మరియు అందువలన పంచాయతీ సమితి జిల్లా పరిషత్‌చే పెట్ట బడిన ఖర్చులన్నియును ఆ నోటీసు అందజేయబడిన పంచాయతీ సమితి జిల్లా పరిషత్ వ్యక్తిచే లేక వ్యక్తులచే చెల్లింపబడగలవు. మరియు సెక్షను 188 లో విధింపబడిన విధానమున రాబట్టుకోబడ దగియుండును.

187. ఏ యితర సెక్షను ననుసరించియుశిక్షార్హములు గాని ఆజ్ఞలను నోటీసులను ఉల్లంఘించి నందులకు శిక్ష :

ఈ శాసనముచే ఒసగబడిన ఏదైన అధికారము ననుసరించి పంచా యతీ సమితి జిల్లా పరిషత్‌చే లేక దాని పక్షమున జారీ చేయబడిన నేదైన లిఖిత పూర్వకమగు నోటీసు ద్వారా ఇయ్యబడిన చట్ట సమ్మతమగు ఏదైన

ఆదేశమును ఉల్లంఘించు లేక దాని ప్రకారము నడచుటకు తప్పు లేక పంచా యతీ సమితి జిల్లా పరిషత్తుచే అతనికి ఏ షరతులకు లోబడి అనుమతి ఇయ్యబడినదో వాని ప్రకారము నడచుటకు తప్పు వారెవరైనా జిల్లా న్యాయాధి కారి (మేజిస్ట్రేటు) సమక్షమున నేర నిర్ధారణపై ఆ ఉల్లంఘనము లేక తప్పుట యింకేదేని సెక్షను ననుసరించి శిక్షార్హమగు నేరము కానిచో, ఏబది రూపా యలవరకు బోవు జరిమానాకు మరియు నేరనిర్ధారణ పిదప ఉక్తఉల్లంఘనము గాని తప్పుటగాని అనవరతముగనున్న కాలములోని ప్రతి దినమునకు ఐదు రూపాయలకు మించని జరిమానాకును బాధ్యుడగును.

అయితే ఒకానొక పని ఏ ఒక కాలములోపల చేయబడవలసినదని నోటీసు నిర్ణయించేనప్పుడు మరియు ఈ శాసనమునందెట్టి కాలమును నిర్దిష్ట పరుపబడనప్పుడు శాసనము యొక్క అభిప్రాయానుసారము అట్లు నిర్ణయింప బడిన కాలము సహేతుకమైనదా కాదాయనుదానిని నిర్ణయించుట జిల్లా న్యాయా ధికారి (మేజిస్ట్రేటు) పైనాధారపడి యుండగలదు.

188. యజమాని లేక అనుభవదారు చేయునప్పుడు పంచాయతీ సమితి జిల్లా పరిషత్ నిర్మాణమును నిర్వహించవచ్చును. మరియు ఖర్చులను వసూలు చేసికొనవచ్చును.

(1) ఎప్పుడైనను ఈ శాసనపు షరతుల ననుసరించి ఏదైన నిర్మా ణము, ఏదైన భవనము లేక భూమి యజమానిచే లేక అనుభవదారుచే చేయ బడుటకు కోరబడిన మరియు అట్టి నిర్మాణము నిర్వహించుటయందు తప్పు చేయబడినచో, అట్టి నేరము కొరకై ఏదైన శిక్ష విధింపబడి యుండినగాని లేక యుండకపోయినను పంచాయతీ సమితి జిల్లా పరిషత్ అట్టి నిర్మాణమును నిర్వహింప జేయవచ్చును. మరియు అందువల్లనైన ఖర్చులు ఈ శాసనము నందు స్పష్టముగా మరొక విధముగా విధింపబడిన దప్ప, అట్టి నిర్మాణము నిర్వహింపవలసియుండెడి వ్యక్తిచే దానికి చెల్లింపబడగలవు. మరియు అధ్యా యము 10 క్రింద వసూలు చేయబడదగు నేదైన పన్ను క్రింద కోరబడిన మొత్తము విధముగనే వసూలు చేయబడగలవు.

(2) ఖర్చులు అనుభవదారుపై విధించు సధకారము, అవే ఖర్చులను అతని అద్దెనుండి మినహాయించవచ్చును; నేరస్తుడు భవనముయొక్క, భూమి యొక్క యజమాని యగుచో, అదనపు ప్రతిక్రియారూపమున, ఏదైన దావా లేక కార్యావాహి అట్టి యజమానికి వ్యతిరేకముగా చేయబడిననుగాని చేయబడక యుండినను పంచాయతీ సమితి జిల్లా పరిషత్ సబ్-సెక్షను (1) యొక్క షర తులకు లోబడి, ఆ సమయపు యజమానిచే చెల్లింపబడవలసిన ఖర్చు లన్నిటి లేక అందేభాగపు చెల్లింపును ఆసమయమున లేక అటుపిదప నెపుడైన అట్టి

యజమాని క్రింద ఆ భవనమునందు లేక స్థలమునందు కాపురమున్న వ్యక్తి నుండి చెల్లించుటకు ఆదేశింపవచ్చును; మరియు అట్లు గట్టిగ అడుగబడిన మీదట అట్టి అనుభవదారు దాని చెల్లింపు విషయమున ఆదే అట్టి అనుభవ దారునుండి వసూలు చేయబడవచ్చును; మరియు అట్లు వసూలు చేయదగు ప్రతి మొత్తము అధ్యాయము 10 క్రింద వసూలు చేయబడదగు ఏదైన పన్ను క్రింద కోరబడిన మొత్తము విధముగనే వసూలు చేయబడగలదు.

(3) వశవర్తులు ఇవ్వవలసిన అద్దె మొత్తమున కన్న నెక్కువ దానికై బాధ్యులు కారు: పంచాయతీ సమితి-జిల్లా పరిషత్ ఆ యుద్దేశ్యము నకై అతని కివ్వబడిన డిమాండు నోటీసుపై ఒక వశవర్తి ఏదైన భూమి లేక భవనము విషయమున సరుకు గొనకున్నచో, లేక నిరాకరించుచో తప్ప, అట్టి వశవర్తి ఈ శాసనముచే, అందుకు చెందిన స్వంతదారుపై విధింపబడిననేవైన ఖర్చుల సందర్భమున అంతకన్న నెక్కుడు డబ్బును చెల్లించుటకు బాధ్యుడు కానేరడు—

(ఎ) అతనికి పంపబడిన అభ్యర్థన సమయమున చెల్లింప దగినట్టి ఖర్చుల పట్ల ఆ భవనమునకై ఆ వశవర్తినుండి రావలసినట్టి అద్దె మొత్తము; లేక

(బి) ఆ మొత్తము, అట్టి డిమాండు లేక నోటీసు మీదట నే సమయి మున నైనను అతని భూస్వామికి నట్టిది చెల్లింపదగినదిగా నన్వయింపబడినదో లేక యైనదో;

అయితే నే వశవర్తి వలన అభ్యర్థింపబడిన మొత్తము అట్టి అభ్యర్థ నకు చెందిన నే సమయమునపైన అతనిచే నివ్వవలసియుండునట్టి అద్దెకన్న నెక్కువగా నున్నదని లేక అట్టిది అన్వయింప బడినప్పటినుండి అట్టి వశ వర్తిపై ఋజువు భారముండగలదు;

అయితే పై జెప్పబడిన నేవైన నట్టి పనుల ఖర్చునకు చెందిన చెల్లింపు పట్ల అట్టి ఏ వశవర్తి మరియు స్వంతదారు మధ్యనైన చేసికొనబడిన నేదైన ప్రత్యేకపు ఒడంబడికను ఇందులో నున్నదేదియు బాధించి గైకొన బడ నేరదు.

189. ఖర్చులు లేక విలువలు ఎట్లు నిర్ణయింప వలసినదియు, వసూలు చేయబడవలసినదియు:

ఈ శాసనముచే చెల్లింప బడవలయునని నిర్దేశింపబడిన నేవైన

ఖర్చులు లేక విలువల సందర్భమున నేదైన వివాద ముదయించు నెడల, ఆ మొత్తము, మరియు అట్టిదాని పంపకము అవసరమగు నెడల ఈ శాసనములో స్పష్టముగా మరొక విధముగా నాదేశింపబడిన పక్షమున, భూమ్యాదాయ మండలిచే గనుగొనబడి, నిర్ణయింపబడవలయును. మరియు అధ్యాయము 10 క్రింద వసూలు చేయబడదగు నేదైన పన్ను క్రింద కోర బడిన మొత్తము విధముగనే వసూలు చేయబడవలెను.

## అపీళ్ళు

190. అపీలు నిషేధము :

ఈ శాసనముక్రింద నొనర్చబడిన నుత్తరువునకు విరుద్ధముగా ఈ శాస నములో నాదేశింపబడిన రీతిగా నున్ననే తప్ప, యే ఉత్తర విజ్ఞాపన నైనను పెట్టుకొనుట కవకాశ ముండనేరదు.

191. కొన్ని ఆజ్ఞలపై కలెక్టరునకు అపీలు :

ఒక అపీలు కలెక్టరునకు పెట్టుకొనుట కవకాశ ముండగలదు—,

(ఎ) వదలబడినది.

(బి) స్థానిక సుంకముకన్న వేరగు అధ్యాయము 10 క్రింద నేదైన ఒక పన్ను నిర్ణయాజ్ఞ పన్ను చెల్లింపవలసిన వారికి వారి యాక్షేపణ నిషేధింప నొక యవకాశము నిచ్చిన మీదట మరియు ఆ అక్షేపణల విన్న మీదట, వారిచే నొనర్పబడిన వేమైన యున్నచో, తీర్మానింప బడినట్టి దానిపై:

(సి) క్లాజు (బి) లో నుల్లేఖింపబడినదేదైన పన్నును ముజరా నొసగు నిరాకరించునట్టి యుత్తరువుపై ;

(డి) సెక్షను 124 క్రింద నొక స్వంత మార్కెటు యొక్క అను మతి పత్రమును అపుదల నుత్తరువుపై ;

(యి) సెక్షనులు 84, 85, 86 మరియు 88 క్రింద జలా ధారములకు చెందిన నుత్తరువులపై ;

(యఫ్) ఏదైన కట్టడమును నిర్మించుటకు అనుమతి నిరాకరించు లేక ఏదైన కట్టడ నిర్మాణము మార్పును లేక అదనముగా చేర్చుటకు ఆప వలయునను లేక పడగొట్ట వలయునను సెక్షను 102 క్రింది ఒక ఆజ్ఞ ;

(జి) సెక్షను 200 లోని సబ్-సెక్షను (2) లోని క్లాజు 20 లోని పేరా (ఇ) క్రింద పెచ్చునకు చెందిన ఉత్తరువుపై ;

192. అపీలునకు కాలదోషము :

సెక్షను 191 క్రింద నొక ఉపర్యభియోగమొనర్చ నుత్తరవు యొక్క తేదీనుండి, 60 దినములలోపుగా నుత్తరాధికారి ముందు పెట్టుకొన బడిననే తప్ప, అనుమతింప బడనేరదు.

అయితే అపీలుదారు ఆ గడువులోపుగా పెట్టుకొనబోవుటకు గల సముచిత కారణములను కలిగియుండెనని కలెక్టరు ఆమోదింపజేసిన యెడల, పై జెప్పబడిన గడువు తరువాత ననుమతింప బడపచ్చును.

193 ఉపర్యభియోగముయొక్క నమూనా మరియు చర్యలు అమలు నిలుపదల :

(1) సెక్షను 191 క్రింది ప్రతి అపీలు దరఖాస్తుదారుడు లేక అతనిచే న్యాయవాదిచే సంతక మొనర్చబడిన ఒక మెమోరాండం యొక్క నమూనాలో పెట్టుకొనబడవలెను. మరియు కలెక్టరు లేక ఈ సందర్భములో కలెక్టరు నియోగింపవచ్చునట్టి అధికారికి దాఖలు చేసికొన బడవలెను. మెమొరాండం తిరిగి అపీలు చేసికొన బడవలసిన నుత్తరువు యొక్క యొక ప్రతితో జత కూర్చ బడవలెను.

(2) ప్రతి మెమొరాండం ఉపీలు చేయబడవలసిన నుత్తరువునకు గల ఆక్షేపణా కారణములు సంగ్రహముగా మరియు వివిధశీర్షికల క్రింద, యేదైన వాదన లేక పుట్టుపూర్వోత్తరము లేకుండగనే వివరింపబడవలెను; మరియు వరుసగా అంకె వేయబడవలెను.

(3) ఉత్తర విజ్ఞాపన చేయబడదగు నుత్తరువు క్రింద నొక ఉత్తర విజ్ఞాపన. యెంతవరకు కలెక్టరు ఉత్తరువు చేయునో అందు మినహాయించి, చర్యలు నిలుపుదలగా పనిచేయనేరదు, లేక ఆ డిక్రీవలన పై యధికారిముందు పెట్టుకొనబడుచున్నట్టి యొక ఉపర్యభియోగమున కారణముపై మాత్రమే యొక యుత్తరపు యొక్క అమలు జరుగుట నిలుపబడనేరదు ; కాని కలెక్టరు తగిన కారణమునకు గాను అట్టి ఉత్తరువుయొక్క స్థగనమునకై (Stay) యుత్తరువు చేయవచ్చును.

(4) అమలుపరచుటకు నిలుపుదల చేయుటకై యుత్తరువు యేదియు, కలెక్టరు సంతృప్తి జెందిననే గాని యొనర్చబడరాదు—;

(ఏ) ఉత్తరువు చేయబడినసేళప్ప, అమలు జరుపుటయొక్క నిలుపు దలకై నివేదించుకొనుచున్న కక్షిదారునకు బలమైన నష్టము చేకూరగలదని;

(బి) సహేతుకముగాకుండు ఆలస్యము లేకుండగనే ఆ విజ్ఞాపన పెట్టుకొనబడినదని,

(సి) దరఖాస్తుదారుపై పర్యవసానముగా కట్టువడ జేయునట్టిదిగా యుత్తరువుయొక్క సక్రమమగు నెరవేరుటకుగాను అతనిచే పూచీకత్తుయొసగ బడియున్నదని,

(5) సబ్-సెక్షను (4)లో నేమి యున్నప్పటికిని, కలెక్టరు, దరఖాస్తు విచారణ నాపివేయుచు అనులుపరచుట నిలుపుదలగా ఏక పక్షముగా నుత్తరువు (Exparty order) చేయవచ్చును.

194. అపీలులో కలెక్టరు యొక్క నిర్ణయము :

(1) కలెక్టరు, కక్షిదారులను లేక వారి న్యాయవాదులను విచారించిన మీదట మరియు పరామర్శ యవసరమని తలంపబడునట్టి న్యాయచర్యలలో నేదైన భాగమును పరామర్శించినమీదట, అతని నిర్ణయమును నమోదు చేయ వలెను. అట్టి నిర్ణయము పెట్టుకొనబడిన ఉత్తర విజ్ఞాపన వలన నా యుత్తరు వును ధృవపరచునదిగా, వేరువిధముగాను లేక తారుమారుగాను నుండవచ్చును. కలెక్టరు, అతడు ఉచితమని తలంచుయెడల ఆ అభియోగము ఉత్తరువు ద్వారా వెనుకకు తిరుగగొట్టవచ్చును. అతడు చేసియుండవలసినట్టి యేదైన ఉత్తరువును చేయుటకు మరియు ఆ అభియోగమున కవసరమగు రీతిగా ఇతోధికమైన ఉత్తరువును చేయుటకు అధికారమును కలిగియుండును. అపీలుపై కలెక్టరు యొక్క ఉత్తరువు అంతిమమై యుండగలదు. మరియు అందుమీద రెండవ అపీలు పెట్టుకొనుట కవకాశముండనేరదు.

(2) ప్రతి అపీలు లోను కలెక్టరు తన వివేచనానుసారముగా ఖర్చులను గూర్చి తీర్పు నొసగవచ్చును. ఒక పంచాయతీ సమితి- జిల్లాపరిషత్‌కు చెల్లింపు తీర్మానింపబడిన ఖర్చులు ఉత్తర విజ్ఞాపకుని నుండి చెల్లింపవలసినట్టి భూమి శిస్తు బకాయిల మోస్తరుగా పంచాయతీ సమితి- జిల్లా పరిషత్‌చే రాబట్టుకొన దగును. విజ్ఞాపకుని చెల్లింప తీర్మానింపబడిన ఖర్చుల నేవైనను ఆ పంచాయతీ సమితి- జిల్లా పరిషత్తు అందులనుగూర్చి చెల్లింపునకై యున్న యుత్తరువు యొక్క తేదీ తరువాత పది దినముల లోపుగా చెల్లింప తప్పినయెడల కలె క్టరు ఆ మొత్తమును చెల్లించుటకు జిల్లానిధియొక్క నియువను ఆధీనములో నుంచుకొనియుండు వ్యక్తులకు ఉత్తరువు చేయవచ్చును.

195. పునఃపరిశీలనకు అధికారములు :

ప్రభుత్వము, ఈ శాసనము క్రింద లేక నావహింపబడిన నేదైన యధికారము లేక హోదాను నిర్వర్తించుటలో నేదైన పంచాయతీ సమితి-జిల్లా పరిషత్ లేక ప్రభుత్వము క్రింది యుద్యోగి లేక యేదైన తాత్కాలికముగా పనిచేయుచున్న పంచాయతీ సమితి- జిల్లా పరిషత్‌చే తీర్మానింపబడిన నుత్తరువు యొక్క న్యాయౌచిత్యము లేక సక్రమతను గూర్చి లేక న్యాయ చర్చలయొక్క క్రమమును గూర్చి. స్వయముగా తృప్తిజెందు నవసరములకు గాను. ఏ సమయమందైనను, సాధికారముగా నడుగవచ్చును. మరియు అట్టి అధికారి యెదుట తీర్పుకాక యున్న నేదైన అభియోగము యొక్క యాభిలేఖ్యముల పరీక్షింపవచ్చును. మరియు ఆతనిచే పరిష్కరింప జేయవచ్చును మరియు అది ఉచితమని తలంచు రీతిగా అందుకు చెందిన సూచన తోడ అట్టి యుత్తరవును జారీ చేయవచ్చును.

అయితే ఏఉత్తరువుపైనను, హాజరగుటకై సంబంధించిన కక్షిదారులకు నోటీసు యొసంగబడియున్ననే తప్ప మరియు అట్టి యుత్తరువునకు తోడ్పాటుగా విచారింపబడి యున్ననే తప్ప, త్రిప్పివేయబడరాదు.

196. నేరముల చట్టబద్ధమగు విచారణ :

(1) మరొక విధముగా స్పష్టముగా నాదేశింపబడిననే తప్ప, పంచాయతీ సమితి- జిల్లా పరిషత్ లేక యీ సందర్భములో పంచాయతీ సమితి-జిల్లా పరిషత్‌చే నధీకృతుడగు నేదైన వ్యక్తియొక్క ఫిర్యాదు లేక వారినుండి అందిన భోగట్టాపై తప్ప, ఈ శాసనము లేక దానిక్రింద నొనర్పబడిన నేదైన నియమము లేక క్రింద నేదైన శిక్షణయు నేరముయొక్క చట్టబద్ధమగు విచారణను గైకొన వచ్చును.

(2) పంచాయతీ సమితి/జిల్లా పరిషత్‌నకు మున్ముందుగా సూచింపకయే ఈ శాసనము లేక దానిక్రింద చేయబడిన నేదైన నియమములు లేక విరుద్ధముగా నొనర్పబడు నేరముల పట్ల సాధారణముగా కాని లేక నిర్దిష్ట నేరములు నిర్దిష్ట వర్గమునకు చెందిన నేరములపట్ల, ఫిర్యాదు చేయుటకు లేక భోగట్టా నొసగుటకు బోర్డు ఏ వ్యక్తిపై నధీకృత మొనర్పవచ్చును. అతడు చైర్మను, వైస్ చైర్మను, అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు, నిర్వహకాధికారి, స్థానిక యింజనీయరు, సివిలు సర్జను, జిల్లా ఆరోగ్యాధికారి లేక ఒక పోలీసు ఠాణాపై అధికారములో నుండు అధికారిగా నుండుపక్షమున, నతని హోదా ప్రభావము ద్వారా అట్టి వ్యక్తి, నధీకృత మొనర్పబడవచ్చును; ఇతర సందర్భములతో ఆ అధికారి నామనిర్దేశ మొనర్పబడవచ్చును.

197. పంచాయతీ సమితి/జిల్లా పరిషత్తు వ్యాజ్యము నడిపించవచ్చును:

(1) పంచాయతీ సమితి- జిల్లా పరిషత్తు ఏదైనప్పటికిని ప్రజానీకమునకు ఉపద్రవ కరమగుదానికై వ్యాజ్యమున దింపవచ్చును. మరియు యీ శాసనము లేక దానిక్రింద చేయబడిన నేదైన నియమము లేక బైలా లోని కట్టుబాటునకు విరుద్ధముగా నేరమొనర్చు వ్యక్తులెవరైనను శిక్షించుటకై, మరియు యేవైన దండుగలను వసూలు చేయుటకై న్యాయ చర్యలకుగాను నుత్తరువు నొసగ వచ్చును మరియు అట్టి అభియోగ ప్రావర్తకములకు లేక యితర న్యాయ చర్యలకగు ఖర్చులు జిల్లా నిధికుండి చెల్లించివేయ బడునటుల నుత్తరువు నొసగవచ్చును.

అయితే నీ శాసనము లేక దానికిరింద నొనర్పబడిన నేదైన నియమము లేక క్రింద నొనర్పబడు నేదైన నేరమునకై యే వ్యాజ్యము నడిపించుటైనను అట్టి నేర మొనర్చిన తరువాత మూడు మాసముల లోపుగా తప్ప ఆరంభింప బడరాదు.

(1) ఈ శాసనము లేక దాని క్రింద నొనర్పబడిన నేదైన నియమము లేక బైలా దానిక్రింద నేదైన వ్యాజ్యము నడిపించుట, అందులో నితర విధ ముగా నాదేశింపబడిననే తప్ప, ఏ దండనాధికారి సమక్షముననైనను ప్రారం భింప బడవచ్చును. మరియు యీ శాసనము లేక దానిక్రింద నొనర్పబడిన నేదైన నియమము లేక దానియొక్క ప్రభావముచే విధింపబడిన ప్రతి దండుగ లేక శిక్ష, మరియు యీ శాసనము నితరవిధముగా ప్రత్యేకపు ఏర్పాటు చేయ బడకుండ అట్టి నష్టపరిహారమునకై లేక ఇతర ఖర్చులకై అభ్యర్థనలన్నియు వసూలు చేయుటకుగాను కూడ, ఎవరినుండి ఆ డబ్బు అభ్యర్థింపబడుచున్నదో అట్టి వ్యక్తికి చెందిన, అతని అధికారావరణపు హద్దులకు లోనుగానుండు నేదైనా చరాస్తియొక్క జప్తు లేక అమ్మకముద్వారా, అట్టి దండనాధికారికి దరఖాస్తు పెట్టుకొనుటపై వసూలు చేయబడవచ్చును.

598. నేరముల రాజీ పరచుటకు అధికారము:

పంచాయతీ సమితి- జిల్లా పరిషత్ లేక పంచాయతీ సమితి, జిల్లా పరి షత్ అధికార ప్రదానముచే దాని అధ్యక్షుడు, అందుకు చెందిన నిర్వహణాధి కారి లేక ఉప-సంఘము ఆ సమయమునకు అమలులోనున్న యీ శాసనము క్రింద న్యాయసమ్మతముగా రాజీ కుదర్చబడునట్టి యీ శాసనము లేక దాని క్రింద చేయబడిన నేదైన నియమము లేక బైలా వ్యత్యయముగా నొనర్పబడిన నేదైన నేరము రాజీ కుదర్చవచ్చును.

(2) రాజీపకు పద్ధతిచే ఆ మొత్తమును చెల్లించుటపై, తరువాత న్యాయ చర్య యేదైనను ఆ విధముగా రాజీపరచుకొనబడిన నేరము లేక ఆరోపింప

బడిన నేరముపట్ల, తప్పినవానికి విరుద్ధముగా గైకొనబడరాదు బైలా లేక సాగింపబడరాదు.

(3) ఆరోపింపబడు నేరములకై రాజీపరచుట కంగీకరించుటకై ఉప నిబంధన (1) క్రింద అధికార ప్రదానము, యీ శాసనము లేక దానిక్రింద నొనర్పబడిన నియమములు లేక బైలా క్రింద సాధారణముగా నొనర్పబడినన్ని నేరములపట్ల, మరియు నిర్దేశింపబడిన నేరములకు లేక నిర్దేశింపబడిన వర్గమునకు చెందిన నేరములకు మాత్రమే ప్రత్యేకముగాను, పంచాయతీ సమితి- జిల్లా పరిషత్‌చే యివ్వబడవచ్చును. మరియు ఏ సమయముననైన పంచాయతీ సమితి జిల్లా పరిషత్తుచే నుపసంహరింప బడవచ్చును.

## అధ్యాయము-14

## నియమములు మరియు ఉప నిబంధనలు

199. నియమమునకు చెందిన సాధారణ విధులు :

ఈ శాసనములోని యేర్పాటునకై చేయబడునట్టి నియమము లన్నియు ప్రభుత్వముచే యొనర్పబడవలెను.

(2) అట్టి నియమములు ప్రభుత్వ మాదేశించు రీతిగా పంచాయతీ సమితి- జిల్లా పరిషత్తులన్నిటికి సాధారణముగా నుండవచ్చును లేక పంచాయతీ సమితి- జిల్లా పరిషత్తులలో నేదు యొకటి లేక ఎక్కువ వాటియొక్క అధికారావరణకు లోనైన ప్రదేశము మొత్తము లేక ఏదైన భాగమునకు గాను ప్రత్యేకముగా నుండవచ్చును.

(3) నియమములన్నియు ముందుగా ప్రచురణకు లోబడియుండవలెను.

(4) ఏదైన అట్టి నియమము లొనర్చుటలో ప్రభుత్వము అందుకు చెందిన యేబది రూపాయలకు విస్తరించునట్టి జరిమానా తోడను మరియు అభంగము అవిచ్ఛిన్నమగు పక్షమున మొదటిదాని తరువాత ఆ భంగము విషయమున పట్టుబట్టి యున్నటుల నిరూపింపబడియుండిన దాని మధ్యకాలమున ప్రతి దినమునకు గాను ఐదు రూపాయలకు విస్తరించునట్టి ఇతోధికమగు జరిమానా తోడను శిక్షనీయము కాగలదని యాదేశింపవచ్చును.

200. నియమము లొనర్పబడవలసిన వ్యవహారములు:

(1) ఈ శాసనముచే ప్రత్యేకముగా నావహింపబడిన నేదైన నధికారము

నకు తోడుగా ప్రభుత్వము ఈ శాసనములోని విధులను నెరవేర్చు నవసరము నకై నియమముల నొనర్పవచ్చును.

(3) ప్రత్యేకముగా మరియు ఆ గ్రామ్యాధికారమునకు సాధారణముగా విరుద్ధముగా లేకుండ ప్రభుత్వము పీవిపట్ల నియమముల నొనర్పవచ్చును.

I నుండి VII వదలబడినది.

(viii) సెక్షను 68 లోని సూచనానుసారముగా పంచాయతీ సమితి-జిల్లా పరిషత్తు దాని నిధినుండి వడుపబడు నటువంటి ప్రజాసంస్థల పక్షమున వినియోగించునట్టి స్వతంత్రాధికారము ;

(ix) సెక్షను 70 క్రింద స్థిరాస్థియొక్క మార్పుదల :

(x) సెక్షను 79 లోని సూచనానుసారముగ సమితి లేక ఏదైన హక్కు లేక అభ్యర్థనచే లేక విరుద్ధముగా ప్రారంభింపబడిన ఏదైన దావాను గూర్చి రాజీ పడుటకుగాను సమితియొక్క అధికారములు;

(xi) సెక్షనులు 80 మరియు 81 లోని సూచనానుసారముగా పంచాయతీ సమితి- జిల్లా పరిషత్తుయొక్క విధులు మరియు విశేషాధికారములు;

(xii) సెక్షను 9 క్రింద నొసంగబడు లైసెన్సునకుగాను షరతులు

(xiii) సెక్షను 97 లో పేర్కొనబడిన అవసరములకై ఉపయోగపడు స్థలమునకుగాను చేయబడు ఏర్పాట్లు మరియు సెక్షనుక్రింద ఒసంగబడు అనుమతి పత్రములకు నగు రుసుము;

(xiv) సెక్షను 102 క్రింద దానిని అనుసరించి స్థాపిత మొనర్పవలసిన భవనము లేక పునఃస్థాపిత మొనర్పబడవలసిన భవనమునకు గానైన ఏర్పాట్లు:.

(xv) గ్రామీణ ప్రదేశము అభివృద్ధి మరియు విస్తరణము పథకముల క్రమము, మరియు సెక్షను 103 క్రింద ప్రభుత్వముచే అనుమతింపబడవలసిన ప్రదేశ లేక గ్రామ లేక స్థానిక పథ ముల విషయమై;

, మరియు ప్రత్యేకముగా ఈ క్రింద పేర్కొనబడిన వాటిపై—

(ఎ) ప్రాంతీయ లేక గ్రామీణ పథకమును లేక స్థానిక ప్రణాళికను తయారుచేయు మరియు దానిని అమలు జరుపు అధికారులు:

(బి) నివాసస్థలములకు కర్మాగారములకు లేక యితర అసరములకు గాను నిర్దేశింపబడిన ఆ ప్రదేశములలో ప్రత్యేకింపబడవలసినదిగా సూచించుట;

(సి) ఇంతకు పూర్వమునుండి వున్న గృహములపైన. కర్మాగారములపైన వృత్తులపైన వ్యాపారములపైన మరియు ఇతర వస్తువులపైన ఆ సెక్షను యొక్క సబ్ సెక్షను (1) క్రింద సూచింపబడు నిషేధములు, అడ్డంకులు, హద్దులు మరియు షరతులను చేయుట.

(డి) పథకములను మరియు ప్రణాళికలను తయారు చేయునప్పుడు దృష్టిలో నుంచుకొనవలసిన పారిశుధ్య విషయములు మరియు కట్టడముల యొక్క నియమములు.

(ఇ) చక్కగా పోవు రహదారులందు లేక ప్రక్కస్థలములకు పోవు గొందుల త్రోవల ప్రక్కన కట్టబడు భవనముల విషయమున నిబంధనలు.

(ఎఫ్) విమానాశ్రయముగా వాడబడు స్థలమునకు మరియు అట్టి స్థలమునకు చుట్టుపట్ల విమానముల రక్షణకై భవననిర్మాణ నిషేధము.

(జి) వీధులుగాని, లేక రోడ్డుగాని మరియు వాటి అభివృద్ధుల పథకములలోను ప్రణాళికలలో నిర్దేశింపబడినవి పంచాయతీ సమితి- జిల్లా పరిషత్తు వారిచేత, ఆస్తిదారులచేత లేక యిద్దరిచేత వాటిఖర్చులు భరింపబడవలయునని.

(హెచ్) బాగుచేయుటకు గానగు ఖర్చుల విషయములో అట్టి పథకములను ప్రణాళికలను చేయు కారణముగా అట్టి ఆస్తులుగా స్వంతదారులకు తమ ఆస్తుల విలువలు పెరుగు సందర్భమున వారివద్దనుండి శిస్తులను వసూలు చేయుట.

(ఐ) ప్రాంతీయ. గ్రామీణ లేక స్థానిక ప్రణాళికలను చేయుటయందును మరియు వాటిని అమలు జరుపుటచేతను కలిగిన లాభములు దానికి సంబంధించిన పరిషత్తుల మధ్యనగాని లేక ప్రభుత్వము మరియు ప్రభుత్వము మధ్యనగాని పంపిణీ చేసుకొనుటయు.

(జె) ఈ విషయములో తయారు చేయబడిన అన్ని దస్తావేజులు మరియు పథకములు ప్రజలకు ఎంతవరకు ఏ సందర్భములలో అందుబాటులో నుంచవలయునోయని;

(xvi) సెక్షను 121 మరియు 123 క్రిందనున్న స్వంత మార్కెట్లు మరియు పబ్లిక్ మార్కెట్లను క్రమపరచుటయందు మరియు ఆ మార్కెట్లలో సహాయవిధులనో మరియు చందాలను వసూలు చేయుట ;

(xvii) సెక్షను 123 క్రింద జారీచేయబడు అనుమతులకొరకు గానై నెరవేర్పబడు షరతులను మరియు ఆ సెక్షనుక్రింద అందునిమిత్తమై వసూలు చేయబడు మొత్తములు;

(xviii) సెక్షను 179 లోని సబ్‌సెక్షను (2) లోని సూచనానుసారముగా జిల్లా నిధి నుండి ఖర్చుపెట్టుట;

(xix) వదలబడినది

(xx) వదలబడినది.

(xxi) సెక్షనులు 135 మరియు 136 లో ఆదేశింపబడిన నవసరముల నెరవేర్చుట;

(xxii) సెక్షను 138 క్రింద ప్రత్యేక పన్ను విధింపు మరియు పన్ను నిర్ణయము, సెక్షను 139 క్రింద పన్నుల విధింపు, పన్నుల నిర్ణయము మరియు పన్నుల గరిష్ట మొత్తములు లేక రేట్లు, మరియు పన్ను నిర్ణయమును, చెల్లింపును తప్పించుకొనుటకును ఆపుటకు మరియు నష్టపరిహారముగా చెల్లింపు కొరకు మరియు నీ క్రింది వానికి రుసుములను నిర్ణయించుటకు—

(ఎ) సెక్షను 147 (3) క్రింద జారీచేయబడిన ప్రతి డిమాండు నోటీసు,

(బి) సెక్షను 152 క్రింద సలుపబడిన ప్రతి జప్తు,

(సి) పై సెక్షనుక్రింద వశపరచుకొనబడిన ఏవైన పశువులను పోషించుట కగు ఖర్చులు;

(xxiii) సెక్షను 163 క్రింద పన్నుల వాపసుచేయుట (తిరుగ చెల్లించుట) అటి తిరుగ చెల్లింపులకై కాలపరిమితి;

xxiv) (వదలబడినది)

(xxv) సెక్షను 179 లోని సబ్‌సెక్షను (2) లోని సూచనానుసారముగా పంచాయతీ సమితి, జిల్లా పరిషత్తు మరియు ఇతర స్థానికాధికారుల మధ్య నుండు సంబంధముల చక్కదిద్దుట;

(xxvi) (వదలబడినది).

(xxvii) సెక్షను 198 క్రింద నేరములుగా చేర్చవలసిన వాటికై అనుసరింపబడవలసిన క్రమము;

(xxviii) (వదలబడినది)

(xxxix) (వదలబడినది)

(xxx) సెక్షను 20 క్రింద పరిషత్తుచే నొనర్పబడు ఉప నిబంధనలను ప్రచురింపజేయు విధము ;

(xxxi) ఈ శాసనమును మరియు దీనిక్రింద చేయబడిన అన్ని నియమములు, మరియు ఉపవిధులయొక్క తర్జుమాలు ప్రాంతీయ భాషలో జరుపుటకును మరియు ఏ కాపురస్తుడైన వాటిని పరీక్షించుటకు ;

*(xxxii) సెక్షను 209 యొక్క క్లాజు (బి) క్రింద పొందిన అధికారములను అమలుజరుపు వ్యక్తుల అధికారములను; మరియు

(xxxiii) విధింపబడి లేక విధింపవలసిన ఏవేని ఇతర విషయమునందును.

201 ఉపనిబంధనలు:

(1) ఈ శాసనముక్రింద కట్టుబాటొనర్పబడిన సకల ఉపనింధలు, ఏ పంచాయతీ సమితి-జిల్లా పరిషత్తు మరియు ఈశాసనము మరియు దానిక్రింద ఒనర్ప బడిన నియమములకు అనుగణ్యమై యుండగలవు.

(2) దానిని పంచాయతీ సమితి-జిల్లా పరిషత్తు అధికార క్షేత్రముక్రింద లేక ఏదేని ఒక భాగమునకు ప్రత్యేకముగా నొనర్పు ఉపనిబంధన సాధారణముగా నుండవచ్చును అని పంచాయతీ సమితి-జిల్లా పరిషత్తు ఆదేశింపవచ్చును.

(3) ఈ ఉపనిబంధనయొక్క అమలునుండి ఈశాసనమందు ప్రత్యేకముగా వినాయింపబడిన తప్ప, ఏ ఉపబంధి అది ప్రభుత్వముచే స్థిరీకరింపబడినంత వరకు కార్యరూపము దాల్చదు.

(4) ఈ ఉపనిబంధన యొక్క అమలునుండి ఈశాసనమందు ప్రత్యేకముగా వినాయింపబడిన తప్ప, ఏ ఉపనిబంధన, ఈ శాసనముక్రింద ఒనర్పబడిన నియమములద్వారా విధింపబడిన విధానము ననుసరించి అది ప్రచురింపబడునంత వరకు కార్యరూపము దాల్చదు

(5) ఏవేని ఉపనిబంధన లొనర్చుటయందు పంచాయతీ సమితి - జిల్లా పరిషత్ వారి ఉల్లంఘనము ఏబదిరూపాయలవరకు బోవు జరిమానతో మరియు మొదటిదినము తరువాత మధ్యకాలమున ఉల్లంఘనము ఆ విధముగ జరిగి యుండెనని ఋజువుపరచబడిన ప్రతి దినమునకై ఐదు రూపాయలవరకు పోవు అధికమైన జరిమానాతో ఉల్లంఘనముల విచ్ఛిన్నమగు ఉల్లంఘమైన సందర్భమున శిక్షార్హులగుననియు ఆదేశింపబడవచ్చును.

202. ఉపనిబంధన మొనర్చబడు వ్యవహారములు :

(1) ఈ శాసనముచే ప్రత్యేకముగా ఒసగబడిన ఉపనిబంధన మొనర్చు అధికారముతోబాటు ఒకబోర్డు ఉపనిబంధన లొనర్పవచ్చును.

(ఎ) బహిరంగ మార్కెట్టు, సంత, వ్యావసాయ ప్రదర్శనము లేక పారిశ్రామిక ప్రదర్శనము లేక ఆటల సరిహద్దుల నిర్వచనము మరియు ఉపయోగము మరియు నిర్వహణమును క్రమబద్ధమొనర్చు నిమిత్తము మరియు అందు ఏదైననా పారిశుద్ధ్య స్థితిని నిర్వహించు నిమిత్తము:

(బి) సెక్షనులు 80 మరియు 81 క్రింద పంచాయతీ సమితి - జిల్లా పరిషత్‌చే జరిపింపబడు సకల వ్యవహారముల నిర్వహణము, సంరక్షణము మరియు కంట్రోలు నిమిత్తము;

(సి) రాచబాటల ఉపయోగము మరియు వానిపైని వాహన జన సంచారము (ట్రాఫిక్) క్రమబద్ధమొనర్చు నిమిత్తము మరియు పారిశుధ్యమును కాపాడుట అదే విషయమునకు సంబంధించి రక్షణ మరియు ఏర్పాటు నిమిత్తము;

(డి) పంచాయతీ సమితి-జిల్లా పరిషత్ అధికార క్షేత్రపు సరిహద్దులతోనున్న ఏ పదార్థమునైన లేక ప్రభుత్వము లేక పంచాయతీ సమితి-జిల్లా పరిషత్ ఆస్తియై పంచాయతీ సమితి-జిల్లా పరిషత్ వశమందున్న ఎద్దానినైనా చెడిపోకుండ రక్షించుటకు లేక దానియందు జోక్యము కలిగించుటకు;

(యి) ఏ బహిరంగ మార్కెట్టు లేక సంతలో తమ వృత్తిని అనుసరించి లైసెన్సు దారులగు దలాయిలకు, కమీషన్ ఏజంట్లు, చూచువారల లేక కొలుచువారలకై మరియు వారిపై విధింపదగు రుసుము నిర్ణయించుట కొరకు మరియు లైసెన్సులు (అనుమతి పత్రములు) ఒసగ బడుటకు మరియు రద్దు చేయుటను నిబంధనల నిమిత్తము;

(యఫ్) ఏ బహిరంగ మార్కెట్టు లేక సంతలో పశుల అమ్మకముల రిజిష్టరు చేయుటకు వ్యక్తుల నియామకమునకై;

(జి.) ఏ బహిరంగ మార్కెట్టు లేక సంత వ్యావసాయిక లేక పారిశ్రామిక ప్రదర్శనము లేక తమాషాకు సంబంధించి సంఘముయొక్క ఏర్పాటు నిమిత్తము అట్టి మార్కెట్టు(సంత)తమాషా లేక ప్రదర్శనముయొక్క కంట్రోలు

మరియు పర్యవేక్షణము నిమిత్తము అట్టి సంఘమునకు పంచాయతీ సమితి-జిల్లా పరిషత్ యొక్క అన్ని లేక ఏ పైని అధికారముల అప్పగించు నిమిత్తము; మరియు

(హెచ్) సాధారణముగా ఈ శాసనము యొక్క ఉద్దేశముల నెరవేర్చు నిమిత్తము.

## అధ్యాయము 15
## వివిధములు

203. పంచాయతీ అధికారములను మరియు క్రియలను పంచాయతీ సమితి జిల్లా పరిషత్‌నకు పంచాయతీ సమితి-జిల్లా పరిషత్ అధికారములను మరియు క్రియలను పంచాయతీలకు మార్చుటకు ప్రభుత్వ అధికారము :—

ఈ శాసనములోగాని లేక హైదరాబాదు గ్రామీణ పంచాయతీ చట్టము, 1956 (యిటుపైన ఆ చట్టము అని వ్యవహరింపబడును) లోగాని ఏది ఏమైనప్పటికీ ప్రభుత్వము పంచాయతీ సమితి-జిల్లా పరిషత్‌తోగాని లేక పంచాయితీతోగాని సలహాపొంది అందులో విధింపబడిన హద్దులకు మరియు పరిస్థితులకు లోబడి నోటీసుద్వారా ఈ విధముగా సూచించవచ్చును.

(i) సాధారణముగా లేక ఆ చట్టములోగాని ఒక పంచాయతీలోగాని లేక ఒక తరగతికి చెందిన పంచాయతీలలోగాని వుంచబడిన అధికారములు మరియు క్రియలు ఒక పంచాయతీ సమితి-జిల్లా పరిషత్‌కు మార్చబడి మరియు దాని అధికారములలో వారిచే నిర్వహింప బడగలవు; లేక

(ii) సాధారణముగాగాని లేక ఈ శాసనముక్రిందగాని ఒక పంచాయతీ సమితి-జిల్లా పరిషత్‌లో లేక పంచాయతీ సమితి-జిల్లా పరిషత్‌లలో నుంచబడిన అధికారములు మరియు క్రియలు ఒక పంచాయతీకిగాని లేక ఒక తరగతికి చెందిన పంచాయతీలకుగాని మార్చబడగలవు. మరియు అట్టి అధికారములు మరియు క్రియలు వాటి అధికార క్షేత్రములలో వాటిచే నిర్వహింపబడగలవు.

(iii) ఈ శాసనముక్రింద పంచాయతీ సమితి-జిల్లా పరిషత్‌లో నుంచబడిన అధికారములు లేక క్రియలు అదే విధముగా ఈ శాసనముక్రింద పంచాయతీకిగాని లేక ఒక తరగతికిచెందిన పంచాయతీలలోగాని నుంచబడిన

అధికారములు మరియు క్రియలు. పంచాయతీ సమితి-జిల్లా పరిషత్ చేగాని లేక పంచాయతీ లేక ఒక తరగతి పంచాయతీలచేగాని ప్రత్యేకముగా దాని లేక వాటి యొక్క అధికారక్షేత్రములలో అసలు జరుపుట మరియు అధికారములలో నుండుటకు.

204. రికార్డు సాక్ష్య పద్ధతి :

రసీదు, దరఖాస్తు ప్లాన్ (ప్రణాళిక) నోటీసు ఉత్తర్వు, రిజిష్టరులోని పద్దు లేక పంచాయతీ సమితి-జిల్లా పరిషత్ వశమందున్న ఇతర పత్రము ప్రతి చట్టసమ్మతముగా దాని నుంచుకొని వానిచే లేక ఈ సందర్భమున, ఏ ఉపనిబంధనముచే అధికార మొసంగబడిన వ్యక్తిచే తగినట్లుగా రూఢీచేయబడిన యెడల, పద్దులేక పత్రము యొక్క ఉనికి ప్రథమ పరిశీలన సాక్ష్యముగా అంగీకరించ బడగలదు. మరియు మొదటిపద్దు లేక పత్రము కనబరచబడిన యెడల అట్టి వ్యవహారములందు జమపరచుటకు అంగీకార యోగ్యములై యుండవలసిన అదే పర్యంతము సందర్భమున ప్రతి దావాలో అందు రికార్డు చేయబడిన వ్యవహారముల మరియు కార్యముల సాక్ష్యముగా నుండుటకు అంగీకరింపబడగలదు.

205. పత్రముల కనుపరుచుటకు సంబంధించి పంచాయతీసమితి-జిల్లా పరిషత్ ఉద్యోగులు హాజరగుటకు పిలుచుటకై నిర్బంధములు :

ప్రత్యేక కారణమునకు సంబంధించినంత వరకు న్యాయస్థానముచే ఒసగబడిన ఉత్తర్వుద్వారా తప్ప పంచాయతీ సమితి-జిల్లాపరిషత్ ఉద్యోగి పంచాయతీ సమితి జిల్లా పరిషత్ కక్షిదారుగాని ఎచ్చట ఒక ప్రమాణకృత ప్రతిద్వారా, పూర్వ సెక్షను ననుసరించి రుజువు పరచబడజాలు విషయములుగల ఏ రిజిష్టరు లేక పత్రమును కనుపరచుటకు లేక అందు లిఖింపబడిన వ్యవహారముల మరియు కార్యములు రుజువు పరచుటకు సాక్షిగా హాజరగు నిమిత్తము కోరబడును.

206. సాక్ష్యమును పిలిపించుటకు పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్‌కు అధికారము:

పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్, సాక్షులను హాజరు కమ్మనుటకు, పత్రములు దాఖలు చేయుటను నిర్బంధించుటకు సివిల్ న్యాయస్థాన అధికారములను కలిగియుండును. ఏ సమాచారమునైనను పంచాయతీ సమితి లేక జిల్లా పరిషత్ చే దానికి దాఖలు చేయవలసినదిగా కోరబడు ప్రతి వ్యక్తి, 1860వ సంవత్సరపు ఇండియన్ పీనల్‌కోడు (1860 సంవత్సరపు XLV) 176వ శెక్షను అర్థానుసారము ఆ విధముగా చేయుటను న్యాయశాస్త్ర సమ్మతముగా బద్ధుడై యున్నాడు.

207. అపరాధములకు సంబంధించి పోలీసు అధికారములు మరియు విధులు మరియు అధికారులకు సహాయము :

పంచాయతీ సమితి-జిల్లా పరిషత్ అధికార క్షేత్రమున నియమింపబడిన ప్రతి పోలీసు అధికారి ఈ శాసనము లేక దానిక్రింద ఒనర్పబడిన నియమములు లేక ఉపబంధనలకు ప్రతికూలముగా ఒనర్పబడిన ఏ అపరాధమును గురించి యైన టోగట్టా సత్వరముగా సమితి పరిషత్‌కు ఒసంగవలయును. మరియు సమితి పరిషత్ సకల సభ్యుల అధికారుల మరియు ఉద్యోగులకు వారి చట్ట సమ్మత అధికారమును చలాయించుటలో సహాయమొనర్చుటకు బద్ధుడై యుండ గలడు.

208. తన అధికారములను ఇతరులకు నిచ్చుటకు సమితి-పరిషత్‌కు అధికారము :

ఈ చట్టముక్రింద లేక దానిక్రింద చేయబడిన నియమముల మరియు ఉపనిబంధనల క్రింద నియమములను మరియు ఉపనిబంధనలు చేయు అధికార ము తప్ప సర్వాధికారములను లేక ఏదేని అధికారమును అధ్యక్షునిగాని, లేక Executive Officer కుగాని లేక యింకే అధికారికిగాని లేక పంచాయతీ సమితి-జిల్లా పరిషత్‌యొక్క ఏ ఉద్యోగికిగాని లేక ప్రభుత్వానుమతితో యింకే యితర అధికారికిగాని ప్రాతినిధ్య మివ్వవచ్చును.

(2) అట్లు యిచ్చిన అధికారమును ఏసమయమునగాని రద్దు పరచు టకు మార్చుటకు లేక ఉపసంహరించుకొనుటకుగాని పంచాయతీ సమితి-జిల్లా పరిషత్ అధికారము గలిగియుండును.

209. హైదరాబాదు పశువుల బంజరు చట్టము 1337 ఫసలీ పై ఈ చట్టము యొక్క ప్రభావము :

హైదరాబాదు పశువుల బంజర చట్టము 1337 ఫసలీ, లో ఏది యెట్లున్నను—

(ఎ) సెక్షను 26 యొక్క సబ్-సెక్షను (3) క్రింద హైకోర్టు యొక్క మరియు సెషన్ కోర్టుయొక్క అధికారములు అధ్యాయముల VI మరియు V ల క్రింద ఉత్పన్నమగు విషయములోనే యుండును, ఉక్త శాస నములో తదితరములగు (కేసు) లన్నిటియందు అధికారములు బోర్డులో నుంచబడును.

(బి) పంచాయతీ సమితి-జిల్లా పరిషత్‌యొక్క సెక్షను 26 యొక్క సబ్-సెక్షను (4) క్రింద ఎట్టి అధికారము లుండవు. మరియు ప్రభుత్వము అట్లు నిర్దేశించిన అధికారములను చలాయించుటకుగాను వ్యక్తికిగాని లేక

వ్యక్తులకుగాని అట్టి అధికారములను చలాయించవలసినదిగా నిర్దేశింపవచ్చును. మరియు అట్టి అధికారములను ఏ సమయ మందైనను ఉపసంహరించ వచ్చును.

(సి) ఉక్తశాసనముయొక్క సెక్షను 27 క్రింద హైకోర్టుయొక్క అధికారములు ఆకోర్టుచే చెలామణి చేయబడవు మరియు అట్టి ఉక్తాధికారములు ప్రభుత్వముచే అమలు జరుపబడును.

210. రద్దు మరియు రక్షణము :

హైదరాబాదు జిల్లాబోర్డు చట్టము "A" 1352 ఫసలీ ఇందుమూల మున రద్దు చేయబడినది;

అయితే—

(ఎ) అట్టి రద్దు శాసనము క్రింద లేక దాని క్రింద చేయబడిన నెద్దానియొక్క చట్ట సమ్మతత లేక చట్ట విరుద్ధతవలన ఏదైన రావలసిన మొత్తమును చెల్లించుటకు ఏదైన వ్యక్తియొక్క బాధ్యతను బాధింప నేరదు.

(బి) రద్దు శాసనముక్రింద నేర్పరచబడిన బోర్డులన్నియు తాత్కాలికమగు బోర్డులతో సహా మరియు ఈ శాసనము అమలులోనికి వచ్చుటకు సాక్షాత్పూర్వము నెలకొని యున్నట్టివి ఈ శాసనము యొక్క కట్టుబాట్ల నను సరించి క్రొత్తగా నట్టిబోర్డు లేర్పడుపబడునంతవరకు ఈ శాసనముక్రింద బోర్డుగా నెలకొల్పబడియున్నటుల భావింపబడగలవు; మరియు ఏదైనా అట్టి బోర్డుల హక్కుల మరియు బాధ్యతలు ఆ విధముగా నెలకొల్పబడియున్నటుల భావింపబడిన బోర్డులయందు ఆయత్తమైనవి మరియు జతపరుపబడినవిగా నుండగలవు.

మరియు ఆ విధముగా రద్దుచేయబడిన ఆ చట్టము క్రింద ఏదైనా అట్టి బోర్డుపట్ల నొనర్పబడిన జారీచేయబడిన లేక విధింపబడిన ఏదైనా నియామకము, ప్రకటన, నోటీసు, పన్ను, ఉత్తరువు, అనుమతి, నియమము లేక ఉప నిబంధన, ఈ శాసనములోని కట్టుబాట్లకు అసమగ్రముగా నుండనంత మేరకు ఈశాసనముక్రింద నెలకొల్పబడియున్నటుల నావిధముగా భావింపబడిన బోర్డుల పట్ల, ఈశాసనము క్రింద నొనర్పబడిన జారీ చేయబడిన లేక విధింపబడిన నేదేని నియామకము, ప్రకటన నోటీసు, పన్ను, ఉత్తరువు, అనుమతి, నియమము లేక ఉపనిబంధనచే రద్దుజేయబడునంతవరకు ఒనర్పబడి జారీ చేయబడి, విధింపబడి యున్నటుల భావింపబడగలవు.

## "షెడ్యూలు-ఎ"

(సెక్షను 148 యొక్క సబ్-సెక్షను (3) చూడుము)

డిమాండు నోటీసు నమూనా

... ... ...కి

ఎ. బి. ... వద్ద నివసించుచున్న ... 19 తేదీతో ప్రారంభమగుచు ... 19 తేదీతో అంతమగు య్యవధికి ... క్రింద విధింపదగు ... ... (ఇచట, ఆ పన్ను విధింపదగు, ఆస్తిని లేక ... లోని విషయమును వర్ణింపుము) ... ... వద్ద నుండి రావలసిన ... ... మొత్తమును ... ... కడనుండి వసూలు ... ... పంచాయతీ సమితి జిల్లా పరిషత్ వసూలు చేయ గోరుచున్నట్లును. యీ నోటీసు అందిన పదునైదు దినముల లోగా, పై మొత్తము ... ... వద్ద గల పంచాయతీ సమితి-జిల్లా పరిషత్ కార్యాలయములో చెల్లింపబడకపోయినచో, పంచాయతీ సమితి-జిల్లా పరిషత్ సంతృప్తి జెందునట్లు, చెల్లింపకపోవుటకు గల తగు కారణమును జూపక పోయినచో, ఆ మొత్తమును ఖర్చులతోసహా రాబట్టు కొనుట కొక జప్తు వారంటు జారీ చేయబడుననియు మీకు నోటీసు యివ్వడ మైనది.

తేదీ ... 19 . ... ... పంచాయతీ సమితి - జిల్లా పరిషత్ యొక్క ఆజ్ఞపై, సంతక మొసర్చబడినది

## "షెడ్యూలు-బి"

(సెక్షను 148 చూడుము)

వారంటు నమూనా

(ఇచట వారంటును అమలు పరచు అధికారి పేరును వ్రాయుము)

... .... ...కి జెందిన. ఎ. బి ... ... 19 తేదీతో ప్రారంభమై ... ...19 ... తేదీతో అంతమగు ... ... యవధికి. పార్శ్వమున జెలుపబడి, మరియు... ...క్రింద విధింపబడదగు పన్ను క్రింద బాకీయున్న ... ... మొత్తమును చెల్లింపనందున,

మరియు అందులకై డిమాండు నోటీసు అతనికి అందజేయబడిన పిదప పదునైదు రోజులు గతించుటచే, ఈ క్రిందిరీతిని అతని కడనుండి రావలసిన ... ... ...మొత్తమునకు గాను, పై ఎ. బి. యొక్క సరకును వస్తువులను, ఆంధ్రప్రదేశ్ (తెలంగాణా) జిల్లా బోర్డుల శాసనము 1956 యొక్క సెక్షనులు 151 మరియు 152 యొక్క ఆదేశములకు లోబడి, జప్తుచేయుటకు యిందుమూలముగా నిన్ను ఆజ్ఞాపించడ మైనది:—

రూ. నపై

పై పన్ను క్రింద ... ...

నోటీసు అందజేయుటకు... ...

మరియు ఈ వారంటులోకూడ, నీచే వశపరచుకొనబడిన సరకు యొక్క వివరము లన్నింటిని ధృవపరచి వెంటనే నాకు పంపవలయునని నిన్ను ఆజ్ఞాపించడమైనది.

తేది.........19

(సంతకము)

అధ్యక్షుడు.

(లేక సందర్భానుసారముగా సెక్షను 150 చూడుము)

"షెడ్యూలు-సి"

(సెక్షను 152 యొక్క ప్రకరణ (సి) మరియు సెక్షను 158 యొక్క సబ్-సెక్షను (1) చూడుము)

జాబితా మరియు నమూనా

... ... ... ... ... వద్ద నివసించుచున్న

... ... ... ... ... ఎ. బి. —కి.

... ... ... తేదీతో ప్రారంభమై, ... ... తేదీతో అంతమైన, యవధికి, యీ ప్రక్కను తెలుపబడిన పన్ను * క్రింద రావలసిన ... ... ...మొత్తము విలువకు డిమాండు నోటీసును అందజేసినందున రావలసిన రూ... ... ...ల క్రిందనూ యీ క్రింది జాబితాలో నిర్దిష్టపరుపబడిన సరకును వస్తువులను యీ రోజున వశపరచు కొంటినని నీకు తెలియజేయడమైనది మరియు ఈ నోటీసు తేదీనుండి ఐదు దినములలోగా పై

మొత్తమును, వసూలు ఖర్చులతో గూడ నీవు ... ... వద్దనున్న పంచాయతీ సమితి-జిల్లా పరిషత్ కార్యాలయములో చెల్లింపక పోయినచో, పైసరకును వస్తువులను విక్రయింపబడుననియు నీకు తెలియజేయుట మైనది.

తేది.........19

(వారంటును అమలు పరచు అధికారి సంతకము)

జా బి తా

(ఇచట, వశపరచుకొనబడిన సరకు మరియు వస్తువుల వివరములను వ్రాయుము)

---

* ఇచట ఆ పన్నును వర్ణింపుము.



సంపూర్ణము

శ్రీవాణీ ముద్రణాలయము, హైద్రాబాదు.

